Andhra University Series: No. 30

# ద్విపద భారతము

## సంపుటము ౧

(ఆదిసభాపర్వములు)

గ్రంథకర్తలు:

ఆదిపర్వము — తిమ్మయ

సభాపర్వము — బాలసరస్వతి

పరిష్కర్త:

పింగళి లక్ష్మీకాంతం




ఆంధ్రవిశ్వకళాపరిషత్తుచే ప్రచురితము

రాజమహేంద్రవరము : సరస్వతీ పవర్ ప్రెస్ నందు
శ్రీ అడ్డేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారిచే ముద్రితము

1943

Price Rs. 10. ] [ వెల 10 రూ.

# ఉపోద్ఘాతము



వ్యాసప్రోక్తమగు సంస్కృతమహాభారతము మాతృకగాఁ గవిత్రయకృతమైన ఆంధ్రమహాభారతమవతరించినట్లే, కాలాంతరమున, ఆకవిత్రయభారతము మాతృకగా నీద్విపదభారతమవతరించినది. ఇది యపరకవిత్రయకర్తృకము.

తిమ్మయ, సోమన, బాలసరస్వతి అనెడి యీద్విపదభారతకర్తలు మువ్వురిలో తిమ్మయ నన్నయభట్టువంటివాఁడు. ఈమహానుభావుఁడు భారతము ద్విపదీకరించవలెనని సంకల్పించి ఆదిపర్వము మొదలు ద్రోణపర్వాంతమువఱకుఁగల యేడుపర్వములలో సభాపర్వముతక్కఁ దక్కినయాఱింటిని నిర్వహించి కొంతవఱకు సిద్ధసంకల్పుఁడయ్యెను. కర్ణపర్వమాదిగా మిగిలినపర్వములను రచించి గ్రంథమును బూర్తిచేసినవాఁడు సోమన. మధ్య మిగిలిపోయిన సభాపర్వమును వ్రాసినవాఁడు బాలసరస్వతీశ్వరుఁడు. ఈసభాపర్వకర్త, ఈమహాకావ్యనిర్మాణములో నీకొంచెపుపాలుడక్కఁగొనుటకు తిమ్మనార్యానుగ్రహమే కారణమని తోఁచుచున్నది. తనకు శిష్యప్రాయుఁడో మిత్రుఁడో అయిన బాలసరస్వతిప్రార్థన నంగీకరించి తిమ్మనార్యుఁడీచిన్నిపర్వమును అతనిపరముచేసియుండును. లేకున్న దీనితరువాత మఱియైదుపర్వములు కొనసాగించిన ఆదిపర్వకర్త, రెండవపర్వమును స్పృశింపక వదలుటకు హేతువుకానరాదు. ఆదిపర్వరచనతోనే యాతఁడస్తమించియున్నచోఁ బరిశిష్టభాగమును బూరించుభారము బాలసరస్వతి తానై వహించెననవచ్చును గాని, అది యట్టిదిగాక యాపైనైదుపర్వములు తిమ్మయకృతములుగాఁ గానవచ్చుటచే, ఈసభాపర్వము పరిశిష్టభాగమనుటకు వలనుపడదు. పూర్వకాలమున రామాయణరచనకుపక్రమించిన భాస్కరుఁడు తనపుత్త్రునెడను శిష్యునెడను ఇట్టియనుగ్రహమునే చూపి కొన్నికాండములు వారిపరము చేయుటయు, ఈకాలమున శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు దేవీభాగవతమున రెండుస్కంధములు తమకవిమిత్రులచే వ్రాయించుటయు ఈసంప్రదాయమునకే దృష్టాంతములుగాఁ బేర్కొనవచ్చును. భాగవతమున వెలిగందలనారయాదులపేరఁ గొన్నిస్కంధములు కానవచ్చుటయు నీయాచారమునుబట్టియనియే నాయూహ.

తిమ్మయకవి వల్లభసూరికుమారుఁడు; కాశ్యపసగోత్రుఁడు. అన్నియాశ్వాసములతుదిని గద్యస్థానీయములైన ఈక్రిందిద్విపదపంక్తులు పైవిషయముల కాధారము :

"ఇది సదాశివభక్త హితగుణాసక్త-సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్త్రి-మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచిత...పర్వ నిర్మలకథయందు-నుచితమై యాశ్వాస......మయ్యె"

ఈకవినివాసస్థలము నెల్లూరుమండలములోని బట్టేపాడుగ్రామమనియు, ఇంటిపేరు బట్టేపాటివారనియు నూహించుటకుఁ గొంతియాధారము దొరకినది. పుష్పగిరి తిమ్మయకు సమకాలికుఁడును సహశ్రోతయునగు తేకుమళ్లరంగశాయియనుకవి తన ద్విపదభాగవతములో (అముద్రితము) పూర్వకవిస్తుతి యొనర్చుసందర్భమున, ఈద్విపదభారతకర్త యెడ సంస్మరణరూపమగు భక్తి ప్రకటించియున్నాఁడు. ఆస్తుతివాక్యములో, ఈకవిపేరు తిరుమలభట్టనియు. ఇంటిపేరు బట్టేపాటివారనియుఁ గలదు :

"రామాయణంబు భారతమును ద్విపద లై మీరఁజేసిన యారంగనాథు
ధీరు బట్టేపాటి తిరుమలభట్టు గారి ప్రౌఢోక్తులు గలుగస్మరించి,
సునయుండు మత్సహశ్రోతయునైన .....................
గిరిధైర్యనిధి పుష్పగిర్యప్పనార్య-వరుని సుపుత్త్రి..................
సారజ్ఞ తిమ్మనసత్క-విఁ బిలిచి-యతనిసహాయత నతులోక్తియుక్తి
..............భాగవతపు-......స్కంధముల్ పదియును రెండు
రచియించితి................"

(తేకుమళ్ల రంగశాయి, ద్విపదభాగవతము)

మఱియు, ఈకవికాశ్రయమిచ్చి విరాటపర్వము కృతిగొన్న జంగాలముమ్మయ రెడ్డియను పంటవంశ్యుడు బట్టేపాడు గ్రామవాస్తవ్యుఁడు:

"శ్రీరాజితాకార, శివభక్తిపూర-గౌరవాకార, జంగలముమ్మ ధీర!" విరా. ప. ద్వి. ఆ.

"డిండీరకీర్తి బట్టేపాటినిలయ!" విరా. ప. తృ. ఆ.

కవినివాసస్థలముకూడ ఈబట్టెపాడేయనియు, నూరిపేరునుబట్టి యింటిపేరును అదియే యైనదనియు విశ్వసింపవచ్చును. కాని భారతమంతటను 'తిమ్మయ'— 'తిమ్మన'గా గోచరించు ఈకవియేనా రంగశాయిచే తిరుమలభట్టుగాఁ బేర్కొనఁబడినవాఁడు? అనుసందేహము కలుగవచ్చును. బట్టెపాటిసంబంధముకలిగి, ద్విపద భారతము రచించిన వేటూరితిరుమలభట్టు కానవచ్చునంతవఱకు, ఈతిమ్మయయే ఆతిరుమలభట్టని విశ్వసించుటకు ఏవిధమగువెనుబాటును ఉండనక్కఱలేదు. బట్టెపాడు—ద్విపదభారతకర్తృత్వము—నామధేయము—అను మూఁడువిశేషములలో ఒక్కనామధేయమునమాత్రము కొంత వ్యత్యాసమున్నదిగాని, తక్కినరెండును సమానముగనే యున్నవి. పేరులైనను పొత్తుకుదురనంత దూరముగాఁగాక ఐక్యమును సాధించుటకనువుగనే యున్నవి. తిరుమలయ్య తిమ్మయగా, తిమ్మయ తిరుమలయ్యగా లోకమున వ్యవహరింపఁబడుటలో వింతయేమియు నుండదు. ఇప్పటి కితనిపేరు 'బట్టెపాటి తిమ్మయ' అనియే యనుకొందము.

ఈభారతమును అర్థాధికముగారచించినవాఁడు ఆతుకూరి సోమన. ఇతని తండ్రిపేరు తిమ్మయ:

"ఇది వేంకటాచలాధీశ్వర దివ్య-పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ-సుగుణాఢ్య సోమనసుకవీంద్రవర్య
రచితమై కర్ణపర్వమున నాశ్వాస-ముచితార్థయుతముగా నొక్కటియయ్యె."

ఈతనిభారతభాగములో నన్నిపర్వముల యన్నియాశ్వాసములతుదిని ఈపంక్తులే యుండును. ఆతుకూరనెడి యీయింటిపేరునుబట్టి యీతనినివాసస్థలము నెల్లూరుమండలములోని 'ఆత్మకూరై' యుండునని యూహింపవచ్చును. లేదా, ఈగృహనామమా గ్రామనామమునుబట్టి వచ్చినదే కాదేమో! కాని బట్టెపాటి తిమ్మయభారతమునందుకొని పూర్తిచేసినయాతఁడు, బట్టెపాటికి సమీపగ్రామమగు ఆత్మకూరువాస్తవ్యుఁడై యుండునని యెంచుటయు దోసఁగుగాదు. 'ఆత్మకూరు' 'ఆతుకూ'రనియు వాడుకలోనున్నదఁట. ఈజంటగ్రామములు (బట్టెపాడు —

ఆత్మకూరు) ఒకకాలమున ఉదయగిరిరాజ్యలక్ష్మికిఁ బాదపద్మములుగాఁ బరిఢవిల్లినవఁట:

"ఉదయగిరిరాజ్యలక్ష్మికి-సదనము నెల్లూరు: అట్టిసాధ్వీమణికిన్
వదనంబు కందుకూరగు;-పదయుగళం బాత్మకూరు బట్టీపాడున్." చాటువు.

కావున ఈద్విపదభారతజన్మస్థానము, ఇప్పటి నెల్లూరుమండలము.

స్థూలదృష్టికి, ఈసోమన యాదిపర్వకర్తయగుతిమ్మనకుఁ గుమారుఁడేమో యని భ్రమ కలుగును. కాని తఱచిచూచినమీఁద ఈకవులిరువురకు నట్టిసంబంధము కానరాదు. కొడుకేయైనచో, భట్టబాణునిపుత్త్రుఁడు కాదంబరియుత్తరభాగ ప్రారంభమందువలె, కాచవిభు విఠ్ఠలరాజులు రంగనాథరామాయణోత్తరకాండాదిని వలె సోమనయుఁ గర్ణపర్వారంభవేళఁగాని, మఱి యేయితరాశ్వాసాంతమందుఁగాని తండ్రిరచనను గొనసాగించువాఁడుగాఁ దన్నుఁగూర్చి చెప్పుకొనకయుండఁ జాలఁడు. చెప్పుకొనుట, పితృపూజ్యతకును స్వీయగౌరవమునకును గారణమగును; చెప్పుకొనకుండుట, పితృతిరస్కారమునకును ఆత్మపాపమునకును హేతువగును. కవి యీధర్మాధర్మములను ఆలోచింపలేని యవివేకిగాఁడు.

అదియట్లుండ, ఆరణ్యపర్వమును తిమ్మయ సంగ్రహముగా రచింపఁగా, సోమన మఱికొన్నియుపాఖ్యానములతో దానిని విపులీకరించి, అయిదాశ్వాసముల నేడాశ్వాసములుగాఁ బెంచి, ఆపెంపును దానేచేసినట్లాపర్వాంతమునఁ జెప్పికొన్నాఁడు:

"విత్యర......గతి...గు నిదియథార్థంబు-.........రణ్యపర్వంబునందు
......తిమ్మనార్యుఁడు విడిచినకథలు-కువలయంబున నాతుకూరి......
..............................-.......వేంకటాచలాధీశ్వర దివ్య
పదపద్మ మకరంద పానద్విరేఫ-మగు నాతుకూరి తిమ్మార్యతనూజ
ముగుణాఢ్య సోమనసుకవీంద్రవర్య-విరచితారణ్యాఖ్య విపులపర్వమున
నరుదుమీఱఁగ సప్తమాశ్వాసమయ్యె"

దురదృష్టవశమునఁ, బై పంక్తులుగల తాటాకు క్రిమిదష్టమగుటచేఁ గొన్ని పంక్తులసమగ్రములుగా నున్నవి. నిల్చియున్నవైనను గొంతవఱకీమీమాంసకు నక్కఱకువచ్చునవగుటచే సంతసింపవలసినదే. ఈపంక్తులలో నిరువురు తిమ్మనార్యుల పేర్లు కలవు; ఒకఁడు ఆరణ్యపర్వమునఁ గథలుకూడిచినవాఁడు; అనఁగా ద్విపదభారతకర్త. రెండవవాఁడు సోమనసుకవీంద్రుని తండ్రి. ఈయిద్దఱు నభిన్నులేయైనచో, అనఁగా—సోమన ద్విపదభారతకర్తయగు తిమ్మయకొడుకేయైనచో, ఆత్మసంబంధరహితముగా, నిరుపపదముగా నూరక 'తిమ్మనార్యుఁడు' అని వ్యవహరించుటకైనను అతఁడు వెనుకాడియుండునుగదా! మఱియు, భారతకర్త తిమ్మనార్యుఁడు 'సదాశివభక్తుఁడు.' సోమనతండ్రి తిమ్మనార్యుఁడు 'వేంకటాచలాధీశ్వర దివ్య పదపద్మ మకరంద పానద్విరేఫము.' అదిగాక, తిమ్మకవియింటి పేరు 'బట్టేపాటి' వారు. సోమనయింటి పేరు 'అతుకూరి' వారు. కావున నిప్పటికిలభించిన యీయాధారములనుబట్టి తిమ్మన—సోమనకవులు తండ్రికొడుకులు కారని నిర్ధారించవచ్చును.

పైనిచూపఁబడినరీతిని ఈసోమన కర్ణపర్వాదిగా మిగిలినపదునొకండుపర్వములను రచించుటేగాక, తిమ్మకవికృతమైన యారణ్యపర్వమును విపులీకరించి సమగ్రమొనర్చెను. ఈతనియీరచనయంతయు బాలసరస్వతిరచనవలె తిమ్మయసమక్షమున సమకాలముననేగాక, అతనిజీవితానంతరమున నేకొలఁదికాలమునకో జరిగియుండునని తోఁచుచున్నది. అట్లుకానిచో, నాతనియారణ్యపర్వమును దానై స్వతంత్రించి విపులీకరించుటయు, నొక్కపట్టునఁ బదునొకండుపర్వములగ్రంథమునంతను దానే రచించుటయుఁ బొసఁగదు. తిమ్మనయనుమతిఁబొందియే బాలసరస్వతివలెనే భారతకర్తృత్వభాగ భాగ్యమాశించినవాఁడైనచో, అతనివలెనే యేకొన్నిపర్వములో నెడనెడవ్రాసియుండును గాని, అర్ధాధికమైన యింతపెద్దభాగమును తిమ్మయయడుగుజాడయైనను గానరాకుండఁ దానే యరికట్టుకొనుట యసంభవము. తక్కినపర్వముల మాటయెటున్నను, ఆపక్షమున, స్వర్గారోహణపర్వము తిమ్మయ యాతనిపరము చేయుటకే వలనుపడదు. కావ్యగోపుర నిర్మాణమును బ్రారంభించినశిల్పి శిఖరారోపణ మహాభాగ్యము నితరులపరమొనర్చి తాను దూరముగాఁ దొలఁగియుండలేఁడు. నిర్వహణానందము ప్రారంభకుతూహలముకంటె నెన్నిమడుఁగులో గొప్పది. కావున బాలసరస్వతి తిమ్మయకవికి సమకాలికుఁడు; సోమన యర్వాచీనుఁడు.

ఏరెప్పటివారు ? అను సమస్య నేను బరిష్కారముచేయలేనిది. దానికక్కఱకు వచ్చు నాధారము లీగ్రంథమున సూచనామాత్రముగనైన లేవు. అయినను యథాశక్తి నొకస్థూలనిర్దేశము చేయఁబూనెదను ; పెద్దలు వివేచింతురుగాక.

తిమ్మకవియెడ భక్తినెఱపిన ద్విపదభాగవతకర్త — పూర్వోదాహృతుఁడైన తేకుమళ్ల రంగశాయి—18 వ శతాబ్దిచరమ భాగమునందున్న పుష్పగిరితిమ్మనకు సహశ్రోత్రిగావున ఈబట్టుపాటి తిమ్మకవి యంతకుఁబూర్వుఁడని చెప్పనక్కఱలేదు. అతని కాలమునకు నిదియొకవైపు మేర.

మఱియు, తంజాపురీపుస్తకభాండాగారమునకై యీద్విపద భారతము ప్రతులువ్రాయించిన యుదారశీలుఁడు శాహాజీ యనెడి మహారాష్ట్రప్రభువు. ఈరాజు, ఆంధ్రనాయకవంశమును దొలఁగించి తంజాపురిని స్వాధీనమొనర్చుకొన్న ఏకోజీ కుమారుఁడు. అనఁగా, చోళమండలమునేలిన మహారాష్ట్రవంశములో రెండవ పురుషుఁడు. ఇతనిపరిపాలనాకాలము క్రీ. శ. 1684–1712. ఈరాజునానతిని నింబాజియనెడి రాజోద్యోగి కుప్పయమంత్రియనెడి వ్రాయసకానిచే ఈభారతము ప్రతివ్రాయించినట్లు విరాట–ఉద్యోగ–భీష్మ–అశ్వమేధపర్వాంతముల నుదాహరింపఁబడియున్నది. శాసనపంక్తులవలెఁ బరమచారిత్రకాధారములైన యీద్విపద లీక్రిందఁబొందుపఱుపఁబడినవి :

"భోసలాన్వయ సుధాంభోధి చంద్రుండు–భాసుర శౌర్యానుభావ సాంద్రుండు
భవసముత్కట జటాభరణాయమాన–ధవళకీర్తి మనోజ్ఞ (తర) గాంగభంగ
గాహనైక పవిత్ర గంధర్వగాన–మోహితామరవధూ ముఖ కౌంతుణీయ
మనుజభావుండు రామామనోజుండు–వనఘుసన్నుతుఁడు శాహావనీవిభుఁడు
ఒకనాఁడు తనమది నుల్లాస మొదవఁ–బ్రకటిత పద్మినీభామా ధవుండు
తొలిగట్టునుదయింపఁ దోడ మేల్కాంచి,–చెలఁగి పన్నీటను జలకంబులాడి,
వరవస్త్ర భూషణావళు లొప్పఁ దాల్చి,–సరసతఁ గస్తూరి చందనంబలఁది
కమనీయ సౌగంధ కమల కల్హార–సుమదామ సౌగంధ శోభితుండగుచు
గరిమతోడుత నూడిగంబులు నొక్క–సరిగ హెచ్చరికని సందడింపంగ,
ప్రచుర నీలస్తంభ బాహుళ్యహేమ–ఖచిత నానారత్న కాంతులతోడ

విప్పైన యాస్థానవేదికమీఁద-నొప్పుగాఁ గూర్చుండి యున్నంతలోన,
దమ్ములిర్వురు వచ్చి తగుపీఠములను-నిమ్ములఁ గూర్చుండి రెలమితో ; నపుడు
దశరథతనయుండు తమ్ములతోడ-విశదనా కొల్వుకు వేంచేసెననఁగ
నొప్పినప్పుడు వేగ నుచితజ్ఞులైన-దొరలును మంత్రులు దుర్గాధిపతులుఁ
బరువిడి సామంత భటసమూహములు,-హితులుఁ బురోహితు లెలమి సత్కవులుఁ
బాఠక గాయకప్రతతి యేతెంచి-కొలువంగ, 'జోద్ధూరికువలయాధిశ,
విలసితవాగ్జాల, వీరప్రతాప,-భూసురాశీర్వాద పుణ్యచారిత్ర,
వాసవజిత భోగవైభవ నిలయ,-శారద డిండీర చంద్ర కర్పూర
తారాళి మల్లికా ధవళసత్కీర్తి-ధామా !' యనుచు భట్లు తగజయవెట్ట,
చెలఁగి యింద్రునిపురిచేడెల నవ్వఁ-గలిగిన రూపముల్ గల వారకాంత
లలవడఁ జేరి నృత్యంబులుసేయ,-దీపింప భూలోక దేవేంద్రుఁడనఁగ
భూపాలతిలకంబు పొలుపుదీపించి,-పంచమవేదమై పరఁగు భారతము
సంచితపాపముల్ చెడఁజేయుఁగాన (?)-నింబాజిఁగనుఁగొని: "నీవు వ్రాయింపు
మంబుజోదరులీలలన్నియు దానఁ-గనవచ్చు." నని చెప్పఁ గడువేడ్కతోడ
సరవితోడ మహాప్రసాదంబటంచు-నిరవొప్పఁగాఁ దనయింటి కేతెంచి,
యెలమి నన్ బిలిపించి యిట్లను: 'నిపుడు-భారతపర్వముల్ ప్రభువు శాహేంద్రుఁ
డారయ వ్రాయింపుమని పల్కెఁ గాన,-కుదురుగా నొరుఁగక కొదరక తప్పు
లాదవకుండఁగ వ్రాయు' మనుచు నావేళ-ఘనసార తాంబూల గంధమాల్యములు
చనవొప్పఁగా నిచ్చి చనుమన్న, నేను-ఘనతర సంతోష కలితుండనగుచు
మనమున నుప్పొంగి, మార్తాండవంశ-మహితాంబునిధి సుధామయ మూర్తిపేర
విహిత సదాచార విఖ్యాతుపేర-బ్రహ్మకల్పస్థాప్య బహుకీర్తిపేర
బ్రాహ్మణాశీర్వాద ఫలవర్తిపేర-మండిత శాత్రవ మత్తభూపాల
శుండాల నిర్జిత శుభమూర్తిపేర-విభవనిర్జిత దేవవిభుపేర శాహ
విభుపేర సకలప్రవీణునిపేర-వ్రాయంగఁబూనితి వరమతియుతులు
మాయురేయని పలుమాఱును మెచ్చ-నిటలాక్షు పదపద్మ నిహితప్రసన్న
పటుచిత్తుఁడైన కుప్పయమంత్రివరుఁడ.-ఎందాఁక రవిచంద్రు లెందాఁక జలధు
లెందాఁకఁదొలిమిన్కు లెందాఁకనలువ-యెందాఁక శైలజాధీశుసత్కీర్తి
యందాఁక నిది పూజ్యమై యొప్పుఁగాక. అశ్వమేధపర్వము చివర.

విరాట—ఉద్యోగ—భీష్మపర్వాంతములఁగూడ నీయర్థముగలపంక్తులే కలవు. దీనినిబట్టి సోమన శాహాజీప్రభువునకుఁబూర్వుఁడై యుండవలెను. ఎంతపూర్వుఁడు? అనునదియుఁ దేల్పరానివిషయమే. కాని, సోమనగ్రంథము ప్రతులు వ్రాయించుకొనఁ దగినంతప్రశస్తి సంపాదించినప్రాచీనరచనయైనపుడే తంజావూరువారికి దానియెడ నంతియపేక్ష కల్గుటకవీలుండును. కావున సోమన శాహాజీకి సమకాలికుఁడును అవ్యవహితపూర్వుఁడును గాక, కొంతప్రాచీనుఁడే కాఁదగును. అత్యుక్తి లేకుండుటకై ఆప్రాచీనతను ఏఁబదిసంవత్సరములవ్యవధిగా నంగీకరింతుమేని యీకవి 17 వ శతాబ్ది పూర్వభాగముననో మధ్యభాగముననో యుండియుండవలెను, (1600–1650). మఱి, యితనికిఁబూర్వుఁడైన తిమ్మకవికాలము 16 వ శతాబ్ది తుదిభాగమో, మధ్య భాగమో కావచ్చును, (1550–1600). ఈయిర్వురు నింకకంటెఁబ్రాచీనులైనచో తిమ్మయ యించుమించు కృష్ణరాయలకాలమువాఁడగును. ఆమహారాజుపరిపాలనా కాలమున కన్నడమున కుమారవ్యాసుఁడనుకవి భారతమును దేశీయచ్ఛందమైన షట్పదులలో రచించెనఁట. కాలప్రభావమున దేశీయతామహితములైన యీరెండు భారతములును ఒకయుగముననే పుట్టినవేమో!

ఈకవులకాలమునుగుఱించి నియతోపకారకములైన యితరాధారములు లభించునంతవఱకు నింతకుమించిన నిర్ణయము చేయఁజాలను. ఆభారము లోకము నకును భావికాలమునకును వదలితిని.

ఈముగ్గురిలో తిమ్మనార్యుఁడు, ఆదిపర్వమును నరసయాధిపకుమారుఁడైన చౌడామాత్యునకంకితమొనర్చెను. విరాటపర్వమును జంగాలమలిరెడ్డిపౌత్త్రుఁడును దేవయపుత్త్రుఁడును అయిన ముమ్మను యనుపేరుగల పంటవంశప్రభువునకుఁగృతి నిచ్చెను. తక్కిన తనపర్వములన్నియు రామార్పితమే చేసెను.

‘శ్రీసమాశ్రితనేత్ర, శృంగారగాత్ర–ధీసార నరసయాధిపుచౌడ, ధీర,
ఆసమానదానవిద్యా వినోదములు–దెసలవర్తిల్లుమంత్రీ! చిత్తగింపు’ ఆది. ఆశ్వా. 4

‘శ్రీరామవిఖ్యాత చిరతరోల్లాస–నారీనుతక్రీడ నరసయచౌడ,
తక్కక కర్ణావతారుండవనఁగ–దిక్కుల వెలయుమంత్రీ! చిత్తగింపు’ ఆశ్వా. 5

‘శ్రీయుతవాగ్జాల, సిద్ధవిశాల-న్యాయనూతనచోడ, నరసయచోడ,
పంచమవేదప్రబంధ సత్కీ-ర్తి-మించిన సత్యనర్సి! చిత్తగింపు’ ఆశ్వా. 6

‘శ్రీకర, శ్రితకల్పవృక్షావతార-పాకశాసనభోగ, భవ్యసంయోగ,
నీలవర్ణునిమీఁద నిజమైనభక్తి-కీలుకొల్పెడుసువివేకి! చిత్తగింపు’ ఆశ్వా. 7

‘శ్రీకరరణజాల, సితకీర్తిలోల-నాకేంద్రవైభవ, నరసయచోడ,
ప్రకటిత నిఖిల సౌభాగ్యవర్తనల-నకలంకుఁడగు నమాత్యా! చిత్తగింపు.’ ఆశ్వా. 8

‘శ్రీరమ్యగుణవార, శ్రితజనాధార,-కారుణ్యపూర, జంగలమమ్మధీర!’ విరా. ప్ర. ఆ. ఆది.

‘అర్థిమందార, సాహసవిక్రమార్క-పార్థివనుతశౌర్య, పంటవంశేంద్ర!’ విరా. ప్ర. ఆ. తుది.

‘డిండీరకీర్తి, బట్టేపాటినిలయ,-మదనసన్నిభగాత్ర, మల్లిరెడ్డిపౌత్ర!’ విరా. తృ. ఆ. తుది.

‘వాసవప్రతిమాన, వరజనాధీశ,-ధీశక్తినిజపాత్ర, దేవయపుత్ర!’ విరా. చ. ఆ. తుది.

‘మహితాయురారోగ్య మంగళంబులను-రమణ బట్టేపాటిరామలింగంబు
క్రమముదప్పక యిచ్చుఁగలకాలమెల్ల,-ఆవేల్పుఁగొల్చిన యనఘాత్ము పేర
దేవయప్రభు వంశతిలకంబు పేర, - సరణిగాఁ బంటవంశప్రభు పేర
మఱియు జంగాలమమ్మయధీరు పేర-సహజసజ్జను పేర సంప్రోక్తమైన
మహితకావ్యము ధాత్రి మను..........” విరా. పం. ఆ. తుది.

ఈచౌడప్ప యేరాజునకు మంత్రియో, ఆతనితండ్రి నరసయాధిపుని యాధిపత్య మేసీమకో! ఏగ్రామమునకో! తెలియవచ్చుటలేదు. ముమ్మయరెడ్డివిషయము మాత్రమింతకంటెఁ గొంత మెఱుఁగు. ఈతనినివాసము బట్టేపాడుగ్రామమని స్పష్టీకరింపఁబడినది. కాని, యీతని ప్రభుత యెట్టిదో! ఏచక్రవర్తికి సామంతుఁడో! ఏరాజునకు దుర్గాధిపతియో! ఇంకే ప్రభువునకు దండనాథుఁడో! నిశ్చయముగాఁ జెప్పలేము గాని, అసాధారణగౌరవముగల యొకమేటిమానిసియని మాత్రము సమర్థింపవచ్చును. ఈమేటితనము కేవలసంపన్నగృహస్థతమాత్రమే కాదు. మఱి, “కర్ణాటతిలక—“ చలమర్తిగండాది ” బిరుదాంచితము; “పరిపాలనాభార ధౌరేయము; “లలిత చౌషష్టికళాప్రావిణ్యాత్మకము ” ఏవంవిధ గుణమహితుఁడైన యీకృతిపతి ఉదయగిరిరాజ్యాభ్యుదయకాలమున బట్టేపాడుప్రాంతసీమకు వంశపరంపరాగతమైన యాధిపత్యమువహించి చరిత్రప్రసిద్ధినందిన యొకమహాపురుషుఁడై యుండును.

దురదృష్టవశమున మనదేశచరిత్ర ‘అతుకులమారిబొంత’ గా నుండుటవలన నిటువంటిమహాపురుషు లెందఱో ‘ఊరుపేరు’ లేకుండఁబోయిరి. అదే సమగ్రమైన నాఁడు ఇట్టివారిపేరఁగొన్ని ప్రకరణములు వేర్పాటుచేయవలసియుండును.

అయితే, ఈకృతిపతిత్వమీమాంసలో నొకచిన్నచిక్కున్నది. అది విడఁదీయరానంత చిక్కుమాత్రము గాదు. ఏమనఁగా— నేనుజూచిన విరాటపర్వప్రతులు నాలుగుగలవు:—తంజావూరిప్రతి, మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయ ప్రతి, వనప్పాకం శ్రీనివాసాచార్యులువారి ముద్రితప్రతి, ఆంధ్రవిశ్వవిద్యాలయప్రతి*. ఈనాల్గిటిలో నొక్కతంజావూరిప్రతిలోమాత్రము తప్పఁదక్కినమూఁడిటను ఈపర్వము ముమ్మయాంకితముగానే ప్రస్ఫుటమైయున్నది. తంజావూరిప్రతిలో ముమ్మయస్థానమున శ్రీరాముఁడు ప్రతిష్ఠింపఁబడినాఁడు. ఈమార్పు తంజావూరివ్రాయసకాండ్రుచేసిరో లేక వారివ్రాఁతకు మాతృకమైనప్రతిలోనే కలదో! ఈమార్పుచేసినవారి యుద్దేశమేమైయుండునో యూహించుటకష్టము. దైవవశమున నేకవాక్యతగల మఱి మూఁడుప్రతులాంధ్రదేశమందలి నానాభాగముల లభింపకున్నచో, తంజావూరి ప్రతివలన ముమ్మయరెడ్డియు మనమును వంచితులమేయయ్యెడివారము. ఇటు చెన్నపట్టణముమొదలు అటునైజామురాష్ట్రమువఱకు వ్యాపించిన ముమ్మయపేరు తంజావూరిలోలేనంతమాత్రమున శంకింపఁదగినదికాదు. ఉన్నపేరును ఒకచోటఁ దుడిచివేయవచ్చునుగాని, లేనిపేరును పలుచోట్లఁగల్పించుటకష్టము. విరాటపర్వము ముమ్మయాంకితమే. తంజావూరిప్రతిలోని వ్యత్యాసమునకును, తక్కినమూఁడుప్రతుల యేకవాక్యతకును ఈక్రిందిపంక్తులుచూడఁగోరెదను:—

| ముద్రిత—ప్రాచ్యలిఖిత గ్రంథాలయ ప్రతులు. | తంజావూరి ప్రతి. |
| --- | --- |
| విరా. ప్ర. ఆ. అది. | |
| ‘శ్రీరమ్యగుణవార, శ్రితజనాధార,<br>కారుణ్యపూర, జంగలముమ్మధీర!’ | లేదు. |

---

* సర్. కట్టమంచి రామలింగారెడ్డిగారి ప్రేరణచే, శ్రీయుతులు శేషాద్రిరమణకవులు నైజాం ప్రాంతమునుండి ఆంధ్రవిశ్వవిద్యాలయమునకై సంపాదించిన ఆంధ్ర తాళపత్రగ్రంథ సముదాయములో నతిశిథిలముగా నున్నప్రతి.

| మద్రాసు-ప్రాచ్యలిఖిత గ్రంథాలయ ప్రతులు. | తంజావూరిప్రతి. |
| --- | --- |
| **తుది.** | |
| 'అర్థిమందార, సాహసవిక్రమార్క,<br>పార్థివనుతశౌర్య, పంటవంశేంద్ర!' | 'నాగదమునివంద్య, నగకాసురారి,<br>వారిధిగర్వ నిర్వాపణకృత్య,<br>కుంభజవర దత్త గురుచారు చాప,<br>కుంభకర్ణవిదార, గురుకీర్తి ధార,<br>సాకేతపురివాస, జయతరోల్లాస,<br>నీకెనుమ్రొక్కెద నిఖిలలోకనాథ!' |
| **విరా. ద్వి. ఆ. ఆది.** | |
| 'శ్రీరాజితాకార, శివభక్తిపూర,<br>గారవాకార, జంగలమునృప ధీర!' | 'శ్రీరఘునాథ, యాశ్రితనాథ, నాథ,<br>వారిజనాథ, శ్రీవనితాసమేత!' |
| **తుది.** | |
| 'అనఘాత్మ, పంటవంశాంబుధి చంద్ర,<br>జననుత ప్రభురాజ, సాహిత్యభోజ!' | లేదు |
| **విరా. తృ. ఆ. ఆది.** | |
| 'శ్రీదివ్యదోర్దండ, చెలమర్తిగండ,<br>వైభవోపేంద్ర, దేవయమునృప ధీర!' | 'శ్రీసమంచితనేత్ర, శృంగారగాత్ర,<br>.......................<br>సాకేతపురినున్న జనులందఱకుఁ<br>జేకొని ముక్తియిచ్చినరామ, వినుము.' |
| **తుది.** | |
| "డిండీరకీర్తి, బట్టెపాటినిలయ,<br>చండశాత్రవశూర, సంచారధీర,<br>మదనసన్నిభగాత్ర, మలిరెడ్డిపౌత్ర,<br>విదితసత్కులచంద్ర, విభవదేవేంద్ర,<br>లలిత చౌషష్టికలా ప్రవీణాత్మ,<br>కలితమహాభాగ్య కర్ణాటతిలక!" | లేదు |
| **విరా. చ. ఆ. ఆది.** | |
| 'శ్రీసముచింతనేత్ర, చిరకృపాపాత్ర,<br>వాసవాకార, దేవయమునృపధీర!' | 'శ్రీకర, గుణధామ, శ్రీరఘురామ,<br>సేవనాతీత, సౌభాగ్యసమేత,' |

| ముద్రిత-ప్రాచ్యలిఖిత గ్రంథాలయ ప్రతులు. | తంజావూరి ప్రతి. |
|---|---|
| | తుది |
| 'వాసవప్రణిమాన, వాజవాధీశ,<br>ధీశక్తి నిజపాత్ర దేవయప్రుత్రి!' | 'అరవిందభవపూజ (?) అమృతశరీర,<br>కరుణించి నన్నేలు కాకుత్స్థరామ!' |
| | విరా. పం. అ. ఆది. |
| 'శ్రీకరచారిత్ర, శృంగారగాత్ర,<br>ధీకల్పితోద్ధార, దేవయమువ్వ!' | 'శ్రీకరచారిత్ర, శృంగారగాత్ర,<br>........................<br>అవిభీషణుని లంకారాజ్యమునకుఁ<br>గావించి నిలిపిన ఘన, చిత్తగింపు.' |
| | తుది |
| 'పంచాక్షరీమంత్ర పరమతత్త్వజ్ఞ,<br>పంచమవేద ప్రపంచ నిర్వహణ,<br>........................<br>ప్రథిత జంబూద్వీపభార ధౌరేయ,<br>పృథులసౌభాగ్య గంభీరసముద్ర,<br>అనియిట్లు నృపతికి నభివృద్ధిగాఁగ<br>నెనసినవేడ్కతో నేఁజెప్పినట్టి<br>యీపుణ్యకథ విన్న నెలమిఁ వ్రాసినను<br>........................<br>మహితాయురారోగ్య మంగళచయము<br>రమణ బట్టేపాటిరామలింగంబు<br>క్రమముదప్పక యిచ్చుఁ గలకాలమెల్ల<br>అవేల్పుఁగొల్చినయనఘాత్ముఁ పేర<br>దేవయప్రభు వంశతిలకంబు పేర<br>సరణిగాఁ బంటువంశప్రభు పేర | 'దశరథరామ, సీతాభిరామ,<br>శశికళాధర సేవ్య సన్మౌనివర్య,<br>........................<br>భోగలాస్యము సుధాంభోధి చంద్రునకు<br>భాసురశౌర్యానుభావ సాంద్రునకు<br>........................<br>అనఘునన్నుతికి శాహాజీనృపతికి<br>నింబాజి వ్రాయించె నఖిలారవింద<br>రంభోధ యగుచుండునట్టి భారతము<br>నిటలాక్ష పదపద్మ నిహితప్రసన్న<br>పటుచిత్తుఁ డైన కుప్పయమంత్రిచేత<br>ఈపుణ్యకథ విన్న నెలమిఁ వ్రాసినను<br>రూపించి చదివినఁ జిరపుణ్యులకు<br>........................<br>మహితాయురారోగ్య మంగళచయము<br>రమణమై నిచ్చు శ్రీరాఘవేశ్వరుఁడు. |
| "మఱియు జంగాలముమ్మయ ధీరు పేర<br>సహజసుజ్జను పేర సంప్రోక్తమైన<br>మహితకావ్యము ధాత్రి మను...<br>........................ | "ఈసుధాకరులు మహియెంతకాలంబు<br>హేమాద్రిశిఖరంబు లెంతకాలంబు<br>........................<br>పాలుపొంద నెలయును భువనంబులెఱుఁగ |

| ముద్రిత–ప్రాచ్యలిఖిత గ్రంథాలయ ప్రతులు. | తంజావూరి ప్రతి. |
|---|---|
| తుది | |
| ఇదిసదాశివభక్త............ | ననుపమస్థితి నొప్పు నంతకాలంబు. |
| .........తిమ్మయ నామధేయ | ఇది సదాశివభక్త........... |
| రచితవిరాటపర్వము........ " | .........తిమ్మయ నామధేయ |
| | రచితవిరాటపర్వము........" |

ఆంధ్రవిశ్వవిద్యాలయప్రతి:—

"చారుయశఃపూర, సరసగంభీర!-ధీరుష్టారిత్రాణ బిరుదప్రతాప!
తాపసకృత సౌఖ్య, ధర్మస్వరూప!-రూపమనోజాత రుచిభానుబింబ!
......................డింభ-డింబకులాచార ద్విజ...లంబ,
లంబకర్ణోద్ధార లలితసంచార! చారణస్తుతభాగ్య, సద్గుణోద్ధార!
ధారాధరోద్ధారధర, సుభావాస:-వాసవప్రతిమాన వరజనాధీశ,
ధీశక్తినిజపాత్ర, దేవయపుత్ర! ఇది సదాశివభక్త హితజనాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప-శ్రుతిపాత్ర వల్లభనూరిసత్పుత్త్రి)
మతిమద్విధేయ తిమ్మయనామధేయ-రచితవిరాటపర్వమున నాశ్వాస
ముచితార్థయుతముగా నొప్పె నాలవది."

నరసయచౌడునివిషయమునను తంజావూరిప్రతి కొంతవంచనకే దొరకొనెను గాని, అది తుదముట్టలేదు. ఆదిపర్వములో మొదటి మూఁడాశ్వాసములలోను నరసయచౌడునిపేరు తొలఁగింపబడి యా స్థానమున శ్రీరామునిపేరు నెలకొల్పఁబడినది. తక్కిన యయిదాశ్వాసములును ఆమంత్రి పేరనే చెల్లుచున్నవి. ఈపర్వమునకు లోకమున మన్నెచ్చుటను ప్రత్యంతరము లభింపకపోవుటచే మొదటిమూఁడాశ్వాసముల యథార్థస్థితి గనిపట్టి వివరించుటకు వీలుకాకపోయెను. అయిననుఉన్న యాధారమునుబట్టి యాదిపర్వము చౌడామాత్యాంకితమనుకొనుటలో సందియ ముండనక్కఱలేదు.

ఈవాదమునకుఁ బక్షాంతరమాలోచించి యీక్రిందివిధముగా ఆశంక చేయవచ్చును: 'తిమ్మయ తనపర్వములనన్నిటిని రామనామాంకితముగనే రచిం

వఁగాఁ, గాలాంతరమున చౌడామాత్యుఁడు ఆదిపర్వమునందును ముమ్మయరెడ్డి విరాటపర్వమందును శ్రీరామునిఁ దొలఁగించి యాచోటఁ దమపేర్లు చొప్పించు కొనఁగూడదా!' యను. కూడునుగాని యిందుసంభావ్యత లేదు. ఈకృతిపతులట్టి దొంగతనమునకే పాల్పడినచో సొత్తునంతను అపహరింతురుగాని, కొంచెములోఁ దృష్టిపడి యెక్కువపాలు వదలిపెట్టిపోరు. వదలిన ఆయెక్కువపాలు తమదొంగ తనమును బట్టిచూపునేని భయమునకును లోనగుదురు. అదిగాక, ఈవంచన ప్రారంభించిన నరసయచౌడుఁడు దానిని తానే తుదముట్టించియుండునుగాని, స్థలాం తరమందలి ముమ్మయరెడ్డికిఁ గొంతపాలు వదలిపెట్టఁడు. మఱియు, ఈపురుషులిరు వురును ఇట్టినికృష్టకార్యమునకు లోఁబడవలసిన నీచులునుగారు. వారు సంఘమున నున్నతపదస్థులు. 'కర్ణాటతారుఁ' డను దిక్కులవెలసిన మంత్రియొకఁడు; 'కర్ణాట తిలకుఁ' డని పేరుమోసిన జనాధీశుఁడొకఁడు. కృతిపతిత్వాకాంక్ష తీర్చుకొనుటకై యీయిరువురు 'ఈశ్వరార్పణ' మన్నవస్తువు నపహరించుకక్కుఱితికిఁ బాల్పడక స్వతంత్రించి తామే యెన్నోగ్రంథములను వ్రాయించుకొనఁగల సమర్థులు. కావున వీరికృతిపతిత్వమును నవ్యాజమొనర్చుటకు నామనసొల్లకున్నది.

'మఱి, తిమ్మయకవి గ్రంథమునంతను ఈయిర్వురికో వీరిలోనొకరికో అంకిత మొనర్పక, కొంతయాతనికిఁ గొంతయీతనికి మఱికొంత రామునకు నేలసమర్పింప వలెను?' అనుప్రశ్నయు రావచ్చును. ఈప్రశ్నవలెనే సమాధానమును సులభమే. ఆకవి యొక్కొక్కపర్వము నొక్కొక్కకృతిగా నూహించి, ఆయాకృతులను దొరకినవుడు దానర్హులైనపతులకు నర్పించి, దొరకనపుడు 'బ్రహ్మార్పణ' మని రామునకు ధారవోసియుండును. భాస్కరరామాయణముప్రతి సర్గుష్టమును సమగ్ర మునుఅయినది లభించినపుడు, ఈద్విపదభారతమువలెనే కొన్నికాండములీశ్వరార్పిత ములుగా మఱికొన్ని సాహిణిమారాంకితములుగా వేర్వేఱ కనుపట్టునని నాయూహ. ఇప్పుడచ్చయియున్న యీరామాయణములో ఈకృతిపతిత్వము చాల తాఱు మాఱుగా నవిర్దేశ్యముగా నున్నది.

సభాపర్వము ఆదినిరామాంకితముగను, అంతమున రంగయామాత్యపుత్త్రుఁ డగు అనంతామాత్యునకంకితముగను ఉన్నది. బాలసరస్వతీశ్వరుఁడు ఈయిరువురను గృతిపతులఁగా భావించెనో? లేక రామునేకృతిపతినిఁజేసి, తనపోషకుఁడగు సనంతా మాత్యుని గౌరవార్థముసంబోధించెనో?

"శ్రీసముంచిత నేత్ర, శృంగారగాత్ర!-కోసలావనినాథ, గుణశోభిరామ!"

సభా. ప. ప్ర. అ. ఆది.

"భానుకులాంభోధి పావన చంద్ర!-భానుకోటిప్రభా భాభాసమాన!

అంజనాత్మజలోల, యతికృపాశీల!-మంజీరయుతపాద, మధురప్రసాద!

.............................................." తుది.

"శ్రీభోగసంపన్న, శివచాపభిన్న!-సౌభాగ్యసుత్రామ, సాకేతరామ!" ద్వి. అ. ఆది.

"పంచఘంటానాద, పాండవాహ్లాద!-పంచాస్త్రసమశౌర్య, ధర్మాద్రిధైర్య!

శ్రీరంగయామాత్యశేఖర పుత్రి!-కారుణ్యనిధి, దానకర్ణావతార!

శ్రీయనంతామాత్యశేఖరోత్తంస!-కాయజసమవర్తి, కమనీయకీర్తి!

ధర్మసమగ్రంబు తలకొన్నయదియుఁ-బేర్మిఁ బుణ్యంబులఁ బెనుపొందునదియు

నసమసాహిత్యవిద్యా చతుర్ముఖుఁడు-రసికుండు బాలసరస్వతీశ్వరుఁడు

పసనొనర్చిన సభాపర్వంబునందు-నసదృశంబుగ ద్వితీయాశ్వాసమయ్యె." ద్వి. అ. తుది.

రాఘవపాండవీయ కృతిప్రదానముకూడ నిట్లే ఆకువీటిపెద వేంకటాద్రికా! వియాపాక్షునకా! అని సందేహింపఁదగినట్లుండును.

సోమన తనపదునొకండుపర్వములను శ్రీ తిరుపతి వేంకటేశ్వరునకే సమర్పించెను. తిమ్మయ క్లుప్తముగావ్రాసివిడిచిన యారణ్యపర్వమును నీతఁడు పెంచి తిరుగ వ్రాసిన గ్రంథభాగమునుగూడ ఆదేవునిపరమే చేసెను. ఇది ఈద్విపద భారతచరిత్ర స్వరూపము.

ప్రకృతిదేవతోత్సంగమున నోలలాడిన ప్రాక్తనమానవుఁడు చిత్రవిచిత్ర కార్య కమనీయమైన ఆమెచిద్విలాసమును జూచి యానందపరవశుఁడై చిందులుత్రొక్కుచుఁ బాడినపాటయే మానవలోకకవిత్వావిర్భావమునకు శ్రీకారము. ఆకవిత్వము ఆడుచుఁ బాడినదిగనుక దానికి 'ఆట-పాట' లేక 'నృత్తగీతము' (Ballad dance) అని పేరు. ఈ 'యాట-పాట' లో మూఁడు భిన్నకళాంశములు గలవు:—అడుగువేయుట, రాగముతీయుట, మాటపలుకుట. శాస్త్రపరిభాషలో ఈమూఁడును గ్రమముగా నృత్తము-గీతము-శబ్దము-అయినవి. ఈమూఁటిలో శబ్దమే కవితాద్రవ్యము; తక్కిన రెండును ఉపస్కారకములు. కాలాంతరమున ఈమూఁడంశలును గ్రమముగా

మూఁడుభిన్నశాఖలై నాట్యము-సంగీతము-పద్యముగాఁ బరిణమించినవి. తొలి నాఁటికవిత్వమునకు సాహచర్యము నెఱపిన నృత్తగీతములలో నృత్తమునుబూర్తిగను గీతిని కొంతవఱకును దొలఁగించి, కవిత్వమునకుఁ బ్రధానాంగమైనశబ్దము తనరాజ్యమును దానే యేలుకొనఁజొచ్చినది. అదియే పద్యకవిత. ఈరాజ్యములో నృత్తమునకుఁ బ్రవేశమే లేదనుట యెల్లరకును విశదమే. గీతికిమాత్రము అప్రత్యక్షమైన యధికారము కొంతకలదు. గీతిగతమైన యేలయనిబద్ధత కలదో అదే పద్యగతమైన ఛందస్సు. ఈఛందస్సుకతముననే పద్యపఠనవేళ మధురమైన యొకగీతివిశేషము వచనపఠనముకంటెభిన్నమైనది వ్యక్తమగుచుండును. పాటగాఁబుట్టినకవిత్వము పద్యముగాఁ బరిణమించుటలో నృత్తమునువలె గీతమును కేవలము విసర్జింపలేక పోయినది. దానినిసైతము విసర్జింపవచ్చునని రుజువుచేయుటకుఁ బుట్టినదే గద్యకావ్యము. ఛందోవిసర్జనమువలన గద్యము కవిత్వమనిపించుకొనునా లేదా? అనునది విషయాంతరము. అది మైమయిఁ దేల్చఁదగినదికాదు. కాని, తనరాజ్యమైన కవిత్వమునఁ దానే సర్వాధికారము నెఱపుటకై శబ్దముచేయుకృషి యెంత దూరముపోవునో చూపుటకుమాత్రమే ఈయంశమును స్మరించివిడిచితిని.

గీతికి అప్రత్యక్షసంబంధముకాక ప్రత్యక్షాధికారమే యొసగినకవిత్వము పదకవిత్వము. పదజాతికిని బద్యజాతికిని ప్రధానమైనభేదమిదియే. ఈపదజాతిలో నింకొకయుపశాఖ కవిత్వాంశకంటె గానాంశకే యెక్కువప్రాధాన్యమిచ్చి గేయకవిత్వమనెడి వ్యపదేశము తాల్చినది. గీతినంగీకరించియుఁ కవిత్వాంశకే యెక్కువ ప్రాధాన్యమిచ్చిన రెండవయుపశాఖ, జాతివాచకమైన పదకవిత్వము పేరనే నిలిచియున్నది. వీనిలో మొదటిదాని సంచారము రాగతాళప్రధానమైన సంగీతకళాజగత్తున; రెండవదానిప్రవర్తన భావనాప్రధానమైన సారస్వతశిల్పలోకమున. ఈరెండు శాఖలనుండియు మరల పెక్కు చిలవలుపలవలు పుట్టినవి. వానిసూక్ష్మవివరణమిచ్చ్యెడ నపేక్షణీయము కాదు. కావున గేయశాఖ-పదశాఖ-యనెడి వర్గీకరణముతో నిలిపెదను.

ఏవాఙ్మయములోనైనను ఈపదకవిత్వమే పద్యకవిత్వముకంటె ముందు పుట్టి పెరుగును. కాని, ఛందోవ్యాకరణాది నియమనిష్కర్షతయు, శైలీప్రౌఢియు, ఇతివృత్తోదారతయు, విజ్ఞానాధాయకతయు లోనగు నితరకవితామహాంగముల సంతరించుకొని, నాగరకమై, పద్యకవిత్వము ప్రౌఢసాహిత్యమనుపేర విద్వల్లోకమున స్థిర

ప్రతిష్ఠ సంపాదించును. పదకవిత్వము, ఎంతనిసర్గమధురమును నిరాడంబరమును అయినను ప్రౌఢవాఙ్మయమున స్థానమాసింపక, గాలిలోనే పుట్టి గాలిలోనే సంచరించునుం, బుట్టుకదార్ఢ్యమునుబట్టి కొంతకాలము సజీవమైయుండును. ఇదియే మనలో శుద్ధదేశికవిత్వమనిపించుకొన్న శాఖ. దీనికిని సారస్వతప్రతిష్ఠ సంపాదించి స్థిరత్వము నెలకొల్పుటకై పలువిధములం బాటుపడిన సంస్కర్తలే ద్విపదకావ్యకర్తలు. పాడందగిన పదకవిత్వమునెడ నొకకంటిని, పఠనయోగ్యమైన పద్యకవిత్వమునెడ రెండవ కంటిని పెట్టి, యుభయగుణములను ఏకముచేసి ఆమహానుభావులు పచనముచేసిన రసాయనమే ద్విపదకవిత్వము. ఇది గేయమును అగును, పాఠ్యమును అగును. ఈవాఙ్మయశాఖ నిసర్గమాధుర్యముతోడియుదాత్తశక్తి, నిరాడంబరత్వముతోపాటు విజ్ఞానాధాయకతకు, సౌలభ్యసహితమైన శైలీప్రౌఢికిం గూడలియై, దేశీయమైన శుద్ధపదకవిత్వమునకును సాంస్కృతికమైన ప్రౌఢసాహిత్యమునకును సామరస్యము గలిగించి యుభయతారకమైన కావ్యపథమును తీర్చిదిద్దినది.

ఈవాఙ్మయమునకు మూలపురుషుండు పాల్కురికి సోమనాథుండు. పద్యకావ్యపథముతీర్చుటలో నన్నయ యెట్టిప్రథమాచార్యుండో, ద్విపదకావ్యపథమును దీర్చుటలో సోమనాథుం డట్టియాచార్యుండు.

ఈ మూలపురుషత్వమునుబట్టియు, గౌరనాదుల శైవమతమునుబట్టియుం గాబోలు, శైవులే ద్విపదవాఙ్మయకర్తలనియు దేశికవితాభిమానులని యొక అపప్రథ లోకమున వ్యాపించినది. ఇతరులమాట యటుండనిండు; సోమన యెంతవీర శైవుడో అంత వీరవైష్ణవులేయైన తాళ్లపాకవారికి సైతము ఈనిర్మాణములో నెక్కువ పాలేకలదు. మఱియును పాల్కురికి వారివలెనే పరమమాహేశ్వరులైన పిడుపర్తి వారియింట వారిమగపిల్లలతోపాటు ఆడుపిల్లలువలె ద్విపదకవితతోపాటు పద్యకవితయు నుదయించినది. ద్విపదసేవయే కవితావ్రతముగా నెగడిన గౌరనయింటనే ఆతనికొడుకు భైరవకవి "పితురాచారము" నజ్జగించి శ్రీరంగేశ్వరునిం బద్యములతోనే పూజించెను. అంతదూరమేల! ప్రథమద్విపదాచార్యుండైన సోమనాథుండే వారియవతారపురుషుడగు బసవేశ్వరునిపాదములను జంపకోత్పలములతో నర్చించెను. కావున ద్విపదలు శైవులసొత్తనియుం, బద్యములు శైవేతరుల ధనమనియు నేర్పాటుచేయుట పొసగనిసంగతి. ద్విపదరచనలకును కులగోత్రములకును సంబంధ మేమియులేదు. దానికిం గాలప్రభావముతోంగూడం బొత్తులేదు. పోంగా, ఆయా

కవులయుఁ గవిపోషకులయు ఆశయాభిరుచులే ఆయావాఙ్మయలతలకు ఆలవాలము లనుకొనుట తెన్ను.

సోమనాథుని ద్విపదలు అనేక కారణములచే సర్వజనసంసేవ్యములు కాక పోయెను. రామాయణరచనారూపమున ద్విపదకు సార్వజనీనత కల్గించినవాఁడు గోనబుద్ధారెడ్డి. ఈతని రామాయణము నన్నయభారతముతో సమానమైన ప్రతిపత్తిని ఆర్జించుకొన్నది. ద్విపదకవిత్వమునకీతఁడు ద్వితీయాచార్యుఁడు. ఈ సోమన బుద్ధనలిర్వురును ద్విపదకావ్యసృష్టిప్రతిష్ఠలకుఁ గారకులు.

అర్వాచీనులగు కొందఱు కవులు తమ పద్యరచనాకుతూహలమును బట్టియో, పద్యప్రబంధములకున్న ప్రచారము ద్విపదకావ్యములకుఁ బండితలోకమున లేదని గ్రహించుటఁ జేసియో, కృతిపతుల యాదేశమునకు లోఁగియో, వీరిరువురి ద్విపద కావ్యముల ననుకరించి పద్యకావ్యములను సృష్టించిరి. భాస్కరరామాయణము రంగనాథరామాయణమునకు ఈవిధమగు ననుకరణసృష్టి. సోమనాథుని బసవపురాణము పిడుపర్తి బసవనయు, పండితారాధ్యచరిత్రమును శ్రీనాథుఁడును ఆరీతిగనే రూపాంతరమునుబొందించిరి. ఈయాచారమంతటితోనాఁగలేదు. భాషలోఁబుట్టిన ప్రతిద్విపదకావ్యమునకును ఇంచుమించు ఈదశయేపట్టినది. శంకరకవిహరిశ్చంద్రయు, తిమ్మభూపతి పరమయోగివిలాసమును, గౌరనామాత్యుని గయోపాఖ్యానమును ద్విపదకావ్యములు పద్యప్రబంధములైన ప్రక్రియకు ముఖ్యోదాహరణములు.

ఈవింతమార్పు కన్నులయెదుట జరుగుచున్నను ద్విపదకవులు తమవాఙ్మయమును ఉత్తరోత్తరాభివృద్ధిగాఁ గొనసాగించుచునేయుండిరి. పద్యవాఙ్మయములో నెన్ని కావ్యజాతులు కలవో యించుమించు నన్నిజాతులను వీరుకూడ సృష్టించిరి. అంతమాత్రమే కాదు. వారిలోఁ గొందఱుసమర్థులు పద్యప్రబంధరాజ్యముపై దండెత్తి యాభూములను గొన్నిటిని ద్విపదరాజ్యమునకుఁ గలుపుకొనఁజొచ్చిరి. వారిసొత్తును వీరు, వీరిసొత్తును వారు నాత్మసాత్తు మొనర్చుకొనుట యొకపరిపాటి యైనది. ద్విపదకావ్యమును ప్రబంధీకరించి యాధునిక నవీనమార్గకవితామండలమునకుఁ (Neo-classical field) గొంపోవలెనని ప్రబంధకర్తలు ప్రయత్నింపగాఁ బ్రబంధములను ద్విపదీకరించి ఆయితివృత్తమును దేశికవితాభూమికిఁ (Popular field) గొని తేవలెనని ద్విపదకర్తలుద్యమించిరి. ఈ వినిమయములో నొండొరులయెడ

వారికి స్పర్థమాత్రములేదు. మాతృకను భక్తితో ననుసరించి తమరచనలను తల్లిచాటు పిల్లలుగాఁ గనపఱుపవలెననియే యీయనువాదకులు ముచ్చటపడిరి. ఈజంటలో దేనిని పరిశీలించి చూచినను మాతృకలోని ఛాయలు ప్రతిఫలించుచునే యుండును. ఛాయమాత్రమే కాదు, ఆపలుకులే వినఁబడుచుండును. ఒకరొకరికి నొండొరుల యెడఁగల యీ విధేయతకతముననే వారికి స్పర్థ లేదంటిని. స్పర్థ లేకపోవుటయే కాదు; పరస్పరభక్తిగౌరవములును గలవు. లేనిచో నింతసంపూర్ణానుకరణమే పొసఁగదు.

పద్యప్రబంధములలో నుద్గ్రంథములనిపించుకొన్న పురాణేతిహాసములను ద్విపదీకరించిన పద్ధతులలో ఈబట్టుపాటి తిక్కనలాతఁడు మొదటివాఁడు. పురాణేతిహాసములలో ముఖ్యమైనవి భారత భాగవత రామాయణములుగదా! వానిలో రామాయణమును గోనబుద్ధారెడ్డి స్వతంత్రముగనే సంస్కృతమునుండి తెనుఁగునకు ద్విపదగా నవతరింపఁజేయఁగా, మిగిలిన రెండిటిలో భారతమును తిమ్మయయు, భాగవతమును తెఱుమళ్ళ రంగశాయియు నాంధ్రపద్యగ్రంథములనుండి ద్విపదకు అవతరింపఁజేసిరి. వీరిలో బుద్ధారెడ్డి తిమ్మయకును, తిమ్మయ రంగశాయికి మార్గదర్శకులు.

భారతాదిమహాగ్రంథములలోని పరమార్థమును జనబాహుళ్యమునకు సుబోధము చేయవలెననెడి యాశతో దక్షిణాంధ్రయుగమునఁ జెందిన కొందఱుకవులు పద్యగ్రంథములను వచనములుగా ననువదించిరి. కానీయనువాదములు మూలమునకు కేవలదండాన్వయప్రాయమైన ప్రతిపదపరివర్తన మగుటచే, వారాశించిన ప్రయోజనసిద్ధి సంశయాస్పదమైనది. కాని, వారివలనఁ దెనుఁగునఁ బ్రత్యేకవచనరచనలు లేని లోటుమాత్రము తీరినది. కళువెవీరరాజు వచనభారతము, సముఖము వెంకటకృష్ణప్పనాయని వచనజైమినిభారతము ఈజాతిలోనివి.

ఈద్విపదభారతము వచనభారతమువలె అస్వతంత్రపరివర్తనముమాత్రము కాదు. వ్యాసభారతమునకుఁ గవిత్రయభారతమెంతవిధేయమో, వారిభారతమునకు నిదియు నంతేవిధేయము. అనఁగా, నదియు నిదియు మూలమునకు యథోచితానుసరణములేకాని యథామాతృకములుగావు. ఒకానొకయెడ మూలానుసరణములో నన్నయకంటె తిమ్మయయే విశృంఖలముగ విహరించెనేమోయనియుఁ దోఁచును.

సంస్కృతపురాణకర్తలు, బహుప్రాచీనకాలమునుండియుఁ బరంపరాగతములై వారిచెవిసోకినయనేకచరితములను, అర్థవంతములు నీతిదాయకములునని వారికిఁ దోచినవానిని, భారతాదిమహాగ్రంథములలో నెట్లో సందర్భముగలిగించి, పురాతనేతిహాసములను వేఱఁ గథలోనటికి వానియునికికి స్థిరతచేకూర్చిరి. చిన్నవియుఁ బెద్దవియునైన ఈయుపాఖ్యానములమూలమునఁ బ్రధానగ్రంథము, ఆవశ్యకతకు మించినవిపులత తాల్చెను. వ్యాసునిభారతము చాలవఱకు వివిధముగాఁ బెరిగినదే. అందును అవతారికాప్రాయమైన మొదటిరెండుమూఁడు ఉపపర్వముల గ్రంథము మహాగహనమువలె నిరంధ్రముగా నల్లుకొనినది. భారతకథారంభమునకును ఈభాగములలోని కొన్నిప్రకరణములకును దూరబంధుత్వమే కాని దగ్గఱచుట్టఱికము లేదు. మఱియు, బ్రహ్మకోశమువలె లౌకికవాఙ్మయమునకైనను శ్రుతముగానే నేర్పఁబడి శాశ్వతముగాఁ గాపాడఁబూనిన యాకాలములో, గ్రంథసందర్భమునకు విషయసూచిక కాఁదగిన యంశములుకూడ సంస్కృతభారతగ్రంథములో నంతర్భాగములే కావలసిన యావశ్యకతకల్గినది. పర్వసంగ్రహ పర్వానుక్రమణికాది కథనమంతయు ఆజాతిలోనిదే. ముద్రణసౌభాగ్యమును--ముద్రణమునకు నేల--వ్రాతనేర్పునేయెఱుఁగని మనపూర్వులు గ్రంథసంరక్షణార్థము పడినపాట్లకుఁ బన్నినయుపాయములకు నిదియొకదృష్టాంతము. భారతాదిపురాణేతిహాసములు దేశభాషలలోని కవతరించుకాలమునాఁటికి ఆవిషయసూచికాదుల యావశ్యకతగాని, అనేకోపాఖ్యానములప్రస్తుతత్వముగాని యంతగానుండదు. ఈధర్మమును గుర్తెఱిఁగియే నన్నయభట్టు వ్యాసునిగ్రంథావతారికాగహనమును జాలవఱకు ఛేదించి మార్గమును సుగమము చేసెను. ఈతిమ్మయ ఆమార్గము మఱింత చక్కఁజేసి రాచబాటనేర్పఱచెను.

ఈతఁడు, తనకప్రస్తుతములనితోఁచిన యుపపర్వశమంతకాక్షోహిణీసంఖ్యాకథనము, దేవశునివృత్తాంతము, చ్యవనునిచరిత్ర, ప్రమద్వరాకథ మొదలగు ప్రకరణములను నామమాత్రముగనైనను స్మరింపక, సూచ్యార్థసూచనగా, భారతకథను బ్రస్తావించి, సాక్షాత్కథాప్రవర్తనకుఁబూర్వరంగమైన యుదంకునిజనమేజయాస్థానప్రవేశముతో నుపక్రమణముగావించి, భారతకథాశ్రవణకుతూహలపరులైన సభాస్తారులకు దుస్సహకాలయాపన గలుగకుండ వీనులవిందొనర్చిన నిపుణసూత్రధారుఁడు.

కథాగమననిర్వక్రతకై యీతఁడు కల్పించుకొన్న యీ ప్రణాళికయే ఆది పర్వరచన కంతకును వ్యవస్థానసూత్రమైనది. ఆసూత్రము వెంటఁబడిన యీతని భారతకథాసరస్వతి, దేవదానవుల యుత్పత్తిక్రమమును, పురూరవాదిరాజవంశచరిత్రలను దెలిసికొనవలెనని వారివంశవృక్షములను వెదకలేదు; వ్యుషితాశ్వ శ్వేతకేతులకు, దీర్ఘతమునకు, దూరమునుండియే నమస్కారము సమర్పించి తరలిపోయినది; సుందోపసుందమందపాలాదుల నొక్కమాటతో మాత్రమే సాగనంపినది; దుర్వహమైన శాస్త్రప్రసంగభారమును తాను మోయఁగలిగినంతే వహించి తక్కినది విసర్జించినది.

ఈతఁడు చేసిన స్వైరవిహారములోఁ బాలవఱకు దారిచూపినది రంగనాథ రామాయణము. బుద్ధారెడ్డి, ఆంధ్రపురాణేతిహాసములను దెనిఁగించినకవులలో నతిస్వతంత్రుఁడనియు, రామాయణములో నతఁడు చొప్పించిన యమూలకగాథాకల్పనలవంటివానిని మఱియేయనువాదకుఁడును గల్పింపలేదనియు, ఆ రామాయణపీఠికలో నిదర్శనపూర్వకముగా నుగ్గడించియుంటిని. కొంతవఱకు ఆలక్షణమే యీద్విపద భారతమునకును బట్టినది. ఈతఁడుచేసిన మొదటి యమూలకల్పన దుర్వాసశ్శాప వృత్తాంతము. సముద్రమథనమునకు మూలకారణమైన ఈయితివృత్తమును వ్యాస భారతముగాని, నన్నయభారతముగాని తడవలేదు. అయ్యెడ సముద్రమథనోప క్రమము హఠాత్సంభవముగానున్నది. విష్ణుపురాణాదిగ్రంథములలోఁ బ్రథితమై యున్న యీకథాంశమును తెచ్చి యతఁడు సముద్రమథనమునకుఁ బూర్వరంగముగాఁ బొందుపఱచి ఆయితివృత్తమును సోపపత్తికము చేసెను. ఈఘట్టములో దేవదానవులకుఁ బొత్తుకూర్చుటకై రాయబారమునంపిన బృహస్పతివాక్యనిపుణత, ఈకవి లోకజ్ఞతకును, ఈతనిశైలిలోని సంభాషణచాతుర్యమునకును బ్రబలనిదర్శనముగా నున్నది:

"నావుడు నాదైత్యనాథులతోడ—నావిబుధాచార్యుఁడనియె నేర్పునను :
అమరవల్లభుఁడు మీయందఱతోడ—సముచితముగఁ గూడిచరియింపఁదలఁచి
పవిపాణి మీతోడఁ బలుకుమన్నట్టి—విధంబు చెప్పెద వినుఁడు మీరెల్ల.
తాము నేమును నన్నదమ్ములమయ్యు—నీమాడ్కి నన్యోన్య మీసుగా నేల!
జగతి నేప్రొద్దు గోచారాన మనకు—జగడంబు వచ్చినఁ జనునె పాయంగ!
నుభయవాదులముఁ గూడుండిన మనకుఁ—ద్రిభువనంబుల నెదిరింపంగఁ గలరె!

యొనరంగ మనమెల్ల నొక్కటై దివిజ-దనుజభటాళిచేఁ దడయక యిపుడు
తోయధిమథియింప దొరకును నమృత :-మాయమృతముఁ ద్రావునంతనె మనము
చావును దేవులును జరయును నెవ్వి-భావింపఁగా రాక భాసిల్లఁగలము.
మాయెగ్గులేమియు మదిలోన నిడక-యీయెడ మీరెల్ల నీకార్యమునకు
..................................................
కించిత్తు మేలును గీడును లేదు-పంచుక యనుభవింపఁగఁ గీర్తిగలుగు.
అనిచెప్పి పుత్తెంచె; నదియును గాక,-యొనయంగ మీరెల్ల నేకరూపమున
వినుఁడు నామాట; యీవిధమున నడవ-ననుకూలమైవచ్చు నన్ని కార్యములు."
అని వారుపల్కి-నయుందులకెల్ల-మొనసి ప్రత్యుత్తరంబులు చెప్పి తీర్చి. ద్వి. భా. 40. పు.

ఆజన్మవిరోధులతోఁ గార్యవశయైన మైత్రినెఱపఁదలఁచినకార్యవాదిసను యజ్ఞుఁడై యెట్టిసల్లాపమాధుర్యము నుపరిపించునో ఆవంచనాచమత్కారమునకు, దేవగురుని యీయుపన్యాసము మూర్తిరూపము.

నిసర్గరమణీయమైన ఈసంభాషణశైలి కావ్యశిల్పమునకుఁ బ్రాణము. అరి వ్యక్తమైనఘట్టములనే యూహింప్యసంపన్నములని, విమర్శకులు కొనియాడుదురు.

హేయమైన తల్లి దాసీత్వమునుజూచి, తనదైన్యమును దలఁచి, రెంటికినివగచి, "అమ్మా! మనకీగతిరేమి!" అని తల్లినిప్రశ్నించుగరుడుని దీనవాక్యములలో నెట్టిసహజసల్లాపసుఖమున్నదో సహృదయులు గ్రహించి యానందింతురుగాక:

"అప్పుడు కద్రువ యంతరాజసమున-నెప్పటిపోల్కి నయ్యురగపుగచేతఁ
బనిగొనుచుండ, నాపన్నగాంతకుఁడు-జననికి నొకనాఁడు సద్భక్తి మ్రొక్కి:
తల్లి! నిన్నిదియేమి తనిలి మావార-లెల్లదిగా వీరికిచ్చిరో తెలుప!
కాదేని, నీకొండుకడ జిక్కు-లేమి-నీదెసపొంది నీవిటుమఁ బొందెదవో!
కాకున్న, ననదవై కడుపుఁగూటికిని-ఈకద్రువకుఁ గను లిట్లుచేసెదవో!
అదిగాక, ప్రతినకునైపూని తగవు-వదలక యిట్లుండవలసెనో నీకు!
కులిశసన్నిభ పటుక్రూర తుండాగ్ర-దళిత నిష్ఠుర ధరాధరుఁడనై వీరిఁ
జేపట్టి కుచ్చితుచెలువున నేను-ఈపాపకొదమల నిట్లు మోచుటకుఁ
బనియేమి? చెప్పుమేర్పడ నాకు!"-.......................... ద్వి. భా. 69. పు.

ఈపంక్తులుచదువుచున్నపుడు గరుడుని యశ్రుప్లావితనేత్రములును గద్గద కంఠమును భావుకుని మనోనయనములకును సూక్ష్మకర్ణేంద్రియములకును గోచరించు ననుటకు సందియము లేదు.

పేలవములైన సన్నివేశములను సైతము తనప్రజ్ఞాబలముచేతనే యీకవి చమత్కరించి రసవంతములనిపించఁగలఁడు. పైతృకమైనధనమంతయు దక్కఁగొని తానే యనుభవించుచున్న విభావసుని, సుప్రతీకుఁడనుతమ్ముఁడు తనసనతుకై నిలబెట్టి యడిగినమాటలు ఎంతలోకస్వభావానుగుణముగా నున్నవో చిత్తగింపుఁడు.

> సుప్రతీకాఖ్యుఁ డచ్చోటికి వచ్చి-................................
> ..............................-చేరియిట్లనియె: ‘ నొచ్చితిఁ ; బేదనైతిఁ ;
> బిత్రుపితామహులెల్లఁ బెంపారఁ దొల్లి-యతులధనాఢ్యులై యందఱు నేఁగ
> దాఁచినయర్థమంతయు నొక్కరుఁడవె-చూచి చేకొంటి, నచ్చుగ విభాగించి
> నాకు నీవలదె ధనంబులో సగము !-చేకొని తండ్రిచేసిన ఋణంబున్న
> వడిఁ బంచి నాకిచ్చువాఁడవు గావె !-గడుసరితన మేల ! కన్నవారెల్ల
> నగుదురు ; గాన నన్నుకున్న ధనము-సగమిమ్ము..............’ ఆది. ప. 75. పు.

నేనీయుదాహరణముల నిచ్చుటలోనియుద్దేశము కవినివాక్స్వభావమిట్టిదని చూపుటకే కాని, యీసర్వనుండియు నిట్లేయుండునని పాఠకులను వంచించుటకు గాదు.

లోకములోజరిగిన యొకవృత్తాంతము పురాణేతిహాసనిబద్ధమగునపుడు ఆకథ తాల్చెడియాకారమునకును, అదియే ప్రబంధీకరింపఁబడినపుడు తాల్చుస్వరూపమునకును ఎంతో వ్యత్యాసముండును. పురాణేతిహాసములలోనికథ ఉన్మీలితముకాని యాకారరేఖ మాత్రమే. ఆకవి దానియున్మీలనార్థము పరిశ్రమింపఁడు. అది యాగ్రంథ ధర్మమును గాదు. ఏధర్మనిదర్శనార్థమో, ఏరాజవంశచరిత్రాంగముగనో చెప్పఁబడిన ఆయుపాఖ్యానమును బురాణకర్త సర్వాంగసుందరముగా దిద్దవలెనని పాటుపడిన సాగదు. కాని, ఆయుపాఖ్యానమునే కైకొని ప్రత్యేకకావ్యనిబద్ధము చేయుకవి, ఆయస్థిపంజరమును సర్వావయవసౌష్ఠవముగల మాంసలాకృతిగా నలంకరించి ప్రదర్శించును. నేపథ్యరచనానిపుణుఁడైన యాకవియే ప్రబంధకర్త. ఆతనిచేతిలో శుష్కమైనపురాణోపాఖ్యానము సజీవమును రసస్యందియు నగును. ఆతనివర్ణనా ప్రజ్ఞకు ఫలితమే కథకుఁగలుగు ఈరూపాంతరలబ్ధి. ప్రబంధములోఁ గథాప్రవర్తనకు రంగమైన స్థలము, దానిపరిసరములు, కథాప్రవర్తకములైన పాత్రలు, వానియాకార చిత్తవృత్తులు, లోనగుసమస్తావయవములును యథాభావరసావస్థముగా వర్ణింపఁ

బడుటచేతనే యీసుందర రూపాంతర పరిణతి కలుగుచున్నది. ఈయర్థమునఁ ప్రబంధమనఁగా 'వర్ణనాత్మకమైన కావ్యము' అని చెప్పవచ్చును.

మన సాహిత్యములో ఈ కావ్యజాతి యొకస్వతంత్రశాఖగా 16 వ శతాబ్ది నుండి విస్తరించినది. దానికే ప్రబంధయుగమని పేరు. ఈతిక్కయ ఆకాలము కవి యగుటచేతను, ప్రబంధాభిరుచి మరగినవాఁడగుటచేతను, ఈ భారతమున ఆయా ఘట్టములను ప్రబంధోచితములైన వర్ణనలచే నలంకరించి కాలప్రభావమునకు లోఁగిన వాఁడాయెను. ఈతఁడే కాదు, ప్రబంధయుగమునఁబుట్టిన యేపురాణకర్తయైనను దనరచనను ప్రబంధలక్షణముద్రితముగానే యొనర్చును. కంకంటి పాపరాజు నుత్తర రామాయణమీధర్మమునకుఁ బ్రబలదృష్టాంతము. ఏకవియైనను బుద్ధిపూర్వకముగాఁ గాని, అప్రయత్నముగాఁగాని కాలప్రభావమునకు వశుఁడగుచునే యుండును.

ఈ మూలపర్వాంతర్గతములగు ననేకోపాఖ్యానములు సుందరప్రబంధవర్ణనలతో ననతివిస్తృతములైన కావ్యములుగాఁ జమత్కరింపఁబడినవి. ఉపరిచరవసు వృత్తాంతములోని శుక్తిమతీనదికి మానవనాయికాత్వమారోపించి యీతఁడు చిత్రించిన చిత్రణము వసుచరిత్రకారుని రూపకల్పనకుఁ బ్రతిద్వంద్విగా నున్నది. ఆసాగసుఁగత్తె సంచారవిలాసమును జూచి యానందింతురుగాక :

'అరయ నొక్కయే తాతనిపురము-చేరువఁబాఱు విశేషసంపదల.
చూచు నొక్కొక్కమాఱు సుకుమారమీన-లోచన శుభగుణ లోలదృష్టులను ;
పలుకు నొక్కొక్కమాఱు బకచక్రవాక-కలహంస మధుకర క్రౌంచనాదముల ;
మెలఁగు నొక్కొక్కమాఱు మృదులమృణాల-వలన హస్తవిలాస వైభవం బొప్ప ;
తెలయు నొక్కొక్కమాఱు వీచిసంక్షోభ-కలిత కైరవ ఫేన కమలహాసముల ,
వనచారణములు ప్రవాహమధ్యమున-మునుఁగఁ గుంభకుచాగ్రములును గానసైన
భయవతిగతిఁ బద్మాస్యపత్రాంబరమున-నయమతిఁ గప్పు నున్నతి నొక్కమాఱు ;
నిగిడిన యిసుకతిన్నియపిఱుందునకుఁ-దగు మొలనూలని తజ్జ్ఞలెన్నంగ
దరి నోలి రాలిన తరుముకుళముల-యురుపంక్తి శోభిల్లు నొక్కొక్కమాఱు ;
అరవిందములమీఁద నళిసమూహంబు-సరసశైఖరి వ్రాలి సందడించుటయు
రాజిత కల్హారరాజి హస్తముల-నోజతోఁ దోలఁగించు నొక్కొక్కమాఱు'. ఆ. ప. 102. పు.

యయాతిచరిత్రలోని దేవయానివసంతవనవిహారము ప్రబంధకర్తలందఱు ప్రోదిచేసిపెంచిన యుద్యానవనములలోని విహారమే :

‘ అంత నా భార్గవి యట నొక్క-నాఁడు-కొంత శర్మిష్ఠాది కాంతలు గొలువ
వనకేళి చేయుచో నలనొప్ప నపుడు-వనమున నొప్పెయ్యె వాసంతలక్ష్మి.
మాకంద మందార మధుక మాలూర-శాఖోట పాటల చంప కాశోక
సల్లకీ బిల్వాది సకలభూజములు-మొల్లంబుగాఁ బూచె ముద మొంద నలులు.
విరహులపై దండు విడలంగ మదనుఁ-డిరవుతో మునుబంచు నెలగోలనంగ
మిండతుమ్మెదపిండు మించుఁబూఁదేనె-కండక్రొవ్వునఁ గ్రోలి కలగుండువెట్టె.
“మానినీమణులార, మానంబు మాని-మానుగాఁ గవియుఁడు మగల” నన్నట్లు
మావిలేఁజివురెల్ల మత్తిల్లి మెసపి-కోవిలకదుపులు గొణఁగంగఁ దొడఁగె.
ఫలరసధారలు బాగుగాఁ గ్రోలి-చిలుకమూఁకలు గూడి చెరలుగొట్టుచును
పంచబాణుని తేరి వార్వాలమనుచు-మించి పాంథులమీఁద మొగ మెత్తఁజేసె,
విరహుల విరహాగ్ని విదితంబుసేయ-మరుఁడు పుత్తెంచిన మందిది యనఁగ
మలయాద్రిచలిగాలి మధురసౌరభము-వలనొప్పఁ బొలసె నవ్వనవీథులందు.
అప్పుడు భార్గవి యతిసంభ్రమమున-నుప్పొంగి చెలులతో నుద్యానవీథి
విహరించి......................................” అ. ప. 126–127. పు.

దుష్యంతునిమనస్సు హరఁగొన్న శకుంతలమనోహరరూపము పినవీరన సృష్టికిఁ బ్రతిబింబము :

“......కణ్వునిపర్ణశాలకే తెంచి-............ ............
నెమలిబర్హముకంటె నెఱిఁగల్మిగలిగి-యమరినకొప్పున నమరినదానిఁ,
పదియాఱుగాఁ జంద్రు భంగమొందించు-వదనపద్మమ్మున వలనొప్పుదాని,
దొండపంటికి సిగ్గు దొడరంగఁజేయు-పండికెంపులమోవిఁ దనరెడుదానిఁ,
జిలుకకోవెలలకుఁ జెలఁగువీణెలకుఁ-బలుకులఁ దలవంపుఁ బాటించుదాని,
మరుఁడు జయంబంది మహిమఁబూరించు-కరశంఖగతినొప్పు కంఠంబుదానిఁ,
గవజక్క-వలఁ గవకవ నవ్వఁజాలు-సవరనిచనుదోయిఁ జానొప్పుదాని,
నిగురించులతలతో నెకసక్క-మాడు-జిగిబిగిగల మేనిచెలువంబుదానిఁ,
గన్నియ లావణ్యగౌరవంబునను - వెన్నునవిహరించు విపులంపువేణి
యుదరంబుపైఁ దోచెనో యనఁజాలు - నొదవిన రోమాళి నొప్పారుదానిఁ,
బిఱుసైన చనుదోయిభారంబువలన - సరిఁ బేదమధ్యంబుజడియ, నానాభిఁ
బసిఁడిశలాకచే బంధించిరనఁగఁ - బసమూఁడువళులను భాసిల్లుదాని,
మరునిజైత్రరథంబు మార్కొ-నఁజాలు - వరజఘనంబున వాసైనదాని,

వనఁటికంబంబుల నదలించుతోడల-నొనరినపిక్కల నొఱపైనదాని,
రాయంచగములతో నంతుగావించు-ప్రాయంపునడపులఁ బరఁగినదానిఁ,
గుటిలకుంతలను శకుంతల నతఁడు-పలుమాఱు చూచుచు......
చెలువల నాబ్రహ్మ సృజియించుచోట-నలరు ఘుణాక్షరన్యాయాన దీని
సృజియింపఁబోలు నీక్షితి; నట్లుగాక-యజునకు నీనేర్పు నందవహానేని
యింక నొక్కతెఁ గాంత నీయింతిసవతుఁ-గొంకక మఱి యేలగూర్పంగ లేఁడు!
శృంగారరసమెల్లఁ జెన్నారఁ గూర్చి-యంగజుఁ డిచ్చోట యంత్రించెఁగాక
వితత వేదాభ్యాసవికలుఁడైనట్టి-చతురాననున కిట్టిచతురత గలదె!''

ఆది. ప. 147-149. పు.

పాండురాజుచరితములోని కిరాతాగనుసము మృగయావినోదము, మను చరిత్రశృంగారశాకుంతలములలోని వేఁటవర్ణనలకు సైదోడు:

“అంతఁ జంద్రునిలోని హరిణంబునైన-వింతగా నలయించి వెసఁబట్టనేర్పు,
నింగినైనను జొప్పునెమకంగనేర్పు-సింగమైనను బ్రేయఁజిక్కనేర్పు,
..........................-గలుగుకిరాతులొక్కట నొక్కనాఁడు
కోకతాలికతలల్ కోరచిందములు-వాఁకైనయురితీఁగె వట్టుబొంగులును
నెఱయఁ జొత్తిల్లిన నిడుఁదకన్నులును-గఱకులై మిడిసిన కావిమీసములు
నమలియాకులునిల్వనాటినతలలుఁ-జుమచుమనైన నెత్తురుచుక్కబొట్లు
............................................................
బీరనరంబులు బిగువుపిక్కలును-దోరవన్నియచెప్పుదోయిని గలిగి
............................................................
యరుదెంచి పాండున కతిభక్తిమ్రొక్కి-కరముచక్కనితూపు కానుకయిచ్చి,
నాదారు లెఱుకుల కాధారమైన-యాధారుణీపతి కప్పుడిట్లనిరి:
‘ఏమున్నయడవిలో నిభపురాధీశ’-భూమికిఁ వేఁగైన భూరజంతువులు
............................................................
అందలిమృగములయదటుగర్వములు-పొంగుగా నవధరింపుము; ధాత్రిఁ గొంత
త్రవ్వి, పాతాళవరాహంబుఁ దెచ్చి-క్రొవ్వునఁ దమకదుపుఁ గూర్తుమన్నట్టు
లట్టులాఁ జెసఁగ మహావరాహములు-మిట్టుపల్లముగాఁగ మేదిని గ్రుచ్చి
యెత్తినబిగువున నించుకతడవు-నెత్తిభారముమాన్చు నిజము శేషునకు
............................................................
ఆఁచేసెదమన్న నడఁగవు మాకు-మాళరమ్ములవాఁడి మానె రమ్మనిన

పాండుభూపతి వేటపై నాసపుట్టి-పాండువచ్చె గసని బోయలఁ బనిచి

.................................................

గొల్లెనకంబాలు గొడుగులుఁ బడగ-లల్లికవల మోపు లమ్ముల బండ్లు

.................................................

పరిచారకులుఁ బోడిపసులు బియ్యములుఁ-బరమళవస్తుసంపదలు నేతేర

.................................................

దారుణ హిమశైల దక్షిణాటవుల-పరఁగ తాప్రౌఢుఁడై వేటలాడుచును

.................................................

గంటవేటయు వేష్ట-గల కోలవేట-వెంటవేటయు సిడువేటయు నాడి,

యొంటివులై క్రొవ్వి మిన్నొరయుజంతువుల-నణిక్రవేసియు మఱి నాటవేసియును,

.................................................

ఉంకించియొగసిన యుగ్రపుమృగము-కొంకులు నఱికియు, గొందిలోనిలిచి

గవిలోన వెడలక గాఱించుమృగము-దవిలి పొగవెట్టించియుఁ దగుల వేసియును"

ఆది. ప. 198-204. పు.

ద్రౌపదీస్వయంవరమండపము రఘువంశమునందలి యిందుమతీపరిణయమండపమును, నైషధమందలి దమయంతీస్వయంవర మండపమును జూచి నిర్మించినదే.

"అటమున్న ద్రుపదుండు నఖిలదిక్కు-లకుఁ బటులీలఁ గల్యాణపత్రికల్ వ్రాసి

క్షత్రకోటికిఁ జెప్పఁ జయ్యన వాగు-యాత్రామహాభేరు లందంద మ్రోయఁ

దమతమగొడుగులుఁ దమతమపడగ-లమిత వైఖరి మొఱయ నాప్రొద్ద కదలి

వచ్చెఁ జోళ్యుండు వజ్రతుల్యుండు-నచ్చిన భుజబలోన్నతిఁ బెచ్చుపెరిగి,

'విలువంతు గుఱ్ఱదుంతు వెలఁగివరించుఁ-జెలి కలే'' యనివచ్చెఁ బాంచాలపురికి

శిశుపాలుఁ డతిరథశ్రేష్ఠులతోడ-దశదిశలను బ్రకాశించి కదలి

తగినకోమలిగ లగ్గెఁ దనశయ్యకనుచు-నగియె చేవారిఁ గాచక వచ్చెనటకు

.................................................

అలివేణిఁ బొందాస నంగాధిరాజు-నలుగడఁ గనికీర్తిగానంబులు చెలఁగ

విజయుఁ దుర్వారలేని వేశ నేఁగెత్తు-గజయాన ననివచ్చెఁ గాంపిల్యపురికి.

.................................................

అటమున్న ద్రుపదరాజాత్మసంభవను-బటుతరకల్యాణభాగ్యయోగ్యతలఁ

గైసేయఁ బనిచినఁ గలికిజవ్వనులు-చేసూటి కోటి మెచ్చినపరిపాటిఁ

జంపక తైలంబు చారుధమ్మిల్ల–సంపద కింపుగా సకియకునంటి

......................—.......................

తిలకంబు బాలికాతిలకంబునుదుట–నలికంబుగాఁ బెట్టి నగవంకురింప

.........................—.........................

మృగనాభి కప్రము మేళనచేసి–మృగనేత్ర చక్కని మెయిదీఁగె నలఁది

......................—...........................

బవిరె లుంగరములుఁ బల్లేరుపువ్వు–లివియాగిగా సొమ్ము లింతికిఁదొడిగి

వాలికయైన నివ్వాళికయెత్తి–బాలికామణికి సౌభాగ్యదర్పణము

చూపిన.................—........................

రాజలోకముచూడ రాజబింబాస్య–రాజాపఁజూపుచు నగ్రజుండనియె :

మలయజగంధి, యీమనుజేశుఁ జూడు–మలవడ ముత్యాలహారముల్ వైచి

పన్నగపతివోలె బాహువిస్ఫూర్తి–నున్నవాఁడితఁడు పాండ్యుఁడు నీరజాక్షి !

కుంతలపతి వీఁడె కుటిలకుంతలుల–చింతాస్పలులఁగాని చేయఁడు విడిది ;

స్వారాజునకు నాత్మ చలియింపుచుండఁ–బారియాత్రాపురిఁ బాలించునితఁడు.

మాళవేశ్వరుఁ జూడు మదిరాయతాక్షి !–బాలార్కనిభహారి ధరియించువాఁడు ;

వీనియౌవనమున విహరింప రంభ–మేనక యూర్వశి మెఱసి కోరుదురు

తరుణి! యీతఁడు పరంతపుఁడనువాఁడు–మరహాటకామినీ మదనమంత్రంబు

వీని శాత్రవగేహ విపినమధ్యమున–నీనినపులులుండు నెంగునుబోక.

ఆది. ప. 378—384 పు.

అతివిస్తరభీతిచే నింతతోఁ జాలించుచుంటినిగాని, లేనిచో నీతఁడుచేసిన సర్వ ప్రబంధసామాన్యములగు నానావిధవర్ణనలకు నెన్నెని యుదాహరణము లీయవచ్చును. ఇంకొకమాట, ముదురునారికేళపాకముసఁబడిన కొన్ని ప్రబంధములలోని వర్ణనలవలె గహనములుగాక, యీకవివర్ణనలు సహజసుకుమారమైన తనద్విపదసరస్వతికనురూపమైన సౌకుమార్యముకలిగి యుండును. ఇది మిక్కిలి ప్రశంసింపఁదగిన విషయము.

సాధారణముగాఁ గవులెల్లరుఁ బూర్వకాలికములగు గ్రంథములను బట్టియే కాక, తమనాఁటి లోకవ్యవహారము ననుసరించియుఁ దమకలవడినభాషనే గ్రంథములలో వాడుదురనుట సహజధర్మము. ఆగ్రంథములందలి ప్రయోగవిశేషములను బరిశీలించి, వానికొకయనుగతికల్పించుకొని, తమకుసమ్మతమగురీతిని వాని సాధుత్వాసాధుత్వములను నిరూపించుట లాక్షణికులపని. మన తెనుఁగులాక్షణికుల ప్రోవలు

పరిశీలింప భిన్నభిన్నములుగాఁ గానవచ్చును. వీరిలో నొక్కరును ప్రాచీనగ్రంథములను సాకల్యముగఁబరిశీలించి లక్షణములను గల్పించినవారు కారు. అది యేయొక్కనికిని సాధ్యమైనపనియును గాదు. అదిగాక దేశములో వివిధప్రాంతములందు భిన్నభిన్న గతులతోఁ దాండవించుచు, నానావిధములగు పరిణామములనొందుచున్న దేశభాషలకు లక్షణమిదియని సూటిగా నేర్పఱచుట మిక్కిలియసాధ్యము. కావుననే యొక కాలమున నొకరుచెప్పినలక్షణము వేఱొకకాలమున నపలక్షణమగుటయు సంభవించుచుండును. దీనినిబట్టియే తెలుఁగులక్షణగ్రంథములాంధ్రభాషాస్వరూపమును సాకల్యముగా నిరూపింపఁజాలవనియు, నసమగ్రములనియు మనమనుకొనుట.

సర్వజ్ఞులును మహర్షులును అనిపించుకొన్న పాణిన్యాదులకే సంపూర్ణ భాషాస్వరూప నిరూపణము దుశ్శకమైయుండ, దేశభాషా లాక్షణికులకీవిషయమునఁ గొఱఁత నారోపింపనేల? వారునిరూపించినసంగతములగునంశములను శిరసావహించి, కొఱవడినభాషావిశేషములను బూర్వగ్రంథములనుండి గ్రహించుటయే మనకర్తవ్యము.

తెలుఁగువ్యాకరణములందుఁ, గానరాని ప్రయోగవిశేషములు మనగ్రంథములందుఁ దండోపతండములుగాఁ గలవు. అట్టివానినిసైతము గ్రహించుట భాషాలక్షణ జిజ్ఞాసువులకావశ్యకము.

ఈద్విపదభారతమున జిజ్ఞాసాచోదకములగు నట్టిప్రయోగవిశేషములు చాలఁ గలవు.

వ్యాకరణముల యడుగుజాడలనుమాత్రమే యాశ్రయింపక, కొంతవఱకుఁ బదప్రయోగమునెడ స్వాతంత్ర్యమునవహించిన యాంధ్రకవులెందఱో ప్రాచీనులుగలరు. అందును సోమనాథుఁడు మొదలగు ద్విపదకవులతిస్వతంత్రులు. ఈతిమ్మయయు ఆజాతికిఁ జెందినవాఁడే. ఈతనిరచనకుఁ బ్రాచీనద్విపదవాఙ్మయమే చాలవఱకు నొరవడియైనది. వ్యాకరణనియమములతోఁబాటు ఇతరద్విపదకావ్యరీతులవలెనే ఛందోవిషయమున సైతము నీతఁడు స్వచ్ఛందుఁడుగా నగపడును. చూడఁజూడ నీద్విపదవాఙ్మయరీతుల త్రోవయే స్వచ్ఛందమని తేలును.

ఉదాహరణార్థ మాప్రయోగవిశేషములలోఁ గొన్నిటిని స్థాలీపులాకన్యాయముగాఁ దిలకింతము.

I. సంధి :—

(1) 'సరస సుభద్రుపచారముల్ సేయ'. 469. పు.

'చక్రిహింసిదియేల చక్రిభిక్షుఁడవు. 198. పు.

'మానవనాథనుమానంబు లేదు'. 100. పు,

ఇందు స్త్రీవాచక తత్సమాకారసంధికి గ్రంథములందుఁ గొంత ప్రచారము లేకపోలేదుగాని, సంబోధనాంతసంధి మిక్కిలివిరళమనఁదగును. 'ఓడులారేటికి'. 'జైనులారెన్నఁడు' (బ. పు. 184. పు.) మొదలగుసంధులు సోమనాథాదులరచన లందుఁ గాననగును.

(2) 'అనియజ్ఞునుఁడు విప్రులనుమతి వడసి'. 395. పు.

'యూథి నేకాదశరుద్రులంశమున'. 113. పు.

అనునీరీతిని లడాగమాకారసంధులు భాషలో విరళములేయైనను, పెద్దనాది మహాకవులకు సమ్మతములే. 'తామరసనేత్రలింట్లు'. మను. చ. 'మాభక్తులొద్ద', 'ఇతరులింట్లు' (బ. పు. 240. 240. 155 పుటలు) మొదలగునవి బసవపురాణాదులలోఁ బెక్కులుగలవు. ఈసంధిని అధర్వణాహోబలులుకూడ సమ్మతించిరి.

(3) 'ఉభయవాదులము గూడుండిన. 41. పు.

'చనుదేరఁ జూచదృశ్యంతి.' 367. పు.

క్త్వార్థకసంధినిఁ గొందఱు సరసించినను, ఆమోదించినలాక్షణికులును బ్రయోగించినకవులును గలరు. 'ఏవేళ నెఱచుండుము'. 31. పు. 'ఊచవోయున్న భావమున'. 76. పు. ఈ మొదలగునవి బసవపురాణాదులలోఁ గలవు.

(4) 'నీయనుగ్రహము' అనుచోఁ ద్రికసంధికార్యమునంటి హ్రస్వద్విత్వములు గావించి 'నియ్యనుగ్రహము' అని ప్రసక్తానమునఁ బ్రయోగించినాఁడు.

'అయ్య వేదవ్యాస, అగమావాస,
నియ్యనుగ్రహములు నిఖిలవేదములు'. 99. పు.

ఇట్టియెడ, 'ఈయనుగ్రహము'—'ఇయ్యనుగ్రహము' ఇత్యాదులందును, 'తీయము'—'తియ్యము' 'పీయము'—'పియ్యము' ఇత్యాదులందును ప్రసిద్ధములగు రూపాంతరములసామ్యము ప్రేరకమైయుండును.

సోమనాథుఁడును,

'అయ్యాయనఁగనేమి యయ్యాయనెడు త-దియ్యవాక్యంబు నజ్జయ్య యడంచి'

బ. పు. 129. పు.

ఇత్యాదులు పెక్కులు ప్రయోగించినాఁడు.

(5) అయ్యున్న :—

..............................ఇంద్రుఁ

డయ్యున్న నింక రెండవయింద్రుఁడైనఁ-జయ్యనఁ ద్రైలోక్యజనులకు......' ద్వి. భా. 18. పు.

అని ప్రాసస్థలమునఁ బ్రయోగించినాఁడు. అయి+ఉన్న, అయి+యున్న, ఇత్వలోపము కలిగినచో 'అయ్యున్న' అను రూపము కాఁగలదు. కాని యిచట 'ఇ' త్వలోపమును లాక్షణికులెవ్వరును విధించినట్లు కాన్పించదు. 'అయ్యున్' (అయి+యుణ్) అనురూపము భారతాదులయందనేకస్థలములఁ బ్రయుక్తమై యున్నది. లాక్షణికులుపలువురు దీనినిఁబ్రతిపదోక్తాన్వయముగా గ్రహించియుండిరే కాని, ఇత్వలోపమును సాధింపకైరి. 'అయ్యున్' 'అయ్యున్న' అను నీరెండును ఇత్వలోపవిషయమున సజాతీయములు. 'అయ్యున్' అనుదానిని సమ్మతించినమనము 'అయ్యున్న' యనుదానిసాధుత్వమును శంకింపఁబనిలేదు. నిదానించినచో నిచటి 'ఇ' త్వలోపమున కొకయుపపత్తియు గోచరించెడిని. 'అయి' అనుదానికి 'ఐ' అనునది రూపాంతరముగదా! 'ఐయున్' 'ఐయున్న' యనురూపము లెల్లరు నంగీకరింపవలసినవే గదా! ఈరెండింటియుచ్చారణమునందును 'అయ్యున్' 'అయ్యున్న' యనురీతిని 'య' కారద్విత్వము శ్రుతిగోచరము కాకతప్పదు. అట్టిశ్రుతినిబట్టియే వ్రాతలందును 'అయ్యున్' 'అయ్యున్న' యని ఇకారలోపరూపములేర్పడియుండును. ఇట్టిప్రయోగములు మఱికొన్నిగ్రంథములందును గలవు:

'అయ్యుండి రప్పు డయ్యసురేశుఁ జూచి-చయ్యన రణమున సైరింపలేక'

రం. నా. రా. 552. పు.

(Andhra University edition.)

'చయ్యన బహువేద శాస్త్రపారీణు-లయ్యున్న నాశిష్యులందఱలోన'

గౌరన : హరిశ్చంద్ర.

(6) సకారాంతశబ్దములను అదంతములగ భావించి సంధిరూపములను గూర్చినాఁడు.

'సిద్ధసాకేత, లక్ష్మీమనోపేత.' 2. పు.

'పరమతపోన్నతిఁ బ్రాభవశక్తి.' 16. పు.

సంస్కృతమున సాంతములుగఁ బ్రసిద్ధములగు కొన్నిశబ్దములకు 'అ' దంతములగు రూపాంతరములుండుట యరుదుగాఁ గలదు. ఆపద్ధతినూఁతగాఁగొని యీతఁడిట్లు ప్రయోగించియుండవచ్చును. ఇట్లే సోమనాథుఁడుగూడఁ బండితారాధ్యచరిత్రలో 'దుర్వాసముఖ్యులు.' 25. పు. అని ప్రయోగించినాఁడు.

II. విసంధి :—

'కొడుకులు లేనట్టి గొడ్రాలిమనువు-అడివిఁగాచిన వెన్నెలైపోవఁగలది.' 232. పు.

'పుత్రులతోఁ గూడి పాండుభూవిభుఁడు-అడవికి వేఁటపై నర్గిఁ బోవుటయు.' 234. పు.

పాదమును వాక్యమును సమాప్తములైనతావున సంధిచేయఁబనిలేదని లాక్షణికులమతము. ప్రాచీనప్రయోగసరణియు నట్లే కాననగును. ఈతఁడు వాక్యపరిసమాప్తినిఁబాటింపక పాదావసానమునఁ బై రెండుతావులందును సంధిమానినాఁడు. ఇంతియగాక పాదమధ్యమునసైతము విసంధిగా విడిచివైచినతావులును గలవు :

'ఒకమహాగ్రాహంబు ఒడిసిపట్టుటయు'. 282. పు. (గ్రాహముకర్త)

ఇట్టివిసంధులు ద్విపదకావ్యములందుఁ బెక్కుచోట్లఁ జూపట్టును.

'వసుధేశసుతుఁడు-అచ్చుగా నెదురేఁగి'. నవనా. చ. 44. పు.

'భూకాంతుఁడిగె పోలుఁ బోలదు-అనక'. నవనా. చ. 64. పు.

'స్వాహైక-అసురాణీయాహ్వాయ', పండి. చ. 15. పు.

'ఖాండిక్య-అసురాణీయ', పండి. చ.

పైసోమనాథప్రయోగములందువలె నిందును సిద్ధసమాసమధ్యమునసైతము సంధిలేని తావులుగలవు.

'ముద్గరచక్ర-అసితూల'. 290. పు.

'విదురాది అప్పులతోడ'. 196. పు.

'శశిరవి అగ్నిలోచనుఁడ'. 46. పు.

iii. రూపవిశేషములు:—

(1) 'దొండపంటికి సిగ్గు దొఱంగఁజేయుచును'. 148. పు.

పండుశబ్దమునకు జెంపకిభక్తికశబ్దము విరళము. కాని మఱికొన్ని గ్రంథము లందును ఈపదమున కిట్టిప్రయోగము గూపట్టుచున్నది.

'ఆసాసల నణుచాచెదఁ దయుండనిపంటికి'. పాం. రం. మా. 5. 230.

'అంచేలోపలి నిమ్మపంటివలె'. సారం. చ. 2. 113.

(2) కల్హారము 'అర్హము' వీనిలోనిసంయుక్తవర్ణములను విడఁదీసి, 'కలహారము' 'అరహము' అనురీతి నీతఁడు ప్రయోగించినాఁడు:

'కలహారదళనేత్ర కనకకంటిచూడ్కి—'
యొలనిముట్టినచిత్తము త్తలంపకఁ. 263. పు.

'ధరణీశ్వరులకు గాంధర్వవివాహ
మరహంబు ... ... ...' 463. పు.

ఇట్టిసంయోగశిథిలత 'మర్యాద'—'మరియాద' మున్నగు పెక్కుతావులఁ గలవు. వీనిలో 'కల్హార' శబ్దము సిద్ధసమాస మధ్యగతమగుటవలనను, ఇట్టిప్రాసములు మఱికొన్ని యాతనిరచనములఁజూపట్టుటవలనను, 'కల్హార' అనుసంయుక్తరూపమే ముద్రణమునఁ జేర్పఁబడినది. రూపుమాయకుండ మూలపాఠ మాపుటయడుగునఁ జూపఁబడినది.

(3) వ్రయము:—'వ్రయముగాకుండ నేర్పుతోఁ బాతిదాఁచి'. 75. పు.

వ్యయమనుటకుమాఱుగా 'వ్రయము' అనుపదము లోకవ్యవహారమున మిక్కిలిరూఢమై యున్నది. పైనఁజూపినయతిస్థానమున నీతఁడు రేఫసంయుక్తముగ దీనినిఁ ప్రయోగించినాఁడు. 'పవ' లకు అభేదవర్గయతిని ప్రయోగించెనని తలంచుటకు వీలున్నను, మఱికొన్ని ప్రామాణికప్రయోగములఁగనఁబడుచుండుటచే దీనిని రేఫయుక్తముగనే గ్రహించెననుకొనుట యుచితముగాఁ దోఁచెడిని. బ్రౌను తననిఘంటువులో రేఫయుక్తముగను గ్రహించినాఁడు. తిక్కనయు శాంతిపర్వములో ఈపదమును యతిస్థానమునఁ బ్రయోగించియున్నాఁడు:

'వ్రయమగు తెలుఁగఁడు వితత జ—రా వ్యాధులచేన్'. శాం. ప. 4. 345. ఇట 'వ్యయమగు తెలుఁగఁడు వితత జ—రాది వ్యథలన్.' అనుపాఠాంతరము కలదు గాని, ఏదికవిప్రయుక్తమో పరిశీలింపవలసియున్నది. భాస్కరరామాయణములోఁ గూడ 'విప్రా, సకలధనంబులు వ్రయమైపోయె.' అని గద్యలోఁగలదు.

(4) చనుమానము :—

'అనుమానమటుమాని యాలేమఁ గదిసి
చనుమానమున వేడ్క సలుపలేనైతి.' 354. పు.

'చనవు' అనునర్థమున ఈపదము వ్యవహారరూఢము. శబ్దార్థచంద్రికలో నీపదము గ్రహింపఁబడినది. కవులుకొందఱు వాడియున్నారు.

'చనుమా చనుమానముతోడ నావుడున్' సారం. చ. 2. 62,

'ఏ-మానవుఁడైనఁగాని చనుమానమునన్ బహుమానమందు.' నానా. రా. సం.

శ్రీములుగు పాపయారాధ్యుల దేవీభాగవతమునఁగూడ నిట్టిప్రయోగము గలదు.

(5) ఆయివారము :—ఇది యాయావరశబ్దభవముగాను, 'య' కారఘటితము గాను శబ్దరత్నాకరాదులలోఁ గానసగును. కాని, 'యాయివారము' 'ఆయి వారము' అని 'యి' వర్ణఘటితముగా వ్యవహారరూఢి గలదు. దానిసిబట్టి యీతఁడు,

'ఆయివారముల హీనాశయవృత్తి' 75. పు.

అనియే ప్రయోగించి యుండును.

(6) తరువాయి :—వ్యవహారములోనున్న 'సంప్రదాయము', 'సాటి' యను నర్థములలో నితఁ డీపదమును బ్రయోగించినాఁడు :

'తనకు భరద్వాజుతరువాయి వచ్చి' 263. పు.

(7) సంధాయి, ప్రదాయి :—

''నిర్వాణసంధాయి నిఖిలప్రదాయి
గౌరి మాహేశ్వరి...........'' 227. పు.

'అరుదుగాఁ బుత్త్రార్థియై యొకగ్రుడ్డు
తెరలుచు నవియించెఁ దెలిసి నేరమిని' 19. పు.

ఇట్లీతఁడు స్త్రీవాచకవిశేషణరూపములను బుంలింగములుగాఁ బ్రయోగించి యున్నాఁడు. ఇట్టివి సోమనాథుని రచనయందునుగలవు:

'కొడుకులు లేమికిఁ గడుదుఃఖియగుచు.' బ. పు. 13. పు.

'వనిత యపూర్వలాంఛనధారి గాఁగ.' ,, 16. పు.

(8) పాండులు:—

'పాఱఁ బాండులకుఁ దోడువోయెడు శల్యుఁ
గురుపతి తా నెట్లు కొలిపించుకొనియె.' 7. పు.

ఇందు 'పాండులు' అనుపదమునకు 'రఘూణామన్వయంవక్ష్యే' ఈమొదలగు కాళిదాసాది ప్రయోగములందు సంస్కృతశాబ్దికులు త్రొక్కిన మార్గమున 'పాండుపుత్త్రులు' అనునర్థమును లాక్షణికముగ గ్రహింపఁదగును.

(9) బ్రాహ్మలు:—

'ప్రకటించి యసిచూపి బ్రాహ్మలచేత
నొకకాసు మొదలుగా నొల్లరు నృపులు.' 33. పు.

బ్రాహ్మణులు అనునర్థమున 'బ్రాహ్మలు' అనురూపము సార్వత్రికవ్యవహారరూఢమై యున్నది. చతుర్ముఖవాచక 'బ్రహ్మన్' శబ్దమునకు సంబంధార్థమునఁగాని, విప్రవాచకమగు 'బ్రహ్మన్' శబ్దమునకు స్వార్థమునఁగాని 'అణ్' ప్రత్యయము చేసినయెడల 'బ్రాహ్మ' అను ప్రాతిపదికము (బ్రాహ్మణపర్యాయముగా) సిద్ధింపఁగలదు. కాని దీనితత్సమరూపములగు 'బ్రాహ్మఁడు' 'బ్రాహ్మలు' అనువానిలో ఉత్వము రాకుండుటకు వ్యాకరణరీతినే మార్గముచింత్యము. 'రాయఁడు'—'రాయలు' ఇత్యాదులందలి ఉత్వాభావమే పైదానికాధారమనుకొనుట స్థితగతిచింతనమగునేమో!

(10) సర్పసేరు, కల్యాణపాట:—

'పేరురంబున సర్పపేరు నటింప.' 46. పు.

'భాసిల్లఁ గల్యాణపాట పాడుచును.' 48. పు.

కేవలసంస్కృతపదములకు దెలుగుశబ్దములతో నేర్చినసమాసములను లాక్షణికులు సమ్మతింపరు గాని, 'ప్రాణగొడ్డము' 'జీవగఱ్ఱ' ఇత్యాదులగుప్రామాణికప్రయోగములను భంగ్యంతరముగా నంగీకరించినదే యున్నారు. ఇట్టిసమాసములుకూర్చిన కవులును బెక్కురు గలరు:

'ముల్లోకవంద్య', 'నిత్యనేమము' బ. పు. 26. 44. పుటలు.

'క్రింద మహామంచిదనుచు గణుతించిరొగిన్.' భాస్క. రా. అయో. కా. 17. పు. 12. ప.

పైని జూపఁబడినవేగాక మఱికొన్నివిలక్షణసమాసములను గూర్చినాఁడీ తిమ్మయ:

'అనురాగదయుఁడు.' 121. పు. (అనురాగము, దయ గలవాఁడు)

'మానసాయకువేఁటకాఁడు.' 241. పు. (మన్మథుఁడనెడి వేఁటకాఁడు)

'వజ్రనూటిబాణములు.' (వజ్రమువలె వాడియగు బాణములు)

(11) తమసామరారి :—

'తమసామరారి యుద్ధము సేయఁ దివిటి
వాడిముల్కులతోడ వరబాణసమితి' 59, పు.

పైసమాసములోని తమశ్శబ్దమును అంధతమసశబ్దసామ్యమునుబట్టి బుద్ధిపూర్వకముగానే 'తమసామరారి' (చీఁకటియనురాక్షసుఁడు) అని కవి ప్రయోగించి యుండునేమోయని దానిని సవరింప సాహసింపనైతిని. మార్పఁదలఁచినచో 'అంధతమసామరారి' అని సులువుగా మార్పవచ్చును.

పైనిచూపినవిగాక— 'ఎల్లెరువు', 'కెంజెర', 334. పు. 'ఎల్లగాఁడు' 593. పు. మొదలగుపదములు కోశములకెక్కనివి యుండఁగలవు. అట్టివి ప్రకరణమునుబట్టి అర్థవంతములగుటచేతను, మాండలికములై యుండునని తోఁచుటవలనను అట్లేయుంచితిని.

(iv) ఛందస్సు :—

(1) గణములు :—

ద్విపదలలో లాక్షణికప్రోక్తములైన సూర్యేంద్రగణములస్వరూపముపైనే ప్రధానదృష్టి నిలుపక, తాళగతికిని గానఫణితికిని అనుగుణ్యముసంపాదించుటయే

ముఖ్యముగ నెంచి తిమ్మయ రచనము సాగించినాఁడు. ఈరచనమునఁ గొన్నియింద్ర గణముల తావులందు మాత్రాసంఖ్య సరిపడు చంద్రగణములు కాననగును.

'ధూధకేంద్రము బుడబుడరవముతోడ'. 43. పు.

'తెల్లచంద్రిక నెగడు దేహంబుతోడ'. 57. పు.

'వినతకొడుకని కాద్రవేయులు గరుడు.' 68. పు.

ఇట్లు తాళగతికిఁ గానశైలికిఁ ననుగుణముగా రచించుటలోఁ గొన్నిపట్ల హ్రస్వములను దీర్ఘము చేసి శబ్దస్వరూపము మార్చినాఁడు:

'అజుఁడుంటఁ దనరు సత్యాలోకమునకు.' 55. పు. (Foot note)

"నకులసహాదేవ నామముల్ వారు." 246. పు.

'గౌతమాంగీరస కశ్యపనీల.' 45. పు.

శబ్దరత్నాకరాది కోశములలోఁ గొన్నిట 'అంగీరస' పదము 'ఈ' కారవంతముగానున్నది.

గణములతబ్బిబ్బును గణింపక తాళగతినే ప్రధానముగ నెంచి, యిట్లు ఛందస్స్వాతంత్ర్యము చూపుట ప్రాచీనులగు మఱికొండఱు ద్విపదకవులందును గలదు.

'దాపటనన్నంబు తాఁగుడిచి యంత.' నవనా. చ. 29. పు.

'మానసిజుదేవికా మధ్యమొక నాఁక.' ,, 55. పు.

మఱియొకచో, 'నెలఁచికృష్ణచతుర్దశినాఁటి రాత్రి.' 313. పు. అని యొక పాదము గణభంగముతోఁ గలదు. అనయుఁ బ్రతిని సవరించి 'కృష్ణాచతుర్దశినాఁటి రాత్రి.' అని దీర్ఘయుక్తముగాఁ బ్రయోగించియుండునేమో!

(2) యతివిశేషములు:

(1) కొందఱు ప్రాచీనద్విపదకవులవలె నితఁడును ప్రాసయతి ప్రాయికముగా వాడియున్నాఁడు.

'అనయంబు శైవదూషణ మాని.' 34. పు.

'అని యింద్రుఁడుర్వికేఁగినను.....' 37. పు.

'మిత్రావరుణ వార దాత్రి సౌవర్ణ.' 45. పు.

సోమనాథుఁడీయతిని ప్రయోగించినాఁడు. గౌరన నవనాథచరిత్రలోఁగూడఁ గలదు:

'విరులరేకులను బంజారుకెంద్రుకలును.' నవ. నా. చ. 36. పు.
'సన్న పుఁగటిమీదఁ జెన్నొందువాని.' ,, 42. పు.

(2) అఖండయతులను బెక్కురీతుల నీతఁడు వాడియున్నాఁడు:

'నాఁడుదర్భలునాక నాసర్పములకు.' 90. పు.
'నీకాంతనయ్యెద నెలమిఁగైకొనుము.' 130. పు.
'రువ్వనవచ్చితి రుత్తమోత్తములు.' 256. పు.

మఱియు నీతఁడు కొన్నియతిస్థానములందు భ్రమప్రమాదములకు లోనైనట్లును గాననగును:—

'పయ్యెద – పయ్యాద' ఇత్యాదులందలి ద్వైరూప్యమును బట్టియు, నుచ్చారణ సామ్యమునుబట్టియు 'అయ్యెడ' అనుదానిని 'అయ్యాడ' గా భావించి – 'అల్లియ దునిమి యయ్యెడ నొక్కకోల.' 215. పు. యని ప్రయోగించినాఁడు. ఇట్లే యుచ్చారణ సాదృశ్యమునుబట్టి 'చెదరక' యనుదానిని 'చదరక' యనియు, 'జటలు' అను దానిని 'జెటలు' అనియు గ్రహించి,

'చెదరక చంచలించక నిల్చుఁగాన.' 215.
'జటలెల్లఁజెలఁగిః సింగమోయనఁగ.' 272. పు.

అని యతులుకూర్చియున్నాఁడు. ఈరీతినే గౌరనయు 'శాచ్ఛ్యమును' 'శాచ్ఛ్యెము' గఁ దలఁచి, 'చలికొండకూఁతు శాచ్ఛ్యెములేని స్నేను.' (నవనా. చ) అని ప్రయోగించినాఁడు.

సాధారణముగఁ బదాదినున్న ఉ ఊ ఒ ఓ లు వకారాదులుగ శ్రుతిగోచరము లగుట సహజము. ఆసాదృశ్యముచే భ్రాంతి

'ఓజమై జరయుఁ జావును దెవుల్ లేని.' 21. పు.
'ఉడిపికోఁబూని పోవుచునుండి.' 75. పు.

అని యతిస్థానములు కూర్చినాఁడు. ఇట్లె గౌరనయు 'వొక్కని' 'వుండఁగ' అనిభ్రమపడి

'ఒక్కని డించిపోవుటయు ఛీత్లి.' నవనా.  చ. 92. పు.

ఉండంగఁదగినతావులను విశ్వాస్య.'  177. పు.

అని ప్రయోగించినాఁడు. మఱియు, ఎవఁడు ఎప్పుడు ఇత్యాదులందుఁబదాదిని 'య' కారము వినఁబడుచుండుటయు, అట్టియుచ్చారణస్వభావమునుబట్టియే కొందఱు లాక్షణికులు పదాది 'య' కారమంగీకరించుటయు సంభవించినది. తిమ్మయ 'ఎనసిన' అనుదానిని 'యనసిన' యనిభావించి 'ఎనసిన వేడ్కతో సమ్మునీశ్వరులు.' 99. పు. అని కూర్చియున్నాఁడు. ఇవిగాక యీతఁడు ప్రమాదవశమున యతిస్థానములు తప్పించిన తావులును గలవు:

'పురుకుత్స సగర పురూరవులాది.'  198. పు.

'చుమచుమ నైననెత్తురు చుక్కబొట్లు.'  199. పు.

'ఎన్న నాతర మేడ నీతర మేడ.'  268.

(2) ప్రాసవిశేషములు:—ఒకప్రాసస్థానమున రెండుమూఁడువ్యంజనములున్నచోటఁ దక్కినప్రాసములందు వానినన్నిటిని ఆవర్తింపఁబనిలేదనియు, వానిలో నేయొక వ్యంజనమైనను సరూపమై సరిపడినఁ జాలుననియుఁ బ్రాచీనద్విపదకవులు తలంచినట్లగపడును. ఆమతమును ననుసరించిన కొన్నిప్రయోగము లీతనివి గలవు:

'శూద్రుఁడవై పుట్టు—నుద్వృత్తికోపుఁడై.'  190. పు.

'నేర్చితివుతనిచే—రాచచిత్తంబులు.'  256. పు.

'హర్షాద్భుతాక్రాంతులై—శరగురు.'  260. పు.

'చంచరీకములు—నిల్చి...........'

పైతావులలోఁ గొన్నిట 'ఉద్రిక్త', 'నేచితిమి' ఇత్యాదిగా అల్పములగు మార్పులు ప్రాసస్థానమున నెట్టివిలక్షణతయులేకుండఁ గుదురుచున్నను, మూలపాఠములనుబట్టియు, నిట్టిప్రాసలు ప్రాచీను లనుమోదించుటఁబట్టియు వీనిసవరింపనొల్లక యట్లే విడిచితిని. క్రిందిప్రయోగములఁ దిలకింపుఁడు:—

సర్వజ్ఞ భక్తి విరహితు – డెవ్వఁడు నుత్కృష్టజాతుఁ డేటికిఁగొఱయే.' శివతత్త్వసారము.

'అక్షణంబునఁ బంచభక్ష్యముల్ గుడిపి.'  బ. పు.

'కర్జంబునావుడు బిజ్జలుండంత.'  బ. పు.

ఈతఁడు 'షన' ప్రాసమును సమ్మతించినాఁడు :

'నాపుత్రికుదయించు నందనునంద
యువరాజభారంబు నునుపనోపుదుకె'' 173. పు.

కొన్ని తావులఁ బ్రాసపూర్వాక్షరగురుత్వలఘుత్వతౌల్యమును ఈతఁడు పాటించి నట్లగపడదు :

'అదర విప్రద్వేష మాచరించితిరో!
వేడినయర్థుల వృథగఁ బంపితిరో!'' 31, పు.
'తా డెక్కమానినిఁ దగఁ గ్రిందవట్టి
యొడగాఁగఁ ద్రోయంగ నెవ్వరితరము.' 121. పు.

* * * * * * * *

దక్షిణతీర్థములను సేవింపఁబోవునాంధ్రులు దర్శింపవలసినముఖ్యతీర్థము తంజావూరుసరస్వతీమహలులోని పుస్తకభాండాగారము. ఆయాలయమునునిర్మించిన ఆంధ్రనాయకరాజులు అందుప్రతిష్ఠచేసిన దేవి ఆంధ్రసరస్వతి. కాలక్రమమున ఆదేవికినిరుపార్శ్వముల నితరభాషామూర్తులును నెలకొల్పఁబడినవి. అయినను మూలపీఠమున దర్శనమిచ్చు దేవి ఆంధ్రసరస్వతియే. ఆతీర్థసంసేవనము ఆంధ్రులెల్లరును, విశేషించి సాహిత్యోపాసకులును ముఖ్యముగా ఆచరింపఁదగినది.

చోళమండలమును 140 సంవత్సరములు అవిచ్ఛిన్నముగాఁ బరిపాలించిన యాంధ్రనాయకరాజవంశములో మూఁడవపురుషుఁడును అపరకృష్ణరాయలునయిన రఘునాథరాయలే యీభాండాగారమును దొలుత నెలకొల్పినవాఁడని పెక్కుమంది యభిప్రాయము. ఆతని తాతతండ్రులైన చెవ్వప్పనాయకుఁడును, అచ్యుతనాయకుఁడును ఆతనివంటి కవితారసికులును గవిపోషకులును గారు. లక్ష్మీపూజతోఁబాటు సరస్వతీపూజయుఁ బ్రారంభించిన మహారాజు రఘునాథరాయలే. కావున భాండాగారనిర్మాత ఆయనయే కావచ్చు. రఘునాథరాయనిపుత్త్రుఁడు విజయరాఘవుఁడు రాజ్యపాలనాదులయందెట్లున్నను సంగీతసాహిత్యోల్లాసమునఁ దండ్రివంటివాఁడే. ఆతనికాలమున ఆభాండారము మఱింతవృద్ధియైనది. 1673 వ సంవత్సరములో ఆరాజులపరిపాలనయంతమైనది. 1675 లో మహారాష్ట్రులు ఆకోటను స్వాధీనమొనర్చుకొనిరి. వారు అన్యరాష్ట్రీయులేయైనను పరజాతీయులుకారు గనుక ఆభాండాగారమునెడ పూర్వరాజులభక్తిగౌరవములనే చూపి, యథాశక్తి పోషించుటకును బెంపొందించుట

కను బాటుపడిరి. వారిలో రెండవమహారాష్ట్రప్రభువైన శాహాజీయు (1684–1712), నాల్గవవాఁడైన తుక్కోజీయు (1729–1735), తరువాత ప్రతాపసింహుఁడును (1740-1764), అట్లె రెండవశరభోజియు (1800-1832), భాండాగారపోషణకర్తలలో ముఖ్యులు. నాయకరాజులవలెనే వీరును స్వయముగాఁ గొన్ని తెనుఁగుకావ్యములను వ్రాయుటయేకాక, తమతమయాస్థానకవులచే వ్రాయించి సత్కరించినసాహిత్యసజ్ఞులు. మఱియు, వారియడుగుజాడలనే నడచి నానాదేశములనుండి నానాభాషలలోని ప్రశస్త గ్రంథములకుఁ బ్రతులువ్రాయించి తెప్పించి గ్రంథాలయమును విస్తరింపఁజేసిన యుదార శీలురు. ఆసంప్రదాయములో శాహజీచే వ్రాయింపఁబడినదే యిచ్చట మాకు లభించిన యీద్విపదభారతప్రతి.

ఈగ్రంథాలయప్రాశస్త్యమునుగూర్చి నేనొకవ్యాసము పత్రికలలో వ్రాయుటయే కాక, ఆంధ్రవిశ్వవిద్యాలయమునకుఁ బ్రవేశించిననంతనే నేను, సర్. రాధాకృష్ణన్ గారికి మనవిచేయఁగా, వారాగ్రంథసంపుటికి కేటలాగు తయారుచేయించి ప్రకటిం పించిరి. తరువాత సర్. డాక్టరు. కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆగ్రంథసముదాయ ములో అముద్రితములైన, పదములు, ద్విపదలు, కీర్తనలు, యక్షగానములు, వచనములు మొదలగు నానావిధగ్రంథజాతులకుఁ బ్రతులువ్రాయించి తెప్పించి ప్రకటింపఁబూనుకొనిరి. ఆమహాకార్యప్రారంభమే యీద్విపదభారతప్రచురణము. భారతకథయెడను అంతరిక్షప్రయోగమునెడను శ్రీరెడ్డిగారికిఁగల భక్తితాత్పర్యము లాంధ్రులెల్లరెఱిఁగినదే. దానింబట్టియే మొదటగ్రంథముగా వీరు భారతమును వెల్వరింపఁబూనిరి. ఈకార్యము తుదముట్టసాగించుటలోను వారి కెంతో యుత్సాహము గలదు. దైవానుకూల్యముకలిమి నదిసఫలమగుఁగాక యని, నేనును యథాశక్తి నావంతుభారము నిర్వహింపవలెనని యుఁ గోరుచున్నాను.

ఆంధ్రసహృదయులు నేను మనవిచేయు నొకసంగతిని జిత్తగించెదరుగాక. ఈభారతమును కవిత్రయభారతముతోఁ బోల్చిచూచి యిందు 'అవిలేవివిలేవ'ని యీసడింపకుందురుగాక. దానిస్వరూపమువేఱు — దీనిస్వరూపమువేఱు; దాని ప్రయోజనమొకటి — దీనిప్రయోజనమింకొకటి; అదిపుట్టినదొకజాతిపాఠకలోకము నకు — ఇదిపుట్టినదియింకొకజాతివారికి. కావున నొకజాతివాఙ్మయమునకుఁజెందిన యీగ్రంథమును వేఱొకజాతిదైన కవిత్రయభారతముతోఁ బోల్పయత్నింపక, దీని

గుణమును బట్టియే దీని నాదరింపఁజూచుసరసులకు, ఇదిమెచ్చుగోల్పునేగాని నిరసన భాజనముగాదు.

ఈతిమ్మయవంటివారే భారతభాగవతాదులను బాటలుగా ఆటలుగాఁ బదములుగా శతకములుగా వెలయించి, వానిపరమార్థమును సంఘమున నెవరికేఁదగినట్టు వారికిఁ బంచిపెట్టిన నిష్కామయోగులు. ఆరచనలన్నియుఁ బామరములనియు నప్రౌఢములనియు దోషభూయిష్ఠములనియు, నిప్పుడువానిసంస్మరణమున్సైతము మఱచిపోయితిమి కావుననే మనవాఙ్మయశరీరమున నొకపార్శ్వము పక్షవాతపీడితమ్మై చచ్చువడినది. దానినిఁ బునరుజ్జీవింపఁజేయుట మనకు మానరానికర్తవ్యము.

ఇదియొకప్పుడు పేరువడినగ్రంథమే యనియు, దీనిప్రతులు ఆంధ్రదేశమెల్లెడలఁ బ్రాకినవనియుఁ జెప్పుటకు సందియములేదు. కానిచో విరాటపర్వపుఁబ్రతి యొకటి తంజావూరిలో, నింకొకటి నైజామురాష్ట్రములో నెట్లులభింపఁగలవు! కావ్యజీవమునకు వ్యాప్తియేకదా పరమప్రమాణము! ఇది యాంధ్రదేశమెల్లెడలను సంచరించుచు సజీవమైయున్నది. కవిత్రయభారతముముందుఁ దలయెత్తుకొని యిది నిల్చియుండుటలోఁగలవిశేషమేమో సహృదయులే యూహింతురుగాక.

ప్రాచీనతాళపత్రగ్రంథములను సంస్కరించి ముద్రింపఁబూనుకొనువారికిఁ గావలసినసదుపాయములలో మొదటిది ప్రత్యంతరలబ్ధి. వివిధప్రతులసాహాయ్యమున్నచో వానియందలిపాఠాంతరములఁ బరిశీలించి, "ఏది సాధువు—ఏది యసాధువు, ఏది కవిది—ఏది కాదు" అనువిషయములను నిర్ణయించుకొని, గ్రంథమునంతయుఁ గవిహృదయానుసారముగా నొకసూత్రమునకుఁ దెచ్చుటకు వీలగును. ఆసాయములేని నాఁడు సంపాదకునకుఁబడుక్లేశము అనేకమేయగును. ఈద్విపదభాగసంస్కరణమున నాబుద్ధికిట్టిశ్రమమే గలిగినది.

ఒక్కతంజావూరిలోఁదప్ప నీయాదిసభాపర్వములకు వేఱొకప్రతి యెచ్చటను దొరకలేదు. దానికిఁదోడు ఉన్నయొక్కప్రతియు వివిధలేఖనప్రమాదములతో నిండియున్నది. అందుచే ననేకపదములస్వరూపము, వాక్యములయన్వయముఁ దాఱుమాఱైయున్నది. వానిని సాధ్యమైనంతవఱకు సుబోధములుగను అన్వితములుగను జేసితిని. ఒక్కొక్కచోట ఆలేఖనప్రమాదము అగమ్యగోచరమైనప్పుడు విడదీయరాని గ్రంథులవలెఁ గొన్నిపదములు, వాక్యములు మిగిలినవి. అట్టివానిని సవరించుట నేను

సొంతకవిత్వము చెప్పుట. కవియెడ నట్టియపచారము చేయలేక పాఠకలోకమో, యేనాఁటికేని ప్రత్యంతరమో నిర్ణయింపవచ్చునని వానినట్లే విడిచితిని.

ఇవిగాక, లక్షణగ్రంథానుసారముగా సవరింపఁబూనినచో సంస్కరింపఁదగిన పదప్రయోగములెన్నియో కలవు. అవన్నియు అపశబ్దములుగానే పండితులు భావింపవచ్చును. కాని, ఈద్విపదకవులభాష సర్వధా లక్షణగ్రంథవిధేయము కాకుండుటచేతఁ గవిసమ్మతములైన ఆయారూపములను నేనుబొడవడఁగింపసాహసింపక యథాతథముగా విడిచితిని.

ఒక్కొక్కచో మూలపదమునకు నేదోయొకయర్థమున్నను, ప్రకరణమునుబట్టి యది కవిప్రయుక్తమైయుండదని తోఁచియు, స్వారస్యమపేక్షించియు వేఱొకపదమును గ్రంథమునఁ జేర్చి, మూలపదమును ఫుట్‌నోట్సులోఁ జూపితిని. నాసవరణకన్న మూల పదమే బాగున్నదనుకొనువారు దానినే గ్రహింపవచ్చును.

కొండొకచో, అక్కడక్కడ నేను చూపనిసవరణలు గూడ కనుపించవచ్చును. అది సహజమే. అచ్చుపూర్తియైనతరువాత మరలఁ జూచుటలో నాయూహకే కొన్ని తట్టినవి. చూచినకొలఁది అట్లు తోఁచుచునే యుండును! ప్రత్యంతరములభించునంతకు ఈవికల్పములకు విరతిచేకూరదు.

అనన్వితమును, అపహాస్యమునగుమూలపాఠమును సవరించుటలోఁ గొన్నిచోట్ల రెండుమూఁడుమంచిపాఠములు మొదట నూహించియుంటిని. అందొకటి గ్రంథమునఁ గూర్పఁబడినది. తక్కినవి ఫుట్‌నోట్సులో, అసలుమూలపాఠముండఁదగినతావునఁ బ్రమాదవశమునఁ బడినవి. ఈతబ్బిబ్బులో అసలుమూలపాఠము ఫుట్‌నోట్సులోఁ జేరనేలేదు. అట్టిపాఠములు సహృదయులకు స్ఫురింపకపోదని నమ్మితిని.

మూలమునందు దూరాన్వితములగుచోట్ల నత్యల్పసంస్కారముతో నుచిత పదములనుసరిపెట్టుటలో, అక్కడక్కడ, కొన్నిపాదములలో యతిపోయినది. ఇది ప్రమాదముగాదు; బుద్ధిపూర్వకము. యతిభంగ[illegible]ప్రాయము గనుక.

ప్రూఫులు నేనుజూడకపోవుట పొరపాటైనది. అక్షరవ్యత్యాసములు, అనవసరప్రశ్నార్థకచిహ్నములు, అర్థములేనిఆశ్చర్యార్థకచిహ్నములు, అక్కఱలేని అర్ధానుస్వారములు మొదలగు అనుకొననియచ్చుతప్పులక్కడక్కడ దొరలినవి. వానిని జాలవఱకు శుద్ధపత్రమున సవరించితిని. అందుఁ జేరనివియు మఱికొన్ని యుండవచ్చును.

పాఠకులు మన్నింతురుగాక. ఈగ్రంథమునకు రెండవసారియచ్చుపడుభాగ్యము పట్టునేని యాలోపములన్నియు నందు సవరింపఁబడును.

ఈసంపుటములోని బాలసరస్వతీశ్వరుని సభాపర్వమందలిరచన కేవలబాలకవిత్వమువలె నున్నది. గ్రంథసంపూర్ణతకు వెలితిలేకుండుటకై యీసభాపర్వము ప్రకటింపకతప్పినదికాదు. పైఁజూపినగుణవిశేషములన్నియు తిమ్మయకవిత్వమునకు సంబంధించినవేకాని యీతనిరచనలోనివి గావు.

తంజావూరినుండి యీప్రతి వ్రాసితెచ్చుటకై ఆంధ్రవిశ్వవిద్యాలయముచే నియుక్తులైనవారు శ్రీ. కొమ్మసమంచి జోగయ్యశర్మగారును, శ్రీ. టి. రామచంద్రాచారిగారును. ప్రతివ్రాయుటలో వారుచూపినశ్రద్ధకు నేనెంతో సంతోషించితిని. ఊరక జీతముకొఱకే పనిచేయువారట్టిశ్రద్ధ చూపలేరు.

ఈయిద్దరిలో జోగయ్యశర్మగారు ఇంచుమించు నేఁటివఱకు నాకు చేఁదోడు వాఁదోడుగా నుండి, యీకార్యనిర్వహణములో నాతోసమానముగు నభినివేశమునే చూపిరి. ఈయనుచరునికతమునే దుస్సహమైనశ్రమ కొంతసహ్యమనిపించినది.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు,
6 - 2 - 1943.

పింగళి లక్ష్మీకాంతం.

# ఉపోద్ఘాతమునకు తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 5 | రణజాల | గుణజాల |
| 17 | 3 | సంచర్రించును | సంచరించుచు |
| 17 | 27 | నేర్పాటు | వేర్పాటు |
| 19 | 1 | ~~పల్లిచాలు~~ | ~~పల్లిచాలు~~ |
| 23 | 16 | తాంలెడ్బి | తాంల్బెడి |
| 24 | 22 | పద్మా | పద్మ |
| 25 | 23 | గోయి | దోయి |
| 28 | 16 | యూర్ద్వసి | యూర్ద్వగే |
| 32 | 1 | అనంతముంగ | అనంతములుగ |
| 36 | 13 | నివిటి | నివిని |
| ,, | 25 | లాక్షణికి | లాక్షణిక |
| 42 | 19 | సూత్రముకు | సూత్రమునకు |
| 43 | 10 | పుటక | స్ఫుటక |

# విషయసూచిక



## ఆదిపర్వము — ప్రథమాశ్వాసము



## ఆదిపర్వము — ద్వితీయాశ్వాసము

## ఆదిపర్వము – తృతీయాశ్వాసము



## ఆదిపర్వము – చతుర్థాశ్వాసము

## ఆదిపర్వము — పంచమాశ్వాసము

## ఆదిపర్వము — షష్ఠాశ్వాసము



## ఆదిపర్వము — సప్తమాశ్వాసము

## సభాపర్వము — ద్వితీయాశ్వాసము

# ప్రథమాశ్వాసము



## కృత్యవతరణిక



శ్రీరామ, రఘురామ, సీతాభిరామ,
ధారుణీపతిరామ, దశరథరామ,
సౌమిత్రిసహచార, జగదేకవీర,
శ్యామనిర్మలగాత్ర, సత్యచారిత్ర,
కౌశికయాగరక్షాపుణ్యయోగ,
కౌశికకోదండ ఖండనోద్దండ,
జానకీకల్యాణ, ధర్మధురీణ,
మానిభార్గవకోప మథనప్రతాప,
పాలితలక్ష్మణ భరతశత్రుఘ్న,
లాలిత [1] గురువాక్య, [2] లక్ష్మణాలోక్య,
గుహానుతవైమన్య, గుహానామనుమన్య,
విహితభరద్వాజ విపులవాక్పూజ,
చిత్రకూటవిహార, చిరకీర్తిహార,
పాత్రనుతాద్వంద్వ పాదుకాద్వంద్వ,
ఖచితపావన దండకాననభవన,
రచితాపరాధ విరాధనిరోధ,
శరభంగమునిసంగ, శరభంగభంగ,
శరభంగసంస్థాన, జాహ్నవీస్నాన,
కలశభవన్యస్త, కార్ముకహస్త,
కలుషిత శూర్పణఖా [3] ముఖదర్ప,

---

1. గుణ. 2. లక్ష్మణశోక్య. 3. ముఖ-(మూ)

ఖరదూషణాది రాక్షసమర్మభేది,
మరణశోషిత తుంగ మాయాకురంగ,
సీతావియోగ, సుశీలప్రయోగ,
ఘాతకబంధ పాతక పంకబంధ,
సుగ్రీవకృతసఖ్య, సురదత్తసౌఖ్య,
విగ్రహప్రియ వాలివిదళనశాలి,
పంపాసరస్తీర భవ్యవిహార,
సంపాతికృతమార్గ సైనికవర్గ,
సీతాశిరోరత్న శీలితయత్న,
ఆతతలంకా ప్రయాణనిశ్శంక,
పరసవిభీషణ స్థాపననిపుణ,
శరధినిర్మితబంధ, సాధుసంబంధ,
క్షపితరావణ కుంభకర్ణ సంరంభ,
కపిసైన్యజీవరక్షణ, గతదైన్య,
నిష్పాప మైథిలీ నియమితశోక,
పుష్పకారోహణ భోగనిర్వహణ,
[1] యుద్ధవిభాగ్రామ, యినకులసోమ,
సిద్ధసాకేత లక్ష్మీమనోపేత,
జయ జయ గుణధామ, జయ రఘురామ,
జయ నిత్యకల్యాణ, చకితసంత్రాణ,
నీకు నేఁ జెప్పఁబూనిన కథాక్రమము
చేకొని విన్నవించెదఁ జిత్తగింపు.
అని నిర్మలధ్యాన మాత్మలోనిలిపి
కనుఁగొంటిఁ; దత్కథాక్రమమెట్టిదనినఁ;
భూమిలో సారమై పొలుపొందునట్టి
నైమిశారణ్య పుణ్యక్షేత్రమునను

---

1. ఇద్ధనభాగావు ఇనతలస్తోమ.(మూ)

శౌనకాదులు మున్ను సత్త్రయాగంబు
నూనినరతిఁ జేయుచున్న, నచ్చటికి
నొకనాఁడు వేడ్కతో నుగ్రశ్రవుండు
సకలపురాణార్థ సరసుఁడే తెంచి,
యనుపమభక్తి సాష్టాంగప్రణామ
మొనరించి, వారితో నోలి నందంద
నభినుతులొనరింప, నా శౌనకాదు
లభినవోత్సాహులై యతనిఁ బూజించి,
కుశలపీఠంబునఁ గూర్చుండఁ బెట్టి,
కుశలంబులడిగి కోర్కులు దోపనపరి :-
"ఇచ్చఁ దలంచుచో నింతలో వేగ
వచ్చితివో సూత, వరకథాజాత.
ఆపరాశరసూతి కాత్మశిష్యుండు
రూపింప మాతండ్రి రోమహర్షణుఁడు.
కనుఁగొని నీ వెఱింగిన పుణ్యకథలు,
వినని యర్థము లేదు విశ్వంబులోన.
నవిరళమహిమ మహాభారతంబు
చెవులకుఁ జవులుగాఁ జెప్పవే మాకు.
అనఘ, గరుత్మంతుఁ డవనిఁ బుట్టుటయుఁ,
జెనకి తాఁ దల్లి దాసీత్వంబు దీర్పఁ
దలఁచి యాఘనుఁ డమృతంబు దెచ్చుటయుఁ,
గోలఁదిఁ దజ్జననిఁ దోడ్కొని పోవుటయును,
అమరదానవముఖ్యు లంబుధిఁ ద్రచ్చి
యమృతంబుఁ బడసినయట్టి హేతువును,
వైనతేయుండు విష్ణువాహనంబైన
యానిమిత్తంబును, నదిగాక మఱియు,
లగి సట్టికథకు మూలస్తంభమగుచుఁ
బొలుచు వేదవ్యాసుపుట్టు వేలాగు?

శంతనునకు గంగ సాధ్వియేలాగు ?
శాంతి భీష్ముఁడు బ్రహ్మచారియెట్లయ్యె ?
నతఁడు చిత్రాంగదుఁ డరిగినపిదప,
క్షితి నెట్లునిలిపె విచిత్రవీర్యునిని ?
ధృతరాష్ట్రపాండుల దేవరన్యాయ
గతిఁ బరాశరసూతి గన్నలాగెట్లు ?
విదురజన్మము, పాండవేయకౌరవుల
యుదయప్రకారంబు నర్థి నేలాగు ?
ఆరాజసుతులకెట్లస్త్రంబులబ్బె ?
నేరీతి దుర్మంత్ర మెన్నె రారాజు ?
వారణావతమున వహ్నిలోఁ బడక
యేరీతి వెలువడి రెల్లపాండవులు ?
మొగి నెట్లుగాంచె భీముఁడు ఘటోత్కచునిఁ ?
దగవొప్ప బకుని నాతఁ డెట్లుచంపె ?
శ్వేతాశ్వములు మఱి శ్వేతవాహనున
కాతతగతి నెట్టు లరయ సిద్ధించె ?
నంచితగతి మత్స్యయంత్ర మేయించి
పాంచాలి యేవురిభార్య యెట్లయ్యె ?
ద్రౌపదిపెండ్లికిఁ దాఁబోయి శౌరి
యాపాండుసుతుల నేమని యూఱడించె ?
నప్పుడు వారల నాంబికేయుండు
రప్పించి మఱి యర్ధరాజ్య మెట్లిచ్చె ?
మూసిసిఁగవియుచో మఱి పాండవులకు
మాని నారదుఁ డేమిమర్యాద చేసె ?
నంత నర్జునుతీర్థయాత్ర యెట్లాదవెఁ ?
గాంత సుభద్ర నాఘనుఁ డెట్లుదెచ్చె ?
ఖాండవ మగ్నిచేఁ గాల్పించి, క్రీడి
గాండీవమును దేరు గన్నలాగెట్లు ?

ఆమహాగ్ని నిదప్పి యలుకమైఁ బోయి,
పామెట్లు కర్ణుని బాణమై నిలిచె?
నలమి పార్థుఁడు గావ నయ్యగ్నిశిఖలు
వెలువడి, సభ యెట్లు విరచించె మయుఁడు?
ఆకొల్వులోపల యమసూనుతోడఁ
బ్రాఁకటలీల నారదుఁ డేమి చెప్పె?
రాజసూయాధ్వర ప్రారంభ వేళ
నాజరాసంధుని హతి యేమి చేసె?
శౌరికి నగ్రపూజలు చేయునిక
యేరీతి శిశుపాలుఁ డీల్గె గర్వమునఁ?
గొలువులోనికి వచ్చు కురురాజుఁ జూచి,
యెలనవ్వుగా భీముఁ డేటికి నవ్వె?
ద్యూతంబు తలపెట్టి, దుర్యోధనుండు
ఏ తెఱంగున గెల్చె నెల్లపాండవుల?
ద్రౌపదిఁ దొడలమీఁదకు రమ్మటంచుఁ
బాపాత్ముఁ డెట్లాడెఁ బతులసన్నిధిని?
అతివఁ దోడ్కొని యంత నడవి కేఁగుచును
బ్రతిన లేమేమని పట్టిరవారు?
అమ్మహావనములో ననిలజు చేతఁ
గిమ్మీరుఁ డేరీతిఁ గెడసెఁ బోరాడి?
హరియును ద్రుపదుండు నంతఁ బాండవుల
నరయుదమని పోయి యచట నేమనిరి?
పాశుపతాస్త్రంబుఁ బడయంగఁ గోరి,
యీశానుతోఁ గ్రీడి యెట్లు పోరాడె?
నాతఁ డా పాశుపతాస్త్రంబుఁ బడసి
యే తెఱంగున నేగె నింద్రునిఁ జూడ?
రోమశువలనఁ బార్థుని సేమ మెఱిఁగి
యేమి తీర్థములాడె నట ధర్మరాజు?

పూని యావేళ దుర్బుద్ధియై పవన
సూనునిచే జటాసురుఁ డెట్లు చచ్చె ।
హనుమంతుతో భీముఁ డది యేల గూడె ।
ధనదు సేనాపతిఁ దా నెట్లు చంపె ।
నంత నాతఁడు వోయి యక్షుల గెలిచి,
కాంతకై సౌగంధికము నెట్లు దెచ్చె ।
సతిని యుద్ధతిఁ జూచి యమసూతితోడ
హితమతి ధననాథుఁ డే బుద్ధి చెప్పె ।
దివి నస్త్రములు గాంచి తివిఱి నివాత
కవచుల నేరీతి ఖండించెఁ గ్రీడి ।
మఱి పాండవులు గంధమాదనం బరిగి
కొఱఁతగా కేవురుఁ గూడుటేలాగు ।
పాముచేఁ దగిలి, యప్పవమానసూనుఁ
డేమియుఁ గాక తా నెట్లు వెల్వడియె ।
హరి యంతఁ బార్థుల నరయఁ బోవుటయు
హరిదేవి యేమాటలాడె ద్రౌపదిస ।
రారాజు ఘోషయాత్రకు వచ్చి తగుల
నేరీతి విడిపించె నింద్రనందనుఁడు ।
ప్రాయోపవేశంబు పన్నగధ్వజుఁడు
చేయఁ, గర్ణుం డేమి చెప్పెఁ బైనొత్తి ।
ద్రౌపదిఁ గొనిపోవు దండి సైంధవుని
నేపునఁ బావని యెట్లు భంగించె ।
ఘనులు పాండవు లంతఁ గ్రమ్మఱి ద్వైత
వనమున కేరీతి వచ్చి రందఱును ।
దివిజ దేవుండు భూదేవుఁడై పోయి
కవచకుండలములఁ గర్ణు నెట్లడిగె ।
యమధర్మరాజుతో నాధర్మరాజు
రమణ నేమని యుత్తరంబులు పలికె ।

మెచ్చి యమునుం డంత మేదినీశులకు
నిచ్చినవరము లేమేమి యేవురకుఁ ?
బోయి పార్థులు మత్స్యపురిసమీపమున
నాయుధంబులు దాఁప నను వెట్లు గనిరి ?
ఏ వేషములుదాల్చి యేవురు విరట
భూవరుఁ గొలిచిరి పూఁబోఁడితోడ ?
నందు భీముఁడు కీచకావళినెల్ల
నిందుబింబాస్యకై యెట్లు మర్దించె ?
బలిమిఁ ద్రిగర్తులు పశులఁబట్టుటయు,
నలిగి విరాటుఁ డెట్లాజికిఁ బోయె ?
మఱునాఁడు గోవుల మఱియుఁ గౌరవులు
తఱిమిపట్టినఁ గ్రీడి తా నెట్లువెడలె ?
గోవుల మరలించి, కురురాజు దొరల
నేవిధంబున గెల్చె నింద్రనందనుఁడు ?
ఆమత్స్యపతికూఁతు రభిమన్యు నెట్లు
తామరసాక్షి యుత్తర పెండ్లియాడె ?
నంత రణోద్యోగులై పాండుసుతులు
వింతగా నెచ్చోట విడిసిరి మెఱసి ?
కయ్యంబునకుఁ దోడుగా నిందునందు
నెయ్యులై కలిసిన నృపతులెవ్వారు ?
ఒక్కట హరిఁబిల్వ, నురగకేతనుఁడు
నక్కిరీటియుఁ బోవ, హరి యేమిచేసెఁ ?
బోరి [1]ఁబాండులకుఁ దోడుపోయెడుశల్యుఁ
గురుపతి తా నెట్లుకొలిపించుకొనియె ?
దూతయైపోయి, పార్థులఁజూచి, మరలి
యేతెంచి సంజయుం డేమనిచెప్పె ?
నప్పుడు నీతిగా నాంబికేయునకుఁ
జెప్పిన విదురునిసిద్ధాంత మెట్లు ?

---

1. 'పాండవేయు'లను నర్థములో వాడియుండును.

హరి యంత దూతయై హస్తినాపురికి
నరుదేర, రాజరాజు దేమితలఁచె।
రూపింపఁ దనవిశ్వరూపంబు చూపి
యాపద్మనాభుఁ డేమనియెఁ గౌరవుని।
మాధవుచేత జన్మముఁ జక్కవినియు
రాధేయుఁ డేల ధర్మజుఁ గూడఁడయ్యెఁ।
దను నర్ధరథులతోఁ దగుల నెన్నుటయుఁ,
గినిసి కర్ణుండు గాంగేయు నేమనియె।
జానొప్ప 'భీష్ముండు సమసినదాఁక
రా' నని కర్ణుండు రణమెట్లు మానె।
నంత శిఖండిజన్మాఖ్యాన మెట్లు।
చింతింప నెవ్వరు సేనాధిపతులు।
ఏచి వారును వీరు నెదురు వేలములు
వైచుట యెచ్చోట। వరసేన లెన్ని।
'వైరుల నన్నాళ్లవధియింతు' రనిన
వీరు లేమాటలు విభులతో ననిరి।
'ఇందు నిందఱువిందు; లేఁజంప'; ననిన,
నిందిరాపతి క్రీడి కెట్లు బోధించెఁ।
బడక గాంగేయుండు పదివాసరములు
నెడపక రిపులతో నెట్లు పోరాడెఁ।
దమకించి భీముఁ డాతఁడు గావఁగావ,
రమణ నెందఱుధార్తరాష్ట్రులఁ జంపెఁ।
దనుజంప నంతయు ధర్మరాజునకుఁ
గినియక యెట్లు గాంగేయుండు చెప్పె।
గాండీవి యంత శిఖండి వెన్వెనుక
నుండి యేగతి భీష్ము నుర్విపైఁ గూల్చె।
నంత సేనకు ద్రోణు నధిపతిఁ జేయఁ,
బంత మేమనియాడెఁ బతితోడ నతఁడు।

భర్త కమ్మనిపినఁ, బ్రహ్మేశసమర
కర్తలై నరునిఁ ద్రిగర్తు లేమనిరి?
శూరుఁడై భగదత్తుసుప్రతీకమును
నేరీతి మర్దించె నింద్రనందనుఁడు?
తోడరి పెక్కండ్రు యోధులు దొమ్మిసేసి
గెడపినవిధమెట్లు క్రీడినందనుని?
శతమఖసూనుండు సైంధవుఁ జంపఁ
బ్రతిన లేమనిపట్టె బహుశోకమునను?
ప్రతిన తీర్చిననాఁటి బవరంబులోన
నతఁ డెట్లుగూల్చె నేడక్షోహిణులను?
ద్రుపద ఘటోత్కచ ద్రోణ విరాటు,
లుపమన్యువును, శ్రుతాయువు, నలంబసుఁడు,
నెలకొని నారాయణీయ గోపాల
కల సోమదత్తులుఁ జచ్చుటేలాగు?
ద్రౌణి నారాయణాస్త్రము పాండుసుతుల
ప్రాణంబునకు నల్గి పఱపుట యెట్లు?
కడుదైన్యమున శల్యుఁ గర్ణునిరథముఁ
గడప నేమనిపిల్చెఁ గౌరవేశ్వరుఁడు?
కర్ణుని శల్యుండు కదనమ్ములోనఁ
గర్ణశల్యమ్ములుగా నెట్లు పలికెఁ?
దడయక గాండీవి ధర్మజుఁ జంపఁ
గడఁగినఁ, జూచి యేగతిచూన్పె శౌరి?
జీర్ణసేనుని వృషసేనునిఁ దక్క
కర్ణసూనుల నెట్లు గాండీవి చంపెఁ?
చెచ్చెఱ మఱి దుస్ససేనువక్షంబు
వ్రచ్చి నెత్తురు నెట్లు వాయుజుండానె?
మురవైరి నాగాస్త్రమునఁ గ్రీడిశిరము
— దొరఁగకుండఁగ నెట్లు ద్రొక్కెను రథము?

సుతులనుద్దేశించి, సూర్యదేవేంద్రు
లతిరోషభావ లేమనియాడుకొనిరి।
అంతఁ గర్ణునిఁజంపి, యాసూతకులము
నంతయు గాండీవి యెట్లుచెండాడె।
రారాజు శల్యునిరణమహోదగ్ర
భారంబునకు నెట్లు పట్టంబుగట్టె।
మహితాత్ముఁ డతని ధర్మజుఁ డెట్లుచంపె।
సహదేవుఁ డేరీతి శకునివధించె।
శకునిసూనులనెల్ల సహదేవుఁ డలిగి,
యొకనిఁబోనీక యెట్లుర్విపైఁ గూల్చె।
మఱిపోయి రారాజు మడుఁగులో దాఁగి,
చుఱుకుమాటల కెట్లు శూరుఁడై వెడలె।
సమరంబులోన సంజయునిఁ బట్టించి
శమననందనుఁ డేలచంపక విడిచె।
నెడచూచి, గద వేసి, యిభపురాధిపుని
తొడ లెట్లుగూల్చె వాతూలనందనుఁడు।
చొచ్చిపోయిన పాండుసుతులు, సాత్యకియు,
నచ్చుగా హరియు నెట్లగపడరైరి।
ఉపపాండవులు చావ, నుడుకుమైఁ గృష్ణ
కుపితయై యేమని కూడుగ్గఁబట్టె।
భాసిల్ల ద్రౌణిఁ ‘యపాండవం’ బనుచు
నేసినదివ్యాస్త్ర మేరీతిఁ దునిసె।
డాకొని శౌరి పాండవకులక్షయము
గాకుండ నేరీతిఁ గరుణవారించె।
వ్యాసులువచ్చి యశ్వత్థామఁ గినియు,
నీసున శాపంబు లేమిమిపుట్టెఁ।
గర్ణునిజన్మంబు కౌంతేయుఁడెఱిఁగి,
ఘూర్ణాయమానుఁడై కోపించుటెట్లు।

దార లప్పుడువచ్చి, తమతమ మగల
కేరీతి శోకించి రిలసంచలింపఁ ?
బార్థులమీఁదఁ గోపప్రసాదమ్ము
లర్థి నేగతిఁజూపె నాంబికేయుండు ?
అనలసంస్కారాదు లఖిలవీరులకు
మనమార నెట్లు ధర్మజుఁ డాచరించెఁ ?
బట్టాభిషేకంబు పాండవాగ్రజున
కెట్టివైభవముల సిలచూడనమరె ?
రసికత నిభపుర రాజవేశ్మముల
వసుధేశుఁ డెవ్వరెవ్వరి విడియించెఁ ?
జుట్టాలఁజంపినశోకంబు మాన,
నెట్టిమాటలు భీష్ముఁ డెఱిఁగించెఁ బతికి ?
నంత సూర్యున కుత్తరాయణంబైన,
శంతనసుతుఁ డెట్లు స్వర్గస్థుఁ డయ్యె ?
నాయెడ ధర్మజుం డశ్వమేధమున
కేయత్న మొనరించె సిలయెల్లఁ బొగడఁ ?
దమ్ములుదెచ్చినధనము లానృపున
కిమ్ముల రాసులై యెట్లువర్థిల్లె ?
హరికృప జీవితుండై పరీక్షిత్తు
కరమర్థి నుత్తరాంగన కెట్లుపుట్టె ?
వెస బభ్రువాహన శ్వేతవాహనుల
కసమాన సంగ్రామమైనలాగెట్లు ?
అంత గాంధారియు, నాంబికేయుండు,
వింతగాఁ గుంతియు, విదురసంజయులు,
నాశ్రమవాసులై యరిగినపిదప,
నశ్రాంతసుఖ వ్యాసుఁ డచటికివచ్చి,
ధార్తరాష్ట్రులనెల్లఁ దనతపోమహిమ
మూర్తిమంతులఁ జేసి మొగినెట్లుచూపెఁ ?

జూపుటయును, వారు శోకంబులుడిగి
యేపుణ్యగతులకు నేఁగిరి ప్రీతి?
మదిరామదాంధులై మహాసలకము సు
యదురాజు లొక్కటహతులౌట యెట్లు?
అంత నారదుచేత నావార్త యెఱిఁగి,
యంతకసూనుఁ డేమనివిలపించె?
ధర నరాజకమైన ద్వారకాపురికి
నరిగి, పార్థుఁడు వారి నటసంస్కరించి,
యాదవసతుల నొయ్యనఁ దెచ్చుచోట
నాదటఁ దను బోయలాక్రమించినను,
విలువంపలేక నిర్వీణ్ణుఁడై యపుడు
తలఁగొని యందుఁ గొందఱనెట్లుగాచె?
వరశక్తిదఱిఁగిన, వైరాగ్యమహిమ
నరుఁడంత నెట్లు సన్యాసంబు గొనియె?
కర్ణుండొకట నరకప్రాప్తుఁడయ్యెఁ
బూర్ణభోగస్వర్గమున కెట్లువోయెఁ?
గర్మవిపాకంబు కాలునిచేత
ధర్మజుఁ డేరీతిఁ దప్పకవినియె?
సమరలోకంబునకరిగి, పాండవులు
తమపూర్వతనువులు దాల్చుట యెట్లు?
అనఘాత్మ, మాకు మహాభారతంబు
విన వేడ్కయయ్యెడు; వివరింపవయ్య!
ఆదిపురాణ శాస్త్రార్థ రహస్య
వేదివి; నీకంటె విజ్ఞానిలేఁడు.
ఒనరంగఁ జెప్పవే! యుగ్రశ్రవుండ,
జననంబు మాకెల్ల సఫలత నొంద."
ననుచువాక్రుచ్చిన, నమ్మహాత్మకుఁడు
వినయముతో వారి వీక్షించిపలికె:

"రసపూర్ణమైన భారతసముద్రంబు
వసమి [1] చెప్పఁగ నెంతవారలకైన!
ఐనను, మీరు నన్నడుగుటఁ జేసి
యేనువిన్నంత మీ కెఱుఁగఁ జేసెదను."
అనుచు, నావ్యాసమహామునీశ్వరుని
మనమున నిలిపి, నిర్మలచిత్తుఁ డగుచు,
నాకథకుఁడు శౌనకాదిసన్మునుల
కాకథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె:
"యతులార, వినుఁడు; మహాభారతంబు
శతపర్వరూపియై చాల నొప్పారు.
[2] నొదవ నూఱును నేను నొక్కటియయ్యెఁ,
బదునెనిమిదియయ్యెఁ బర్వంబు; లందు
వరుసలో నాదిపర్వము, సభాపర్వ,
మరుదార నారణ్య, మట విరాటంబు,
జగతినుద్యోగ భీష్మ ద్రోణములును,
మొగిఁగనన్ శల్యాఖ్యమును, సౌప్తికంబు,
జానొప్ప స్త్రీపర్వ శాంతిపర్వంబు,
లానుశాసనికాఖ్య, మశ్వమేధంబు,
పటుమౌసలిక మహాప్రస్థానికములు,
నటు నాశ్రమాప్తి, స్వర్గారోహణంబు,
సరినిది యష్టాదశప్రబంధముల
సరహస్య వేదార్థ సారబంధంబు,
విన్నఁబుణ్యము, దీనివిసినయుత్తములఁ
గన్నఁబుణ్యము పుణ్యకథయైనకతన.

---

1. 'దాటఁగ' అని యుండుట మేలు. 2. 'ఒదవనాఱును నేను నొక్కటియయ్యె' అని మూలము. అవాంతరపర్వములతోఁగలిసి 106 అగుటచేఁ బైరీతిగా సవరింపఁ బడినది.

ఏ వేదములు పఠియించుటకంటె,
నే వెంటఁ దీర్థంబు లేఁగుటకంటెఁ,
బాపహారంబైన పంచమవేద
మే పార వినిపించి యేఁ బుణ్యుఁడగుదు.

### ఉదంకుఁడు జనమేజయునియొద్ద కేఁగుట

వినుఁడు, భారతవంశ విఖ్యాతుఁడైన
జనమేజయుఁడు తొల్లి జగతి యేలుచును,
అతిరాత్రమనుయాగ, మశ్వమేధంబు,
ధృతి వాజపేయంబు, దీర్ఘసత్రంబు
మొదలైన యధ్వరంబులు పెక్కు చేసి,
సదమలచిత్తుఁడై సద్గోష్ఠి నుండ,
నా రాజుకడకు నుదంకుఁడన్మౌని
యారాధనియతిఁ గార్యార్థియై వచ్చి,
యధిపుచేఁ బూజితుండై, యాతఁడిచ్చు
బుధయోగ్యపీఠకంబునఁ గూరుచుండి,
కన్నులఁ గోపాగ్ని గదుర నిట్లనియె :
"జన్నంబులిన్నియు జననాథ, యేల!
- పగవగయైయుండ భండారమెల్ల
జగతీశ, తగని వెచ్చంబుచేసెదవు! -
వ్రతధారివై చేయవలసినయట్టి
క్రతువుండ, వేఱొక క్రతువేల నీకు!
తరమెఱుంగక కొండ తప్పఁగా నేసి (?)
ధరణీశ, వెండ్రుక దాఁక నేసెదవు.
[1] నడికేదు కటకటా! ననువంటిమునివె!
వెడ నీకుఁ గోపంబు వెదకిన లేదు!
తక్షకుండను పాము తన వేఁడికోర
దక్షతఁ గఱచి మీతండ్రినిఁ జంపె.

---

1. నడిసేదు కలుకదీ ననువంటి మునివె. (మూ)

మేలుచేయనుబోయి మోయిమోయి నుంటి ; -
మేలు నీశాంతంబు మేదినీనాథ !
శత్రుని సాధింపఁజాలని రాజు,
పుత్త్రసంతానంబుఁబొరయనిమనువు,
నురుకీర్తిలాభంబు నొరయని ధనము,
చిరశౌర్య, వృథయనిచెప్పఁగావినవె !
[1] సోముండు రాజని శ్రుతులు ఘోషించు ;
నా మేటి దిగ్విజయము తొల్లి చేసి,
రాహువుఁ బగవాని [2] రక్షోవిశేష
దేహంబుతోఁ బాపి దివ్యయత్నమున.
ఆసోమకులవార్ధి నధిప, జన్మించి
యీసుదలంప ; నీవెట్టిభూపతివి !
ఒంటికంబముమేడ లోగి మీఁదమీఁద
మింటితోఁ [3] జేరంగ మేదినిఁగట్టి,
యామేడలకుఁజుట్టు నగడత పన్ని,
యామయామవిబుధు, లౌషధకరులు,
శస్త్రవైద్యులు, మంత్రశాస్త్రసంపన్ను,
లస్త్రపాణులు నుండ నధిపునిఁదరిసి,
కపటభావంబునఁ గఱచి వధించి,
తపనుండుసాక్షిగాఁ దన పేరువాడి -
పోయినపగవాఁడు బొందితో నుండ,
నీయున్కి చూడ నిన్నే మనఁగలదు !
ఎవ్వరు నిది నీకు నెఱిఁగింపకునికి
నివ్వెఱఁగయ్యెడు ! నీచిత్తమెట్లొ !
హితముచెప్పెదఁ ; గాని, యేను నీతోడ
నతిసాహసపుమాటలాడుటయెఱుఁగ.

---

1. సోముండు రాజనిశ్రుతుని ఘోషింప. 2. రక్షావిశేష. 3. జేయంగ. (మూ)

## కుండలాపహరణకథనము

గురుసేవ యేఁజేయ, గురుపత్ని నన్ను
నురుతరప్రార్థన నొకనాఁడు చూచి:
“పుష్యరాగపుఁగర్ణపూరయుగంబు
పౌష్యమహారాజుపత్ని యెప్పుడును
ధరియించునది నాకుఁ దనయ, తె.” మ్మనిన
గురుపత్నితో నియ్యకొని, యేనుగదలి
పాతాళమున కేఁగి, పౌష్యునియింట
నాతిథ్యమొనరింప నతనిసన్నిధిని
గొనియుండి, మెప్పించి, కోమలిచేత
నొనరినతాటంకయుగ మందికొనుచు —
వచ్చుచో, వెంటనేవచ్చి తక్షకుఁడు
మ్రుచ్చిలి తివిసె నేర్పున నటత్రోవఁ.
బాము లీవిధమునఁ బరువులుపెట్టి
యేమైనఁజేసిన నెవ్వరుదిక్కు !
భూలోక [1] నాయకా, భోగులనెల్లఁ
గాలునిఁగూర్పవె! క్రతుముఖంబునను.
ఈరీతి నీయాగ మీవుసేయంగఁ
గారణమొక్కటి గల ; దదివినుము.

## కద్రూవినతలు పుత్త్రులఁబడయుట

పరమతపోన్నతి బ్రాభవశక్తిఁ
బరువడి కశ్యపబ్రహ్మనాఁ బరఁగి,
ప్రకట సురాసుర ప్రముఖ జంతువుల
నకలంకతేజుఁడై యననిఁ బుట్టించిఁ,

---

1. బాయుగా. (మూ)

దీప్తప్రభావుఁడై త్రిభువనంబులకుఁ
బ్రాప్తుఁడై నెగడె; నాపరమసంయమికి
దక్షుకూఁతులు త్రయోదశసంఖ్య లెలమి
నక్షీణగతి భార్యలై విలసిల్లఁ,
గద్రువ వినతయుఁ గాంతు లత్యంత
భద్రంపుసంపదఁ బడయుదమనుచుఁ
బతిఁ గూర్చి నిష్ఠఁ దాత్పర్యంబుతోడ
వ్రతములు నోములు వరుసతో సలిపి,
యతివలు బహుసహస్రాబ్దంబులకును
బతిఁ బ్రసన్నునిఁ జేసి భక్తితో మ్రొక్కి
నిలిచిన, నతఁడు సన్నెలఁతలఁ జూచి
పలికె నెంతయుఁ గృపాభరితుఁడై యపుడు:
"పడఁతుకలార, మీభక్తికి నేను
గడుఁ బ్రసన్నుఁడనైతిఁ; గామితార్థంబు
లడుగుఁడు మీకిత్తు"; ననినఁ, బ్రేమంబు
జడిగొనఁ బాణికంజంబులు మోడ్చి,
వనిత యాకద్రువ నలనొప్పఁ బలికె:
"ఘనదీర్ఘకాయులఁ గాంతిశోభితుల
వేవురఁదనయులఁ గోయుని" మ్మనియె.
నావినతయు నంత నంజలి మోడ్చి:
"ఘనసత్త్వులగు వారికంటెను శౌర్య
ధనులను నాకు నిద్దఱఁ గుమారకుల
ని" మ్మని వేఁడిన, నిద్దఱకోర్కె
యమ్మహాముని కృపాయత్తుఁడై [1] పూడ్చి, —
పడఁతులకపుడు గర్భములిచ్చి పలికె:
"కడుఁ బ్రయత్నమ్మున గర్భముల్ రెండు
రక్షించుకొనుఁడు". డని రమణులననిపి,
యాక్షణంబునఁ బోయె నమరాద్రికడకు.

---

1. మోడ్చి. (మూ)

3

తరుణులిద్దఱుఁ దమతమ నివాసముల
కరిగి వేడుకనుండ, నాసమయమున
నాహారములఁ గాంక్ష లల్పంబులయ్యె;
దేహవల్లులు పాండుదీధితులయ్యెఁ;
నారులుపొదలె; మధ్యంబు లొయ్యొయ్యఁ
దోరంబులై యొప్పె; [1] దొరఁగొనెఁ గలఁత;
వళులు జీర్ణంబయ్యె; నాముఖాబ్జములు
కళలేద; [2] మనము లొక్కట బీతువాఱెఁ;
బొలుపుదీపింప నాభులు వికసించెఁ;
బులుసులపైఁ జాలఁ బుట్టెఁ బ్రేమంబు;
పలుమాఱు మృత్తికాభక్షణం బొదవెఁ;
దలఁగాని చిట్టముల్ తఱుచుఁ గాఁదొడఁగె.
నీరీతి నయ్యింతులిద్దఱు గర్భ
భారంబుదాల్చి, యొప్పగునురక్షితము
గావించుచుండఁ, దద్గర్భమ్ములందు
భూవినుతంబుగాఁ బుట్టె నండములు;
పుట్టిన, నవి కుండములలోనఁ బ్రీతిఁ
బెట్టి రక్షింపంగఁ బెరిగె నొండొండ.
నరవియేర్పడఁ బంచశతవత్సరమ్ము
లరయుంగఁ, గద్రువయుండంబులెల్లఁ
దఱితోడ నందంద తముఁదాము యవ్విసి
సొరిదిమై శేష వాసుకి తక్షకాదు
లగుమహాభుజగంబు లందుఁ బుట్టుటయుఁ,

## అనూరు జన్మవృత్తాంతము

దగవేది వినతయుఁ దనదుగర్భమునఁ
బుట్టినయండము లొప్పదలమిచూచి,
చిట్టాడువగపును సిగ్గును బెరయు,

1. తురగొనెనెలంత. 2. విసము. (మూ)

నరుడుగాఁ బుత్త్రార్థియై యొక గ్రుడ్డు
తెరలుచు నవియించెఁ దెలియ నేరమిని.
ఆయండమున నొక్కఁ డర్ధశరీరుఁ
డై యుదయించి, తా నతికోపుఁడగుచుఁ:
"గడుపూర్ణదేహునిఁ గాకుండ నన్ను
నడరుచు నడుమ నండము వ్రక్కలించి
వికలశరీరుఁ గావించితి; గాన,
సకలవిఖ్యాతి నీసవతికి నీవు
దాసివిగ;" మ్మని తనకన్నతల్లి
నీసున శపియించి యిట్లని పలికె:
"అమ్మ, యీరెండవయండంబునందుఁ
గ్రమ్మఁబుట్టు నఖండవిక్రముఁడు;
చెలువొంద నీదుదాసీత్వంబుఁ బాపి
వెలనొప్ప రక్షించు; నగవకుమింక;
నయ్యండ మది తానె యవియును". మ్మనుచుఁ
జయ్యనఁజని, యర్కుసారథియగుచు
నెమ్మి ననూరుండు నిజశక్తినుండె.
[1] అమ్మగువయును నయ్యండంబు నంత
నతులయత్నమ్మున నరయుచు, మిగుల
జతనంబుగాఁగ నిచ్చలుఁ బ్రోచుచుండె.

## కల్పకుసుమదామప్రదానము

ఉర్విలో నటుమున్న, యుగ్రకోపనుఁడు
దుర్వాసుఁడనుముని దొరయ నేతెంచి
చరియించుచును, నొకసమయంబునందుఁ
దరణితేజుఁడు తిలోత్తమయను పేరి

1. అమ్మగువయు నంత నయ్యండ్యమంద. (మూ)

యప్పురోద్యాన భూమియందుఁ గ్రీడింప
లిప్పుడీరంగ నాళీనివహమ్ముఁ
దానును వచ్చుచోఁ, దరుణీలలాము
చేనున్న కల్పకక్షితిజప్రసూన
మంజరీ విమలదామమ్ము వీక్షించి,
సంజాత కౌతుకోత్సాహుఁడై చేని :
"శుభమస్తునీకు నోశుభకాంతి, మాకు
నభిమతమయ్యె నీయులకులగంధి.
పొసఁగంగ బ్రాహ్మణబుద్ధిగా మాకు
నొసగుము నీ." నన్న, యుగ్మలి యప్పుడు
పటుభక్తిమైఁ బాణిపద్మముల్ మోడ్చి,
నిటలంబుపైఁ జేర్చి, నెఱిసన్నుతించి :
"ఓమునినాథ, నీయుల్లంబులోన
నీమాడ్కిఁ బ్రియమైన నదియెంతపెద్ద !
కో". మ్మనియొసగఁ, గైకొని మునీంద్రుండు
సమ్మదంబొదవ నచ్చరఁ బ్రస్తుతించి,
యాపుష్పదామకం బఱుత నుల్లాసుఁ
డై పూని విహరించునాసనుయమున,
నేమహాత్మున[1] దొడ్డి నెల్లకాలంబుఁ
గామధుగ్ధేనువుల్ కదుపులై యుండుఁ,
బారిజాతంబు లేప్రభువు క్రీడించు
నారామమున గుంపులై గనుపట్టుఁ,
దలఁపుటౌలెప్పుడు నేధన్యు గేహమున
నెలకట్టడంబులై నెలకొని వెలయు,
నచ్చర లేవేల్పునాస్థానసీమ
నిచ్చలుఁ గాసించి నిలిచియుండెదరు, —

---

1. తోడి. (మూ)

ఓజమై జరయుఁ జావును దేవుల్ లేని
భోజనంబమరు నేపుణ్యభాగునకు
నా నిత్యశుభసాంద్రుఁడగు నమరేంద్రుఁ
డానందకందళితాత్మకుండగుచుఁ,
దన వేయికన్నులఁ దనరుదీధితులు
నినుపారి పగలు వెన్నెలలు గాయింపఁ,
దన మౌళిరత్న సంతాన ప్రభాళి
యినకిరణాళితో నీడుజోడాడఁ,
దనచేత విలసిల్లు దంభోళిధార
ఘనతను దుష్టశిక్షణజాలి నెఱపఁ,
దనపాదములు దేవతాకోటి మకుట
వినుతరత్నప్రభావితతి వెలుఁగఁ,
దనరొప్పిదము దివ్యతరుణీ కటాక్ష
జనితతృష్ణలకు నుజ్జ్వలభుక్తి నొసఁగ,
దన యశోరమను గంధర్వకిన్నరులు
మునుకొని కైవారములు బిట్టు సేయ,
లాలితోజ్జ్వల చంచలాలతా కలిత
కైలాస భూధరక్రమమునఁ బొలుచు
సలలిత కనకభూషణ కాంతిజాల
విలసితంబై జగద్విఖ్యాతి నొప్పు
ధళధళ్యమును [1] చతుర్దంతకాండములు
గలిగినయట్టి దిగ్గజముపై నెక్కి,
సముదీర్ణ కింకిణ ఝణఝణారావ
కమనీయు సురవధూకర [2] విజ్యమాన
బహుళచామర [3] జాతపవన సంచలిత
మహనీయకుండల మండితుండగుచు,
నతిసమున్నత మౌక్తికాతపత్రంబు
నతులితస్థితి నభంబంతయుఁ బొదువ,

1. చతుర్దంత. 2 దీప్యమాన. 3. జాత. (మూ)

నన లాగ్గి రాక్షసేంద్రాప్రభృతి వాయు
ధనద శంకరులు, ముదంబుతో మేష
కాసర మానవ ఘనచక్ర హారిణ
భాసురాశ్వోష్ట్ర సాపదలెక్కి నడువ,
ననమానముగ సిద్ధ యక్ష గంధర్వ
వసు రుద్రసాధ్య గీర్వాణ కింపురుష
కిన్నర మరు దశ్వి ఖేచ రాదిత్య
పన్నగ గుహ్యకప్రవరులు గొలువ,
[1]మహీరులను చక్రవర్తులు, రాజ
వరులును సంప్రీతి వరుస సేవింప,
ననుపమ శోభైశ్వర్య వాశ్వరత్నంబు
మునుకొని పడివాగె ముందఱ నడువఁ,
గనిసి నిర్జరలోక కంచుకిజనము
ముదముతో నోంకారముఖరులై కొలువ
నేతెంచు సమరేంద్రు నీక్షించి, యర్థి
నాతఁడు దూర్వాసుఁ డట నెదురేఁగి,
పోలంగ నాననాంబుజము నిక్కించి,
లీలఁ జేతులుదోయిలిగఁబట్టి చాచి:
"దిగ్విజయోస్తు; తే దీర్ఘాయురస్తు;
ప్రాగ్వర, సంకల్పఫలసిద్ధిరస్తు".
అని యిట్లుదీవించి, యాధిపుల గురులఁ
గని రిత్తకేల డగ్గఱరాదుగానఁ,
దనచేతనున్న మందారప్రసూన
ఘనతరదామంబు కానుకగా నొసగ
'మునిలోకవర్య, నమోనమో' యనుచుఁ
గొనకొని చేతియంకుశ మొయ్యఁ జాచి,

1. కరతరు. (మూ)

యామునీశ్వరుఁడిచ్చు పలుకుఁదండ
ప్రేమతోఁ నంది యాత్రిదశనాయకుఁడు
కడఁక నైరావతకంఠదేశమునఁ
దడయక వైవ, నాదండతావులకుఁ
గలఁగొని చంచరీకములు ఝంకార
ములతోడ నటునిటు ముట్టి శాటింప,
మధురాజబింబంబునుండి చలించి
కడుఁజట్టుపట్టు చీఁకటిగుంపులట్లు
అలులతండము లసంఖ్యములుగా మూఁగి
పలుచందములఁ జెవుడ్పడఁగ మ్రోయఁగను,
దగ మును కటయుగ (దాన) ధారలకు
మిగులఁ గాంచుచు మొదలకుఁ దోడు
దండతావులకు నుద్దండగతిఁ బోలయు
గంధుతుమ్మెదలచేఁ గాసిలి యలసి,
చయ్యన నాదిగ్గజము కరాగ్రమున
నయ్యలరులదండ నవలీల నొడిసి,
మొరయుచు [1] నెల తేఁటి ముత్తంబులెల్లఁ
బరచి దిక్కులఁ బటాపంచలై చెదర
బిట్టుగా నింగికి బింబిరఁద్రిప్పి,
'యిట్టిచందమున సురేంద్రునిలక్ష్మి
భ్రమణంబుతో నేలపాలగు నేఁగు
గామరువో' యన్నట్లు గుంభిని వైచి,
మండి [2] గాఢత దంతిమండలిఁ గ్రుమ్మి,
తొండంబుచే వెంచి తోడన యొత్తి,
త్రొక్కి కాలునఁద్రొక్కి యుద్ధతిఁ ద్రుంచి,
చిక్కుగా నలినలి చిద్రుపలై దొరఁగఁ
బటుభంగి నిలఁబెట్టి పదములఁబ్రామి,
చటులత రూపనాశంబు గావించి,

1. సెలదిండి, 2. గాదల. (మూ)

గమిఁగొన్న మేఘసంఘముచాయ మించు
[1]హిమశైలమునుబోలి యిభనాథుఁడమరె.

## దూర్వాసుఁ డింద్రుని శపించుట

అప్పుడు దూర్వాసుఁ డయ్యమరేంద్రు
నిప్పులుచెదరంగ నిబిడరోషమునఁ
బృథులాజ్యధారల పెల్లున నేయు
ప్రథితానలముభంగి భగ్గునమండి,
మోమున నెత్తుటిమ్ముఁ గ్రమ్ముదేర
మోమును సర్వాంగములుఁ జెమరింపఁ,
బ్రళయాగ్నిరుద్రుని ఫాలాక్షివహ్ని
లలిఁబొల్చు బడబానలము నైక్యమొదవి
మునిరూపమున నిట్లు మొనసెనో యనఁగఁ
గినిసి, యయ్యింద్రు నీక్షించుచుఁ బలికె:
“నోరిమదాంధ, నీయున్నతైశ్వర్య
కారణంబున నీకుగౌరవంబొదవ
నేనుదీవించి నీ కిచ్చినయట్టి
మానిత పుష్పదామంబు గైకొనక,
కలిమిమై నిలఁ గల్పకంబులు పెక్కు
గలవని మదిలోనికండగర్వమునఁ
గడునల్లిదంబునఁ గరటికుంభమున
నిడితివి; హే నీకు నింతయుల్పుఁడన!
ధరణిఁ జేయుఁగరానితప్పొనర్చినను,
గరుణఁ గాచినయట్టి [2]గౌతముఋషిన!
అనుదివసంబుఁ బంచాంగంబుచెప్పి
పనులొనర్చెడు బృహస్పతిఁ జూచితివె!

---

1. హేమశైలముంబోలి. 2. గౌతమీసతినె. (మూ)

వసల్గిచూచిన వీక్షణంబునను
బూని కులాద్రులు పొడిపొడై రాలు;
రవి శశి తారకా గ్రహసమూహంబు
లవలీల నిర్ధూతమై నేలవ్రాలుఁ;
కలఁగి గుల్లలు నిసుకయును శేషించి,
జలనిధులేడు శోషతనొంది యుండు;
జగతియంతయు జీవజాలంబుతోడ
మొగిఁ దిర్గి పాతాళమునఁ గూడియుండుఁ;
బరగ సర్గ స్థితి ప్రత్యవహార
కరులైనమూర్తుల కలఁగి పాఱుదురు;
పుడమిలోఁ గలిగిన భూరికోపంబు
పడఁగట్టి తెచ్చినవాఁడ నేనసన,
నీవెంతవాఁడవు! నీబలంబెంత!
దేవతావలియెంత! త్రిజగంబులెంత!
కొలువిచేఁ దల గోఁకికొన్న చందమున
నెఱుఁగక నాతో నీ వెగ్గుచేసితివి;
అహహా! మే." లని, యట్టహాసంబు తీవ్ర
దహనకీలాకళాతతిఁ గిఱుపఱుపఁ:
"జెఱుగ, నీయాచరించిన ఫలంబెల్లఁ
గుడుతువుగా". కని ఘోరవాక్యముల
శతమన్యు నీక్షించి, శాపోదకంబు
లతిభీమగతి నేలనలికి యిట్లనియె:
"నిలమీఁదఁబడినట్టి యాపూలదండ
నలఁగినగతి నీవు నలఁగు సొంపేది.
మానసీయుల సన్మానంబొనర్పఁ
గా నీకు మహితమై కనుపెంచియున్న
భవదీయరాజ్యసంపదలు, నీభూరి
వివిధ పరిచ్ఛేద విభవంబు లెల్ల,

జడనిధిలోన నాశ్చర్యంబుగాఁగఁ
బడఁగాక". యనుచు శాపంబొనర్చుటయు,
జగము లల్లాడె; భూచక్రబంధంబు
డిగియె; భూవలయంబు దిర్దిరఁదిరిగెఁ;
కులగిరిశ్రేణి యాకులతఁ గంపించె;
జలరాసులెల్లఁ జంచలమంది మ్రోసె;
భానుదీప్తులు మాఁగువాఱె; నుల్కములు
సోనలై భువిరాలె; సురలు భీతిలిరి.
వెఱఁగును, శోకంబు, విహ్వాలంబొదవ
సురపతి సురసుర స్రుక్కి యావేళ
కరిమీఁదనుండి గ్రక్కున నుర్వికుఱికి,
కరములు మొగిచి, గద్గదకంఠుఁడగుచు:
"నోనంయమీంద్ర, నీయుల్లంబులోన
నీసుపుట్టిన నెవ్వ రెదురంగఁగలరు!
తనయుఁడజ్ఞానియై తప్పొనర్చినను
కినియక తండ్రి శిక్షింపంగఁ దగదె!
పశుమతినైన నాభావంబులోన
వశమె నీదగు ప్రాభవంబు నెఱుంగ!
తొలఁగక [1]సాపరాధులకైనఁ గీడు
తలఁపమిగా తపోధనులకు వన్నె!
దేవర యొసగిన దివ్యదామంబు
కావరంబున వైవఁ గరిమస్తకమున;
బాహుళ్య లోలంబ బాధకై కాని.
శ్రీహరిసాక్షి; మీచిత్తమే నెఱుఁగ.
నమలాత్మ, నేఁజేసినట్టి యాతప్పు
క్షమియింపు క్షమియింపు క్షమియింపు". మనుచుఁ
గరములఁ బాదయుగ్మముఁ బట్టుకొనిన,
విరసమందుచు మౌని విరసించిపలికె:

---

1. సావధానులకైన. (మా)

“ వెనసి క్రాలినవహ్ని నగఁదోయు భంగిఁ
బెనఁగొని పటపట ప్రియము సేయుకుము.
ఈ [1] వట్టిమాటలకెల్లను గరుణ
యేవెంట నామది నేల జనించుఁ!
చాలుఁజోచాలు! నిచ్చలుఁ బనిలేని
జోలిమాటలును మెచ్చులుగావు మాకు.
ఇంక నొండాడిన నిప్పుడు గడమ
కొంకులుమాని [2] నీగుఱుతుమాయింతు ;
వలవదు తల ;” మనివడి మూర్ఖవృత్తిఁ
బలుకుచు నామానిపతి వేగఁజనియె.

## అమరలోకపతనము

అప్పుడు దేవేంద్రుఁ డాత్మలో శోక
ముప్పతిల్లఁగ, దైన్య మొదవనాస్యమున,
సకలనిర్జరసైన్యసమితియుఁ, దానుఁ
జకితమనస్కుఁడై చయ్యన మగుడి
యమరావతికి నేఁగునప్పుడు, పురము
కొమరేది దూర్వాసుకుటిలవాక్యముల
వరుసఁ జెప్పఁగఁ జూప వాక్రువ్వరాని
పరుసున నెంతయుఁ బాడొందెఁజూడ.
సురుచిర సురభూజ శూన్యంబులైన
పుర బాహ్యభాగ విస్ఫుటవనంబులును,
వర హేమ సన్మణి వజ్రముల్ లేని
గురునగర ద్వార గోపురంబులును,
పరవి నందంద రక్షకకోటి లేక
— యరయుఁగ [3] నాఱడియైన వాకిళులు,

1. పట్టి. 2. గుఱుత. 3. బారడి. (మూ)

రహితూలఁ గానంగ రంగభోగముల
మహిమ వాసిన దేవమందిరంబులును,
రత్నదర్పణవిభా రహితంబులైన
[1] నూత్న సమగ్ర మందుర గోపురములు,
హరి దుకూలధ్వజావళి లేక
సారంబులెడలు ప్రాసాదపంక్తులును,
లాలిత నర్తకీ లాస్యంబు లుడిగి
డాలఱియున్న నాటకగేహములును,
ప్రచుర [2] విధూరత్న భాస్వద్విలాస
రుచిహీనమైన శిరోగృహంబులును,
లలనా కటాక్ష లీలావలోకముల
తళుకులు లేని వాతాయనంబులును.
మిడుకమానిసి లేమి మిగులఁ బాడొంది
యుడరి దయ్యాలుకొట్లాడు వీధులును
గలిగి, దగ్ధపటంబులై పడఁ దోపఁ
బాలుపేదియున్న యాపురమువీక్షించి:
'కటకట! తపసి తెక్కలివిధి యగుచు –
నిటుచేసెనే!' యని యెంతయుఁ బొగిలి,
కరిదిగ్గి, దివిజసంఘము నెల్లఁజూచి,
వరుసతో 'నిచ్చోట వసియింపుఁ' డనుచుఁ
బలుకుచు నగరిలోపలి కొయ్య నేఁగి,
కలయంగ నలుదెస లనుఁగొనునపుడు,
పూని రథంబు లద్భుతముగాఁ బోయె;
ధేనువు మొదలని దీపింపదయ్యె;
నటుపోవ నెల్లచో నలవడియుండు
పటుదివ్యరత్నముల్ భాసిల్లవయ్యె;
మఱియును జనిచూడ మాయంబులైరి
మెఱయు రంభోర్వశీ మేనకాదులును.

1. ధూర్త్న. 2. వధూతర భాసవిలాస. (మూ)

ఈచందమున సర్వహీనమౌ నగరు
చూచి, విస్మయమును శోకంబుఁ గదుర
జడిముడి వెలికివచ్చినయంతలోన,
సడికి నైరావతోచ్చైశ్శ్రవంబేఁగె.
ఈవిధి సంపదలెల్ల నొండొండ
పోవుటచూచి యుప్పొంగ చాలనలిగి,
దహనార్క దనుజ యాదఃపతి గంధ
వహ యక్షపతి వృషధ్వజులును దానుఁ
దలపోసి, తమ కాపదలు పొందినపుడు
తలఁగించుగురుని సత్తముఁ బిల్వఁబంచి,
చనుదేర నందఱుఁ జయ్యన లేచి,
పనివడి భక్తిసంభ్రమమున నెఱఁగి,
యందఱు నొక్కచో నాసీనులైన
సందు సురేంద్రుఁ డయ్యాచార్యుఁ జూచి
తారందఱును మహీస్థలికి నేఁగుటయు,
వారక యచట దుర్వాసుఁ గాంచుటయు,
నామునీంద్రుఁడు దామ మర్థినిచ్చుటయుఁ,
దా మది గజము మస్తమున వైచుటయు,
నఖులచేఁగాసిలి యలసి యాగజము
నలిరేఁగి యాదండ నలియ మోఁదుటయుఁ,
బలుమాఱు విలపింప భాషింపకతఁడు
చలమునఁ గోపించి శపియించుటయును,
దివిజాగములు వేల్పుదెఱవలు కామ
గవి దివ్యమణి సురగజతురంగములు
మాయమై చనినక్రమంబును, దెలుప
నాయెడ వెఱఁగంది యాంగిరసుండు:
"విధినిర్మితంబు నేవిధమునఁ గడవ
నధికులై తలపోయ నధములెవ్వారు!

మనకెల్ల దిక్కు తామరసాసనుండు;
చని యమ్మహాత్ముని 'శరణ' న్న, నతఁడు
వలగొను నీదురవస్థలన్నియును
నలఁగించు; నటకుఁబోదం." దని కదలి,

### అమరులు బ్రహ్మయొద్దకేఁగుట

తడయక వారును దానును గూడి
కడువేగ బ్రహ్మలోకంబున కేఁగి,
ధర్మ తపో యజ్ఞ దాన దక్షిణలు,
నిర్మలశ్రుతి శీల నీతి సత్యములు,
పరమాత్ములగు సురబ్రహ్మసంయములు,
వరుసతోడుతఁ జక్రవర్తులు, నృపులు,
మునుకొని హస్తాబ్జములు ముకుళించి
వినయంబు మెఱయ సేవింపుచు నుండ,
వీణా [1] లసచ్ఛుకాన్విత పాణియైన
వాణీసమేతుఁడై నరసౌఖ్యలీలఁ
గమలభాసుర కర్ణికా విష్టరమున
రమణమైఁ గొలువున్న బ్రహ్మకు నెఱఁగి,
యతులితభక్తి హస్తాబ్జముల్ మొగిచి
పితతాగమోక్తుల వినుతించుటయును,
సారసభవుఁడు వత్సలతదీపింప
వారల వదనవైవర్ణ్య మీక్షించి:
"గురు శక్ర శిఖి యమ కోణప వరుణ
మరు దర్థపతి శివుల్, మదఁజాలనలసి
వచ్చినయట్లున్నవారలె! యలఁత
యెచ్చోటినుండి మీ కిటు సంభవించె!

---

1, లసన్నుతాన్వితమైనపాణి. (మూ)

కడుకొని ధర్మమార్గంబు దప్పితిరో!
యొడపక గురునకు నెగ్గొనర్చితిరో!
అడర విప్రద్వేష మాచరించితిరో!
వేడినయర్థుల వృథగఁబంపితిరో!
తవిలి విశ్వాసఘాతక మొనర్చితిరో!
భువిలోనఁ బూజ్యులపూజ దప్పితిరో!
ఈలీల మీకేల యిటుచిన్నవోవ!
నాలోకమునను దైన్యము చేటు వగపు
దారిద్ర్య శోక సంతాప[1] వార్ధక్య
దారుణ మృత్యుబాధలు చెంద రాదు.
ఇందువచ్చియును మీరిందఱు నార్తి
డెందంబులో సందడింపఁ దూలుదురె!
వెలవక చెప్పుఁ; డేవిధముననైన
మొఱ మొఱమాన్పి మీమెచ్చు గావింతు".
నని కృపఁబల్కిన, నాబ్రహ్మపలుకు
విని, చిత్రవాక్యప్రవీణత మెఱయ
సరసమానవుఁడు వాచస్పతి యపుడు
కరములు మొగిచి వాక్పతిమ్రోలనిలిచి:
"నిఖిలాధినాయక, నీదుచిత్తమున
నఖిలలోకములవృత్తాంతంబులెల్ల
నెడవక కరతలామలకము; తెలియఁ
బడయకయుండునె! లోకభర్త! వాణీశ!
ఐనను, దేవ! నీవడిగితిగాన
నేనెఱింగినదాని నిట విన్నవింతు".
నని యింద్రుఁ డుర్వ కత్యంతహర్షమునఁ
జనుటయు, దూర్వాసుశపియించుటయును,
అలవడ నాదిమధ్యావసానంబు
తెలుపంగ, విని భారతీయనాయకుండు:

1. సాధక. (మూ)

“కటకట! దూర్వ్యాసు కడు మొక్కలీఁడు! —
కుటిలుండు! నన్నుఁ గైకొనఁడు చీరికిని!
— అనిష్టురాత్ము[1] నిట్లతికరింపుదుర!
నేను నిన్నేమన నేర్తు నోయింద్ర!
ఎడపక క్రూరమృగేంద్రునికోర
లడరునుద్ధతిఁ[2] జేతనాడిఁ చిదైన,
మదతరంగిత తీవ్రమాతంగవిభునిఁ
గదిసి తుండాగ్రంబుఁ గబళించిదైనఁ,
గలిత[3] క్షుధార్త బుభుక్షుఁబు మీసముల
నలవడఁబొదివి యుయ్యాలలూఁగిదైన,
నుదిత కోలాహలాత్యుగ్ర కాలాహిఁ
బదమునఁ గ్రౌర్యమొప్పఁగఁ దన్నిదైన,
నలఘుకీలా నికాయాభీలమైన
ప్రళయానలంబులోపలఁ జొచ్చిదైనఁ
గ్రమ్మఱఁ జని బ్రదుకఁగాఁబోలుఁ; గాని,
యమ్మూర్ఖుఁ జెనకి యెయ్యెడ బ్రదుకవశమె!
వఱలంగఁ బడవేలువచ్చెఁ! జాల్చాలు!
మఱియొండనాక యీమాత్రనపిడిచ!
— ప్రాణంబులుండ సంపదలేమిదొడ్డు!
త్రాణమై మనకు నారాయణుండుండ.
ఆ దేవుతోడ నీయాపదలెల్ల
నాదట వినుపింత మటకుఁర.” మ్మనుచుఁ
జతురాస్యుఁ డాసభాసగుల వీడ్కొల్పి,
హితబుద్ధి నమరుల నెల్లఁ దోడ్కొనుచు,
మాకాంతునకు సత్యమందరంబైన
వైకుంఠ పురవరద్వారంబు చొచ్చి,

1. నిట్లధికరింపుదుర. 2. చేరి యడరంగిదైన. 3. క్షుధాకవక్షుంబు. (మూ)

## వైకుంఠపురవర్ణనము

పోవఁగా, నప్పుడు పుణ్యగేహమున
శ్రీవైష్ణవాస్పద శృంగారగరిమ
రతిమీఱు విష్ణుపురాణంబు భాగ
వతమును మొదలైనవైష్ణవకథలు
సారిదిఁబఠించు శిష్యులకు బోధించు
నురుపుణ్య భాగవతోత్తమ వ్రజము,
ననవరతంబు : " నారాయణ, కృష్ణ,
దనుజమర్దన, జనార్దన, వాసుదేవ,
శ్రీరామ, హరి, శార్ఙ్గి, శేషపర్యంక,
వారిజోదర, రమావక్ష, గోవింద "
యనుచును భువననాయకు విష్ణుదేవు
ఘన కృపాపాత్రులై కడుచెన్నుమీఱి,
కామ రోషాది వికారముల్మాని,
వ్యామోహకోటులు వదలించివైచి,
మొనసి పంచేంద్రియంబులు మూలకొత్తి,
మనమున హంకారమమతలు పాసి,
రాజస తామస ప్రబలంబు లుడిగి,
తేజిల్లు పరమసాత్త్వికమె చేపట్టి,
యరుదార నిజకృత్యంబులు క్రియలెల్లఁ
బరమాత్మునకు సమర్పణముగావించి,
సతతంబు శైవవైష్ణవసమర్చనలె
మతములుగా నప్రమత్తమార్గమున
సముచితోన్నతి మీఱ జరపువైష్ణవుల,
రమణ బ్రహ్మర్షి నారద పరాశరులఁ,
బ్రాకటంబుగ మంత్రసాధక వైష్ణ
వైకాంతికులఁ, బరమైకాంతికులను

కనుఁగొని యేఁగుచోఁ, గమలసంభవుఁడు
నెనసిన వేడ్కతో నింద్రునకనియె:
"చూచితె యింద్ర, విష్ణునిమహామహిమ!
యీచందమని తెల్ప నెఱుఁగంగ రాదు.
అనయంబు విష్ణుదివ్యాలయంబులకుఁ
గనుకని నేఁగి కైంకర్యంబుచేసి,
దేహాభిమానముల్ దిరుగంగవిడిచి,
మోహతృష్ణాదులు మొదలంటఁబొడిచి
చరియించునట్టి సజ్జనుఁ డందుసుమ్ము
వరుసనెయున్న పావనశుభోన్నతులు.
దారిద్ర్య [1] శోక సంతాపంబు లోకటఁ
జేరిన నందుచేఁ జీకాకుపడక,
ధనధాన్యములు [2] పోఁకు దకలకుఁబోక,
తనరెడు హరిభక్తిధనముగా వెలయు
ననమాన ధన్యాత్ములగువారు సుమ్ము
పొసఁగ నీయున్నసత్పూజ్యులు వజ్రి!
ఒలయ నేకాదశి నుపవాసముండి,
పొలుపుతో ద్వాదశిపొద్దు సాధించి,
భూసురారాధనంబులు చేసినట్టి
భాసురచరితు లీధన్యాత్ములెల్ల.
జప తపస్ స్వాధ్యాయ సద్ధర్మార్త
విపులకర్మంబుల విసువునవిడిచి,
యనయంబు శైవదూషణమాని, కీర్తి
లోనరంగవెలసిన యుత్తముల్ వీరు.
[3] కుడువఁగూడును, గట్టఁగోకయు లేక
బడలిన హరిభక్తిపరులఁ జేపట్టి,

---

1. లోక. 2. లోకు. 3. కడుపెద్దలై గూడ కట్టకోకలును. (మూ) దీనిని "కడుపేదలై కూడుఁ గట్టకోకలును" అని సవరించుట మూలమునకు చాల సన్నిహితముగానుండును; కాని, అసవరింపుసైతము కొంత అనన్వితమగుటచే, మూల దూరమయ్యు దీనిని అంగీకరింపవలసివచ్చెను.

యన్నపానాంబరాద్యములఁ బోషించి,
సన్నుతిగన్న సజ్జనులు వీరింద్ర!
పరికింపఁ బదికోట్లు బ్రహ్మకల్పంబు
లరిగెడునప్పు డీయచ్యుతుపురము
గసుగంద; దేమియుఁగా దొకింతయును;
పిసువదు; నొగులదు; వేదఁ బడదు;
గరిమంబొ ననివృత్తకైవల్య మొసగు;
వరశుభాకుంఠ మీవైకుంఠపురము.
మహిమంబొఁ దద్దివ్యమందిరంబునకు
సహజసాహసులు, రక్షకులైనవారు,
దారుణ వికటాష్టదంష్ట్రులు, సతుల
సార తేజులు, చతుష్షష్టిదంతులును,
ఘనతరమస్తక కలితనోగ్రవత్సు,
లనుపమ చరణ శోభా సహస్రాధ్యు
లరయంగ లక్ష కోట్లర్బుద పద్మ
వరశంఖసంఖ్య, లవార్యశోభితులు,
చండ[1] ప్రచండులు, చక్రికింకరుల
ఖండితు లేపార్దుఁ గాచియుందురు."
అనియని చెప్పుచు నాపద్మభవుఁడు
మునికొని వచ్చుచో, మొగి నొప్పుమీర
మాండవ్య కపిల రోమశ భరద్వాజ
శాండిల్య భృగు పరాశర కుంభజన్మ
నారద వ్యాస శౌనక గాతి మాత్రి
వారిభుగ్జటిల పర్వత పైల సుబల
శుక మతంగాంగీరసులు మొదలైన
సకలమునీంద్రు లుత్సవలీలఁ గొలువఁ,

1. ప్రచండవిచక్ర. (మూ)

బరమపుణ్యులు విష్ణుభాగవతులును
గరిమతో నంతంతఁ గదిసి సేవింప,
భోగికులాధీశు భోగపీఠమున
రాగిల్లు శ్రీరమారమణితోఁగూడి

విష్ణుసందర్శనము

కొలువిచ్చియున్న యాకువలయశ్యాము,
సలలిత వికచాంబుజాతాయతాక్షు,
నిరుపమ మణివిభా నిబిడకిరీటు,
సురుచిర [1]కుండల స్ఫుటగండభాగుఁ,
గౌస్తుభ శ్రీవత్స కలితోరు వక్షు,
శస్త పీతాంబరోజ్జ్వల దివ్యదేహుఁ
బొడగని, సాష్టాంగములు భక్తిఁ జేసి,
సడలనిభక్తి హస్తాబ్జముల్ మొగిచి :
"జయ జయ గోవింద, జయ చక్రహస్త,
జయ జయ లక్ష్మీశ, జయగదాపాణి,
నారాయ, ణాచ్యుత, నగధర, కృష్ణ.
వారిజోదర, భక్తవత్సల, శార్ఙ్గి,
వైకుంఠ, కేశవ, వరద, మురారి,
లోకేశ, హరి, కృపాలోల, ముకుంద,
యనిరుద్ధ, పాపసంహర, విష్ణుమూర్తి,
వనజాక్ష, కైవల్యపర, వాసుదేవ,
పన్నగశయన, యాపన్నుల మమ్ముఁ
గ్రన్ననరక్షించు కారుణ్యనిలయ!"
అని సన్నుతించు బ్రహ్మాదులఁ జూచి
వనజనాభుఁడు కృపావర్ధిష్ణుఁడగుచు,
చిఱునవ్వుఁ గృపయును జెలఁగుచూపులను
బెరయంగ జలదగంభీరనాదమునఁ :

1. గండల. (మూ)

“బరమేష్ఠి గురు శక్ర పావ [1]కార్క్య సుర
వరుణ మారుత యక్షవర రుద్రులార!
కడుదురవస్థయుఁ, గార్యదాహంబుఁ
బాడమెదు మీముఖంబుల నాకుఁజూడ ;
వచ్చినపనియేమి వ్రాక్రువ్వుఁ? డిప్పు
డచ్చుగాఁదీర్చి మీయడలు వారింతు.”
నని యానతిచ్చినయా దేవుపలుకు
విని, యటు శారదాపిభుఁడు కేల్మోగిచి:
“అధ్యాత్మవేద్య, నీయంతిరంగమున
బోధ్యంబుగానిది భువిలోనఁగలదె!
శ్రీవర, యడుగంగఁ జిత్తగించితరి ;
గావున, వినుపింతుఁ గలతెఱంగెల్ల.”
నని యింద్రుఁడుర్వికేఁగినను దూర్వాసుఁ
జెనకి యాతనిచేతఁ జేటొందినట్టి
విధమంతయును విన్నవించిన, నపుడు
మధుదైత్యమథనుఁ డామఘవునీక్షించి:
“యేమి దేవేంద్ర, నీవెఱుఁగవే యకట!
యామూర్ఖు (నతి) క్రూరుఁడని జనుల్ వలుక.
పిన్నబిడ్డవె నీవు! పెరిమె వెన్నడచి
నిన్నింక బుద్ధులు నేర్పెదమన్న!
నొకరొకవేళ మాయున్నడకతఁడు
వికలుఁడై యున్నత్తవిధమునవచ్చు ;
నప్పుడు నేమెల్ల ‘నాకుటిలాత్ముఁ
డెప్పుడుపోవునో యిట’ యని యాత్మ
జలదరింతుము ; గాని, స్వస్థత మదికిఁ
గలుగ దాతపసి దిగ్గనఁ బోవుదాఁక.

---

1. నైకసుర. (మూ)

పట్టిచంపఁగరాని పగఁదెంపరాని
యట్టిచందంబున నతఁడుదుర్లభుఁడు.
విడువుశోకము ; 'బండివిఱిగినవాఁడె
కడువెట్టివాఁ' డనఁగాఁ బోలదింక.
సొమ్ము వోనాడినచోటికె యరిగి
క్రమ్మఱ సాధించి కాంచినభంగి,
జడనిధిలో సమస్తముఁ గూలెఁగాన
మడవక యవ్వార్ధి మథియింపవలయు. —
కవ్వంబు మంథనగంబుగా, దాని
కవ్వాసుకియె సూత్రమై యుండుటొప్పు.
సమరులు బలహీనులై యున్నవారు ;
తమకంబుతో నబ్ధిఁ దరువంగ లేరు.
సరవితో నొకప్రయోజనమైనయపుడు
బిరుదేది పగఱతోఁ బ్రియమాడియైనఁ
జేకూరఁ గార్యంబుసిద్ధించినపుడు
పైకొని వైరంబు పాటించుటురవు ;
కావున, నరిగి రాక్షసకోటితోడ
వేవేగ సంధిగావించుట యొప్పు.
వారు మీరునుగూడ వార్ధిమథన
మారూఢిఁ గొనసాఁగు ; నగుఁబనులెల్ల."
ననిపల్క, యాదేవుఁ డప్పుడు ధిషణు
దనుజనాయకులయొద్దకుఁ బోవఁబనిచి,
గొనకొన్న వేడ్కతోఁ గొలువుచాలించి,
[1] ..............................
సదమలాత్ముల మునీశ్వరుల నందఱను
ముదముతో నాశ్రమంబులకుఁ బోఁబనిచి,

1. ఇట్టిచోట్ల ప్రాసాక్షరమునుబట్టి 'పాదములేవేని లుప్తములైయుండునేమో' యను సందేహమునకువీలున్నను, పూర్వాపరార్థసందర్భములు సరిపోవుటచే, నొక ప్రాసమును కవి మరచెననుటకును అవకాశమున్నది.

కరచతుష్టయమున ఘనశంఖ చక్ర
వరగదా నందక ప్రకాశంబు వెలుఁగఁ,
ప్రాతరంభోజాప్తు భాతిఁ గిరీట
మాతతకాంతుల నమరి దీపింపఁ,
దొలఁగక రవియుఁ జంద్రుఁడు ప్రకాశమునఁ
దెలివొంది కనులనుద్దీప్తిఁ బొల్పెసగ,
నమలినపీతాంబరాంచలద్వయము
కమనీయగతి రెండుగడలఁ దూఁగాడ,
హార కిరీట హేమాంబ రాభరణ
చారుభూషణ విభాచ్ఛటలు శోభిల్ల,
ఫణికులేశ్వర యక్షపతులు సద్భక్తి
మణిమయచ్ఛత్రయుగ్మము ధరింప,
నెమ్మి నీశానుండు నిర్జరేశ్వరుఁడు
ప్రమ్మి ముందఱ బరాబరి సేసి నడువ,
వరుణదేవుఁడు గంధవహుఁడుఁ గా [1] లూఁది
వరుసలోఁ దుత నాలవట్టముల్ వైవఁ,
బ్రకటించి యముఁడును రాక్షసేశ్వరుఁడు
[2] నకుటిలమతితో జయముపెట్టుచుండ,
నరవిందసంభవుం డర్థిమై వెనుక
గురుతరభక్తిమైఁ గొలిచి యేతేఁ,
నుగ్రతేజులు ప్రతాపోగ్రమానసులు
నిగ్రహానుగ్రహనిపుణులౌ మునులు,
ఘనయశులైన కింకరులసంఖ్యములు
నెనసినభక్తిమై నెనసి సేవింప,
బ్రహ్మాండచయములఁ గాలింగునట్టి
జిహ్వాగళాయి యాశ్రితరక్షకొఱకు

1. కాలాది. 2. సకుటిలమతితోడ జయపెట్టుచుండ. (మూ)

నంచితలీల దుగ్ధాంభోధికడకు
నేంచేయఁగాఁ, గాంచి వెస నబ్ధిరాజు
తడయక యాచక్రధరునకు నొసగ
వడి నర్ఘ్యపాద్యముల్ వరుసతోఁ గొనుచు
నెదురేఁగి పూజింప, నెలమి నాహరియు
ముదముతోఁగొని యాసముద్రమన్నించె.

బృహస్పతి రాయబారము

అయ్యవసరమున, నట బృహస్పతియుఁ
జయ్యన నేఁగి యుజ్జ్వలనీతిశాలి
బలి కాలకేయోగ్ర బాష్పల భీమ
[1] నల విప్రజిత్ శకంధర తీవ్ర నముచి
పనస బిడాల శంబర శతమాయు
లనువారు మొదలైనయసురనాయకులఁ
బొడగాంచుటయును, నప్పుడు వారెల్ల
నుడుగనిభక్తిఁ బ్రత్యుత్థితులగుచు:
"ననఘచరిత్ర, నీయరుదెంచినట్టి
పనియేమి? దయ మాకుఁ బన నానతీవె!"
నావుడు, నాదైత్యనాథులతోడ
నావిబుధాచార్యుఁ డనియె నేర్పెసగ:
"అమరవల్లభుఁడు మీయందఱితోడ
సముచితముగఁగూడి చరియింపఁదలఁచి,
పవిపాణి మీతోడఁబలుకుమన్నట్టి
వివరంబు చెప్పెద; వినుఁడు మీరెల్ల:
'తాము మేమును నన్నదమ్ములమయ్యు
నీమాడ్కి నన్యోన్య మీసుగానేల!
[2] జగతి నేప్రొద్దో గోచారాన మనకు
జగడంబువచ్చినఁ జనునెపాయంగ!

---

1. నలివిప్రజిత్తకందర. 2. జగతిపై ప్రొద్దు గోచరమున మనకు. (మూ)

నత్తఱి సురలు నయ్యసురులుఁ గదిసి,
క్రొత్తగాఁ బరిరంభ కుశలప్రసంగ
వందన ప్రియవచో వ్యాపారలీలఁ
గ్రందుగాఁ జెలఁగి యుత్కటహర్షులైరి.
అప్పుడు హరియు, బ్రహ్మయు, సురాసురులు
నొప్పుగా మంథాద్రియొద్దకు నడచి.

### సముద్రమథనము.

రయ్యెడ విష్ణుండు నంబుజాసనుఁడుఁ
జయ్యన సమ్మహాచలము భేదించి,
శేషుననుగ్రహించిన నాతఁడలరి,
భీషణతరమైన పృథివీధరంబు
నతిసత్త్వయుతి దీర్ఘమైన పుచ్ఛమున
వితతంబుగాఁ బెల్లువేష్టించి పట్టి,
పెకలించె; నప్పుడు ఫెళఫెళధ్వనుల
సకలజగంబులుఁ జలియించిచెదరె.
నప్పర్వతము పాఁతునందుఁ గన్పట్టి
తప్పక సప్తపాతాళంబు దోఁచె.
ఆరీతి శేషుఁ డయ్యచలమెత్తుటయు,
నారూఢి దివిజులు నసురులుఁ గూడి
తడయక దాల్చుసత్త్వముగానకున్న
యెడ, వారిజవసత్త్వమెల్లఁ దూలుటయు,
వారలకపుడు సత్త్వంబును జవము
నారాయణుండు సన్మతిఁగృపసేయఁ, —
బొలిచి వా రతిరయంబున నద్రిఁదెచ్చి
జలనిధిలోన భీషణభంగివైవ,
గుభులుగుభుల్లను ఘోషంబుతోడ
రభసంబుమై శిఖరంబుల వ్రేళ్ల

వెసఁ బెక్కుజనయించి[1] వివిధవృక్షములు
పసచూపె నాకాశభాగంబునందు.
అత్తఱి వాసుకి పన్నగంబునకుఁ
దత్తరంబునఁ దరిత్రాడుగాఁ జుట్టి,
యమరులుపుచ్ఛంబు, నసురనాయకులు
సముదగ్రగతి ఫణజాలంబుఁ బట్టి,
యుఱుగనికడఁకతో నొండొరుఁగడప
వడి సముత్సాహ దుర్వారులై తరువ,
నాధారహీనమై యప్పుడామథన
భూధరేంద్రము బుడబుడరవముతోడ
నడఁకి పాతాళంబునకుఁ గ్రుంగిపోవ
నదరి విష్ణుఁడు కూర్మమై యదిదాల్చె.
అతులప్రమోదులై యమరదానవులు
ధృతి నంబురాశిమథించున వ్వేళ,
శరనిధి మథన ఘోషము నింగిముట్టి
యురుతరమగు భారం ముర్వికిఁబుట్టె.
సురవిద్విషామర స్తోమార్భటములు
పరువ నాశామదావళములు[2] మ్రొగ్గ.
గరిమతో మథనవేగంబున, నెగసి
యురవడి దట్టమై యుదకబిందువులు
నెఱసికప్పిన, గశ్మి సిగుడఁగఁ జేసి
పరఁగ భానుఁడు మాఁగువడి మింటనిలిచె;
పొలుచు వాసుకి మొగంబునఁ బొగల్ వెడలె;
నిలువక మంటలు నిగుడి మిన్నంటెఁ;
దగ జవంబులుమాని దనుజగీర్వాణు
లగణితవిషవహ్ని నతిభీతులైరి.

---

1. విశద. 2. వ్రాగ (మూ).

అప్పుడు గనుఁగొని యార్త్తసంరక్షుఁ
డప్పురుషోత్తముఁ డమరదైత్యులకు
నతిజవసత్త్వంబు లగ్గలంబొసఁగ,

## హాలాహలోత్పత్తి

ధృతిమీఱి యప్పుడు దేవసంఘంబు
లాదానవులకంటె నధికసత్త్వంబు
తోఁ ద్రచ్చుచుండఁ, బాదోర్బలాటోప
భీకరమథన సంభృత దీప్యమాన
లోకభయంకరాలోల విశాల
తర విస్ఫులింగోగ్ర దర్పిత [1]జ్వాల
లురుతరంబుగ మండి యుద్విస్ఫరించి
రయోత్కట జగములాహుతిఁగొనఁజాలు
నకాలకూటమహాగరళంబు
బలువిడి ప్రభవించి పెల్లేఁగఁ జూచి,
నలుఁగడ దేవదానవులెల్ల బ్రమసి
పాఱంగ, నప్పు డాపన్నగశాయి
వారలతో నొక్క వాక్యమిట్లనియె:
"వెఱవకుఁ, డిప్పు డీవిషవహ్నిభయము
కఱకంఠుచేఁగాని కడతేఱిపోదు;
చని, యుమ్మహాదేవు శరణంబు వేఁడుఁ."
డనిన, బ్రహ్మయును దేవాసురావలియుఁ
గదువేగ రజతనగంబునకేఁగ,
[2]. . . . . . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . . . . . .
గజకర్ణ శార్దూలకర్ణాశ్వకర్ణ
విజయ ఘంటాకర్ణ విహాళగోకర్ణ

1. జ్ఞాల. (మూ) 2. గ్రంథపాతమైయుండును.

ద్వాదశాదిత్యులు, పదిరుద్ర[1]సంఘ,
మాదినవబ్రహ్మ, లష్టవసువులుఁ,
దుంబుర నారదాదులును గీతామృ
తంబుల నెయ్యంబుదనర నోలార్పఁ
గదు వేగమునఁ బోయి, కంజభవాదు
లడరు వేడుకఁ గొలువై యున్నశంభుఁ
గనుఁగొని, ప్రణమిల్లి, కరములు మొగిచి
వినుతించి: "శంకర, విశ్వ, లోకేశ,
అభయంబు గౌరీశ! యభయంబు దేవ!
అభయంబు ఫాలాక్ష! యభయంబు రుద్ర!
అభయంబు పురహారార్చిత పాదపీఠ!
అభయంబు [2]సూర్యచంద్రాగ్నిలోచనుఁడ!
కాలకూటోదగ్ర గరళాగ్నివలనఁ
జాలభీతిల్లి నీశరణుచొచ్చితిమి.
అమ్మహావిషవహ్ని నడఁగించి, కరుణ
మమ్ము రక్షింపుము మదనసంహార!"
అని యార్తులగువారి కభయంబులిచ్చి,
మనసిజారియు సభామధ్యంబు వెడలి,
క్రొన్నెల మకుటంబుకొనఁ జెన్నుమీఱ,
మిన్నేఱు జడలలో మేకొనితూలఁ,
బేరురంబున సర్పపేరు నర్తింప,
గారవంబున [3]సర్పకటకంబు లమరఁ,
బూని భస్మంపుమైపూఁత రాగిల్ల,
మానిత సింహచర్మము కటినమర,
నతిసమున్నత వృషభారూఢుఁడగుచుఁ,
దతధంగిఁ బ్రమథులు తన్ జేరికొలువ

1. సంఖ్య-లా. 2. శశిరవి యగ్నిలోచనుఁడ. 3. సప్త. (మూ)

విచ్చేసి, యంబికావిభుఁ డుగ్రభంగి
వచ్చునాగరళంబునలను వీక్షించి,
నవ్వుచు నప్పుడు నతపాణివద్ద
మవ్విషమునకెదురగునట్లు చాఁపఁ,
బరికించి విరిదమ్మిపై వ్రాలు తేఁటి
కరణిఁ దద్విషము తత్కరముపై వ్రాలె.
అంగజాంతకుఁ డప్పు డవ్విషానలము
నంగదఁగబళించి యుదరిమ్రింగుటయు,
భువనంబులలరె; నప్పుడు వారలెల్ల
శివుఁ బ్రశంసించిరి చెలఁగి షల్దాఘు.
అవలీల వెండియు నసురులు సురలు
జవముదీపింప నాజలరాశిఁదరువ,

## ఐరావతాద్యుత్పత్తి

సురపతిప్రముఖులు చూచి మోదింప,
గరిమతో నప్సరల్ గనుపట్టె; రంత
నైరావతము, దేవహయమును, గల్ప
భూరుహపంచకంబును, సుధాకరుఁడుఁ
ద్రిదశేంద్రధేనువు, దివిజరత్నంబు
ముదముతోఁ గౌస్తుభంబును దోడుతోడ
నుదయించె; హరికృపనొందినవారి
కొదవుసంపద లిప్పుడొదవినకరణి.
సొరిది శృంగారవిస్ఫురణ రెట్టించి,
కరమునఁ బూదండఁగడఁక ధరించి,
కరుణారసం బర్థిఁ గనులధరించి,

.........................

పాలిండ్లకొలపుగాఁ బైఁట గీలించి,
లీలఁ బేదల మొరాలించి లాలించి,

నవనిధానములు నన్నతిఁ గొల్వఁ బొంచి,
భువనంబులెల్ల నప్పుడు వెలిఁగించి,
లాలిత జఘనవిలాస సంపత్తి
మై లక్ష్మి యుదయించి యబ్జాక్షుఁ గాంచి,
మందస్మితోత్సాహ మడరి వేడుక
నిందిర యక్కృష్ణు నెమ్మిఁ జేరి,
బింకంపుఁ బ్రియమును బ్రేముడియు నొఱపు
సంకురింపఁగ రెప్పలల్లార్చి చేఁ
తనచేతి మందారదామ మాదటను
ననువార నద్దేవునురమున వేయుటయుఁ,
జెలువారె నీలాద్రిశిఖరంబుఁ జుట్టి
మలసిన తారకామాలికకరణి.
అంత వాణియు, గిరిజా, [1]శచి, దేవ
కాంతలు, దానవాంగనలును చూచి
భాసిల్లఁ గళ్యాణపాటఁ బాడుచును
సేసలు వెట్టి రూర్జితవైభవమున.
శూలియు నాత్మిచూలియు నొక్క-
చో లీలఁ బంకజాక్షుని దాసియుండ,
నాపయోధీశ్వరుఁ[2] డమలోదకముల
నాపద్మనేత్రు పాదాబ్జముల్ గడిగి,
యమగురుఁడు కన్యావరంబు
క్రమముతోఁ బరియింపఁగా ధారవోసె.
అటమీఁద శోభనవ్యాపారమెల్లఁ
బటుభంగితోఁ గొదవడక సాగంగ,
గురులీల నాజగద్గురునివాహ
మరుదార భువనత్రయాధారమయ్యె.
ఆమాధవునకుఁ దోయధిపల్లభుండు
భామనోహర కౌస్తుభాభరణ మొసగె.

---

1. శచీదేవి. 2. నమరలోకముల. (మూ)

అచ్చరల్, సురధేను, వైరావతంబు,
నుచ్చైశ్శ్రవంబు, దివ్యోర్వీజములును,
చింతామణియు సురశేఖరుకొసగె.
[1] నంతఁ ద్రిమూర్తులు నబ్ధినిఁబొగడ,
నయ్యెడఁ బ్రమథు లాయ్యనరాఁగ, హరుఁడు
చయ్యన విష్ణుకంజాతసంభవుల
వీడ్కొని, సురలెల్ల వినుతించిమ్రొక్క
వేడ్కతో నేఁగె నవ్వెండికొండకును.

## అమృతోత్పత్తి

వెండియుఁ దరువ, నవ్విషధిమధ్యమున
నుండి ధన్వంతరి యురుకాంతిశాలి
ఘనతరంబగుసుధాకలశంబు చేతఁ
గొని రాఁగఁ, జూచి రక్షోనాథులెల్లఁ :
"గలిగిన వస్తుసంఘములెల్లఁ దారె
బలువిడిబొఱరె పాల్లు గైకొనియు!
నిదియైన మనము గ్రహింత;" మటంచుఁ
గుదిసి తత్కలశంబు గొనిరింపుతోడ.
అప్పుడు వెలుఁగు నత్యంతదైన్యంబు
గప్పి, నిశ్చేష్ట మొగంబులువాంచి
యున్న దివ్యుల హరి 'యోడకుం' డనుచుఁ,
గ్రన్నన మాయాప్రకారసంవేది
యొక్కకృత్రిమరూప మొనరు వధూటిఁ
దక్కకకల్పింపఁ [2] దలఁచి, తాఁ గాంతిఁ
[3] బొలుచు మోహనరూపమును, విభ్రమంబుఁ
దళుకొత్తఁ [4] జక్క గాంతారూపుదాల్చి,

---

1. అంతఁ ద్రిమూర్తులు నబ్ధులు సురలు-నయ్యెడఁ బ్రమథు లెయ్యెడహరుఁడు.
2. తనరు తత్కాంతి. 3. గలిగి. 4. చక్రి. (మూ)

పయ్యెద వెడఁజారి పాలిండ్లు దోప,
నొయ్యారికచభార మొయ్యొయ్యఁ గదలఁ,
జరణనూపురములు ఝణఝణ మ్రోయ,
గరిమతో రత్నమేఖలమాల పొలయఁ,
దనుఁ జూచి దివిజులు దనుజులు మతుల
నెనసిన భ్రమఁ జేష్ట [1] లేది యాత్మింప,
నల్లనల్లన దానవావలిఁ జేరి
పల్లవాధర మృదుభాష నిట్లనియె:
"వీర దానవులార, వినుఁడు మీలోన
నీరీతి నపనమ్మికేటికి [2] వి'ఁడు;
తడయక, యీయమృతంబు నాచేత
నిడుఁడు; నేఁ బంచెద నెలమి నేర్పొదవ.
నేను వడ్డించిన నెవరు మాటాడఁ
గా నోరులాడునె! కడఁకతో మీకు
వెడ్డు మీఱఁగ, మాఱు వేడక యుండ,
వడ్డింతుఁ; గరలాఘవంబు గన్గొనుఁడు;
లెం." డన్న, నప్పుడు దేవతారాతి
మండలి యమ్మాయమగువమాటలకు:

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

"[3] జన నిరో, జవదాటఁజాలము నేము;
వనిత, నీ వేరీతి వడ్డించి తేని
మనముల నదియెల్ల మాకు సమ్మతము
కొ." మ్మని యమృతంపుఁగుడ నిచ్చుటయుఁ,
గొమ్మ సంప్రీతిఁ గైకొని చేతఁ బూని:
"బంతిసాగుఁడు దేవతలు దానవులు;
వరుసతోఁ దరువాత వచ్చి వడ్డింతు".

1. లేది. 2. వినుఁడు. 3. జవరాని. (మూ)

ననుకాంతపలుకుల కసురులుఁ బుణ్యా
జనులును బంతులై సాఁగికూర్చుండ,
నమరేంద్రుఁడాదిగా నమరదిక్పాల
సమితికి, సకల నిర్జర సంఘములకుఁ,
గడఁగి కుతుకబంతిగాఁగ నయ్యమృత
మొసఁగ నెంతయు ముదము నేపారఁ,
గని రాహువనువాఁడు గ్రక్కున నమర
తనుయుక్తుఁడై దేవతాకోటిలోన
ననువారఁ గూర్చుండి యమృతంబుఁ ద్రావఁ,
గని, సుధాకరుఁడును గమలమిత్రుఁడును
దానవారాతికిఁ దద్విధంబెల్లఁ
బూనిచెప్పుటయు, నప్పురుషోత్తముండు
గనుఁగొని సుధ కుతుకకుఁబోకమున్న
తనచక్రమున రాహుతలఁ ద్రుంచివైచె.
సొలవక యమృతంబు సోఁకుటఁ జేసి
తల వృద్ధిపొంది తత్తనువుర్విఁబడియె.
అదియాదిగాఁ, రాహు వర్కేందువులకు
వదలక శత్రువై వర్తింపుచుండె.
అసురులు తమచేతి యమృత మీభంగి
విసువక విష్ణుండు విబుధులకిడిన,
నలుకదీపింపంగ నతికోపులగుచు
బలియులై బలిముఖ్యబహుదైత్యపతులు :
"ఓసురలార, మమ్ముఁ జకరప్పించి
బాసదప్పఁగ మీకుఁ బాడియె తలఁప!
నన్నియులెస్సాయె! నందుకేమాయెఁ!
బన్నుగా మావంకఁ బాపంబులేదు.
బీరంబుగా నాజిఁ బ్రీతిఁ గాలూఁది
పోరాడుఁ; డిట్టటు పోసియుమింక.

## సురాసుర సమరము

ననుచుఁ గోపాటోప మందందపొలయు,
ఘనబాహుశౌర్య హంకారంబు లడర,
రథ రథ్య సుభట వారణముఖ్య చటుల
పృథుల[1] పదాహతిఁ బృథివి గంపింపఁ,
బణవ భేరీ దివ్యపటహాది వాద్య
రణనచే నాశాంతరంబులు వ్రయ్యఁ,
జండ[2] నిశాత భీషణ హేతిచయము
మండుచు భానుబింబముఁ గప్పిపాఱ,
దారుణసింహనాదములచే నభము
బూరటిల్లఁగ, రయంబునఁ గిట్టి కినిసి,
శర శూల తోమర శక్తి శార్ఙ్గయు
పరశు గదాంకుశ ప్రాసాగ్ర ముసల
భిండివాలముల నాభీలసంరంభ
చండాంశులగుచు నిర్జరులఁ దాఁకుటయు,
వారును గడఁగి దుర్వారప్రతాప
సారులై పోరాడుసమయంబునందుఁ
గుదియుక శరముల గుదులుగ్రుచ్చియును,
మదమున గదలచే మడియమోఁదియును,
జదియంగ గజములచేతఁ ద్రొక్కించి
బెదరిపాఱఁగఁ గడుబిట్టదల్చియును,
గడలచే గ్రుచ్చి యాకసమునకెత్తి
నడుములు దునియంగ నఱికివైచియును,
బిడికిటిపోట్లను[3] బిమ్మిటి గొలిపి
తడఁబడ ముసలఘాతముల నొంచియును,
అంకుశంబుల గుండె లగలఁదీసియును,
డొంకెనపోటుల డొల్లదీసియును,

1. రాథవాహన. 2. నిశాటహోషణ. 3. బిమ్మట. (మూ)

అతులితోజ్జ్వల శిలాహతులఁ జంపియును,
ధృతి శూలశక్తులఁ దొడరఁ గూల్చియును,
ప్రాసఘాతములచేఁ బ్రాణముల్ గొనియు,
నీసునఁ గుంతాల నెదిరి మోఁదియును,
భిండివాలములచే బీరుమాన్పియును,
దండితోమరముల ధరణిఁ గూల్చియును,
అదటుతో నుభయసైన్యంబులవారుఁ
గదనంబు మిగులభీకరముగాఁ జేయ,
నప్పుడు బలము ధైర్యంబు జవంబు
తప్పక పొదవినదనుజయూథంబు
లరవాయిగొనక యాయసురయూథంబుఁ
దఱిమిన, వార లెంతయు బలంబెడలి,
కష్ట [1]దుష్టావస్థఁ గడుభీతిఁబొంది
యష్టదిక్కులకును నటు పాఱిపోవఁ,
బరవశంబున మీఱి పాఱెడు సేన
వెఱవకుండని భేరి వేయించి, కడఁకఁ
బురుహూత శిఖి యమ పుణ్యజనేశ
వరుణ మారుత ధనేశ్వర వృషధ్వజులు
చలముతోఁ గరి మేష సైరిభ మనుజ
జలచర మృగ హయోక్షములపై నెక్కి,
తనరంగ బలశక్తి దండ కౌక్షేయ
ఘనపాశ కేతు ముద్గర కుఠారములు
ధరియించి, దనుజయూథంబుపైఁ గదిసి
దురమున నొప్పంగఁ, దూలి దానవుల
వారెల్ల నెదురనిల్వఁగలేక భీతిఁ
బాఱంగ, నిజసైన్యపటలి నీక్షించి
బల భీమ శతమాయ బాష్కల నముచి
నల కాలకేయ కంధరులుగ్రులగుచు

1. దురావస్థ. (మూ)

సురవడి పనిసేయుచున్న నిర్జరులు
యరదంబులెదురుగా నడరి తోలించి,
పఱచు సేనలఁ గూడఁబఱచి, ²ధైర్యంబు
మెఱయఁ గొండలఁగప్పు మేఘంబులట్లు
లశితోగ్ర దృఢ ముష్టిలాఘవోత్కృష్ట
బలశౌర్యములు మీఱ బాణజాలములఁ
గప్పి, స్రుక్కించి, యఖండశౌర్యమ్ము
లుప్పతిల్లఁగ నింగియదరఁ బెల్లార్చి,
యంతటఁబోవక యమరవల్లభుని
దంతితోఁగూడ మదంబుదక్కించి,
యనలుఁ బొట్టేలితోఁ బడగంటఁదోలి,
యెనుబోతుతో యమునేఁ బ్రదూలించి,
నరునితో నిర్ఋతిమానము తూలపుచ్చి,
వరుణు నక్రంబుతో వడిఁ బాఱఁదోలి,
పవమాను నిఱ్ఱితోఁ బట్టిభంగించి,
తవిలి యశ్వమ్ముతో ధనదునిఁబఱపి,
యెద్దుతో నీశాను నేపడఁగించి,
యద్దెసఁజిక్కిన యమరులఁ బదుప
గర్వితులైన రాక్షసులు[1] ననికి
నోర్వక వెసఁ గాఱుచున్న యావేళ
నమరులఁజూచి, కరుణాగుణోల్లాస
మమర 'నోడకుఁ' డని యభయంబులిచ్చి,
చక్రంబు నురుదివ్యశరచాపములును
విక్రమంబునఁ బూని, విమతులు చెదర,
నతి ²కుపితాత్ములై యసురవర్గంబు
³సంహారమొనరింప, సకలరాక్షసులు
విహ్వలులై పాఱి విపధిలోఁబడిరి.

---

1. సైన్యంబు. 2. కుటిలాత్ములై. (మూ). 3. "నరనారాయణులు" అను కర్తృపదము అధ్యాహారము.

ఆవేళ బ్రహ్మయు, నమరసంఘంబు,
నావీరవరుల నారాయణు నరుసఁ
బలు తెఱంగులఁ బ్రీతిఁ బ్రస్తుతిచేసి;
కెలమితో భువనంబు లెంతయు సలరె.
అమరు లప్పుడు ప్రమోదాత్ములై మించి,
రమర శేషుఁడు మంథరాపనీధరముఁ
గొనిపోయి, తొల్లింటికుదురుపట్టున నె
యనువార నిలిపె సత్వాన్వితుండగుచు.
అయ్యెడ, సురలెల్ల నాసుధారసము
చయ్యన మంథరాచలమున దాఁచి,
కడుజతనంబునఁ గాలిపెట్టి,
తడయక యా రమాధవుని సేవించి
నడవ, నద్దేవుఁ డున్నతవైభవమ్ము
పొడమఁగ వైకుంఠపురమున కేఁగి,
యరయ నబ్జజ సురేంద్రాదుల నెల్లఁ
బురడించి నిజపురంబులకుఁ బోఁబనిచి,
మానుగా శ్రీవధూమణితోడఁ గూడి
పూని లోకంబు లింపుగ నేలుచుండె.
అజుఁ డంతఁ దనదు [1] సత్యలోకమునకు (?)
నజితసౌఖ్యంబుతో నమరులుగొలువ,
విచ్చేసి, యమరులవీక్షించి, కరుణ
నచ్చుగా వేర్వేఱ నర్థి వీడ్కొలిపి,
శారదాసహితుఁడై సకలసౌఖ్యములు
మీఱ లోకములు నిర్మింపుచునుండె.
పరఁగ నింద్రుండు దిక్పతులెల్లఁ గొలువఁ
దిరముగా నమరావతీపురి కేఁగి,

1. సత్యా. (మా)

యకలంక శోభనాయతిఁ దొంటియట్లు
సకలసౌభాగ్యవిస్తారమై వెలయు
నమరావతీపురి నభిషిక్తుఁడగుచుఁ,
గమనీయ భోగసౌఖ్యంబులచేత
నలఘుసంతోషుఁడై యఖిలదిక్పతులఁ
బొలుపార నిజపురంబులకు వీడ్కొలిపి,
పౌలోమియును దాను భాసిల్లఁగూడి
లీలతో దివము పాలింపుచునుండె.

### కద్రూవినత లుచ్చైశ్శ్రవముఁ జూచుట

ఆరీతిఁ గలశాబ్ధియందుద్భవించి
భూరివిఖ్యాతితోఁ బొలుపొందునట్టి
వాసవతురగంబు వనరాశిపొంత
భాసురగతిఁ జరింపఁగ, నొక్కనాఁడు
వినత కద్రువయు సద్వినుతచారిత్ర
మున యథేచ్ఛవిహారమునఁ జరియింపఁ
దలఁచి, వేడుకమదిఁ దరుణులయ్యెడను
వెలయంగ సఖులు సేవింప, నుత్ఫుల్ల
కుసుమపరాగ సంకులలసద్భ్రమర
[1] కిసలయాహార కోకిలశుకధ్వనుల
వలనొప్పుచున్న యవ్వనిఁ గేళి వేడ్క
సలుపుచు, నొండొండ జలజలోచనలు
చతురతదీపింపఁ జయ్యననరిగి,
క్షితి [2] పతిచేలంబు, జితకిల్బిషంబు,
గ్రావాశ్రయంబు, గీర్వాణాశ్రయంబు,
శ్రీవరు శయన సుస్థితి నివాసంబు,

1. విసరకాసారకోకిల. 2. పతిచెల్వంబు, (మూ)

నవనవరత్నజన్మప్రదేశంబు,
భువనసంస్తుత పుణ్యభువనాకరంబు,
క్రూరకర్కటసంఘ కుగ్రాహకంబు,
ఘోరాహి మకర [1]కుర్కుర దర్దురాది
యాదోన్వితంబు, మర్యాదాన్వితంబు
నై [2]దట్టమైన బృహత్తరంగముల
నాదవి, పెల్లొదవునయ్యుదకబిందువులు
[3]చదునైన ముత్యాలసరములు గాఁగఁ,
గమలంబులకు మూఁగు గండుతుమ్మెదలు
సముచిత నీలకేశంబులు గాఁగఁ,
[4]గలఁకమైఁబొదలు చొక్కంబైన నురువు
పొలుపైన వెలిపట్టుపుట్టంబు గాఁగఁ,
గడఁకతో వాహినీకాంతలు దన్నుఁ
గదునెయ్యమునఁగొల్వ గంభీరయుక్తిఁ
దనరు నంభోరాశితటమున మెలఁగు
వననిధిజసిత గీర్వాణహయంబుఁ
గని, చోద్యమంది, యాకద్రువ వినతఁ
గనుఁగొని పల్కెను గర్వవాక్యముల :
" అల్లద ! చూచితె ! యశ్వరత్నంబు ;
తెల్లచంద్రికఁదెగడు దేహంబుతోడ
లాలితంబైన వాలప్రదేశమున
నీలమైయున్నది నెఱిఁజూడు ". మనినఁ
గనుఁగొని, నవ్వి, యాకద్రువతోడ
వినత యిట్లనియెఁ బ్రవీణతతోడ :
" ఏ తెఱంగునఁజూచితే తురంగంబు !
బ్రాఁతిమైఁ దారహారంబులపొలుపు,

---

1. దుర్దుర. 2. దట్టమై ద్రుహంతారంగములను. 3. చదురులై.
4. గదలమై. (మూ)

హార పటీర నీహార మరాళ
శారదా నారద చంద్రికాకాంతిఁ
గైకొని, నిష్కళంకంబగు మేన
నేక్రియ నల్పు! నీవెక్కడఁగంటి!"
వనవిని, కద్రువ యప్పు డావినతఁ
గనుఁగొని మఱియుఁ దక్కకయిట్టులనియెఁ:
"తెలిఁగన్నుఁదోయి ఁజెందినయట్టి నలుపు
పొలుపున, శశిమేనఁబుట్టినకందు
లాగున, నీలవాలము శుభ్రతనువు
బాగుమీఱినయది పలుకులేమిటికి!
సొలవక నిజముగాఁ జూచి, వాలమున
నలుపులేదని నీవు నాతోడ నొక్క
పన్నిదంబాడుము పంతంబుతోడ;
నున్నమాటలునుగా నోడఁబాటుమనకు".
ననవుడుఁబ్రియమంది, యప్పుడవ్వినత
తనమాటగెలుపు తథ్యంబనికడఁగి:
'పడఁతి, నీచెప్పిన పన్నిదంబునకు
నొడఁబడితొద'. నన్న నుదరికద్రువయు:
'లలితాంగి, హయమువాలము శుభ్రమైనఁ
దలఁగక యే నీకు దాసినౌదాన;
నలుపుగల్గినయేని నాదాసివగుము;
తలకొంటి; యీమాటఁదప్పకు'. మనిన
నట్లకానొడఁబడి, యప్పుడావినత:
'యట్లైన నచ్చోటికరిగి యాహయముఁ
గదిసి వీక్షింతముగాక ర.' మ్మనినఁ,
జెదరక దానివీక్షించి యిట్లనియె:
'వేఁడిమిమందమై వెలుఁగుభానుండు
వాఁడె యస్తాద్రిపై వ్రాలుచున్నాఁడు;

గావున నిదివేళగాదు ; వే మగుడి
పోవుటమేల యీప్రొద్దున ; కింకఁ
బోదమురఁ.' మ్మని పొలఁతుకఁ గూడి
యాడట నింటికినరిగె నవ్వినత.
అంతలో సూర్యుండు నస్తాద్రికరుగ,
సంతసంబునుదక్క జలజసంఘంబు,
తమవల్లభుఁడు లేమిఁదలఁచి, యుల్లమున
[1]రమణేది కందిన క్రమము దీపింప,
మూఁగినషట్పదంబులు లోనఁజిక్క
నాఁగుచు ముకుళించె నమరఁజిత్రముగ ;
తమమీఁదఁ జంద్రుఁడు దాడివచ్చుటయుఁ,
దమసామరారి యుద్ధము సేయఁదివిఱి
వాఁడిములుక్కులతోడ వరబాణసమితి
పోఁడిగాఁగూర్చిన పొలుపుదీపింప.
'పగలెల్లఁదిరిగి మాపటి కస్తశిఖరిఁ
దగఁ బ్రవేశించెఁ బతంగుఁడు ; మనము
నతని పేరిటివార ; మటుగాన, దిరుగ
మతముగా ;' దని గూండ్ల మఱి పక్షులడఁగె.
'కద్రువకిష్టంబుగా వాలదీప్తి
ముద్రించి నాపెంపు మునుమిడిచూపి,
వినతనోడించెద వేవేగఁ బోయి'
అనివచ్చెనోయన, నంధకారంబు
కడుదట్టమై యిర్లుగదిసి యేతెంచె.
'తడయక ద్విజరాజు తగఁ బూర్వశైల
శృంగసింహాసనస్థితుఁడగు' ననుచుఁ
................................

1. క్రమహేది. (మూ)

జనుదెంచి పొల్చినచందంబు దోప
వినువీధిఁ జుక్కలు వెలుఁగుచునుండె.
'వినతగన్గొనువేళ విబుధహయంబు
గనుపట్టియుండె నీక్రమమున' ననుచుఁ
బూర్వదిక్కాంత నేర్పున రచియించి
పర్వెఁ జూపిన మంచుపగిది, కళంకు
బెరసి చంద్రిక మింటఁ బేరి సొంపెక్కె.
విరహులహృదయంబు వేఁపెసిమంట,
యలచకోరంబుల యామనిపంట,
కొలఁది నొక్కటఁ గళల్ [1]గూర్చుపదంట,
యీశుజూటంబుపై నేప్రొద్దు నుంట,
భాసిల్లు నలపంచబాణుని గంట
చంద్రుఁడు పొడిచె దిక్చక్రంబు వెలుఁగ
సాంద్ర నిర్మలతరజలధి యుప్పొంగ.
యామినీకాంత సాయంకాలవేళఁ
గామించి పొంచినగాఢభూతంబు
విడుపింప వెన్నెలవిభూది మేనఁ
గనుపొప్పఁగాఁ, గళంకపుఁదిలకంబు
నొనరంగఁ, బరివేషయోగపట్టియును
మునుమిడి నక్షత్రములసంకుపూస
లగణితంబుగఁ దాల్చి, యఖిలలోకములఁ
బొగడొందుచును జగత్పూజ్యుఁడై కళల
వృద్ధిఁబొందిన మంత్రవేదియై, భూప్ర-
సిద్ధుఁడై దగు మంత్రసిద్ధుఁడో యనఁగ,
బలువిడి నధికసంభ్రమ మగ్గలింపఁ
గలువలవిందు శీఘ్రంబున నెక్కె.

---

1. గూరచుతంట. (పూ)

## కద్రూకృత కపటప్రయత్నము

అప్పుడు కద్రువ యాత్మసంభవులఁ
దప్పక పిలిచి యందఱితోడఁ బలికె :
"తనయులుగల్గుట తల్లిదండ్రులకు
మును దారొనర్చినపుణ్యఫలంబు
లగు ; నైనఁ, దత్పుత్త్రు లతిబలశౌర్య
సుగుణగాంభీర్య విస్ఫురణరంజిల్లి
పితృమాతృభక్తిచేఁ బెంపొందిరేని,
సుతులని కొనియాడఁ జొప్పడు ; గాన,
వినుఁడు నే మిము వేఁడువిధము సర్వంబు
ఘనులు మీరందఱుఁ గడముట్ట నిపుడు.
నాతనూభవులార, నాగేంద్రులార,
మీతల్లి నేను నమ్మితి మిమ్ము నొకటి ;
సకలరూపంబులఁ జరియింపనేర్తు ;
రొకచోట నల్లనై యుండరే పోయి !
అమరులు నసురులు నంభోధిఁ ద్రచ్చి,
యమితనిర్మలమైన హయముఁ బుట్టించి,
దాని నయ్యంభోధితటినుంచి పోవ,
నేనును, వినతయు, నిటప్రొద్దుపోక
సవతిపొత్తునఁగూడి చరియింపుచుండి,
రవిక్రుంకువేళ వారాశితీరమున
నట్టిశ్వేతాశ్వంబు నల్లంతఁ జూచి,
యిట్టంటి వినతతో నే విచారించి :
'అల్లతెల్లని జవనాశ్వంబుతోఁక
[1]నల్లనై యుండెఁగా ! నవుఁగా లతాంగి !
యేఁగంటి' ; ననిన, 'నిహీ' యనినవ్వి :
'రాఁగదె పోదము రమణి, యచ్చటికి ;

1. నల్లనైయున్నది నవుగా లతాంగి. (మూ)

నేకంటఁజూచితి! విందేదినలుపు!
[1] నాకంటెనీకంటెనా! కంటిఁదెలివి'!
అని పక్షిమాత నన్నాడినఁజూచి,
వినతతోఁ 'గల' దంటి, వినత 'లే' దనియె.
నంత: 'నేఁజూపెద ; నటు చూపకున్నఁ
బంతమాడెద ; నీకు బానిసనగుదు ;
చూపుము మఱి నీదుచుట్టఱికంబు
[2] తేపు ; వెన్ దీయకు ; వ్రేయుముకరము'.
అనిపన్నిదము వేసి, యటపోయిపోయి,
దినపతిక్రుంకుచోఁ దిరిగివచ్చితిమి.
అగునల్లి జయమైన నపకీర్తియైన ;
నగుఁబాటు మాన్పరే ననుగటాక్షించి!
చని హయవాల మచ్చట నల్పుచేసి
చనుదెంచుమీరు ; వంచనచేయరేని
వినతకుదాసినై విహరింపవలయు ;
తనయ నాకోర్కుల నీడేర్పరయ్య!"
అని వేఁడుకొనుటయు, [3] నాయకార్యంబు
నొనరింపనేరక యొఱగొడ్డమాడి,
తమకించి చూపులఁదమవక్రగతులఁ
దమరోషవిషములఁ దఱచుగాఁజూపి,
వెనుకొని యందఱువెఱఁగంది : 'యిట్టి
పని యధర్మస్థితి భావించిచూడ ;
జామరో, యిటు సేయఁజనునె యెవ్వరికిఁ!
క్రమమొప్ప నెచట 'ధర్మోజయం' బనుచుఁ
బలుకువేదంబు లేర్పడ మున్నువినవె!
వలవదుతల్లి! నీవాక్యంబు నేము

1. నాకంటనీకంట నాకంట దెలివి. 2. త్రేపు నేదీనియు వ్రేయుముకరము.
3. నధ్యార్జశక్తి. (మూ)

వలసేది చేయనివారము గాము.
తలపోయఁ గపటకృత్యంబులనేఁత
బలిమిమిక్కిలి యిహపరహానిసేయు'.
........................
నని యధర్మంబున కందఱు నోడి
తనపంపుసేయక తగనూరకునికి
చూచి కద్రువ తనసుతులకిట్లనియె :
"నీచభావంబున నే నింక సవతి
దాసినై యుండుట తలపోయ మీకు
వాసితక్కువయు నేపంబునుగాదె!
అన్నదమ్ములు మీరలందఱు నిట్లు
మిన్నకుండిన నిటమీఁద నే నింక
నెవ్వరినడుగుదు! నెవ్వారుదిక్కు!
రెవ్వారు మీకంటె హితులు నాకన్న.
నకట! వేపురఁగన్నయట్టినాకిప్పు
డొకఁడైన నీపని కొదవంగవలదె!
తొడిఁబడ నొకకీడు దొడరినచోటఁ
దడవుసేయక దానిఁదప్పింపవలదె!
కైకొనిచేయుఁ డీకార్యమెట్లైన
నాకొఱ". కనుచు మానక వేఁడుకొనఁగ,
నప్పుడు తల్లితో ననిరి క్రమ్మఱను :
"దప్పులెన్నుటగాదు తల్లి, మాచిత్త
మెప్పుడీపనిసేయ ; నుచితంబుగాదు ;
తప్పదు పాపంబు తలఁపంగమాకు.
నీకుఁబ్రియంబని నిజములుకల్ల
లేక్రియఁజేయుదు! మిది మాకుఁదగునె!"
అని యిట్లుపలుకుచు నందఱుఁగూడి
చనఁజనఁజూచి, యచ్చలము రెట్టింపఁ,

కరుణయించుకలేక కద్రువయలిగి:
"గురుకార్యవిముఖులు క్రూరులు మీరు
నాపుత్త్రులని నేను నమ్మితిఁగాక.
యీపాత్త్రు లేమెత్తునే మత్తులార!
జనమేజయుఁడు సేయు సర్పయాగమునఁ
బనివడి భస్మమై పడుదురుగాక;"
అని శాపమిచ్చెఁ దాయక [1] పుత్త్రులకును.
ఘనతపఃఫలములు గడతేర, నపుడు
పెలుచ నీరీతి శపించిన, మదినిఁ
గలఁగి, యెంతయుభీతిఁ గర్కోటకుండు
శాపభయంబున సంప్రీతిదోప
నేపునఁ దల్లితో నిట్లనిపలికె:
'జనని, నీపంచినజాడ నేఁ బోయి
ఘనహయువాలభాగముఁ గప్పువాఁడఁ;
బెనఁగిచేసెద.' నన్నఁ బ్రియమంది యనుపఁ,
గొనకొని కర్కోటకుండేఁగి యపుడు
కామరూపమునఁ దురగమువాల మలమి,
రోమము ల్గడునీలరుచులఁ గావించి
కొనియుండె వేడ్కఁ గర్కోటకుం. డంతఁ,
గనుపట్టెఁ బూర్వదిక్కాంత భానునకు
మొనసి కానుక మొల్ల మొగ్గలబంతి
ఘనముగాఁ జేసినగతి వేగుఁజుక్క.
పొడిచినశశికాంతిపొదుపు లోలోన
నడఁగంగఁ, గుముదంబు లంత ముడుంగ,
భీతిఁ జీకటి కకావికలుగాఁ బాఱఁ,
బ్రీతి నిశాకాంత పెద్దకాలంబు

1. క్రూరులకును. (మా)

భోగింప రహిఁజెడ్డ ముత్యంబులనఁగ
బాగైనమించులఁ బ్రబలక తార
లొాగి నాకసమున నొండొండ యడంగ.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

మొదలిగ్రహంబు, త్రిమూర్త్యాత్మకంబు,
చదువులముద్ద, శాస్త్రంబులపెద్ద,
కమలాప్తుఁ, డేకచక్రరథస్థితుండు,

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

కాలచక్రం బవక్రతఁద్రిప్పుప్రోడ,

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

పద్మరాగపుసానఁబట్టి కెంపెక్కె.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

అప్పుడు కద్రువ, యావినతయును,
నొప్పుగా గెలుపులొండొరులు [1] పేర్కొనుచుఁ
[2] దలరి, యాందోళచిత్తాకులత్వమున
జలనిధితీరభూస్థలికి వేవేగఁ
జని, డాసిచూడ, నుచ్చైశ్శ్రవంబపుడు
గొనకొని కర్కోటకునిమాయవలన
సితదేహమున మహాసితవాలమునను
సతులమైయుండెను ; అప్పుడావినత
లజ్జించి: "మిగులనేలా మాటలింక!
నొజ్జయై విధి నన్నునొగి నింతచేసె!
అలసి, యనూరుశాపాధిదైవతము
కొలఁది కద్రువకనుకూలమై మాయ
పన్నుటనెఱుఁగక, పన్నిదంబాడి
విన్ననై వగలచే వేఁగంగవలసె."

1. వేడ్కొనుచు 2. తరలియాందోళచిత్తానుకూలమున. (మూ)

నసితలవాంచి, తా నాకద్రువకును
గానకొని నీతితోఁ గోరినపనులు
కాలూఁదనడలేక గైకొని మిగులఁ
దాలిమిఁజేయుచోఁ, [1] దరలెను బంచ
శతవత్సరములు. వేసటలేక యుండ,
మతిలోనఁ గౌతుకోన్మాదినై, యపుడు
పన్నగకులమాత పక్షీంద్రుమాత
నన్నక పనిగొని యేలుచునుండె".
అని యిట్లు జనమేజయక్షితీశునకు
మునిచెప్పె నని చెప్ప మోఁటంచి మునులు :
‘అనఘాత్మ, తరువాతనైన వృత్తాంత
మనువొందఁ జెప్పవే!’ యని వేఁడుటయును,
సౌమిత్రిసత్సేవ, సమరాంతచాప, (?)
రామ, గయాక్షేత్రరచనా విధిజ్ఞ,
శూద్రతపోవిఘ్న, సురకార్య [2] మగ్న,
యద్రీంద్ర రచిత మహాసేతుబంధ,
దశకంఠనాభి సుధాగ్రాహి విశిఖ,
దశరథ శాసనోత్సవ దత్తచిత్త,
ఇదినదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితాదిపర్వ నిర్మలకథయందు
నుచితమై యాశ్వాస మొక్కటియొప్పె.



1, దరలక. 2. విఘ్న. (మూ)

# ద్వితీయాశ్వాసము



శ్రీలక్షితాకార, శ్రితజటాభార,
లాలితగుణధామ, లంకావిరామ,
శరణనితలఁచు సంసారభీతులకు
వరములీనేర్చు దేవా! చిత్తగింపు;
అక్కథకుఁడు శౌనకాదిసన్మునుల
కక్కథాసూత్ర మిట్లనిచెప్పఁదొడఁగె:

## గరుడోత్పత్తి

"అత్తఱి నొక్కనాఁ డతివిచిత్రముగ
నుత్తుంగ[1] తైజసయోగాప్రమేయ
మయ్యున్న యండంబు నవిసిన, నందుఁ
జయ్యన సూర్యతేజఃప్రకాశుండు,
వితత [2] పక్షాంచలావిర్భూతవాత
హతసప్తశైలసంహతుఁడు ధీమంతుఁ
డుదితుఁడై, పవిచేత నూనంబుగాని
ఛదములుగల కులాచలమో యనంగ
దిగ్గన నగసి, యే తెంచి వేగమున,
నగ్గరుడుఁడు తల్లికందంద మ్రొక్క,
వినమితుండగు పక్షివిభు [3] నవతితల్లి
కనుఁగొని సంతోష [4] కలితయై పలికె:
"వినుము నీడోద్భవ, వినతకు నింటి
పనులుదీర్పఁగవలెఁ; బడుచులఁబట్టఁ
దీఱదు; వీరినత్తికొని చరింపు;
సారెకు నీకు సిచ్చలుఁజెప్పవలదు.

1. తేజసంయోగప్రయోగ. 2. పక్షానిలా. 3. (జూచితల్లి. 4. కలితుండై. (పూ)

అనిప్రభుత్వంబుగా నాడువాక్యములు
విని, యొండునాఁక యవ్వినతానుమతినిఁ
జరమభాగమున నాసర్ప[1] శాబముల
నిరవుగానిడికొని యేఁగి, శైలములు
వనములుఁ బురములు వరుస దీవులును
వనధులు దిశలు భూవలయంబు నదులు
నొండొండ చూపుచునుండఁగా, బాఁప
తండంబు వేగ నుద్ధతకోపులగుచు
వినతకొడుకని కాద్రవేయులు గరుడుఁ
బనులుపంపుదు, వీపుపై నెక్కికొనుచు,
నొకనాఁడు దమకు నూర్యునిఁజూపుమనఁగ,
వికటభోగులఁ బక్షి వీపునఁదాల్చి
సప్తమారుతజవసత్వుఁడై యెగసి
సప్తాశ్వమండల స్పర్శుఁడౌటయును,
బన్నగావలి చండభానువేఁడిమికి
నన్నియుఁ బెలపెటమని ప్రేలి మునిఁగి
ధరమీఁదఁబడి మూర్ఛదగిలియుండుటయు,
గరుడనిఁగోపించి కద్రువవగచి :
"యసురుచాలనిపుత్త్రు లొకవేవురేల!
యసమశౌర్యుఁడు చాలఁడాయొక్కఁ!" డనుచు
వినతాత్మజునిలావు వినుతించి, యంతఁ
దనయులదెసకు నెంతయుఁ జిన్నవోయి,
కొసగిన యినరశ్మి నిందఱుఁ గమరి
వసుధపైఁ ద్రెళ్లిన వారలఁజూచి,
యింద్రునిఁబ్రార్థించి హితసుధావృష్టి
సాంద్రతఁగురియించి పసుసినవారి

1. బత్తములం. (మా)

నిర్మ్యోడఁజూతుండ నేనగ్ని వేగఁ
జయ్యున బ్రదికింతుఁ జలమున." ననుచుఁ
దనరిన భక్తి వృద్ధశ్రవుఁగూర్చి
వినయంబుతో నిట్లు వినుతియొనర్చె :
"దేవతాధీశ, యతిస్తోత్రపాత్ర,
పావక ప్రభృతి దిక్పాలక సేవ్య,
శ్రీపతిసత్కృపాశ్రీయుత, వజ్రి,
పాపవిదూర, సౌభాగ్యసంపన్న,
మా పాలఁగృపగల్గి మమ్మురక్షింప
నీపాఁపకోదమల కిమ్ము ప్రాణంబు."
లనిన నింద్రుఁడు కృప నాశీవిషముల
తనువులు దడుపుసుధాధారవృష్టి
గురియింప, మూర్ఛగైకొనినసర్పములు
వరుసతోఁ బ్రతికి నవ్వాసవుకరుణ.
నప్పుడు కద్రువ యతిరాజసమున
నెప్పటిపోల్కి నయ్యురువురిచేతఁ
బనిగొనుచుండ, నాపన్న గాంతకుఁడు
జననికి నొకనాఁడు సద్భక్తిమ్రొక్కి :
"తల్లి, ని న్నిదియేమి! తవిలి మీవార
లిల్లాద్రిగా వీరికిచ్చిరో వెలకుఁ!
గా దేని, నీకొండుకడ దిక్కులేమి
నీదెసపొంది నీ విడుమఁబొందెదవో!
కాకున్న, [1] ననదవై కడుపుఁ గూటికిని
ఈ కద్రువకుఁ బను లిట్లు చేసెదవో!
అదిగాక, ప్రతినకునై పూని తగవు
వదలక యిట్లుండవలసెనో సిఖ!

---

1. నవలవై. (మూ)

కులిశసన్నిభ పటుక్రూర తుండాగ్ర
దళిత నిష్ఠురధరాధరుఁడనై వీరిఁ
జేపట్టి, [1] కుచ్చితుచెలువున నేను
నీపాఁపకొదమల నిట్లుమోచుటకుఁ
బనియేమి! చెప్పుమేర్పడనాకు." ననిన,
వినతయగ్గరుడనివీక్షించి పలికె:
"ఖగనాథ, వినుమయా! కద్రువ నన్నుఁ
బగగొని కపటంపుఁబన్నిదంబునను
గెలిచి యోడింప నీప్రియ దాసినైతిఁ;
దలకొని నాకు నీదాసీత్వముడిపి
గైకొని రక్షింపు; గలరె నీకంటె
నాకు దిక్కొరులు పన్నగవైరి!" యనిన,
మనమున మిగులనుమ్మలికంబుఁ బొంది:
"జనని, నీవింక విచారింపవలదు;
ఇప్పని చింతింప నెంతటిభార!
మిప్పుడే దీర్చెద; నిదెచూడు!" మనుచు
నలవుమీఱఁగ మారుతాశనజననిఁ
బలికెఁబ్రియోక్తితోఁ బక్షినాయకుఁడు
దలపోసి: 'నీవు మాదాసీత్వముడుప
వలయు; మీమదిలోని వాంఛితంబేమి!
కోరుఁ; డట్టిది మీకుఁగొనివచ్చియిత్తు
వారిధినున్న దేవతలచేనున్న'.
ననవుడుఁ బ్రియమంది, యహిరాజజనని
వినతాతనూజు భావించి, దీవించి,
యావైనతేయుకిట్లనియె: "నోగరుడ,
వేవేగఁబోయి తె వెస నమృతంబు.

1. కుచ్చంబు (మా)

ఘనపరాక్రమము వేగంబును గలిగి
వినుతిఁ బెంపొందిన విహగముఖ్యుఁడవు ;
దాస్యంబుఁ బాపుకోఁ దలఁచెద వేని
హాస్యంబుపొందక యమృతంబు మాకుఁ
దెచ్చియి." మ్మనవుడుఁ దెచ్చెదననుచు
నచ్చుగా మైకొని, యటఁదల్లికడకుఁ
జనుదెంచి తత్ప్రయోజన మెఱిఁగించి :

## అమృతాహరణము

'చని తెత్తు నమృత మీక్షణమున.' ననినఁ,
దనయుఁ గౌఁగిటఁ జేర్చి తగ నాదరించి,
తనరార నొండొకతడవు వీక్షించి :
"కలఁగక యట్టి దుర్ఘటమైనపనికిఁ
దడయక మైకొని తనయ, వచ్చితివి.
అమరులసాధింప నలవియె మనకు !
నమృతంబు సాధింప నలవియె నీకు !
నెలమి నేఁ బెక్కువేలేఁడులు తపము
నలయక చేయఁ, బుణ్యానుకూలమునఁ
గలిగిననాదైనగర్భంబునందుఁ
బొలుపార రెండండములు పుట్టుటయును,
దవిలినపుత్త్రవత్సలత నందొకటి
యవియింప నేగమి నయ్యండమునను
గొడుకొక్కరుఁడు [1] పిచ్చుకుంటయిపుట్టి,
పెడఁబాసిచని యెఁ గోపించి శపించి.
దానిచేసుమ్మి యీదాస్యంబునాకు
జానొప్పఁ దలఁగక సంభవించుటయు,

1. పిచ్చుగుంటయైపుట్టి. (మూ).

సిడుములఁగుడిచి, యేనిటనిన్ను గాంచి,
యుడుకాఱి వగదప్పియుండితిఁ; బిడప
సినుబాసి యేరీతి నిలువంగనేర్తు!”
ననవుడు తల్లితో ననియె మోదమున:
“నమరలోకంబెంత! యస్వప్నులెంత!
యమృతంబుసాధించుటదియెంత నాకు!
నీకేల మదిలోన నేఁడింతచింత!
కైకొని యమృత మీక్షణమునఁదెత్తు.
ననవుడు ప్రియమంది, యప్పుడావినత
గొనకొని యాత్మలోపలఁ బతిఁదలఁచి,
తనయునితనువు హస్తంబున నిమిరి,
తనరారువేల్పులఁదలఁచి యిట్లనియె:
“అనిలుండు నీఱెక్కల, నలుండు శిరము,
తనువు సూర్యుఁడు, వీఁపు తారకావిభుఁడు
కాతురు; వేల్పులు కరుణతోనిన్ను
బ్రోతురు; విజయంబు పొందునీవనఘ!”
అనుచుదీవించినయమ్మకు మ్రొక్కి:
“జనని, యే నమృతంబు సాధించునపుడు
ఘనజవసత్వంబు గలుగంగవలయుఁ;
గనుఁగొన క్షుత్తుచేఁ గాదు కార్యంబు;
ఆహారమేది పద్మాక్షి, నా?” కనిన:
“సాహసబలుఁడ, నీచనుత్రోవ జలధి-
లోఁ గిరాతాలి వాలుచునుండు; వారు —
లోఁగక జనుల సుశ్లోకుల నెపుడు
కారించి, యేపుచుఁ, గడుప్రావ్వి, గణన
మీఱి, దుర్వారులమేయుప్రతాపు
లగ్గలమైయుండు; రలకిరాతులను
భగ్గించి, యుండతిభక్షింపు; మప్పు (?)

డందు విప్రుండు నీకనశనంబగును ;
ఎందు నీకును జయంబెసగు ఖగేంద్ర!”
అనుడు : ‘నచ్చట విప్రుఁడవియెఱుంగుటకు
వినిపింపు గుఱుతైనవిధము.’ నావుడును :
‘పక్షీశ, బోయలభక్షించునపుడు
కుక్షిలోనికిఁబోక, కుత్తుకయందుఁ
జిక్కి గాలము క్రియఁ, [1] జిచ్చువంబోలె
మిక్కిలిమండుచు మెఱయుచునుండు.’
అని బ్రాహ్మణునిగుఱుతంతయుఁజెప్ప,
విని ముదమంది యవ్విహగవల్లభుఁడు
వినయంబుతోఁ దల్లివీడ్కొని, ధరణి
ననువొంద నిలిచి, యాయత పక్షయుగము
కొండొకయల్లార్చి, కుప్పించి, యమర
మండలియును మర్త్యమండలి వొగడ,
దిగిభముల్ చెదర, భీతిలి శేషుఁడదర,
జగములన్నియు వణంక, శైలముల్ బెణఁక,
జవమున నెగసి నక్షత్రమార్గమునఁ
బవనవేగమున నిర్భరగతిఁబఱచి,
వారిధిలోన నెవ్వారి కభేద్య
శూరులై వాలి యస్తోక శౌర్యమున
మత్తులై త్రిదివసమాజంబునైన
నొత్తిగెల్వఁగఁజాలు నురుశక్తిగలుగు
శబరవే[2]షులఁగాంచి, చటులవేగమునఁ
బ్రబల [3] గుహానిభ వక్త్రంబుఁ దెఱచి,
బలువిడిఁ బెక్కండ్రఁబట్టి యొండొండ
తలఁగకమ్రింగ, నత్తఱి గళబిలము

1. చిక్కన. 2. వేషము. 3. మహాభవక్త్రంబటు. (మూ)

చొచ్చి లోనికిఁబోవ నుడిసి కార్చిచ్చు
నచ్చుననేర్చిన, నట వానివిప్రుఁ
డని మదినెఱిఁగి విహంగపుంగవుఁడు
వినయవాక్యంబుల విప్రుతోఁబలికె:
'అనఘచరిత్ర, బ్రాహ్మణుఁడ, వెల్వడుము
నినుమ్రింగ'; ననిన భూనిర్జరుండనియె:
"ద్విజకులోత్తమ, యేనుద్విజకులోత్తముఁడ;
సుజనమాన్యుండఁ; బ్రసూనాస్త్రబారిఁ
బాటి, నిషాది నాపత్నిగాఁజేసి,
వీరిలోపలఁగూడి విహరింతు; నన్ను
నీవెఱింగితి; ధర్మనియతి నీకంటె
భావించి కాంచు నేర్పరులెందుఁగలరు!
నాకూర్మిసతి కంఠనాళంబుచొచ్చి
నీకుక్షిలోపల నిలిచియున్నదియు;
ఆకాంత రాక నేనవలరాఁదగదు;
నీకృపకలిమి మన్నించి నాకిమ్ము
విహగేంద్ర!" యనవుడు, విప్రునిమ్రింగ
విహితంబుగాదని వెలయ నిషాది
మగుడింపరామియు మదిలోనఁదలఁచి,
తగిలి భూసురుసప్రార్థనమును జూచి:
'అనఘాత్మ, ఓధరామరవర్య, వేగ
చనుఁడెందు వెలువడి సతియునునీవు.'
అనవుడుఁ బ్రియమంది, యవనీసురేంద్రుఁ
డనురాగముప్పొంగ నపుడు నిషాది
సహితుఁడై వెలువడి సద్వృత్తినరిగె.
విహగాధిపతి బోయవీడెల్లమ్రింగి,
పోయి సురాచలంబున నిష్ఠతోడఁ
బాయక కశ్యపబ్రహ్మకు నెఱిఁగి:

"కరుణావిధేయ, జగజ్జీవజనని,
కరమొప్ప మాతల్లిఁ గద్రువ తనకు
మరియాదమాలి, నెమ్మది దాసిఁజేసి,
పరికింప నన్నును బంటుగా నేలి
కొనియుండ, నయ్యురగులకునమృతము
గొని తెచ్చియిచ్చి, మేకొనఁగ దాసీత్వ
ముడిపికోఁ బూని పోవుచునుండి, జలధి
నడుమనున్నట్టి కాననచరావలుల
ఘనబుభుక్షార్తిఁ జెక్కుండ్ర మ్రింగినను
గనివిలేకున్నది; తవిలియాహార
మనఘాత్మ, దయచేసి యర్థి నన్నునుపు."
మనుడు నాకశ్యపుఁ డాత్మసంభవునిఁ
గనుఁగొని, యాతనికడఁకకు మెచ్చి:

### సుప్రతీకవిభావసుల శాపవృత్తాంతము

"మును విభావసుఁడను మునివరుఁ డొక్కఁ
డపరిమితంబైన యర్థంబుఁ బడసి,
విపులలోభాత్ముఁడై, వీసంబు నందు
[1] వ్రయముగాకుండ నేర్పడఁ బాఁతి దాఁచి,
దయలేక శిశువులు దగఁగూటికేడ్వ,
[2] నాయివారముల హీనాశ్రయవృత్తిఁ
బోయినంతనె పొద్దుపుచ్చుచు, దినము
లొకరీతి గడుపుచు నున్నచో; నంత,
నొకనాఁడు వానిసహోదరుండైన

---

1. 'వ్యయమ'ని సవరింప వీలున్నను, తిక్కనప్రయోగము 'వ్రయమ'ని యుండుటచే నట్లె యుంచఁబడినది. చూ. తిక్కన. శాంతి ప. 4 ఆ. 345 ప. 2. 'యాయావర'మను సంస్కృతపదమున కియ్యది వ్యావహారిక రూపమై యుండును.

సుప్రతీకాఖ్యుఁ డచ్చోటికి వచ్చి,
యుప్రయాసంబున నతనికి విత్త
మేరాళముగఁ గల్గుటెఱిఁగి తానతనిఁ
జేరి యిట్లనియె: "నొచ్చితిఁ; బేదనైతిఁ;
బితృ [1]పితామహులెల్లఁ బెంపారఁ దొల్లి
యతులధనాఢ్యులై యుందఱు నేఁగ,
దాఁచిన యర్థమంతయు నొక్కరుఁడవె
చూచి చేకొంటి; వచ్చుగ విభాగించి
నాకు నీవలదె ధనంబులో సగము!
చేకొని తండ్రి చేసిన ఋణంబున్న
వడిఁ బంచి నా కిచ్చువాఁడవు గావె!
గడుసరితన మేల! కన్నవారెల్ల
నగుదురు; గాన, సన్నకుసన్న ధనము
సగమి." మ్మటంచు వేసరక వేఁడుటయు,
నలిగి, విభావసుం డర్థలోభమునఁ
బెలుచఁ దమ్ముని జూచి 'పృథివిపై గజమ
వై యుండు' మని శాపమర్థి నిచ్చుటయు,
నాయెడ సుప్రతీకాఖ్యుండుఁ గసలి,
శాపించె మఱలఁ గచ్ఛపముగా మిగులఁ
గోపించి మదిఁ గొంకుఁ గొసరును లేక.
సరవి నట్లన్యోన్యశాపముల్ వార
లిరువురుఁ గాంచిరి; యేనుఁగా వాఁడు
'ముగి నాఱుయోజనంబుల విస్తృతంబు,
తగ నున్నతంబు ద్వాదశయోజనములుఁ
గలిగి, యొక్కెడ నొక్క కానలో నుండఁ,
జలములో నంతఁ గచ్ఛపముగువాఁడు

1. మూతా. (మూ)

నలువారఁ బదియోజనంబులు కరివి,
పొలుపార యోజనంబులుమూఁటిపొడవు
ధరియించి, తొంటి క్రోధంబునఁ జేసి
సరిఁగలహింతు రచ్ఛలముతో; నిపుడు
నారెండు నాహారమగు; నట కేఁగ
నారయ జయసిద్ధియగు నీకుఁ బుత్ర!"
యనవుడుఁ బ్రణమిల్లి, యచ్చటి కేఁగి,
కనియె నాగరుఁడండు గజకచ్ఛపముల;
గగనంబు సీలమేఘంబు నొక్కటని
తెగి కలహించునత్తెఱఁగున నుభయ
వనములలోని జీవంబులు బెగడఁ
గనలుచు నొండొంటిఁ గదిసి తాఁకియును,
దొక్కియుఁ, గఱచియు, దోఁగసీడ్చియును,
నొక్కటసిగిడియు, నొంసియు, నట్లు
వెక్కసంబుగఁ బోర వీక్షించి, వాని

గరుడఁడు గజకచ్ఛపములతోఁ గశ్యపునొద్ద కేఁగుట

తెక్కలనడఁచి, యారెంటిని గాళ్లఁ
బెనచి, నభోవీధి బిట్టులఁ ఘించి
చనుచోట గాంచె భీషణగహనంబు;
ఘనరు కైలాసభూధరమునుబోలె
ననుపమలీల శివాన్వితంబగుచు,
రమణ ధనదునిమందిరంబును బోలె
సమలిన కాంచనాయత పూర్ణమగుచు,
దండిమై మునిజనస్థానంబుఁ బోలె
శాండిల్య కౌశిక సంయుక్తమగుచు,
జలజమిత్రుని దినచక్రంబు పోలె
విలసిల్లు రాజార్క [1]విన్యాసమగుచుఁ,

1. విశ్వాస. (మూ)

బురణింప ఘనరుద్రభూమియుఁ బోలె
నరుదారఁ బ్రబలభూతావాసమగుచు,
వేదప్రవర్తిత విప్రాళి పోలె
మోదమై గాయత్రిముఖ్యతఁ బొల్చి,
కనుఁగొనఁగా వర్షకాలంబుపోలె
మునుకొన్న జీమూతములఁ దేజరిల్లి,
గుఱుతైన దేవేంద్రుకొలువును బోలె
వరుస నొప్పగు వహ్నివరుణులు గలిగి,
సలలితంబైన కాసారంబు పోలెఁ
బొలుపైనయట్టి యంబుజములు గలిగి
విలసిల్లుచున్న యవ్విపినమధ్యమున
లలి నొప్పుచుండు నలంబతీర్థంబు.
అచ్చోట రోహణంబను వటభూజ
మచ్చెరువై విహాయసమెల్లఁ గప్పి
తేజరిల్లుచు వైనతేయునిఁ జూచి:
"యోజగన్నుతశీల, యొనర నాయందు
శతయోజనంబుల శాఖలుగలవు.
జతనమైయుండి కచ్ఛపమును గజము
నాహారముగఁగొని యరుగుము ; నీకు
నూహింప నిదిగాని యొండిమ్ము లేదు."
అనవుండు పక్షీంద్రుఁ 'డౌఁగాక' యనుచుఁ
దనపాదయుగళంబు తరుశాఖ నూఁద,
ఫెళఫెళధ్వనులఁ బెంపెక్కి యొక్కింత
నిలువక విలయాభ్రనిర్ఘోష ఘోష
ములఁ గొమ్మవిఱుగ, నప్పుడు ఖగేంద్రుండు
నెలవుగాఁ దనుశాఖనిలిచి తపంబు
నతినిష్ఠఁ జేయుచు నధశిరస్థితులు
వ్రతములుగానున్న వాలఖిల్యాది

యతులకు నుపహారియగునని, శాఖ
క్షితిమీఁదఁ బడకుండఁ జెలువొంద దానిఁ
గఱచిపట్టుక, గజకచ్ఛపంబులను
నిఱికిపట్టుక దివినేఁగుచో, నచట
నిలువనాధారంబు నెఱిఁ గానలేక
పలుశాఖతోఁ దుతిఁ బలువిడి తండ్రి-
కడకేఁగి మ్రొక్కినఁ, గశ్యపబ్రహ్మ
కొడుకులావునకు నెక్కుడు ముదంబంది,
యమ్మహాశాఖయం దతినిష్ఠనున్న
యమ్మునీశ్వరులఁ బ్రియంబునఁజూచి:
" యలఘుబలోదాత్తుఁడగు నీసుపర్ణుఁ
డలమి యీశాఖ మీకగుబాధకులికి
విడువక యున్నాఁడు, వీనిమన్నించి
కడఁకమై మీరొండుకడ కేఁగవలయు."
ననుచుఁ బ్రార్థించిన యతనివాక్యములు
విని, యతుల్ తరుశాఖవిడిచి శీతాద్రి
కరిగిన, గరుడఁ డత్తఱిఁ దరుశాఖ
ధరణిపై విడువక తండ్రికిట్లనియె:
' ఈశాఖ విడిచిన నిందుచే జనులు
నాశమ్ముగానికాననమానతిమ్ము.'
అనవుడు విని: 'తుహినాద్రిప్రాంతమున
ఘనత నిష్పురుషనగంబున వైవు ;
చను మదిలక్ష యోజనములదూర.'
మనిన గరుత్మంతుఁ డతులవేగమునఁ
జని, తరుశాఖయచ్చట దిగవిడిచి,
ఘనుఁడు శీతాద్రిపై గజకచ్ఛపములఁ
దనివోవభక్షించి తగఁదృప్తిఁబొంది,
యనఘుండు మఱి తుహినావనీధరము

చలియింప నురవడిఁ జరణంబులూఁది,
బలువిడి గంపింపఁ బద్మజాండమ్ము
ఘల్లుననవియ భూభాగంబులద్రువఁ
దల్లడించుచు జీవతతియెల్లఁ దూల
నురవడి మింటికి నుప్పరంబెగసి,
కరువలికంటె వేగము పోవుచుండ,
నప్పుడాసురపురియందు నెల్లెడలఁ
దప్పక దుర్నిమిత్తంబులుదోఁప,
వెఱఁగంది ధిషణు రావించి యింద్రుండు:
'పరవి నుత్పాతసూచనకుఁ గారణము
నెఱిఁగింపుఁ.' డన మతినెఱిఁగి యాగురుఁడు
తెఱఁగొప్పఁబలికె నాదేవేంద్రుతోడ:
"శతమఖ, వినుము; కశ్యపువరంబునను
నుతకీర్తి వినతాతనూజాతుఁడగుచు
జలనిధిలోనున్న శబరుల నెల్లఁ
గలగొనిమ్రింగి, యాగజకచ్ఛపముల
నొక్కటమెసవి, మహోగ్రతేజమునఁ
జక్కనఁ దల్లిదాస్యంబెడఁబాపు-
కొఱకునై, యురగముఖ్యులకమృతంబు
తెఱఁగొప్పఁగొనిపోవఁ దివికి యిచ్చటికి
వచ్చుచున్నాఁడు వైనతేయుండు.

* * * * *

నీకు నసాధ్యుండు నిర్జరనాథ,
కైకొని నీవు నగ్గరుడనిమహిమ

## గరుడనిమహిమ

యెఱుఁగుదు; వట్లన్న నెఱిఁగింతువినుము.
వఱలంగఁ దొల్లి భవన్ముఖ్యదేవ

గణములు దనకు నొక్కట సహాయముగ,
గణనమీఱినమునిగణములతోడఁ
బరమపుణ్యుఁడు కశ్యపబ్రహ్మ వేడ్క
పురణింప నరుదైనపుత్రకామేష్టి
సలుపుచో, నీవు నిర్జరులతోఁగూడి
యెలమిరాఁ, [1] బాదము లిట్టట్టునడుచు
మానితాంగుష్ఠప్రమాణదేహములఁ
బూనికి ఫలమూలములు సమిధలును
వరుసతోఁ గొనివచ్చు వాలఖిల్యాది
పరమసంయములు నేర్పడఁజూచి నగినఁ,
గనుఁగొని, రోషించి, ఘనమునీశ్వరులు
చనుదెంచి, నీమీఁదిచలమున నప్పు
డతివీర్యవంతంబులైన మంత్రముల
నతినిష్ఠ ననలున కాహుతుల్ వ్రేల్చి :
'శతమఖుకంటెను శతగుణవీర్య
యుతుఁడు కశ్యపునకు నుదితుఁడై, యాతఁ
డింద్రునకింద్రుఁడై యొసగుత.' మనిన
నింద్ర, నీ వంతయు నెఱిఁగి భీతిల్లి,
వాలఖిల్యులఁజేరి వరుసఁ బ్రార్థింప,
నాలోనఁ గశ్యపుఁ డమ్మునివరులఁ
గనుఁగొని : "మీరిట్లుగా నియమింపఁ
జనునె! యాతఁడు బ్రహ్మసమ్మతి నింద్రుఁ
డయ్యున్న నింక రెండవయింద్రుఁడైనఁ,
జయ్యనఁ ద్రైలోక్యజనులకు బాధ
యగుఁ ; గాన, వేఱొక్కయనువున నతని
'ఖగములకింద్రుఁడౌఁగాక' నకున్నఁ

1. దపములు. (మూ)

గాదు; మీపలుక మోఘముగానఁ, బిదప
నాదినాకాధిపు సమరత్వముడుగు;
నదిగానఁ గరుణింపుఁ". దన మహామునులు
ముదమంది నీకు నిమ్ములఁ గరుణించి,
యాపుత్రకామేష్టియందు జనించు
నాపుత్రకునకుఁ బతంగాధ్యక్షుఁ జేసి.
రట్టి యామునుల మాహాత్మ్యంబువలనఁ
బుట్టిన తార్క్ష్యుఁ డిప్పుడు వచ్చుకతనఁ
బూని మహోత్పాతములుఁ బుట్టె." ననిన
నానిర్జరాధీశుఁ డమృతరక్షకులఁ
దగఁ బిల్చి: "కడుఁ బ్రయత్నమున మీరెల్ల
ఖగపతి యమృతంబు గైకొనకుండ
రక్షించుకొని, లావు ప్రకటించి నిలిచి,
పక్షి నాహవమునఁ బఱపుఁ డీక్షణము."

### గరుడఁ డమృతరక్షకులతో యుద్ధమొనర్చుట

యనవుండు నట్ల కాకనుచు వారేఁగి,
మును నిశితాయుధంబులు పూని రేయుఁ
బవలును నమృతంబు పటుభంగిఁ గావఁ,
బవమాన వేగుఁడై పక్షీంద్రుఁ డపుడు
బెడిదంపు మ్రోఁతలఁ బిడుగును బోలెఁ
గడఁకమై విష్ణుచక్రంబును బోలె
ఱెక్కలుగల మహాద్రియుఁ బోలె రభస
మెక్కుడై వచ్చెఁ; బక్షీంద్రుని పక్ష
వాతూలగతి రెండు వ్రయ్యలు గాఁగ
నాతతలీల మహాభ్రముల్ దునిసి
తునకలు నలుదెసఁ దూలి పాఱంగ,
వెనుఁబడి ఖేచరవితతి కలంగ,

వరుస మహావేగవాయువేగమునఁ
బరతేరఁ, దత్సుధాపాలురు భీతిఁ
గలఁగుచుఁ బాఱిపోఁగమకించి, నిలిచి
బలపరాక్రముఁడైనపక్షీంద్రుఁగనిరి.
కని యనల్పక్రోధగర్వులై తాఁకి,
పనుగొని నిశితాస్త్రపంక్తులఁ దాల్చి
తడఁబడ నేసియుఁ, దాఁకనేసియును,

*        *        *        *        *

మొత్తియు, నొత్తియు, ముసలఘాతముల
నొత్తియుఁ, దాఁచియు, నదరి తాఁకియును,
ధట్టించియును మహోద్ధతి నిట్లు పోరు
నట్టినిలింపుల నగవాయిగొనక,
పక్షవిక్షేపణ [1] ప్రసృతరేణువులఁ
జక్షులఁగప్పి, చంచలనుండఁజేసి,
విదితకోపోద్రేక విస్ఫులింగములఁ
బదనఖ తుండాగ్రపక్షఘట్టనలఁ
గనుకని రక్తమంగంబులఁదొరుఁగఁ
దనువులుచించి, యుద్ధతివ్రక్కలింప,
నమరులు, వసువులు, యక్షకిన్నరులుఁ,
గమలబాంధవులు, నేకాదశరుద్రు
లందఱు నొక్కట నాజిచాలించి
యందందపాఱిన, నటపక్షివిభుఁడు
సమరకేళీలోలచతురుఁడై యమృ
తమృతంబుకడకేఁగి, యచ్చట ఘోర-
తరసమీరణప్రేరితంబైన యగ్ని
దరికొని మిన్నులుదాఁకెడిశిఖలు

1. ప్రసర. (మూ)

గలిగి తన్నటుపోవఁగానీకయునికి
దెలిసి, దక్షిణవార్ధి దివ్యజలంబు
పుక్కిటఁగొనివచ్చి పోసి చిచ్చార్చి,
తక్కక చని, తీక్ష్ణ [1]ధారమై దేవ-
కల్పితంబైన చక్రంబురంధ్రమున
నల్పాంగుఁడై చొచ్చి, యట మహాఘోర-
గరళాగ్నికీలసంఘటితవిస్ఫురణ
నరుణారుణాక్షివిధాగ్నులఁ జూపు-
మాత్రాన పగుల భస్మముసేయు నుగ్ర-
గాత్రమై యతిభయంకరలీలనున్న
భుజగయుగంబును బొడగాంచి, తనదు
నిజపక్షయుగముచే నేత్రముల్ గప్పి,
నలిరేఁగి వానిఫణంబులు ద్రొక్కి,
చెలఁగుచు నమృతంబుచేకొని వెడలి,
దివికిలంఘించి యుద్దీప్తబలుండు
దివిజులనెల్లను దృణలీలఁ గెలిచి

## విష్ణువు గరుడు ననుగ్రహించుట

పోవుచో, నప్పు డంభోరుహనాభుఁ
డావైనతేయు పరాక్రమశక్తి
కెంతయుఁ బ్రియమంది, యిచ్చలో నతని
సంతతసత్కటాక్షంబున ననుపఁ
దలఁచి, సన్మునులు బృందారకానీక
ములు సందడింపుచు ముందఱనడువ,
వాణీశ్వరుండు గీర్వాణేశ్వరుండు
రాణింప నుభయపార్శ్వంబుల నడువఁ,

1. ధామమై తేగ. (మూ)

జల్లనిచూపుల సకలలోకములకుఁ
దల్లియై ప్రోచు పద్మాదేవి తనదు
వక్షస్థలంబున వరశుభోన్నతుల
సాక్షాత్కరించి ప్రసన్నత నిలువ,
దివ్యరత్నోజ్జ్వల దీప్తులతోడ
భవ్యమై కౌస్తుభాభరణంబు వెలుఁగ,
నొసపరిలాగున నొఱపైనముండ
పసిఁడిచాయలచీర పసమీఱఁగట్టి,
మహితప్రభావ నిర్మలరత్నఖచిత
బహువిధాలంకార భానుప్రకాశ
వరపుష్పకంబెక్కి, వైభవోత్సాహ
తరసముగతినొప్ప తనచిత్తమునకు
మెచ్చులువొదలంగ మెఱసి యక్షేశుఁ
డిచ్చమై: 'సవధారు హే ఇంద్రధీర,
సకలలోకారాధ్య, సన్మునిస్తుత్య,
మకరాంకశతకోటిమహిత, విరాజ!
నందీత్తఘనచక్రసంహృతదనుజ,
యిందిరానాయక, హెచ్చరిక!' యనఁగ,
దేవదేవుఁడు సర్వదేవతామయుఁడు
వేవేగనేతెంచి, విహగవల్లభున
కావటఁ బ్రత్యక్షమై నిల్చునంత,
నాదేవదేవు శుభాకృతి భక్తి
భావించి పులకించి ప్రమదంబుతోడ:

.......................

"పద్మాలయారాధ్య, పద్మపత్రాక్ష,
పద్మజవినుత, సద్భావనాతీత,
సత్యస్వరూప, నిశ్చలతత్వరూప,
నిత్యనిరాలంబ, నిర్వాణనిపుణ,

భక్తలోకాధార, [1] ప్రణవస్వరూప,
నక్తంచరాంతక, నాగేంద్రవరద,
నీదయాదృష్టిచే నిఖిలలోకములు
ప్రోదియై నలిరెక్కి పొదలుచున్నవియు.
లోకంబులకు నీవు లోనుగా నేర్తు;
లోకంబులెల్ల నీలో నున్న నేర్తు;
వాదిదేవుఁడవు; సర్వాత్మకపరుఁడ;
వాదట బ్రహ్మాదులైన నీమూర్తి
కనఁగ నెంతటివారు! కమలాధినాథ!"
అని సన్నుతించిన యా వైనతేయుఁ
గనుఁగొని మనమున గారవంబార:
"వినతాతనూజ, నీవిక్రమక్రమము
లావును జవమును జలంబు సద్భావ
మేపలనను మేల; యెవ్వారు నిన్నుఁ
బోలరు మగటిమి బొంకుటగాదు;
మేలువరంబిత్తు మెచ్చితి నడుగు."
మని ప్రసన్నాత్ముఁడై యానతిచ్చుటయు,
మనమునఁబొంగి, సామజవరదునకు
వినతుఁడై కరములు వెరవొప్ప మొగిచి
తనర నిట్లనియె: "నీదయ నాకు నెపుడు
నమృతంబుగోరక యజరామరంబు
సముచితంబుగ నిచ్చి, సకలలోకముల
కగ్రణివైన నీయగ్రంబునందు-
దగ్రతేజత నిన్ను దయఁగొల్చియుండ
వరమిచ్చి కరుణింపు వరదయామూర్తి,
పరమకృపాలోల, భక్తవత్సలుఁడ!"

1. ప్రణవానుకార. (మూ).

యనవుండు దయచేసి, హరి ఖగేశ్వరునిఁ :
‘ దనకు వాహనమవై ధ్వజమవై యుండు. ’
మనుటయు, నతఁడు ‘ మహాప్రసాద ’ మని
వినతుఁడై లక్ష్మీశువీడ్కొని పోవ,

## గరుత్మదింద్రుల మైత్రి

మగఁటిమి వాటించి మఱియు నింద్రుండు
ఖగపతిపై మదోత్కటవృత్తి వచ్చి
భిదురంబువైవ, నాభీలరవంబు
లొదవంగమందుచు నురవడివచ్చి
గరుడనిపక్ష ముగ్రతఁదాఁకుటయును :

* * * * *

“నీవెటు నను నొంప నేరవు ; వినుము,
వావిరి మునిసంభవంబవు, నింద్రు
డైనవవును గానఁ, గడుఁజిన్నబుచ్చఁ
గాదు ; కావున, నీవు కడఁగి మదేక
పర్ణంబుద్రుంపు ; దోర్బలశక్తి నే సు-
పర్ణుండఁగాఁగ నీబలిమి యీపాటి
గానిలే ”. దనిన, నక్కడిభూతసమితి
మానుగా ఖగపతిమగఁటిమి చూచి,
1.........................
చెందినఁజూచి, శచీపతి యప్పు
డచ్చెరువడిపల్కె : “ ననఘ, నీతోడ
నచ్చినవేడ్క మానక చెల్మిసేయ
నిష్టమయ్యెడునాకు ; నిట్టివిక్రమము,
శిష్టధీరత నీకుఁజెల్లెఁగా ; కెందు

1. “ ఆచటిభూతములెల్ల గరుడనిచెక్కుఁబలిమికచ్చెరువడి, యాతని ‘ సుపర్ణుఁ’డని పిలిచిరి ” అనువిషయము లుప్తమైయుండును.

నెవ్వారలకుఁ గల్గునిట్టిసామర్థ్య!
మెవ్వారలకుఁగల్గు నీశక్తిపెంపు!
అమరుండ, వజితుండ, వజరుఁడ, వెందు
నమరుఁడవైన నీ కమృతమ దేల!
అమృతసేవకుల నాహవమున గెలిచి
క్రమమున విజయంబుగైకొన్న నీకు
నమృతాభిలాషలే; దన్యులకొఱకుఁ
దమకించి గొనిపోవఁదగము పక్షీంద్ర!
ఇతరుల కీసుధ యిచ్చిన, వార
లతిబలవంతులై యమరసంఘముల
కరయఁ బోర నసాధ్యులగుదురు; గానఁ,
దిరుగనిమ్మిది వైనతేయుఁడ, మాకు; —
నీకు నిష్టావాప్తి నెఱినిత్తు." ననిన,
నాకాశికునితోడ ననెఁ బక్షివిభుఁడు:
"అనఘ, మదీయాంబకై సదాసీత్వ
మనువుగా ననుపుదునని పన్నగులకు
'నమృతంబుదెచ్చిత్తు' నని పూని నొడివి,
క్రమముతో నమృతంబుగైకొంటి; దీని
నయ్యురగులకిచ్చి యంబదాసీ[1]త్వ
మొయ్యనఁబాపిన, నురగముల్ దీని
— సేవింపకుండ శచీనాథ, మఱల
నీ వెత్తుకొనిపొమ్ము నేర్పున." ననిన
గరుడని కదిమికిఁ గడుసంతసిల్లి,
పురుహూతుఁ డతని నింపునఁ జూచి పలికె:
'గరుఁడ, నీబలపరాక్రమములు వినఁగఁ
బరితోషమయ్యెడుఁ; బక్షీశ, తెలుపు'.

---

1. దాసీత్వ——చయ్యనఁబాపిన సర్పముల్ దీని. (మూ)

మనవుండు నిట్లను : "నాత్మసంస్తుతియుఁ,
దనరంగ నితరనిందయును సత్పురుష
గుణములుగా ; వైనఁ, గొనకొని నాదు
గుణములుగల తెఱంగును విన్నవింతు.
స్థావరజంగమతతులతో భూమి
లావునఁదాల్తు ; నలంఘ్యపయోధి
వారిరత్నాలతో వరుసఁ జల్లుదును ;
మీఱిన పక్షసమీర వేగమున
వరుస ముజ్జగములు వడిఁగొట్టినత్తు ;
నరయంగ మేరువునైన మత్పక్ష
హతి నుగ్గుసేయుదు." నన సంతసిల్లి :
'పతగాధిపతి, నాకు బద్ధసఖ్యుండ
వై యుండు ; మిగుల నెయ్యంబార నిత్తు
నేయది నీకిష్టమొఱఁగింపు.' మనినఁ :
"బాకశాసన, భవత్పాలితంబైన
లోకంబులందుఁ బెల్లుగ భుజంగములు
తిరుగుచు జీవులఁదెగటార్చు ; నట్టి
యురగు లాహారమై యుండు పరంబు

## వినతాదాస్యవిమోచనము

నాకిమ్ము ;" నావుడు నాకేశుఁడొసగె.
ఆకశ్యపాత్మజుం, డమరనాయకుఁడు
విడువ కదృశ్యుఁడై వెంటనే తేరఁ,
దడయక కద్రువతనయులకడకు
బృందారకులకూటిబిందెను గొనుచు,
నెందునుగదలక యేపుమై ధరకుఁ
జనుదెంచి, సుధకలశము దర్భమీఁద
నునిచి యిట్లనియె నయ్యురగులతోడ :

"సమరనాయక భోజ్యమైనట్టి యమృత
మమరులుసాక్షిగా నర్థితోఁ దెచ్చి
యిచ్చితినిదె మీకు; నింక మాతల్లి
నచ్చుగా దాసీత్వమది పాసె నుష్ణ-
కరహిమాంశులు గుఱిగాఁగ; మీరిపుడు
కరమొప్ప స్నానాదికర్మముల్ దీర్చి
యొదవువేడుక నుపయోగింపుఁ." డనుచు
ముదముతోఁ దమతల్లి మూఁపున నునిచి,
వినతులు సేసి, దర్వీకరారాతి
వినతఁదోడ్కొని పోయె వినువీథి. నంతఁ,
గొనకొని యయ్యురగులు [1]రోసముడిగి,
[2]యనఘులోకైక జలాశయమ్మున కేఁగి
స్నానంబుచేయ, నచ్చట మున్నదృశ్యుఁ
డై నిల్చియున్న యయ్యమరనాయకుఁడు
సుధయెత్తుకొనిపోయి, సురలలోఁ దొంటి-
విధమున నునిచి ప్రవీణుఁడై యుండె.
అంత నాయురగు లయ్యమృత మచ్చోట
సంతయు వెదకి తా రటుగానలేక,
యమృతకుంభస్థితి నమరినదర్భ
లమృతంబుమాఱుగా నందఱుఁదలఁచి
నాఁడు దర్భలునాక, నాసర్పములకుఁ
[3]వాఁడిమై జిహ్వలు పాయగాఁ ద్రెవ్వి
చిరతరలీల ద్విజిహ్వలునాఁగఁ
బరఁగి; రమృతస్థితిఁ బరగమపవిత్ర
మయ్యెదర్భయు; విహగాధిపుఁడంత
నయ్యురగులఁ బాసి, యమృతాంబురాశి-

---

1. రోసగులుడిగి. 2. అనఘులు పన్నగులాయంబుకేగి. 3. పొడిగా జిహ్వలు పొలిగాఁ ద్రెవ్వి. (మూ)

కడఁ దల్లినుసిచి, యాకశ్యపబ్రహ్మ
కడకేఁగి యతనికిఁ గడుభక్తిమ్రొక్కి,
వలనొప్పఁ దనపోయివచ్చిన తెఱఁగు
తెలియంగ వినిపించి దీవనలంది,
కమలాక్షుకృపఁ ద్రిజగంబులయందు
విమలవిఖ్యాతిచే వెలయుచునుండె.
గరుడని విజయంబు కడుభక్తి విన్న
నరులకు ఘనప్రసన్నత మహిమలలరు.-
బహుళతీర్థస్నానఫలము, గోదాన
మహనీయఫలమును, మహితభూదాన
ఫలముఁ, గన్యాదానఫలమును గలుగు ;
వెలయుదు రాపూర్ణవిభవసంపదల
నటుగాన జనమేజయక్ష్మారమణ,
పటుతర భక్తిసంపదతోడ వినుము.
కావక శాపాగ్నికలుగుపన్నగుల
దేవతాద్రోహులఁ దీర్పవే దేవ!
ఈరీతి క్రతువు మున్నెఱిఁగియె కాదె
చేరిరి హరి నీకు శేషవాసుకులు!
ఒకఁడు వంశము పెంచు ; నొకఁడు హరించు ;
నకట! తక్షకుచేత నణఁగునీకులము."

## సర్పయాగ సంకల్పము

అనినఁ, గోపాటోప మాత్మ రెట్టింప
జనకునిఁదలచి, తక్షకుకీడుదలఁచి,
జనులెల్ల వలదనిచాటిన వినక,
జనమేజయుఁడు సేయ సర్పయాగమ్ము
నారీతిఁగోరి, యుదంకుఁడొక్కలిసి,
దారుణయజ్ఞంబు దగఁజేయఁ దలఁచి,

జాబాలి జమదగ్ని జహ్ను శాండిల్య
కౌబిల మాండవ్య కణ్వ వశిష్ఠ
కపిల భరద్వాజ కశ్యపుల్ మొదలు
తపసుల నుత్తమోత్తముల రప్పించి,
పుణ్యాహవాచక పూర్వంబుగాఁగఁ
బుణ్యాంగనలఁగూడి పుణ్యులఁగూడి,
దురితవిదూర బంధురకురుక్షేత్ర
విరచితశాలా ప్రవేశంబుచేసి,
యాతంత్రమున బ్రహ్మ [1] యధ్వర్యుఁ డనఁగ
హోత యుపద్రష్ట యుద్గాత యనఁగ
వలయుతావుల విప్రవరుల వరించి,
కులకాంత [2] క్రేవలఁగూడి వర్తింప,
ఫలసూపములు, నెయ్యి, పాయసాన్నములుఁ,
గలపులు, శాకముల్, కపురపీడెములుఁ,
గార్పాస [3] రాజత కనకవస్త్రములుఁ,
గర్పూర కస్తూరికా కుంకుమలును,
కుశ కూర్చ సమిధలుఁ, గుసుమాక్షతలును,
వశు పాత్ర పూర్ణకుంభములాదిగాఁగ
యాగోపకరణంబులన్నియుఁ గూర్చి,
భోగిభీకర మంత్రముల ప్రేల్చునప్డు
డందండ యాగాగ్ని యందంతమగుచు
దండశూకావలి తమదుచొప్పడలి
తొరఁగె దీర్ఘములైన తోఁకలతోడఁ,
దరణికన్నులుఁగని తనువులతోడ,
గుబులైన క్రొవ్వాఁడి కోఱలతోడ,
నెఱినిప్పు లురలెడు నేత్రాలతోడ,

1. అధ్వర్యులనఁగ. 2. కోలి. 3. కాయత. (మూ)

మత్తిల్లు ఫణిఫణా మణిదీప్తితోడ,
చిత్తరమ్ములు చిమ్ము పెదవులతోడ,
నక్కు వాయుసు దంటనాల్కలతోడ,
మక్కళించిన పొట్టనుడతలతోడ,
మాయపుఁ బలువన్నె మచ్చలతోడఁ
బాయక చిగురుఁగుప్పసములతోడఁ.
దొరఁగు నప్పటి హోమధూ[1]మమ్ము తాఁకఁ
దిరమేది మూర్ఛిల్లె దేవలోకంబు ;
హోతలు శాలలోనుండలేరైరి ;
ఘోరతాపమునఁ గ్రాఁగె సకలదిక్కులును ;
మడిసిరి కొండఱు మనుజులా వేళ ;
నడుమింట గానోడె నక్షత్రకులము.
వెలయు నధ్వరవహ్ని విషవాఁదోఁగి
మలినమై రాఁజి, క్రమ్మఁబ్రజ్వరిల్లఁ,
కుటిలఫణారత్నకోటులు చిటిలి
పెటపెటధ్వనిఁ బాతెఁ బ్రిస్ఫలి యుష్ణశిఖిఁ.
జెలచేల నురియు మాంసములచప్పళ్లు
చలములుగొని కులాచలములఁబొదివె.
చచ్చియు, నొకకొన్ని సామగానముల
పచ్చితీపుల నిల్చెఁ బ్రాణవాయువులు.
కాలకంఠుఁడు మూఁచెఁ గడియంబుముట్టి ;
నీలకంఠముఁ బట్టె నెఱవైనభయము.

తక్షకుఁ డింద్రు శరణుచొచ్చుట

అప్పుడు, తక్షకుం డార్తరావంబు
ముప్పిరిగొన దర్భముఖములు గఱచి,

1. ధూమ్రమమ్ము. (మూ)

యింద్రుకొల్వునకేఁగి యిట్లనునతని:
"యింద్ర, రక్షింపవె! యేను దక్షకుఁడ;
నాఁడలుండఁ బట్టక యురగవంశంబు
మడియింపఁదలఁచిన మత్తాత్మకుఁడను.
ఎరగొని యొక్కనాఁడే పరీక్షిత్తుఁ
గఱచితి మీదెఱుంగని పాపమునను.
[1] నోళ్లవలన మున్నును నక్కలుండ
వ్రాళ్లననుమాట వానఁగూడెమాకు (!),
దర్పించి యారాజతనయుఁ డొక్కరుఁడు
సర్పయాగంబిప్డు జరపుచున్నాఁడు.
వచ్చినసర్పంబు సంయమిగ్రీవ
నచ్చలంబున వైచె నాపరీక్షిత్తు.
అతనిచే నట్లు మహాశాపమందె;
సుతుఁడదితలఁప కిట్లేఁపుచున్నాఁడు.
[2] ప్రోవుగా మాసర్పములు గూలెనగ్ని;
నేవెరవునఁ దప్పు నీబారి నాకు!
దయమాలి మంత్రాధిదైవంబు నన్నుఁ
బయనమై యున్నది పట్టుకపోవ.
జీవరక్షార్థమై శేషవాసుకులు
శ్రీవిష్ణు నభవునిఁ జేరిరి మున్ను.
సకలలోకైకరక్షకుఁడవు గాన,
'నాకుఁడ నేవచ్చితి [3] నోము న' న్ననుచుఁ
గోర, దేనికి మందుగోరని యమృత
ధార దాఁచితి; దది తగిలె మీచేతఁ;
బుడిసెఁ డాయమృతంబు పోయింపు నాకుఁ;
గడపెద నీ బారి కరుణావిధేయ!"

---

1. ఈద్విపద అనన్వితముగా నున్నది. ఇట్లు సవరించినఁ గొంతసరిపడునేమొ!
'తోళ్లువమలిన ?త్తులనక్కలుండ-నూళ్లఁగుక్కలమోఁదు టొనఁగూడె మాకు.'
2. పోనీనా. 3. నోడకు మనుచుఁ గోరనేటికి. (మూ).

అనిచొచ్చిపోయి, దైన్యంబున నతని
కనకమహాపీఠకముఁ జుట్టి యుండె.
ఆవిధంబున సర్పయాగ మానృపతి
గావింప, నాగలోకమున నింటింట
బాలవృద్ధాంగనల్ బలసి వాపోవ,

### ఆస్తీకుఁడు సర్పయాగమును వారించుట

నాలించి, యాస్తీకుఁడనుమహామాని
యనఘు, జరత్కారుఁడనుమునీంద్రునకు
నెనయు జరత్కారువను నాగసతికి
జనియించినట్టి యాసంబంధమునను
వినయంబుతో సర్పవితతి ప్రార్థింప,
'మాతృవంశమువారి మరణభయంబు
నే తెఱంగుననైన నే మాన్తు' ననుచుఁ,
జలకాకపక్షులసంయమివరుఁడు
చెలులును శిష్యులు సేవింపఁ గదలి,
జనమేజయునియాగశాలకుఁ బోయి,
వినయసంపూర్ణుఁడై, వేగిరపడక,
మునుల నానాతంత్రములనున్నవారిఁ
గొనియాడి, తజ్ఞులఁ గోరికీర్తించి,
పాత్రంబులొడ్డినఫణితి నుతించి,
ధాత్రీశు నియతచిత్తమునకు నలరి,
మఱియుఁ బదార్థసామగ్రి నుతించి,
నలిఁ దొంటిక్రతువులనన్ని పోనాడి
మెచ్చించుటయుఁ, బల్కె మేదినీనాథుఁ:
"డిచ్ఛదనీకోర్కి యేమైన నడుగు;
నిక్క; మెవ్వఁడవయ్య! నీదేహకాంతి
పిక్కటిల్లఁగఁ జొచ్చెఁ బృథివినల్లెడల.

నీవయస్సులవారు నీతోడిమునులు
దేవతామూర్తులు దీప్తిసమ్మితులు.
........................
నీవాక్యవిభవంబు నీచిత్తశాంతి
భావించి యాశ్చర్యభరితుండనైతి."
ననవిని, యాస్తీకుఁడనియె: "రాజేంద్ర,

## ఆస్తీకజన్మవృత్తాంతము

తనయుండ నే జరత్కారుసంయమికి;
నాతండు బ్రహ్మచర్యంబు వేదంబు
ప్రీతివ్రతంబుగాఁ బెంపొందుచోటఁ,
బితరు లాతనిఁగాంచి పెంపారననిరి:
'ధృతిమంత, యిట్టిప్రతిజ్ఞలు గలవె!
ఉత్తమాంగములేని యొడలునుబోలె
సత్తనయుఁడులేని సంసారమేల!
నెఱి నిట్టినియమంబు నీవు చేకొనఁగ
నరయుచున్నారము నరకాననుండి;
చేయంగదే! దారచింతనం.' బనిన,
నాయుత్తముఁడు వారియాజ్ఞకు వెఱచి:
'నాకిది [1] సేయు, మన్నామకన్య
నాకునౌఁగాని యున్నస్థితిఁగాదు.
కలుగునొకో జరత్కారు పేరైన!
నిలిపెదఁ గుఱ;' మని నిఖిలంబు నరసి,
యిట్టిది నాగకన్యక గల్గుటయును
నెట్టననెఱిఁగి, పాణిగ్రహణంబు
చేసి.....................
........................

1. నాయ. (మా)

మానినికిట్లను : "మగువరో, యొకటి
నేనీకుఁ జెప్పెద నిర్ణయంబిపుడు ;
ఎప్పుడు నీవు నా యిచ్చ నొప్పింతు
వప్పుడు నినుడించి యరుగుదుఁ జూవె".
అనియొడంబఱచి, సంయమి జరత్కారు
డొనరఁ బెండిలియాడి యుండె. నంతటను
నొక్కనాఁడువిద సూర్యుఁడు గ్రుంకు వేళ
చక్కఁ బవళించు మగని వీక్షించి :
"తెలుపకుండిన నట్లొ ! తెలిపిన నట్లొ !
కులర నివ్వేఁగర్త మవ్వాలసుఖము !
ఏమి సేయుదుంగ నా కేమియయ్యెడినో !
పాములోఁ జెలిమయ్యెఁ బతితోడ నాకుఁ !
గడచి పోయెడుఁ దసకర్తంబు [1] దీర్ప
నిదె సర్వమునులు నేఁగెదరు గాలమికి ;
నలిగిన నలిగెఁ ; గార్యము చూతు." ననుచుఁ
దెలిపిన, మాతండ్రి దృష్టిఁ గెంపొదవ :
"నే నిద్రపోవుచో ననుఁ దెల్పఁ గ్రుంకుఁ !
బూని కార్యము తలపోయలేవైతి !
సుఖ మేలచెఱచితి ! సుప్తిఁ బోలంగ
సుఖమొందఁగలదు ! సుస్థిరమతి ;" ననుచుఁ,
'బతియిచ్చ మెలఁగని పడఁతి కాపురము
ధృతిఁ దోపతప్పిన తెరువరి యాత్ర ;
గావున, నొడఁబాటుగల నిన్ను డించి
పోవ నతఁగు నాతపోవనంబునకు.
కలఁ డుదయింప నీ గర్భగోళమునఁ
గులదీపకుండైన కొడుకు భీతిలకు'.

1. దప్ప. (మూ).

అనిచెప్పి ముని పోయె; నాతనిసుతుండ;
దినకరతేజ, యాస్తీకుండ నేను.
నన్ను మెచ్చితినంటి; నామాతృకులము
మన్నింపవే! యిట్టిమఖ మింక వలదు.
ఘనుఁడ, నీచేయునాగప్రళయమున
*కనిలుండు, నీలుండు, నాశరభుండుఁ,
కర్కోటకుండును, గాలదంతుండుఁ,
దర్కింపఁ బారావతంబనుపాము,
నక్షతుఁ, డశ్రుతుం, డాకక్షకుండు,
లక్షింపఁ శంఖపాలుఁడు, ధనంజయుఁడు,
మణినాగ శబల వామన కిటింజయ శ-
రణ శకునులుఁ, బాండరము గనుఘణులుఁ,
బొనర నేరక ప్రాతహమ్మరకంబు
లనువివిమొదలుగా నశ్నియువడలెఁ.
గద్రువ మేనెలుంగక మూర్ఛపోయె.
రౌద్రమింకేటి! కుర్వర మోవవలయుఁ!
జక్రిహింసిగియోల! చక్రిభక్తుఁడవు!
విక్రమంబిదియోల! ద్విజులుపన్నగులు.
గుహచొప్పి, పవనంబుగ్రోలుచుఁ జొక్కి,
తుహినాంశునిజకాంతి తూకొనఁగలిగి,
కంచుకమాత్రంబుగలుగు భోగీంద్ర
లించుకవెల్తి యోగీంద్రులుగారె!"
అనుటయు, జనమేజయక్షితీశ్వరుఁడు
కనికరం బెంతయుఁ [1] గలిగి నవ్వుచును
ఆక్షణంబున సర్పయాగంబు మానె.
దక్షకుం డావేళఁ, దాను నింద్రుంకు

---

* ఈ పాముల పేర్లపట్టిక, తుదిమొదలులేక చీకాకుగానుండుటచేఁ, గొంతవఱకు వక్షరములపోలికనిబట్టి కవిత్రయభారతానుసారముగా సవరింపఁబడెను.

1. గని. (మూ).

నిట ‘తక్షకాయ సహేంద్రాయ’ యనెడు
కుటిలమంత్రంబుల గుట్టులుపదలి,
హాహారవంబులో సంతరిక్షమున
నాహుతిదిరుగుచు నగ్నిలోపలికి
నేతేర, నాస్తీకుండెలుంగెత్తి నిలిపి,
పాతాళమునకలపె భయమెల్ల మాన్పి.
ఎనయంగ నాస్తీకముని పుణ్యచరిత
వినినవారికి లేదు విషధరభీతి.
ఆస్తీకముని మాన్ప, నట్లుయాగంబు
ప్రస్తరింపుటమాని, పారీక్షితుండు
నిగమార్థవిదులకు నిఖలహోతలకుఁ
దగనొప్ప సంపూర్ణదక్షిణలిచ్చి,
యొనసిన వేడ్కతో నమ్మునీశ్వరుల (?)
ననుపక తనయూరికరుదెంచి, యందుఁ
బదివేలసిండికంబములకూటమున
మృదులతల్పంబున మెలసికూర్చుండి,
యుచితాసనంబులనునిచి సన్మునుల
నుచిరతేజస్కుల సొరిదిఁ బూజించి,
వ్యాసు నశేషభావనంబూజచేసి,
గూసంయమికి మ్రొక్కి యంజలిచేసి :
“ అయ్య, వేదవ్యాస, ఆగమావాస,
నియ్యమగ్రహములు నిఖిలవేదములు ;
నీవాక్యసీమలు నిఖిలశాస్త్రములు ;
భావింప నూతనబ్రహ్మవు ; గాన,
బంచమవేదంబు భారతాఖ్యంబు
మించినవేడ్క భావించినకవివి.
అది నాకు సర్వంబు నానతియీవె!
ముదమొప్ప వినియెద మునులసన్నిధిని.

నాకలోకంబున నాగలోకముఁ
జేకొని చదువఁబంచితివి శిష్యులను ;
ఈలోకమున నాకు నెఱిఁగింపవలయుఁ
దైలోక్యమున నని తనరునట్లుగను."
అనిన, వేదవ్యాసుఁ డతనిప్రార్థనకు
ననుకూలచిత్తుఁడై యందఱఁజూచి,
వారివారికి వేదక్రమ వర్తిల్లుకొఱిఁగి,
యారాజవరున కిట్లని యానతిచ్చె :
"ఆసిన బ్రహ్మహత్యాది[1] పాపముల
కేను బ్రాయశ్చిత్త మిది చేసినాఁడ.
వినియెడు వేదశాసనము యెవ్వారికి
జనియించు నాశంకు జగతిని వాఁడు.
నీనిమిత్తంబున నిఖలమానవులు
నానుకయుక్త భవాంబుధి గడచి
శ్రీనిధిపదభక్తి చెందఁగలారు ;
మానవవా, ధనుమానంబు లేదు.
కావున, నీపుణ్యకథ కడముట్ట
సావధానమున వైశంపాయనుండు
చతురుండు సకలశాస్త్రార్థకోవిదుఁడు
హితమతి నన్నియు నెఱిఁగించు నీకు."
నని వానిఁజూపి సంయమిపోవుటయును,
జనలోకపతి వేదసంధిల్లనున్న,
వదలక యతనికా వ్యాసజన్మంబు
మొదలుగ నక్కథ మునిచెప్పఁదొడఁగెన్

### ఉపరిచరవసువృత్తాంతము

"వసువనియెడురాజు వసధపర్యంత
వసుధయేలుచు, నూఱువర్షముల్ తొల్లి

1. పాతకుల. (పా)

తపనుఁ డర్థితోఁ దపమాచరింప,
విపులాంశుఁడైన యవ్వేలుపుకృపను
ననలభానుసమానమగు విమానంబు
వినువీధి నెపుడైన విహరించుదానిఁ
గాంచి యాకాశమార్గమునఁ జరింపఁ,
గాంచనరుచులు లోకములెల్ల నిండ
నుపరిచరుండయి, యుర్వీశరాజు
నపరిమితానందుఁడై యొప్పుమిగిలె.
అరయ నొక్కయెడ [illegible]పురము
చేరువఁ బాఱు విశేషసంపదలఁ.
జూచు నొక్కొక్కమాఱు సుకుమారమీన
లోచన శుభగుణ లోలదృష్టులను ;
బలుకు నొక్కొక్కమాఱు బక చక్రవాక
కలహంస మధుకర క్రౌంచనాదముల ;
మెలఁగు నొక్కొక్కసాఱు మృదుల మృణాళ
వలనహస్తవిలాస వైభవంబొప్ప ;
నెలయు నొక్కొక్కమాఱు వీచిసంక్షోభ
కలిత కైరవ ఫేన కసుల హాసముల ;
వనచారణములు ప్రవాహమధ్యమున
మునుఁగఁ గుంభకుచాద్రులును గానవైన,
భయపడిగతిఁ బద్మపత్రాంబరమున
నయమతిఁ గప్పు నున్నతి నొక్కమాఱు ;
నిగిడినయిసుకతిన్నె యుపిఱుందునకుఁ
దగుమొలనూలని తజ్ఞులెన్నంగ.
దర నోలిరాలిన తరుముకుళముల
యురుపంక్తి శోభిల్లు నొక్కొక్కమాఱు ;
అరవిందములమీఁద నళిసమూహంబు
సగసవైఖరి ప్రాలి సందడించుటయు,

రాజిత కల్హారరాజిహస్తముల
నోజతోఁ దాలఁగించు నొక్కొకమాటు;
వీక్షింప నీరీతి విలసిల్లు నేలు
లక్షించి, కోలాహలంబుకొండ
రతిరాజవశత నొప్పడఁ బాఁటుకలఁగి,
'సుతభిక్షమిడర! నేఁజూచెద' ననుచు
నడపక యుద్యోటి కెలమి నడ్డంబు
నడిసిఁ, బ్రవాహంబు పాఱకనిలిచి,
'యుచితనాథుసఁగూడి యుబ్బెనో' యనఁగఁ
బ్రచురంబుగానుబ్బి పట్టణంబునకు
బెదరుపుట్టించినఁ, బృథివీశుఁ డెటేఁగి
తుదిగాల నక్కొండఁ దొలఁగఁద్రోచినను,
నక్కొండదనున్నవా రటయున్న పుట్టి
రొక్కకూఁతురుఁ బుత్త్రుఁ డుత్తమాకృతులు.
మగవాని రాజుగా మత్స్యరాజ్యమునఁ
దగనిల్పె నృపతి. యాతన్వికిఁ జొక్క :
"గిరికిఁబుట్ట నాగిరిజయుఁబోలె
గిరికాభిధానంబు కృతనాతిఁదాల్చి,
నాధర్మ్యవర్తినై, నవరత్నఖచిత
సౌధవీథుల యందుఁ జరియించు కాంత!"
అని దాసిఁబెండ్లియై, యసమాస్త్రగతులఁ
దనియక, కొంకనాఁడు ధరణీశ్వరుండు
వేటలోనుండియు, విరహతాపంబు
గాటమైయుండ నక్కాంతనే తలఁచె.
తలఁచినతలఁపు ప్రత్యక్షంబుగంటె
నలకొని నిజమైన సతి నొర్వలేక,
మనసున రతిచేసి మదనాంబుధార
వినయంబుచాలక వెడలించి, దాసఁ

జయ్యన దొప్పలో సవరించి, యంత
నయ్యెడ సకలభాషాజ్ఞుఁడగుట
నొక డేగరప్పించి యుర్వీశుఁడనియెఁ:
"బ్రకటితపురుషార్థపరుఁడ వోపక్షి,
విష్ణువాహన వంశ[1] విదితుఁడ వీవు;
విష్ణుభక్తుఁడ నేను; వినుమొకమాట.
చిత్తజాజలము నించితి మేనుమఱచి;
యెత్తెఱంగొనరింతు! నిదియమోఘంబు!
కట్టెద నీమెడఁ; గడువేగఁబోయి,
పట్టన నీవయ్య నీచెలియలికి.
ఘనశౌర్యలక్షణంబులుగలిగినవాని
తనయుకు నీదుబాంధవ మెందుఁగలదు!"
అనుచు డగ్గఱఁబోయి యావీర్యపాత్ర
యనఘుండు మెడఁగట్ట, పద మీఁదికెగసి
పోవఁబోవఁగ, మాంసబుద్ధి నచ్చటికి
నావల నొకపక్షి యడ్డంబువచ్చి
యాలంబుసేయ, వీర్యంబుదొలంకి
కాళిందినడునీటఁ గాఱెఁ; గాఱుటయు,
నదిమ్రింగి గర్భమై యుండొకమీను
చదురైనవిధియాజ్ఞఁ జరియింపుచున్న,

## మత్స్యగంధి జనన వృత్తాంతము

నంబుధిలోన జాలంబులువన్ని
పడినయామీనుఁ బల్లెవాఁడొకఁడు
వేఁటలాడుచుఁబట్టి వేతెచ్చి యింట
వాటంపుఁగూరకు వాలుగఁదఱుగ,

1. విదుడవునీవు. (మూ)

ముత్తెంపుఁజిప్పలో ముత్యమున్నట్లు
చిత్రజాడీమమై చెలువ యొకర్తు
కానవచ్చిన, [1] నిధిగన్న నిర్పేద
పూనిక నాత్మలోఁబొంగ, [2] ధీవరుఁడు
నబ్బాలికామణి నాలిచేసి నగ,
గుబ్బగుబ్బునఁ జన్నుగుబ్బలఁ జేపి
పడఁతియిట్లను : "దీని భవుఁడిచ్చెఁగాక !
మనుఁగెల్ల ! మీనెల్ల ! మాకీబిడ్డయెట్లు !
అనపత్యతాదోష మణఁగెఁబో నేఁడు !
పొనరఁ బాఁదెనుసొమ్ము పోను సెందున్న.
రక్షించి మన మొకరాజున కిత్తు ;
మత్స్యణంబునఁ దీఱు సకలార్తులెల్ల.
మత్స్యమారణ మింక మానుము నీవు ;
మత్స్యగంధనునామ మొలుకు దీనికిని ;
బూనిపెంతముగాక పూఁబోఁడి", ననుచు

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

ఇరువురుఁ బ్రియమున నాతిమ్మనను
నరయు, సత్యాము నది యభివృద్ధిఁబొంది,
కరువునఁబోసిన కనకంపుఁ బ్రతిమ
కరణి యౌవనవేళఁ గనుఁజూడనొప్పు,
గాళిందిలో నోడఁ గడప నయ్యతివ
/ బాలించె గైవర్తచక్ర[3]వర్తియును.

## వేదవ్యాసావతారము

అంతట, నొకనాఁడు హరిపరాయణుఁడు
శాంతిశీలుఁడు పరాశరమునీశ్వరుఁడు,

---

1. నిధిగన్నని ర్పేద. 2. దేవలుండు. 3. కర్తులును. (మూ)

మాససహస్రంబు మేటి తీర్థయాత్ర
చేసి, యచ్చోటికిఁ జెలువొప్పవచ్చి,
లోలవీచుల నాకలోకంబు ప్రాఁకు
కాళిందిదాఁటి నక్కడఁ ద్రోవలేక
'యోడవారెచ్చోటనున్నారో'! యనినఁ,
జేడియవిని వచ్చి చేతులు మొగిచి :
"యేతెంచి మునినాథ, యెక్కవే యోడ ;
చూతువుగాని నా[1] సూటి యీపనికి ;
వావిరి యమునాప్రవాహంబు దాటి
యావలనున్నాఁడవని విచారింపు.
దట్టపుభవవార్థి దాటెడునీకు
నిట్టికాలువ లెంత! యేతెంతుగాక."
యనిన నాయింతి నయంబుఁ బ్రియంబుఁ
దనుకాంతియును జూచి, తాపసోత్తముఁడు
కన్నులతళుకులుఁ గల్కి మొగంబు
నన్నువనడుము ధైర్యముఁజుట్టికొనఁగ,
నతివలావణ్యప్రవాహంబునందుఁ
బతితుఁడై యాకాశపథము చూచుచును,
జాపలంబున బ్రహ్మచర్యధనంబు
తీపువిల్కాఁడను తెక్కలి గొనఁగ,
నేమియుననక మునీంద్రుఁ డయ్యేట
భామినివలకేలు ప్రాపుగాఁబట్టి,
యుచితాసనంబుననుండి, యాయతివ
కుచములపొంగును, గురుల తేటయును,
నయనవిభ్రమమును, నడుములేమియును,
బ్రియదర్శనంబైన పిఱుఁదుఁ, బిక్కలును,

1. మూలుసాపనికి. (మా)

ముంగొంగు లెగఁద్రోచి సోఁకలించుటయుఁ,
దొంగలించెడు మిసిమితొడల గ్రొమ్మించు,
దర్వీచే నుదకంబు తప్పించునపుడు
పర్వీకానఁగవచ్చు బాహుమూలములు,
బలువున మునివ్రేళ్లఁ బలకత్రొక్కుటయుఁ,
దలదిండులైన పాదముల పెంపులును,
గిన్నరశ్రుతినాదు కృష్ణాహిపోలె
నెన్నన విహరించు వేణియుఁ జూచి,
కౌతుకంబున నోడగడపక యుండఁ
జేతులు ముని పట్టి చెలువకిట్లనియె :
"అంగజు [1] సాక్షిగా నబల, యిచ్చోట
సంగమమగుఁగాక సరి నీకు నాకు.
ఉత్తమసతితోడ యోగమానేని,
హత్తినబ్రహ్మచర్యము చెర్గి [2] పోదు ;
చెరిగిపోయినఁబోయెఁ ; జెప్పెదిదేమి !
తెలివ, నీపొత్తుసంధింపవలె నాకు.
చూచితిశర్వాణిఁ ; జూచితిరతిని ;
జూచితిహరిరాణిఁ ; జూచితిరంభ ;
నింతవుట్టియెఱుంగ ; వేయేల ! నేఁడు
కాంత, నీయెడ నయ్యెఁగన్నుల మరులు."
అనిన, ధైర్యముఁబట్టి యబల యిట్లనియె :
"ననునేలపట్టెదు ! నాకులమెంత !
యేముపల్లియవార ; మీవుసన్ముని !
రామలులేరె ! పరాశరబ్రహ్మ !
[3] చెలువుదైవమెఱుంగుఁ ! జెఱుమీనుపోలను
వలచునా దేహంబు వతిదౌర్గంధ్యంబు.

1. కాంచిగా 2. చిర్వబోదు. 3. చెలువదైవ మెఱుంగు చెఱుమీనుపోలను. (మా)

[1]అట్టులైనఁ గాక, మత్స్యగంధగర్భమునఁ
బుట్టితి ; మానుషబుద్ధి నెఱుఁగుదును.
గుణదోషములలోన గుణములల్పములు ;
గణుతింప నేను నీ కాంతికిఁ గలనె !
అతివలయెడలఁ బాత్రాపాత్ర [2]చింత
యతనుండు తా నెఱుంగఁగనీఁడు మొదల ;
ఆపాటివారమే ! యటులుండు." అనినఁ,
దాపసాగ్రణ్యుఁ డాతరుణి కిట్లనియె :
"లీల నీతనువు పల్లియవంశమునను
నేలపుట్టఁగ నేర్చు నిభరాజగమన !
నీచరిత్రం బేను నిజయోగదృష్టిఁ
జూచితి ; నొక్కరాజునకీవు సుతవు.
'మీనగంధము పోదు మేనిఁక' ననుచు
మానిని, నీవు మానింపవలదు ;
ఘనసార మృగమద ఘనగంధసార
ఘనసార రసములు గలుగునత్తావి
చుట్టుయోజనమున జోడుముట్టంగ
నట్టనఁ గలిగెడు నీశరీరమున ;
జనులెల్ల నీవు యోజనగంధి యనఁగ
వనితాలలామ, ప్రవర్తింతువు గాక."
అనినంత, నతని వాక్యప్రభావమునఁ
దనమేన సౌరభ తతులుల్లసిల్లి
యాలువసల్లింప, నించుక సిగ్గు
జాలివట్టంగ నాజవ్వని పల్కెఁ :
"గట్టినవలువపూర్చి, శాంతుసుతోడ
నట్టి [3]ప్రౌఢలకైన నీపట్టపగలు

---

1. అందునగాధమత్స్యంబు. 2. యింత. 3. ప్రాజ్ఞులకైన. (మూ)

రతిసల్పవచ్చునె! రాత్రిగా; దీవు
[1] యతిపతి; వదిగాక, యేనుగన్యకను;
ఈవు మున్నలిగిన నెసఁగఁ దావార్చి;
గావున, నేమిపల్కఁగ నేమియుఁ గదె!"
అనుటయు, మునిచంద్రుఁ డంధకారంబు
ఘనమైనమూఁడ [2]మఁ జటగిల్లఁజేసి,
కాంతియుఁ గన్నెతనముఁ జెడకుండఁ
గాంతకువరమిచ్చి, కస్తూరిఁ గోడ
వరదనొయ్యనవచ్చి, పడి నొక్కఁ జోట
నొరగినయామోద [3] నొద్దుఁ జేర్చి,
'రమ్మ'ని కామినీరత్నంబు డించి,
సమ్మదంబున దర్భశయ్య గావించి,
యువిద మన్మథకేళి నోలలాడింప,
ధ్రువకీర్తి యపుడు సద్యోగర్భమునను
నుత్తుంగభుజములు, యోగదండంబు,
జొత్తిల్లుజడలును, సోగకన్నులును,
నీలాభ్రరుచులును, నెఱిఁగృష్ణమృగము
తోలుపుట్టంబు, వర్తులకమండలము,
లీలముక్తాక్షమాలిక, జన్నిదంబు,
వేలఁబవిత్రంబు వెసఁ దోడ మొలవ,
బ్రహ్మాంశమునఁ దాఁ దపస్వియైపుట్టి
బ్రహ్మణ్యుఁ డావ్యాసభట్టారకుండు.
ద్వీపంబునందు సంధిల్లుటఁజేసి
ద్వైపాయనాఖ్యగాఁ దండ్రిగావింప,
ధర నిట్లుజనియించి తల్లిదండ్రులకుఁ
గరములుమొగిచి: "యోగగుణాఢ్యులార,

1. యతిని. 2. మచ్చట. 3. నొయ్యన. (మూ)

తపమునకేఁగెద ; దయఁజూడుఁ డనఘుఁ ;
డపరిమితోత్సాహుఁడై యున్న వాఁడ.
మీనిమిత్తంబున మేనుసిద్ధించె ;
నేను జేసినపుణ్యమెల్ల మీసొమ్ము.
పలుమాఱు వేడ్కతోఁ బసిగల్గునపుడు
తలఁపుఁడు వచ్చెదఁ దాత్పర్యమొప్ప ;"
ననిచెప్పి మ్రొక్కి, [1] హిమాద్రియవ్వలికిఁ
జనియె నాతఁడు దేవచక్రంబు పొగడ.
అట పరాశరుఁడును సద్యోఋతుదాటి,
కుటిల [2] కుంతలను వీడ్కొని వేగసరిగె.
ఆవిధమునఁ దప మయ్యత్రి సుతుఁడు
గావించి, మఱి పెక్కుకాలంబునకును
ఆదిమబ్రహ్మఁ బ్రత్యక్షంబుచేసి,
యా దేవుచే విద్యలన్నియు నేర్చి,
యాదరంబున లెక్కకధికంబులైన
వేదంబు లొండొండ [3] విభజించి తీర్చి,
సారబంధంబుగా జనులకుఁ జదువ-
నేరవచ్చినపాటి నెఱి నాల్గుశ్రుతులు
విరచించి, పిదపఁ గావించె భారతము
సరవి సపాదలక్షశ్లోకములను.
అంతట నది మాకు నానతియిచ్చె ;
నింతయు నీకు నే నెఱిఁగింతు వినుము.
పంచాక్షరియుఁబోలెఁ బరఁగినకథను
బంచమవేదంబు పాయక వినినఁ,
బంచపాతకములు పాయు భూనాథ !
పంచ [4] వక్త్రుండిచ్చుఁ బరమసంపదలు.

1. హిమాద్రి. 2. కుంతలిని. 3. విభగించి తిగిచి. 4. వర్ణుండిచ్చు. (మూ)

ఏవగింపక సేయుఁ; డిదియు వాఁధర్మ
మేవిధంబుల నుండు నే వినియుండు ;
నే యుగంబునఁ జేయ రెవ్వారు మున్ను ;
నా యాజ్ఞ నిది మీరు నడపుఁడు మేలు."
అనుడు నమ్మునిరాజ్ఞ యందఱుఁ జేసి
తనయులఁ గాంచ, సత్తనయు లింటింటఁ
బెరిగి పిత్రుల యాజ్ఞఁ బృథివి రక్షింపఁ,
బరఁగిన ధర్మప్రభావంబువలనఁ
గురిసె వర్షంబులు గోరినయట్లు ;
ధరణి సస్యములెల్ల ధాన్యమై [1] రూఢిగాఁ ;
బెల్లుగా మొదవులు పిదికెఁ జన్నవిసి ;
ఎల్ల [2] పేదఱిమి శోకము లస్తమించె ;
నిరువురఁ గూఁతుల నెనమండ్ర సుతుల
నిరపాయులగు వారి నెలఁతలు గనిరి ;
పదివర్షములనాఁడె బ్రహ్మచారులకుఁ
జదువక ప్రాపించె సర్వవిద్యలును ;
ముదిసియు, నౌషధంబుల లావువలన
వదలరు తఱుచు ; చావరు మహీజనులు.
ధరలోన నగ్నిహోత్రములేని ద్విజుఁడుఁ,
బురుషునిఁ బాసిన పొలఁతియు లేదు.
వన్యధాన్యంబుల వనచరుల్ దనిసి,
సన్యసించిరి హింస జంతువులందు.
హరులును గరులు వాహనములుగాని,
నరవాహములు లేవు [3] నరుల మోయుటకు.
ఇట్టివైభవముల [4] నెనసి మానవులు
పుట్టియుండినయట్లు భూమిఁ గ్రిక్కిఱియ,

---

1. పెరిగి. 2. పెదరమి. 3. నరులు మోవమిని. 4. నెంచి. (మూ)

గిరి శేష మాతంగ కిటి కూర్మములకు
ధరియింపరాక యెంతయు భారమైన,
ధర నిండుచూలుకాంతయుఁబోలె నలసి,
శరధిలో నాగేంద్రశయుఁ గానఁబోయి,
నామంబునొడివి ప్రణామంబుచేసి
లేమ యల్లన లక్ష్మి లేనత్త లేచి,
వడఁకుచునిట్లను: "నాప్రాణనాథ,
జడిసితి మాన్పవేజంతుభారంబు!
నాకునై కిటివైతి; నలిఁ గూర్మమైతి;
నీకుఁబోవున దేవ, నేఁటిపట్టునను.
పుక్కిటఁ బదునాల్గు భువనంబులందు

... ... ... ... ... ... ...

ఏనిదే లెక్కకునెక్కుడైనట్టి
మానవమాత్రుల మతిమోవఁజాల.
[1] ఖలమైన ధర్మ విరోక్రియ రాజసుతులు
చెలువార నాచరించిన ప్రభావమున
శాఖోపశాఖలై చెలువుప్పతిల్ల
లోకపూజిత, ముప్పాలేకయున్నారు.
ఇన్నియు నీమూర్తు; లివి యింకఁ గొన్ని
నిన్నుఁగూడినఁగాని నిలువలే." ననినఁ
గరుణించి, ధరఁజూచి కమలాక్షుఁడనియె:
"నరులుప్రేఁగైరని నాతి, యోడకుము;
నచ్చనియీప్రేఁగు నరుఁడనై పుట్టి
పుచ్ఛేద ములు ముంటఁబుచ్చినయట్లు.
ఏనట్లుపుట్టిన, నింద్రాదు లమర
[2] యోనులు నరులుగా నుదయింపఁగలరు.

---

1. ఖల. 2. యోనుల నరులఁ. (మూ)

తెలిపి వారలరెండు తెగలగాఁ గూర్చి,
కలహింపఁ జేసెదఁ గళ్యాణి, వినుము.
అందు నిందునుగూడి యధికమానవులు
మ్రందుదు ; రంత నెమ్మదినుండుగాని".
అని భూమివీడ్కొల్పి, హరి యంత వెనుక
మనుజుఁడై, శ్రావణమాసకృష్ణమున
నష్టమి రోహిణి నర్ధరాత్రమున
దృష్టింప వసుదేవ దేవకులందుఁ
బన్నగేంద్రుఁడు బలభద్రాఖ్యఁ దనకు
నన్నయై మునుబుట్ట, యదుకులాంబుధిని
[1] కృష్ణ నారాయణ కేశవ జిష్ణు
విష్ణు నామసహస్ర విభవంబునందు
రామ రామాంతర రామావతార
సామర్థ్యరూపమై జనియించి మించె.
హరిజన్మ మదివిన్న నఖిలపుణ్యులును
హరిరూపులై యుందు రందును నిందు.

సురాసురులయంశమున భీష్మాదివీరులు జనించుట

హరి యిట్లు జనియింప, నసురులు సురలు
[2] హరివాక్యమున ధాత్రి నటపుట్టుచోట,
వసువులయంశముల్ వలనొప్పఁ దాల్చి
పొసఁగ భీష్ముఁడుపుట్టెఁ బుణ్యమానసుఁడు ;
ద్రోణుండుపుట్టె శుక్రునియంశమునను ;
క్షోణిఁ గర్ణుఁడుపుట్టె సూర్యాంశమునను ;
రూఢి నేకాదశరుద్రులంశమున
[3] గూఢముగ నుదయించె గుణమూర్తి కృపుఁడు ;
మహినిఁ గామ క్రోధ మద మత్సరముల
సహవాసలీల నశ్వత్థామపుట్టె ;

1. సహస్రనామకుఁడగు విష్ణునవతారములలో రామత్రయ సామర్థ్యము గలిగి కృష్ణుఁడు జన్మించెనని కవితాత్పర్యమేమో! 2. హరిలోకమున. 3. గూఢగా. (మూ)

ఉరుశక్తి ద్వాపరయుగము నంశమున
ధరఁ బుట్టె శకుని జూదపునేర్పుతోడ;
[1] ఘనుఁడు హంసుండను గంధర్వునంశ
మున ధృతరాష్ట్రుండు పుట్టె భూవిభుఁడు;
విను మంత [2] మతియను వేల్పునంశమున
జనియించె గాంధారి శతపుత్త్రమాత;
కలియుగాంశంబునఁ గడుఁ గ్రూరుఁడగుచుఁ
దులితార్యుఁ డుదయించె దుర్యోధనుండు;
తనరఁ బౌలస్త్యసోదరులు నూర్వురును
ననుజులై యుదయించి రాకౌరవునకు;
శిశుపాలుఁ డుదయించెఁ జెలఁగి హిరణ్య-
కశిపునంశంబునఁ గడుఁ గ్రూరుఁడగుచు;
అనువొప్ప సహ్లాదుఁడను దైత్యునంశ
మున శల్యుఁడుదయించె భుజబలోన్నతుఁడు;
తగవొప్ప బాష్కలదైత్యునంశమున
భగదత్తుఁ డుదయించెఁ బరమవైష్ణవుఁడు;
విప్రచిత్తను యక్షవిభుని యంశమున
సప్రతాపుఁడు జరాసంధుండుపుట్టె;
ననఘ! నపుంసకుండగు [3] గుహ్యునంశ
మునఁదోఁచె మలకంటి (?) మొండిశిఖండి;
మానుగాఁ బుట్టిరి [4] మరుదంశమునను
శైనేయ విరట పాంచాలురన్నృపులు;
సదయాత్ముఁడైనట్టి జమునియంశమున
విదురుండు జనియించె విష్ణుభక్తుఁడు;
అదె బ్రహ్మయంశంబునందుఁ బాండుండు
నుదయించె నెంతయు నుర్వి మోదింప;

---

1. ఘనుడై ననఘుడై గంధర్వయంశ. 2. మయయను. 3. దైత్యునంశ.
4. మనుకేశమునను. (మూ)

సిద్ధి బుద్ధి యనంగ సిద్ధకామునుల
యిద్ధాంశములఁ బుట్టి రిలఁ గుంతి మాద్రి;
ధర్మాత్ముఁడైన యంతకునియంశమున
ధర్మరా జుదయించె ధరయెల్లఁబొగడ;
నామహాత్ముని తమ్ముఁ డనిలునంశమున
భీమసేనుఁడు పుట్టె భీమప్రతాపి;
నరుఁడనుముని వచ్చి నాకేంద్రునంశ-
భరమునఁ గ్రీడియై ప్రభవించి మించె;
[1] సహజు లశ్వినులయంశమ్మున నకుల
సహదేవు లాదవిరి జగతినెగినలు;
శ్రీయంశమున యాజ్ఞసేని జన్మించె;
నాయొధృష్టద్యుమ్నుఁ డగ్నియంశమున;
వివరింప భారతవీరులు మఱియు
దివిజాంశ దనుజాంశ దృష్టరూపముల
నవతరించిరి; యందు నమరాంశులెల్ల
రవితేజులైన ధర్మజుని వారైరి;
యసురాంశభవులెల్ల నాసుయోధనుని
వశమున నుండిరి వైరంబుదలఁచి.
అట్టిభారతవంశమనుసముద్రంబు
పుట్టెఁ జంద్రునినుండి బుధుఁడాదిగాఁగ.
జలరాశిఁ జంద్రుండు జనియించెఁగాక;
జలధి చంద్రునియందు జనియించుటరుదు!
నుతికెక్క దుర్యోధనుఁడు బడబాగ్ని;
యతిరథ సమరథు లందు జంతువులు;
సొరిదిఁ బుట్టినరాజసుతులు రత్నములు;
అరయ వారలకీర్తి యమృతరసంబు;

1. సహ్యాదయు లశ్వినులంశమున. (మా)

మొగి ధర్మసుతునికిమ్ములు తరంగములు;
తగఁ జెలియలికట్ట ధర్మజాతాళి;
కలహంసహాయులు కలిసిననదులు;
తలపోఁగ గానినాదము దానివిధము;
ఆయయ మధ్యస్థుఁడై వినోదించు
నారాయణుం డాదినారాయణుండు.
సకలభూతోద్భవము సరవిఁ గావిన్న,
సకలసంపదలిచ్చు సర్వేశ్వరుండు.
ఇట్టివంశమున ననేకులు నృపులు
పుట్టి, యీయిలఁదోలి పోయిన వెనుక,

## యయాతి చరిత్ర

నహుషాత్మజుండైన నవకీర్తిశాలి
యహిమాంశువిభుఁడు యయాతిభూవిభుఁడు
సకలరాజ్యంబును సవరగా నేలి,
ప్రకటించి క్రతువులు బహుభంగిఁ జేసి,
యతఁడు శుక్రునికూఁతు నసురేశుకూఁతు
నతి దేవయాని శర్మిష్ఠల న్వారిఁ
బరఁగ వరించి, యాభార్గవియందు
వరుసతో యదునిఁ దుర్వసునిఁ గాంచె.
సహ్యధర్మాత్ముఁ డాశర్మిష్ఠయందు
ద్రుహ్యానుపూరుల దొరయఁగఁబడసె.
అంత, శర్మిష్ఠపై నవనీశుకూర్మి
కొంతకాలమున శుక్రునికూఁతు రెఱఁగి,
కోపించి జనకునకుఁ గుంది చెప్పుటయుఁ,
దాపసుం డాకవి తద్దరోషించి:
'నాకూఁతు నవ[1]మానము చేసితిగానఁ,
జేకూరు నీకుఁ శిథిలంపుముదిమి.'

---

1. అవమాన్యత. (మూ)

అని శాపమిచ్చిన నతఁడు నట్లగుచుఁ
దనయులకిట్లనుఁ దా : 'సుతులార,
మీ జవ్వనంబిచ్చి మీలోన నొకఁడు
నా జరఁ గొనుఁ'. డన్న నలుగురుసుతులు
'నోపము పొ' మ్మన్న, నొసరఁ బూరుండు
చేపట్టె జర, తనచిన్నిప్రాయంబు
జనకున కిచ్చిన, జననాథుఁ డలరి
తనపంపు సేయని తనయుల విడిచి,
తనరాజ్యమునఁ బూరుఁ దగవాస్స నలిపి
ఘనతపోమహిమ నాకంబున కేఁగె'.
అనవిని జనమేజయావనీనాథుఁ
డనఘు వైశంపాయనార్యు కిట్లనియె :
"వినుతాత్మ, మావంశవృద్ధులందఱును
ఘనధర్మపరులని కలయ నెన్నుదురు.
రాజయ్యుఁ దా నెట్లు రమణ యయాతి
యోజ శుక్రుసుకూఁతు నుద్వాహమయ్యె!
నీసందియము నాకు నెఱుఁగంగఁ జెప్పు ;
మేసమ్మతులఁ జూడ నిది యధర్మంబు".
అనిన నానృపుఁ జూచి యమ్మౌని పలికె :
"విను మేర్పరింతు నావృత్తాంతమెల్ల ;
మును వృషపర్వుండు ముదమొప్ప దనుజ
ఘనరాజ్యము తమిఁ గడిమి నేలుచును,
నొనరిన దానవయోధులఁ గూడి
తనర స్వర్గముమీఁద దండెత్తిపోయి,
యమరులఁ దాను నతిఘోరరణము
సమితంబుగాఁ జేసి యపజయంబొదవి,
నేతెంచి, తనపురోహితునకు నపుడు
[1] బ్రాఁతితోఁ బ్రణమిల్లి భక్తి నిట్లనియె :

1. భ్రాంతితో. (మా)

"భార్గవ, యెప్పుడు సమరంబులోన
స్వర్గధీరులు మాకు జలదరింపుదురు.
నేఁడిదె దైత్యుల నిర్జరోత్తములు
పోఁడిమిఁ జంపిరి పుణ్యాత్మ, వారి
సంజీవనీమంత్ర సామర్థ్యమునను
సంజీవితులఁ జేసి జయమిమ్ము మాకు".
అనుచుఁ బ్రార్థన సేయ, నలరి శుక్రుండు
తనమంత్రశక్తిచే దనుజులఁ గాచె.
ఈవిధంబున మఱి యెల్లరాక్షసుల
నేవెంట నాశుక్రుఁ డెలమి రక్షింప,
బ్రదికి దానవులెల్లఁ బ్రబలులై సురలఁ
బ్రిదులఁ జంపంగ, భీతులై వారు
తమకు సంజీవని తగులమిఁ జేసి
తమసేన పొలియుట తిలకించి వగచి,
తమపురోహితునాజ్ఞఁ 'దత్పుత్రుఁ గచుని
[1]సమరసీమాంత్రార్థ మర్థించి' యనుచుఁ
గచుఁ డున్నకడ కేఁగి, గారవం బొప్ప
నుచితంబు గావించి యొనఁగ పల్కిరి :
"ఓమహాత్మక, నీవు యోగ్యవిప్రుండ;
వేము మాశిష్యుల; మిందువచ్చితిమి;
శుక్రసంజీవని సురుచిరస్ఫూర్తి
విక్రాంతి దైత్యులు వెలవరున్నారు;
వారిచేఁ దెగి మా వరసేనలెల్లఁ
బోరిలోఁ బోయినపోకయై చనిరి;
కావున, నీ విందుఁ గౌశలంబొప్ప
నేవిధంబుననైన హితమాచరించి,

1. అసురనిమంత్రంబు లందింతు మనుచు. (మా)

శుక్రుచే సంజీవి [1] శుభదమంత్రంబు
సక్రమంబునఁగాంచి జరగిరావయ్యా !
అట్లైన, మాకు నీయమరరాజ్యంబు
నెట్లనసిద్ధించు నీప్రసాదమున."
ననుచు దేవతలెల్ల నర్థిఁ బ్రార్థింప,
ననయంబుఁ గచుఁడును 'నవుఁగాక' యనుచుఁ
జనుదెంచి, యాశుక్రసంయమీంద్రునకు
వినతి దండమువెట్టి వేడ్కనిట్లనియె :

కచుఁడు సంజీవనీవిద్యకై శుక్రునొద్దకేఁగుట

"ననఘాత్మ, యేను బృహస్పతిసుతుఁడ ;
నొనరంగఁ గచుఁడ ; మీయొద్దనె విద్య
లన్నియుఁ జదువంగ నరుదెంచినాఁడ ;
నన్ను శిష్యునిఁగాఁగ నడుపవే!" యనినఁ,
గావ్యుండు 'నట్లనె గావింతు' ననుచు
భావ్యంబు మదిలోనఁ బరికించి చూచి :
'ఋషి వీఁ [2] దమరపురోహితుకొడుకు
ఈడఁజదువుట నాకు నెన్నిక ;' యనుచు,
నాకచునకు వేడ్క నఖిలశాస్త్రములు
జోకగాఁ జెప్పుచు శుక్రుఁడున్నంతఁ,
గచుఁడును గురుసేవ కడఁకఁ జేయుచును
నచట శుక్రునికూఁతురగు దేవయాని
నిచ్చలుఁ దనతోడ నెయ్యంబుసేయఁ,
గ్రచ్చఱ నొకనాఁడు కాననంబునను
హోమధేనువుఁ గాచుచుండంగఁ జూచి,
తామసులైనట్టి దానవులలిగి,

1. సుపద. 2. విందమర. (మూ)

‘పగవారిబాఁపనిపట్టిపీఁ’ కనుచుఁ
దెగిచంపి; రంతలో దినపతిగ్రుంకె.
హోమధేనువులెల్ల నొగిఁ దోఁపఁబట్టి
తామె యింటికిరాఁగఁ, దత్సఖుఁ గచునిఁ
గానక భార్గవి కలఁగి శోకింప,
దానవాచార్యుఁడు తనయ కిట్లనియె:
“శోకింపనేటికి సుదతి, నీకిప్పు
డేకొఱఁతయైన నే నిచ్చెదనడుగు;”
ననిన, నాతండ్రితో నతివయిట్లనియె:
“అనఘాత్మ, నేఁ డేమి యావుల వెంటఁ
గచుఁడు రాఁడాయెను! గానలోపలను
[1]బ్రచురంపు మృగకోటి పాలాయెనొక్కొ!
ఏవిధంబుననైన నెఱిఁగి, నిముసముఁ
దేవయ్య వాని నాదృష్టిభూమికిని.”
అనుడు శుక్రుఁడు తనయార్తిఁ జింతించి,
దనుజులచేనొచ్చి ధరనుండు టెఱిఁగి,
సంజీవనీవిద్య చయ్యనఁ బుచ్చి
సంజీవితునిఁ జేసి, సామర్థ్య మొప్ప
రప్పింపఁ, గనుఁజూచి రామ భార్గవియు
నుప్పొంగె హర్షాశ్రులొలుకంగ నపుడు.
వెండియు నొకనాఁడు వికటాటవులను
దండినావులఁ గావ, దనుజులు కినిసి
కచునిఁ జూర్ణముఁ జేసి కలితమద్యమున
నుచితంబుగాఁ గూర్చి యుశనునకొసఁగ,
దానవాచార్యుం డుదగ్రుఁడై త్రావి
తానుదన్నెఱుఁగక దర్పించియుండె.

1. ప్రచితంపు. (మూ)

అంత మాపటివేళ నావులవెంట
నెంతయుఁ గచుఁగాన కిట దేవయాని
జనకునకిట్లను : "జనక, యిదేమి !
ఘనుఁడు నీశిష్యుఁ డెక్కడఁబోయినాఁడు !
అసురులు నేఁడును నడవిలోఁ బట్టి
[1] మిసిమింతుఁజేసిరో మిన్నక వాని" !
అనవుడు భార్గవుఁ డాత్మజకనియెఁ :
"తనయ, యావఙ్గపై దానవులెల్లఁ
జలముగొన్నారు ; నేఁ జాల రక్షింప ;
నలయుక కచుడింక నరుగనీ దివికి.
తా డెక్కుమానిసిఁ దగఁ గ్రిందుపట్టి
మొడగాను ద్రోయంగ నెవ్వారివశము !"
అనినఁ, దొయ్యాలిపల్కు : 'నతఁడులేకున్నఁ,
గొన నన్నపానముల్ కుందుచు.' ననుడుఁ,
దనయపై ననురాగదయుఁ డౌటఁజేసి
విని, భార్గవుండు వివేకించిచూచి,
యన్నిలోకంబుల నతఁడు లేకున్నఁ
గ్రన్ననఁగని, తనకడుపులోఁ జూడఁ
బోవంగ నందులో [2] బుగ్గయైయుండె ;
గావున, సంజీవిఘనమంత్రశక్తి
బ్రదికించి, వానికిఁ బ్రాణమంత్రంబు
లాదవినదయతోడ నుపదేశమిచ్చి :
'యిందాఁక నాజ్ఞాన మొదలించెమధువు ;
నిందితంబగుఁగాక నేటి నింతనుండి ;
[3] పరఁగ మధుపానంబు పాతకం.' బనుచు
గురుసమయముచేసి గురుపుత్త్రుఁబలికె ?

1. మిసిమిగా. 2. బుద్ధి. 3. పరగని మధుపానపాతకుండనుచు. (మూ)

"ఓవత్స, నీవు నాయుదరంబు చించి
వేవచ్చి యీమంత్రవిభవంబుచేత
నను బ్రదికింపుము నయవిధి." యనిన
ననయంబు నాతఁడు నట్లకాఁ జేసి,
దండప్రణామంబు తగ నాచరించి
కొండంతభక్తితో గురున కిట్లనియె:
"అనఘాత్మ, నీచేత నఖిలవిద్యలును
దనరంగ నేర్చితి ధర్మమార్గమున;
భారతీదానంబుఁ బ్రాణదానంబు
నేరుపఁగల నింక నెఱయ నన్యులకుఁ;
బోయెదనే;" యన్నఁ బొంగి భార్గవుఁడు
ధీయుక్తి నాకచు దీవించియనిపె.

## కచదేవయానుల పరస్పర శాపప్రదానము

అనిపిన నాదేవయానికిఁ జెప్పి,
చనియెదనని పోయి జవ్వనిఁబలికె:
"గురుఁడురమ్మని నాకుఁ గోరిపుత్తెంచె;
గురునిచే ననుపించుకొని వచ్చినాఁడ;
నెఱి నింకఁ బోయెద నిజగేహమునకు;
నెఱిఁగింపవచ్చితి నింతి, ని." యనిన,
ననఘు నాకచుఁజూచి యాదేవయాని:
"వినుమయా కచ, నీవు విభుఁడవై నాకు
నుండుదుగా; కింక నొంటరావునకు
దంచికూరిమిమాని తగునె నీకేఁగ!"
అనవుడుఁ, గచుడు నెయ్యముమాని పలికె:
"నను నిట్లు నీవాడ నాయమె ముగ్ధ!
గురుపుత్త్రి వరియించు కుమతులుగలరె!
తరుణి, ధర్మములెల్లఁ దప్పనాడెదవు!

ఒనఁగూడ నీమాట లుడుగుమీ." యనినఁ
గనలి, యాభార్గవి కచునకిట్లనియె :
"ఓచురాత్మకుఁడ, నీవును బ్రాహ్మణుఁడవె!
నీదురుక్తులు నమ్మి నేవెఱ్ఱినైతి.
నీతోడఁ జేసిన నెయ్యమింతయును
[1] నీ తెలుంగునకమ్మె నీటివ్రాల్పగిదిఁ!
గావున, మాతండ్రి కరుణించి చెప్పి
జీవమంత్రము నీకుఁ జెడిపోవుఁగాక."
అనుచు శపించిన నాకచుండలిగి,
యెనయ నాసతిఁజూచి : "యింతి, నేనిట్లు
ధర్మవాక్యము నిన్ను నాఁక నాడినను —
ధర్మమే శపియింపఁ దరుణకి నీకుఁ!
బ్రాణమంత్రము నాకుఁబనిసేయకున్నఁ,
బ్రాణ నాశిష్యులు [2] తామొనర్చెదరు.
ఎనయంగ నీకును హితుఁడైన మగఁడు
మనుజేశుఁడగుఁగాక మహిమమీఱఁగ." ననుచుఁ
గ్రమ్మఱశపియించి కచుఁడు పోవుటయు,
నమ్మానినియు నుండె నార్తవగచుచును.
అంత, నావృషపర్వునాత్మజయైన
శాంతశర్మిష్ఠ భార్గవపుత్రిఁగూడి
పరిచారికలు పెద్దపరిచర్యసేయ
నరుదెంచి, వనములో నలరఁగ్రీడించి,
చీరలుధరఁబెట్టి శీతాంబుకేళి
వారకగావించి వారిలో వెడలి
శుక్రకూఁతురుచీరఁజుట్టెఁ ; జుట్టుటయు
నక్రమంబున, దేవయాని యిట్లనియె :

1. నీతెలుంగునకీటకొతివ్రాయాంపగిది. 2. తామొనేర్చెదరు. (మా)

“నాపుట్టువిది; గిట్ట నాయమె నీకు!
నేపున నీకట్టునీమైలనాకుఁ
గట్టవచ్చున! నాతిక్రమముఁదప్పితివి”.
[1] ఇట్టన, మైమయి నేచి శర్మిష్ఠ
కవిపుత్రికిట్లనుఁ: “గాంత, నేఁజాల
వివరింప కిటుఁగట్ట వీడనాడెదవు!
రాచకూఁతుర నేను; రమణ నాయొద్ది
గోఁచిబాఁపసికీవు కూఁతుర వింతె!
నీచీర నేఁగట్ట నెటిగాదుగాక;
నాచీరగట్టిన నాతి, నీకేమి!”

### యయాతి, నూతఁబడిన దేవయాని నుద్ధరించుట

అనుచువివాదించి, యసురేంద్రపుత్రి
గొనిపోయి భార్గవిఁ గూపంబులోనఁ
ద్రోయించి, యడవిలోఁ దోడనెవచ్చి
ధీయుక్తిఁ బురములోఁ దెమలకయుండె.
అటమున్న, యాకానయందు యయాతి
[2] పటురీతి మృగకోటిఁబట్టి వేఁటాడి
యానూతిచేరువ నటపోవ, నేప్పు
వీనులసోఁకిన, వేఁటచాలించి,
తరుణిగాఁదలపోసి, తద్దయువగచి,
పరికించి నూతిలోపలఁ జూచునపుడు,
కనుఁగవఁ గన్నీరు కడునించి యేడ్చి
కొనగోరఁ గన్నీరుగొని మీటుదానిఁ,
బడినభారంబునఁ బయ్యెదజారి
కదలేనికుచకాంతి గప్పినదాని,

1. యిట్టైన కట్టైనయది. 2. పటురయు. (మూ)

నెడగల నుడివోలె నింపైన నాభి
బడుగునెన్నడుముతోఁ బ్రకటించుదానిఁ
గనుఁగొని, యారాజు కరుణాత్ముఁడగుచు
వనిత వేవెడలించె వలకేలుపట్టి.
ఆరీతి నాకూప మాదేవయాని
వారక వెడలి, యానహుషసుతునకుఁ
దనచరితంబెల్లఁ దప్పక చెప్పి,
వనము వెల్వడివచ్చి వసి యయాతియును
దనపురంబున కేఁగ దళములతోడ.
చనినంత, భార్గవి చనక యూరికిని
ఘూర్ణికయనుచెలిఁ గోరి గావించి :
"నిర్నిమిత్తము నన్ను నేఁడు శర్మిష్ఠ
నూతిలోపలఁద్రోచి, నూర్గురుఁ దాను
నేతెంచెఁగాన నేనింటికిరాను.
ఈ తెఱంగంతయు నీవిప్పుడేఁగి
మాతండ్రికెఱిఁగింపుమా! చాలు." ననిన,
నదియును 'నగుఁగాక' యని పోయి, యతని
కాదవంగ నంతయు నోడక చెప్పఁ;
జెప్పిన, శుక్రుండు చేరంగఁబోయి
తప్పక కూఁతుతో దయనిట్లుపలికె:

### శర్మిష్ఠ దాసియై దేవయానిఁగొలుచుట

"ఓబాల, నీకేల యుగ్రకోపంబు!
[1] ఈబాము లేనుండ నెట్లురావచ్చు!
శర్మిష్ఠచేసినసాహసంబెల్లఁ
గర్మవశం; బింతె! క్రందంగనలదు.

---

1. ఈబాములనునుండ. (మూ)

ఇల్లు [1] వట్టుము; నీకు నిచ్చోటనుండఁ
దల్లి, ధర్మముగాదు; తరుణివిఁకపు."
అని యొడంబఱచుచో, నంతట దైత్య-
ఘనుఁడైన వృషపర్వ [2] క్రవ్యాదవిభుఁడు
తనతనయ చేసిన దంటతనంబు
మనమున నెఱిఁగి, యమ్మగువఁ దోడ్కొనుచు
వచ్చి యాగురునభివందించి పలికె:
'హెచ్చి మాశర్మిష్ఠ యాయింతి కగ్గు
లొనరించె; దీని నేలుఁడు దాసిగాఁగ;'
ననిన, నాశుక్రుండు నంగీకరించె.
అప్పుడు వేడ్కతో నా దేవయాని
యుప్పొంగి, శర్మిష్ఠ యొగిఁ దన్నుఁ గొలువ,
జనకుండు వృషపర్వసహితుఁడై యగ్ర
మునఁబోవ, నేతెంచెఁ బురవరంబునకు.

## దేవయాని వసంతవన విహారము

అంత, నాభార్గవి యట యొక్కనాఁడు
కాంతశర్మిష్ఠాదికాంతలు గొలువ
వనకేళి చేయుచో, వలనొప్ప నఘను
వనమున నొప్పె [3] య్యె వాసంతలక్ష్మి.
మాకంద మందార మధుక మాలూర
శాఖోట పాటలీ చంప కాశోక
వల్లకీ బిల్వాది సకలభూజములు
ఫుల్లంబుగాఁ బూచె ముదమొంద నలులు.
విరహులపై దండు వెడలంగ మదనుఁ
డిరవుతో మునుబంచె నెలగోలనంగ,

---

1. పట్టుట. 2. గంహారి. 3. యవ్వనవసంతంబు. (మా)

మిండతుమ్మెదపిండు మించుఁబూఁదేనె
కండక్రొవ్వునఁ గ్రోలి [1]కలగుండుపెట్టె ;
'మానినీమణులార, మానంబు మాని
మానుగాఁ గలియుఁడు మగల' నన్నట్లు,
మావిలేఁజివురెల్ల మత్తిల్ల [2]మెసవి
కోవిలకదుపులు గొణఁగంగఁదొడఁగె ;
ఫలరసధారలు బాగుగాఁ గ్రోలి,
చిలుకమూఁకలు గూడి చిరలుగొట్టుచును,
పంచబాణుని తేరి [3]వార్యాలమనుచు
ముంచి పాంథులమీఁద మొగసొత్తుచేసె ;
విరహులవిరహాగ్ని విదితంబుసేయ
మరుఁడుపుత్తెంచిన మందిది యనఁగ
మలయాద్రిచలిగాలి మధురసౌరభము
వలనొప్పఁ బొలసె నవ్వనవీథులందు.
అప్పుడు భార్గవి యతిసంభ్రమమున
నుప్పొంగి, చెలులతో నుద్యానవీథి
విహరించి, యెంతయు వేడ్కలింపార
బహుపుష్పవితతులు బహుభంగిఁగోసి
పోగులుపోయించి, పుష్పాస్త్రునచట
బాగుగానొదవించి భక్తిప్రాయించి,
పూజించి యవ్వేల్పుబోఁటికిమ్రొక్కి
రాజుఁగోఁ గొనియాడె: "నోరతిరాజ,
చిగురుఁగైదువుచేతఁ జిత్రంబుగాఁగ
జగములన్నియుగెల్చు జగదేకవీర!"
... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...

1. కడుగుండుపెట్టె. 2. చెమసి. 3. బాణాల. (మూ)

## యయాతి దేవయానిని వివాహమగుట

అనుచుఁ బ్రార్థనచేసి యంజలిచేసి
మనమున నలరి నెమ్మదినుండె. నంత,
నట యయాతియు వేఁటలాడంగఁ బూని,
బటురీతిఁ జతురంగబలములుతోడ
వేఁటకుక్కలు వలల్ వెస [1] బోయవాండ్రు
వాటంపు డేగలు వలనైన తేజీలు
మొదలైన సాధనంబులు చాల గలిగి,
పదిలుఁడై యడవికిఁ బసఁగొడివచ్చి,
తెరలును వలలును దివిరిపన్నించి,
చులుకఁగా మృగముల జోకపెట్టించి,
పటహ భేరీ శంఖ పణవ నిస్సాణ
పటువాద్యములు చెవుల్ పగులమ్రోయించి,
బెదరిన మృగరాశి బ్రిదులక డాసి,
పదలక కుక్కలఁ బాఱంగవిడిచి,
బాణజాలములేసి పార్థివోత్తముఁడు
త్రాణతో శరభాలి ధరమీఁదఁ గూల్చి,
సింగాలవధియించి, చెండిబెబ్బులుల,
భంగించి యెలుగుల, బందులఁ గ్రుచ్చి,
మన్నుబోతులఁ ద్రెంచి, మహిషాళిఁ ద్రుంచి,
చిన్ని [2] కొర్నవగండ్లఁ జెండిఖండించి,
కడతులఁ గారించి, ఖడ్గజంతువుల
మడియించి, గిఱుతలమద మెల్లఁ ద్రెంచి,
దుప్పులఁ దెగటార్చి, తూఁటాడి కరుల,
నొప్పించి యెద్దుల, నుఱుగక మఱియుఁ,

---

1. బోవు. 2. కొరుకవరెళ్ల. (మూ)

దక్కునమృగములఁ దవిలి చెండాడి,
వెక్కసంబుగ డేగవేఁటయు నాడి,
తనసేనలును దాను ధరణీనాయకుఁడు
వనములో వేడ్కమై వర్తించునంత,
విరిదమ్మివిరులపై విహరించి, యలరు
తరుణుల నునుగురుల్ తరళింపఁజేసి,
వనపుష్ప సౌరభ వాసితంబగుచు
మనుజేశుపై వీచె మందమారుతము.
తరుణులచదురులు, దంటమాటలును,
బరిహాసములు వినఁబడెఁ; బదుటయును,
జెవులలో నమృతంబు చిలికినట్లైన
నవలీల నేతెంచె నరనాయకుండు.
చుక్కలలోనున్న శుభ్రాంశు కళిక
చక్కఁదనంబున [1] జవ్వనంబునను
జెలులలోపల నెల్లఁ జెలువమై మిగుల
లలితభావంబున లలినొప్పుదాని,
నెఱిగలకురులును నిడుదకన్నులును,
మెఱుఁగుఁజెక్కిళ్లును, మించినమోవి,
నగనగనని యొడి నవకంపుమోము,
జిగిబిగి గలిగెడి చిన్నిచన్నులును,
దగఁదగనని యొడి [2] తేలికనడుము,
ధగధగమని యొడి తను [3] వల్లరియును,
నూఁగారు [4] సౌరు, నన్నువలైనవళులు,
బాగైనపిఱుఁదును, [5] బసిమిపాదములుఁ
గలిగి కాంతలకెల్లఁ గాంతియై [6] నిలిచి
యుంరేకు నాదేవయాని నానృపుఁడు

---

1. జవ్వనియగుచు. 2. తెలివిచెన్నడుము. 3. వల్లకి. 4. నారు. 5. బసని.
6. గలిచి. (మూ)

గనుఁగొని, యాశ్చర్యకలితుఁడై మున్ను
మనమున నెఱుఁగనిమాడ్కి నిట్లనియె:
"ఇందీవరాక్షి, నీవెవ్వరిదాన!
యెందుండివచ్చితి విచ్చటికిపుడు!
వెస నీకుఁ బేరేమి? వీరలెవ్వారు?
మసలక చెప్పు మామనసు మోదింప."
అనిన, భార్గవినవ్వి యతనికిట్లనియె;
"విను, మఱచితె నన్ను విజ్ఞానినయ్యు!;
శుక్రుండు మాతండ్రి; సురుచిర తేజ (?)
విక్రాంత, నా పేరు విను దేవయాని;
పరిచారికలు నాకుఁ బరఁగవీరెల్ల;
సారిది నీవన[1] శోభఁ జూడవచ్చితిమి.
మున్ను నే నూతిలో మొఱవెట్టుచుండఁ
గ్రన్ననఁ గడఁక నాకడ కేఁగుదెంచి,
నావలచేయి యున్నతి వడిఁ బట్టి,
వే వెడలించితి విపినకూపంబు.
కావున, నదియుపో కరుణావిధేయ,
భావింప నాకయ్యెఁ బాణిపీడనము.
నాఁటనుండియు నిన్ను నాటినకూర్మి
వాటమైయున్నది వదలింపరాదు.
ఈకాంత[2] లిందఱు నెలమి సేవింప
నీకాంతనయ్యెద నెలమిఁగైకొమ్ము."
అనిన, యయాతి [3] శంకాయత్తుఁడగుచు
మనమున ధైర్యంబు మఱువెట్టిపలికె:
"ఓముగ్ధ, యీమాట లానఁగూడ దెందు;
నేము రాజన్యుల; మీవు బ్రాహ్మణివి;

1. కేళి. 2. లిద్దఱు. 3. కామ్యకచిత్తుడగుచు. (మూ)

కాన, వివాహంబు కాఁగాఁదు నిన్ను ;
నేను ధర్మముదప్పనట్లు సేయుదును !"
అనవుండు నయ్యింతి యనుకూలయగుచు,
మనమునఁ దమతండ్రి మహితాత్ముఁదలఁచెఁ ;
దలఁచిన, శుక్రుండు తడయకవచ్చి
[1] నిలిచె నాపుత్రికా నృపుల కిట్టిదుర.
అప్పుడా రాజన్యుఁ డా దేవయాని
యుపాంగి ప్రణమిల్ల, నచ్చి భార్గవుఁడు
ఆసీనుఁడై వేడ్క నవనీశుఁబలికె :
"భాసురాత్మక, నీవు పరమపుణ్యుఁడవు ;
రాజవు ; సద్ధర్మరతుఁడవు ; గానఁ,
దేజిత నాకూఁతు దేవయాన్యాఖ్య (?)
నిచ్చితిఁబత్నిగా ; [2] నీమె యెల్లెడల
నచ్చినధర్మంబునకు నగు నీకు."
అనుచుఁ బార్థివచంద్రు ననుమతుఁజేసి,
తనపురంబునకు నాతనయతోఁగూడఁ
దోకొని, వేడుకఁదూర్యముల్ [3] మొరయ
భూకాంతునకుఁ బెండ్లి పుత్రికఁజేసి,
దివ్యభూషణములు దివ్యాంబరములు
దివ్యగంధములుఁ బుత్రికి నల్లునకును
గట్టంగనిచ్చి, యాకావ్యుండు వారిఁ
బట్టణంబునకంపి, పార్థివేంద్రునకు
శర్మిష్ఠఁజూపి సంశయమేదిపలికె :
"ధర్మాత్మ, వృషపర్వదానవేంద్రునకుఁ
గూఁతురీకోమలి ; కోమలగాత్రి ;
బ్రాఁతి నాపుత్రికిఁబరిచారికనక,

1. నిలిచె నానృపతిలకా పుత్రి కిట్టిదుగ. 2. నీవెల్లయెడల. 3. మెఱయ. (మా)

శయనంబు వెలిగాఁగ సర్వభోగములు
నయవిధి దీనికి నడుపుము నీవు."
అని చెప్పి భార్గవుం డటపోయెఁ; బోవ,
మనుజేశ్వరుండును మదిలోన నలరి,
దేవయానియుఁ దాను దేవేంద్రు భాతి
భావజరాజ్యసంపద లందు చుండె.
అంత, గర్భిణియైన యా దేవయాని
కెంతయు నరుచితో నెసఁగె వేవిళ్లు;
మోము వెల్వెలఁ బాఱె; మురిపెంబు దక్కె;
వేమాఱు నయనముల్[1] వెల్లనై తోఁచెఁ;
చాలిండ్ల ముక్కులపస నల్లనయ్యె;
బాలికి యాలోనఁ బదియగు నెలను
యదుఁడు తుర్వసుండను నిరువురసుతుల
ముదమొప్పఁగాఁగాంచె; మోదించి నృపుఁడు
పుత్రోత్సవంబులు పొలుపారఁ జేసి,
ధాత్రి యేలుచునుండె ధర్మమార్గమున.
పుత్రులు లేని యా భూజనులెల్లఁ
బుత్రులఁ గాంతు రీపుణ్యకథ వినిన.

యయాతి, శర్మిష్ఠకుఁ బుత్రదానంబు సేయుట

ఒకనాఁడు వేడ్కతో నుద్యానవనము
లొకఁడునే తెంచుచో, నొంటిమై నచటఁ
జీఁకటిలో నున్న శీతాంశురేఖ
లేఁకువ నొప్పెడు దేహంబు దాని,
సమ్మతి బుతుశుచిస్నాతయై వచ్చి
కమ్మని తావులఁ గరమొప్పుదానిఁ,

1. తెల్లనై. (మూ)

బలుమాఱు పయ్యెద పాటించుకొనుచు
జలిబిలిసిగ్గునఁ జెలువైనదాని
నమలాంగి శర్మిష్ఠ నారాజుచూచి
తెమలియుండఁగఁ, గాంచి తెఱవయుఁగదిసి
ప్రణమిల్లి పలికె : "నో పార్థివచంద్ర,
గణుతింప దైత్యేంద్రకన్యను నేను ;
వెసఁ గానలోఁగాయు వెన్నెలపోలెఁ,
బస దేఁటిగొననిపువ్వుము తావివోలె,
సవతిఁదాఁచిన రత్నహారంబు పోలె,
ధవుఁబాయు కామినితండంబుపోలె
నాజవ్వనంబెల్ల నానాఁటికిట్లు
లోజ నూరకపోయె నోదయాధార !
ఋతుమతినై యేను నిట్లున్నదానఁ ;
జతురత నాకోర్కె సలుపవే దేవ !"
అనుటయు, రాజన్యుఁ డబలకిట్లనియె :
"వినుము, నీమాటలు వినఁగూడదిపుడు ;
శుక్రుండు నను మున్ను జూపి [1] చెప్పాఁడు, న-
వక్రముగ నాకునే వాక్యంబుచెప్పె
నావిధంబున నేను నరుగఁబడుఁ ; గాని,
యేవెంట నామాట లేదాటవెఱతు."
అనవుడు శర్మిష్ఠ : "యట్లేల ! దీనఁ
దనరిన సత్యంబు దలఁగదు నీకుఁ ; —
'ప్రాణసంకటముల, బ్రాహ్మణక్రియల,
రాణతోఁ బెండ్లిండ్ల, ద్రవ్యభంగముల,
నతివయు ఋతుమతియైయుండుచోట్లఁ
బతి కల్లలాడినఁ బాపంబులేదు'.

1. చెప్పచుష్ఠ—శుక్రంబుగా. (మూ)

అని చెప్పవిందు నే నఖిలశాస్త్రముల ;
విను నీవు బాంకితి వెసఁ బెండ్లియందు."
అని యొడంబఱచిన నతఁ డిచ్చగించి,
[1] రొయొనరిన రత్నంపుటోవరులందు
నిపుణత బహుపుష్పనిర్మితశయ్య
నపరిమితోత్సాహుఁడై పవ్వళించి,
శర్మిష్ఠ నీక్షించి, సరసంబులాడి,
మర్మంబు లన్నియు మఱి యంటియంటి,
మొఱఁగుఁ జెక్కిలి గీఁటి, మించుఁ బాలిండ్ల
గుఱుతులుగాఁ గొనగోళ్లు నాటించి,
బిగియఁ గౌఁగిటఁ జేర్చి, బింబాధరంబు
తగ నొప్పఁ జవిగొని, తద్దహర్షమున
యువతి మన్మథకేళి నోలలాడించి
యవనీశ్వరుఁడు పోవ ; నపుడు శర్మిష్ఠ
వలుద క్రొమ్ముడి వీడి, వదనంబు వాడి,
తిలకకస్తురిజారి, దిటవెల్లదారి,
తెఱచావులింపుచు, ధవళనేత్రముల
నెఱికెంపు దోఁపఁగ, సొలుగుచు, మఱియుఁ
బొదవిన సంభోగభూరిచిహ్నమ్ము
లొదవంగ, గర్భమై యోగ్యంపుఁ దిథుల
దృహ్యానుపూరుల ధృవకీర్తియుతుల
సహ్యధైర్యులఁ గాంచె సత్క్రమంబునను.
అంతట, నొక్కనాఁ డా దేవయాని
కాంతుండుఁ దానును గదయంగనుండి,
శర్మిష్ఠకొడుకులు చదురొప్ప నచటి
కర్మిలి నేతెంచి యాడుచుండఁగను,

1. రొయునరినరత్నంబుటోవరగలిగి - నెపురైనబహుపుష్పనిర్మితశయ్య. (మూ)

రూపవై భవకళారూఢి నారాజు-
రూపంబులై యున్న, రోషించిచూచి
మగనితోనిట్లను : 'మనుజేశ, వీరు
తగవొప్ప నెవ్వరితనయులో!' యనిన
రాజూరకుండిన, రమణి యాసుతుల
నోజతోనడిగె ని : 'ట్లో బాలులార,
మీతల్లిదండ్రుల మృదురీతి నాకుఁ
బ్రీతిఁజెప్పుఁడు మీకు బెల్లమిచ్చెదను.'
అనిన బాలురుపల్కి : 'రతివ, మాతండ్రి
తనర యయాతి ; మాతల్లి శర్మిష్ఠ.'
అనవిని భార్గవి యతిశోక కోప-
వినతయై, యచ్చోటువీడ్కొనిపోయి
తనతండ్రికంతయుఁ దప్పక చెప్పఁ,

శుక్రుఁడు యయాతిని శపించుట

గనలి, యాశుక్రుఁ డాకన్యనూరార్చి :
"నిను డాఁగురించి యానృపతి శర్మిష్ఠ
ననుభవించినయట్టి యాపాపమునకు
వదలజవ్వన, మెల్ల వాసియుఁదక్కు-
ముదిమినొందు"; నటంచు ముని శాపమిచ్చె.
నిచ్చిన, వివశుఁడై యెఱిఁగి యయాతి
యచ్చుగా శుక్రున కందంద మ్రొక్కి,
యనయంబు భక్తితో నంజలిచేసి :
"యనఘాత్మ, చేసితినపరాధమేను ;
గావవే! ముదిమి నేఁగడవంగనోప ;
భావింప విషయానుభవకాంక్ష గలదు."
అనియనిప్రార్థింప, నతఁడు చింతించి
తనలోన నొక్కింత దయచేసి పలికె :

"భూప, యీముదిమి నీపుత్త్రులలోన
నేపుత్త్రునకునైన నిచ్చి, నీవిపుడు
వానిప్రాయముఁగొను; వలనొప్ప వెనుక
పూని రాజ్యభరంబు పూనునువాఁడె".
అనని య్యకొని, నృపుఁ డతనివీడ్కొనుచుఁ
దనపురికేతెంచి తరుణియుఁ దానుఁ,
గొడుకులనేవురఁగూర్చి యిట్లనియె:

యయాతి యదుప్రభృతుల శపించుట

"వెడగైన ముదిమిచే విహరింపఁజాల;
నుడుగదు భోగేచ్ఛ యొగి నింక నాకు;
నడుకక మీలోన నలి నెవ్వఁడైన
జవ్వనంబిచ్చి నాజరగొనుం". డనిన
నవ్వి, యిట్లనిరందు నలుగురు సుతులు:
"విభువర, నీకేమివెట్టిపట్టినదొ!
విభవులై చరియించు విభుకుమారకులు
చిన్ని ప్రాయంబిచ్చి, పెద్దయీముదిమి
క్రన్ననఁదాల్తురే కడఁకనెందైనఁ!
గొంచక మెటువంటి కూళ[1] మానిసియుఁ
బంచదారకుఁ దాడు ప్రతి[2] విల్చుకొనునె!
అని విడనాడిన, నారాజు కినిసి
తనయుల నలువురఁ దప్పకపలికె:
"పుత్త్రులా మీరలు! భువి మత్తులార!
శత్రులుగాక; యోజనకుఁడ మిమ్ముఁ
బనిచినఁ, జేయంగ భాగ్యంబుగాదె!
తనరఁ దండ్రికిఁగానితనయులేమిటికి!

1. మానవులు. 2. విల్చు.

నాచార [1]విగతులై యతిహీనవృత్తులగుచు
భూచక్రమున మ్లేచ్ఛభూములు పాలింపుఁడు ;"
అనుచు యయాతి దృహ్వ్యనుతుర్వసుల
కొసరంగ యదునకు నొసగె శాపంబు.
అప్పుడా పూరుండు నాతండ్రి కెఱఁగి,
తప్పక కేల్మోడ్చి తగ నిట్టులనియె :
'పూనెద నీజర భూనాథ, నాకు
జానొప్ప నిమ్ము రాజ్యసంబంధి.'
అనుపుడు రాజన్యుఁ డతని హర్షించి,
తనజరాభార మాతని కునకిచ్చి,
వాని యౌవనశక్తి వలనొప్పఁ దాల్చి,
సానుగా రాజ్యంబు మహిమనుభవింపఁ
బెక్కుకాలంబులఁ బెక్కురీతులను
దక్కక [2]పాలించి ధర్మమార్గమునఁ,
దనయానుభవవాంఛఁ దనిసి పూనుటయుఁ,
దనయువప్రాయంబు తనయునకిచ్చి,
తనవార్ధకంబుఁ బొంది, తన్నాదరించి,
యనువొప్ప మన్నించి, యాప్తమంత్రులను
విప్రుల రాపించి విత్తంబులొసఁగి,
సుప్రశస్తంబైన శుభముహూర్తమునఁ
నొనరంగఁ బూరుని యుక్తమార్గమునఁ
దనరఁ బట్టముగట్టి, ధరణీవిభుండు
రాజధర్మంబులు రాజనీతులును
రాజైనసుతునకు [3]రాజిల్లఁ జెప్పి,
మునివృత్తిఁ గైకొని, మునులును దాను
వనములకేఁగి, యత్యుగ్రతపముల నొప్ప

1. వియుతులై. 2. కావించి 3. రాజిల్ల. (మూ)

బహువత్సరంబులు బహువిధంబునను
బహుతపంబులుచేసి, పార్థివోత్తముఁడు
స్వర్గలోకముచేరి, శంభులోకమును
దుర్గమంబైనట్టి ద్రుహిణలోకంబు
మొదలుగాఁగల లోకములయందుఁ బ్రీతి
వదలక కొన్నాళ్లు వసియించి, తిరిగి
సాంద్రవైభవములు చాలఁగైకొనుచు
నింద్రలోకంబునకిరవొందవచ్చె.
వచ్చినఁజూచి యవ్వాసవుండలరి
యచ్చుగాఁబూజించి యాసీనుఁజేసి,
పలికెఁ బార్థివుఁజూచి పరమమోదమున:

### యయాతి స్వర్లోకభ్రష్టుఁడగుట

"కలితాత్మ, నీవంటి ఘనపుణ్యచరితు,
మాన్యైన బహువిధమఖ సోమయాజిఁ
గానమెచ్చోటను; గాంతివిశాల,
నీవుచేసినతపం బేలాటితపము!
భావించిచెప్పు తప్పక నాకు." ననినఁ
దనలోన నెంతయుఁ దలఁచి, యయాతి
వినతుఁడై హరిఁజూచి వేడ్కనిట్లనియె:
"ఎట్టిదేవతలును, నెట్టిదానవులు,
నెట్టిమునీంద్రులు, నెట్టిరాజులును
జేయంగలేరు నేఁజేసినతపము;
నాయజుండెఱుఁగును నన్యులెఱుఁగుదురె!"
అనినఁ, గోపంబెత్తి యమరనాయకుఁడు
మనుజేశునిట్లను: "మదయించి, నీవు
పెద్దలతపమెల్ల బీరుచేసితివి;
తద్దయు ధర్మంబుఁదప్పితి; గానఁ,

బోయి యధోలోకముననుండు." మనిన,
నాయయాతి తలంకి యతఁడిట్లనియె :
" అనఘాత్మ, చేసినయపరాధ[1] మునను
ననుగట్టఁ దెచ్చితి నలి నేన త్రాళ్లు ;
భూలోకమున కేను బోవంగనోప ;
నోలి సత్పథమందు నుండెద నిప్పుడు."
అనుచుఁ బ్రార్థనచేసి యంజలి సేయఁ,
గనికరంబున వజ్రి కైకొని యనిచె.
ననిచిన, నారాజు నాకాశవీథి
కొనరంగ నేతెంచి యుండుచో ; నంత,
నతనిదౌహిత్రకు లాయష్టకాదు
లతులితతేజస్కు లందుంకివచ్చి,
యారాజుఁబొడగాంచి యంజలిచేసి
ధీరతఁబలికిరి : " దేవ, నీవిప్పు
డెందుండివచ్చితి ? వెవ్వరవయ్య !
యెందులకేతెంచి ? తెలిఁగింపుమాకు."
అనవుడు రాజన్యుఁ డష్టకాదులకుఁ
దన తెఱంగంతయుఁ దప్పక చెప్పె.
చెప్పిన విని, వారు చెలఁగి హర్షమున
నుప్పొంగి, దండంబు లోలిఁ గావించి :
'మొనయంగ మీకు దౌహిత్రులమేము
మనుజేశ, చెప్పవే మాకుధర్మముల !'
ననుడు యయాతి యయ్యష్టకాదులకు
ఘనతరమహిమలు గలుగంగఁ జెప్పి,
ధర్మంబులన్నియుఁ దగ నేర్పరించి,
కర్మంబులన్నియుఁ గడముట్టఁ దెలిపి,

---

1. తను. (మూ)

కొంతకాలము వారిఁగూడి యచ్చోట
సంతసంబుననుండి, జగదీశుఁ డంత
మనుమలుఁ దానును మఱియును వేడ్క-
పానరంగఁ బ్రాపించెఁ బుణ్యలోకములు.
ఇట పూరుఁడును శాస్త్రహితమార్గమునను
బటుబుద్ధిఁ గ్రతువులు బహుభంగిఁ జేసి,
నడవడి రాజ్యాధినాథులౌనట్టి
కొడుకుల నెక్కుడు కొమరొప్పఁబడసి,
ధర్మమార్గమ్మున ధరణియంతయును
ధర్మాత్ముఁడై యేలి ధన్యుఁడై యుండె.
ఈయయాతిచరిత్ర మెవ్వరువిన్నఁ,
బాయుఁబాపంబులు; ప్రబలుఁబుణ్యములు;
అతఁడుపోయిన వెన్క నవనినాయకులు
చతురతఁ బెక్కండ్రు చని." రనె వేడ్క-
జనమేజయునకు వైశంపాయనుండు
మును చెప్పెనని చెప్ప నోదించి వార:
'లనఘాత్మ, తరువాతనైన సద్వృత్తాంత
మనువొప్పఁజెప్పవే!' యనియడుగుటయు,
[1] గౌరీశ పూజాధిక మతానుచార,
చారణ (సంస్తుత) చంతానుసార,
సారస్వతామృత సాధనధీర,
ధీరాంగరంజితాదమశుభాకార,
కారాగృహాగత ఘనశత్రుశూర, (?)
శూరతాలంకార, సుజనమందార,
భారతాధిప, నీకుబహుళార్థసిద్ధి.

1. గౌరీపూజాభిక మతాభిచార. (మూ)

ఇదిసదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మననామధేయ
రచితాదిపర్వ నిర్మలకథయందు
నుచితమ్మై యాశ్వాసమొప్పెరెండవది.

-----

# తృతీయాశ్వాసము



శ్రీతనయాకార, సితకీర్తిహార,
చాతుర్యఘన, రామ, జానకీరమణ,
కల్పవృక్షము భాగిఁ గవులకోర్కెలు
కల్పించుఘనదాత, కడకనాలింపు;
అక్కథకుండు శౌనకాదిసన్మునుల
కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగ.

## దుష్యంతచరిత్ర

అట్టిపూరుని వి (శాలాన్వ) యంబునను
నెట్టన దుష్యంతనృపుఁడుద్భవించె.
గుబ్బలిపెకలించి గుబ్బలిమీఁద
గుబ్బస వైచును గ్రొత్తలావునను;
గజములఁజేపట్టి కడిమివాటించి,
భజనకాశసముపైఁ బాఱంగమీటు;
నలఘుసత్త్వంబున నరులనకైన
జళుకుపుట్టించును జాతుర్యలీల;
బలభేది కంతయుఁ బరిణామమొసగ
బలిమిమై రాక్షసబలముఁ గారించుఁ;
బగతురఁదెగటార్చి బహుళవిస్ఫూర్తి,
జగమెల్ల నేకశాసనముగానేలి,
వరుస బ్రహ్మక్షత్త్రవైశ్యశూద్రులను
సరి నిజధర్మముల్ సలుపంగఁజేసె.
ఒనరినవేడ్కలో నొక్కనాఁడతఁడు
'తనరాజచిహ్నలై తనరినయట్టి

తగఁ బుండరీక[1] భూదార భావనలు
జగతి ఖడ్గిత్వంబు చామరత్వంబు
వనమృగంబులు దాల్చి వర్తించుటట్టు'!
లని మృగంబులమీఁద నలిగెనో! యనఁగ
వేటలాడఁగఁ బూని వెడలి, యారాజు
గాటమై సేనలు గదిసి సేవింప,
వందిబృందంబు కైవారంబుసేయ,
సందడ మ్రోయంగ నఖిలవాద్యములుఁ,
ద్రిజగంబు వ్రేల్మిడిఁ దిరిగిరా నోపు
నిజ జవాశ్వరథంబు నెమ్మి నెక్కి,
సకలసాధనములుఁ జను దేర వెంట
నకలంకగతి నేఁగె నడవిలోపలకు.
శరభ వాహ వరాహ శార్దూల గవయ
రురు శల్య భల్లూక రోహిత వృషభ
కరివైరి వారణ ఖడ్గ గంధర్వ
హరిణాది మృగకోటి నవలీలఁ గదిసి
చించియు, నొంచియుఁ, జెదరనేసియును,
ద్రుంచియు, దంచియుఁ, దూలనేసియును,
గెడపియు, నెడపియుఁ, గీలడంచియును,
బొడిచియు, నడఁచియుఁ, బోకత్రుమ్మియును,
నలిచియుఁ, బఱచియు, నొగులఁ జేసియును,
బలువిడి నీరీతి బహుళమార్గముల
విలువిద్య యెంతయు వేడిమిఁ జూపి,
కలమృగంబులనెల్లఁ గలగుండువెట్టి,
పట్టినమృగకోటిఁ బట్టణంబునకుఁ
బెట్టిపుత్తెంచుచుఁ, బృథివీశుఁ డంతఁ,

1. ఘుధార. (మూ)

జంద్రునిలోనున్న సారంగ మృగము
సాంద్ర[1]రయంబునఁ జరుదెంచె ననఁగ
శివునిచే నెలవడి చెలువంపుటిఱ్ఱి
యవలీల నచ్చోటి కరుదెంచె ననఁగ
బంగారుకెంజాయ భాసిల్లుమేన
రంగైన యొకయిఱ్ఱి రాజిల్లఁ జూచి:
'చోరవర్తనము లీక్షోణి లేకుండ
నీరీతి నాజ్ఞ నేనేలుచునుండఁ,
గాంతకన్నులకాంతిఁ గడఁగి [2]చోరించి
వింతగా నీయిఱ్ఱి విపినంబులోన
దాఁగియున్నదటంచు [3]ధాటితో డాసి
రేఁగి చంద్రుఁ బట్ట నెసఁగెనో,' యనఁగఁ (?)
జలమున డాసి, దుష్యంతభూవిభుఁడు
బలములచే దానిఁ బట్టింపఁబోయెఁ
బోయిన, నాయిఱ్ఱి పొదవుగా నెగసి,
వాయువేగంబున నలలెల్ల దాటి
పఱవఁగఁ గనుఁగొనెఁ బార్థివోత్తముఁడు.

..........................

అంతంతఁ బఱచుచు, నఖిలదిక్కులను
వింతగాఁ బలుమాఱు వెఱచిచూచుచును,
గొరిసెచేఁ జెవిక్రింద గోఁకిదీఁటుచును,
ధరణీశు నలయించి దవ్వుగాఁజనియెఁ;
జనిన నారాజును జలమునఁ గొంద
అనుచరులును దాను హరిణంబువెంటఁ
బోవఁబోవ, మృగంబు పుణ్యాశ్రమంబు
వేవచ్చిచొచ్చిన, వీక్షించి మాను

1. రూపంబున. 2. గోరించి. 3. ధారతో. (మూ)

లడ్డంబుగావచ్చి యతనిదీవించి
దొడ్డప్రియంబులుదోప నిట్లనిరి :
“ చనదుచంపంగ దీనిఁ ; జాలునీయలుక ;
[1] యనఘాత్మ, యిదిమదీయాశ్రమమ్ముగను.
ధూర్తులఁదగటార్పఁ దొడరునీబలిమి
యార్తులరక్షింప నందంబుగాదె ! ”
అనిన, వారలమాటలంగీకరించి
మనుజేశుఁడిట్లను : ‘ మహితాత్ములార,
దవ్వులనే వేడ్కఁదనరంగఁజేయు
నెవ్వరియాశ్రమంబీపుణ్యభూమి ? ’
అనవుడు మౌనీంద్రులతనికిట్లనిరి :
‘ వినుమయా రాజన్య, విఖ్యాతుఁడగుచు
దేవదానవులకు ధృతిఁదండ్రియగుచు
భావజ్ఞ కశ్యపబ్రహ్మసంయమికిఁ
దమ్ముఁడై, ఘనతపోధర్మాత్ముఁడైన
యమ్మహాత్ముఁడు కణ్వుఁ ; డతనియాశ్రమము. ’
అనిచెప్ప, దుష్యంతుఁడలరిచిత్తమున :
‘ మునిచంద్రుసేవించి, ముదమొప్ప నిందు
ఘనతపోమహిమలు గలయనీక్షించి,
నను బుణ్యుఁజేయుదు న[illegible]వొ[illegible] ’ ననుచు
మనమునఁదలపోసి, మంత్రు[illegible] భటుల
నునిచి యచ్చోటికి నుర్వీశుఁడేఁగ.
దారుక మాకంద దాడిమీ నారి-
కేర కేసర నాగకేసర గ్రాహి
జంబీర శింశుపా జంబూ కదంబ
నింబ ప్రియక నీల నిచుల కుద్దాల

1. యొనయంగనిది. (మూ)

బంధూక నారంగ ఫలపూర వనస
సిందుర చామర శేలు ఖర్జూర
చందన ద్రాక్షానుస్యందనాక్షోఠ (?)
కుంద వాసంతికా కురవక నికుచ
మల్లికానన నవమల్లికా ముఖ్య
వల్లరీతరువుల వారక యొప్పుచు
పువ్వులు ఫలములుఁ బూవలుఁ గలిగి
నివ్వటిల్లుచునుండ నెగడినదానిఁ,
దనియంగ మునులు సంధ్యలువార్వ జలము
గొనిపోవుకవులచేఁ గొమరొప్పుదాని,
మునిపుత్త్రులకుఁ గందమూలాదు లెపుడుఁ
దనియంగఁ దమిఁబూని తద్దయు వేడ్కఁ
దప్పక కొమ్ములఁ ద్రవ్విచ్చునట్టి
దుప్పుల నిట్టులఁ దొడరినదానిఁ,
తెలఁగి ధేనువులకుఁ దెలువంపుఁబూరి
చెలిమితో మేపెడు చిఱుతబెబ్బులులు,
నెమలిబర్హముక్రింద నిద్రకప్పుడును
నెమకివచ్చుచున్న నిసుదపాములును,
మూషికశిశువుల మొగి మేఁతవెట్టి
పోషించుచున్నట్టి పోతుపిల్లులును,
వెండియుఁ దమలోన విరసంబుమాని
దండిగేహంబులఁ దనరు జంతువులు,
నెఱి నెండఁబోసిన నివ్వరివడ్లు
గఱగఱగా మేసి కొశలఁబొప్పు
సకలశాస్త్రంబులుఁ జదువుచున్న
శుకశారికాతతి శోభిల్లుదాని,
హోమధూమమ్ముచే నొగిఁ గంపుచెడిన
తేమావినల వేల్లితమైనదాని,

జపమాలికలుదెచ్చి సంయమీంద్రులకుఁ
గృపనిచ్చు చెంచులఁ గీల్కొన్నదాని,
వాదించి చదివెడువటువుల వివిధ
వేదఘోషంబుల విలసిల్లుదాని,
మునుకొని వివిధంపుముగ్గులుగూర్చు
మునికుమారికలచే మొనసినదాని,
నేరుమద్దులమీఁద నెందుచునున్న
నారపుట్టముల నున్నతమైనదాని,
భోగంబులన్నియుఁ బో విడనాడి
యోగమార్గంబెల్ల నొప్పగాఁదెలిసి
యొదవ శిష్యులకు బ్రహ్మోపదేశంబు
తుదిచేయు మౌనులఁ దొడరినదానిఁ,
బుణ్యఫలముల కెల్లభూమియై మిగుల
గణ్యధర్మంబుల ఘనమైనదాని,
ఘనతపోధనుఁడైన కణ్వమునీంద్రు
ననఘాశ్రమస్థాన మధికమోదమునఁ
గనుఁగొని, యాశ్చర్యకలితుఁడై నృపతి
మునుకొని యచ్చోటిమునులకందఱకుఁ
బ్రణమిల్లి, వారిచే బహుమానమంది,
[1] గుణవంతుఁ డందలి క్రొత్తలన్నియును
బరికించిచూచుచు, భక్తిదీపింప
పరవఁ గణ్వునిపర్ణశాలకే తెంచి,
నెమలి [2] బర్హముకంటె నెఱిఁగల్మి గలిగి
యమరినకొప్పున నమరినదానిఁ,
బదియాఱుగాఁ జంద్రు భంగిమొందించు
వదనపద్మమ్మున వలనొప్పుదాని,

1. గుణవంతులందఱ. 2. బర్హము. (మా)

దొండపంటికి సిగ్గు దొడరంగఁజేయు
దండికెంపులమోవిఁ దనరెడుదానిఁ,
జిలుకకోవెలలకుఁ జెల[illegible]కుఁ
బలుకులఁ దలవంపు [illegible]దాని,
మరుఁడు జయంబంది [illegible]ముఁబూరించు
కరశంఖగతి నొప్పు కంఠంబుదానిఁ,
గవజక్కవలఁ గవకవ నవ్వఁజాలు —
సవరని చనుఁదోయి జానొప్పుదాని,
నిగురించులతలతో నెకసక్కెమాడు
జిగిబిగిగల మేనిచెలువంబుదానిఁ,
గన్నియ లావణ్యగౌరవంబునను
వెన్నున విహరించు విపులంపువేణి
యుదరంబుపైఁ దోఁచనోయనఁ జాలు
నొదవినరోమాళి నొప్పారుదానిఁ,
బళిపైన చనుఁదోయిభారంబువలన
సరిపేదమధ్యంబు జడియ, నానాభిఁ
బసిఁడిశలాకచే బంధించిరనఁగఁ
బన మూఁడువళులను భాసిల్లుదాని,
మరుని [1]జైత్రరథంబు మార్కొనఁజాలు
— వరజఘనంబుల వాసైనదాని,
ననఁటికంబంబుల నదలించుతొడల
నొనరినపిక్కల నొఱపైనదాని,
రాయంచగములతో నంతుగావించు
ప్రాయంపునడపులఁ బరఁగినదానిఁ,
బటురీతిఁ జెలులతో భాషించుదానిఁ
గుటిలకుంతలను శకుంతల నతఁడు

---

1. చైత్ర. (మూ)

పలుమాఱుఁ జూచుచుఁ, భావంబులోన
వలరాజుతూపులు వాటమైనాటఁ,
బద్దరి తద్గుణపాశబద్ధుఁడై, కదల
మొదలంగనేరక మిన్నకయుండె.
మనసు మానినిమీఁద మరగియుండంగ
నెనయంగఁ దన్నుదానోపఁగంగలేక,
తరుణిలావణ్యామృతంబుఁ గ్రోలంగ
సరి ననిమేషత నందిల్లెననఁగఁ
గనురెప్పవెట్టక కనువిస్మయమునఁ
దనమనంబున నిట్లుదలపోయఁదొడఁగెఁ :
“ చెలువల నాబ్రహ్మ సృజియించుచోట
నలర ఘృణాక్షరన్యాయాన దీని
సృజియింపఁబోలు నిశ్చితి ; నట్లుగాక
యజునకు నీనేర్పు నందమానేని,
యింక నొక్కతెఁ గాంతి నియింతి [1] సవతుఁ
గొంకక మఱి యేల [2] కూర్పంగలేదు !
శృంగారరసమెల్లఁ జెన్నారఁ గూర్చి
యంగజుఁ డిచ్చోట యంత్రించెఁగాక !
వితత వేదాభ్యాస వికలుఁడైనట్టి
చతురాననున కిట్టిచతురత గలదె !
ఈయింతికౌఁగిలి యెవ్వానికబ్బె,
నాయుత్తమునకబ్బు నమరరాజ్యంబు.
పటురీతి సరిచేయ భావ్యంబుగాదు
కుటిలకుంతలల నీకోమలాంగికిని. ”
అని యిట్లుతలపోయు నవనినాయకునిఁ
గనుఁగొని, మునిపుత్రి గారనంబునను

1. నరి. 2, కూర్పగల్గదిని. (మూ)

ఆతిథ్య మొనరించి, యాసీనుఁ జేసి,
చేతులు మొగిచి యాక్షితినాథుకనియె :
'ఓ రాజ, నీ వెందునుండివచ్చితివి ?
నీ రాకయిం దేల ? నీకుఁ బేరేమి ?'
అనినఁ, దొయ్యలిఁ జూచి యవనీశుఁ డనియె :
"విను, నేను దుష్యంతవిభుఁడను వాఁడ ;
వేఁటకై సేనతో వెడలి యేతెంచి,
గాటంపుభక్తితోఁ గణ్వసంయమిని
సేవింపవచ్చితిఁ జెలువ, నేనిచటి ;
కావిప్రవరుఁ డున్న యచ్చోటు చెపుమ."
అనుడు, శకుంతల యతనికిట్లనియె :
"మునినాథుఁ డింతటిమున్నె గాఁ గదలి
సమిధలు దర్భలు శాకముల్ పండ్లు
నమరంగఁ గొనితేర నడవికిఁ జనియె ;
మీరు వచ్చుట విన్న, మీఱిన వేడ్క
వారక యేతెంచు వనములో వెడలి."
అనుటయు, రాజన్యుఁ డాయింతిఁ జూచి
మనమున నిట్లను : "మహనీయుకణ్వ
మునిపుత్రి యెట్లయ్యె ! మొగి దీనిమీఁదఁ
గనుకూర్మి నాకిట్లు కడముట్టఁ బుట్టెఁ !
గానివస్తువుమీఁదఁ గాంక్ష డెందమున
నూనదన్నేఁడు మఱి యుచితంబు దక్క !
దీనిజన్మవిధంబు తెలియక నాకు
నూనిన సందేహ ముడుగదె తమును."
అని యిట్లు దలపోసి యబలకిట్లనియె :
"వనజాక్షి, యడుగంగవలసె నిన్నొకటి ;
[1] బ్రహ్మవిదుండన బ్రహ్మణ్యుఁ డనఁగ
బ్రహ్మచారియనంగఁ బరఁగుఁ గణ్వుఁడు ;

1. బ్రహ్మవిదుండనఁగ నగణ్యుండనఁగ. (మూ)

అతనికి నీ వెట్టులాత్మజవైతి !
హితమతి నీక్రమం బెఱిఁగింపవలయు."
అనిన, శకుంతల యారాజుకనియె :

## శకుంతలాజన్మవృత్తాంతము

"విను, మేను విన్నట్టివిధము చెప్పెదను ;
అనఘ, విశ్వామిత్రుఁడనురాజమౌని
మును దపంబుండంగఁ బురుహూతుఁడలిగి,
తనరాజ్య మాతండు తడవునన్ భీతి
ఘనముగా నంకిలిగావింపఁ దలఁచి,
మేనకయనుదాని మృగరాజమధ్య
మానుగా రావించి మన్నించి పలికె :
'ఓకాంత, నీవేఁగి యుగ్రతపంబు
చేకొని సేయు కౌశికమునీంద్రునకు
వివిధభావంబుల విఘ్నంబుచేసి
యువతి, యేతె ;' మ్మన్న నువిదయిట్లనియె :
'ఓదేవ, నీమాట యొనఁ [1] గూర్పనోపఁ ;
గాదు నాచే నింతకార్యంబు సేయఁ ;
దగ దూడలోపునే దంటుమేయంగ !
మగువలతరమె యమ్మహితాత్ముఁగలఁప !
నెఱిఁగియుఁ బాఁతఱ నెవ్వఁడుగూలు !
వెఱతు నేఁ గోవ నావిమలాత్మునకు.'
అనిన నింద్రుఁడుపల్కె : 'నల్లేల ! నీకు
ననువగునీకార్య ; మతివ, భీతిలకు ;
గానికార్యములకుఁ గళ్యాణి, నిన్ను
బూనదునే ! వేడ్కఁబొ ;' మ్మన్న నదియుఁ
గైకొని యేతెంచి, కౌశికునెదుటఁ
దూఁకొన్న మధులక్ష్మిఁ గోడుగా మెఱసి,

---

1. గూడ. (మూ)

బహువిలాసంబులు బహుగీతతతులు
బహునాట్యకళలును బహుభంగిఁజూపఁ,
దలమెత్తి యటుఁజూచి, తపమెల్లమాని,
వలరాజునకుఁదక్కి, వలవంతఁజిక్కి,
మేనెల్లమఱచి, యమ్మేనకఁగూడి
మానైన మరుకేళి మది మెప్పుఁజేయ
ననితపుట్టిన, దాని వసుధపై విడిచి
వనితమేనక యేఁగె వాసవుపురికి.
కౌశికుండును, నంత ఘనతపంబునకుఁ
గాశలంబున నేఁగె గర్వంబుదక్కి.
ఇట యేడ్చుచుండంగ నింత నాబాలఁ
జటులశకుంతాలి సంరక్ష సేయ,
నొకనాఁడు కుశనది కొగిఁగణ్వమౌని
యకలంకగతి నట కరుదెంచిచూచి,
కొనిపోయి యుబ్బాలఁ గూఁతుగాఁబెంచి,
తన [1] చెలియలిచేత స్తన్యమిప్పించి,
రమణ శకుంతాలి రక్షించెఁగాన
నమర శకుంతలయను పేరు పెట్టి,
హోమకుండును దండ్రి భువినగుననగ
భామఁ గణ్వుఁడు నాకుఁ బసఁ దండ్రియయ్యె.
ననినాదువృత్తాంత మాద్యులు చెప్ప
వినియుందు నీరీతి విశ్వంభరేంద్ర!"
అనిన, నాదుష్యంతుఁ డధికహర్షమున
మనసిజుండేఁప నమ్మగునకిట్లనియె:
"వనిత, నిజంబె కావలయు నెంతయును;
మనుజకాంక్షల కిట్టిమంజిమ గలదె!

1. చెలిచేతను. (మూ)

మఱియు నాకసమ్ముపై మెఱుఁగారుమెఱుఁగు
నెఱయంగఁ దోఁచునే నేలపై నెందు!
నింక నొక్కటి నాకు నిందీవరాక్షి,
కొంకక సమకూర్పఁ గూడును నీకుఁ ;
గ్రుంకుగుబ్బలి పొడ్పుగుబ్బలికడల
నంకితంబైనట్టి యవనిమండలికి
నాయకుండననొప్పునాకు నోతన్వి,
నాయికవగుము [1] మన్మథశాస్త్రవిధిని. ''
అనిన, శకుంతల యవనీశుఁబలికె :
' మునితేనిపిమ్మట ముదితాత్మ, నాకు
స్వాతంత్ర్యమున నీకు సమకూరనగునె!
మాతండ్రి రానిమ్ము మఱి యగుఁగాక '.
అనవుడు రాజన్యుఁ డబలకిట్లనియె :
'' వినుము, నీకేటికి వెఱవంగ ముగ్ధ!
యెనయ వివాహంబు లెనిమిదియందు
ఘనత క్షత్త్రియులకు గాంధర్వసరణి
యెఱుఁగ వధూవరులిద్దఱుఁదక్క
మఱి యన్యులెఱిఁగిన మతముగా ; దదియు,
వసుధ గాంధర్వవివాహంబు మున్ను
వసుధేశకన్యకావరుల కబ్బినది ;
మీతండ్రి విన్నను మిగుల [2] మోదించు ;
నేతెంతుగా. '' కన్న నింతి యిట్లనియె :
'' నా కుమారుని రాజ్యనాథునిఁజేయ
నీకుఁగూడిన, నేను నీచెప్పినట్లు
చేసెదఁ ; గాకున్నఁ, జేయంగఁగూడ ;
దీనమయును నాకు నీడేర్పఁగలవె ! ''

---

1. మన్మథశాస్త్రవిధికి. 2. బోధించు. (మూ)

అనిన, దుష్యంతుండు నంగీకరించి
వనితకోరినలాగు వారకసలిపి,
మదనుండుమెచ్చంగ మగువతోఁగూడి
వదలనికూర్మి జవ్వనికి నిట్లనియె:
" పోయెద నోకాంత, పురమున కేను;
నాయెడ నెయ్యంబు నాఁటి, మరువకుము.
పిలువఁబుత్తెంచెద బింబోష్ఠి, నిన్ను
నలరఁ దండ్రికిఁజెప్పి యరుదమ్ము నీవు."
అనుచు వీడ్కొనివచ్చి, యటసేనఁ గూడి
తనపురంబున కేఁగె ధారుణీవిభుఁడు.

## భరతోత్పత్తి

అట కణ్వమునియు, నయ్యడవిలోనుండి
పటురీతి సమిధలు ఫలములుఁ గొనుచుఁ
బర్ణశాలకువచ్చి, పరమహర్షమునఁ
బూర్ణచంద్రాననఁ బుత్రికఁజూచి,
సిగ్గును, వెఱపును, జడిముడిపాటు,
నగ్గలికయుఁ, గాంతి, యలసభావంబు,
గర్భచిహ్నము, మఱి గర్భస్థుఁడైన
యర్భకువిభవంబు [1] నంతయునప్పుడు
తనదివ్యదృష్టిచేఁ దప్పకదెలిసి,
మనమునసలరి సమ్మతి నూరకుండె.
అంత, శకుంతల హర్షసంవృద్ధిని
గాంతిమంతునిఁ బుత్రుఁ గనిన, నమ్మౌని
తడయక యేతెంచి, దౌహిత్రునకును
గడువేడ్కఁజేసి సంస్కారంబులెల్ల:
[2] " సత్వాల బలిమిని సమయించుఁగాన,
సర్వదమనుండను శైశవంబునను;

---

1. నాతండెఱింగి. 2. సత్వాదబలిమియు సమయంబు గాన. (మూ)

బరఁగ నామీఁద భూధరణంబు నేలు
భరతనామకుఁడనఁ బ్రబలు వీఁ." డనుచు
నామధేయంబును నలువొప్పఁ బెట్టి,
ప్రేమతోఁ బెనుపంగ, బెరిగి యాసుతుఁడు
సింగంపుఁగొదమల సిగపట్టి తెచ్చి,
భంగించి యావలఁ బాఱంగఁ దోలు ;
నెలుగుపిల్లలఁ దెచ్చి యింటి బాలకుల
నలబూచిబూచని యాడించుచుండు ;
నీరీతి మఱియు ననేకలీలలను
వారక సేయుచు వర్తించుచుండె.

### శకుంతలను హస్తినాపురికనుపుట

అంతఁ, గణ్వమునీంద్రుఁ డనుఁగుఁగూఁతునకుఁ
గాంతి రాచూలికిఁ గడువేడ్కతోడ
దివ్యభూషణములు, దివ్యాంబరములు,
దివ్యగంధంబులు దీపింప నొసగి,
తనశిష్యగణములఁ దగఁ దోడుగూర్చి
యనఘుఁ డల్లునియూరి కనిచిపుత్తెంచె.
ఆరీతి మునిపంప, నా శిష్యవరులు
దారకతోఁగూడఁ దరుణిఁ దోడ్కొనుచు
హస్తినాపురమునకరుదెంచి, యానృప
శస్త్రంపు మొగసాలఁ జదురొప్పసిలిచి,
దౌవారికులచేతఁ దమరాక తెఱఁగు
భూవరునకుఁ జెప్పిపుత్తేర, నతఁడు
నతిభక్తితో వారి నటకు రావించి,
చతురతఁ బూజించి సన్నుతిఁ బలికె:
"అనఘాత్ములార, మీరరుదెంచుకతన
ఘన తపో ధర్మార్థ కలితుండనైతి.

మహాత్ముఁడగు కణ్వమౌనిచంద్రునకు
బహుభంగిఁ దపములు పరఁగున నెపుడు!
దేవ విప్రార్థమై ధృతిఁ గూడఁబోయు
నీవారధాన్యంబు నెలవుగాఁ గలదె (వె)!
కందమూలంబులుఁ, గమ్మనిపండ్లు,
నందంద యతిథులకబ్బునే పెట్టఁ!
బరమేశుఁ బూజింపఁ బత్త్రపుష్పములు
వరనదీజలములు వారికిఁ గలవె!
మఱియును దక్షిణమహితకృత్యములు
[1] దరలక మానిఁ దనరున యచట!
ఆమహాత్మకుఁ డేమియాఁకతియిచ్చె!
నేముగావించెద మిటు చెప్పవలయు."
ననవుడు, మునిపుత్త్రి యతనికిట్లనియె:
"ఘనుఁడ, కౌరవ వంశకర్తవు నీవు
ఇలయేలుచుండంగ నెల్లవస్తువులు
నిలయీనుసంధమున నెసగునల్లెడలఁ;
ప్రజలకందఱకును బరిణామమెపుడు;
నిజధర్మములు చెల్లు నిఖిలభూములను;
గావున, నెప్పుడుఁ గణ్వసంయమికి
భావింప సుఖముతోఁ బ్రబలుఁ దపంబు.
అమ్మౌనివాక్యంబు లాదట వినుము:
'నెమ్మి నేలేనిచో నీవనంబునకు
సమరంగ వేఁటకై యరుదెంచి, నీవు
కోమరి నాకూఁతు శకుంతలాకన్య
గాంధర్వమునఁ బెండ్లి కడఁకతో [2] నాడి
బాంధవంబుగఁ జన్న పద్ధతిక్రమము

---

1. తనరక. 2. గూడి. (మూ)

మనమున నెఱింగి సమ్మతిచేసి, పిదపఁ
దనయుఁ డెదిగినదాఁక దనయునిల్పితిమి ;
[1] ఇంకకుమారకు నిల్లాలి నీవు
గొంకక యొప్పుగాఁ గొను.' మని చెప్పి
పుత్తెంచె దమ్ము నో భూపాల !" యనిన,
నత్తఱి వికలుఁడై యవనీశుఁ డనియె :
"ఈకన్య నెన్నఁడు నేఁ బెండ్లియైతి !
నాకు నీ బాలుఁ డెన్నటికుమారకుఁడు !
ఏ నేమియు నెఱుంగ ! నీ భంగి నాకుఁ
గానక కొడిమెలు గట్టంగఁ దగున !" —
అనిన, వారలు రాజు కలుక నిట్లనిరి :
"మనుజేశ, యూరకే మఱపుగైకొంటి ;
వేము చెప్పఁగనేల ! యీరహస్యములు ;
శ్యామలకుంతల సర్వంబుఁ దెలుపు".
ననిన శకుంతల యవనీశుఁ బలికె :
"వినుతాత్మ, మఱచితే విజ్ఞానివయ్యు !
మున్ను దపోవనంబున వేడ్క నన్నుఁ
గ్రన్ననఁ గామార్థిఁ గదముట్టఁగూడి, —
రాజ్యానుభవమున రాజిల్లి యిపుడు
పూజ్యుండవై యుండి బొంకంగఁ దగున !
ధర్మంబులన్నియుఁ దగఁ జేయుకంటెఁ
గర్మోక్తమున నొక్క క్రతువు మేలందు ;
ఆ క్రతువులు నూఱు నటు సేయుకంటె
సుక్రమస్తుతుఁ డగు సుతుఁడు మేలండ్రు ;
ఆసుతశతకంబు నందుటకంటె
వాసిగా నొకసత్యవచనంబు మేలు ;

---

1. ఇంక కొమారక యిల్లాలివీవు. (పా)

సకలధర్మంబులు సరసితో వ్రాసి
యొకవంకనిడి, సత్యమొకవంకఁ బెట్టి
త్రాసునఁదూఁచిన, ధర్మంబుకంటె
వాసియయ్యెను సత్యవచనంబుతొల్లి ;
కావున, సత్యంబు గడచిపోనాడు
భూవిభుగావించుపుణ్యంబులెల్ల
నొసర బూడిదలోని హోమంబుగాద !
మనుజేశ, కల్లలు మానుము నీవు ".
అనిన, మానినిఁజూచి యువనీశుఁడనియె :
" వినరానిమాటలు వెలఁది, యాడెదవు ;
నలి నసత్యముగాఁగ నామాటలెల్ల,
వెలఁది, నీమాటలు వేదంబొ చెప్పుము !
మటుమాయప్రోగులు, మదనమోహినులు,
నటమటంబులకావు, లనృతభాషిణులు,
కన్నండఁ గనుపాపఁ గడఁకతోఁదివియు
కన్నగాండ్రులుగారె ! కాంతలన్వారు.
సత్యంబులెల్ల నసత్యంబు సేయు,
నిత్యమనిత్యంబు నిజముగాఁ జేయు
నేరుపు సంధిల్లు నెలఁతలకెల్ల ;
వారకు నీమాట చాలించి యుడుగు ".
మనిన, శోకంబుతో నతివయిట్లనియె :
" వనములోపలనుండు వసిరాజనంబు
పలుకుల సత్యంబు పాటిగాదయ్యెఁ !
గలకాలమును శత్రుగణములఁ జెఱుచు
కుచ్ఛితంబులు నేర్చు కువలయాధిపులు
నచ్చగా సత్యంబులాడెడువారె !
నామోము చూడుఁడి నలినలియయ్యె !
నేమింక నేయన నేర్తుము నన్నుఁ !

దనయునకై నను దండ్రి ముందటను
ఘనయౌవరాజ్యంబు గానలేనయ్యె!"
నని యిట్లు పలుకుచు నధిపుదూఱుచును,
మనమున శోకించి మఱియు నిట్లనియె :
"అనలుండు, చంద్రుండు, నంభోజసఖుఁడు,
ననిలుండు, భూమియు, నాకసం, బాత్మ,
యుదకంబు, జముఁడును, నుభయసంధ్యలును
మదిఁజూతు రెప్పుడు మనుజుల నెల్లఁ;
గావున, నీరాజుకల్ల నిజంబు
దేవతాతతులార, దృష్టింపుఁడీరు."
అని పలుమాఱు నయ్యతివ శోకింప,
వనితకై యాకాశవాణి యిట్లనియె :
"ఓరాజ! వినుము, యీయువతి నీభార్య;
శూరుఁ డీబాలుండు సూనుండు నీకు;
గాంధర్వ[1] విధమునఁ గానలో నీవు
సంధించితివిదీని; సత్యమీమాట.
సందియంబేటికి! సతిగైకొనదీని
నందనుఁ గైకొమ్ము నరనాథ, మేలు".
అనిన సంతోషించి [2]రఖిలసభ్యులును;
జననాథుఁడును హర్ష[3]సంభృతుఁడగుచు
మాని[4]సామంతుల మంత్రులఁ బిలిచి :
"నేనెఱిఁగియు నింతి నింతసేయుటలు,
వనములో నొంటిపై వర్తించునట్టి
ఘనకృత్య మిందఱుఁ గలయంగఁదెలియ
వలసి; యింతియె కాని, [5]వగున నీసాధ్వి
కులకాంతయగు; వీఁడు కొడుకును నగును."

---

1. మిదియును. 2. యఖిల. 3. సంభృతులగుచు. 4. సామజకేళి.
5. వలసి. (మూ)

అనుచుఁ బార్థివచంద్రుఁ డాశకుంతలను
'జనుములోనికి' నని శాసించిపలికి,
పులకలు మేనెల్లఁ బొదలిభూషింప
నలఘుశౌర్యునిఁ బుత్త్రు నందందమెత్తి,
బిగియఁ గౌఁగిటఁజేర్చి, ప్రియమొప్పఁ దొడలఁ
దగనొప్పనిడుకొని, ధారుణీవిభుఁడు
ఆకణ్వశిష్యుల కతిభక్తితోడఁ
బ్రాకటంబుగనిచ్చి బహువస్తుతతులు,
మునినాథునకు లేఖ ముదమొప్పఁబెట్టి
యనిచిన, దీవించి యరిగిరమ్మునులు.
అంతట, దుష్యంతుఁ డఖిలరాజ్యంబు
వింతలాగుననేలి విఖ్యాతివడసి,
యాశకుంతలఁగూడి యఖిలసౌఖ్యంబు
లాశయ్య బహుకాల మలర భోగించి,
క్రతువులు బహురీతిఁ గ్రమమొప్పఁజేసి,
చతురత యోగవిచారుఁడై, పిదపఁ
దన ప్రధానులనెల్లఁ దాల్మి రావించి,
తనయుఁబట్టముగట్టి తగనొప్పగించి,
మునివృత్తిగైకొని ముదిమి నారాజు
ఘనతపంబునఁ బుణ్యగతులఁ బ్రాపించె.
ధరఁ గులకర్తయై తనరినయట్టి
భరతుండు ధర్మసుభరితుఁ డావెనుక
భూలోకమంతయు భుజశక్తినేలి,
చాలవేడుకఁ జేసె జన్నముల్ పెక్కు.
సారత నతనిచేఁ జంద్రవంశంబు
భారతవంశమై పరఁగె నెంతయును.
జగతి దుష్యంతునిచరితంబు విన్నఁ,
దగనొప్పఁ జదివినఁ దనరుఁబుణ్యములు.

అంత నాకులకర్త హాస్తిపురభర్త
వింతగా భరతుండు విభుండైన వెనుక,
వెండియు నృపతులు వివిధప్రశాస
[1] ఖండితవైరులై కడునేల భూమి,
శంతనుండనురాజు జనియించి వేడ్క-
నంతయు నేలుచు నెఱవైభవమున,
నీతిసహాయుండై [2] నిఖిలభూపతుల-
చేతఁ గప్పంబులు చెలువొప్పఁ గొనుచు
వారణ మదవారి వర్షాగమంబు
వారక యేప్రొద్దు వాకిటఁ గలిగి,
కైలాస హిమశైల గంధశైలముల
వాలినతనకీర్తి వన్నియవ్రాయ,
సతులతోఁ బతులయాచ్ఛన్నవృత్తిదక్క-
నితరయాచ్ఛన్నవృత్తి యిలమీఁద లేక,
పేరిన సురల దుర్భిక్షదోషంబు
వారక క్రతువులవలన మాన్చుచును
ఉర్వియేలుచునుండి, యొక్కనాఁ డతఁడు
సర్వసేనాఢ్యుఁడై జాహ్నవికడకు
వేఁటలాడఁగఁబోయి విపినంబుచొచ్చి,
మీటుగల్గిన యుగ్రమృగములఁ జంపి,
శాంతి నెంతయుఁ దూలి, సహకార వకుళ
హింతాల వనరాజి నెసగుజాహ్నవికి
నరుదెంచి, మధురంబులైనతోయములు
గరగలఁదెప్పించి కమ్మగాఁగ్రోలి,
పూచినగురువింద పొదరిండ్లనీడ
రాచిల్కపల్కుల రసికుఁడై వినుచుఁ,

1. ఖండితైశ్వర్యులైకడు నేలిభూమి. 2. నీతి. (మూ)

గలయఁ దన్మోహపాశకడలఁ గ్రాఁకి
ఫలవృక్షములఁ దాఁకి పైగాడ్పువోలయు,
నేకతంబుగ నేన యెడగల్గ సిరిపి,
సైకతంబుననున్న సమయంబునందుఁ,

## వసువులు గంగతో మొఱవెట్టుట

గామినీవేషంబుగైకొని గంగ
భూమీశుఁగవయంగఁ బూనిపోవంగ,
వసువులడ్డమువచ్చి వసుసతో మ్రొక్కి,
యసమానదైన్యులై యాగంగకనిరి:
"ఎందుఁబోయెదు గంగ? [1] హితనులరంగఁ
బొందఁబోయెద లాగొ భూపాలతిలకు!
ఈతనిసంబంధ మెఱుఁగుదుమింత;
నీతఁడు మునుమేన నిక్ష్వాకుకులుఁడు;
భీమశౌర్యుఁడు మహాభిషుఁడనురాజు;
భూమియేలుచు యాగములు పెక్కు చేసి
దేహాంత్యమున బ్రహ్మదేవుని [2] సభకు-
నాహాశనిజపుణ్యుఁడై పోయి మరలి,
పెరసినతనయిచ్చఁ బెక్కుకాలములు
సురలోకవిభుకొల్వ చొచ్చియుండఁగను,
దేవి, నీవాకదివ్యదేహంబు దాల్చి
యావాసవునిఁగొల్వ నరుదె మనపును,
[3] సవిడినగాడ్పున నీచీరదొలఁగ,
ధవళాక్షి, మునవెల్లఁ దలవంచుటయును,
అంబరంబు ధరించు నాలోన నిన్ను
నంబుజానన, కాంక్ష నాతఁడు గనెఁ;

1. హితమత్తరంగ. 2. సభకు బహుళాం. 3. నిగన. (మూ)

జూచిన, నింద్రుఁడు క్షోణీశుఁ గినిసి
'భూచక్రమునఁ బోయి పుట్టుమని' యనుచు
శాపించుటయును, నొంటి జనులకుఁ బుట్ట-
నోపక యారాజు యుక్తమార్గమున
ననుపమ కలదీపుఁడగు ప్రతీపునకు
జనియించె ధర నిట్లు శంతనుండనఁగ.
శృంగారరసమొల్ల క్షితిసతంబైన
సంగజానకుఁ బుట్ట ననువు తే దబల!
ఎన్నఁగా నాఁడు నీ పిరాజుమీఁదఁ
గన్ను వేసితి; గానఁ, గడువేడ్క-పుట్టి
కాంతవై నీవిదే కనయఁబోయెదవు.
వింత వారము గాము వినుము మాకథయు;
నేము లోకంబుల నెదురెందు లేక
వేడుక విహరించి, వెసలోకమునకుఁ
బోసఁగ భార్యలు మేముఁ బోవుచుండఁగఁ,
బసఁగ మే మేఁగు నప్పథమధ్యమునకుఁ
జేరువనున్న వశిష్ఠాశ్రమమునఁ
గోరి సుఖింపఁగఁ, గొంతసేపునకు
నందలిమును డిగ్గ, నచ్చోటనుండె
నందిని యనునావు నయనాభిరామాంగి;
ఎట్టికోరిక లెన్న రిచ్చలోఁ దలఁచి
రట్టికోరిక లిచ్చునంతటిసామర్థ్య.
[1] మియ్యఁబోవఁగ దాని మేనిరోమముల
చాయకు వెఱఁగంది సంప్రీతి నఘుఁడు
ఆర్యాణియనునది యష్టమవసువు-
భార్య యాధేనువుఁ బట్టి తెమ్మనుచు
మగనిఁ బ్రార్థించిన, మాసిన మాట
తగదన మెంచిరి; తప్పుచేసిరి.

---

1. మరియు. (ఊ)

పడఁతి [1]యిట్లనుపఁగఁ, ద్యౌర వాఁడుపోయి
యొడిసి వశిష్ఠుని హోమధేనువును
బట్టి తెచ్చిన, నేముఁ బదిలమై గదలి
నెట్టన వచ్చుచో, నిజబుద్ధి నెఱిఁగి
'మనుజులై పొం' డని మాకు వసిష్ఠుఁ
డనమండ్రకును శాపమిచ్చె; నిచ్చుటయు,
నందిని విడిపించి నయ మొప్పఁగదలి
యందఱము నువచ్చి యతనికి మ్రొక్కి,
చేతులు మొగిచి: "మా చేసిన తప్పు
బ్రాఁతియా! మునినాథ, పనలేదు గరవె!
ఉలిఁగి దప్పుగా నేలగైకొంటి!
భూలోకమున నేము పుట్టనోపుదుము;
చచ్చుచుఁ, బుట్టుచు, సకలరోగముల
— నెచ్చుచు, వ్యాధితో విహరింపఁగలమె!
మొదల బాల్యంబున, ముదిమి నంత్యమునఁ,
బొదలుయౌవనమున పొక్కుచుఁగలమె!
పత్తెంబు మ్రింగుచుఁ, బవలును రేలు
చిత్తంబు దలఁచుచు విహరింపఁగలమె!
సర్వజ్ఞ, యూర్పవే! శాపాగ్ని;" యనిన,
నార్వాశ్రేయుఁడు మాకు నభయంబులిచ్చె:
'కథలేల! మీలోనఁ గడపటివాఁడు
పృథివి నుండెడుఁగాక పెద్దకాలంబు;
మట్టుపునియతితో మానవయోనిఁ
బుట్టుచు, మరణంబు బొందఁడెప్పుడును;
సంతానశూన్యుఁడై సకలభోగముల
పొంతఁబోవసిపుట్టు పుట్టుచు నిశేఁకు'.

1. యిట్లనుపఁగ ద్యౌరిగాఁడుపోయి. (మూ)

అని వశిష్ఠుఁడు మమ్ము ననుపుటఁ జేసి
జనియింపవలసె నీజగతిలోపలను.
నీయందు మునిఁగిన, నెఱయఁ జేరినను,
బాయుంగనగు సర్వపాపంబులందు;
ఒక్కనిఁ దనయుఁగా నుండని". మ్మనుచు
మ్రొక్కి యావసువు లమ్మునికిట్లనిరి :
"ఇలదీర్ఘజీవిగా, నేము మాలోనఁ
బాలఁతి, చతుర్థాంశములు పుచ్చి వచ్చి
కలసియిత్తుము పుత్త్రుఁగా నీకు; నతఁడు
నిలిచివర్ధిల్లెఁడు నృపుఁడు మోదింప".

### గంగాశంతనుల సమయము

అనిన నట్టిద కాకయని వారినెల్ల
ననిచి, భాగీరథి యటవచ్చివచ్చి
వసుధేశునమ్మేను, వక్షస్స్థలంబుఁ,
దనదీప్తులు, ముఖపంకేరుహంబు,
నాజానుబాహులు, నసమానరుచియు,
రాజీవ రుచిర నేత్రంబులుఁ జూచి,
యాశానుతిలకెక్కె యేలినగంగ
యాశంతనునిమూర్తి కాత్మలో మెచ్చి,
గరువంబు నేరక కదిసిపోలేక
సురిగిరా నేరక సుడివడియున్నఁ,
బతియును దానిసౌభాగ్యసంపదకు
మతిలోనఁ జొక్కి, మన్మథునకుఁ జిక్కి :
"దైవకన్యకయొ ! గంధర్వకన్యకయొ !
యీవచ్చుకన్య దేవేంద్రకన్యకయొ !
వరకన్యకయొ ! కాక, వసుమతినంత
నరకన్యకకు నిట్టియరూపు గలదె !

కలికిమీనంబులో! కన్నులో! యెఱుఁగ;

నలరినపసడమో! యధరమో! యెఱుఁగ,

గ్రమమొప్పఁగంబువో! కంఠము! యెఱుఁగ;

గమలమృణాళమో! కరములో! యెఱుఁగ;

జక్రవాకంబులో! చన్నులో! యెఱుఁగ;

జక్రమో! పులినమో! ఘనమో! యెఱుఁగ;

[1] గరిమకూర్మములో! మీఁగాళ్లో! యెఱుఁగ;

నరుణపంకజములో! యడుగులో! యెఱుఁగ;

నేరూప మెఱుఁగిలే; సిట్టిసౌభాగ్య

మీరూపు నిర్మింప [2] నేరఁడుబ్రహ్మ.

ఒకమాఱు కౌఁగిలి యువిదయిప్పటయు,

సకలంబువెలగాదు జగతీతలంబు.

ఈచోట నొంటిగా నెవ్వరికెదురు

చూచుచున్నచ్చో శుకవాణి ముగ్ధ!

అమ్ములగతినాటె నలిన [3] మూపులును

[4] నమ్మఁజాలనరీతి నాశరీరమును.

నడిగిచూచెదఁగాక యవలవృత్తాంత;

మడుగంగ మఱుమాట లాడిరిండెడినో!

కదిసి చూచెదఁగాక కమలాయతాక్షిఁ;

గదియఁగా నెక్కడ కదలిపోయెదినో!"

అని యిట్లుదలపోయు నధిపతిఁ జూచి,

వనజాక్షి యారాజువామాంక మెక్క;

నెక్కనఁ, బులకలు నిరువురమేన

నొక్కట నెసఁగట యుప్పతింపనొప్పె

[5] గీష్మతి పదనుగల్గినచోటెఱింగి

పుష్పాస్త్రునకు నారు పోసినాఁడఁగ.

---

1. గరిమకూర్మములొ మోఁగాళ్లొయెఱుఁగ. 2. నేరము. 3. మూపురుల. 4. నమ్మ రాదని లేని. 5. గ్రీష్మతి. (మూ)

అప్పుడు నరనాథుఁ డాత్మలో 'నబల
చెప్పినయట్లెల్లఁ జేయుదు' ననుచుఁ
దలఁచుచున్నతనికిఁ దరుణి యిట్లనియె:
"నెలకొని చేసెద నీకుఁ గాపురము; —
ఏనేమిచేసిన నీవు గాదనక
యూనినమతి నూఱండనోపుదువె!
ఉండక యెన్నఁడే నల్లంబునొవ్వ
మండలేశ్వర, నన్ను మఱచి యాడినను,
అప్పుడు నినువిడిచి యరిగెదఁ జువ్వె!
చెప్పితి, నెట్టనఁ జేపట్టు." మనిన
నొడఁబడి, శంతనుం డువిదనిచ్చోటఁ
గడురమ్యముగ నిండ్లు గట్టించి, యందు
సురలనుభవమున సురరాజు పోలె
సురనదిఁ గూడి భాసురసౌఖ్య మందె.
అత్తఱి, వరుణేంద్రులాదిగా వసువు
లెత్తిన క్రమముతో నింతికిఁ బతికి
జనియింప జనియింప, జాహ్నవి వారి
మనుజేశ్వరుఁడు చూడ మఱిఁగొంకులేక
గొనిపోయి గంగలోఁ గూయికూయనఁగ
మునిచి, తీర్థములాడి మోద మొప్పవచ్చు.
ఇట్టుముంచి వధింప [1] నెన్నగఁదాఁక,
నెట్టనఁజూచి యానృపచక్రవర్తి
యాలికడ్డముచెప్పనెన్నఁడు గాన
లోలోన వగలఁగాలుచు నోర్చి యోర్చి,
యనలతేజుని నంత నష్టమపుత్త్రుఁ
గొనిపోవఁ, బోనీక కోపించి నిక

1. నెన్వరు. (మూ)

చేట్టన రేఁగి యాజాహ్నవిఁ జూచి :
"వెట్టిదానవుగాక వేఁడి, నీకడుపు
చుట్టఁకున్నది చోద్యంబు చూడ!
నట్టువచ్చిన నట్లు వలచితి గాక,
కొట్టుమ్రింగినయట్లు కొంత గై కొంటి
నట్టుత్రొక్కిన నడ్డ పూఁడరాదనుచు.
జుట్టఁజూచితి నీవు సోమకులంబు!
మట్టినుండెడు భూతమాత్రవు గాక,
కట్టువట్టెద (?) నీవు కాంతవుగావు.
ఒట్టెలాగున నన్నొకమాట యన్న,
జట్టన [1]జూతెదు సంసారమెల్ల.
విట్టవీఁగక నీవు విడిచిన, మాకు
జెట్టికి నొకకాలు చెడినట్లు [2]సకియ!
తిట్టెఁబోసిననీళ్లు తెలివ, నీబ్రదుకు ;
గొట్టెదూడలఁజేస్తి కొడుకులనెల్ల.
ఉట్టూఁతలూఁగు నీయురుకుచద్వయము
ముట్టుపా లేబిడ్డ మూతిఁ బట్టితివి!
కట్టలపంటి నాకొడుకుల మ్రింగి,
గట్టునఁ ద్రేంచెను గంగలో మీలు!
అట్టాడి మ్రింగిన నట మ్రింగనిమ్ము,
తట్ట, [3]మెత్తెద వాని దయమాటలాడి.
మిట్టుగాదే యెల్లి మిన్నేరు! పూన్చి,
కొట్టువిత్తించెదఁ గోపంబు మాన ;
ఈకుమారకు జముకికు మాఱకము ;
నీకు మాఱాడితి నేఁ"; డన్ననవ్వి :
"ఏటికి నామీఁద నింతకోపంబు!
వాటంపుసెయ్యంబు వలదన్న మాని,

---

1. జారదు. 2. సకుల. 3. మెంత్తెద. (మూ)

చాలించి పోయెద జాహ్నవి నేను ;
బాలు నేఁ గొనిపోయి భక్తిఁ బెంచెదను ;
యౌవనప్రాప్తిలో నరుదెంచు నిచటి
కీవసుంధరకెల్ల నితఁడొడయుండు ;
పుట్టుచు మరణంబుఁ బొందినవారు
నెట్టన వసువులు నేఁడైన నెఱుఁగు ;
వారి వశిష్ఠుండు వసుధపైఁ బుట్ట
నీరీతిఁ బొమ్మన్న నేతెంచినారు ;
ఒప్పఁగా నీచేత నుపకృతులైన
యప్పుణ్యులోకవేళ నగుదురు నీకు."
అనిచెప్పి, గంగ రయంబెసగంగఁ
దనయునిఁగొంచు శంతనుడించి పోయె.
అంత నూరికివచ్చి, యతఁడవ్వధూటిఁ
జింతించి చింతించి చిత్తజుండేఁప,
నూరిపట్టున నుండ నుల్లంబురాక
వీరవర్గముగొల్వ వేటాడవెడల,

## శంతనుఁడు భీష్మునిఁ బడయుట

భాగీరథీ నదీ పథమునఁ దొంటి
భోగభూమికిఁ బోయి పొడగనునపుడు,
కదిసి మోడలఁగాని గడువంగరాని
యుదకంబు సన్ననై యుబ్బెల్లస్రుక్క,
పలుచనై చెదరుచుఁ బాకుఱాళ్లకును
నలబలసేయుచు నడుమంటస్రుక్క, —
యారీతిఁ దనుబాసి యాకాశగంగ
భూరి తనుత్వంబు పొరసెనో యనఁగ
జాలువారుచునున్న సందియంబంది
హేల [1] ప్రయాణమై యెగువకుఁ బోయి,

1. ప్రమాణుఁడై. (మూ)

యక్కడఁ బొడగాంచె నాత్మనందనుని;
నొక్కెండు వింట నేయుచునున్నవాని,
నట్టగా నేసిన యమ్ములకట్టఁ
దొట్టిన నీటికందువ నున్నవాని,
నరుదారఁ దనరూప మచ్చొత్తినట్లు
ధరియించి బహుకళాప్రభనున్నవానిఁ
గనుఁగొని, తనసుతుఁగా నిశ్చయంబు
మనమునశేకయు, మమతావిభూతి :
" నెవ్వనితనయుఁడో యీదీర్ఘ [1] బాహుఁ !
డెవ్వనిపుణ్యమో యీమేలుగాంచె !
సుతు నింతవాని నీశుఁడు నాకు నీయ
క్షితికెల్ల యువరాజుఁజేయంగఁ దగదె!"
అనివిచారించుచో, నతనికి గంగ
వనితయైపొడసూపి వరలజ్జఁబలికె :
"ఏను మున్నిటిగంగ ; నితఁడునీసుతుఁడు ;
మానవేశ్వర, నీవుమఱచిన వినుము.
ఇతఁడు వశిష్ఠుతో నెల్లవేదములు
చతురతఁ జదివె శాస్త్రములతోఁగూడఁ ;
బరశురాముఁడు నేర్ప బహుతరవిద్య
శరములు మంత్రించి సంధింపనేర్చె ;
వాహనారోహణ వరశక్తియుక్తి,
[2] వ్యూహశుకృతులఁ దా నుపదిష్టుఁడయ్యె ; –
సనకసనందన సన్మునీశ్వరుల
ఘనకృప నెఱిఁగె [3] యోగప్రకారంబు ;
నింతటఁ గొనిపోయి యేలింపుధరణి ;
సంతాన [4] వంతులసరస నుండెదవు ".

1. దేహు-డె. 2. వ్యూహతాసుకృతానుపదిష్టుఁడయ్యె. 3. యోగపుకార్యంబు.
4. రితుం. (మూ)

అనుటయు, వేడ్కఁ దా నాగంగననిచి
తనయునిఁదెచ్చి, శంతనమహీవిభుఁడు
హస్తిపురంబులో నతనికి వేడ్కఁ
బ్రస్తుతి యువరాజపట్టంబుఁ గట్టి,
రణమున సాధింపరానిశాత్రవుల
నణుమాత్రమున గెల్చి, యతనిసత్వమున
జలరాశివేష్టిత సకలభూతలము
నలమి యేలుచునుండి, యటనొక్కనాఁడు,

శంతనుఁడు సత్యవతిని మోహించుట

ఆపగేయునిమీఁద నఖిలభూభరము
మోపి, రథంబెక్కి ముదముఱెట్టింప
యమున [1]వాలునకు నెయ్యమున వేటాడ
నమితసేనాఢ్యుఁడై యరిగి, యచ్చోటఁ
గప్పారుజలముపైఁ గాంచనచ్ఛాయ
నొప్పారుచున్న యాయోజనగంధి
నీలమేఘంబుపై నెలకొను మెఱుపుఁ
బోలియుండఁగఁ జూచి, బుద్ధినూహించి :
"యీసౌరభంబును, నీజవ్వనంబు,
నీస్వరూపము బ్రహ్మ యీయింతికొసగి
[2]నాకల వలనొప్ప నడువ నిట్లునిచె ;
నీకార్యమునఁగదా యితఁడు [3]ఛాందసుఁడు !"
అనితలపోసి యిట్లను నింతిఁజేరి :
"వనిత, నీరూప యౌవన విలాసములు
సూడిదగాఁ జిత్తజునకు నీవచ్చు ;
నోడరేవున నుండ నుచితమె నీకు !
నింతికి నర్ధాంగమిచ్చిన శివుఁడు
కాంత, నీరూపంబుగని సిగ్గువడఁడె !

1. వాల్పునకు. 2. నాకలోపల నొక్కనాప యిట్లునిచె. 3. చెందనుఁడు. (మా)

కాముండు మూర్తితోఁ గలిగినవాఁడు
నీ[1] మేనుగలిగిన నిలుచునే [2]జగము!
ఎన్నంగ ధరయెల్ల నేలినవాఁడ,
నన్ను నేలుమురాక నలినాయతాక్షి!
కాముబారికి మునుగాము; నీప్రేమ
యేమనిభావింతు నెఱిఁగింపఁగదవె!"
అనిన నాతనిమూర్తి కతివ మెచ్చియును,
మనసువికారంబు మఱువెట్టి పలికె: —
"ఏనియ్యకొనఁజేసి నీయర్థమునకు;
మానవేశ్వర, నీవు మాతండ్రిసుతుఁడు;
అల్లదె మాపల్లె; యందు మాతల్లి
పల్లెలతోఁగూడి జనకుఁడుండెడిని;
వారినుండియు నీవు వచ్చునందాఁక
వారినుండెదఁ బూర్వవర్తనంబునను;
విచ్చేయు." మనవుడు, విరదమ్మునుండి
యచ్చుగాఁ బోలేసి యులిపోలె నతఁడు
నతిఁబాయలేకయు ఝషవైరిపులకిఁ
గలిపయ [3]మంత్రిసంకలితుఁడై పోయి,
దాసుఁడయ్యును విష్ణుదాసుఁడైయున్న
యాసతీమణితండ్రి నచ్చోటఁ గాంచి,
యతనిచేఁ బూజితుండై వేడ్కఁబలికెఁ:
"జతురత మాతోడి సంబంధమైతి;
కాశి నీగతి మత్తకాశినీమణుల
దాసులు గానరు తపముచేసియును.
రత్నంబుగంటివి; రథనంబు [4]మిగుల
యత్నంబుతో నడుగ నరుదెంచినాఁడ.

---

1. మేలు. 2. జయము. 3. మాత్ర. 4. అఖిల. (మూ)

గ్రామంబులిత్తునో ! కరులుగావలెనో !
హేమ మౌక్తిక రాసులిత్తునో తనియ !
నెయ్యది నీకోర్కె ? యెఱిఁగింపు.” మనినఁ,
దియ్యనిమాటల దేవలుండనియె :
“హరిణలోచనఁ బెండ్లియాడెదు గాక ;
ధరణీశ, నీకంటెఁ దగువారు వేఱె !
ఉంకువ నీచేత నొల్లముగొనఁగ ;
నింక చెప్పకపోదు హితలీల వినుము ;
నాపుత్రికుదయించు నందనునంద
యువరాజభారంబు నున్పనోపుదువె !
ఓపిన, నిది నాకు నుంకువ”. యనినఁ,
గోపమించుకవచ్చి కువలయేశ్వరుఁడు :
“ఆపగేయుఁడు రాజ్య మరయుచునుండ,
నీపని యెట్లుగా నేనియ్యకొందుఁ !
గట్టిడికార్యంబు, కళ్యాణమైనఁ
గట్టినట్లున్నది కడునాత్మనాకు.”
అనిఖిన్నుఁడై పోయి హాస్తినాపురము,
తనయిల్లువెడలక తాపభారమున,
వాలినమొగులులో వనజాప్తుఁ [1] డట్లు
చాలఁదూలిన జీర్ణచంద్రుండువోలెఁ
గుంభినీజనులకుఁ గొలువియ్యకున్న,
గాంభీర్యజలరాశి గాంగేయుఁ డెఱిఁగి,
యయ్యెడ నొక్కనాఁ డయ్యయున్నడకు
నొయ్యన సుముఖుఁడై యొక్కఁడుఁ బోయి :

### భీష్మప్రతిజ్ఞ

“యిదియేమి తండ్రి ! నీవెన్నఁడు [2] లేదు,
చెదరియున్నావు నీచిత్తంబులోన !

1. డున్న. 2. లేమి. (మూ)

సాధింప, ఘనుఁడైన శత్రుఁడా లేఁడు!
బాధింప, నోడినపాపంబు లేదు!
విల్లు నేనును గల్గ విజయంబునీకు;
నెల్లకార్యములు నాకెఱిఁగింపు." మనిన,
(ననువొప్పఁ దా వేట కరిగినలాగు,)
ఘనుఁడు యోజనగంధిఁ గదిసినలాగు,
రమణికి సుతుయౌవరాజ్య ముంకువగ
(నమరంగ దాశరా జడిగినలాగు,)
వలదని తా నంత వచ్చినలాగు,
లలిఁ బంచశరుఁడేయులాగుఁ జెప్పుటయు,
గురుభక్తి యాత్మలోఁ గొలఁదికి మిగుల
సురనదీతనయుండు క్షోణీశుఁబలికె:
"జాలరీఁడాడినచతురంపుమాట
యేలగైకొనవైతి! నేనున్న నేమి!
గురుహితం బెఱుఁగని కొడుకేమికొడుకు!
ధరణీశ, నీకోర్కి తలకూర్తు వినుము;
అందుఁబుట్టెడువాఁడు నసఘు, నీసుతుఁడు;
పొందుగా ధర నేలఁబోలదే చెపుమ!
తగ నేనపోయి, యాతని నొడంబఱచి
మగువఁదెచ్చెద"; నని మక్కువఁబోయి,
దేవలుఁగాంచి సుధీవరుఁడనియె:
"భూవరునకు నేల పుత్రినీవైతి?
నాచిత్తమెఱుఁగక నరనాథుఁ డపుడు
నీచేత నతి నంద నేరకపోయె.
అతఁడేమెఱుఁగు! నీయాత్మజగాంచు
సుతునిఁ బట్టముగట్టి క్షోణియేలింతు;
నేనేలనొల్ల; సూర్యేందులు సాక్షి;
మానవేశ్వరునకు మగువని." మ్మనిన,

దక్కఁగా నాఁడుబిడ్డల నిచ్చుచోటఁ
దక్కఁ జింతింపఁదగుఁ; గాన నతఁడు
నృపనందనునిఁబల్కు : "నీకు నీవోపి
నృపునిఁ జేసెదనంటి ; నిజము నీమాట ;
నీకుఁబుట్టెడువారు నీయంశమునకు
రాకమానరు ; ఘోరరణములో నపుడు ;
కావునఁ, గూడదు కళ్యాణ". మనిన,
నావేళ మెత్తిన ట్లతఁడు భీష్మించె :
"ఏను బెండిలియాడి యెన్నఁడే నొకనిఁ
గానఁగ మఱిగదా ! గలుగుఁ గయ్యములు ;
మనుజేంద్రు పెండ్లికై [1] మానెదఁ బెండ్లి ;
ఘనతఁ బుత్త్రులఁ గానఁగలవాఁడఁ గాను. –
[2] అమరమైయుండు నాయావనావస్థ ;
రమణుల [3] నంగ యారంభదీమముగఁ
గుసుమాస్త్రుఁడేయనీ కుసుమబాణముల,
వెస వీడిపోవనీ పితరులునన్నుఁ,
బట్టితిఁ బట్టితి బ్రహ్మచర్యంబు
గట్టిగా." ననుటయుఁ, గడు [4] మెచ్చి సురలు
'దేవవ్రతుం' డని దివినుండి పొగడ,
భూవరుపైఁ గురిసెఁ బుష్పవర్షములు.
'భీష్మించి యతఁడేఁగెఁ బితృభక్తి' ననుచు
భీష్మనామముఁ జేసి పిలిచిరి జనులు.
అంత సంతోషించి, యాదాశరాజు
'శాంతనిచ్చితి' నని గాంగేయు వెనుక
నిభముపై గూఁతురి నెక్కించుకొనుచు
నిభపురంబున కేఁగె నెలమిదీపింప.

---

1. మానెనా. 2. అమరగమై. 3. నంగనిరంభలోయముల. 4. నొప్పి. (మూ)

సత్యంబుతోవచ్చి సౌంజ్ఞ దైవార
సత్యవతీదేవి జనకున కప్పుడు
విభవంబుతో యుక్తవిధిఁ బెండ్లిసేయ,
నభినవోత్సాహుఁడై యప్పుడు పుత్త్రునకు
నరవిఁ గోరినదాఁక చావులేకుండ
వరమిచ్చి, యాసత్యవతియును దానుఁ
జిత్రచిత్తజకేళిఁ జెలఁగుచునుండి,
చిత్రాంగదునుని విచిత్రవీర్యునిని
బుత్త్రులఁగాఁగాంచి, పుత్త్రోత్సవంబు
ధాత్రి మెచ్చఁగఁ జేసి తనరఁబెంచుచును,
రాజ్యంబుచేసి, యారాజు గీర్వాణ
రాజ్యంబు కాలధర్మమునఁ బ్రాపించె.
అప్పుడు భీష్ముఁ డయ్యబల నూరార్చి,
తప్పక శ్రాద్ధముల్ తండ్రికిఁజేసి,
నవలీల సింహాసనంబు గైకొనక
యువనికి రాజుఁ జిత్రాంగదుఁజేసె.
చేసినచోట నాచిత్రాంగదుండు
వాసవునైన సత్త్వమునఁ గైకొనక :
"కరి గండభేరుండ కంఠీరవముల
గరిడికిఁగొనివచ్చి కడఁక నొంచుదునో!
ఏఱులన్నియుఁ బూడ్చి, హేమాద్రి పెఱికి,
వారంగవిడుతునో జలధిలోపలను!
కాదేని, జలధిచక్రము వ్రక్కలించి
పోదునో శేషులోఁబోరాడ! ననుచు,
నట్టిదిగాదేని, యవని సత్త్వాఢ్యుఁ
బట్టి సాధింతునో బలమున!" ననఁగ,
. . . . . . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . . . . . .

అంత నేతెంచెఁ జిత్రాంగదుఁడనంగఁ
గాంతిభీకరుఁడైన గంధర్వుఁ డొకఁడు ;
ఏతెంచి యారాజు నిట్లనిపలికె :
" భూతలాధీశ, చెప్పఁగఁగ నీలావు ;
అష్టదిక్కరులను నడిగితి రణము ;
నష్టదిక్పాలుర నడిగితి రణము ;
నెందులేదు ; భుజంబు తేర్పులు వట్టె ;
విందుసేయుము మల్లవిద్య నా". కనుచు
నరులుఱిచ్చవడంగ నలినాక్షులేడ్వ,
దొరలునివర్తింపఁ దోడ్కొనిపోయి,
భూరి కురుక్షేత్రమున నాజిచేసి,
యారాజుఁ దెగటార్చి యాతండుపోవ,
నొక్కంతశోకించి, యూర్ధ్వకృత్యములు
తక్కక భీష్ముఁ డాతనికిఁ జేయించి,
యుర్వి కాతనితమ్ము నొడయునిఁ జేసి
సర్వంబునడపుచో ; [1] జగతిలో నంత,

### కాశిరాజుకూఁతుల భీష్ముండు తోడ్తెచ్చుట

మువ్వురుసుతలకు మొగిఁ గాశిరాజు
జవ్వనంబునఁ బెండ్లిసమకూర్ప వలసి
వీరస్వయంవరవిధికి భూవరుల
వారక పిలిపించువార్త పుట్టుటయు,
నొక్కఁడు రథమెక్కి యుర్విగ్రక్కదల
గ్రక్కున భీష్ముఁ డాకాశికిఁ బోయి,
తప్పక వీరులందఱు నల్గువారి
కప్పలగతినుండఁ గనుఁగొని నవ్వి,

1. జనులలో. (మూ)

కమనీయ కమలినీ కబళనార్థంబు
కమలాకరముఁజొచ్చు గజమునుబోలె
మచ్చుగాఁ బన్నినమందలమీఁదఁ
జొచ్చి, కాశీనుండు చూడఁజూడంగ,
నంబుజగంధుల నంబ యంబికయు
నంబాలికయు ననునట్టి కన్యకలఁ
దనరథంబెక్కించి దర్పించిపలికె:
"మనుజేంద్రులార, యేమతియుండవలదు;
అనుజునిపెండ్లికి నఖిలంబు నెఱుఁగఁ
గొనిపోవుచున్నాఁడఁ గుఱికలఁగలుల.
అసుర బ్రాహ్మంబులను వివాహముల
నాసుర మీపెండ్లి; యార్షంబు మాకు;
పెనఁగినయందు నాపేరు భీష్ముండు;
వినుఁ డొంటివచ్చితి విలుతునేను".
అనిపోవఁ, బోనీక యుద్ధంబుదాఁకి,
జననాథు లస్త్రశస్త్రంబులచేత
ముంచిన, నతఁడు రామునిశిష్యుఁడౌటఁ
బొంచి యానృపవైరములఁ బెచ్చుపెరిగి,
యనుపమాస్త్రంబుల నవి ద్రుంచివైచి,
తనరథవేగంబు దప్పకయుండఁ,
గృత్తసూత రథాశ్వ కేతన ఛత్త్ర
మత్తేభ [1]కుంభముల్ మార్గంబుదెలుప,
విచ్చుచుఁ బొదువుచు వెస భానుమీఁద
వచ్చుమంచువిధంబు వైరులు దెలుప,
నావలవెడలినయతనిబాణములఁ
ద్రెవ్వులువసిసియుఁ, బృథివిఁ ద్రాలియును,

1. కుభముల. (మూ)

[1] బిరుదులువోయియు, వీఁకిగియు, నృపతు
లరవరులయ్యు నయ్యనువున దస్సి
[2] దీనాస్యులై పెక్కుతెరువులఁ బోఁగ,
దానట్లుపోవక తవిలి సాళ్వుండు
భీష్ముని నారాచ [3] ప్రేరితుఁ జేయ,
గ్రీష్మకాలాదిత్యుక్రియ నాతఁ డలిగి,
విల్లును జోడును [4] వెసఁద్రైన కేడె
మల్లియుఁ దునిగి, యయ్యెడ నొక్కకోల
నాటించి శిరుభగ్నముసేయ, నతఁడు
దాఁటి ధాత్రికిడిగ్గి తలవీడఁ బాఱె.
అంత నూఁకినచ్చి యాపగేయుండు
కాంతల నొక్కలగ్నమునఁ దమ్మునకు
... ... ... ... ...
... ... ... ... ...
శక్తిత్రయంబుతో సంధించునట్లు
భక్తిమైనున్నచోఁ బలికె నయ్యంబ :
"నరనాథ, యిటమున్న నన్ను సాల్వుండు
వరియించె ; మాతండ్రి వచనంబుఁగలదు ;
నివ్వుఁదెచ్చితి ; నీతిమార్గమున
భావింప, నీకంటెఁ బ్రాజ్ఞులు గలరె !"
... ... ... ... ...
అనుటయుఁ, దనకుమెప్పైన యాయింతి
ననిచి, భీష్ముం డంబికాంబాలికలను
ననుజునకిచ్చిన, నసమాస్త్రకేళిఁ
బనియుక యతఁడు నిత్యంబుఁ గ్రీడించి,
నానాఁటి కొదల జీర్ణవ్యాధిపుట్టి
మానక యాలీల మరణంబునొందె.

---

1. చిరుఫులువోయివారిగియున్నృపతు. 2. దీనాస్యులై. 3. ప్రీతుని. 4. వెసఁగైన నసురి. (మూ)

అరయ నట్టిద కాదె యధికకామంబు
నరులకుఁ గొఱగాదు నయవిధిఁజూడ.
గాంగేయు భూనాథుఁ గాకుండ నడిగి
యంగననిచ్చిన నదియేల వెలయు!
అనుజుఁడిట్లేఁగిన, నాపగేయుండు
మనమున శోకాగ్ని మంటమై యుండ
దీనుఁడై, యెవ్వరు దెలిపినఁ దెలివి
నూనక మూర్ఛిల్లి యొకకొంతదెలిసి:
"శంతనుమాఱుగాఁ జన్మించి మిమ్ము
నెంతయు నరసితి నేఁ దమ్ములార!
[1] ఒమ్మగుపనిగాఁగ నొకమాను వాఁకువ
బొమ్మరమ్మును గాకపోయినట్లయ్యె!
ఇలకు విచారింప నే నున్నవాఁడఁ!
గులసూత్ర మింతతోఁ గలుచయయ్యెడినో!
ప్రాణసాధ్యంబైనపని గాదుగాఁ,
ప్రాణంబునకు నడ్డపడనె యింతకును!"
అనియేడ్చి యతనికి నపరకర్మముల
నొనరించి, యరయుచునుండె భూతలము.

## చంద్రవంశోద్ధరణకై సత్యవతి ప్రయత్నము

నిత్య నిస్పృహావృత్తి నెగడినయతని
సత్యవతీదేవి జపవేళఁ గదిసి,
విపులచంద్రముఖంబు వెసవాంచియున్న
యపరయామినివోలె నాస్యంబువంచి,
మెలుఁగు [2] డగ్గువడంగ నేడ్చుచుఁబలికెఁ:
"కలరెధర్మజ్ఞులు ఘనుఁడ, నీకంటె!

---

1. [illegible]. 2. తగ్గఁటరుగ. (మూ)

సకలపావనమైన చంద్రవంశమును
[1]నొకఁడవె శోషించియున్నాఁడ విపుడు ;
శంతనుహితముగా సంతానమునకుఁ
గాంతానుభోగంబు గైకొనవలయు ;
అరులు నీతరువాత 'హస్తినాపురము
దొరకుమా' కని యాసతో నున్నవారు ;
ఆరయ బ్రహ్మచర్యం బింక వలదు ;
కారణం బెడలుచోఁ గార్యమేమిటికి !"
అనిన భీష్ముఁడు పల్కు : "నమ్మ, యిట్లేల
ననువిచారింపవు నయుహీనుఁ జేసి !
పట్టనేరుతునఁట ! పట్టిన వ్రతము
నెట్టన విడుతునే నింగి పైఁబడిన !
ఎల్లధర్మంబుల నెఱుఁగుదు వంటి ;
తల్లి, యీమాటకుఁ దగుదునె యేను !
ఎఱిఁగినధర్మంబు నే విన్నవింతు ;
నెఱిఁ జంద్రవంశంబు నిలుచు నట్లైన.
పరశురామునిచేతఁ బతులఁ గోల్పోయి
తరుణులు తొల్లి త్రేతాయుగాంతమున
నాచరించినధర్మ మఖిలపురాణ
సూచితంబైనది సుచరిత్ర, కలదు ;
సర్వలక్షణముల సంపూర్ణుఁడైన
యుర్వీసురేంద్రుని నొకని వరించి,
సన్నుతి శుచి ఋతుస్నానంబు చేసి-
యున్న నీకోడండ్ర యొద్దకుఁ దెచ్చి,
పుడమికిదిక్కుగాఁ బుత్రభిక్షంబు
నడిగించు ; గలిగెద రతిసమీపమున.

---

1. ఒకటియా. (పా)

కలరు నమ్ముము రాజకాంత లిరువురఁ
గులమునిల్పెడువారు కుంభినిమీఁద.”
అనిన శంతనుదేవి యంగీకరించి,
తనకుమారుని వ్యాసుఁ దలపోసి పలికె:
“కన్నియయైయుండఁ గంటి నేఁబుత్త్రు;
నన్నాఁడు మునిచంద్రుఁ డుత్తమోత్తముఁడు;
[1] ఆరయఁబోనేల యన్యునొక్కరుని!
మేరువుపైనుండి మిన్నేల వెదకి!
శాంతశీలుఁడు చాలఁజక్కనివాఁడు
కాంతిమతులఁజేఁ [illegible]లిగించుసుతుఁ;
అతఁడువ్యాసుండు; మహామునిపుత్త్రుఁ;
డితరుండుగాఁడు; నీ వెఱిఁగినవిధము.
అలయక నాయాజ్ఞ యమ్మహామౌని
తలఁదాల్చి పుత్త్రులఁదా నంబొనర్చు.”
అనిన భీష్ముఁడు లేచి యంజలిచేసి
కనుదోయి మోడ్చి చక్కఁగఁదూర్పునిలిచి:
“ఓంకారమయరూప, యోగివ్యాసమౌని,
పంకజాసనుసాటిఁ బ్రతిమైన వ్యాస,
హరియుద్ధరించినయఖిలవేదములు
సరవి నేర్పఱచిన జగదేకహితుఁడ,
సావధానంబున సాత్యవతేయ,
రావయ్య మీతల్లి రప్పింపుమనియె;
మునిచంద్ర, మునిసింహ, మునిసార్వభౌమ,
యనిమిషేశ్వరవంద్య, యరుగుదేవయ్య!”

### వ్యాసుఁడు తల్లికిఁబొడసూపుట

అనిన, జేగురుకాల్వ లందును సింధు
[2] నిసికివ్రేలఁగఁబచ్చు సీలాద్రివోలె

1. అరసిచూడఁగ నేల. 2. నిలి. (మూ)

మెఱుఁగుఁదీఁగెలతోడి మేఘంబుపోలె
చేఱుపులై పింగళజట లుల్లసిల్ల,
ద్వైపాయనుఁడువచ్చి తల్లికిమ్రొక్క :
'నేపనిగలిగెనో యెఱిఁగింపు ;' మనిన,
నప్పుడు గాంగేయుఁ డర్ఘ్యాదివిధుల
నప్పరాశరసూను నర్థిఁ బూజించి,
యున్నతాసనముపై నునిచి కీర్తించి,
కన్నులుచల్లఁగాఁ గనుఁగొనుచుండ —
నాసత్యవతి వేడ్క నతనికిట్లనియె :
" వ్యాస, తలంపఁగా వచ్చితి నేఁడు ;
హరిపోలె సంచితాయుంతరంగముల
చరితంబుతెలుఁగుదు సంయమితిలక !
ధర వచ్చివచ్చి శంతను [1] ననంతరము
— [2] ఒఱిపోవఁగానుండె భరతవంశంబు ;
తనయులఁబడయఁ డీతఁడు బ్రహ్మచారి ;
ఇదివసి గురుస్థైర్య పట్టినవ్రతము ;
కూలిరిద్దఱుపుత్త్రకులు ధురంధరులు ;
వాలిన నాలోని పగలార్పవయ్య !
అంబుజముఖులు నీయనుజునిభార్య
లంబికాంబాలికలనియెడువార
లున్నారు ; వారిలో నొకయింతియందు
మన్నించి యొక్కకుమారు నీవయ్య !
దేవరన్యాయంబు ధృతిఁ జేయువచ్చు ;
నావల నీకంటె నర్హుండు లేఁడు. "
అనిన, వేదవ్యాసుఁ డంబకిట్లనియె :
" విను మెఱుఁగుము లోకవిదితమీ తెఱఁగు ;

---

1. నందనుండు. 2. పరవిపోవుచునుండె. (వూ)

పూఁబోఁడు లనుకూలబుద్ధి వారైన,
నేఁ జూప కావింతు నీప్రయోజనము.
క్షేత్రంబులోని విశేషంబు గలన
క్షాత్రంబు గలవాఁడు జనియించుఁ గొడుకు.
నెలకొని యొకదోఁప నియమంబు సలిపి
నలినాక్షులున్నచో, నాఁడు న న్నీవు
తలఁపుము; నే వచ్చి తల్లి, వారలకుఁ
గులము నిల్పఁగ నోపు కొడుకుల నిత్తు."
ననినఁ గుమారుతో నతివ యిట్లనియె:
"దినవంశనియేల! ధాత్రికి రాజు లేఁడు;
నాకోడలున్నది నాల్నాళ్లు చేసి;
యేకతంబున నీకు నేను బుత్తెంతు
[1]ర." మ్మని యంతఃపురమున కాతనిని
సమ్మతిఁ గొనిపోయి, శయ్యపై నునిచి,
యంబికాంగన యున్న యావాసమునకు
సంబరంబున రాత్రి చనుదెంచి పలికె:
"ధర్మమార్గంబునఁ దరుణి, నీకొక్క
కర్మంబు చెప్పెదఁ గైకొని వినుము;
నిరతసంతానంబు నిలుపుట కంటెఁ
బరమధర్మము లేదు [2]పతిధర్మవతికి.
రమణుఁ గోల్పోయిన రాచయిల్లాలు
విమలాత్ముఁడగు విప్రవీర్యంబు దాల్చి
సుతులఁ గాంచుట మేలు; శ్రుతి పురాణముల
వితతమీయర్థంబు; వింటిమెల్లెడల.
ఈరాత్రి యుదకంబు లింపి, నీవాడి,
సౌరభగంధంబు చల్లనిమడుఁగు

1. రమ్మని యంత నంతఃపురమునకు. 2. ప్రతిధర్మములకు. (మూ)

జాదులు ధరియించి చనుదెంచు గాక;
భూదేవుఁ డున్నాఁడు పువ్వుఁబోఁ డిప్పుడును;
అతఁడు వేదవ్యాసుఁ డనఘ, మీ బావ;
యతిభక్తి యొనరించి యడుగుము సుతుని."
అనుటయు లజ్జించి యత్తకుత్తరము
వనిత యీనోపక పరుసఁగై సేసి,
రత్నదీపంబులు రమణీయధూప
యత్నంబుఁ గలిగినయచ్చోటికిఁ బోయి,
కపిలవర్ణంబైన గడ్డంబు జడలుఁ
దపసినల్లని మేనుఁ దప్పక చూచి,
రొయిగలు[1] గిల్బిరికింప నోఁడాడ నోడి,
వెడఁదకన్నులు మోడ్చి వెఱచుచునుండఁ,
దగిన కార్యముదీర్చి ద్వైపాయనుండు
మగుడ మఱ్ఱవఁ బంచి, మఱునాఁడు తేవు
అంబికవృత్తాంత మడుగుచున్నట్టి
యంబతో నిట్లను: "నయ్యెఁ గార్యంబు;
పుడమి యేలెడుభోగి భుజబలోన్నతుఁడు
కొడుకు జన్మించు నీకోడలియందు;
ననుజూడనోడి యున్నతిఁ గన్ను మోడ్చు
జననిదోషంబున జాత్యంధుఁడగును;
అంబికాసంభోగ మభవుండు సేయ
లంబోదరుఁడు పుట్టె లలి వక్రముఖుఁడు;
ఈయంబికయుఁ బుత్త్రు నిటుగనఁగలదు;
చేయనేమున్నది శివునాజ్ఞగాక!
ఏను బోయెద." నన్న సతి చింతించి:
'మౌనీంద్ర, పోకుము; మఱిపోదు గాని,

1. "జలదరింప" అనుట మేలు. ప్రస్తుత పదము ఈయర్థమునందే ప్రయోగింపఁబడియుండును.

బాలికయైన యంబాలిక నేఁడు
నోలినంటుననుండి యుదకంబులాడె;
దానిఁ బుత్తెంచెదఁ దనయునొక్కరునిఁ
బూని దోషవిహీనుఁబుట్టింపుమందు."
అనుచుఁ దొల్లిటియట్ల యామినివేళ
మునియున్నచోటికి ముద్దియ ననుప,
నదిపోయి మునిపుత్త్రునాకృతిఁ జూచి
బెదరివెల్వెలఁబాఱి, 'వెఱవకు' మనుచుఁ
గాలోచితముదీర్చి, ఘనుఁడు మాన్యుఁడు
చాలవేడుకనున్న జననికిట్లనియె:

## ధృతరాష్ట్రపాండురాజుల జననము

"అంబ, యంబాలిక[1] యందులోపమునఁ
గంబువర్ణుఁడుసువ్వో గలుగు నందనుఁడు;
వెలవెలఁబాఱినవికృతికి నదియుఁ
దలఁప నూరకపోదు తల్లిదోషంబు."
అనిచెప్పిమునిపోవ, నంతఁ గోడండ్రఁ
గినిసి గర్భములురక్షింప నేమించె.
అంత వ్యాసులుచెప్పినట్ల నందనులు
కాంతల కిరువురు క్రమముతోఁ గలిగి;
రాజానుబాహువు లమరమార్తాండ-
తేజులునై యుండ దృష్టించి, యుప్పు
డుప్పొంగి గాంగేయుఁ డోలి బ్రాహ్మణుల
రప్పించి ధనముధారలువోసి యిచ్చి,
పురము శృంగారింపఁబుచ్చి, సక్రమము
కర మొప్ప జాతసంస్కారముల్ చేసి,

1. యుదనిలోపలను. (మూ)

దిననాథనిభులకు ధృతరాష్ట్రపాండు
లనియెడునామంబు లనువుగావించి
పెనుచుచో, మఱి యంతఁ బెద్దకోడలికి
ననఘ, పుష్పోదయంబైన యప్పైన,
మజ్జనదినమున మాపటివేళ
సజ్జనుతుఁ బరాశరసూనుఁ దలఁచి
రప్పించి : "పలుకనేరరు మఱఁదండ్రు ;
తప్పిరి నినుఁజూచి ; తమ కేలవెఱవ !
ఇంగితంబెఱిఁగి నిన్నించుకనేవు
శృంగారరసపూర్ణుఁ జూడలేరైరి.
ఊనంబుగలిగిన సర్వేశునైన
మానవు లొక్కంత మతులఁగైకొనరు.
అని చెడఁ బ్రార్థించి యంబిక నేఁడు ;
తనయునొక్కని దివ్యతనయుఁగా నీవె !"
అని చెప్పి యారాత్రి యాయింతి ననువ,
మునిఁ బొందనేరక ముద్దియ రోసి
తత్తరింపుచు దాఁగి, తనదాదికూఁతు
నత్తగానక యుండ నంపె ; నంపుటయు,
నదివోయి తననేర్పులన్నియు మెఱసి
మదనుండు మెచ్చంగ మౌనిఁగూడినను,
దల్లికి జేపాడి తనయుఁడిట్లనియె :
"నల్లోకవిజ్ఞాని యుదయించుఁ గొడుకు ;
[1]శూద్ర గాంచుటఁజేసి శూద్రుఁడౌఁ ; గాన,
భద్రాంగి, కులము నిల్పఁగఁజాలఁ డతఁడు."

---

1. శూద్రి. (మా)

## యముఁడు విదురుఁడై జనించుట

అని చెప్పి మునిపోవ, నంత నంతకుఁడు
తనకర్మమహిమ నద్దాదికూఁతునకు
విదురుఁడై పుట్టిన, వేడ్క భీష్ముండు
ప్రిదులక నానాఁటఁ [1] బెంచె నాతనిని.
ధర శూద్రయోని నంతకుఁడు పుట్టుటకు
నరనాథ, విను కారణంబు చెప్పెదను.
ఒక్క భూపాలుని యూరిచేరువను
మక్కువ నడవిలో మాండవ్యమౌని
తపమున్నచోటున, ధరణీశునగరి
విపులార్థములు చోరవీరులు దిగిచి,
యరుగుచు రాత్రి యయ్యాశ్రమభూమి
తెరువున నరుగుచో, ధృతి నంతలోనఁ
దలవరు లాచొప్పు తడవి యేతెంచి
తులువలఁ గానక ధూర్తులై గదిసి :
'మునినాథ, కానవే ముచ్చుల !' ననినఁ,
బనివడి యామౌని పలుకకుండినను :
'ఇతఁడును, దొంగలు నేకమై నేఁడు
పతిసొమ్ము దెచ్చిరి ; పట్టుకులే !' యనుచు
జడలు కంపలఁ బట్టి, జపమాలఁ ద్రెంచి,
మెడ నల్లుగట్టించి, మిన్నక తిగిచి,
యంతరం బెఱుఁగని యాతతాయులకుఁ
జంతింపఁ బాపంబు సిద్ధించు [2] ననక
షండేఁద్రాడొనరించి, జనపతి [3] కడకు
నందఱుఁగొని తెచ్చి యతనిసమ్మతిని
శూలాగ్రమున నైవ, నుక్కక మౌని
వాలిన తనతపోవైభవం బొప్పఁ

1. బెంపకారంబు. 2. గాన. 3. కోడ. (మూ)

జాతున్న, నాతనిసామర్థ్యమెఱిఁగి
భూకాంతుఁ డామౌని భూమికి డించి,
భూరి ప్రదక్షిణంబులుచేసి మ్రొక్కి
'నేరమి సైర్వవే నీవాఁడ' ననుచు
నుతియించి, యాకొఱ్ఱునొక్కండఁ ద్రుంచి –
యతనియుల్కకుఁదప్పి యసిఁడిన, నరిగి
కుత్తుక నొకకొంత కోయంగరాక
బెత్తెఁడుకొఱ్ఱు నిల్చిన యాణినలన
యాణిమాండవ్యుఁడై యంత నామౌని
మానక తపముండి, మఱియొక్కనాఁడు
యమపురంబున కేఁగి యమునకిట్లనియె :
"శమన, కొఱ్ఱెక్కింపఁజనునయ్యె నన్ను!
గలయుంగ ధర్మాధికారిగా నిన్ను
నిలిపిన విధిఁగాక నిన్నాడఁగలదె!
ఏతప్పు నామీఁద నెన్నితి?" వనిన,
నాతఁడిట్లను: "నన్ను ననఁబనిలేదు ;
ఎప్పుడుఁ బ్రాణుల నేఁ 'జొప్పఁగోసి
చొప్పఁగట్టినయట్టిచొప్పు' దీపింపఁ
గట్టుదు నిజనిజకర్మపాశముల ;
నిట్టుదూఱఁగఁ దగునే వట్టిదూఱు!
నీవు తూనీఁగల నీపిన్ననాఁడు
వావిరిఁ గొఱ్ఱులవైచితి గాన,
నాకర్మఫలమునే యనుభవించితివి ;
మాకేమివా!" యన్న మాండవ్యుఁడలిగి :
'యిలఁబుట్టి పదునాలుగేఁడులు దాఁక
తలఁపంగనేరఁడు ధర్మంబునరుఁడు ;
ఆలోనికర్మంబు లతనిఁ బ్రాపింపఁ
జాలవు ; చేసితి సమయమునిపుడు.

అంతయెఱుంగక యనుచితదండ
మంతకు, నాయెడ నాచరించితివి ;
శూద్రుఁడవై పుట్టు క్షోణిలో. ' ననుచు
నుద్వృత్తకోపుఁడై యొనర శపింప.
అదికారణంబుగా నంతకుండిట్లు
విదురుఁడై జన్మించె విను. " మని మఱియు
జనమేజయునకు వైశంపాయనుండు
వివరించెనని ప్రీతి వెండియుఁ జెప్ప.
మానదుర్యోధన, మదన [1]సమాన,
మానవతీమాన్య, మదనాభిరామ,
రామణీయకధామ, రామాభిరామ,
రామాయణానంద, రక్షాప్రసార, (?)
సారస్వతామోద, సత్యవిహార,
హార నూపుర కింకిణాంగద యోగ,
యోగనిర్మలభాగ, [2]యుచితసంభోగ,
భాగవతాధార, భాగ్యాప్తినీకు.
ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితాదిపర్వ నిర్మలకథయందు
నుచితమై యాశ్వాస మొప్పె మూఁడవది.



1. సరాను. 2. ఉచితానుభాగ. (మూ)

# చతుర్థాశ్వాసము



శ్రీసమాశ్రితనేత్ర, శృంగారగాత్ర,
ధీసార, సరసయాధిపుచౌడ, ధీర,
అసమాన దానవిద్యా వినోదముల
దసలవర్తిల్లు మంత్రీ! చిత్తగింపు ;
అక్కథకుఁడు శౌనకాది సన్మునుల
కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె.
ఆరీతి నామధేయములు గావించి,
ధీరుఁ డానుతులకు దేవవ్రతుండు
వరుసతోఁ జౌలంబు వడుగులుఁజేసి,
గురుకళాసిద్ధులైన కుశలులచేత
నంగపూర్వకముగా సకలవేదములు,
సంగీత సాహిత్య చాతురితోడ
నస్త్రవిద్యలు, [1] వాహనారోహణములు,
శాస్త్రపురాణవాసన లాదిగాఁగ
నెఱిఁగింపఁజేసి, మహీరాజ్యమునకుఁ
దెఱఁగొప్ప నృపునిఁగా ధృతరాష్ట్రు నిలిపి,
హితవృత్తిఁ గార్యంబులెఱిఁగించి, కొలువ
నతనికి విదురు సహాయుఁగానిచ్చి,
యిమ్ముడెప్పరమైన నిందువంశమునఁ
గ్రమ్మఱ నొకరాజుఁ గల్పించెఁ [2] దాను
అగ్నియారినవేళ నరణిమథించి
యగ్నిహోత్రముసేయు యజమానురీతి.

---

1. వారణా. 2. గాన. (మూ)

ధర్మంబులన్నియుఁ దనకుఁ దోడుగను
ధర్మాత్ముఁ డితఁడనఁదగి చరింపుచును,
బరభూమిపతుల కప్పంబులఁ గొనుచుఁ
దిరముగాఁ గృతయుగస్థితి [1] భూతి దనర,
సరసత ధృతరాష్ట్రశాసనంబునకుఁ
దిరముగా జనుల వర్తింపఁజేయుచును,
అనఘు నాధృతరాష్ట్రు యౌవనారూఢుఁ
దనరఁ బెండిలిసేయఁ దలఁపోయుచుండఁ,

## ధృతరాష్ట్రుఁడు గాంధారి నుద్వాహమగుట

ప్రబలుండు గాంధారపతియైనయట్టి
సుబలునికూఁతురు సురుచిరాకార-
కమనీయ రూపరేఖా విలాసముల
సమరకాంతుల కెనయైనది యనియు,
గురుమతి నూర్వురు కొడుకులఁబడయ
వరము వ్యాసునిచేత వడిఁ గాంచెననియు,
సారెకు నిత్తెఱఁగు భూసురులచే నెఱిఁగి
యరుదార మోదించి యప్పుడుప్పొంగి,
యాకాంతనయుఁడైన యాశాంతనవుఁడు
శైశవాంతరమున జనపతిఁ జూపి
విదురునకిట్లను : "విదుర, యీరాజు
సదమల తేజుండు, సత్యసంధుండు,
వెలయ మదించిన వేయిదంతులకుఁ
గలలావు గలవాఁడు, గాంభీర్యజలధి,
పెండ్లిచేసెదఁగాక పెక్కండ్రుసుతుల
సిండ్లనిండఁగఁ గాంచుసతిఁదు మోదమునఁ ;

---

1. భూమి. (మూ)

గావున, నితనికి గాంధారు పుత్త్రి
దేవి గాఁదగు నెల్ల తెరవులఁ ; మఱియుఁ
దనయులు నూర్వు రత్తనికిఁ గోతు –
రనివింటి వ్యాసవరానుభావమునఁ ;
దొయ్యలు లయ్యింతికిఁ దోడఁబుట్టువులు
నెయ్యంబుగలవారు నిధిసంఖ్యఁ గలరు.
పుత్త్రమా! యచటికి భూసురోత్తముల
విత్తంబులిచ్చి యా వెలఁదుల నడుగ."
ననుటయు విదురుండు 'సత్కార్య' మనినఁ,
బనివడి యొంతయు బ్రాహ్మణోత్తములఁ
గన్యకావరణంబు గావింపఁ బనుప,
సైన్యసహాయులై చనుదెంచి వారు
గాంధారు సుబలునిఁ గాంచి, కౌరవుల
బంధుత్వ మతని కేర్పడ మాటలాడి : —
'సుతను గాంధారిని సుతను సుచరిత్ర
ధృతరాష్ట్రు[1]కడిగె నా దేవవ్రతుండు
పుత్తెంచె ; సోదరీపూర్వంబుగాఁగ
నిత్తుగా.' కనుటయు నిట్లనునతఁడు :
"కురువంశవిస్తారకుఁడు ధృతరాష్ట్రుఁ
డరయ నీకన్యకు నర్హుండు ; గాన,
సచ్చరిత్రునకు నాజనవరేణ్యునకు
విచ్చలవిడితోడ విశ్వంబు మెచ్చ
నిచ్చితి ;" యని తండ్రి యుద్యోగ మెన్నంత,
మెచ్చక యచ్చోటి మానినీజనులు
నతిబంధువులును నట తమలోన
హితవేది గుజగుజ నిట్లనిరపుడు :

1. కడిగెను. (పూ)

"అంగంబులందెల్ల నతిశయ ము_త్త
మాంగ; మందును గన్ను లరయంగ మేలు;
జనులకు నిట్టిలోచనములు లేమిఁ
బెను[1] చిక్కులఁగు నిచ్చ; ప్రియకనూభవయు
గాంధారి సర్వలక్షణలక్షితాంగి
యంధున కక్కటా! యాలు గాఁదగునె!
ఈనాతి నంధున కీకున్న నేమి!
మానుగా మగపోఁడిమానంకయుఁగునో! —
భువిలోన మగవాఁడు పుట్టఁడో కాక!
యువతీతిలకమున కల్లుండు గాఁగ.
పడఁతిసౌందర్యంబు పతికట్టకురను
అడవిఁగాచినవెన్నెలై పోవఁగలది!
ఈవల శకునియు నిట 'తండ్రిమాట
గావలె' ననుఁ; గాని, కాదనవెఱచు."
ననుటయు, గాంధారి యచ్చోటనుండి
మనజాలమాటకు మదినొచ్చి పలికె:
"క్షితిపతి[2] నన్ను నిచ్చితినన్నమాట
ధృతరాష్ట్రునకు నేను దేవినైనట్ల;
పతి యతఁడేకాక, పరికింప[3] నాక-
పతియైన, మఱి రతిపతియైన నొల్ల.
సింధురశతములఁ జెనకు బలాఢ్యుఁ
డంధుఁడై రాజ్యమదాంధుఁడు గాఁడు.
చతురుఁడు, జ్ఞానలోచనసహస్రాఢ్యుఁ,
డతని నూరక యంధుఁడన నెట్లువచ్చు!
ధృతరాష్ట్రునకులేనిదృష్టి నాకేల!
హితమతిఁ జూడుఁడీ యిందఱు!" ననుచు

---

1. చిక్కునకు. 2. నన్నునుయిచ్చితినన్న. 3. నాకు. (మూ)

బంగారుపట్టంబు పడఁతి దెప్పించి,
పొంగారు వేడ్కఁ గప్పురము మెత్తించి,
సోగలై మెఱుఁగెక్కు సొబగుకన్నులను
బాగులై పేసవ్వు పర్వమై నిక్క
చెంగావికోలుకుల సిగ్గుకందువలఁ
దొంగలిఱెప్పల దొరయునేత్రముల
మూయించెఁ; బతిసంద మును జేసియున్న
దాయలనోళ్లెల్లఁ దా మూసె ననఁగ.
అప్పుడాగాంధారి నర్థిఁ బూజించి,
తప్పక పసిఁడియందలమెక్కఁబనిచి,
తోయజాక్షుల దాసితోడఁబుట్టువుల
నీయెడఁ దొమ్మండ్ర నిచ్చితిననుచు
జనపతి రప్పించి, శకునిఁ దోడంపి,
యనిచెఁ గాంచనకోట్లు నందఱ కొసగి;
యనిచినఁ గొనితెచ్చి, యాపగేయునకు
జనపతికూఁతుల శకునిచూపుటయు,
నొక్కలగ్నంబున నువిదలఁ బెండ్లి
యక్కొడుకునకును నతిభక్తిఁ జేసి,
గాంధారపతులకుఁ గట్నంబు [1] లీయ,
బంధుసామగ్రి యేర్పడ సంతసిల్లె.
ఘనుని నిశ్చలుని సంగ్రామభైరవుని
ఇననిభ తేజు నింద్రవైభవుని,
శరనిధిగంభీరు సన్నుతాచారు
భరతవంశేశునిఁ బాండునిఁ జూచి:
'యితనిచేఁ గురువంశ మెల్ల వర్ధిల్లు;
నితని పెండిలి సేయ నెలమి మై వలయు'.

1. లిచ్చి. (మూ)

ననియుని విదురాది యూష్టులఁ గోడ (?)
ఘనుఁడు భీష్ముఁడు ప్రసంగము సేయుచుండె.

## పాండురాజు కుంతిని వివాహమాడుట

అంతట, యదువంశ్యుఁడగు శూరుని సుతకుఁ
గాంతాలలామకుఁ గమలనేత్రకును
గుంతిభోజుఁడు తన్నుఁ గూఁతుఁగాఁ బెనిచి
సంతసింపఁగనొప్పు సౌభాగ్యవతికిఁ,
జెలఁగి దుర్వాసుఁడిచ్చిన మంత్రశక్తి
నెలమి మానవులకు నెఱుఁగరాకుండఁ
జండాంశువలనఁ బుట్టిన పుత్రకవచ-
కుండలాలంకృతుఁ గురుయశోధనుని
ఘనుఁ గర్ణుఁ గని తనకన్యాత్వహాని
జనియింపకుండఁగాఁ [1] జరియించుసతికిఁ,
బృథయనఁ గుంతినాఁ బేర్వహించి
ప్రథితనామంబులఁ బరఁగుకోమలికి
నలరు స్వయంవరమనువార్త పొడమి
వెలయుంగ మ్రోయుట వేగఁ జేతఁగి,
యంతట నొక్కనాఁ డాపగేయుండు
కుంతిభోజుని కూఁతుఁ గుంతియన్ దాని,
మద్రరాజతనూజ మాద్రియన్ దాని,
భద్రాత్ముఁడైన యాపాండురాజునకు
వీరస్వయంవరవిధిఁ దెచ్చి యిచ్చెఁ.
గోరి మూర్వురఁ బెండ్లికూఁతుల మఱియు
నక్కడక్కడఁ దెచ్చి యాంబికేయునకుఁ
దక్కక వంశవర్ధనకాంక్ష నిచ్చి,

---

1. జనియించు. (మూ)

పాండుని యువరాజ్యపట్టంబు గట్టె.

..............................

## పాండురాజుదిగ్విజయము

చంద్రప్రకాశుఁడై జగతిపై నతిఁడు
సాంద్రవైభవముల జనులెల్లఁ బొగడ
సుఖలీలఁ దనరుచు, శూరాగ్రగణ్యుఁ
[1] డఖలదిగ్విజయార్థ మరుగంగఁ దలఁచి,
పటుమతిఁ జతురంగబలములు గొలువఁ,
గుటిలారి నరపాల కులశైల వజ్ర-
[2] తులితుఁడై తొలితొల్లి తూర్పునకేఁగి,
బల [3] సమగ్రుల నరపతుల సాధించి,
యట దక్షిణమునకునరిగి, మార్కొనిన-
పటుభుజాబలుల భూపతుల నోడించెఁ;
బడమటికరిగియు బహుధరాధిపులఁ
గడిమిమై నసమసంగరమున గెలిచె;
నుత్తరంబునఁగల్గు నుర్వీశవరుల
నొత్తి యుద్ధంబున నుదుటెల్ల నణఁచి,
[4] యుల్లాసముననుండి యుర్వినద్దెసల
నల్లనల్లనొత్తి యరులసాధించి,
యక్కజంబుగ బల్మి నట వారిచేతఁ
బెక్కుగజంబులఁ, బెక్కుగుఱ్ఱముల,
రమణీయగతి నవరత్నరాసులను,
బ్రమదాజనంబుల, బహువస్తువితతిఁ
గప్పంబుగాఁదెచ్చె; గనకాంబ [5] రంబు
లుప్పతిల్లినమాడ్కి [6] నూరివారెల్లఁ

---

1. డిల. 2. తూలితుఁడై. 3. సమగ్రతుల. 4. యుల్లంబురానుండి యుర్వ్యుద్దసుల. 5. చాడు. 6. సూరగాఢ్లైనల. (సూ)

గ్రిక్కిఱియుఁగ, నాంబికేయుండు ధనము
తక్కక వేడ్కతోఁ దనచేతికొలఁది
నాలయంబులకు, దేవాలయంబులకు,
బాలాది [1]వృద్ధాంత పౌరమండలికి,
బంధువర్గములకు, బ్రాహ్మణోత్తముల,
కంధాదిదీనుల, కతిథికోట్లకును,
బేదసాదలకుఁ, బెంపారబంధులకు,
నాదట సఖులకు, నాశ్రితావళికి,
బంధురాత్మకులకుఁ, బరహిత సత్య-
[2]సంధ సత్పురుష సజ్జనవరేణ్యులకు
బాగొప్పవెచ్చించి, పదియశ్వమేధ-
యాగంబులనుజేసి యదితెగకున్నఁ,
దమ్మునిశక్తికిఁ దలపులో మెచ్చి
యిమ్ముల ననురాగమెసగంగ నుండె.
పురుకుత్స సగర పురూరవులాది
కురుమహీశులఁబోలి కొమరుదీపించి,
యాపాండుఁ డంత నేకాతపత్త్రముగ
నేపారఁగా ధాత్రి యేలుచునుండె.

## పాండురాజు శాపోపహతుఁడగుట

అంతఁ, జంద్రునిలోనిహరిణంబునైన
వింతగా నలయించి వేసఁ బట్టనేర్చు,
నింగినైనను జొప్పు నెమకంగనేర్చు,
సింగమైనను వ్రేయఁ జిక్కనేర్చు,
లలిఁ గాలినైనఁ గాల్నడఁగూడు నేర్చు,
శిలనైన నొకసందు చేకొను నేర్చు,

1. వృద్ధాంగ. 2. సంధుల సత్పురుష జనవరేణ్యులకు. (మా)

నిలువున వ్రాఁకులై నిలువంగనేర్పఁ
గలుగుకిరాతు లొక్కట నొక్కనాఁడు
కోఱ తాలికతలల్, కోర [1] చిందములు,
వాఁకైనయురితీఁగ, వట్టుబొంగులును,
నెఱయఁ జొత్తిల్లిననిడుదకన్నులును,
గఱకులై మిడిసిన కావిమీసములు,
సమలియాకెలు, నిల్వనాటినతలలుఁ,
జుమచుమనైన నెత్తురుచుక్కబొట్లుఁ,
[2] గంపులుపుట్టెడు కఱకందు మేను,
లంపటిప్పతోడనలరు హస్తములు,
బీరనరంబులు, బిగువుపిక్కలును,
దోరవన్నియచెప్పుదోయిసిఁగలిగి,
వసుధకుడిగ్గిన వానకాళ్లనఁగఁ
గసరున నెసగుసాగర [3] వీచులనఁగఁ
బోరిపోరి నేతెంచు భూతంబులనఁగ
నరులచూడ్కికి వింతసనుప చేయుచును,
నినుపు పున్నమనాఁటి నెలలునుబోలె
ఘన పుండరీక భీకరకరులగుచుఁ,
జౌలసంస్కారవిశాలురు పోలె
నాలోల కాకపక్షాంకితులగుచుఁ,
బొనర మేడలమీఁది పురజనుల్ పోలె
ఘన జాలమార్గ వీక్షణపరులగుచుఁ,
గనుఁగొన నుగ్రరాక్షసులును బోలె
ఘన రామలక్ష్మణాగ్రహ యుక్తులగుచుఁ,
దెమలనిమృగములఁ ద్రెవ్వనేయించు
తమకాన నందఱుఁ దమకాననుండి

---

1. చెందములు. 2. క్రంపలుబట్టిన. 3. వీధులనఁగ. (మూ)

యురుదెంచి, పాండున కతిభక్తి మ్రొక్కి,
కరముచక్కనితూపు కానుకయిచ్చి,
[1]నాదారుబెఱుకుల కాధారమైన
యాధారుణీపతి కప్పు డిట్లనుఁ :
"ఏమున్న యడవిలో నిభపురాధీశ,
భూమికివ్రేఁగైన భూరిజంతువులు
మాయలవులరాక మాయలఁబెట్ట,
నాయుగ్రవిధముల కాత్మలో వెఱచి
వచ్చినారము ; నీవు వానినధింప
విచ్చేయుటకు వేఁటవిన్నాణమునకు.
అందలిమృగముల యదటుగర్వములు
పొందుగా నవధరింపుము ; ధాత్రిఁగొంత
త్రవ్వి, పాతాళవరాహంబుఁదెచ్చి,
క్రొవ్వునఁ దమకీదుపుఁ గూర్తుమన్నట్టు
లట్టులావెసఁగ మహావరాహములు
మిట్టుపల్లముగాఁగ మేదినిగ్రుచ్చి,
యెత్తిన బిగువున నించుకతడవు
నెత్తిభారముమాన్ప నిజముశేషునకు ;
బులిరక్కనుసిఁజంపి పులితోలుగట్టి
పులినోరికండ మొప్పదువ్రేలనిఱికి
హరుఁడున్నవాఁడని యాతనిమీఁది
[2]గుఱికమార్గములందుఁ గూడెనోయనఁగ
బబ్బరింపుచు గుంపుబలసి గుబ్బులుగ
బెబ్బులు లుబ్బులుబెరయ వర్తించుఁ ;
జెలఁగుచు గుహలలోఁ జీకటి[3] వెడలి,
తల కేలు కాలు చైతన్యంబువచ్చి,

---

1. యాధారమెఱుకకు నాధారమైన. 2. గుఱు. 3. వెర్కి. (మా)

యరిరాజచంద్రుని యచలాగ్రమెక్కి,
గుఱుతుగాఁ గుధరంబు గోరాడ నసఁగ
వెల్లమోరలతోడ వెనుభులుప్రాఁకి,
భల్లూకములమూఁక భయముపుట్టించుఁ;
గొండలుగోరాడి, కొమ్ముల నోడల
గండెక్కి యెత్తరేగినమన్న కొఱయు,
మొసళులమడుగుల మునిఁగి, యాఁబోతు
లెసగి యల్లనమోము లెత్తి యల్లార్చ,
ముక్కులుబిగియించి ముసురార్చవుచ్చుఁ; -
జొక్కులగతి మిన్ను సోఁకుదుప్పులును,
లాసికటారికోలలుఁబట్టియాడు
మాసటీలునుబోలె మసలకడాసి,
కొమ్ములరవళి దిక్కులఁ గప్పుదుప్పు
లిమ్ములఁ బోరాడు సెలపెల్లగిల్ల;
భువినుండి యొకయిత్తి పుటముగానెగసి,
ప్రవిమలచంద్రులోఁ బడఁ దాఁకెఁదొల్లి;
యంతవారము నేమఁగుదునున్నట్లు
వింతగా నిత్తులు వినువీధి దాటుఁ;
బెరిగినపెక్కువఁ బెక్కుమెకములు
నురవడి మెఱయును నొక్కొక్కచోట;
నన్నితూపులఁగాని యుణఁగమన్నట్లు
మున్నాడి యేనులు మొలుచూపు మాకు;
మూరిబోఁ బెరుగు చమూరుమృగంబు
లూరినచీఁకటి [1] నొంటిఁబోనీవు;
కడఁతులలెక్క యెక్కుడఁబట్టు [2] వచ్చుఁ!
గదలేవు హరి ఖడ్గ కరి శరభములు;

1. నొండు. 2. చేర్చు. (మూ)

సబలత వానిమాంసముచూచి డేగ
శిబిమాంసమడుగుట సిగ్గుగాఁ[1] దలఁచు;
నెఱయ నొక్కొక్కటి నెతిచూపియున్న,
[2]నెతి జగత్త్రయమును నీరసంబగును;
ఓలి నొక్కొక్కటి యుగ్రతనమరఁ,
గాలానలంబైనఁ గతిబొగ్గువడును;
నెమ్మి నిన్నియుఁగూడి నీటికి డిగిన,
నమ్మడుగునఁజిక్కు నడుసునుడీాలు;
నవి రాజులనుబోలె నాత్మవైరమున
భువి భీతులనుబోలెఁ బూరిమేయుచును,
ధరఁ బత్తులనుబోలెఁ దగ[3]నగురుచును,
బోరిపోరి మ్రుచ్చులుపోలెఁ ద్రవ్వుచును,
జెడనికాపులుపోలెఁ జేనుపట్టరసి,
కదుఁ[4]గొలంకులుపోలెఁ గనుమలుత్రొక్కి,
[5]కూరిననెలపోలెఁ గొమ్ములు[6]పొదలి,
[7]కారుమొగిళులుపోలెఁ గంకుచువచ్చి,
పెద్దకందయుఁబోలెఁ బిల్లలఁ బొదివి,
తద్ద ధూర్తులుపోలె ధరకు వ్రేఁగగుచుఁ,
బుట్టజున్నులుపోలెఁ బుటపుటనగుచు,
నిట్టప్రౌఢలుపోలె నెందువెల్వడక,
గడి భూమిప్రజపోలెఁ గడుబెదరుచును,
నుడి భిక్షుకులుపోలె శునకవైరమున,
నరఁటిమ్రాఁకులుపోలె నటపొరలెక్కి,
పొరిఁ గర్ణధారులుపోలె గాడ్పు[8]ఆఁగి,
భువి విరవాలుపోలెఁ బొదరిండ్లుదూరి
వివిధరూపులనుండు; వేయేలచెప్ప!

---

1. దనుచు. 2. నెరినెత్రయాగంబునిరసంబులను. 3. నొరయు. 4. దొలంకులు.
5. కూడిన. 6. ఒదవి. 7. కోరమొగిలువోలెగొంకులుపట్టి. 8. ఆడి. (మూ)

నాశచేసెదమన్న నడఁగవుమాకు ;
మాశరమ్ములవాఁడి మాసె ర". మ్మనినఁ,
పాండుభూపతి వేఁటపై నాసపుట్టి
పొండువచ్చెద ననిబోయలఁబనిచి,
యన్నకు నెఱిఁగించి యనుమతివడసి,
సన్నుతిఁ దనమంత్రిసంఘంబుతోడ
గొల్లెనకంబాలు గొడుగులుఁ బడగ
లల్లికవలమోపు లమ్ములబండ్లు
మెత్తనిశయ్యాలు మెఱుఁగుకొప్పెరలు
ముత్తియంబుల పవడముల పల్లకులును
బసిఁడిమంచములును బట్టుమేల్కట్లుఁ,
బానఁగ సరాతులు బోనకావళ్లుఁ
బరిచారకులుఁ బాఁడిపసులు బియ్యములుఁ
బరిమళవస్తుసంపదలు నేతేరఁ,
జపలాక్షు లిర్వురు సంప్రీతిఁగొల్వ,
విపులయాత్రాభేరి వేయించి కదలి,
కరి రథ సుభ టాశ్వ ఘన[1] పాదధూళి
యరుణున కరుణత్వ మచ్చుగాఁబొదువ,
దారుణ హిమశైల దక్షిణాటవుల
వీరప్రతాపుఁడై వేఁటలాడుచును,
వాహనంబులు వెంటవచ్చుట గాని
సాహసంబునఁ బాదచారంబుగలిగి,
నదులైననీఁదుచు, నగములమీఁదఁ
బొదలైననెక్కుచుఁ, బులి పంది వనుక
చటినైన నుఱుకుచు, సాగనిపూఁట
[2] నెఱచైన నమలుచు నీరీతిఁ [3] దిరిగి,

---

1. రథ. 2. కాయచైన. 3. దిగిచి. (మూ)

యతిమృగయాసక్తి నాదరించుధుఁడు

..........................

..........................

..........................

ధరవేట మున్న సప్తవ్యసనములు
[1]నిరవొప్పఁ గీడని యెడఁ గానలేక
తనపాలివిధి తన్నుఁ దవిలిప్రేరేప
ననఘు, కార్యాకార్యమది యెఱుంగకయు,
నిది చంపఁదగినది, యిది కాఁదగిన,
దిదియది యనుబుద్ధి యెఱుఁగలేఁక,
యటపోయి యటపోయి యనుప్రాలుగడచి,
కుటిలమహాటవీ కోట్లను గడచి,
మునులున్న యాశ్రమంబులు పెక్కు గడచి,
యొనరఁ గార్యాంధుఁడై యొకనాఁటివేఁట
లేడియిట్టియు రెండు లీలఁ గ్రీడింప
నోడక యేసిన, నుఱక మూర్ఛిల్లి
తెలిసి యొయ్యనఁ గన్ను తెఱపి యాయిట్టి
పలికె మానుషభాషఁ బార్థివోత్తముని :
"ఓ పాండుభూవర, యో రాజచంద్ర,
యీపాపమునకొడిగేలగట్టితివి !
పగఱపై నీబాణపస చూపలేక,
మృగములమీఁదనే మెఱసిచూపితివి.
పోలక రతిసౌఖ్యములనున్న మమ్ము
నేలయేసితివి ! యిట్లేయుంగఁ దగునె !
మించి నీకు వధింప మృగములు లేవా !
పొంచి మావిధమంత పొడగానవైతి.

---

1. నిలవొప్పఁగీడనియాల. (మూ)

తెగనేయుమృగమును, దగనేయరాని
తగవెఱుంగక యేలదాయవైతివుడు!
అలసి మేయుచునున్న యాఁకొన్నమృగముఁ,
జలకగాఁబోలేక చూల్గొన్నమృగము,
నీరానఁగావచ్చి నిలిచిన మృగము,
నీరితి రతికేళి నెనసినమృగము,
మూలకుముట్టుగా ముదిసినమృగముఁ, -
బోలేక మృగములఁబొదివినమృగము
బోయయు నేయఁడు; భూపాల, తగున!
నాయంబుదప్పితి నామొడాటమున.
తగునయ్య! యేను గిందముఁడను మునిని;
మృగమాత్రమనిచూచి మేనుమఱచితివి;
అతివయు నేనును హరిణరూపముల
రతిసల్పుచున్నవారము వేడ్కఁబుట్టి.
అదియెఱుంగక యేసితికట! ఓరాజ;
మొదలంట మాప్రాణములు నిల్వవీఁకను.
ప్రతిలేని యీపాపఫలమున నీవు
సతిఁగూడినప్పుడె చత్తువుగాక;
మానినియును నీకు [1] మాద్రి సహాయ
మా." యనిశపియించి, యాలునుదానుఁ
బరలోకగతుఁడయ్యెఁ; బాండురాజపుడు
తరుణులఁజూచి, యెంతయుఁజిన్నవోయి,
శరములుఁ జాపంబు జారంగవిడిచి,
తొరఁగెడుకన్నీటితో వెచ్చనూర్చి,
యనలసంస్కారంబు లామృగంబులకు
నొనరించి, సరసిలోనుదకంబులిచ్చి,

---

1. పాఠ. (మా)

'యధమత్వ [1]మీఁగతినందితి' ననుచు
విధి నాత్మఁదూఱుచు వేదనతోడఁ
గొండొకదవ్వేఁగి [2]గొంతులఁబలికెః
"పాండు మిమ్మనిపెదఁ బురవరంబునకు ;
నస్త్రలసేవించి యట నుండుఁడీరు ;
తత్తరించినఁగాదు ; తప్పెఁగార్యంబు ;
మనచేత మునులును మరణంబుఁబొంది
మనకును నొకకీడు మఱి చేయకుండ్రె !
ఇంకనెక్కడిరాజ్య ! మింకేటిసుఖము !
ఇంకనాకీశాపమేమిటఁదిరుగు !
వలనొప్పఁ గౌరవాన్వయపయోరాశి
బలమఱి యీశాపబడబాగ్నినింకె !
..............................
కడలేర నీశాపకాలాహిచేత.
నే నింక భోగంబులిన్నియు విడిచి,
మానావమానముల్ మమతయు విడిచి,
సకలపాపంబులసమితియు విడిచి,
ప్రకటిత నిజకర్మఫల మాసపడక,
యడవిని నిత్యఫలాహారనియతిఁ
గడపెదఁగాలంబు కడముట్టనిపుడు ;
పుడమియేలఁగ నాకు బుద్ధిగా ; దింకఁ
గడుఘోరతపము నేఁ గావింతు నిచటఁ ;
గాన, మీకిప్పుడు కానల నవయఁ
గానేల ! చనుఁడింకఁ గరిపురంబునకుఁ ;
జని, యెల్లవారి కీచందమంతయును
వినిపింపుఁ." డనిన, నవ్వాలఁదులిట్లనిరి :

1. మీఁగితినందు నేననుచు. 2. 'గొంతి' పదమును స్త్రీపర్యాయముగా వాడి నాఁడనవలెను ; లేదా 'గొంతితో' అన్నను సరిపడును. (మూ)

"పాయనోపము నిన్నుఁ గాంచు భూపాల!
యేయనువున నైన నేము వచ్చెదము.
అకట! శంతనువంశ మూఁగినచోట
నా భాగ్యమహిమచే నుదయించితీవు.
కులము నిల్పెదవని కోరియుండంగఁ
గలిగెనే నీకిట్టి కాండావస్థ!
ఏమిచేసిననాఁడు నీపాతకంబు!

......................

రతిలేక యుండవు రాత్రి యెన్నఁడును;
రతిచేసి తనియవు రమణి, యెన్నఁడును.
పరఁగ నిప్పటినుండి బ్రహ్మచర్యంబు
చరియింపనోపుదే జగదీశ నీవు!
ఇది పురాతనదోష మేమనఁగలదు!
విదితాత్మ, నీవింక వినుము మామాట;
శైలాటవుల నొంటిఁ జరియింపవలదు
లాలితజటల వల్కలములుఁ దాల్చి;
యుడిరి వానప్రస్థమను నాశ్రమమున
నడపుము మమ్మును నరనాథ, కూడి.
ప్రాణేశ, నిన్నేము పాయుదుమే,
ప్రాణంబులును మమ్ముఁ బాయు నాక్షణమె.
సతితోడ రాజభూజనపతి గూడి
ధృతివట్టి యడవి వర్తింపఁడే మున్ను!
అటుగాక, నిను గాసి హాస్తినాపురికిఁ
బటుభంగి నరుగంగఁ బదము లెట్లాడుఁ!
బొనరంగ మధ్యాహ్నమున నిటగ్రుంకి,
యనలు నివ్రేల్చుచు నతిథిఁ బూజించి,
జలములఁ బితరుల సంత[1]సపెట్టి,
నిలువవె! మాకును నీడ యయ్యెదవు."

1. బెట్టుచును. (మూ)

అనిపాదయుగళిపై నబలలుపడినఁ,
దనకరంబులనెత్తి ధారుణీశ్వరుఁడు :
"మీరు చెప్పినయట్లు మృగనేత్రలార,
కోరివర్తించెదఁ గొంక నేమిటికి !
పాయక హృదయంబు పదిలమానేని,
యేయాశ్రమంబైన నేమియుఁగాదు.
మనవెంట వచ్చినమంత్రులనెల్ల
ననిచెద వస్త్రవాహనములతోడ.
పోయినవారలు భూనాథుతోడ
నాయన్నయునకు విన్నపముఁ జేసెదరు ;
పూనెదఁగాక తపోభార." మనుచు
మానినీసహితుఁడై మానవేశ్వరుఁడు
జడలు వల్కలములు శాంతిమైఁదాల్చి,
యడలుచున్న సైన్యము వీడుకొల్పి,
తమభూషణంబులుఁ దమవస్త్రములును
క్రమముతో భూసురగణములకిచ్చి,
తక్కినధనములు తనయన్నకప్పు
డక్కజంబుగఁబంపి, యతినిశ్చయముగ
నిందుబింబాస్యల నెలమిఁ దోకొనుచుఁ
గందమూలముల నాఁకలిదీర్చుకొనుచు
మునుకొని యుత్తరముఖముగాఁ గదలి,
మునులెల్ల విస్మయంబుగఁ జూచి పొగడ
నయగుణోజ్జ్వలుఁడంత నాగశైలమును
రయమున నట చైత్రరథమునుగడచి,
తొలఁగక చనిచని తుహినాద్రిదాటి,
యలఘుపుణ్యుఁడు గంగ నట యుత్తరించి,
సురసిద్ధసేవ్యమై సొంపగ్గలించి
ధరనొప్పు గంధమాదనమునకరిగి,
గురుమతితో హంసకూటంబుగడచి,

## పాండురాజు శతశృంగమందుఁ దపమొనర్చుట

యల్లన శతశృంగమను గిరిచేరి,
చల్లని నవపర్ణశాల గావించి,
యందు దేవేంద్రాదులచ్చెరువంద
నందంద తపముసేయఁగ, నొక్కనాఁడు
పిన్నలయ్యును శాంతిపెరిగినమునులు,
నెన్నియుగంబులో యెఱుఁగని మునులుఁ,
గన్నన హరిఁగాని కానని మునులు,
హరివచ్చి 'వర' మన్న నడుగని మునులు,
హరిరూపు హరురూపు నందినమునులుఁ,
బెంపార మఱియును బెద్దలౌ మునులు,
గుంపులుగుంపులై కోటి సంఖ్యములు
పుణ్యులు, ఘనులు, సభ్యులు, యశోధనులు,
గణ్యులు, విబుధలోకస్తోత్రమతులు,
సత్యసంధులుఁ, మహేశ్వరపదధ్యాన
నిత్యులు, వరతపోనిధులు మోదమునఁ
బోవఁగాఁ, బొడగాంచి భూపాలకుండు
దేవీసహాయుఁడై తెరువునఁగూడి
వారివెంటనెపోవ, వారువీక్షించి
భూరాజుగాఁదలపోసి యిట్లనిరి :
"ఎవ్వరు నీ? యేల యిట్లు మావెంట
దవ్వనితలఁపక తలఁగివచ్చెదవు?
నెలఁతలు రాలేరు నిలువుమిచ్చోటఁ;
దెలియ నింతటినుండి దేవమార్గములు;
సురమునీంద్రుల మేము; సురలకుఁగాని
నరులకు మావెంట నడచిరారాదు".

అనుటయు, దీనుఁడై యప్పాండురాజు
తనపేరుచెప్పి యందఱకుఁ గేల్మొగిచి :
" యేనును వచ్చెద హితపుణ్యులార,
మానినులలసిరి మముఁగూర్చికొనుఁడు.
నారు తెన్నఁడుఁ దొల్లి నడచినవారు
గారు ; త్రోవల[1] చక్కఁగరగరగాదు. –
ఏమితీర్థంబులకేఁగుచున్నారు !
హేమాద్రికేఁగుచో నెఱిఁగింపుఁ ". డన్న
మానులు పలికిరి మనుజేశుఁజూచి :
" కానఁబోయెద మేము కమలసంభవునిఁ ;
బోయి, యమావాస్యపుణ్యకాలమున
నాయన సేవింతు రమరులు మునులు.
ఇంద్రాదిలోకంబు లిన్నియుఁ గడచి
చంద్రవంశాధీశ, చనవలె మాకు.
ఎంతవారలకైన నింతటినుండి
సంతతిలేనిచోఁ జనుదేరరాదు.
లోలత నాక బ్రహ్మలోకంబయేల !
యేలోకమును[2] లేద పేతపుత్త్రునకు.
సంతానలాభంబు జననాథతిలక,
చింతింపు ; మది నీకు సిద్ధింపఁగలదు.
వరసుతుల యమ వాయు వాసవాశ్వినుల
వరమునఁగాంచెదు వంశవర్ధనుల ".
అని నిల్పి పోయిన, నాతండుమరలి
చనుదెంచి, ఖిన్నుఁడై సతిఁ గొంతిఁ బలికె :
" మానిని, చూచితే ! మనలనేర్పఱచి —
మానులుపోయిరి మఱి కూడనీక.

---

1. సద్ద. 2. లేదు సేద. (మూ)

ఉన్నతి సంతానమొకటి తప్పించి
యన్నిభోగంబులు ననుభవించితిమి.
కలదొకో పుత్త్రునిఁ గన్నారఁ గానఁ!
గలకంఠి, యట్టుల గలుగుఁ బాంథునకు!
పుత్త్రలాభములేనిబొంది నాబొంది,
ధాత్రినుండిననేమి! తప్పిననేమి!
సంతతిగలదని స్వర్గలోకమున
కింతి, పోదముగాక యిందఱియట్ల.
ధృతి 'నపుత్త్రస్య గతిర్నాస్తి' యనెడు
శ్రుతివాక్యమున్నది శూలమై చెవుల.
ఎంతతపంబున నేధర్మములను
నింతి, గల్గఁగనేర విహపరోన్నతులు.
అది విచారించి, మీయందు నందనుల
ముదమునఁబడయంగ మొగి నాకురాదు.
మృగశాపభయ మార్తి మిఱయుచున్నదియు;
[1]సుగతి నాకిక యెట్లు చొప్పడఁగలదు! —
క్షేత్రజన్యాయంబు చింతించి, నీవు
పుత్త్రులఁబడయుము భువి నిందరాదు.
నాయాజ్ఞనేయుము నాతి, పుణ్యంబు
వేయిచోట్లను నేను వింటినాక్రమము.
ప్రబలధర్మములకుఁ బ్రబలమీచంద; —
మబల, నీ వింక నాయనుమతంబునను
దలఁపఁగ ధర్మసంతతి గాంచితేని,
పొలుపార నాకబ్బుఁ బుణ్యలోకంబు.
లనువార దేవరన్యాయంబునందు
ఘను శ్వేతకేతునికథయును వినవె!

---

1. సుగతి. (మూ)

ఏము జనించితి మీాప్రకారమున ;
భామిని, పిలుతునా ! బ్రాహ్మణు ;" ననినఁ :
"బలివి నీవైయుండ భరతవంశేంద్ర,
యితరుని మనసులో నెట్లునిల్పుదును !
పతియేమిచెప్పినఁ బనిగడిసేయ-
కతివలకుండుట యధికపాతకము.
తలఁప, నీవలనన తనయులు మాకుఁ
గలుగు నుపాయంబు గావింపు ; మిదియె
తపము సేయుట ; మేలుదపమునఁ దొల్లి
[1] వపితాశ్వ సతికి దైవంబిచ్చెసుతుల.
'పుత్త్రులు దేవాంశమునఁ బుట్టఁగలరు
ధాత్రినీ' కన్నారు తపసులు వినవె !
నీవేమిచెప్పిన నీచెప్పినట్లు
గావింతు ; మింతేలకడఁక [2] నీకిపుడు !
తమకింపవల." దని తరుణిసూనుటయు,
రమణుఁడిట్లను : "నోర్వరాదంతతడవు ;
తనువులెవ్వఁడునమ్మఁ ! దలఁచినట్లగున !
'దినహానిశుభములు దిను' నని వినవె !
ఇంతి, సేయుదుగాక యేఁజెప్పినట్లు ;
కాంత, వేగమె పిలు ఘనునొక్క-మునిని ;
మానినిఁబసిచి కల్మాషపాదుండు
పూని వశిష్ఠుచేఁ బుట్టించె సుతుని ;
మామతేయునిఁదెచ్చి మగువతోఁగూర్చి,
యామగధుఁడు తొల్లి యాత్మజుఁగాంచె ;
సందేహమేటికిసాధ్వి నీ ?" కనిన,
నిందువంశ్యునిఁజూచి యిందీవరాక్షి :

1. 'వ్యుషితాశ్వసతి' అని నన్నయ. ఆది. ప. 2. గావుతును. (పా)

## ధర్మజజననము

"యే వేల్పుఁదలఁచిన, నే తెంచి నాకు
నా వేల్పు నందనుండై యుదయించు.
మంత్రంబుగాంచితి మనుజేంద్ర, తొల్లి;
తంత్రజ్ఞ, యే వేల్పుఁదలఁపుదు ?" ననిన,
వాడినసస్యంబు వాన గన్నట్లు
చేడియమాటకుఁ జెలఁగి పార్థివుఁడు :
"సుందరి, సుతుమోముఁ జూడ నేఁ గంటిఁ;
గిందవు శాపాగ్ని కిందవునింక.
[1] అందనిపండ్ల నే నందంగఁ గంటి;
విందవు నామాట వృథసేయవైతి.
మందవు [2] మంత్రంబు మహిఁ బుణ్య [3] ఫలము
[4] మందుఁడనాకుఁగా మగువ, నేర్చితివి.
సకలలోకములకాస్పదమై, ధరిత్రి
సకలధర్మములకు సదనమై వెలసి,
సమవర్తనంబున సమవర్తియనఁగ
నమర వేల్పులలోన నధికుఁడై మించి,
సకలజీవులయందు సమచిత్తుఁడైన
యకలంకుఁ దలఁపుమ యాత్మలోకముని.
పితృపతియాతండు బిడ్డఁడై వెనుక
పితరులఋణమెల్లఁ బ్రియములోఁదీర్చు."
అనినఁ బ్రదక్షిణం బతనికివచ్చి,
వనిత యాదుర్వాసువరమంత్రమహిమ
నంతకుదెసకునై హస్తముల్ మొగిచి,
కాంత నద్భయు [5] యుక్తిఁ గదుభక్తితోడ

---

1. యందనిపనులని నే చూడగంట్టి. 2. పుణ్యంబు. 3. కథల. 4. మందవు.
5. భక్తి. (మూ)

యమునిఁ బ్రార్థించిన, నారాత్రి వచ్చి
రమణిఁ గోరినధర్మ [1] రాజు నీ వలచి,
ముదమారఁగా యోగమూర్తి ధరించి,
సదయుఁడై వరమిచ్చి సమవర్తి యరిగె.
అరిగిన, నాతనియంశ [2] ంబువలనఁ
గరియాన యొకయేఁడు గర్భంబు దాల్చి,
ప్రోష్ఠపదంబునఁ బుణ్యమాసమున
జ్యేష్ఠాష్టమీరాత్రి సిద్ధయోగమునఁ
గుడికాల రేఖలై [3] గొడుగు కంబువును
బడగయు సామ్రాజ్యపద్ధతిఁ దెలుప,
భరత [4] వంశాంభోధిపంకజవైరి
నిరుపమకారుణ్యనిధి నిశ్చలుండు
ధర్మంబు రూపంబు దాల్చెనో యనఁగ
ధర్మ [5] నంశంబున ధర్మజుం డనఁగఁ
బ్రభవించెఁ దనయుండు పంచగ్రహములు
శుభదృష్టిఁ గ్రుంకక చూచుచునుండ.
అప్పుడు సురలెల్ల నానందజలధిఁ
దెప్పదేలిరి ; మిగులఁ దెలిసె లోకములు ;
దినపతి వెలుఁగొందె ; దేవగానములు
వినవచ్చె ; నారదువీణ ఘోషించె ;
'పోదివినరణములో భూరివైరులకుఁ
బెదరక చంచలించక నిల్చుఁగాన (?)
నితఁడు యుధిష్ఠిరుండీధాత్రి' ననుచు
నతనికిఁ బేరిచ్చె నాకాశవాణి ;
[6] తొడరిఁ 'యజాతశత్రుండితఁ' డనుచు
నొడివిరి మునులు మనోవీధి నెలిఁగి".

---

1. రాజునివలసి. 2. భాగమున. 3. గొడుకంభంబు. 4. వంశాన్వయు.
5. వంశంబున. 6. తొడగి. (కూ)

అని చెప్ప జనమేజయక్ష్మారమణుఁ
డానరఁగ వ్యాసశిష్యునకుఁ గేల్మొగిచి :
" వనితకామంత్రంబువచ్చిన తెఱఁగు
వినిపింపు." మని యడుగ వినిపించెనతఁడు :

## కుంతి సౌరమంత్రోపాసన

" కుంతిభోజునియింటఁ గొండొకనాఁడు
కుంతి సన్మునులనుగూర్చి, నిత్యంబు
హోన్నాణమున నెంతయొరసినఁ గూర
లన్నంబు పాయస మట్లు మాంసంబు
మొదలైన యిష్టాన్నములు వేడ్కఁ బెట్టఁ,
బ్రిదులక భోజనప్రియుఁడైన కతన
నొకనెల దుర్వాసుఁ డుండి భుజించి,
ప్రకటప్రియంబునఁ బల్కె నాసతికి :
" ఏను నీకొకమంత్రమిచ్చెదఁ గుంతి,
దానిసత్త్వమున బృందారకులైనఁ
దలఁచినఁ జనుదెంచి, తనయులై నీకు
నెలమిఁబుట్టుదు. " రని యిచ్చిపోవుటయు,
నామంత్రసామర్థ్యమరసెద ' ననుచుఁ
గామిని యొకనాఁడు గంగకుఁబోయి,
కరమర్థిఁ బాడుచు భాస్కరుఁగోరి జపము
విరచింప, నతఁడొక విప్రుఁడై డిగ్గి
కదియుచో, లజ్జించి కరములు మొగిచి :
" యిదిమంత్రసామర్థ్య మెఱుఁగలేనైతిఁ ;
దప్పు నేటికి నేర్పుఁ దపసిమంత్రంబు !
ఎప్పటియట్లు నీవేఁగవే దివికి !
కన్నియ నేఁ బుత్త్రుఁగనిన నవ్వుదురు ;
మన్నించి పోఁగదే మార్తాండ ! " యనుచు

నలినాక్షి ప్రార్థింప నవ్వుచు నతఁడు:
'పొలఁతి, యూరకవచ్చిపోరాదునాకు.
కన్నెతికము వెల్తిగాకుండ సుతుని
మన్నించి యిచ్చితి మఱివియ్యకొనుము.'
అనుచు, సద్యోగర్భసుకవిధానమునఁ
దనయుఁ దేజోమూర్తిఁ దనయంశవాని
నిచ్చి, కర్ణుండని యిలఁ బేరువెట్టి
[1] యిచ్చ దివాకరుండేఁగిన, కుంతి:
'తనయుని నక్కటా! తండ్రికిఁజూపఁ
గొనిపోవలేను; మక్కువఁ బ్రోవలేదు;
ఇల నాకు నక్కటా! యిటుమూఁగగన్న
కలయయ్యె; నూరకే గడఁగితి.' ననుచు
సహజకుండలములు, సహజవర్మంబు,
మహి నెవ్వరికిలేని మదనరూపంబుఁ,
గలిగినకర్ణు నక్కడఁ బాఱవైనఁ
దలఁపుపుట్టకయున్నఁ, దరళాక్షి కడకుఁ
గ్రందుగా నవరత్నఖచితమైనట్టి
మందసమొక్కటి మార్తాండుకృపను
ఏటివెంటనెవచ్చి యిక్కువనిలువ,

. . . . . . . . . . . . . . . . . . . . . . . . .

నాదిత్యసమవర్ణు నాకర్ణు నందు
నునిచి యంగనపోవ, నొయ్యననదియుఁ
బొనరఁ జంపారాజ్యమునఁ బోవుచుండ,

### కర్ణుఁడు సూతునకు దక్కుట

నాంబికేయుని మిత్రుఁడైన సూతుండు
కంబుకంఠులుఁ దాను ఘనజలక్రీడ

1. అచ్చు. (మా)

నుండి మందసం గాంచి యొయ్యనం దెచ్చి,
కుండలాంచితు నందుఁ గొడుకు వీక్షించి
యిన్నంది : 'యిది నాకు మృడుఁడిచ్చె సుతుని ;
దన్నరి ననపత్యతాదోషముఖము ;
నీకున్న నెవ్వఁడీయేటుల వెంట
నీక్రియ విడుచునే యిటువంటివాని !'
అని రాధయను దానికా కర్ణు నొసఁగి,
వనిత చన్నులుచేఁపి వానిఁ బెర్పఁగను
యౌవనప్రాప్తుఁగా నరసిన, నతఁడు
వేవేగఁ గృపునిచే విలువిద్య నేర్చి,
పోయి బ్రాహ్మణవేషమున రాము మొఱఁగి,
ధీయుక్తి సాధించె దివ్యబాణములు.
ఈతెఱంగున వచ్చె నింతి కామంత్ర ;
మాతరువాతి వృత్తాంతంబు వినుము.
అంతనక్కడ నున్న యా పాండురాజు
చింతించి యనిచిన సేనలు దొరలు
హస్తినాపురమునకరుగుచుఁ బోయి,
వస్తువాహనములు వసుధాధిపతికి
నిచ్చి పాండునిచంద మెఱిఁగింప, నతఁడు :
"వచ్చెనాపద ; యిట్టివార్తయుఁ గలదె !
దిక్కెవ్వరున్నారు ! తెఱచినయిల్లు
కుక్క చొచ్చినయట్లు కురుభూమికింక
వత్తురు వైరులు ; వారిపై నెవ్వ
రెత్తిపోయెదు వార ! లేఁగింటఁగాన.
ఏకటా పాంథుఁడై విడిచి పోనేల !
యొకరీతి నాయొద్ద నుండినఁగాదె !
నాలుగుదిక్కులు నలువొప్ప గెలిచి,
యీలీల సంపద తిరవొందఁగలిగి,

కడపటఁ దనుఁబాసెఁ గడు[1] ఖేద మొదవఁ
బుడమి నాబ్రదుకంత భూజనులకు నవ్వ.
రాజనుమాత్రుండె! రసికుఁ డా పాండు
రాజు; మా వంశవర్ధనుఁ; డేడుగడయు.
అటువంటిసమ్ముని నడవిమధ్యమునఁ
గటకటా! పోఁజేయఁగా విధిచేసె.
హా పాండుభూవర! హా గుణాధార!
హా పుణ్యఫలసార! యబ్ధిగంభీర!
అన్న! నన్నువ్వారింగర్థి నోములంటి
యెన్న నోమెదువా రెక్కడగలరు! —
నాపట్టుఁగొమ్మయ్యు, నాకన్నులయ్యు,
నాపుణ్యపదమయ్యు, నా తేజమయ్యు,
నాప్రతాపంబయ్యు, నాగర్వమయ్యు,
నాప్రాపు దాపునై నన్నురక్షించి,
మన్నించి, తలిదండ్రిమఱపించి, నీవు
నన్నిట్లు పాసితె నాఁగన్నతండ్రి!”
అని చాలభీతుఁడై, యంతఃపురమున
వనితలు వారింప వగచుచునుండె
నున్నంత, ధర్మరాజుదయించు వార్త
యన్నిదిక్కులమ్రోసె; నట్లుమ్రోయుటయు,

### కౌరవజననము

వ్యాసునివరమున వనిత గాంధారి
భానుగ గర్భంబు పండ్రెండు నెలలు
మోఁచి, వేసరి: “ యింక మోవ నేనోప ;
నేచందమున మోతు నిదిచాలవ్రేఁగు!

1. ముదంబాదక. (మూ)

కన్నియవయసునఁ గడువేడ్క నేను
దన్నునారాధింపఁ, దపసి వ్యాసుండు
'తనయులనీకిత్తుఁ దరుణి, నూర్గురను'
అనువరంబునకింతయాసనుండితిని.
ఏనేమిపాపినో! యొండజన్మైనఁ
గానంగ మీనునో కడునాసగాఁక!"
అని [1] కుంది, కుంతి తా నాత్మజు మున్ను
గనినవం [2] జెలిని నాకాంతరోషించి
ప్రేవులుపొదివింపఁ, బితిరులునవ్వ,
దైవమంతటనవ్వ తనయులునొవ్వ
ననయంబు తెగువతో నర్ధరాత్రమునఁ
దనకుక్షి కరములఁదాటించుకొనిన,
మలఁగఁ బక్వముకానిమాంసపుముద్ద
గలఁగి ధారుణిఁబాఱఁ, గడువేగవచ్చి
ద్వైపాయనుండు గాంధారిఁ గోపించి:
"చాపలంబున నిట్లు సాధ్వి, చేయుదురె!
వరముబొంకైన నెవ్వారైన నగరె!
సరి, యిందు నందనశతి ముద్భవించు."
ననిచెప్పి యావేళ నలుగునఁగోసి,
కనుఁగొన నూఱునొక్కటి పంచివైచి,
కలసినవేదశాఖలఁ జక్కపుచ్చి
[3] చెలువారఁ బంచివైచిన పెద్దగాన,
నేతికుండలఁబెట్టి నిత్యంబు నమ
శీతలజలములు చిలుక నేమించి
యేఁగిన, మఱియొక్క యేఁటికి వెనుక
వ్రేఁగున నొకకుండ విరియుచో, నందు

1. గంటి. 2. జెలిమి. 3. జలగాం. (మూ)

నండంబుపగిలిన యహిహోళెఁ గ్రోధ
నుండగు దుర్యోధనుండుదయించె.
నతఁడుపుట్టినవేళ నవసికంపించె ;
హిత్తవేది వర్షించె నెమ్ములవాన ;
పగలు నక్కలుకూసె ; భానుండుమాసె ;
జగమెల్ల భేదించెఁ జండమారుతము.
అంత నొండొక భాండ మమ్మఱునాఁడు
వింతగా విరియుచో, వీక్షింప నపుడు
కామినీమదనుండు కౌరవవంశ
ధూమకేతువు పుట్టె దుశ్శాసనుండు.
భాండంబు లీరీతిఁ బ్రతిదివసంబు
నొండొండ పగులుచో నొప్పుగా నందుఁ
గర్ణ వికర్ణ దుష్కర్ణ జయంతు,
లూర్ణనాభుఁడు, సుబాహుండును, జిత్ర
దుర్మద దుస్సహ దుష్ప్రధర్షణులు,
దుర్ముఖ దుర్ధర్ష దుర్మర్షణులును,
విందానువిందాది వింశతి సహులు,
నందోపనందులు, నాగదత్తుఁడును,
జలసంధ సహులు, దుశ్శల శరాసనులు,
శల నంద వికటులు, సముఁడు దుర్జయుఁడుఁ,
కుండ మహాకుండ కుండోదరులును,
కుండజ దుర్మద కుండభేదనులు,
ననహాలంకు, దుర్విలోచనుఁ, డనాహుయుఁడుఁ,
గనకధ్వజుండు, విక్రాంతుండు, ప్రమథ-
దండధరులు, మహోదరుఁ, డభయుండుఁ,
బండిత భీతుండు, బహ్వాశి, పాశి,
దృఢధరుండును, దృఢాదిత్యకేతుండు,
దృఢవికటానన దీర్ఘబాహులును,

దీర్ఘభుజుండును, దీర్ఘజంఘులుఁడు,
దీర్ఘరోముఁడు, మఱి దీర్ఘకోపనుఁడు,
చిత్రసేన సుషేణ చిత్రదృక్కులును,
చిత్రవర్మ సువర్మ చిత్ర విచిత్ర
చిత్రాక్షులు, సమిత్రజిత్తనువాఁడు,
చిత్రబాహుండును, చిత్రకుండలుఁడు,
చిత్రాయుధుండును, చిత్రధ్వజుండు,
చిత్రాంగదుండును, చిత్రనేత్రుండు,
నుగ్రసాయకుఁడు, వ్యూఢోరు విరావు,
లుగ్రకర్ణోగ్రసేనోగ్రశ్రవసులు,
భీమ మహాబాహు భీమబాహులును,
భీమవిక్రాంతుండు, భీమవర్ణుండు,
సేనాధిపతి జయత్సేన సుహస్తు,
లాసిషంగి, వివత్సుఁ, డపరాజితుండు,
సంతకాశనుఁడు, దురాచారయుతుఁడు,
సంత వికారాక్షుఁ, డాయులోలుపుఁడు,
గొనకొని వాతవేగుఁడు, సువర్చుండు
నన నూర్వు రుదయించి రనుపమబలులు.
ఆదివసంబున నంబికాసుతున
కాదట భార్యవైశ్యాపుత్రియందు
మతిమంతుఁడును, బుద్ధిమంతుఁడు, హితుఁడు,
చతురుండు, నయశాలి, సజ్జనోత్తముఁడుఁ,
బొదలు సుకీర్తినిఁ బొందుయుయుత్సుఁ
డుదయించె గుణవంతుఁ డుర్వీశుఁడలర.
జనియించె భాగశేషంబున నొక్క
తనయ దుస్సలయనఁ దల్లి మోదింప.
మతిగతి నీరీతి నూటయొక్కండ్రు
సుతులుదయించిరి సుకృతాధికమున.

అన్నిప్రకారంబు లటు మహాప్రేమ
తన్నాత్మ నలరింప ధరణిపాలుండు,
నని జాతసంస్కార నామసంస్కార
ములు మునిసహితుఁడై మోద మొప్పఁజేసి,
దాదులచేతికిఁ దనయువర్గంబు
నాదటనిచ్చుచో, నవసరంబెఱిఁగి
పదరక భీష్ముండుఁ బౌరులు బుధులు
మొదలైనవార లిమ్ముల నేఁగుదేరఁ,
బ్రాకటంబుగఁ గురుపతితోడ నప్పు
డేకాంతమునవచ్చి, యేపుమైఁ బిలిచి
వెలవఁ విదురుండు విభునకిట్లనియె :
"ఎఱిఁగింతునొకమాట యిది వేళగాన,
నెట్టన ధృతరాష్ట్ర, నీపెద్దకొడుకు
పుట్టినదినమున భూకంపమయ్యెఁ;
బరికింప నూటుకంబంబులమీఁద
ధరఁగూలెఁ బ్రతిమలతఱచులోఁగూడఁ;
దోఁచె వెండియుఁ బెక్కుదుర్నిమిత్తములు;
పూఁచి చెప్పఁగరాదు భూపాల, నీకు;
అవిరళగతి విను మదికారణముగ
నవిరళ జనసంక్షయంబౌను; దీనఁ
గులమెల్లఁ దెగటార్చు [1] కుమతిగాఁగలఁడు;
వలవదు చంపవె వానినొక్కరుని!
ఉన్నారుసుతులు యుయుత్సుండు నీకుఁ;
జెన్నార [2] వేయిలోఁ జెదురును బోదు.
కాన, సుయోధనుకారణంబునను
బూని యుపాయముల్ పుట్టకయున్నె!

---

1. కోటి. (కోఱియని వ్రాఁతసేమా) 2. వెక్కిలో చిదురయుచోదు.

పుత్త్రమోహముమాని, పౌనర నీయుగ్ర-
పుత్త్రుని విడువుము భువియెల్లఁ బొగడ.
[1]నాకంటె నీ కిట్టు నలిఁ జెప్పహితులు
భూకాంత, యెందును బుట్టుదురింక!
అన్నవు; నీకు నే నర్థిఁదమ్ముఁడను;
మన్నించి యీమాట మదినియ్యకొనుము".
అనినఁ గోపాంధుఁడై యాయంధుఁడనియెఁ:
"దనయులఁదునుమాకు తండ్రులు గలరె!
మునుమును బుట్టిన మోహంపుఁగొడుకుఁ
దునుమాడి బ్రదికెడి ద్రోహులుఁగలరె!
ఇది యేమిమాటగా నిచ్చనోనాడి!
తడినీకుఁ బాడియే యకట! దుర్బుద్ధి!
వాక్రువ్వరాని యీవాగ్దోష మేను
నే క్రియఁ బాపఁగో నెన్నడు మదిని!
వినవచ్చుమాటలు వినవచ్చుఁగాక,
వినరానిమాటలు వినవచ్చునెట్లు!
ఈతప్పుగాచితి నీకఁదమ్ముఁడనుచుఁ;
బాతకంబులఁబల్కఁ బాడిగా దుడుగు".
అని విడనాడిన, నాబాలుచేతఁ
దనప్రేఁగు దిగునని ధర సంతసిల్లె.
అంత నంతకుమున్న యాపాండురాజు
గొంతి నుత్తమకాంతఁ గొనియాడిపలికె:
"వనిత, యీపుత్త్రుని వలనొప్పఁ జూచి,
యొనరంగ సంతోష ముబ్బుచున్నదియు;
ఎలమి నెవ్వఁడుగల్గ నీజగత్త్రయము

..............................

1. నాకంట నీకంట నలిచప్పహితుండు. (మూ)

ఒక్కసూనుఁడువలె నల్లోకబలుఁడు
గ్రక్కున యత్నంబు గావింతుగాక ;
భూరిహోమము లేక పుత్త్రకామేష్టి
నీరూపమున సన్నిధి యయ్యె నాకు."

## భీ మ జ న న ము

అనినఁ గుంతీదేవి 'యట్లకా' కనుచు,
ననిలుని నారాత్రి యాత్మలోఁ దలఁచె.
తలఁచిన, నతఁ డెల్లతనువులయందుఁ
గలవేల్పుగాన నాక్షణమున వచ్చి,
మంత్రింప మనుజుఁడై మగువతో మదన-
తంత్రమార్గమున నాతఁడు ప్రవేశింప
నింతిగర్భము దాల్చె ; నేఁడు నిండుటయు,
నంతంత గ్రహములు ననుకూలగతుల
వింతయై వర్తింప, విపులప్రతాప
సంతోషోత్సాహులకుఁ జండతేజునిని,
ఆ వాయుదేవుని యంశంబునందు
భావజాకారుని భామాలలామ
యొనర గాంధారి దుర్యోధనుఁ గనిన
దినమునఁ దనయు సుస్థిరతేజుఁ గనియె.
సురదుందుభులు మ్రోసె ; సురపుష్పవృష్టి
కురిసె ; వేదంబులు ఘోషించి పలికె ;
భయమయ్యెఁ గిమ్మీర బకహిడింబులకు ;
జయజయధ్వని యయ్యెఁ జదల నెల్లెడల ;
తనయుని వీక్షింపఁ దా వచ్చెననఁగ
ననుకూలపవమానుఁ డల్లన వీచె.
హేమకిరీటులు నితఁడు శాత్రవుల
భీమంబుగా నాజి భేదించుఁగాన,

సుతశక్తి భీమసేనుండితండనుచు
నతని పేరెఱిఁగించె నాకాశవాణి.
భూతలాధిపుఁ డంతఁ బొంగుచు వచ్చి
సూతికాగృహములో సుతుమోముఁ జూచి :
'హస్తినాపురభాగ మన్న యీకున్న
నస్తమింపదు ; వీని కదిసాధ్య' మనుచుఁ,
గాంతేయుఁ బట్టంబుకట్టిన[1] కంటె
సంతోష మాత్మలో సంధిల్లనుండె.
పురుఁడువచ్చిననాఁడె పూఁబోఁడి యంత
సరసిలో మంగళస్నానంబు చేసి,
[2]నవరీతి నుదికిననారఘట్టంబు
పవతియిచ్చిన నది సంప్రీతిఁ దాల్చి,
యదురాజశేఖరు నుపహారమునకు
నొడిపిలి పాయసం బొప్ప [3]వండించి,
భామిని మాద్రిచేఁ బట్టించుకొనుచుఁ
గోమలి సుతు నెత్తుకొని పెద్దవేడ్కఁ
బోవుచో, నాగశైలభూరిరంధ్రమున
నావలఁ బులియుండి యదిమాంసమనుచు
ఘోషించి యది వేగ గొటగొటమనుచు,
క్షణగతిలోడఁ బృథకద కవుసు
గమికొన్న యాఁకటఁ గదియఁ జాలుటయు,
బ్రమసి భీతిఁ గూడి పాండుసదేవి
కొడుకునచ్చట కొండ [4]గుండులమీఁదఁ
బడవైచె మూర్ఛచేఁ బరవశయగుచు ;
వైచిన, నాభీము వజ్రకాయమున
నేచినశిలలెల్ల నిసుమయ్యె నందు.

---

1. కట్టి. 2. నవవార. 3. సద్దించి. 4. గుండ్లల. (మూ)

ఆలోన 'నోడకు' మనుచు భూపతియు
వాలిక విలు గుణధ్వని చెలంగించి,
దూలమువోస శార్దూలముఁ దునియ
వాలమ్ము లేసి, యువ్వసుధేశుఁ డంతఁ
బవమానసుతుమీఁదఁ బడియున్న కుంతి
నవమానవతి నెత్తి, నందను నెత్తి,
'తిను వెంతగట్టెయో తనయున!' యనుచు
మనమున సంతోషమునుహిమ లింపొంద,
దేవాలయమునకుఁ దెఱఁగొప్ప నేఁగి,
యావేళ జగదంబ నర్చించి వేడ్క,
సతియును దాను సాష్టాంగ మెఱఁగి,
స్తుతవచోరచనల స్తుతిచేసి రిట్లు :
"గౌరి, వారాహి, శాంకరి, దుర్గ, త్రిపుర-
భైరవి, శక్తి, జపారత్నవర్ణ,
ఫాలాక్షి, మధుమతి, పరతత్వ, జనని,
కాళి, కంకాళి, హ్రీంకారి, రుద్రాణి,
భుజగభూషణు దేవి, పూర్ణేందువదన,
విజయ, శర్వాణి, దేవీ, జ్ఞానమూర్తి,
వారాహి, చాముండి, పరదివ్యమూర్తి,
ఘోరదంష్ట్రి, కరాళి, కోమలి, ముగ్ధ,
గీర్వాణి, శాంభవి, కీనాశవంద్య,
నిర్వాణసంధాయి, నిఖిలప్రదాయి !"
అనుచు నివ్విధమున నభినుతి చేసి,
తన దేవియును దాను ధరణినాయకుఁడు
నాయ్యెడ నటపాసి యొగి నుండుచోట
నుద్యానములో నుండె నెలఁతలుఁ దాను.
ఈరీతిఁ [1]బుత్తుఁ గని నొందు నేమఱక
గారవంబునఁ బెంపఁ, గరిపురినంత,

1. భూమిని. (మూ)

ధృతరాష్ట్రునకు వంశదీపకులైన
సుతులు నూర్వురు నొక్కసుతియును బుట్టి
యున్నవారను వార్త యుర్విపై బ్రాయ
విన్నవాఁడై, పాండువిభుఁడు మోదించి,
శూలివిక్రములైన సూనులు తనకుఁ
జాలనితలఁపున సాధ్వికిట్లనియె:
"తరుణి, విద్యలచేతఁ దనయులచేతఁ
ధరచేత సిరిచేతఁ దనియరెవ్వరును;
ఇక్కగా నినువంటి యిల్లాలుగలుగఁ,
కొక్కండ్రు గావలె బిడ్డలు మనకు.
శతమఖు నమరేంద్రు శతకోటిధరుని
బ్రతిలేని యాదివస్పతియైన యట్టి
యింద్రు నారాధింపు; మీఁక నొక్కసుతుని
ఐంద్రవంశము నిల్పఁజాలినవాని,
మానితాటోపు సముంచితోత్సా[1]హు
[2]భానుసన్నిభ [3]దీప్తప్రభ గల్గువాని
నాచంద్రధర సురేంద్రాది దేవతలఁ
జూచి పోరాడ నిష్ఠురుఁడైనవానిఁ
గనుము; కాంచినదాఁక గారీవ్రతంబు
ఘనతరనిష్ఠతోఁ గమలాక్షి, నడుపు".
అనిచెప్పి, తా నొకయైంద్రమంత్రంబు
మునులచే నుపదేశముఖమున నెఱిఁగి,
యురుదైన నిష్ఠతో నమరాధిపతికి
ధర నేకపాదుఁడై తపముసేయుంగఁ,
బ్రత్యక్షమైవచ్చి పలికెవాసవుఁడు:

---

1. హ. 2. భాను. 3. దీప్త. (మూ)

## అర్జునుజననము

"సత్యశౌర్యుఁడు నీకు జనియించుఁగొడుకు ;
ఎంతటివానిఁగా నీవుచింతించి
తంతటిగుణవంతు నతిరథశ్రేష్ఠు
నిచ్చితి." ననిచెప్పి యింద్రుండుపోవ,
నచ్చట వ్రతము సమాప్తమై కుంతి
పతియాజ్ఞఁ దలమోచి, ఘన భక్తియుక్తి
హితమతి వేలొండు నిచ్చలోలేక
మునియిచ్చుమంత్ర మిమ్ములననుష్ఠించి,
తనమదిలోనున్న తాత్పర్య మెసగ
నమరేంద్రుఁదలఁచిన, నారాత్రివచ్చి
కమలాక్షి కోరిక కరుణించి, యుఘుఁడు
వరదుఁడై పాండుభూవరుకూర్మిసతికి
వరపుత్రదానంబు వలనొప్పనిచ్చి
పోయిన, నొకయేఁడు పూఁబోఁడి గర్భ
మాయతమతిఁ దాల్చి, యటయొక్కనాఁడు
ఉత్తరఫల్గుని నుడురాజుమెఱయఁ,
జిత్తరాగము సర్వజీవులఁ బొరయ,
విక్రమక్రమకళాన్వితసముద్భవుని
శక్రునంశంబున జగమెల్లఁ బొగడ,
జలజాక్షు రాముఁ గౌశల్య గన్నట్లు
కులదీపకునిఁ గాంచెఁ గొడుకు నుత్తముని.
అప్పుడు భాషించె నాకాశవాణి :
"యిప్పండువుఁడు ధీరుఁ డింద్రసన్నిభుఁడు ;
కార్తవీర్యార్జునుగతి నాజిలోన
మార్తురఁదెగటార్చు మహిఁ బాత్రుఁడగుట
నర్జుననామధేయంబున నమరి
నిర్జరాధిపునైన నిర్జించు నాజి ;

భర్గుఁ దా నెక్కటిబవరాన గెలిచి,
మార్గణరాజంబు మహిఁ బొందఁగలఁడు ;
పొందితోడన నింద్రుపురమున కేఁగి,
యందు రాక్షసకోటి హరియింపఁ గలఁడు;
అనలుని మెప్పించి, యరిదంబు విల్లుఁ
దొనలు [1]రథ్యములుఁ గేతువుఁ గాంచఁగలఁడు ;
ఇతఁడు రాజుల గెల్చి, యెలమి ధర్మజుని
నతివేడ్క రాజసూయంబు చేయించుఁ ;
గతలేల! యితఁ డింద్రుఖాండవవనము
చతురుఁడై కాల్చు వాసవుఁ నోడించి ;
యుత్తరఫల్గుని నుదయించెఁగానఁ,
గ్రొత్తగా దితని ఫల్గునుఁడనఁ జెల్లు ;
సితఁడీశ్వరునిఁగూర్చి యెలమిమైఁ దపము
చతురుఁడై కావించు జగమెల్లఁ బొగడ."
ననునంత దేవత, లఖిలసంయములు,
మనువిశ్వవసువులు, మానుశంబులును,
గరుడగంధర్వులు, గ్రహతారకాదు
లరుగుదెంచిరి కూడి యర్జునుఁజూడ.
పాండురా జప్పుడు పరమమోదమున
దండప్రణామముల్ తగ నాచరించి,
యందఱఁగూర్చి: "కృతార్థుఁడనైతి ;
నందనఫలసిద్ధి నాకబ్బె నేఁడు ;
ఈకురుకులమెల్ల నేదివర్ధిల్లె ;
నాకు నంతయుఁ గల్గె నాకలోకంబు ;
కడువేడ్క వివిధలోకంబులవారిఁ
బొడ [2]గాంచుటయెఁగా! పుత్రులఁగనుట ;

1. రథ్యంబు. 2. గాంచుటయును దా. (మా)

నెదురుగాఁ బట్టి యీ కేలెంతురట్టు!
పొదలు దివ్యుఁడఁగాన! బొందితో నేను."
అనుటయు, దేవత లతనిఁగీర్తించి
చని రంత నిజనిజసదనంబులకును.
కుంతికి సిరికిఁ గొడుకులు గలుగ
సంతతోత్సాహుఁడై, సంభ్రమంబెసఁగ
నంతట శతశృంగమందుఁ బాండుండు
సంతోషచిత్తుఁడై, సంయములలర
సతులతో సుతులతో సతతంబు గూడి
యతివినోదములఁ బొంపఁగుచునుండె.
ఆలోన మద్రరాజాత్మజ మాద్రి
భూలోకవినుతులఁ బుత్త్రులఁ గనఁకుఁ
బడయునుపాయంబు పరికింపలేక,
నెడఁదలోఁ బలుమాఱు నిట్లనితలఁచె:
"కోరినతపసొక్క కొదవడకుండ
వారిజానన కుంతి వసుధేశుఁడలర
సురుచిరాకారుల శూరుల ఘనుల
గురుమతితోఁ గాంచెఁ గొడుకుల ముగురి;
గాంధారి కొడుకులఁ గాంచె నచ్చోట
బంధురలీలలఁ బరఁగ నూర్వురను;
మతికెక్కఁగా వారునోచిననోము
నతివేడ్క నే నోమనైతినా కాక!"
అనితలపోసి యయ్యధినాథునకుఁ
జని, మాద్రి దుఃఖంచి చానొప్పఁబలికె:
"ఇందుపుట్టువుపుట్టి యక్కట! నాకుఁ
బోడిగా లేదయ్యెఁ బుత్త్రలాభంబు;
కొడుకుల నాతోడికోడలు గాంచెఁ
గడువేడ్క నూర్వురఁ గ్రమముమీఱంగ.

కుంతీమహాదేవి కొడుకుల ముగురఁ
గంతుసమానులఁ గరమొప్పఁగాంచె;
నెక్కడినాజన్మ! మెక్కడిబ్రదుకు!
అక్కట! వగలపాలైతి నే నిపుడు!
పసపార్చి, చన్నిచ్చి, పలుమాఱుచీరి,
కొసరుచు ముద్దాడి, కోర్కెదైవార
నక్కున నురమున నత్తుచుఁ బెనుప
నొక్కఁడైనను నాకు నుదయింపఁడయ్యె!
కొడుకులులేనట్టి గొడ్రాలి నైనను
అడవిఁగాచినవెన్నెలైపోవుఁగాదె!
మంత్రమేమియునేర; నాతోడ మదన-
తంత్రమీవెఱుఁగవు; తనయుఁడెట్లొదవు!
సవతియు నీవును జనఁబుట్టఁగలిగి,
సవనీశ, నాకరా నభవుఁ డీఁడయ్యె!
దేవిచే మంత్రోపదేశంబు నాకు
దేవ, యిప్పింపఁగదే!" యన్న నతఁడు,
వేలెడునిడుపులై వ్రేలెడుకురులుఁ
దూలెడునడపులుఁ దొక్కుమాటలును
ముద్దుగానొప్పెడి మూఁడేండ్లకొడుకు
నొద్దన ధర్మజు నునిచినదానిఁ,
'జేతప్పి ప్రిదిలిన [1] చిన్నిక్రేఁకమున
జూతిచట్టువమీఁద గదమయ్యెఁదొల్లి;
ఇంతమహాసత్త్వ నిట్లుధరించు
సంతటిదానఁగదా!' యను వేడ్క
నెలమి నాభీము రెండేఁడులవాని
బలమొప్ప నూరులపైఁ దాల్చుదానిఁ,

---

1. చిన్ని తెంకరను. (మూ)

గలశజుచే వీఁడు ఘనతఁ బెంపొందఁ
గలఁడనంగను గుచకలశంబులోని
[1] పాలిచ్చుననఁ దోపఁ బరఁగునొండొక్క-
బాలుఁ జన్నిచ్చుచు భరియించుదాని,
మిన్నంత వేడ్కతో మృదుశయ్యమీఁద
నున్నకుంతీదేవి నొయ్యనఁ గదిసి :
" యీమాద్రి రక్షింపు ; మిది నీకుభరము ;
[2] భామ, నీకింతయుఁ బరమపుణ్యంబు ;
[3] నీకీమె చెల్లెలు ; నీకిట నెపుడుఁ
జేకొని శుశ్రూషచేయుఁ ; గావునను,
ఇమ్ముగా ముని నీకునిచ్చినమంత్ర
మిమ్ము సత్కృపతోడ నెలమి నీ." వనుచు
మాద్రిచందము చెప్పి, మంత్ర మిప్పించి,
మాద్రికిట్లనియె నమ్మనుజనాయకుఁడు :

## కవలజననము

" జగదేకవిఖ్యాతచరితు లశ్వినులు ;
మగువ, నానాజ్ఞానమహితులశ్వినులు ;
వారి నారాధింపు వచ్చెద." రనిన,
ధారుణీశునియాజ్ఞఁ దరళాక్షి మాద్రి
యిచ్చలోఁదలఁచిన, నిరువురశ్వినులు
వచ్చి నిశావేళ వరమిచ్చిపోవ,
హిమకరనిభగర్భ మేఁడాది డాల్చి,
యమదలఁగాంచె నయ్యశ్వినులందు.
విహితప్రతాపులు వీరలు నకుల
సహదేవులనుచుఁ బుష్కరవాణిపలికె.

1. పాలిచ్చుననబరగునొక్కొంటి. 2. భామినికింతయుం. 3. నీకిట చెల్లెలు. (తూ)

ఘనతఁ బాండునిమనఃకమలంబు విరియ,
దనయంబు గొంతియు నాత్మలో నలరఁ,
గామునిశరములు కల్పవృక్షములు
నామహాదేవుని యయిదుమోములును
ఈరూపములఁదాల్చి యిలఁ బుట్టెననఁగ,
భూరితేజంబులఁ బొగడుదీపింప,
ధర్మజ భీమ సుత్రామజ [1] యములు
పేర్మి నానాఁటికిఁ బెరిగి పెంపొంది.
కిరీటి నందను లేవురు గలిగి
పౌరవకులకర్త పాండుభూభర్త
శతశృంగగిరిమీఁద సతులును దాను
వ్రతధారియైయున్న ; వసుధలో నంతఁ
బడఁతులతోఁగూడఁ బాండుభూవిభుఁడు
అడవికి వేఁటకై నర్థిఁబోవుటయు,
మృగశాపభయముగ్రమైన రాజ్యముడిగి
పొగడొందఁగాఁ దపంబునకుఁజొచ్చుటయు,
దేవతావరములఁ ద్రిదశేంద్రసముల
నేవురఁబుత్త్రుల నెలమిఁ గాంచుటయు,
విని వసుదేవుండు వేడ్కలువొదువఁ
దన [2] కూర్మిచెలియలిఁ దనకూర్పుమఱఁదిఁ
దనమేనయల్లుండ్రఁ దగమద్రసుతను
'గనుఁగొనిర' మ్మని కశ్యపునంప,
నాపురోహితుఁడేఁగి యఖిలతంత్రముల
నాపాండుభూవరు [3] నర్థి దీవించి,
నవరత్నభూషణావళులు వేర్వేఱ
నరుదారఁగా నిచ్చి, యామకుమారులకు

---

1. కవలు. 2. భ్రాత. 3. నర్థితో గాంచి. (మూ)

నలిమీఱఁ జౌలోపనయనాదివిధులు
గొలఁదికగ్గలముగాఁ గోర్కెనొనర్చి,
[1] విదితశాస్త్యులకును వేదశాస్త్రములు
చదివింపుచుండె నాసంయములలర.

## వసంతోదయము

అంత వసంత మత్యనురక్తి జగము
లెంతయునలరంగ నెలమిదైవార
[2] హత్తె భూభువనమందఖిలజీవులకుఁ
జిత్తానురంజనశ్రీ యుల్లసిల్ల.
తరువులామధువునఁ [3] దలఁగుప్రాయములు
తిరిగివచ్చుట యెల్లదిక్కులఁ దెలిపె ;
సలజీర్ణపర్ణంబులసియెడు [4] నరలు
[5] తలఁగి శీతవ్యాధిఁ దగులుట [6] దెలిపెఁ ;
[7] 'గురుకుమారకుల కాకులపాటు గలుగు
నరయంగ నటమీఁద' నని చెప్పుకరణిఁ,
దాడిమలతో నూఁడి తోడ్తోడ ధాత్రి
[8] నడరంగఁ దరులఁ గారాకులు మొల్లెఁ ;
బారిపోఁ బాండవాభ్యుదయంబునకును
బరికింప విదురాదబంధుచిత్తంబు
బలసితంబుగఁ బల్లవించునిమాడ్కి
[9] బలి నంచుఁ దరులఁ బల్లవము లొప్పారెఁ ;
కోకిల శుక భృంగకులములఁ బిలువ
నాకులువెట్టిన ట్లాకులఁబెట్టె ;
సుమనోవిలాస భాసురలీలఁ జెలఁగి
సమబుద్ధిఁ గీర్తివాసనఁ బాండవులు

1. విదదశరథులకును. 2. హత్తె భూభువనాలి నఖిలజీవులకు. 3. దలుకు.
4. నరులు. 5. తగిలి. 6. దెలిసి. 7. కురుకుమారులకు గులపాటుగలుగ.
8. నటరంగ. 9. బలిదగులందు బల్లవములొప్పార. (మూ)

అమరంగ నొప్పాదురనుభంగిఁ దరులు
సుమనోవిలాసభాసురలీలఁ బొదివె;
ఫలియించెఁ బాండుభూపతితపంబనఁగ
ఫలియించె వృక్షముల్ పాయకెల్లెడల;
మలయాచలంబున మలయుచుఁ [1] గదలి,
జలజాకరంబులచలువ నోలాడి,
పరువెత్తి, యుయ్యానబలసి, పూఁబొదలఁ
బరఁగుపూమొగ్గలఁ బరువులెత్తించి,
తెలియఁబుష్పిణులైన తీగజవ్వనుల
తలిరాకుచెఱఁగైనఁ దాఁకునో యనెడి
ఘనశంకఁ జరియించుకరణి గంధాద్రి-
యనిలుండు చల్లనై యల్లనవీచె;
వీఁగుచు తేఁగాలి [2] విటుతలమీఁద
నూఁగెడువిటపులయుపరిభాగముల
నాలికెనుగతి రాలె నుత్ఫుల్లకుసుమ-
వలమాన మకరంద వరఘర్మజలము;
వేఁట పాంథులమీఁద వెడలుచో మరుని
మీఁదైన గండుతుమ్మెద సల్లప్రజకుఁ
దావుకూళులుచూపు తావు లనంగఁ
ద్రోవులతావులు గూర్చె మధుంబు;
ఆవిరులందు నొయ్యన దూరిదూరి,
[3] క్రేవలరసము పుక్కిటఁ బట్టిపట్టి,
పొడబొల్లువడకుండఁ బుప్పొడి యలఁది,
సుడిసి మైమెఱుఁగగ సోలి గూఁకుచును,
బలువిధంబులఁ [4] బాడి, పంచమశ్రుతులు
పలికె [illegible] మొప్పారె;

---

1. దగిలి. 2. విటువుల. 3. కేవిపులరసము. 4. పాం. (పా)

[1]చిగురాకు లారగించినచంచువమరఁ,
బాగరేదులోఁ జవనంబులఁ గెంపు గదుర,
బలువడిఁ జిగురుఁజొంపములలోనుండి
కలయంగఁ గోకిలగము లెలుఁగించెఁ ;
దెల్లఁగాఁబూచిన తిలకంబుప్రాల
మొల్లంబుగాఁ [2]బూచి మోదుగు [3]పొదల
నాఁటియీశ్వరు [4]ఫాలనయనాగ్నిశిఖల
నాఁటిన మండు మన్మథుఁ దలఁపించెఁ ;
పెక్కు తెఱంగులై పెరయు తావులకు
నెక్కుడమూఁగుదు మదిమేలనుచుఁ
జంచరీకములు బిసాటంబుదిరిగి,
నిల్చి యెందును వ్రాలనేరకయుండె ;
గండుఁగోయిల జంకె గర్వంబులుడిగి
మిండలఁగవయుకాదినులగోపాగ్ని ;
నడవుల వేఁట సేయను బుష్పధూళి
వడి మృగంబుల కొక్కవన్నియ దెచ్చెఁ ;
గ్రమ మొప్పఁ గమలాకరంబులై చాలఁ
గమలాకరములొప్పఁ గడురమ్యమగుచుఁ ;
దనదుబాణములను దైవంబులైన
ననుపమగతి శిరసావహింపంగఁ,
దనవిల్లు లోకముల్ దగఁ గొనియాడఁ,
దను నెల్లవారుఁ జిత్తజుఁడనిపొగడఁ,
గడఁగి నిశ్చలకీర్తిఁ గాంచిన [5]మరుఁడు
గను వడిగల్గు చిల్కలరథం [6]బెక్కి,
యావలఁగదలి, మీనాంకంబు గొలువ,
నావిరి గమ్మగా వాలమ్ము తేర్చి

---

1. చిగురాకులారగించు చంచుక మెఱసి. 2. పూచి. 3. ప్రోవు.
4. ఫాల. 5. మధువు, 6. విచ్చి. (మూ)

దండెత్తి యాముని తన[1] ముంగానడవ,
నొండొండ జగముల నురుతేజమెసఁగ,
గలఁగొని రతి[2] కేళిఁ గడఁకలు[3] మీఱి,
తల కురు లెఱుఁగక తడఁబడువారి,
సంగతిఁ గాంతలచనుగుబ్బలనడి
లింగంబులను గాఁగిలించినవారి,
మనలక సతులకమ్మనిమోవులనసి
కసవుల మఱువక గఱచినవారి,
ననువారఁ దోయజాతాక్షులపిఱుఁదు
లను పుట్టలెక్క పాయక యున్నవారి
మన్నించి, విజయుఁడై, మఱియు లోకమున
నున్నజీవుల నేయుచుండ నొండొండ.
చిత్తవికారంబు శివునంతవాని
హత్తఁజేసినయట్టి యాఋతువునను,
అట పాండుభూపాలుఁ డంగసంభవుని
పటుబాణపాత హృత్పద్ముఁడై యలసి,
మానంబు తన కనుమానంబుగాఁగ
నూనినవిరహాగ్ని నుడుకుచునుండి,
మాద్రివట్టఁగరాని మానితాకార-
మాద్రిపై మోహంబు మరలింపలేక,
శాపంబుకతముగా జనియించుభీతి
నేపార నలయుచు నిట్లున్నయంత,

### పాండుని మరణము

వనజాక్షి మాద్రి భూవరునకు బ్రేమరఁ
దనరూపునకుఁదగఁ దద్దయువేడ్క

1. మోఁత. 2. కేం. 3. మారి. (మూ)

లేమ కుంతీదేవి లేనిప్రొద్దునను,
గాముఁ డోర్చినవాఁడు గానిప్రొద్దునను,
మెఱుఁగుఁజన్నులమీఁద మృగనాభి యలఁది,
నెఱిఁ గల్వరేకులనిగ్గు పట్టించి,
మొల్లమొపిగిడిన ముత్యాలమాలు
మొల్లమొగ్గలఁగ్రుచ్చి మొలనూలుగట్టి,
సొంపైన మొయిదీఁగెసొమ్ములమాలు
సంపంగిరేకులుసంప్రీతిఁదాల్చి,
తెగగలకస్తూరితిలకంబుమాఱు
మొగలిపుప్పొడి గోటిమొన నత్తి దిద్ది,
జిగిమెక్కు మెఱుఁగులు [1] జీరలువాఱు
చిగురాకు చంద్రికచీరఁ ధరించి,
పొన్నలుఁ బొగడలు బొండుమల్లియలుఁ
గ్రొన్ననలును గీలుకొప్పునఁదురిమి
వనలక్ష్మిగతినున్న, వసుధాధిపతియు
నొనర దగ్గరఁబోయి చేరసుకయుండి,
గురుభక్తితో నంత గొంతి విప్రులకు
సరసాన్నములఁ దృప్తిసలుపుచునుండి
తన్ను నేమఱుట చిత్తములోన నెఱిఁగి,
క్రన్నన నప్పు డేకాంతంబునందు
దండితారాతి యుద్దండవిక్రముఁడు
పాండుభూపాలుండు భావజాకులిక,
సంయమియిచ్చినశాపంబు మఱచి,
సంయుతహృదయ [2] విస్రబ్ధతమఱచి,
పొలుపారు వనపుష్ప భూషణంబులను
లలిమీఱి భవపుష్పలతిక చందమునఁ

1. జీరకువాయ. 2. విసంభృత. (మూ)

చెలువారు నమ్మాద్రిఁ జెచ్చెరఁగదిసి,
వలదనివారింప వలనొప్ప నతఁడు
ఆలింగనముసేయ, నబల వారించి:
" యేలయ్య! మఱతురే యిటు సన్నునీవు!
వనము నీయుద్యానవాటిక గాదు;
వనము నీదువిలాసవాసంబుగాదు;
మునులలోఁ గొందఱుమునులమై కాద!
మన మున్నవారము మనమున్నతముగ!
పదరకు; రాకు; పైఁబడకు; పట్టకుము;
కదియకు." మనుచు నంగన పోవఁబోవ,
సలలిత పల్లవశయ్యాతలమున
బలిమిమై నదరంటఁ బడఁతుక నంటఁ-
బట్టి, భావజకేళిభరితసామ్రాజ్య
పట్టాభిషిక్తుఁడై పాండుభూవిభుఁడు
ప్రాణంబువిడిచినఁ, బఱ తెంచి కుంతి
ప్రాణేశ్వరునిమీఁదఁబడి మూర్ఛనొంది,
దేవి మద్రకుమారి తెలుపఁగాఁ దెలిసి:
" హావినిర్మలతేజ, హాపాండురాజ,
హాకురువర, ధీర, హామహాశూర,
హాకరుణాకర, హావీరవర్య,
ఎక్కడఁబోయితే! యేమనైతిఁ!
దక్కక తాఁకెనే తపసిశాపంబు!
దిక్కులన్నియుఁ గెల్చి దివిజులుమెచ్చ,
నక్కజంబుగ ధనం బపరిమితంబు
తెచ్చి, యగ్రజుఁడైన ధృతరాష్ట్రవిభున
కిచ్చి యాగంబు నేయించితివీవు.
నీయంతశూరుండు, నీయంతసుకృతి,
నీయంతకారుణ్యనిధి యెందుఁగలఁడు!

ఎక్కడిమధుమాస! యెక్కడిమాద్రి!
యెక్కడిసంభోగ! యిం దేమిగలదు!
పలుకులేటికి, మాద్రిపైఁ గన్ను వేసి
మెలఁగునిన్నఱఁగియు మేముమఱచితిమి.
మునిశాపచరమసముద్రంబునందు
మునిఁగితే కురురాజ! మోహనాకార!
మునిగి శాపబడబాగ్ని ముట్టిననీవు
జగదీశ, పోయితే జలధిగంభీర!
సంయమీశ్వరు శాపచటులాగ్నిచేత
నొయ్యనఁజిక్కితే! యదురాజవంశ!
[1] వనితేక్షణములను వలలోనఁ దవుల
ననిపితే! సూనసాయకు వేఁటకాఁడు;
అశ్రాంతనెఱి [2] కురులను నురులందుఁ
జిక్కితే! కౌరవసింహాంబ! నేఁడు;
బ్రాహ్మణులకు నేఁడు పాయసాన్నములు
బ్రహ్మార్పణంబుగా భక్తినేనొసఁగ,
నెడచూచి మఱిగదా! యిల్లుచేసితివి;
పడఁతికై చావంగఁ బాడియే నీకు!
అసమాస్త్రదివసంబులంటేఁ గదయ్య!
యసము: దింపక యుండుమంటేఁ గదయ్య!
ప్రాణేశ, నన్నీవు పాసిన వెనుక
ప్రాణంబు లేలొకో పాయవు నన్ను!
తపసులు వెఱఁగందఁ దప మర్థిఁ జేసి,
విపులపుణ్యుల ధర్మవిదుల నందనుల
నమరులవరమున నర్థితోఁ గాంచి,
యమరలోకంబునకరిగితివయ్య!

---

1. వనితవీక్షణవలలోఁ దవుల. 2. గురులనురుల చేత. (పూ)

సుతులఁ గాంచితిగాని, సుతులుర్వి యేలఁ
గుతలంబు మెచ్చఁ గన్గొనఁ గానవైతి!
తనయాత్మజుల నిప్పు డెవ్వరికిచ్చి
పోయితివో! పాండుభూపాలతిలక!
ఇంక నెవ్వరు మాకు నిచ్చోటదిక్కు!
ఇంకఁ బ్రాలైతిఁగా యీశోకవహ్ని!
పరికింపఁజాల నీబాలుర విడిచి
యరుదెంతు నీవెంట." ననునంత, మాద్రి:
"ఇమ్మెయి మృగశాప మెఱిఁగియు నెఱిఁగి,
వమ్మైన నాబుద్ధి వరదఁబోవిడిచి,
మొదలు [1] మఱచినయట్టియొప్పనిదానఁ;
గొడుకులఁ బెంపంగఁ గుంతి, యే నేర.
వసుధేశ్వరునకు నావలననగాదె!
యసువులు దొలఁగంగ నక్కటా! వలసె.
నాకెడయిమ్మింక నలినాయతాక్షి,
యీకురునాథుతో నేఁగెద నిపుడు;
తనయుల రక్షింపు తరుణి, నీవుండి;
ననుబంపు నరనాథునకు సహాయముగ.
నితని నేమఱినట్లె యే నిల్తునేని,
సుతుల నేమఱుదును శూన్యాటవులను.
కావున, నామాట గాదనకిపుడు
వేవేగ నను బాండువిభుఁగూడననుపు."
అనుచు రాజేంద్రుశయ్యకు దాటుకొనిన,
మును లంత శోకాబ్ధిమునుఁగుచువచ్చి
మొప్పుగా నందఱు నొగిఁగూడి, కుంతిఁ
దప్పక యూరార్చి తమలోననిరి:

1. మరుగని యట్టి. (మా)

"ధరణీభరంబు బాంధవరక్షణంబు
నరయంగవిడిచి ఘోరాటవిచేరి,
తనకును శరణంబు తాపసులనుచుఁ
జనుదెంచి తప మర్థిఁ జాలంగఁజేసి,
సురలవరంబున సూనులఁ గాంచి
పరలోకగతుఁడయ్యెఁ బరికింప జగము ;
మనుజేశ్వరుఁడు నమ్మి మగువలుఁ దాను
మనలోపలనయుండె [1] మనబందు." వనుచు
మారెదు నేరెడు మామిడి మఱ్ఱి
యారావి శమి మోదుగాదిగా వెదకి
వట్టిపోయినతుండ్లు వారక తెచ్చి,
కొట్టి యయ్యిరువుర కుచితాగ్నియిచ్చి,
యయ్యస్థి నీటిచే నందంద తడిపి
చయ్యన నవదర్భశాఖలఁ బొదివి,
కుంతికిఁ గొడుకులకును శోకమార్చి,
యంత వారలతోడ నయ్యస్థిగొనుచు
నెచ్చటనిలువక యిభపురంబునకుఁ
దెచ్చిరి పదియేడుదివసంబులకును.

### పాండవుల హాస్తిపురప్రవేశము

పౌరు లంతకుమున్న పాండునందనులు
వారక చనుదెంచువార్తల కలరి,
చదురొప్ప నానందజలధినోలాడి
కదియుచుఁ దమలోనఁ గడఁకనిట్లనిరి :
" పాండునిభాగ్యంబు పల్లవింపంగ,
నిండుగొంతెమకడుపు నిండివెలుంగ,
వరమునఁబుట్టిన వంశవర్ధనులు
వరుస వచ్చుచునున్నవారుపో వీరు.

---

1. మనకుంబోదనుచు. (మా)

అంతటిలోపల నధికమై యగ్ర
మందున ధర్మరూపాకృతిదాల్చి,
జలనిధిపర్యంత సకలభూతలము
వెలయనేలెడుచిహ్న వెరవొప్పఁగలిగి,
ప్రాకటంబుగ సార్వభౌముఁడై మించి,
యొకడ మనవారలనెల్ల రక్షింప
నాకేశవైభవోన్నతితోడ మెఱసి,
జోకవచ్చెడు ధర్మసుతుఁ డల్లవాఁడె;
ఆతనివెనుక మహాధురంధరుఁడు
భీకరాకృతితోడఁ బెంపగ్గలింప,
'వనిమొనఁ దనకెదురైన రాక్షసుల
గనియలు తునియలుగాఁ జేతు' ననుచుఁ
గడఁగి కయ్యమునకుఁ గాలుదువ్వుచును
వడివచ్చుచున్నాఁడు వాఁడుభీముండు;
కడిమిమై రాము భార్గవరాముకరణి
గడిదేరి చాపసంకలితుఁడై మెఱసి,
వికటశాత్రవ వేగుపిత్తి తఁడనఁగఁ
బకపకనవ్వుచుఁ బావనివెనుకఁ
గనుఁగొని తమయన్నకనుసన్న మెలఁగి
వినయంబుతోవచ్చు విజయుండు వాఁడు;
మాద్రికుమారు లిమ్మహిఁగరుణాస-
[1]ముద్రులై వినయసమున్నతి వెలసి,
సలలితభూతభవిష్యద్వర్తమాన
కలితాత్ములైమించి కడఁకఁబెంపొంది,
చనువొప్ప నకులుండు సహదేవుఁడనఁగ
వెనుకొని విజయునివెనువెంటఁగొలిచి,

---

1. మాద్రులై వెలసి సముద్రములై వెలసి. (మూ)

పనిగొన నలిలేనిభక్తి దీపింప
నొనరంగ వచ్చుచున్నారు వారె.
ఈదివ్యపురుషుల నిటు గన్నకాంతి
యేదైవములకన్న నెక్కుడై మించి,
యల్లదె వచ్చుచు నట మనమీఁదఁ
జల్లనిచూపులు చల్లుచున్నదియు ;
దేవమూర్తుల వారిదృష్టింత." యనుచు
వేవేగ నెదురేఁగి వీక్షించువారు,
నేవీధివత్తురో యెఱుఁగరా దనుచు
నావీథి కావీధి కరిగెడివారు,
'రాజమార్గంబున రాఁబోన రాఁగు ;
వాజులు రథములు వారణంబులును
సందడించెడు.' నని సౌధంబులెక్కి
కందర్పమూర్తులఁ గనుఁగొనువారుఁ,
జల్లగాఁ గస్తూరి జాజులుఁ గలిపి
చల్లెడువారునై సంభ్రమింపఁగను,
విదురుని భీష్మాదివృద్ధుల హితుల
నెదురుగాఁబుత్తెంచి, యిభపురాధిపుఁడు
ఆఁడువారలు మోచునందలంబెక్కి
పోఁడిగాఁ గుంతిఁ బూఁబోఁడి రాఁబనిచి,
పెద్దకొల్వుననుండి బిడ్డలరాక
తద్దయుఁ గోరుచోఁ, దాపసోత్తములు
పార్థులఁ దెచ్చి భూపతికి మ్రొక్కించి,
యర్థి నంతఃపురి కాకుంతిఁ బనిచి,
జగదీశుచేతఁ బూజలు వారు వడసి
తగినవీరకములఁ [1] దమయంతనుండి :

1. రరుకార. (మూ)

“ఓన్యాయధృతరాష్ట్ర, యోధృతరాష్ట్ర,
ధన్యులు వీర నీతనయులేవురును ;
వరుస నంతక వాయు వాస వాశ్వినుల
వరములఁబుట్టినవంశవర్ధనులు ;
ఇతఁడుయుధిష్ఠిరుం ; డితఁడుభీముండు ;
ఇతఁడర్జునుండు ; వీరిరువురుఁగవలు
[1] నకుల సహదేవ నామ నాయకులు ;
ఒకభేదమునులేక రూపము వీరి ; –
నిరువురుమాద్రేయు లీపృథాపుత్త్రు
లరయ భూపతిచావ నరుదెంచినారు ;
మాద్రి యాతనితోడ మరణంబుఁబొందె ;
ముద్రగా నిదె యస్థి కూచి తెచ్చితిమి ;
పట్టితి మొకరీతిఁ బడకుండఁ గుంతి ;
నట్టివారికి వలదే తల్లినీడ !
ఓసరింపక వారి కుత్తరక్రియలు
చేసి యీశిశువులఁ జేపట్టు.” మనుచు
జననాథునకుఁ జిత్రశల్యంబులైన
యనుజునిశల్యంబు లాపాంత నిచ్చి
మునులుపోయిన, రాజు మూర్ఛిల్లి తెలిసి,
తనయులు భీష్ముండుఁ దానుఁ దల్లులును
విదురుండు సచివులు ద్విజులు గాంధారి
మొదలుగాఁగూడి తమ్మునకు వాపోయి,
భూదేవసహితుఁడై పురజనుల్ గొలువ
నాదేవనది కేఁగి, యమసూతి [2] చేత
నొద్ద వేదవ్యాసుఁడాజ్ఞయై చెప్ప
ముద్దుతమ్మునిశల్యములు సంస్కరించి,

---

1. నకులుండు. 2. చెంత. (మూ)

స్నానతర్పణములు శ్రాద్ధాదికములుఁ
బూనినిర్వర్తించి పురమునకరిగి,
కొంత [1]దుఃఖంబాఱి క్రొత్తగా [2]నిండ్లు
కుంతికిఁ దత్పుత్త్రకులకుఁ [3]గట్టించి,
జలనిధివేష్టిత సకలభూతలము
నలమియేలుచునుండె'. నదియును గాక,
'వరుస ధర్మజ భీమ వాసవి యముల
పరిచిత [4]కీర్తనప్రకరంబు వినిన,
ధర్మాభివృద్ధియు ధరఁబాప [5]హాతియు,
దుర్మదారిజయంబుఁదోడ్తోనఁ గలిగి
రోగంబులెల్ల నారోగ్యమా' ననుచు
బాగుగా వేదంబు పలికెడుఁగాన,
సారిదిఁ బుణ్యశ్లోకసుఖుల పాండవుల
చరితంబు లెంతేని సరి చెప్పవచ్చు;
నైనఁగానిమ్ము, నామాత్మలోపలను
నేనెఱిఁగినపాటి యెఱిఁగింతు వినుము;
అంతట నొక్కనాఁ డనఘుండు వ్యాసుఁ
డంతరంగంబున నానందమొదవ
నరుదెంచి, వినతుఁడై యాసత్యవతికిఁ
గరమర్థిఁ బలికె నేకాంతంబునందు :
" అరివ, యీసంసార మతిచంచలంబు ;
మఱఁదలంపఁగ నెండమావులయట్లు
జలతరంగములట్లు సంపదలెల్ల ;
నలిఁదలంపంగఁ బ్రాణములస్థిరములు ;
కాయంబు విద్యున్నికాయంబు తెఱఁగు ;
ప్రాయంబు లటు కతిపయదివసములు ;

1. దుఃఖంబిఱి. 2. నుంతు. 3. గట్టింటి. 4. కీర్తిత. 5. హరము. (మూ)

గతకాలమే మేలు కమలదళాక్షి!
గతము [1] సౌఖ్యము వచ్చుకాలంబుకంటె.
కురుకులేశ్వరుపెద్దకొడుకు దుర్మార్గ
పరుఁడు, క్రూరుఁడు, మహాపాపమానసుఁడు;
వానితమ్ములు నట్టివారలు; గానఁ
బూని యాకురుకులంబునకుఁ జేటొదవు;
కరముగ్రముగఁ బ్రజాక్షయమును గలుగుఁ;
బోరిఁబోరి నేఁదలపోసిచూచితిని.
అనయంబు మఱి దాని నాంబికేయుండు
ననుభవించెదుఁ; గాని, యట్టి [2] కార్యములఁ
జూడక యిఁక వీరిచోటుచాలించి,
కోడండ్రఁదోడ్కొని, గురుబుద్ధితోడ
సుడియక విదురభీష్ములకెఱింగించి,
యడవులఁ దపముసేయఁగ నేఁగుమమ్మ!
తపముననఁగాని, యెంతయును వేఱొండు
ఉపమల గతియుండ దూహింప." యనుచు
నల్లనబోధించి, యంత వ్యాసుండు
తల్లిని మఱఁదండ్రఁ దపమునకనుప,
నరయ నమ్మునియాజ్ఞ నతివలు భక్తి
పెరవొప్పఁగాఁ దపోవేషంబుదాల్చి,
దారుణాటవినుండి తమతపోమహిమ
వారు ప్రాపించిరి వైకుంఠపదము.
ధృతరాష్ట్రుఁడిట నెల్లదిక్కులనృపుల
కతికయప్రథవాయతఁ బెచ్చుపెరిగి,
'తనయులు, నాపాండుధరణీశసుతులు'
ననియొడుభావంబు లాత్మలో లేక

---

1. సౌఖ్యం. 2. కారణము. (మూ)

'కొడుకులు నూటయేగురు నా' కటంచు
నడనడ వాడుచు నెందు నేపుటలర,
పెద్దగద్దియమీఁదఁ బేరోలగమునఁ
దద్దయుఁ బ్రియముతో ధర్మనందనునిఁ
దొడలపై నిడుకొని, దొరయ ధర్మంబు
లడుగుచుఁ గాచకార్యంబు దీర్చుచును,
భీమార్జునులలాఘవ పేర్మిమైఁ గడఁగి
వేమఱు ఘనశత్రువిజయంబు [1] గనుచు,
నకులుని సహదేవు ననఘుల చెంత
నకలంకమతికి [2] నందంద మెచ్చుచును
బాండునివహాలుగాఁ బరికింపుచుండె.

## బాల్యక్రీడలు, అసూయాంకురప్రాదుర్భావము

పాండుసూనులఁగూడి బాల్యంబునందు
దుర్యోధనాదులు తోడఁబుట్టువులు
గాంధారిమిత్రులై కనుఁబొత్తుగూడి,
సాముచోఁ జదువుచో జలకేళిచోట
వేమాఱు విలువిద్య వెసనేర్చుచోట
నిద్దఱిద్దఱుగూడి రోక్రియనైన
నుద్దులమనుచుఁ బెన్నుద్దులమనుచు
బయలుళుల నుప్పఁబట్టిలాడుచును,
బ్రియమునటించుచుఁ జేరులాడుచును,
దీపు [3] వుట్టఁగ బిల్లదీపులాడుచును,
గోపురా నొడ్డసకోపు లాడుచును,
ఏటిలోతునఁజొచ్చి యీఁదులాడుచును,
[4] ఏటిపారవుమ్రాఁకు లెక్కియాడుచును,

---

1. నగుచు. 2. నానందమిచ్చుచును. 3. బుట్టుచు. 4. ఏంభారము. (మూ)

బెరయ నొండొరుఁబట్టి పెనఁగులాడుచును,
దరమిడి [1] తగులునఁ దాఁకులాడుచును,
మఱియును శిశువులు మహి వేడ్కవుట్టి
నెఱి నాడుదెఱఁగులన్నియు నాడుచోటఁ,
బవనసూనునకోడి, పార్థునకోడి,
కవలకుఁ బాండవాగ్రజునకు నోడి,
ఓడినకోపాగ్ని నల్లంబుగమరి,
యాడినపంతంబులన్నియుఁ దప్పి,
యనిలసూనుఁడు దమకధికుఁడై యున్నఁ
గనుఁగొనఁజాలక, కడు [2] నిగ్రహమున
నఁటఁదెలియక, యాసుయోధనుఁడు
మంతనంబున మేనమామకిట్లనియె:
"సులభసాధ్యులుగారు చూచితే శకుని!
బలవంతులెంతయుఁ బాండునందనులు;
వారిలోపలనెల్ల వాయునందనుఁడు
వారనికడిమి దుర్వారతేజుండు;
మూర్తిమంతుఁడు; వీని మును జంపకున్న
ధార్తరాష్ట్రులకెందుఁ దలలెత్తరాదు
పగవానిఁదెవులును బ్రబలకమున్న
తెగఁజూడకుండినఁ దెగునుగార్యంబు.
ఇందఱుఁజూడంగ నెకసక్కెమునను
బొందేది మారుతపుత్త్రుండు మమ్ము
సిరుమూపులెక్కించి యీఁదుచు, నడుమఁ
బరిహాసగతిముంచుఁ; బ్రార్థింపవిడుచు.
చలమున నేము వృక్షములెక్కఁ జూచి
'ఫలములఁదెండు కప్పములు నా' కనుచుఁ,

---

1. తగ్లిన. 2. సంభ్రమమున. (మూ)

దనకురాల్పకయున్నఁ దరువులుపట్టి
పనివడి భీముండు పడరాల్చు మమ్ము.
పెక్కేల! యర్జునుపిడికిలి పీడ
నొక్కలేమైతిమి నూర్వురుఁగూడ.
నోగలఁడుధర్మసూనుఁడు ; [1] వాడు కొయ్యఁ
దగవు చెప్పినయట్లు దండించు మమ్ము.
ఏపదార్థంబైన [2] సమ్ములోసమ్ము
చూపుదిప్పక దాఁచి చూపకయున్న,
నట్టి వివేకులో ! యేలెంచి కవలు
పట్టిచూపుదు ; రిట్టిబలియులుగలరె !
కన్నార ధర్మజుఁగన్నకన్నులకు
నన్ను రాజన నేలనమ్మికపుట్టు !
అటుగాన, నేయుపాయంబులనైనఁ
బటువృత్తిఁ బవనజుఁ బరిమార్పవలయు.
వాఁడొకఁడీల్గిన వారిలావణఁగుఁ ;
బోఁడిగా నేలుదు భువియెల్ల నేను."

### దుర్యోధనుఁడు భీమునిఁజంపఁ దివుఱుట

అన, వానిఁదెగటార్ప ననువు చింతించి
పనిచినఁ, గురురాజు పవనజుఁ దొలుత
జలములు తనులోన జల్లుపోరాడి
యలసి నిద్రించినయాసమయమునఁ
బట్టించిసంధులు, బలువుకంబమునఁ
గట్టించి యొకనాఁడు గంగఁద్రోసినను,
మునుఁగుచు నడుమ భీముఁడు నిద్రదెలిసి,
తనువుననున్నబంధముతోడ [3] విల్లి-

1. సాదు. 2. విఱుడుతో. 3. గిల్లి. (మూ)

వెడలివచ్చిన, వాని వేగ నీక్షించి
కడులజ్జఁబొల్పడి కౌరవేశ్వరుఁడు:
‘జలధిముంచిననైన సర్వేశ్వరుండు
గలుగునాయుష్యంబుగలవాని’ కనుచు
బలిమి వెండియు నొకపాములవానిఁ
బిలిపించి, పూజించి, ప్రియములు సెప్పి:
“బ్రహ్మమంత్రములైన బలిమిఁ గైకొనని
జిహ్మగముల నీవు చిక్కించి తెచ్చి,
కఱపించి చంపుము ఘనుభీము నేను;
నెఱపించు నాతండు వేమాఱుసుమ్ము.
పవమానుఁ గ్రోలెడు పామునోళ్లకును
బవమానసుతుఁ డెంత పట్టిచూడఁగను!”
అనుటయు, నొడఁబడి యహితుండొకండు
ననిలజు నిద్రించునావేళఁ గదిసి,
యుండియు నందని యాహారనియతిఁ
గుంద భీకరవిషాగ్నులఁ బొరయుచును,
గతకాల మెవ్వరిఁ గఱచుటలేక
పుతపుతవోయెడు తోసినోళ్లమును,
మొఱయుచు రోఁజేపాములచేత గఱపఁ
గఱపింపఁగాఁ, [1] బల్లుగాఁడక యుపియుఁ
దఱగొప్పఁ జీమలు తేనియ [2] గుడిచి
గఱవనోపక [3] పాఱుగతిఁ బాఱఁదొడఁగె.
అంత మెల్లనఁజూచి యావజ్రతనుఁడు
పంతపుఁబాములఁ బట్టి చెండాడి,
యుక్కెఁ బాములవాని నుదికినట్లుడికి,
సర్వకారతనుండె. నెఱి మఱునాఁడు

---

1. కొల్లగాండ్ర. 2. కుడువ. 3. పారు. (మూ)

అమరారి తొల్లి ప్రహ్లాదునిఁ జంప
నమరి యత్నము చేసి యలసినట్లలసి,
యట బాలశశిఫాల నడబాల బాలఁ
గుటిలకుంతలఁ బిల్చి [1] కొంకకిట్లనియె :
" పడఁతిరో ! శిలమాఱుఁ బవనకుమారు
నడఁపవే ! యొక్కమాఱ [2] తిశోకమాఱు ;
వడ్డించునావేళ వానియన్నమున
జిడ్డుగా నొకకొంత చిలుకవే విషము.
నీవు [3] పెట్టినకూడు నిజమని కుడుచు ;
నేవెంట నాకును హితముచెప్పు.
అతనిఁ జంపినఁ జత్తురఖిలపాండవులు ;
క్షితియెల్ల నాకు నిచ్చినదాన [4] వాదు. "
అనుటయు నొడఁబడు నాయడబాల
యునికిని మునుపె యుయుత్సుండెఱింగి,
వారివాఁడయ్యును వాయుజుతోడ
నారీతి యెఱిఁగింప, నతఁడాత్మఁగొనక
యడబాలయిడిన విషాన్నంబు గుడిచి,
యదరి రుద్రునిరీతి నఱిగించుకొనియె.
ఈరీతి భీముని నెల్లమార్గముల
వారక గరళంబు వసుఁబెట్టించి,
నిద్రింపఁ బాముల నెఱిఁగఱపించి,
క్షుద్రుఁడై గంగలో నుడివడఁద్రోసి,
యేయుపాయంబుల నేచి వాయుజునిఁ
గాయక చంపునుపాయంబు లేక,
తఱివేచి యాసుయోధనుఁడు పాండవుల
నెఱిమాఱఁ జెఱుపఁ జింతింపుచునుండె.

---

1. రాండ. 2. తశోకమాం. 3. చెప్పిన. 4. వీవు. (మూ)

## కృపాచార్యుల వృత్తాంతము

అంతఁ, గృపాచార్యుఁడను విప్రధన్వి
కాంతాసమేతుఁడై కాంతిమిన్నంది
యరుదేరఁగా, భీష్ముఁడతనిరావించి,
[1] పురువంశవిధుచేతఁ బూజచేయించి :
" యెవ్వరుమీరు ? మున్నచ్చోటివార ?
లివ్విల్లు మీచేత నెంతయునొప్పు ;
నెఱుఁగుదురా దీనినేమైన ? " ననినఁ
జిఱునవ్వుదళుకొత్తఁ జెప్పెనాకృపుఁడు :
" నరనాథ, గౌతమునకు నహల్యకును
శరచాపహస్తుఁడై జనియించినట్టి
వీరుండు మాతండ్రి విను [2] శరద్వంతు ;
ధారుణి నతఁడుగ్రతపము సేయంగ,
శతమఖుఁ డంతలోఁ జింతింపఁదొణఁగె : (?)
" ఇతఁడు కైదువుతోడ నిలఁబుట్టి తొలుత,
నటమీఁదఁ దపముసేయఁగఁ జొచ్చె ; దీన
నెటుపోనిపుట్టునో ! యిటు నమ్మరాదు ;
ఇంతట మాన్పెద నీతపం. " బనుచుఁ
జింతించి యప్సరస్త్రీలరావించి,
జలపదియనుదానిఁ జక్కనిదానిఁ
బిలిచి, యచ్చెలువతోఁ బ్రియములుసెప్పి :
" తరుణి, గౌతమపుత్త్రుతపము విఘ్నంబుఁ
బొరయింపు ; " మని పంపఁ, బోయి యవ్వనిత
కలికి గాడ్పున మేను గందునోయనుచుఁ,
జిలుకజెంకెల నాత్మ చెదరఁగనోయనుచు,
వింతకావున దృష్టి వీఁగునోయనఁగఁ,
గాంతి మేదినిఁ గొంతగాఱునో యనఁగ, —

---

1. పురువంశనిధి. 2. 'శరద్వంతుఁ'డని సర్వత్ర. (మూ)

సిగ్గులు నగవులుఁ జెనకుచూపులును,
నగ్గలికలు నేర్పు లలసయానములు,
మెలపులు గరిమలు మెచ్చుకుండుటలుఁ,
చెలువములు బలములుఁ జడిముడిపడఁగఁ,
గుచములుఁ గచములుఁ గునిసియాడంగఁ,
బ్రచురమై రత్నహారము లొయ్యఁ దూలఁ,
గంగణఝణఝణత్కారంబు మెఱయ,
నంకించి యందియ లల్లన మొరయ,
విడువక చిఱునవ్వు వెన్నెలగాయ,
నడుమసియాడంగ నడతెంచి వచ్చి,
యోడక నిగిడి యమ్మోహి కట్టెదురఁ
బాడిన, శృంగారభావంబు పుట్టి
యుల్లంబునుల్లంబు నొక్కటియైన,
ఝల్లన మదనరసంబు నెట్టవిసి
ధారాప్రవాహమై తపసికి వెడలి,
యూరక శరముపై నొలికి రెండయ్యె.
అందు నేమన నొక్క యాఁడుబిడ్డయును
ఇందువంశాధీశ, యేలమిఁబుట్టితిమి.
ఆమెడ మాతండ్రి యచ్చోటువాసి
పోయె ; దేవస్త్రీయుఁ బోయె నద్దివికి.
అంత, వేఁటాడుచు నటవచ్చివచ్చి
శంతనుం డేమున్న చందంబు చూచి
కొని తెచ్చి పెనుచుచోఁ, గొంతకాలమున
కనఘుండు మాతండ్రి యట మమ్ము వెదకి
చనుదెంచి ‘వీరు నాసంతాన’ మనుచు
మనుజేంద్రునకుఁ జెప్పి మముఁగొనిపోయి,
కృపుఁడను పేరును గృపియను పేరు
[1]నృప, మాకొనరించి నెమ్మి రక్షింప

1. నృపుఁడు మాకొనరించి. (మూ)

నేర్చితి నతనిచే నిఖిలశాస్త్రములు ;
రాచచిత్రంబులు రానుండ నేర్తు ;
నేలిన మేలు ; నన్నేలుఁడు మీర ;
లాలంబులోన సహాయమయ్యెదను."
అనిన భీష్ముఁడుపల్కు : "నాచార్య, నీవు
ధనువు నేర్పుదుగాక ధార్తరాష్ట్రులకు.
'ఎవ్వరుగలరొకో యిచ్చోట' ననఁగ
రువ్వననచ్చితి రుత్తమోత్తములు.
వీరె కౌరవ్యులు ; వీరె పాండవులు ;
వీరె నానాదేశవిభుకుమారకులు ;
బాలశిక్షకు మీరు ప్రౌఢులుగాన,
నీశేఁతబిడ్డల కీడేర్పుఁ." డనుచు
భూమీశుననుమతిఁ బాలుపొంద నైదు-
గ్రామంబు లతనికి గ్రాసార్థమిచ్చి,
కరిముఖునకు [1] మోదకములు పెట్టించి,
కరిదంతముల విండ్లుఁ గనకలక్ష్యములుఁ
జక్కనిశరములు శస్త్రభేదములుఁ
జక్కనిజోళ్లు విచిత్రపుఁదొనలుఁ
జేయించి, చల్లనిశ్రీఖండతరుల
నాయతమగు శాల లాయత్తపఱచి,
యాచార్యులకుఁ జీర లాభరణములుఁ
దాఁచినసరతిఁ గన్నుతనియంగ నిచ్చి,
నృపకుమారుల నెల్ల నేర్వఁబెట్టుటయుఁ,
గృపకృపామహిమ మిక్కిలిగల్గి వారు
లక్ష్యంబులేయుచు, లలనాకటాక్ష
లక్ష్యంబులై హస్తలాఘవంబొప్ప,

---

1. మోదకములెక్కించి. (మూ)

నూనెదట్లును మొలనూళ్లును బిగిసి
మేని క్రొమ్మించులు మెఱయు, నిత్యంబు
నభ్యసించినవిద్య లాపగేయాది
సభ్యులముందఱఁ జక్కఁజూపుచును,
మక్కువ నందఱు మహిమతో నప్పు
డక్కజంబుగ నేర్పులమరఁ జేయుచును,
జాపశిక్షాప్రౌఢి చాతుర్య గరిమ
యేపారఁ జెలఁగించి యెలమి మించుచును,
దమలోనియాగ్రహతవు నొక్కనికిని
సమచిత్తులై శాంతి చాల నేర్పుచును,
ఓర్వలేకందులో నుగ్రించునతని
నుర్విఁ గృపాచార్యు కొనరఁ జెప్పుచును,
జెప్పిన గురుమూర్తిశిక్షలకలికి
ముప్పిరి నందఱు మొగినొక్కటగుచు,
నూఱటయగువేళ [1]నబుసుపోకకును
బాగులువీక్షింప బాల్యంబుగానఁ
జెలువుగా ముత్యాలచెండుగట్టించి
కలసియాడుచు, మిన్నుగాఁడ నేయుచును,
వ్రేసినఁగ్రుంకిడి వెసఁ జెండుగొనుచు
డాసి క్రమ్మఱలేచి డాసిపోవుచును,
వెనుకొని వ్రేయుచు వెస నుర్విప్రాలు
ఘనకందుకముఁ బాటిగ్రక్కనఁగొనుచు,
నారీతి వైచుచు నటునచ్చుచోటఁ
జేరి పైపైఁబడి చేతులొగ్గుచును,
నెవ్వనిచేఁజొచ్చె నింతలో వాఁడె
దవ్వుగా నిందఱదాటిపోవుచును,

1. ఉబ్బసపోక. (మూ)

‘గూడ నెవ్వఁడుపాఱి కూడిన వాఁడె
యీడువానికి’ నని యిట్లన్నకొనుచు
నాడుచో, నొక్కనాఁ డా మేటిచెండు
మేడలపైఁ బాఱి మిద్దియలెక్క
పరిపూర్ణసితకరప్రభ లుల్లసిల్ల
నురవడి మెఱయుచు నొప్పార నదియు
వాటుకందక వచ్చి వడి నప్పురంబు
కోటవెల్పల వడిఁ గూపంబులోనఁ
బడిన, నందఱుఁ జెందుఁబట్టి రాఁదివియ
నోడఁగూడమికిఁ జూచుచుండిరి కూడి.

### ద్రోణుఁడు నూతఁబడిన కందుకము నుద్ధరించుట

అంత ద్రోణాచార్యుఁ డాలును దాను
సంతానతిలకు నశ్వత్థామఁ గొనుచు,
నిలుగుజన్నిదములు నీర్కావి [1] దోత్ర
మలికంపుఁగీలొక్కప్పు సరపగడ్డంబు,
పెడఁదవక్షంబును విల్లునమ్ములును
[2] మెండపెంపునడరించు మేలుపచ్చడము
నందంద చూపట్ట నచటికివచ్చి,
యుందఱిదీవించి, యానూతిలోని
ఫణిఫణారత్నప్రభాభాసమాన
మణికందుకముఁ జూచి మందహాసమున
నిందఱనిట్లను: “ సిదియేమి! మీర
లిందువంశపురాజు! [3] లెంతకు లేరు!
కృపుఁడఁటె మిమ్ము శిక్షించెడిగురువు!
కృపసేయఁడయ్యెనో కృప నిట్టిపనికి!

1. దొల్లుగ. 2. మెండపంపులడరించు మేరుపచ్చడము. 3. లిందుఱుసేర. (మూ)

కానవచ్చినసొమ్ము గైకొనలేర!
కానక్కడివారు ఘనశస్త్రధనము
భరమున నీబావిఁబడినకందుకము
వెరవునఁగొనలేక వెడఁగులైయునికి
పౌరుషంబగునయ్య పార్థివావలికి!
నేరరే దీనికి నిజ మొక్క వెరవు?"
అనిన, నాతనిఁజూచి యందఱిట్లనిరి :
"చనునె! నీకిట్లాడ జగతీసురేంద్ర!
పాతాళవివరంబుఁ బలె నున్ననూయి
భేతాళుఁడైనను భీతిల్లుఁజొరఁగ.
చొచ్చిన వెడలెడుచొప్పెందులేదు ;
పుచ్చనేరము ; మాకుఁ బుచ్చియా మీకుఁ
జొప్పడనైనను ; జూతమా వెరవు!
ఒప్ప నెంతయు దీని నొగిఁ దీసియిమ్ము
నీవిద్య". ననుటయు, నృపకుమారకుల
భావించి ద్రోణుఁడుద్భటవృత్తిఁ బలికె :
"గురుఁడవిద్యలకెల్లఁ ; గోదండగురుడఁ ;
బరికింపుఁడీ నన్ను బటుబుద్ధులగుచుఁ ;
పాయుఁడందఱు". నని బాణంబు వింట
ధీయుక్తిసంధించి, దృష్టిసంధించి,
చెందు నాటఁగనేసి, చెలఁగి వేఱొక్క
కాండ మక్కాండపుంఖమున నాటించి,
యాతూపునకు నొక్కయస్త్రంబుఁజొనిపి,
యాతూపు వేఱొక్కయలుగుననాటి,
యాయమ్ముపింజేయు నట గాఁడనొక్క
సాయకంబున నేసి [1] సరవిదీపింప,

---

1. సరస. (వ్రా)

వెండియు నీరీతి విశిఖంబులేసి
కాండరజ్జువుచేసి, కలశసంభవుఁడు
ఈఁతనీళ్లమునింగి యేర్పడకున్న
నూతిలోపలిచెండు నుతగతిఁ దిగిచి
యిచ్చిన, వెఱఁగంది యిందువంశేంద్రు
లచ్చాపధరవర్యు నర్థితో మెచ్చి,
హర్షాద్భుతాక్రాంతులై కుమారకులు
శరగురుఁదోడ్కొని సరవినాచెండు
వడిగ్రుచ్చి పదిలమై వదలింపరాని
కడుకాండరజ్జువుఁ గైకొని వచ్చి
ధృతరాష్ట్రుకొలువులో దేవవ్రతాది
హితులముందఱఁ బెట్టి యెంతయుఁ జెప్ప,
సంతోషచిత్తుఁడై శాంతనవుండు
సంతుష్టుఁ గావించి శరగురు నపుడు:
"వెదకనౌషధలత వెసఁ గాలఁ బెనఁగె;
ముదమారఁ గనుదవ్వ[1] నులుగుచు నేఁగి
యాడఁబోయినతీర్థ మచ్చోటి కపుడు
వేడుక నెదురైనవిధమయ్యె". ననుచు
వెనుకొని ద్రోణుని వేడ్కఁ బూజించి:
"యనఘాత్మ, మీ రెవ్వ రానతీయావె!
అఖండపరశువో! యాఖండలుఁడవో!
యేఖండమునఁ గాన మింతటివాని;
నెచ్చోటనుండుదు? రేదిమీనామ?
మిచ్చోటికే తేర నేమికారణము?
వినవేడ్కయయ్యె మీవృత్తాంత." మనినఁ,
దనకునిచ్చినగద్దెఁ దగనుండి యతఁడు:

---

1. మునుగుచు. (మూ)

## ద్రోణాచార్యవృత్తాంతము

"వినవయ్య, మునిగోత్రవిఖ్యాతుఁడనఁగఁ
దనరుభరద్వాజతనయుండ నేను ;
నా పేరు ద్రోణుండు ; నరలోకవినుత !
యేపార విలువిద్య యెఱుఁగుదుఁ గొంత.
నరతనూజాతుఁ డశ్వత్థామయనఁగఁ
బరఁగునీతని పేరు పార్థివ, వినుము.
శీతల జాహ్నవీ సింధు సంగమున
మాతండ్రి యొకనాఁడు మజ్జనంబాడి
యచ్చోటవీక్షింప, హావభావములఁ
బచ్చవిల్తునిదీమొ ! పసిఁడిపుత్తడియొ !
మొనసిన మెఱుఁగుల మొత్తమొ ! కాక,
తనరారు లావణ్యధామమో ! కాక,
దాఁచినవేడ్క ఘృతాచినా నొక్క
ఖేచరి తనజలక్రీడకువచ్చి,
మునిఁగిలేచినదివ్యమునిఁ గిరవర్ణ
ఘనుని భరద్వాజుఁ గాసిఁజేసి
వలువూడ్చి ధరఁబెట్టి వారిలో నుఱికెఁ,
..........................
గదళికాకాండయుగ్మముఁ బోలు తొడలుఁ,
బదములకెంపులు భవ్యదీధితులుఁ,
దెగగలకన్నులు దృష్టించి యలరి,
తగుతర్పణంబులతిరవాఱు మఱచి,
నియమింపనరిదైన నిజవీర్యధార
భయమున భూమిపైఁబడనీక యపుడు
తొడఁగి తాఁదెచ్చినద్రోణంబులోన
నిడఁగఁ, బుట్టితినందు నే ద్రోణుఁడనఁగ.

వీర, యేనిదియుద్భవించిన తెఱఁగు;
నారాక కిటువిను నాల్గుమాటలను.
పృషతుండునా నొక్క పృథ్వీశ్వరుండు
ఋషివేషధారియై ఋష్యాశ్రమముల
మెలఁగి, మాతండ్రితో 'మిత్రభావమునఁ
గలసివర్తింపుచు, ఘనుఁడొక్కనాఁడు
మిన్నేటిచేరువ మేనకాకాంత
పొన్నపూవులుగోయఁ బొడగాంచి సొక్కి:
'యెవ్వరొకో! చిత్ర మీపువ్వుఁబోఁడి!
నవ్వకనవ్వెడు నవకంపు మొగముఁ,
ద్రచ్చివైచినయట్లు తలచుట్టుఁ దిరిగి
వచ్చినగతినున్న వాలుఁగన్నులును,
గుంభికుంభక శాతకుంభకుంభములఁ
గుంభిస్పైఁబోలు కుచకుంభయుగము,
మరుఁడుజయంబంది మహిమఁబూరించు
కరశంఖగతినొప్పు కలికికంఠంబుఁ,
బసనిమించుల మించు బంగారువన్నె
పసిమిగల్గినయట్టి బాహుమూలములు,
సులభ [1] నిమ్నగభర్త సుడివోలె మించి
నలికమై యున్నట్టి నాభిరంధ్రంబు,
సలలితగతి నాకసంబునుబోలి
కలదులేదనువాదుగలిగించు నడుము,
మదనుసిశేరి సముప్రభఁ బొలిచి
[2] పొదలు సైకతమునుబోలిన పిఱుఁదుఁ,
గరికరంబులగెల్చి కదళికాతతులఁ
బారపొచ్చెములు సేయఁబూను పిన్దొడలు,

---

1. నిమ్నగ. 2. పొదిపైకతము. (మూ)

వరుణాంబుజమ్ముల కప్పులీఁజాలు
నరుణిమ మించిన యడుగుఁదమ్ములును,
గ్రొన్ననలకుఁబోక కొదమతుమ్మెదలు
తన్ను గొల్వఁగనొప్పు తనుసౌరభంబుఁ
గలిగియున్నది; దీనిఁగనిన నాయొడలు
గిలిగింతలెసఁగెడుఁ; గృత్యమేలింక!'
యనిచూచి, మఱిచూచి, యందందచూచి,
తనకు భరద్వాజుఁ దరవాయిఁ వచ్చి,
మగువఁ జెందిన చూడ్కి మరలంగఁదివియఁ
దగువచాలక చిక్కి ధృతిమెల్లఁదూలి,
కడిమిమై నురుచేతిఁ గరవాలులీల
బెడఁగుగా జళిపించు పేర్మి దీపింపఁ
[1]కల్హారదళనేత్ర కడకంటిచూడ్కి
యొలసిముట్టినచిత్త ముత్తలంపడఁగ,
నతిమతి సూనాస్త్రుఁడను వేఁటకాఁడు
తెలివిరూపంబను దీమంబుఁ జొనిపి
కలకంఠి లేఁజూడ్కి గములను నురుల
నెలయింపఁ దగిలినయిఱ్ఱియుఁబోలెఁ,
దొలఁగఁజొప్పడక యందుఱి తొట్రుగొనుచుఁ,
దలకొన్నకలఁకతోఁ దగ నిల్వలేక
మదనాంబువొలికిన, మహి నదిచూచి
తుద కాలఁ బృషతుండు త్రొక్కెఁ; ద్రొక్కుటయు,
ద్రుపదుండుపుట్టె; నాద్రుపదుండు నేను
నుపమింప వయసున నొక్క పెద్దలము.
అంత, నాతఁడు పుత్త్రు నచ్చోట నునిచి,
శాంతిమైఁ దొంటిపాంచాలభూములకు
రాజుగాఁబోయిన, రమణ నిర్వురము
నాజన్మసఖులమై యయ్యాశ్రమమునఁ

1. కలహార. (మూ)

బెరిగితి ; నింతలోఁ బృషతుండు చావ,
సరి రాజ్యమానని చని ద్రుపదుండు
పాంచాలభూమికిఁ బ్రభువుగాఁ జనుచు
డించి [1] పోలేకూఁ డడించి నన్నపుడు :
"ద్రోణ, నీవును నేను దోడ్తో నగ్గలసి
ప్రాణంబులేకమై బహుకాల మిట్లు
ఎడమడు వొక్కింతయేనియు లేక
యుడివోనికూర్మితో నుంటి మిన్నాళ్లు.
రమణమై [2] నొంటి నే రాజ్యభారంబు
గ్రమమున భరియింపఁ గారణం బేమి!
భాసురంబగు రాజ్యభాగంబు నేను
భూసురాగ్రణి, నీకుఁ బొసఁగ నర్పింతు.
మిత్రునభ్యుదయంబు మిత్రుఁ గోరఁగఁ
బాత్రంబుగావున, బంధుయుక్తముగ
నవయ నేటికి! నమ్ము నా పెంటరమ్ము ;
నవరింతు నిన్ను నే సకలభోగముల.
రసికత నిటనుండి రానొల్ల వేని,
పొసఁగినప్పుడె రమ్ము పూజింతు నిన్ను".
అనిపోయెఁ ; బోయిన, నచ్చోట నేను
ధనువు నేర్చెదనని తలఁపులోఁ బుట్టి
యగ్ని వేశుండను యమిచంద్రునొద్ద
నాగ్నేయసాయకంబాదిగా నెఱిఁగి,
విలువిద్యలందలి వివిధకృత్యములు,
నొలసిన బహువిధ వ్యూహభేదములు,
నమ్మహాముని శిక్ష నాయుధాభ్యాస
విమ్ముల నెఱిఁగి నే నెలమి దీపించి,

1. పోక. 2. నిట. (మూ)

కృపునిసోదరి సంతఁ గృపియనుదానిఁ
[1] తపనీయ కమనీయ తను నొయ్యనడిగి
పెండ్లియాడితి ; వీఁడె బిడ్డండునాకుఁ ;
బెండ్లి ప్రాయంబయ్యెఁ ; బేద కాపురము ;
[2] సర్వాంగములఁ జూవె జనియించెఁ గొడుకు ;
సర్వశాస్త్రంబులఁ జతురుఁడెంతయును.
ఇరువుర రక్షింప నేనోడి యుంటఁ,
బరశురామునిఁ బోయి పరఁగి వేఁడినను,
అతఁ : "నేను [3] ధనములు, నవనిచక్రంబు
హితమతి విప్రులకిచ్చితినున్న ;
యస్త్రంబులిత్తునో యర్థంబు మాఱు !
శాస్త్రజ్ఞ, యాగమును చాలినవన్ని.
ఇరువదియొక్క మాఱేచి రాజులను
బోరిఁగొంటి నవియేవి పొల్లులుగావు".
అనిన, శిష్యుండనై యారాముచేత
జననాథ, గాంచితి శస్త్రాస్త్రవిద్య.
అదిగాక వినుము, మొకయుయుగారి యొద్దఁ
జదువ నశ్వత్థామఁ జదువంగఁ బెట్టఁ,
దనతోటిబాలురఁ దానును గూడి
పనిగొన నక్షరాభ్యాసకాలమున
గురువుచే నంపింపుకొని యిండ్లకేఁగి,
స్థిరమతితో నాగు క్షీరాశనంబు
భుజియింపఁగాఁ జూచి బుద్ధిలోవగచి,
భజన నశ్వత్థామ పల్కెంచి, తనకు
వారారగించు సైవడిఁ బెట్టుమనుచు
ధారుణి మముఁ బెద్దతడవు ప్రార్థింప,

---

1. కమనీయ తపనీయతనను నొయ్య నడిగి. 2. సర్వాంకయును. 3. ధనువును. (మూ)

నప్పుడు లేమనునంధకారంబు
గప్పిన మదిలోనఁ గడుఁదత్తరించి,
కాఁగిటఁగదియించి కన్నీరు దుడిచి,
మూఁగినవగలతో ముద్దుపాపనికిఁ
బాలెందులేమికి భావించి వగచి:
"పాలకై నాల్గేనుపాఁడికఱ్ఱలను
పాంచాలుఁడొసఁగఁ బాలుపూలెసిన! -
'పంచియిచ్చెద రాజ్యభాగంబు నీకు'
నని బాల్యమునఁబల్కె నతఁడుమాతోడ;
మనమున నామైత్రి మఱవంగఁగలఁడె!
ఇల పంచియీకున్న నీమైత్రమైనఁ
గలిమిలో నొసఁగఁ గడవఁజాలెడిన!
బలిమి నాచెలికాఁడు పాంచాలవిభుఁడు
చెలువార రాజ్యంబు సేయుచున్నాఁడు;
కోరినంతర్థంబు కొదవడకుండ
కోరననిచ్చు నేఁడో యొదఁగాక".

### ద్రోణుఁడు ద్రుపదుచే నవమానితుఁడగుట

అనిమదినూహించి, యతివయు నేను
దనయునిఁదోడ్కొని తగు ప్రయాణములఁ
బోలఁ బొందఁ గాంపిల్యపురికి నేతెంచి,
పొలఁతినొక్కెడనుంచి పోవుచో, నెదుట
మణికిరీటోజ్జ్వల మకుటవర్ధనులు
ప్రణమిల్లి వినతులై బహుభంగిఁగొలువ,
[1]ఖండనాధ్యక్షు లప్రతిహతబలులు
దండనాయకులు నుద్దండతఁ గొలువ,

1. ఖండనాధ్యక్షులై ప్రతిహతబలము. (మూ)

సందడి దొలఁగఁగ జడియుచుఁ గదిసి
యందందుఁ బటువేత్రహస్తులు గొలువ,
నుడుగని మదధార నుజ్జ్వలంబగుచుఁ
బొడవైన కొండలఁబోలు కుంభినులుఁ
గడిఁదిసజ్రముక లై గాడ్పునకంటె
బెడిదమై జవములఁ బేర్చునశ్వములు
సరవిమైఁ జూపట్టె సమరాళికసురి
యిరుదెస మొత్తమై యిమ్ములఁ గొలువ,
మెఱుఁగారు తొడవులు మించు లేఁదొడల
నిఱుపేదనడుముల నిడిక్రిక్కిఱిసి,
కడుమించుకుచములఁ గంబుకంఠముల
సుడిబోలునాభుల సొబగుఁ బల్కులను
గమలాకరంబులఁ గాంతిఁ గేడ్పఱచు
విమలాననంబుల వెసఁ దర్కింగ నగవుఁ
గుటిలాలకంబులఁ గొమరు దీపించి,
పటువైన మరుచేతి బాణంబులనఁగఁ
బొలుపారి పిలసిల్లు పుష్పకోమలులు
లలితోజ్జ్వలాకార లావణ్యవతులు
కరకంకణంబులు గదిసి ఘోషింప
సరసత్వమునఁ జేరి చామరలిడఁగ,
దివ్యభూషణ మణిదీప్తులు వెలుఁగ,
భవ్యపుష్పంబులు భవ్యగంధములుఁ
గ్రమమున ధరియించి, కనకాసనమున
సమరేంద్రువైభవంబలరఁ గూర్చున్న,
నుపకార మీకేళ నొదవు నాఁటి నుచు
ద్రుపదునొద్దకుఁబోయి దుఃఖంబు ద్రప్పి :
" చెలికాఁడ, నీవాఁడుఁ జేపట్టినన్ను ;
నలఁగి వచ్చితిఁ ; జూమునాకుటుంబమ్ము !

నా పేరు ద్రోణుండు నరనాథచంద్ర,
యేపున నాకోర్కె యిచ్చి మన్ననుము.
పాలుద్రావెడి తోడిపడుచులఁ జూచి
బాలుఁ డశ్వత్థామ పాలు వేఁడినను,
నీయాన, వరిపిండినీళ్లలోఁ గలిపి
చేయార నత్తుము చెప్పెడి దేమి!"
అనవిని ద్రుపదుండహా! యనినవ్వి,
తన రాజ్యమదమునఁ దగవేరి పలికె:
"ఎక్కడిచెలికాఁడ! నేపుఁ రాక!
యెక్కడికరుదేర! నిదయేమిపాటి!
బిక్కవు నీవెట్లు! ప్రభువ నేనెట్లు!
వెక్కిరించెడువారి నిక్షింపవైతి!
కుంచెడు బియ్యంబుఁ, గూరకట్టయును,
బంచాంగపఠనంబుఁ బ్రాప్తంబు నీకు.
ఎన్నఁటిచెలికాఁడ! నేనాఁటివాఁడ!
వెన్నరాతిర మేడ! [1] నీతర మేడ!
నాసరివాఁడవే! నాతోడి చెలిమి
రూపరింపక చేయ నర్హులో ఁలవు!.
వెనుక నెన్నఁడు నిన్ను విని యెఱుంగఁ;
గనియును నెఱుఁగమే! కాఱులాడెదవు;
కాన, నిప్పుడు రాచకార్యంబు గలదు;
బానొప్ప నెందైనఁ జయ్యనఁ జనుము.
చెలికాఁడవట్టెతి! చెప్పెడిదేమి!
కలలోననైనను గడసి నీతోడ
భాషించియెఱుఁగము; పాఱుమాలుదురె! -
పోమఱికిట్లాడఁబోలున విప్ర!

1. నీవనునదేవ. (మూ)

[1]“ లేమిచే నెన్నఁడు లేని దిచ్చుటకుఁ
గామించివచ్చితిఁ ; గల్లచేసితిని ;
వచ్చి యీతనిచేత వాసివోవలసెఁ
జెచ్చెర నేను జేసినకల్లవలన.
తలఁప, నిట్టిద కాదె ! ధనహీనుఁడైనఁ
దలిదండ్రులొల్లరు తనయునినైన.
ధనవంతుఁడైన నాతిలివానినైన
వినయంబుఁ బ్రియముఁ గావింతురు ప్రజలు.
‘ధనము చుట్టరికంబు ; ధనము ధర్మంబు ;
ధనమె రూపంబును ; ధనమే కులంబు.
అదిగాన, ధనములేదనుచు వచ్చినను
వదలక నన్నేల వాఁడు గైకొనును !
కాన, దీనికిఁ [2] బ్రతీకారమ్ము నేను
బూనిసేయక యున్నఁ బొందునే యెలమి !
వీనిమాటలు నమ్మి [3] యిష్టుండ ననుచు !
నేనేల వచ్చితి నీనీచుకడకు !
బొంక నకోర్చి యీభూపాధముండు
గొంకక యిట్లాడెఁ గ్రూరవాక్యముల.
పుడమీశులను నమ్మఁబోల దేభంగిఁ,
గడుపాపముల మూలకందంబులౌట ;
బహురాజ్యమదమను పానంబు గ్రోలి
యహరహంబును మత్తులై యున్నకతన ;
నెదిరిని దమ్ము నిమ్ముగఁ గాన్నఁడును ;
బాదలు జిహ్వాకు నీచభోగ్యంబులైన
యన్నమదంబున నంధత్వ మొంది
కన్నులఁగానరు గానిచందముల ;

1. లేమిచేనెన్నఁడు లేమియిచ్చుటకు. 2. ప్రతికార్యము నెలమి. 3. విష్కుండ ననుచు. (మూ)

ధనగర్వమునఁ జేసి ధర్మవాక్యములు
మొనసి పల్కఁగలేరు మూఁగలో యనఁగ;
విభవత్రిదోషంబు విననీదు చెవుల
నభినవశుభమూలమగు యుక్తకథలఁ;
బరికించి త్రొక్కఁగు బహుధనాంధత
[1] సారహీనులవోలె సన్మార్గపథము;
రాజుల నటుగాన రాదు నమ్మఁగను.
భూజనాధిపులన్న బొంకులపొత్తు;
అరయ దుర్గుణముల కట జన్మభూమి;
దురితంబులకుఁ బ్రోవదొలఁగ రెన్నఁడును;
వారలచరితలు వాక్రువ్వనేల!
ఘోరయ దారిద్ర్యమతి [2] కష్టవృత్తి;
కులజుఁడు, పూజ్యుండు, గుణనిధి, ఘనుఁడు
చెలువుండు, నుదారుండు, శిష్టవర్తనుఁడు
కర్తయు, భోక్తయు, ఘనతత్వనిధియుఁ,
కీర్తనీయుఁడు, మంత్రి, కేవలప్రభుఁడు
ననఁగాలు జగమునం దర్థవంతుండు.
జనులకు నాయర్థసంచయం బెడలి
కులమును విద్యయుఁ గోటిగల్గినను,
నలవున శూరత నధికుఁడై యున్న,
వెరవు మిక్కిలి యైన, విత్తహీనుండు
పురణింప జనులచేఁ బూజ్యుఁడు గాఁడు'.
అనునీతిమార్గంబు లవి శిష్టమయ్యె;
ధనగర్వమునఁ గాదె! దగిలి యాఘనుఁడు
అసమానమగు మైత్రి యాత్మఁ గైకొనక
వెస నన్నుఁ గిడాడి వెడలఁ ద్రోపించె!

---

1. చెర. 2. కష్టవృష్టి. (మూ)

ఇమ్మహాపరిభవ మేభంగి నోర్తు!
నిమ్మహీపతిగర్వ మేభంగిఁ దీర్తు!
తనువునఁ గాఁడిన దారుణాస్త్రముల
ననువున వెడలింప నానొప్పి యుడుగు;
మనమున నాటిన మర్మవాక్యములు
విను మెన్ని భంగుల వేదన చెడవు.
గర్వాంధుఁడగువాని గర్వింపఁజాలు
నిర్వాహమునఁ బల్కు నెఱిదీర్పవలయు.
తా నెందుఁ జివ్వకుఁ దగనుచేఁజాఁప;
మానక తనుదాన మాటవీడ్వడిన,
నరులెవ్వరును దన్ను నమ్మకయుండ
భరమునఁ దఱి వేచి భంజింపవలయు.
ఏరీతి వెడలింతు నీమనోవ్యాధి!
నేరీతి నీఁగుదు నీశత్రుఋణము!
అనివితర్కించుచు ననఘ, నామనను
ననుమానమొందుచు నలసి కుందుచును,
మదమెల్లనిఁకిన మదనాగమనఁగ,
నదలెల్ల నాఁగిన నర్తకుండనఁగ,
పటు[1]దండహతిఁ రేఁగు పాపఱేఁడనఁగ,
జటలెల్లఁ బెఱికిన సింగమో యనఁగ
లేమిఁ గంటెను జావు లేదుహా! యనుచు,
నామహీశునిసభఁ గల్లన వెడలి
వచ్చితి". ననిన భూవరుఁ గని భీష్ముండు
ఇచ్చలో సంతోషమునుగురోత్త ననియె :
“భావింప నేఁడు మాపాలిటిభాగ్య-
దేవతవై యేఁగుదెంచితిచ్చటికి.

---

1. దండ. (మూ)

పాంచాలపతిమాకుఁబగవాఁడుగాని,
మంచి మేలొనరించె మాయెడాతఁడును.
అతఁడాదరించిన నరుదే కుమారు ;
సుతులకు శరవిద్య చోద్యమె లేదు.
కినిసి చెప్పఁగ లేఁడు కృపుఁడు మోమోడి ;
ధనువునఁ దీర్పవే దయతోడ సుతులఁ ;
బ్రీతితో మీరుకోరిన కోర్కులెల్ల
నాతతంబుగ నిత్తు ననిశంబు మీకు."
అని చెప్పి ద్రోణున కాపగేయుండు
కనకరత్నంబులు, గంధవైభవము,
నెన్నికకెక్కిన హేమగ్రామములు,
సున్నపుమేడలు సొంపారునిండ్లు,
నరుగార నవరత్నహార కేయూర
వరభూషణాంబరావళు లాదిగాఁగఁ
బాఁడికఱ్ఱులనిచ్చి, పసిఁడి తేరిచ్చి,
[1] నాడెంబుగలరత్నహారంబులిచ్చి,
తరుణీమణులనిచ్చి, తనుపధ్యసింప
గురుమతినిచ్చెను గురుకుమారకుల.
అతఁడంతఁ గృపునిచే ననుమతివడసి
సితపక్ష [2] సితవార సితకరర్క్షముల
నందఱఁగూర్చి, విద్యారంభవేళఁ
బొంమగా భూపాలపుత్త్రులఁబలికెఁ :
" ఇందఱుఁగనుఁడు మీరు, లిందఱుఁబుధులు,
లిందఱు విలువిద్యయెఱిఁగినవిదప
నేనొకపనివుత్తు ; నెవ్వఁడేనిందు
మానినమతిఁ జేయనోపున నాకు !

1. నాడెల్లచెయు రత్నహారంబులిచ్చి. 2. శితవారశితకరర్క్షముల. (మా)

ఆపని నాచేతనగు; నైననేమి,
రూపింక మీకు నెట్లో చూత!" మనిన,
ధరణీశతనయులు తలలెత్తి వెఱచి
గురునితో నొక్కపల్కునుబల్క వెఱచి
యొండొరు మొగము లొండొండ చూచుచును
నిండారునిశ్చేష్ట నివ్వెఱగంది
యున్నచో, 'మీకోర్కెయొనరింతు' ననుచుఁ
గ్రన్ననఁ బలికె నాఖండలాత్మజుఁడు.
అప్పుడర్జును మెచ్చి, యతఁడు వారలకుఁ
జెప్పంగఁదొడఁగె నూర్జితచాపవిద్య.
చెలఁగుకుమారుల శింజినీధ్వనులఁ
గలఁగె వారాసులు; కంపించెగిరులు;
పదఘట్టనల భూమి పగిలినట్లయ్యెఁ;
బెదరె దిగ్గజములు సింహనాదములఁ.
గురుఁడంత నీరీతిఁ గురుకుమారులకుఁ
జిరగతి విలువిద్య చెప్పుచునుండ,

## ఏకలవ్యుని ధనుర్విద్యాభ్యాసము

నడరి హిరణ్యధన్వను చెంచురాజు
కొడు కేకలవ్యుండు కోర్కెదీపింప
నాకుమారులతోడ నతులితభక్తి
నారడకేతెంచి, యరయంగ నపుడు
కలశజుఁగాంచి సొక్కపుభక్తిమ్రొక్కి,
చెలువార సద్గురుఁజేరి యిట్లనియె:
"నీవేమికోరిన, నీకోరినట్లు
దేవేగనొసగెద విలువిద్యఁజెప్పు;"

మనుచు ... ... ... ...

... ... ... ... ...

దానును గురువుతో ధనువభ్యసింప
నానరేంద్రకుమారు లదియోర్వలేక :
"హీనజన్మునకేల యీమహావిద్య!
హానిపుట్టెడు వీని ననుపవే ద్రోణ!
సురలతో రాహువు సుధఁ గ్రోలవచ్చు-
కరణి వచ్చిన వీని గడపవే ద్రోణ!"
అనిన ద్రోణుఁడు వారియతులవాక్యములు
విని, బోయనీక్షించి నెంపొప్పఁ బలికె :
"వేదంబుసరి ధనుర్వేదంబు ; దీని
రాదు చెప్పఁగను ; గిరాతుండవీవు ;
కావున, నిది నేర్పఁగాఁజాల." ననిన,
భావించి యబ్బోయ పలికె నగ్గురుని :
"నీరూపురచియించి, నిన్నాత్మనిలిపి,
యారయ విలువిద్యలభ్యసించెదను ;
ఇప్పుడనుజ్ఞయు నిమ్ము నా." కనిన,
నప్పుడనుజ్ఞయు నతఁడిచ్చె వేగ
ననఘుఁడై యబ్బోయ నర్థిసంపుటయుఁ,
జనుదెంచి వాఁడొక్కశైలంబుపొంత
గురుమూర్తిమేనును గొమరొప్పఁ జేసి,
గరిడిలో విశ్వాసగతిఁ బ్రతిష్ఠించి,
దవ్వుల శిష్యుఁడై ధనువభ్యసింప,
నెవ్వరికింటె వాఁడెఱిఁగెను విద్య.
అటపల్క నరుని నేకాంతంబ గురుఁడు :
"పటుతరశౌర్య, నీపై వేడ్క నాకు
నేవమ్మె ; నాకోర్కె యెవ్వారు నేయ
నోపనితలఁపున నూరకుండినను,

నేను జేసెదనని యానన్న మాట
యూనియున్నది నాకు నుల్లంబునందు.
నిక్కము, ధనువున నీకంటె నితరు
లెక్కుడు లేకుండ నెఱిఁగింతు విద్య".
అని శస్త్రసంధాన, మస్త్రజాలంబుఁ,
దనుదాఁకు శరములఁ దప్పించు ననువు,
శత్రుని కోపప్రసాద చింతనము,
శత్రుని విలుఁ దేరు సమయించు ననువు,
నఁడు నందఱకందఁ ద్రైయుండు ననువు,
గొండిఁ గానఁగరాని గుఱి యేయు ననువుఁ,
బోరిఁ బెక్కుముఖములై పోరాడు ననువు,

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

మొగ్గరంబులు చించి మోఁదిరా ననువు,
నుగ్గుగా విఱిగియు నూల్కొను ననువు,
హల శూల ముసల ఖడ్గాదులఁ బెనఁగి
విలుఁ దేరు సమసిన వేగ సంధించు
ననువు లెవ్వరికంటె నతఁ డిష్టమునకుఁ
బనివడి నేర్చె నభ్యాసకాలమున.
నరుఁడును గురునానుసకు నిసువుట్ల
శరములు తనుదాన సాధించెఁ గొన్ని.
అదిచూచి యాచార్యుఁ డతిసికేకతను
పదరక యిట్లను: "భళిరా! నీవగుదు;
వతిరథశ్రేష్ఠుండవన నచ్చు నిన్ను;
[1] జతచేసితివి కొంత చెప్పనివిద్య
ర;" మ్మని సకలమంత్రంబులు సెప్పె.
సమ్మోహనాస్త్రంబు, జలదసాయకము,

---

1. జతముచేసితివి కొంతచప్పనివిద్య. (మూ)

నేకలవ్యుఁడు దానియెలుఁగాలకించి,
దాఁకొని యోజనత్రయదూరుఁడయ్యు
నాదట నాధనువభ్యసింపుచును
మోదించి, చిఱునవ్వు మొలవంగ నవుడు
వాఁడిశరంబుల వాఁడేనుదొడిగి
పోఁడిమి[1] చేసెను బొచ్చెంబులేక
యనువార సారమేయము నోరుగాఁడఁ
దొనకోలలొకటిగ దూపిడ్డకరణి.
వేవచ్చి శునక ముద్వేషంబుతోడ
భూవరాత్మజులకుఁ బొడసూపుటయును,
దమవిద్య కుఱుచగాఁ దలపోసి, వారు
గుమిగూడి చొప్పుగైకొని పోయిపోయి,
హిమగిరిప్రాంత నవ్యైకలవ్యాఖ్యుఁ
గమనీయభుజచాపు గరిడిలో నొంటి
నీక్షించి, వెఱఁగంది: "యెవ్వాఁడవీవు!
శిక్షయెవ్వరిచేత[2] సిద్ధించె నీకుఁ?
దలఁపనచ్చెరు!" వన్నఁ, దలఁచి వాఁడు:
"కలశసంభవుచేతఁ గంటినీవిద్య;
నేకలవ్యుండ నేనెఱుకలఱేఁడ;
నేకలవ్యయమును నెఱుఁగఁ గయ్యముల;
నోపినఁ జనుదెంచు యుద్ధంబు సేయఁ
జాపహస్తులు మీరు సన్నద్ధు." లనిన
విన్ననై యుందఱు వీఁగి, వెన్కకును
గ్రన్నన వచ్చిరి కరిపురంబునకు.
అంతట నొక్కనాఁడాబోయచరిత
మంతయు గురునకు నటయెఱింగించి,

---

1. చేసిన. 2. శిక్షించె. (మూ)

యేకాంతమున నంత నింద్రతనూజుఁ
డాకుంభజునిఁబల్కు: "నవధారు గురువ!
నాకంటెనెక్కుడు నరులలో వింట
లేకయుండంగ నిల్పెదనంటి విద్య;
నేకలవ్యునిఁ జెంచు నేముచూచితిమి;
నీకృపఁ దానఁట నేర్చెనువిద్య!
నాకంటె నీకంటె నానాప్రకార
లోకులకంటె నుల్లోకుండువింట.
వాలుచున్నాఁడు వాఁడు మీచేత;
నోలిమై విలువిద్య లొగి[1] నేర్చినట్టి!
వారక యిటువంటివారు మీశిష్యు
లారయ నెందఱో! భువనిలోపలను;
అటుగాన, మీపల్కు లనృతంబులనుచు
నిటపల్కనోడను నేవిధంబులను."
అనుటయు నుదరి యయ్యమరేంద్రతనయుఁ
దన వెంటరమ్మని తడయక గురుఁడు
అనఘు, శిష్యులుఁ దాను నప్పుడేపోయి
వనచరుఁగాంచిన, వాఁడాత్మఁబొంగి
గురునకునెదురేఁగి గురుభక్తిమ్రొక్కి,
కరపద్మములుమోడ్చి కరమర్థిమీఁదఁ
దేనియ ఫలములుఁ దెప్పించి, యపుడు
కానుకగానిచ్చి కరమర్థిఁబలికె:
"చేపట్టితివి నన్ను శిష్యునిఁగాఁగ;
నా పుణ్యమున వచ్చినాఁడవు వెదకి;
యిదెశస్త్రు, మిదెగాత్ర, మిదెకళత్రంబు;
మది నేదిగోరెదు మసలకయిత్తు;

1. నోర్చినట్టి. (మూ)

గురుపూజ నాచేతఁగొందుగా." యనిన
గురుఁ డింద్రజుఁడుమెచ్చుగతి వానికనియె:
"వనచరనాథ, నీవలచేతిలోని
పెనువ్రేలునాకిమ్ము ప్రియమార." యనిన,
నతఁడును: "నదియె మహాప్రసాదంబు
హితమతిఁగైకొమ్మయిచ్చెద." ననుచు
ననువుమీఱఁగ నలుఁగమ్మున వ్రేలు
దునియుంగనొత్తి యాద్రోణునకిచ్చె.
అదికతంబుగఁ బోయె నధికుఁడైనరుఁడు
ముదమంది మదిఁగల[1] ముసుకెల్లవిడిచి.
అతివేడ్క గురుఁడును నతఁడుఁదోడ్కొనుచు
హితమతినేతెంచె నిభపురంబునకు.
మఱి, వాఁడుఁ దర్జనీమధ్యమాంగుళుల
నిఱికించి బాణంబులేయ సాధించె.
అర్థితో నారీతి నాచార్యవరుఁడు
పార్థుతోనాడినప్రతిన చెల్లించి,
యురుదార ధర్మజాండాదిగాఁగలుగు
కురుకుమారులకేయఁ గొలఁదిగానట్టి
యరుదైన లక్ష్యంబు లర్జునుచేత
నురుమతినేయించుచుండె; నాగురుఁడు
నాయుధవిద్యారహస్యమార్గంబు
లాయింద్రతనయున కన్నియుఁజెప్పి:

## అస్త్రవిద్యాపరీక్షణము

'చూచెదఁగాక శిష్యులదృష్టి ముష్టి
యేచందమో' యని యెన్నికచేసి,

1. ముసటిల్ల. (మా)

యంతరిక్షంబున యంత్ర[1] కాకంబు
సంతతచలముగాఁ జక్కఁబన్నించి,
కోదండహస్తులఁ గురుకుమారకుల
నాదటరప్పించి యా [2]పక్షిఁ జూపి,
తొలుత నజాతశత్రునకిట్లువలికె :
"బలియుఁడ, కంటివే పక్షిశిరంబు ?
ననుజులఁ గంటివే యాచూపులోన ?
ననుఁగానవచ్చునా ? నయనాంతవీధి."
ననిన నాతఁడు : 'కంటి నదెపక్షిశిరము !
నినుఁగాననయ్యెడు ; నృపులుఁదోచెదరు ;
వేయుదునా పక్షి నిలఁగూల ?" ననిన,
నాయనకోపించి యప్పుడిట్లనియె :
"నీవేయ నేరవు ; నీదృష్టి చెదరె ;
నావిధంబులు వేఱె ; యవినీకు రావు."
అని ధర్మసుతునని, యయుగారితనము
తనరంగనిలిపి గాంధారేయుఁజూచి :
'యీవేమిపొడగాంచి తెఱిఁగింపు ;' మనిన
నావీరుఁడును బల్కె యమసూతియట్ల ;
భీమునడిగిన నట్లభీముండు చెప్పె ;
నామాడ్కి నందఱనడిగి ద్రోణుండు
కడపట నర్జునుఁ గార్ముకకుశలు
నడిగిన, నతఁడు లక్ష్యముచక్కఁజూచి :
'పూని పక్షిశిరంబుపొడగంటిఁ ; గాని,
యేను నీచెప్పినవేమియుఁ గాన ;
నేసెదఁ జూడుఁడీ యీపక్షి." ననుచు
భాసురజనమొప్ప బాణంబువిడిచి,

1. కారంబు. 2. పేశ. (పూ)

చపలచిత్తముపోలెఁ జంచలంబైన
కపటాకారముతల ఖండించుటయును,
వాసవిఁ బొగడ, నశ్వత్థామ మొగము
పీసమంబై తోఁచ విలుకాండ్రుచూడ.
తోరంపుసిగ్గుతో దుర్యోధనుండు
భూరిరాత్రుల నిద్రఁబోరయుకయుండె.
శరగురుం డెంతయు సంతోషమంది :
"సరిలేరు వింటికి జగమందునీకు ;
సచలితదృష్టియు, నలవును, వెరవు
నుచితంబులై నీకునాఁగెఁజెల్లు ;" ననుచు
నాచార్యుఁడర్జును హస్తకౌశలము
చూచి వేడుకనిచ్చె సునిశితాస్త్రములు.
తక్కినవారికిఁ దగినచందములఁ
గ్రక్కున విలువిద్య గఱపియున్నంత,
ధృతరాష్ట్ర గాంగేయ కృప సోమదత్తు
లతిమోద మొందంగ నకుమారకులు
శరగురుచేఁగన్న శస్త్రాస్త్రవిద్య
కరమద్భుతంబుగాఁ గడిమిఁజూపుటయు,
రాజశేఖరులెల్ల రమణమైఁదన్నుఁ
బూజింప నెంతయుఁబూజ్యుఁడై, గురుఁడు
పెండియు నొకనాఁడు విపులదోర్దండ
చండిమ చూతముసరసిలో ననుచు
మకరంబులుండెడుమడుఁగున కేఁగి,
సకలశిష్యులుచూడ జలముచొచ్చుటయు,
నొకమహాగ్రాహంబు ఒడిసి పెందొడను
బ్రకటితదంష్ట్రలఁ [1] బట్టె, యాపట్టు

1. బట్టెబట్టుటయు. (మూ)

విడువక యుండిన, విడిపించుకొనఁగఁ
గడు నేర్చియును శిష్యగణముతో నపుడు
'విడిపింపుఁడో దీని వెరవుతో!' ననిన
విడిపింపనేరక వివశులై వారు
నేయఁగా నట్లొకో యాతసికనుచు
నాయను వెఱఁగక యందఱు వీఁగ
యున్నచో, నర్జునుండొక మేటిరథము
వన్ని సూతుఁడు తేరఁ బటుగతి నెక్కి,
శరచాప ముద్గర శక్తి వజ్రాది
పరశు తోమర ఖడ్గ పట్టిస ప్రముఖ
వివిధాయుధంబులు వెస సంతరించి
యవిరళగతి రాఁగ నతని వీక్షించి:
"పగతు లిచ్చట లేరు పన్ని పోరాడ
మగఁటిమి మెఱయ ; నీమకరికిం జేల
తనకు నుద్ధతి!" యను ధార్తరాష్ట్రులను
గనుఁగొని పార్థుండు కడఁక నిట్లనియె:
"శరగురుం డల్పుండె! చర్చింపమనకు ;
భరమున నాతనిఁ బట్టిన మొసలి
యలఁతులఁ దీఱునే! యనువులఁ గాక!
వలయు నిస్సియు". నని వాసవాత్మజుఁడు
వెసఁ జేరి గురునకు వినయంబుతోడ
'మొసలి మిమ్మె చొప్పటము లైనో!' యనఁగ,
శోకాతురత్వంబు చొప్పడునట్లు
ప్రాకటంబుగ గురుప్రవరుఁ డిట్లనియె:
"మకరి పెందొడ వట్టె మడుఁగులోపలికిఁ
బెకలించుకొని పోవఁ బెనఁగుచున్నదియు ;
పదములు ధరనూఁది, పదిలమే నుఱక
యుదకమధ్యంబున నుండితి మింత ;

అలయుదునీటిలో నమ్మేటి మొసలి;
యలంతి మాకడ రేమనటమున్న నీవు
విడిపింపు". మనుటయు విప్వచ్చుడదరి,
కడునుగ్రచాపంబు గడంకమ్రోయించి
పటుతీవ్రసాయకపంచకంబునను
దటుకున మకరంబుదనడలు చించి,
విడువనిమకరంబు వెసంజించి, యిభము
విడిపించినట్టిశ్రీవిష్ణువోయనంగ
విడిపింప, రావాలుచే విడివడ్డచంద్రు
వడువున విడివడివచ్చి ద్రోణుండు
'పాంచాలపతి పట్టువడు వీని' కనుచు
నంచితసంతోషుండై యుండెననుచు
జనమేజయునకు వైశంపాయనుండు
వినిపించె"; నని చెప్ప, వెండియు వారు
'అనఘాత్మ, తరువాతనైనవృత్తాంత
మనువొందంజెప్పవే!' యనివేంటయును,
బంచమవేద ప్రబంధైకనాథ,
పంచాక్షరీమంత్ర పావనమూర్తి,
శాస్త్ర పురాణార్థ సార వివేక,
శస్త్రఖండిత శత్రుసైన్య ప్రపంచ,
సతతచాపాలంబ, సత్కీర్తిబింబ,
మతి ధైర్య నిర్జితామరమంత్రివర్య,
నుతధర్మ, నీకు మనోరథావాప్తి.
ఇదిసదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితాదిపర్వ నిర్మలకథయందు
నుచితమై యాశ్వాస మొప్పె నాల్గవది.

---

# పంచమాశ్వాసము



శ్రీరామవిఖ్యాత, చిరతరోల్లాస,
నారీనుతక్రీడ, సరసయుచౌడ,
తక్కక కర్ణావతారుండవనఁగ
దిక్కులవెలయు మంత్రి, చిత్తగింపు;
అక్కథకుఁడు శౌనకాదిసన్మునుల
కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె.

## ధనుర్విద్యాప్రదర్శనము

కురుకుమారులకెల్ల కోదండవిద్య
గురుఁడిచ్చి, యొకనాఁడు కొలువులోపలను
అంబికేయునిఁబల్కు: "ననఘాత్మ, నీవు
[1] సంబంధియుతుఁడవై సభ్యులఁగూడి
నీకుమారులకేను నేర్పినవిద్య
ప్రాకటలీల నొప్పనగొందుగాక.
తజ్ఞులువీక్షించి తగునన్నఁదాఁకి
విజ్ఞానినసరాదు విద్య నెవ్వారికి.
శరములుదూలింప సంధించునపుడు
గరిడివిస్తీర్ణంబుగాకున్నఁ గాదు.
[2] వాస్తుశాస్త్రజ్ఞులు వసుమతీసురులు
విస్తరింపుదురొప్ప విభుఁడ, యాస్థలము;
పేర్చి భేతాళునిపీఠంబు తొలుతఁ
దీర్చి యావేల్పుఁ బ్రతిష్ఠింపవలయు;

---

1. సంబుద్ధి. 2. వస్తు. (మూ)

శకునవేదుల శిల్పశాస్త్రకోవిదులఁ
బ్రకటించి విశ్వకర్మలఁ గూర్పవలయుఁ;
బవడంపుబోదెలుఁ బసిఁడికంబములు
నవరత్నవేదులు నవ్యపీఠములు
బచ్చనగోడలుఁ బట్టుమేల్కట్లుఁ
బచ్చుతాళులకప్పు బాగుగావలయు;
నరనాథ, లగ్ననిర్ణయము నేయింపు;
కరిపురంబెల్ల సింగారింపఁ బంపు;
నృపపుంగవులనెల్ల నెమ్మిరప్పింపు."
అనుటయు, ధృతరాష్ట్రుఁడట్లకాకనుచు,
ఘనునంపెఁ బురము సింగారింప విదురు.
అంత, నవ్విదురునియాజ్ఞాక్రమమున
వింతగాఁ బౌరులు వేడ్కనప్పురిని
బసిఁడిమేడలయిండ్లు పసనారఁ దోమి,
వెస వెండిమేడలు వేగఁబుల్గడిగి,
సున్నంపుమేడలు సొంపురాఁబూసి,
క్రన్నన భువనేశ్వరములు భూషించి,
మాడుగులట్టళ్లుమణికవాటములుఁ
గ్రీడాగృహములు మిక్కిలి మెఱుఁగువెట్టి,
ముత్తెంపుగోపురంబులు ధవళించి,
క్రొత్తగా బంగారుకుండలెక్కించి,
మిసిమియుప్పరిగల మీఁదికోణములఁ
బసిఁడికోలలు పాఁతి పడగలుగట్టి,
గోడలమొదలఁ గుంకుమమప్పళించి,
వాడలఁ గస్తూరి వాసిల్లనలికి,
రంగైన బహునవరత్నముల్ మెఱయ
ముంగిళ్ల ముత్యాలముగ్గులు దీర్చి,

ఫల పుష్ప పల్లవ ప్రతతు[1] లయ్యెడల
నలువొప్ప బహుతోరణంబులు గట్టి,
ముంబైన సోపానములనీడ చూచు
డంబులుగల కల్వడంబులుగట్టి,
కడపట నుదయభాస్కరము గావించి,
కొడిగల రత్నపుఁగుచ్చులు గట్టి,
దీపించునమరావతికి బొమ్మవెట్టు
నీపురియనితోప నెల్లసౌధములఁ
గాంతులుదైవాఱఁ గనకపుత్రికల
వింతవారలుచూచి వెఱఁగంద నిల్పి,
మోలి సోరణగండ్ల నువిదలుచూడఁ
నీలిమవర్ణానో నెఱి నిట్లనంగఁ
బరిమళబహుళ ధూపంబు లెల్లెడలఁ
బరఁగించి, రత్నదీపము[2] లోలినిలిపి,
మూరుబాణములకు మాఱుబాణములఁ
జేరినజనులు వీక్షింపనీ నేఁడు
అని విస్తరించినయట్లు సౌభాగ్య -
మొనయఁ బురస్త్రీలనెల్లఁగైనేసి
యున్నంత, గరిడియు నూరితూర్పునకు
నన్నిసౌభాగ్యాల నాయితమయ్యె.
పిలువఁబంచిన రాజబృందంబువచ్చె;
నెలమిఁగూడిరిలోకు లిలయీనెనఁగ.
విదురుఁ డత్తెఱఁగెల్ల విభునిలోఁజెప్ప,
ముదమంది యారాజు ముత్యాలరథము
నెక్కుచుఁ దనయులనెల్ల రావించి,
తక్కక గురుని నెంతయుఁబిలిపించి,

---

1. లయొద్ధల. 2. లలోనిలిపి. (మూ)

'యింతులు పల్లకులెక్కరం' డనుచుఁ
గుంతీసమేతులై కొలిచిరాఁ బనిచి,
గాంగేయ కృపులాదిగాఁగల దొరల
సంగరసన్నద్ధ సకలసైన్యముల
రాఁబంచి, బహుళతోరణరాజవీథిఁ
బూఁబోఁడులక్షతంబులు చల్లఁ గదిసి,
సంగడి విదురసంజయు లెల్ల తెఱఁగు
నింగితవేదులై యెఱిఁగింపుచుండ,
నడరి కృష్ణునికుక్షి నబ్జజాండములు
వెడలినగరిమతో వెస నూరువెడలి,
సిద్ధాంతనిపుణులు చేపట్టియున్న
శుద్ధలగ్నంబునఁ జొచ్చిరగ్గరిడిఁ;
జొచ్చి సేనల నొక్కచో నుండఁబనిచి,
[1] యిచ్చమై రాజులకిమ్ములిప్పించి,
గాంధారియును దానుఁ గనకపీఠమున
బంధుకోటులుఁగొల్వఁ బసమీఱియుండె.
అప్పుడు బుధునితో నలరారుచంద్రు
చొప్పున ద్రోణుండు సుతునితో నిలిచి,
'ధనువున మెఱయుఁగదా గురుండెపుడు'
ననుచు నక్షత్రజ్ఞులాడ విల్దాల్చి,
'రామాస్త్రములుగాన రాజవైరమున
నేమిసేయునొ రాజు[2] లిందఱ! ననుచుఁ
దొనల మోములుదూర్చి తొలఁగించె' ననఁగ
వెనుకమాటున నస్త్రవితతి ధరించి,
వెనుకొని శిష్యులు విలు కోల జోదు
దొన బొమిడికఁ బూని తోరమై నిలువ,

1. ఇచ్చలదగురాజులకిమ్ము లిప్పించి. 2. లిద్దఱు. (రూ)

సుర్వీశ్వరునిఁ దోడియోధులఁ బలికె :
"సర్వజ్ఞులిందఱు సభఁగూడినారు ;
వింటికి హరియొండె విశ్వేశుఁడొండెఁ
దొంటిరాఘవుఁడొండె గుర్గ తానొండె
నేతుఁ ; రొండొకనికి నేర్తునరాదు ;
బ్రాతిగా నట్లయ్యుఁ, బలిమూదరమునఁ
గురుకుమారకులకుఁ గొంత చెప్పితిని ;
బరికింపు." డని చెప్పి పాయయిచ్చినను,
ఆచార్యులకు మ్రొక్కి యాకుమారకులు
వే చాపములుపూని వేడ్క మ్రోయించి
కనుచూపుమేరలక్ష్యము లేయువారుఁ,
గనరానిసూక్ష్మలక్ష్యము లేయువారు,
వెనుక ముందఱ నొక్కవిధములక్ష్యములు
గనుఁగొని తునియ నొక్కట నేయువారుఁ,
దునిసి లక్ష్యంబు తోఁదొలఁగుచోఁ దునుక
గనుఁగొని చూర్ణంబుగా నేయువారు,
ధరకమ్ము [1]నాడికాత్రయమునఁగాని
తిరిగిరాకుండ నద్దివి నేయువారు,
తగ్గక శరము పాతాళలోకంబు
దగ్గఱ ధరణిగాఁడఁగ నేయువారు,
గుఱిగొని తీగెలాగునఁ బింజేపింజె
గఱవఁ గోలలు నిడుపుగా నేయువారు,
నలుగుననొకట నైదారులక్ష్యములు
బలిమి నొక్కట ద్రెవ్వఁబడ నేయువారు,
నొండొరుఁదలపడి యుద్ధంబు నేయు-
పాండిత్య మెంతయుఁ బ్రకటించువారు,

1. నాడిగా. (మూ)

ముసల కుంత ప్రాస ముద్గర చక్ర (?)
అసి శూల హలముల హవణించువారు,
గ్రక్కున రథ తురంగమ వాహనముల
నెక్కి యుద్ధాటోప మిలఁ జూపువారు,
మఱియుఁ బెక్కనువుల మనుజేంద్రసుతులు
నెఱి విద్యచూపుచో నేలగ్రక్కదలె;
నాదిత్యురుచి మాసె నస్త్రదీధితుల;
భేదిల్లె దిశలు గంభీర[1] నాదముల.
అప్పుడు తమలోనియాగ్రహాటోప
ముప్పొంగి భీమదుర్యోధనుల్ గదిసి,
యొక్కటగదలెత్తి యురుచారురూఢి
నక్కనకాద్రివింధ్యములునా నొప్పి,
లోఁగక వ్రేసి, వ్రేటులుదప్పఁగ్రుంగి,
వీఁగియుఁ గడిమిమై వెండియుఁగదిసి,
యుర్విపై గదలూఁది యొండొరుఁజూచి,
పూర్వసీమలుమాని పూపుమైఁజొచ్చి,
వ్రేటు వ్రేటునకంటె వ్రేఁకగావ్రేయ
వ్రేటుకందువులకు వేవేగఁ దొలఁగి,
గదలు వేమొగమునఁ గదియఁద్రిప్పియును,
అదిరొండలేక వ్రేయక లాసిలాసి,
యాయస్త్రఘట్టన లగ్నులనీస
మాయపుఁద్రొక్కులు మహిఁగదలింప
నీసునఁబెనఁగుచో, నెఱిఁగి పట్టించి
యాసమయంబున నాచార్యుఁడనియె:

## అర్జును నస్త్రవిద్యాకౌశలము

"ఇంక నాప్రియశిష్యుఁ డింద్రనందనునిఁ
గొంకకచూడుఁడీ కోదండమునను!

1. నాదముల. (మూ)

'పాంచాలుఁదెత్తు నీపగదీర్తు' ననిన
సంచితపుణ్యుఁ డీసత్యసంధుండు;
కారణంబున శిష్యగతినొందెఁగాని,
ఘోరాస్త్రవిద్య నాకొలఁది [1] వాఁడితఁడు.' —
అనిచూపి నిలిపిన, నయ్యర్జునుండు
ధనువుతోడనెప్పట్టెఁ దల్లికి ననఁగ,
నిరుగేల విలుద్రాల, నిషుపరంపరలు
తొఱఁగించె నుప్పొంగుతోయధివోలె.
బాణపంజరములు బాణవర్షములు
బాణవేణికలేయుబాగునుజూప,
'నెంతటఁబెట్టునో యీబాణమహిమ
కొంతవారింపఁడో! గురుఁ' డనుచు
సభికులు వెఱపు నాశ్చర్యంబునొంద,
నభినవంబుగఁ బార్థుఁడంత వెండియును
మిక్కిలియెండచే మేదినిగప్పర,
నొక్కటఁ బెక్కుసూర్యులఁ బొడిపించి,
పెలుచఁ గార్కొని వృష్టి పెద్దగా నుఱుమ
జలదాస్త్రమేసి యాసంభ్రమంబుడిపి,
యేయూఁతనిలువక యిలసంచలింప
వాయుబాణంబేసి వానవిప్పించి, —
గిరశిధూమంబు లాకసమున నిండ
నురగాస్త్రమేసి యాయుబ్బు విప్పించి,
యురుతర పక్షవాయువు లుప్పతిల్ల
గరుడాస్త్రమేసి యాగర్వంబునణఁచె.
దివ్యాస్త్రమహిమ లిత్తెఱఁగున మఱియు
నవ్యంబుగాఁజూపె నరులచూడ్కులకు.

---

1. గాఁడితఁడు. (మా)

కమనూత్నకాండగు ; ఘనుఁడగుఁ ; గానఁ
బడ [1] కుండు ; సంతసేర్పడు నెల్లమొదల ;
భూమిలోనణఁగు ; నభోవీథిఁదోచు
సామాదిబహువేదసమ్మితుండగుచు.
సాయకమహిమ నీచందమానరునిఁ
గోయనిపొగడిరి కొలువువారెల్ల.
కదిసి గాంధారికి గాంధారిపతికి
విదుర [2] సంజయులంతవినిపించిరెలుఁగ.
ఇంద్రాదులకురానిహృదయానురాగ
మింద్రసుతునకుఁగల్గె నిలమొల్లఁ బొగడ.
అప్పుడు, ప్రళయకాలాభ్రనిర్ఘోష
ముప్పొంగ రాధేయుఁడాగిమల్లచలించి,
యాసభాస్థలి నక్కడక్కడపలించి
మూసరిల్లకనిల్చి యుగ్రగర్వమున
నుర్వీశ్వరులఁబల్కు : “ నోహో ! యితండు
సర్వాధికుఁడా ! యింతసన్నుతించెదరు !
దీనిఁజెప్పఁగనేల ! దివ్యాస్త్రమహిమ
నేనును నొక్కంత యెఱుఁగియుందుదును. ”
అనివిల్లుమోపెట్టి యర్జునుకంటె
ననువొప్ప వివిధసాయకవిద్యచూపి,
తనపెద్దకొడుకని తలఁపులోఁగుంతి
యనురాగపరిపూర్తిమైఁ జూచుచుండఁ :
“ గర్ణుండనేను భార్గవుసశిష్యుండ ;
నిర్ణయింపుఁడు విద్యనేర్పునోలేదో !
అయ్యర్జునుని బలునసఘునితోడి
కయ్యంబుగోరి యీకడకువచ్చితిని ;

1. కుండనంతసేర్పడ. 2. సంజయులకు వినిపించిరెరింగి. (పూ)

ఇందఱుఁజూడంగ నిపుడు గావలయు;
సందుచేకొనిపోకు చాపహస్తుండ!
ఎదుటనెవ్వఁడులేక యేయుటయొప్పె;
నిదె యింక నన్నేయు మెదిరించినాఁడ."
అనుడు, నర్జునుఁ డాత్మ నతనిఁగైకొనక
మునివ్రేల సాయకముఖమంటి పలికె:
"పిలువక సరి యిట్లు బిరుదవై వచ్చి
పలికెదు; నీకెట్టిపౌరుషంబందు!
ఎవ్వఁడవని నీకు నిత్తుఁగయ్యంబు!
నవ్వొఱఁగయ్యెడు నీగర్వమునకు!
బుధుఁడైన గర్వంబుఁ బొరయఁడువిద్య;
నధముండు గర్వించు నల్పవిద్యలను;
పగయును మైత్రియు బంధుకార్యంబుఁ
దగువానితోడఁగదా! సేయవలయు."
ననినఁగర్ణుఁడుపల్కు: "నస్త్రంబుగలిగి
నినువోలె మెత్తనై నేరముపలుక;
ఘోరాస్త్రజిహ్వఁబల్కుము; మాంసజిహ్వఁ
గూరిమిఁ గొసరినఁ గొనఁడుకర్ణుండు;
ఎవ్వఁడనైతినేనేమి! ర." మ్మనుచుఁ

### కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము

గవ్వడిపై మేఘకాండమేయుటయు,
ముదివడ బెడఁగైన మొగిళులనడుమఁ
గొడుకుఁగానక తల్లి కుంతి మూర్ఛిల్లి
త్రెళ్లిన, విదురుండుదెలిపె; నాలోన
ఝల్లన నా మేఘసంఘంబు వివ్వ
వాయుబాణంబేసి, వానిపై నరుఁడు
సాయకంబులు గొన్నిసంధించునంత,

నెడచొచ్చి గురుఁడు [1] దేవేంద్రజాశరము
లుడిపి, కర్ణునిఁజూచి యుగ్రుఁడై పలికె :
"ఆచార్యులముగాన, నాజిధర్మములు
వేచూపి తలపడవిడుతుము నిన్ను ;
తక్కువవానితో ద్వంద్వయుద్ధంబు
స్రుక్కక నేయనిచ్చుట దోస ; మధికుఁ
డీనృపాలకుఁ డర్హుఁ, డిందువంశ్యుండు,
సూనుండు పాండురాజునకుఁ గుంతికిని ;
నెఱయ నీగోత్రంబు, నీతల్లిఁదండ్రి
నెఱిఁగింపు ; [2] దొరవైన నితఁడుపోరెడిని.
ఎచ్చట నస్త్రంబు లెవ్వాని మొఱఁగి
తెచ్చినాఁడవో ! నిన్నుఁదెలియరా." దనినఁ,
దనకుసహాయమై దైవంబుదెచ్చె
ననుచు దుర్యోధనుండచ్చోటుగదలి :
"ఆచార్య, నీకునిట్లనుగంగఁదగునె !
మీచంద మొప్పదు ; మెచ్చితివీనిఁ ;
గులముడుగఁగనేల ! కూతునిచ్చదరో !
వలనైనవిద్య యెవ్వనిపాలఁబోయె !
కులజుఁడే పెనువ్రేలుగోసిన యొఱుకు !
తలఁపరు పక్షపాతమున నాడెదరు ;
రాజుగాఁడనిగదా ! రణముమాన్పితిరి ;
రాజుఁజేసెదఁ గర్ణు రాజులు మెచ్చ."
అని వేదపారగులైన బ్రాహ్మణుల
ఘనుఁడు సహస్రసంఖ్యలఁబిలిపించి,
కనకసంపన్నులఁగాఁజేసి, వారి
యనుమతితోఁ గర్ణు నంగభూమికిని

---

1. దేవేంద్రుని. 2. దొరవిన. (మూ)

బట్టభద్రునిజేసి, పరఁగ నాతనికి
బట్టాంశుకంబులుఁ బసిఁడి [1]యుత్తరిగ
లురుహారములు రాజయోగ్యపీఠములు
హరులు మత్తేభంబు లాతపత్రంబు
లిచ్చిన, రాధేయుఁడిచ్చనుప్పొంగి :
"మెచ్చితిరాజేంద్ర, మేలునీప్రియము ;
ఏమైననడుగు నీకిచ్చెద." ననిన
నామహీపతిపల్కు నందఱువినఁగ :
"ఈశ్వరుతోడ యక్షేశుండువోలె
వైశ్వానరునితోడ వాయువువోలెఁ
జంద్రునితోఁ బుష్పచాపుఁడువోలె
నింద్రునితోడ నుపేంద్రుండువోలె
నాతోడ మైత్రి యున్నతిఁజేయు." మనిన
నాతఁ డచ్చోటికి నగ్ని దెప్పించి,
యావేల్పుసాక్షిగా నతనితో మైత్రి
గావించెఁ బాండవకౌరవులెఱుఁగ.
సూతుఁడప్పుడు తనసుతుఁడుకర్ణుండు
ప్రాఁతిగా నంగాధిపతియైనవార్త
విని వచ్చి గరిడిప్రవేశించుటయును,
వినుతి నారాచంబువిడువంగరాక
ధృతి [2]సూతగోత్ర రాధేయనామములు
పతులెల్లవిన నంగపతి చెప్పుకొనుచు,
నయ్యకుమ్రొక్కి [3]లజ్జానతవదనుఁ
డయ్యున్నఁ, జూచియిట్లనియె భీముండు :
"కాకి కోయిలయని గారాముసేయ
నేకాలమునవైన నెఱుఁగరాకున్నె !

---

1. యుత్తరలు. 2. సూత్ర. 3. లజ్జాయత. (మూ)

ఇల సూతగోత్రుగా నెఱిఁగిరి మితనిఁ;
కులమేలడాఁగును గోటిచెప్పినను!
కుక్క యందలముపైఁ గూర్చున్నయపుడె
.........................
అంగరాజ్యమునకు నర్హుండె వీఁడు!
సంగతిఁ జనుఁగాక సారథ్యమునకు."
అనుడు దుర్యోధనుం డతనికిట్లనియె:
"తనకన్నుగానఁడు ధరణినొక్కఁడు!
శూరులజన్మంబు, సురలజన్మంబు,
భూరి నదీజన్మములుఁ గాననగునె!
శరవణంబునఁగాదె! జనియించెగుహుఁడు,
శరముకందువఁగాదె! జనియించెఁగృపుఁడు;
ఘనకుంభమునఁగాదె! గలిగద్రోణుండు;
మునినేత్రమునఁగాదె! మొలిచెఁజంద్రుండు;
తలఁప మీపుట్టువు తానెట్లు చెపుమ!
వలదన్న మానరు వాదంబుత్రోవ."
అనిపల్కునంతలో నర్కుండుగ్రుంకె,
ఘన సహస్ర కరదీపికా దీప్తితోడ
గురునకుఁ దండ్రికిఁ గురురాజు మ్రొక్కి,
యరిగెఁ గర్ణుఁడుగొల్వ ననుజులుగొల్వ.
ధృతరాష్ట్రుఁడును రత్నదివ్యాంబరముల
శతసంఖ్యకరుల నాచార్యుఁబూజించి,
యందఱననిచి రథారూఢుఁడగుచు
మందిరంబున కేఁగె మగువయుఁ దాను.
మఱునాఁడు తేపాడి మనుజేంద్రసుతులఁ
దెఱఁగొప్ప నాచార్యతిలకుండు చూచి:

## కౌరవులు ద్రుపదునెదిర్చి పరాభూతులగుట

"గురుదక్షిణార్థమై కూర్చితి మిమ్ము; -
నురుకీర్తులార, నాకొసగరె యొకటి!"
అనిన, దుర్యోధనుం: "డనఘ, మీకెద్ది
మనసునకిష్టంబు మము వేఁడుఁ." డనిన,
దొల్లి యేఁ జెప్పితి; ద్రుపదు గర్వాంధుఁ
బ్రల్లదంబులు నన్ను బలికినవానిఁ
బ్రాణంబుతోడనే పట్టి తెం." డనిన
ద్రోణాజ్ఞఁ గురుకుమారులు నూటయొకరు
కర్ణుండుతోడుగాఁ గరిరథతురగ
మర్ణవారబలంబుతో నూరు వెడలి
మున్నాడి నడువ, నిమ్ములఁ బాండుసుతులు
పిన్నాణముగ ద్రోణు వెనుక నేవురును
నరదంబులెక్కి సైన్యములతో నడువ,
నరుఁడందు నాచార్యునకుఁ గేలు మొగిచి:
"అనఘ, వీరేఁ గాదరక్కట! తమకు
గొనకొని చిక్కునో కో! ద్రుపదుండు;
మీపూర్వసఖుఁడని మీఁదుచింతింప;
రేపాటి బిరుదులో! [1] మొఱఁగరు తమ్ముఁ;
దడవరు ధర్మనందనుఁ బెద్దవాని!
నోడువరు భీమసేనుసంగడు తోన;
ఆరాజపురం మేమియగ్రహింపంబె!
వీరలు విరుగక పిలువంప నేను."
అనునంత రథధూళి యాకాశపథము
మునుముట్టఁ, బురము నిమ్ములఁ జుట్టుముట్టి,
కురుకుమారులు కంఠ [2] కుహరనాదములు
పరఁగింప, నందఱుఁ బాటికిఁ గొనక,

1. మొఱంగము. 2. కురహ. (మా)

పులిఁగోలవైచినపోల్కిఁ బాంచాలుఁ
డలిగి కార్ముకభీమమగురథంబెక్కి,
భట ఘోట రథ దంతిపంక్తితో వెడలి
పటుభంగిఁ గౌరవబలముపైఁబడిన,
నీక్షింప భయమయ్యె నిరువాగురణము
నక్షీణసుభటశస్త్రాస్త్రదీధితుల.
తుండంబు లొండొంటితో బిట్టుపెనఁచి
శుండాలములపోరు చోద్యమైయుండె;
[1] జగతీశులార్థిమై జగడింప, గిరులు
తెగి తాఁకినట్లయ్యెఁ దేరులు తాఁకి;
నానాభిధాన బాణంబులు వేయ
వేనామముల విష్ణువిధమైరిభటులు.
అనుపమ శంఖ కాహళ పటహాది
నినదముల్ రథకింకిణీగుణధ్వనులు,
రౌద్రహుంకార పరస్పరాహ్వాన
భద్రేభగర్జిత బాణనాదములు
సతతమైనిగుడఁ, బాంచాలుఁడావేళ
ధృతరాష్ట్రసుతులపైఁ దేరుద్రోలించి
గుఱుతింప సరుదైనకోలలుపఱపి,
[2] తఱచుగా నరులకుఁ దాఁ గానరాక
యదలించి, [3] యందఱనన్నిదిక్కులకు
నొదిగింపఁ, గురువీరులుగ్రులై కదిసి,
పాంచాలుసేనల బాణవర్షముల
ముంచి, మొగ్గరములు మొగిఁజిక్కువఱచి,
తోడిఁబడఁ గాల్వురఁద్రుంచి తూటాడి,
బెడఁగుగాఁ దేరులుపెళికి పేటాడి,

---

1. జగతీశమార్థమై. 2. తరచునరిలకు. 3. యన్నిటి. (మూ)

మొత్తమై దంతుల మొత్తి మోటాడి,
మత్తిల్లుహయముల మట్టిసుల్లాడి,
కన్నకయ్యంబులు క్రమముతోఁ జేయఁ,
గన్నులఁ[1] గెంపెక్క కాంపిల్యపతియుఁ
దలఁప వశిష్ఠనందనులపైఁ దొల్లి
చలమునవలుగు విశ్వామిత్రువోలెఁ
గులిశధారలమించు క్రొవ్వాఁడితూపు
లలవోకవిగుడింప, నందంద వెఱచి,
దిక్కులు తెలియక ధృతినత్తిపోయి
యొక్కలాగునఁ దోవలొయ్యన నెఱిఁగి
పాఱి, రప్పుడు వెంటఁబడి ద్రుపదుండు
పాఱవాఱి మొఱుంగు బాణంబులేసి :
" యేలవచ్చితిరి ! మీరేల పాఱెదరు !
చాలున ! మీకుఁ బొంచాలు నేయుటలు !
వీచినచేతికి వెయ్యేండ్లటంచు

... ... ... ... ...

యేనోరుపెట్టుక యేయవచ్చితిరి !

... ... ... ... ...

బాసినవగ లేదు, పగపట్ట లేదు,

... ... ... ... ...

బాలుం మిమ్ముఁ జంపక కాచినాఁడఁ ;
దేలిపోం." డనవిని దేవేంద్రసుతుఁడు

### అర్జునుఁడు ద్రుపదుఁ బట్టితెచ్చుట

రూపించి కురుకుమారులపలాయనము
చాపశిక్షకునకు సంప్రీతిఁ జూపి,

---

1. కంపెట్టి. (మూ)

కురుకుమారులు కండక్రొవ్వున నతని
గురుదక్షిణార్థమై కొనిపోవవచ్చి
తతిఁగాసిపాఱిరి తమచేతఁగాక ;
ఇతఁడునెగ్గులువల్కె ; నిఁక నేనుబోదుఁ ;
బవమానసూతి తోడ్పడ నాకుఁగలఁడు ;
కవలిదే చక్రరక్షకులున్నవారు ;
అన్న రావలదు ; మీయడుగులఁగొలిచి
యున్న మే." లనిపోయె నుర్వీశుఁగూడ.
ఆవిధంబునఁబోయి యతఁడస్త్రరుచుల
భూవలయంబుగప్పుచుఁ గూడఁబట్టి :
"నిలునిలు పాంచాల, నీకుఁబోరాదు ;
తలపడు మిదె పాండుతనయుల మేము ;
మాకొంపులనన్న మాటలవరుస
చేకొని పసలావు సేయర." ననుచు
భానుసమానాస్త్రపటలంబు లేయ,
సేనలతోడ నాక్షితిపతి తిరిగి
పలుతూపులేయంగఁ, బవననందనుఁడు
కలిగెఁగయ్యంబున గద త్రిప్పుకొనుచుఁ
బరవీర ఘన[1] జాను బాహుమధ్యములుఁ,
గరితురగాది కంకాళమధ్యములు
ప్రేసిపయ్యలువావ, వీక్షించిద్రుపదుఁ
డోసరింపక వచ్చి యొక్కొక్కకోలఁ
బాండవసేనలఁ బదుల నిర్వదులఁ
జెండుగొట్టినయట్లు క్షితిఁ గూలనేసి,
యీసునరథముల నిభచయంబులకు
రా సందులేకుండ రణమధ్యసీమఁ

1. పార. (మూ)

బాఱవాతిశరమ్ము పవనజునురము
దూఱ నొక్కటినాటి, ద్రుపదుఁడందంద
సేనాసమేతుఁడై చెదరక యింద్ర-
సూనుపై శరములు చొనుపుచో, నతఁడు :
" నెఱిఁగితిఁ, గర్ణాదులితనికిఁగాక
[1] విఱుగఁటతగు ; వీఁడు వేఁడిపిల్కాఁడు. —
వాలాయ మింతటివాఁడుగాకున్న,
నేలమ్మను ద్రోణుఁ డితనినిఁబట్టు !
మేనువంచింపక మేకొనిపెనఁగి
యేనుఁబట్టుకపోదు నిలఁగీర్తిగలుగ."
అని దివ్యబాణంబులరిఁబోయు, నంత
ధనువు తున్కలుచేసి, తగ ద్రుపదుఁడు
మెఱుఁగునారసముల మేనెత్తురులు
వఱదలై పాఱ నావాసవినొంచి,
కవలిరాఁదఁ బ్రచండకాండంబులేయఁ,
దవిలి వేఱొకవిల్లుదాల్చి యర్జునుఁడు
నెఱి పిడుగులవోలె నిగుడి వక్షంబు
గఱవఁ బుంఖానుపుంఖములు బాణములు
పఱపుచో, నెడచొచ్చి పాంచాలుతమ్ముఁ
డఱిముఱి సత్యజిత్తనియెడువాఁడు
నరునితోఁదలపడి నానాస్త్రవృష్టి
గురియ, భీముఁడు వానికొనకెట్టపట్టి —
పాఱవైచినఁబోయె ; బలముంతవచ్చి
దూఱంగ, నంతలో ద్రుపదభూవిభుఁడు
కోపించి భీముని గోత్రారిసుతునిఁ
జూపుడింపక వజ్రసూఁటిబాణములఁ

1. గఱిగినతగు. (మూ)

గప్పి పార్థునివిల్లుఖండించి యూర్వ,
నప్పుడుకోపించి యమరేంద్రసుతుఁడు
ధీనుతగతిఁ దన తేరుపై నుండి
వాని తేరికిదాటి వడి వాగఁదెచ్చి
బిగువుపగ్గంబులఁ బెనఁగొన మిగుల
నొగులఁ బాంచాలు నన్నాగలతోఁగట్టి,
శిథిలతఁ బాంచాలసేనలు వాఱ
రథసూతుఁబడఁదన్ని, రథికులు గొలువఁ
గొని తెచ్చి 'గురునకు గురుదక్షిణార్థ'
మని ద్రుపదునిఁజూప, నాతనిఁజూచి:
"అక్కట, ద్రుపదునకా! యిట్టియునికి!
నక్కచిక్కులు చిక్కినాఁడవి దేమి!
నిరతినన్నెఱుఁగుదా! నీచెలికాని;
నురురాజగర్వ మేయూరికిఁ బోయె!
అంటివి మమునొవ్వ నాఁడు; తత్ఫలముఁ
గంటి; తొంటివి యింకఁగలవె గర్వములు!
పోపొమ్ము కాచితి బుద్ధితో." ననుచుఁ
జాపశిక్షకుఁడు పాంచాలునివిడిచి,
వినుతిఁగట్టఁగనిచ్చి వీడుకొల్పుటయుఁ,
జని యూరుచేరక యీశ్వరుఁగూర్చి తపము
నతఁడుసేయఁగఁజొచ్చె; నటపాండురాజ-
సుతులతోఁ గరిపురిచొచ్చె ద్రోణుండు.
మఱునాఁడు కృప భీష్మ మంత్రికుమారు
లెఱుఁగ నర్జునుఁజూచి యిట్లనెగురుఁడు:
"చలమునఁ బాంచాలు జయకథాశీలు
గెలిచిననీకుఁ దక్కినరాజులెంత!
ఇచ్చిననావిద్య యీడేరె నీకు;
నిచ్చెద! దక్షిణ యింకనాకొకటి?

ఎన్నఁడు రణములో నీవునాకెదురు
పన్నక బహుబాణపటలి యేయుచును
దాటుదో ! యదినాకుదక్షిణ ” యనిన
వాటంపుభక్తి నవ్వాక్యంబునకును
నరుఁడియ్యకొన ; నంత నరునకు బ్రహ్మ-
శిరము బ్రహ్మాస్త్రంబుఁ జెప్పెద్రోణుండు.
పతి యంత యువరాజపట్టంబు ధర్మ
సుతునకు విదురభీష్ములు మెచ్చ నిచ్చి,
యనుపమ రాజచిహ్నముల నిచ్చుటయు,
జనులాత్మనలర నజాతశత్రుండు
కరి కిటి గిరి శేష కచ్ఛపంబులకు
ధరణిభారము మోవఁ దాను దోడగుచు,
న్యాయమార్గంబున నడపి భూజనుల
శ్రీయు సుభిక్షంబుఁ జెందఁ జేయుచును,
నలువురుతమ్ములు నాలుగుదిశలు
బలిమిసాధించి కప్పంబులు దేర,
ధన ధాన్య పశు వాజి దంతులు నగర
మున నాఁటికేఁటికి ముమ్మరింపంగ,—
నానినవేడ్క నేనానిపట్టంబు
పూనినట్టిగుహుఁడువోలెఁ బెంపొంది,
యేకశాసనముగా నిలయేలునతని
యాకాంతి, యాశాంతి, యామూర్తి చూడఁ
జాలక, శకుని దుశ్శాసనుఁ గర్ణు
నాలోనఁగూర్చి యిట్లనియె రారాజు :
“ రాజెఱుంగఁడు ; యువరాజ్యంబుధర్మ
రాజునకొనగె నుర్వర హెచ్చువొంద ;
మేలునఁ బగవారి మెఱయించు టెల్లఁ
బాలుపోయుటగాదె పాముకూనలకు !

సహజప్రతాపుఁడజాతశత్రుండు
మహిఁ నింతవాఁడైన మన కేమిగలదు!
వలదని నృపునకు వారింపరాదు;
కలదె! యింకను బాయఁ గత్తు నా." కనుచు
ఘననీతిగణ్యుని గణికుఁడన్వానిఁ
దనమంత్రి గాంధారితనయుఁడీక్షింప,
నింగితంబామంత్రి యెఱిఁగి కుమార
పుంగవునకు నిట్లుబుద్ధియేర్పఱిచె:

## గణికునుపదేశము

"ఓనాథ, వినుము దండోపాయనియతిఁ
గాని భూప్రజ రాజుఁగైకొనరెప్పుడు;
తగిన [1] దండముచాలు ధాత్రికైననఁ;
దగనిదండముచెల్లుఁ దనవారిచోటఁ;
దనవారివలెనుండి దాయలై చంపు
జనుల శోధింపని జననాథుఁడేల!
తన కెవ్వ రెంతమంతనము చెప్పినను,
దనబుద్ధిలోఁగాని తానుండవలదు;
ప్రజలు మూఁకలుగట్టి బహుభాషలాడ
నిజము నిక్కము సేయ నృపునకుఁగాదు;
తనయూన మొకనితోఁ దలపోయవలదు;
... ... ... ... ...
అరులువచ్చినదాఁక నగులకుఁదాను
... ... ... ... ...
పనివడి ప్రియములు పాటింపవలయు;
దార కుమార సోదరులాదిగాఁగ
వారువీరనక యెవ్వరినమ్మవలదు;

1. చందము. (మూ)

పాముచందంబునఁ బగపట్టుకున్న,
భూమీశునకు భీతిఁబొందరు నృపులు ;
అరిరాజు శిశువని యాలస్యమొప్ప ;
[1] దరులుచేరువనున్న నటపాపవలయు ;
నమ్మించియైనఁ బుణ్యము వైరిఁజంప ;
నిమ్మాడ్కి నృపనీతి యెఱుఁగు కుమార !"
[2] అని పురస్త్రీలకు నాబుద్ధుఁడెట్లు (?)
మునునీతి చెప్పె నాముసవునఁ జెప్ప,
విని సుయోధనుఁ డంత విభు నేకతంబ
కనుఁగొని దైన్యంబుగానరాఁ బలికె :

### దుర్యోధనుఁడు తండ్రితో తనమనోదుఃఖము నెఱిఁగించుట

"పాండుసూనులకేనుభయమందుటెల్ల
మండలేశ్వర, నీవు మదినెఱింగియును,
రమణీయమగు యువరాజపట్టంబు
యమసూతికొసగితి వక్కట ! తగునె !
జ్ఞాననేత్రుఁడవని జగతీశ ! నిన్ను,
సూనులు లేరని సురనదీసుతునిఁ
దలపోసి, ధర్మనందనుని రాజ్యమున
నిలిపెదరనివింటి నిక్కమీమాట.
వసుధాప్రజకు మంచివాఁడు గాఁగోరి
పసిఁడివెచ్చము సేయుఁ బార్థుండు మిగుల.
పెద్దవాఁడవునీవు పృథివినీసొమ్ము ;
తద్దయు నాకు రాఁదగదె ! మీఁదటను.
నిజముచెప్పెద, వారు నృపతులై యుండఁ
బ్రజలకు నామీఁదఁ బట్టదుచూడ్కి.

---

1. వరులు. 2. "అని పురందరుకు బృహస్పతి యెట్లు" అని వ్రాసెనేమో !

కావున, నిచ్చోటుకదలించి వారి
వేవేగ ననుపవే! వేఱొక్కయెడకు."
అనిన నందనుతోడ నాతఁడిట్లనియె:
"తనయ, ధర్మజుఁ డట్టితలఁపులవాఁడె!
ఏజాడ నీరాజ్యమేలఁ; డేలినను,
రాజుతానగుఁగాని, రాజు నిన్ జేయు.
పాండుఁడు రాజుగాఁ బాటించెనన్ను;
బాండుసూనుఁడు నిన్నుఁ బాటింపకున్న!
వదలి యేనొకవంక వారిఁబొమ్మనిన
విదురుండు పోనీఁడు వేయేల!" యనినఁ,
గౌరవుండిట్లను: "ఘనరోషవిషము
వారిమాసందున వర్ధిల్లు నెపుడు;
నీవు పాండుఁడు నుండు నెయ్యంబుగాదు;
గావున వెడలింపఁ గాదన రొరులు.
వదలఁడు నన్ను నశ్వత్థామ హితుఁడు;
తుదముట్ట విడువఁడు ద్రోణుఁడాసుతుని;
నయ్యిరువురవాఁడు నగుఁ గృపాచార్యుఁ;
డియ్యెడ విదురునకేలావు గలదు!
ఏకభావుఁడు భీష్ముఁ డిందును నందు;
నేకార్య మనువుగా దీలోన మనకు.
కలదు గంగాతీరకాననాంతమున
వలనొప్ప వారణావతమనుపురము;
ఈశ్వరస్థాన మనేకభోగైక
శాశ్వతం బచ్చోట సౌఖ్యంబుగలదు;
గడిరాజ్యమది శత్రుగణము రాయిడికి
నెడరైనచో వీరినిడుము మే." లనిన
నొడఁబడి, యాంబికేయుఁడు పాపములకు
నొడిగట్టుకొని, వారినొక్కనాఁ డంతఁ

## పాండవుల వారణావతగమనము

ప్రియపూర్వకంబుగాఁ బిలిచి యిట్లనియె :
"నయనిధులార, యోనందనులార,
యొండుతావుల మిమ్మునునిచెద ; నందుఁ
బొందు కుంతియు మీరు బుద్ధినొందనక.
గంగానదీ తుంగకల్లోల సుభగ
సంగతి నీశ్వరస్థానమైయున్న
వారణావతపుర వరము చేకొనుఁడు ;
వైరులువచ్చుత్రోవకు నడ్డ [1] మగుఁడు ;
మఱి యుత్సవముల బ్రాహ్మణభోజనములఁ
గఱకంఠుఁబూజింపఁగలుగు మీకచట."
అనవుడు ధర్మరాజవుఁగాక యనుచు
వినయంబుతోడ నవ్విభునకు మ్రొక్కి,
గాంధారిపాదపంకజముల కెఱఁగి,
బాంధవులకుఁజెప్పి పయనమానంతఁ,
బోయెదరని యాత్మఁబొంగియు వారి
నాయూరఁదెగటార్ప ననువుచింతించి,
యదయుఁ బురోచనుండనుశిల్పకారు
ముదమొప్పఁబిలిపించి మొదలికారవుఁడు
రౌద్ర దారిద్ర్య నిద్రా ముద్రనణఁచు
భద్రకాంచనమిచ్చి, పసిఁడి తేరిచ్చి :
"రుచివిరోచన, యోపురోచన, నిన్ను
నుచితకార్యమున నియోగింపవలసె ;
వారణావతమున వసియింపఁగోరి,
వారె పాండవు లటవచ్చుచున్నారు ;
పొందుగా మున్నాడిపోయి వేవేగ
నందు లాక్షాగృహమాయిత్తపఱుపు ;

---

1. మఱుచు. (మూ)

మఱియు నాయుధశాల కపరభాగమున
మృదుచతురస్రమై మెచ్చుగా వలయు.
ఆవాసమునఁగాని యచట వేఱొక్క
యావాసమునఁ బార్థులమరంగఁజొచ్చి
రొయింటిమై నిద్రింప, నొకనాఁటిరాత్రి
మంటలుదగిలించి మడియింపు వారి.
ఇంతచేసిన, నాకునేకభోగముగఁ
జింతింప రాజ్యమిచ్చినవాఁడవగుదు."
వనిన నింద్రార్థమై వారునిఁగలంపఁ
బనిఁబూని చను పంచబాణుండువోలె
వాఁడేఁగి, వారణావతమున మున్న
పోఁడిగాఁ గర్పూరమును సజ్జరసము
లక్క మైనంబుఁ దైలముఁ దట్టుఁ బునుఁగుఁ
దక్కొలమును హరిదళము నాజ్యంబు
గుగ్గులుధూళియుఁ గ్రొత్తకస్తూరి
యొగ్గైనమంటితో నొయ్యనఁగలిపి,
మెదిపి గోడలువెట్టి మిద్దెయిల్ పన్ని,
మృదువుగా సున్నపుమెయిపూఁత పూసి,
తెల్లంబుగా మృత్యుదేవతవంట-
యిల్లో! [1] పావకునకు నిడిన నంజుండో!
యన నస్త్రశాలకు నపరభాగమునఁ
బనివడి వాఁడట్లుపన్నుచునుండె.
అట పాండవులు రమ్యమైన లగ్నమునఁ
బటుతర చతురంగబలములు గొలువఁ,
గుంతిఁదోడ్కొని బంధుకోటులనిలిపి,
యంతట దుర్యోధనాదులననిపి,

---

1. పావకునకునిడియము జంగరియె. (మూ)

సంతోషమున నాత్మసఖుల వీడ్కొలిపి,
యెంతయు వేడుక యిగురొత్త నపుడు
గురు భీష్మ కృపులకు గురుభక్తి మ్రొక్కి,
పరఁగినబ్రాహ్మణప్రతతికి నెఱఁగి,
యాయూథచాపులై యరదంబులెక్కి,
పౌరుల బహుదీనభాషలు వినుచు,
'నదరి యాపురలక్ష్మియయిదుప్రాణములు
వెడలెఁబో' మ్మనితోప వెసనూరువెడలి,
యీసునఁ గురుపతి యిలఁబొగడించు
వాసన వారణావతము మేలనియుఁ
దగఁ దండ్రియాజ్ఞగదా యిది! యనియుఁ
బాగులకె తెగువమైఁ బోవుచున్నదను,
గొంతిదవ్వుల వీడుకొను వేళ విదురుఁ
డంతికసుతుఁజేరి యల్లనఁబలికె :
"పనిలేనిపని మిమ్ముఁ బతి తొలంగించె ;
ననుమానములకెల్ల నాలయం బిదియు ;
నచ్చటి శస్త్రవిషాగ్నిబాధలకు
హెచ్చరికలుగల్గి యారుండవలయు ;
బలవంతులని మిమ్ముఁ బరిమార్చుబుద్ధి
మెలఁగుఁగౌరవుఁ ; డదిమీరుఁగన్నదియె ;
యేనును వారి[1] పంచెటేఁగి, మీకడకుఁ
బూని యొక్కకదూతఁబుత్తెంతు." ననుచుఁ
జెప్పి కుంతికిమ్రొక్కి, చింతాభరంబు
గప్పినమనసుతోఁ గ్రమ్మఱవచ్చె.
పదియాఱు పదియేను బదునాల్గు మఱియుఁ
బదుమూఁడునగునేండ్ల ప్రాయంబునాఁడు

1. చెంచెటేఁగి. (మూ)

వరుస ధర్మజ భీమ వాసవి యములు
కరిపురిఁ జొచ్చి యక్కరిపురిలోనఁ
గౌరవులును దాముఁ గలిసి వర్తింప,
వారికి పదుమూఁడు వర్షంబులయ్యె.
అవిగూడ నవిగూడ నైనప్రాయముల
భువి వారణావతపురిఁ జేరఁబోయి,
పురము శృంగారంబుఁ బురవిభవంబుఁ
బురపురంధ్రులు చల్లు పుష్పాక్షతములు
మెచ్చుచు వచ్చుచో, మేదినీశ్వరుల
నిచ్చఁ బొంగుచుఁ బౌరులీక్షించి యపుడు :
" దేవమూర్తుల [1] వీరి దృష్టింపఁ గలిగెఁ ;
బావనత్వముఁ బొందె భవములు మనకుఁ ;
బట్టణంబిది గాఁగఁ బాండునందనుల
నెట్టన రప్పించె నృపులఁ గానోఁచి ;
తొడఁగి దుర్యోధనుదుర్మంత్రమునకుఁ
గడచి వచ్చిరి దివ్యకాయులు వీరు."
అని కొనియాడ నొయ్యన రాజవీధిఁ
జని చని నిజరాజసౌధంబు గదిసి,
కనకరథంబులు ఘనులంత డిగ్గి,
వెనుక వచ్చిన సేన విడియ వీడ్కొలిపి,
పుణ్యాహవాచనపూర్వంబు గాఁగఁ
బుణ్యుల విప్రోత్తములఁ బూజచేసి,
మంగళాలంకారమహితంబులైన
బంగారుగృహములఁ బరిపాటి విడిసి,
కడు నొప్పు కరిపురీకనకసౌధములు
విడిచి వచ్చినవంత విడిచిరి కొంత.
అంతఁ బురోచనుఁ డాజతుశ్శాల
యెంతయు నేర్పుతో నీడేర్చి వచ్చి,

1. వారి. (మూ)

ధర్మసూనునకది దర్శింపజేసేయు,
ధర్మజుండదిచొచ్చి తమ్ములుఁ దాను
నిచ్చలఁ బరమాత్మహృదయంబులోనఁ
జొచ్చినసుఖ మిందుఁజొచ్చినఁ గలిగె.
కదలిన నిది పుష్పకముఁబోలకున్న !
కదలక యిదివోలుఁ గనకాద్రిగుహను.
ఈశ్వరునకు నిట్టియిల్లబ్బనేని,
శాశ్వతంబుగ నేల! శయనించు నొలికి ;
నారాయణున కిట్టినగరబ్బనేని,
నీరధిలో నేల నిద్రింపఁదలఁచు!
కమలజుం డీయిల్లు గానందుగాక,
కమలంబులో నేల ఘనధూళిఁబ్రుంగు!
ఇంతచిత్రపుమేడ లిందుండు చూడ,
నంతరిక్షంబున నతఁడేలయుండు!"
అనికొనియాడి, గృహంబున్నయునికి
మనమలరింపక, మతియొక్కనాఁడు
భీమునకదిచూపి పృథివీశుఁడనియె :
"ఏమొక్కొచిత్ర! మీయిల్లున్నయునికి
నామదినమ్మదు నానావిధముల ;
నీమించుపుట్టునే! యితరమృత్తికల!
తైలాజ్యములతావితఱచు కుడ్యములఁ
బోలింపుచున్నవి ; పొడవెల్ల లక్క ;
కపటంబునకుఁగాని కలుగదీసొబగు ;
విపరీతమునఁగాని వెలయదీయొప్పు ;
ఆగ్నేయదిశనుండునదికారణముగ
నగ్నిభయంబున కర్హమీయిల్లు.
చక్కచూడ్కికిఁ బురోచనుఁడు రోచనుఁడు ;
మక్కువ [1] వీనినమ్మఁగనెట్లువచ్చు!

1. వినియునమ్మంగ. (మూ)

విను మిదియునుగాక, విదురుండు మనల
'ననలవిషాస్త్రంబులరయుఁడి' యనియె."
అనినభీముఁడువల్కు: 'నట్లైన వీని
నెనయఁ దాఁగట్టినయింటిలోఁ గాల్చి,
కురురాజయత్నంబు కుడిపింత.' మనిన —
ధరణీశుఁ: " డదిగాదు; తమకింప రాదు;
ఏమఱకుండుటే యిదినీతి; గాని,
భీమ, యీనీచుఁజంపఁగ నేమిగలదు!
కొన చిదుమఁగనేల! కురురాజు [1] తలఁపు
కనుఁగొంద; మెన్నిమార్గముల రాఁగలఁడో!
మనము [2] మున్పడఁ, దప్పుమనమీఁదవైచి
మనుజేశునకు వాఁడు మంచివాఁడగును;
హస్తినకర్తాబ్ధి యటివోలె నిందుఁ
జొత్తు; మింతేకాని సుఖకాంక్షవలదు."

విదురుఁడు పాండవులయొద్దకు దూతనంపుట

అని లక్కయింటికి నలవోకఁజనుచు
మనముల వారినమ్మనివారుగానఁ,
బగళుల వేఁటాడి పరఁగ రాత్రులను
మగఁటిమి విలుఁగోల మఱువకయుండ,
ముప్పదుల్ మూఁడును మూఁడుముప్పదులు
నప్పూరి దివసంబులరిగె వారలకు.
అత్తఱి, విదురాజ్ఞ నాపురంబునకు
నార్తినపరువులో నొకదూతవచ్చి,
యేకాంతమున వారినేపురఁ గాంచి:
"యోకాంతినిధులార, యొకవార్త వినుఁడు;

1. తనకు. 2. మున్నిన. (మూ)

విదురుఁడుపుత్తెంచె వేగుగానన్ను ;
నిదె నేను ఖనకుఁడ నితరుఁడఁగాను.
దుర్యోధనునియాజ్ఞ దుర్మంత్రమెల్ల
నార్యపూజితుఁడైన యతఁడు మున్నెఱిఁగి,
తెలుపఁబుత్తెంచె నత్తెఱఁగెల్ల వినుఁడు.
తలఁచి కృష్ణచతుర్దశినాఁటి రాత్రి (?)
లక్కయింట మహానలప్రయోగమునఁ
జిక్కించి, మిమ్ముహింసించు యత్నంబు
సేయ నంపించె నీశిల్ప[1] కారుకుని ;
నాయత్న మితఁడు సేయఁగనున్నవాఁడు.
చలమివ్వారికి నేల ! ' చచ్చెడియంత
కలగన్నచోట మేల్కను ' మనికలదు ;
రం.''డనికొనిపోయి, రాత్రి యయ్యెంట
గండిగా నొకచోట [2] ఖనకపుంగవుఁడు
విదురుండు చెప్పినవెరవునఁ ద్రవ్వి,
యదియేరుపడకుండ నల్లనఁ గప్పి :
" యనలంబుదగులక యావల వెడలి
చన మీకునిది త్రోవ జనపతులార ! ''
అని చెప్పి, వారును నయ్యాగనుండఁ,
జనుదెంచెఁ గౌరవసంకేతదినము.
అప్పుడు కుంతి బ్రాహ్మణపురంధ్రులకుఁ
దప్పక దేవతార్థము కుడుపఁబెట్ట
వంటలురుచులుగా వండించి పెట్ట,
ఇంట నొయ్యనజారి మిహిరుండుగ్రుంక.
ఆయెడఁ గుంతికినాప్తురాలైన
బోయత యేవురుపుత్రులుఁ దానుఁ

1. కారునకు. 2. ఖనిక. (మూ)

జనవున నప్పురోచనుదూతయయ్యె
[1] మనసీర యందునెమ్మదినుండుఁగాన,
నడతాఁకి యెడతాఁకి యిచ్చటివేగు
మడఁతి వానికి నాఁడు మతిచెప్పుచుండి,
కుంతియింటనె కూడు కుత్తుకబంటి
వింతగాభుజియించి, వెస నిద్రతోడ
జతుశాల (?) కేతెంచి శయ్యపైఁగూలి
మృతిఁబొందినట్లున్న, మేదినీపతులు
తారును భోజనోత్తరవేళ నెలమిఁ
జేరి కుంతికిఁబాదసేవలుచేసి
శయనించి; రప్పురోచనుఁడు నచ్చోట
శయనించెఁ గలదు నిషాదివేగనుచు.
ధరనట్లుకాద! నిద్రాపరాయణునిఁ
బరఁగనమ్మినవానిపని మోసపోవు!

## లక్క యిల్లు గాల్చుట

అందఱు నిద్రవో, నారాత్రి నిద్ర
పొందనిపవమానపుత్త్రుండు లేచి,
యనలార్చి తెచ్చి యెయ్యన [2] రవుల్కాలిపి,
మును బురోచనుఁడున్నమూల దగిల్చి,
పోరాకయుండఁ దల్పులుదరికొల్పి,
ధీరుఁడు చిచ్చు మీఁదికిఁబాఱఁజిమ్మి
విదురోపదిష్టభూవివరంబు తెఱచి,
పొదఁడని తనవారి బోధించినడపి,
లాగైన యన్త్రశాలలు దరికొల్పి,
వేగంబె తానును వెడలి, యవ్వార్త

1. మనసీరయుండు. 2. లావు. (మూ)

దూతకు నెఱిఁగించి, త్రోవ నేమఱక
యాతతగతి గంగ నార్వురు దాటి
నడచుచో, నిద్రగానముఁ జాలపెద్ద
[1] నడికిన కుంతి నన్నను దోడివారి
భుజముల నఱకడంబున రెండు రొండ్ల
గజలీల భీముఁ డొక్కట ధరియించి,
యుపపర్వతములతో నొకకొండ వోలె
నుపపర్వతములెల్ల నురలఁ ద్రొక్కుచును,
గమనవేగంబునఁ గాళ్లఁ బెనంగు
ద్రుమములు లతలును [2] దుమ్ముగా నడఁచె.
సురభిధూమంబులు సురవిమానముల
బెరయ వహ్నియుఁ గాల్చెఁ బెరిగి యయ్యిండ్ల.
ఏవురుసుతులతో నిటనిషాదియును,
నా వేశ్మకారుండు నయ్యింటిలోనఁ
బావకశిఖలతో భస్మమై పడిన,
వే వేగఁ [3] బౌరులవ్విధము నీక్షించి :
"కుంతియు నేవురుకొడుకులుఁ గాలి ;
రంతంత నివె చూడుఁ డాఱుకుప్పలును ;
జనలేక యిదె పురోచనుఁడును గాలెఁ ;
దనకుచ్చితం బేల తనుఁ గాల్పకుండు !
నేమని యెఱిఁగింత మిది కరిపురికి !
నేమని పలవింత మిమ్మహాత్ములకు ! "
అని యేడ్చుచో, దూత యందఱఁ గూడి
పనవ వచ్చినయట్లు భస్మంబు చొచ్చి,
వదలక యాబిలద్వారంబుఁ గప్పి,
విదురున కావార్త వినిపించెఁ బోయి.

1. నడుకున. 2. ద్రుమముగా. 3. చారులు వేగ. (మూ)

ఆవెన్క పౌరజనావలి దూత
పావకవార్త చెప్పఁగ, విని విభుఁడు
కులిశంబు తాఁకునఁ గుధరంబుగూలు
బలువున ధాత్రిపైఁబడి మూర్ఛనొంది,
ధృతిగలవిదురుండు తెలుపఁగాఁ దెలిసి,
సుతులకు వాపోయె సురలెల్లనవ్వ.
అప్పుడు కృపభీష్ము లాచార్యముఖ్యు,
లప్పురిఁగలవార, లచ్చటిభటులు,
నంతఃపురావాసు, లఖిలకౌరవులుఁ
గుంతికిఁ దత్పుత్రకులకు వాపోవ,
రారాజు తనకేప్పురాకయే శిల్ప-
కారునకై యేడ్చెఁ గడుపాపబుద్ధి.
అంతఁ, 'బ్రమాదాగ్నినైనయాపదకుఁ
జింతింపవల' దనిసేనాధిపతులు
చెప్ప, నించుకధైర్యచిత్తుఁడై నృపుఁడు
నొప్పుగా వారికినుదకంబులిచ్చి,
శ్రాద్ధకర్మంబులు సకలంబుఁజేసి,
బుద్ధిలో నేప్రొద్దుఁ బొగులుచునుండె.
అంతనక్కడ భీముఁ డన్నదమ్ములను
గుంతినెక్కించుకొని సాహసమున
నినరశ్మిదూరని యీరంపుత్రోవఁ,
గొనలు మిన్నందిన కొండలత్రోవ,
నేరుదాటఁగరాని యేటులత్రోవ,
ఘోరరాక్షసులుండు కుటిలంపుత్రోవ
నేతేర, నాఁకటనెరిసి పాండవులు
పాతాళమునఁ బ్రొద్దుపడనున్నవేళ
'నీరువట్టయ్యెడు సలుభీమ!' యనిన,
నీరువట్టినయట్టి నేల నాతఁడును

[1] జెదరక శాఖలన్ జేచాచి మింటి
యుదరంబుత్రోచిన యొక మఱ్ఱిఁగాంచి,
యభవునకైన యామ్రాని మొదల
విభునిఁ దమ్ములఁ దల్లి వెరవొప్పనునిచి,
'యుదకంబు లెక్కడనుండునో!' యనుచుఁ
దుదిగొమ్మ వాయుపుత్త్రుఁడు ప్రాఁకి చూడఁ,
గాక బక క్రౌంచ కారండ [2] కమఠ
కోక బలాకాదికూజితంబులను,
వారివారి మదాంధ వనగజ గంధ
పారణావారణ భ్రమర భాషలను
గానవచ్చెను నొక్కకమలాకరంబు
పూని విష్ణుఁడువోలె భువనభారమున.
వాయునందనుఁ డంత వసుధకుడిగ్గి,
యాయతగతి నేఁగి యమ్మడుఁగుఁజొచ్చి,
మొదలఁ గుత్తుకబంటి మొలబంటిగాఁగ
నుదకంబుద్రావి యాయుపవిల్వానమ్మి,
డొక్కలవలె నాకుడొప్పలుకుట్టి
యొక్కతోయము తోయ మొగినందునునిచి
గొనితెచ్చునంతకుఁ, గుంతియు సుతులుఁ
దనువులుమఱచి నిద్రలువోవ నతఁడు
నుదకంబుడించి వారున్నజాడకును
మదిలోన శోకంబుమల్లడిగొనఁగ
నుండుచోఁ, గర్ణునియుద్దండగతికి
మండునో నామీఁద మారుతియనుచు
శంకించుగతిఁ గ్రుంకె జలజబాంధవుఁడు;
హుంకరింపుచు గూబ లుఱుములుచూపె,

---

1. జెదరక బాగల చేచాచికంట. 2. కురర. (మూ)

బడబాగ్ని భాస్కరప్రభకోర్వలేక
వెడలె వార్ధినంగ వెసఁసంజదోచె;
కమలయుండఁగ రాత్రి గండుతుమ్మెదలు
కమలంబులో నుండఁగాదని చెలులు
చోపిన నవిమొల్లచో నుండెననఁగఁ
గాపురంబే తెంచెఁ గడలఁ జీఁకట్లు;
రాజైనచంద్రుండు రానున్నత్రోవఁ
[1] బూజార్థమైన కర్పూరంపుముగ్గు
బెరయ దిశాకాంత పెట్టెనో యనఁగఁ
గరమొప్పెఁ జుక్కలు గగనభాగమున;
మహి ధార్తరాష్ట్రులు మనవారలనియు,
సహజనామంబుల శకునులమనియు,
[2] శిక్షించునో భీమ నేనుఁడన్నట్లు
పక్షు లూరకయుండెఁ బలుకులుమాని;
మొగి నీలి [3] చీరపై ముత్యాలువోలె
గగనంబుపైఁ దారకంబులు వొడమెఁ;
దనమనుమలకైన తాపంబు మాన్ప
నెనసిన వేడ్కఁ దా నేతెంచెననఁగ,
ధవళంపు వెన్నెల దట్టమై పర్వ
ధవళాంశుఁడుదయించె దండి తూర్పునను.
అత్తఱి, నచ్చోటికనతిదూరమున
నుత్తుంగగృహమున నొక్కరాక్షసుఁడు
సిరులుగ్రమ్మెడు మేను, నెఱసంజెగ్రుడ్లు,
నెఱిగొంకిగోళ్లను, నిడుపైనకాళ్లు,
నందమానొక బ్రహ్మహత్యయువోలె
డిందనిబిరుదు హిడింబుఁడన్వాఁడు

1. భూజాతమైన. 2. శిక్షింపుచో. 3. చిరము. (మూ)

మానుషగంధంబు [1] మఱివల్చుటయును,
లేనవ్వుతో నావులించుచు లేచి,
తనచెలియలిఁజూచి దర్పించిపలికె:
"వినుమహిడింబి, దైవికమున నేఁడు
మనుజులువచ్చిరి మనవనంబునకుఁ;
జని, వారిఁజంపి, మాంసము తెచ్చి నీవు
దీనవుమృగములఁదినినయాచెగటు
మాన, నేర్పునవండుమా చవిపుట్ట.
దేవదానవులునుదృష్టింపరాని
యీవనస్థలియేడ! యీమర్త్యులేడ!

## హిడింబ భీముని మోహించుట

ద్వి. " మ్మనుటయు, నదిపోయి హిడింబి
యమ్మారుతాత్మజు నాననప్రభయుఁ
గన్నులసొబగు, విశాల [2] వక్షమును,
నున్నతఘనభుజాయుగమును జూచి,
పులకించి పంచాస్త్రభూతంబుసోఁకి,
తలఁపునఁ దమకించి తన మేనుమఱచి,
కామరూపిణిగానఁ గడునొప్పుమనుజ
కామినియై, భీముఁగదియ నేతెంచి:
"యనఘ, యేను హిడింబుఁడనురాక్షసునకు
ననుజ; హిడింబనియండ్రునా పేరు;
కామరూపిణి; నేమిగమ్మన్ననగుదు;
నీమూర్తిపసఁజొక్కి, నిన్నుఁగామించి
వచ్చితి; నిమ్మహావనములో మీరు
చొచ్చివర్తించుట చోద్యంబు దలఁప!

---

1. మాఱు. 2. వక్షతయు. (మూ)

మిమ్ము నంజుడుచేసి మృదువుగా వండి
తెమ్మని నన్నుఁబుత్తెంచె మాయన్న ;
ఆలిగా నన్నేలు ; మఱియైన, మిమ్ముఁ
బాలింతుఁ ; బట్టిచంపఁడు హిడింబుండు.”
అనిన భీముఁడు నవ్వి యానాతిఁ బలికె :
“ వినుము, రాక్షసులకు వెఱవ నెన్నఁడును ;
నిండారు సుఖమున నిద్రించువీరి
లెండని యేనేల లేపుదుఁ దొలఁగ !
వనశాంతిగా నేఁడు వధియింతుఁ వాని
నను వెఱపింపక నాకారిఁ దెమ్ము.”
అనునంత, రాక్షసుం డతులకోపమునఁ
జనుదెంచెఁ దనపండ్లు సానపట్టుచును.
‘ వచ్చిన పని యేల వదలితి ’ యనుచు
నచ్చెలియలిఁ జంప నాయితం బైనఁ,
కెచ్చెర నది భీమసేనుని మఱుఁగుఁ
జొచ్చెఁ ; జొచ్చిన వాయుసుతుఁ డాదరించి,
కలహసన్నాహంబు గాసరా లేచి,
చులకని చూడ్కి నాసురవైరిఁ జూచి :

## భీముఁడు హిడింబాసురు మడియించుట

“ ఘోరరాక్షస, నీకు నుర్విలోఁ బులుగుఁ
బూరేఁగు నాహారమునకబ్బెఁగాక,
చిక్కెనె పాండవసింహంబు లకట !
చక్కఁజత్తువుగాక సరి నెదుర్కొనిన,
నేలకువ్రేఁగైన నిను బోరఁగనుట
చాలనుత్తమ.” మన్న సైరింపకసుర :
“ మానవాధమ, నిన్ను మడియించు టెంత !
యేను జీరికిఁ గొన నింద్రాదిసురల.

ఉరవడి మ్రింగెద నోలి మిమ్మెల్ల
నఱిగిపోదురుగాక యరిది నాకుక్షి."
ననుచు దండాకారమగు బాహుదండ
మనిలజుమీఁద నయ్యసుర యెత్తుటయు,
నదలించి [1] తనదు బాహాశక్తి వానిఁ
బ్రిదులకుండఁగఁబట్టి భీమసేనుండు :
"ఆజియిచ్చటనైన నాసంభ్రమమున
రాజులనిద్రాభిరతి యేమియగునో !
యెడగలుగఁగ వీనినీడ్చెద ;" ననుచు
నొడలెల్లఁ దోఁగ దైత్యుని భీముఁడీడ్చె.
విడిచినఁ గాల్కొని వీఁగక యయ్యసుర
పిడికిటఁబొడిచిన, భీముండువొడిచె.
[2] పసరించుపోటుల పసవిచారింప
నసురమర్త్యుఁడు మర్త్యుఁడసురయునైరి.
అప్పుడు రణకాంక్ష నతఁడును నితఁడు
నుప్పొంగి పేర్చి బాహువులప్పళించి,
యురమును నురము, బాహువులు బాహువులు,
శిరమును శిరము నూర్జితశక్తిఁ దాఁకి,
పిడికిటిపోటులఁ బెడచేతివాట్ల
విడువనివ్రేటుల వినరు [3] దాటులను
నుక్కులై పోరుచో, నురుపాదహతుల
నిక్కినధూళి మునింగిరిర్వురును.
తుదినుండి మొదలికిఁ దొలుసంజె మొగులు
పొదివిన భూధరంబులజోడు వోలె
మెఱయుచో, భీముని మెదలరాకుండ
నిఱికటంబునఁబట్టి యింద్రారియార్వఁ
గలఁగెఁబయోధులు, కంపించె గిరులు,
తలగ్రుచ్చెఁగూర్మంబు, తడఁబడెదిశలు.

---

1. వాని. 2. పసిమిన. 3. వాటులును. (మా)

ఆమహాధ్వనివిని యట నిద్రదెలిసి,
భీమునిఁగానక పృథయుఁ బార్థులును
జింతించి, రాక్షసస్త్రీనొద్దఁగాంచి ;
“ యింతచక్కనికాంత యెట్లొకోకలిగె !
ధాత్రికిఁదిగిన గంధర్వకన్యకయొ !
చిత్రమీరూపంబు ! క్షితిలోనలేదు ;
ఇది భీమువృత్తాంత మెఱుఁగుఁబో.” మ్మనుచుఁ
గదిసి యందఱునడుగఁగ, వినయమున
నదిచెప్పె : “ మీభీముఁడసురతో వాఁడె
చెదరక కయ్యంబు నేయుచున్నాఁడు.
ఆ రాక్షసునిచెలియుల నే హిడింబ ;
నీరూపుగైకొంటి నిందఱువినుఁడు.
అలవోక మిమ్ము మాయన్న హిడింబుఁ
డిలఁగూల్చి తెమ్మని యిటనన్నుఁబనుప
వచ్చి భీమునిరూపవైభవంబునకు
నిచ్చ నేఁజొక్కుచో, నెఱిఁగి రాక్షసుఁడు
మీతోడ నన్నును మ్రింగెదననుచు
నేతేర, మీనిద్ర యొడలునోయనుచు —
వాతనెత్తురులొల్క వాని వాతూల
సూతి దవ్వుగనీడ్చి ఘోరతమెఱయ
నచ్చోటఁబెనఁగెడు ; నసురవధించి
వచ్చునింతట.” నన్న వారు బిట్టులికి
యుదరాగ్ను[1] లాదుఁగ నయ్యుదకంబుద్రావి,
కదలి యాహవభూమిఁ గదియవచ్చుటయు,
నసురఁగౌఁగిటనూఁది యనిలనందనుఁడు
వెసవానిద్రేయుచో, వీక్షించి నరుఁడు :

---

1. లొలుక. (మూ)

"ప్రొద్దుపోయినఁగాదు పోరిగొనువీనిఁ ;
పెద్దసేయకుభీమ, బెగడెదుఁగుంతి.
కయ్యంబు వెండియుఁ గలిగెడుఁ గాని,
యియ్యుగ్రభుజుఁగూల్పు ; మిదిదైత్యవేళ."
అనిన వాయుజుఁ డట్టహాసంబుచేసి,
మనుజభోజను నూఱుమాఱులుదాఁకఁ
గదకాలువట్టి యాకసమునఁద్రిప్పి
పుడమితో వ్రేయుచుఁ, బోనికోపమున
వెసఁద్రొక్కి, కోలెమ్ము విఱిచి, దిక్కులకు
నసురఁ బాఱఁగవైచె నమరులుపొగడ.
కలిగె సంవత్సరగ్రాసమై వాని
పొలను రక్తంబు జంబుకభూతములకు.
అనిలజుపై నంత నప్సరస్త్రీలు
గొనకొని కురిసిరి కుసుమవర్షములు.
అప్పుడు ధర్మరాజంబయుఁ దాను
నుప్పొంగి కౌఁగిట [1] నొదిగించె భీము."
అనియిట్లు జనమేజయావనీంద్రునకు
మునిచెప్పె ననిచెప్ప మోదించిమునులు :
'అనఘాత్మ, తరువాతనైనవృత్తాంత
మనువొప్పఁజెప్పవే!' యని యడుగుటయు,
ఇదిసదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్త్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితాదిపర్వ నిర్మలకథయందు
నుచితమై యాశ్వాసమొప్పె నేనవది.

---

1. నొనరించె. (మా)

# షష్ఠాశ్వాసము

శ్రీయుత వాగ్జాల సిద్ధివిశాల,
న్యాయనూతనచోడ, నరసయచౌడ,
పంచమవేద ప్రబంధ సత్కీర్తి
మించినసత్యధర్మ! చిత్తగింపు;
అక్కథకుఁడు శౌనకాదిసన్మునుల
కక్కథానూత్న మిట్లని చెప్పఁదొణఁగె.
ఆవిధంబున దైత్యుఁడణఁగినపిదప
భావిత హర్షసంభ్రమములు దోపఁ
గొడుకులనీక్షించి కుంతి యిట్లనియె:
"కడలేనియీకాన ఘనులార, మనకుఁ
జరియింపనేటికి? జనపదంబులకు
వరయుక్తిఁబోవలె వనము వెల్వడుఁడు."
అనిన నయ్యోగురు నౌఁగాక యనుచు
జననీసమేతులై సమ్ముదంబునను
అచ్చోటుచాలించి యరుగుచో, వెంట
వచ్చుదానవిఁజూచి వాయుజుండనియె:
"ఏలవచ్చెదు బాల! యీవేళ కొలువు
చాలుఁ; జయ్యనఁబొమ్ము సదనంబుకడకు.
అన్నఁజంపినపగ యాత్మలోనిడిన
నిన్ను నమ్ముటయెట్లు! నీవురాక్షసివి;
కాదేని, నీరూపుగై [1] కొనఁ జనునె!
పోదువు మీయన్నపోయినకడకు."
అనిన హిడింబ దైన్యంబునఁ గుంతిఁ
గనుఁగొని కదిసి యేకతమ యిట్లనియె:

1. కొని చనకు. (మూ)

"కులముతోఁ బగఁగొని కుసుమాస్త్రబాణ
దళితనై వచ్చితిఁ దనుబొందుమనుచు ;
కపటమెఱుంగ ; రాక్షసినైననేమి !
విపరీతమున నన్ను విడిచినఁ జత్తు.
చెప్పఁగదే ! భీమసేనున కెఱుఁగ
నిప్పుడు ననుడించి యేఁగుట తగదు.
[1]తగ నతీతానాగతము లెఱుంగుదును ;
బగతుచే మీరుత్రోపడినచ్చినారు ;
ఇద్దెస మీకింక నేఁగుచో నెదుటఁ
దద్దయు విశ్రాంతి తరువులు [2]కూర్పఁ
గన్నులపండువై కడుసమీపమున
నున్నది విను శాలిహోత్రునాశ్రమము.
అచ్చటకేఁగి మీరర్థినున్నంత
వచ్చు వేదవ్యాస పరమునీశ్వరుఁడు.
అతఁడు బుద్ధి మీకానతియిచ్చు ;
నాతి, వెండియు విను నావిశేషములు.
కోరినయెడలకుఁ గొనిపోదు మిమ్ము ;
వారక తెత్తు మీవాంఛితార్థములు ;
ఏరూపుగమ్మన్న నేను గానేర్తు ;
నూరక తానేల నొల్లఁడె !" ట్లనినఁ
గుంతిసంతోషించి, కొడుకుతో దాని
మంతనంబెఱిఁగించి మఱియుఁబ్రార్థించి :
"రా భీమ, దానవురాలి. విరాలి
లాలించు మనకు నేలా దిగవిడువ.
'చేపట్టుశరణ' ని చేరినవారి
నేపట్టునను గాచు టిదిధర్మ." మనిన

1. తగనతీతానాగమతతు... 2. మాన్ప. (మూ)

ననిలజుఁ డమ్మాట కంగీకరించి
దనుజకామినిఁజూచి తగ నుత్తరించి :
"యోజతో దినమెల్ల నొకచోటఁబుచ్చి
రాజీవముఖి, రమ్ము రాత్రినాకడకుఁ;
గోడుకుగల్గినదాఁకఁ గొమ్మ, యీరీతి
నడతాఁకి, వీడ్కొను మెలఁగియువ్వానుక."
అనియొడఁబడఁజెప్పి యందఱుఁగూడి
చనుదేర, వేదఘోషంబులతోడ
వేడుకఁ బులినాకివిడిచిన లేడి
దూడలచేఁ బడ్డ దోరువులచేత,
హరిదువ్వ నిద్రించు హస్తులచేతఁ,
బరమాత్మఁ జింతించు బకములచేత,
ఘనబిడాలములకుఁ గందమూలములు
గొనితెచ్చు మూషికకులములచేత,
నహులకు యోగనిద్రాసక్తి నుండ
బహుబిలములు చూపు బభ్రులచేత,
వాసిత మాసోపవాస వరాహ
కాసర శరభ ఖడ్గంబులచేత,
శాఖలగతి వేదశాఖలు [1] గలుగు
శాఖులచే నతిసౌమ్యంబ యగుచు
ననుపమ శాలిహోత్రాశ్రమంబున్నఁ
గనుఁగొని మ్రొక్కి భాస్కరునుదయమున
నిత్యసంధ్యావిధుల్ నృపు లందుఁదీర్చి,
దైత్యకామినిమాట తథ్యమౌననుచు
నున్నయప్పుడు వ్యాసుఁ డురుకృపావాసుఁ
డున్నతాజినవాసుఁ డొయ్యనవచ్చి,

. . . . . . . . . . . . . . . . . . . . . . .

హరినాత్మనునిచిన యానిమిత్తమున

. . . . . . . . . . . . . . . . . . . . . . .

1. గలిగి-సాఖంబులచేత నతిరమ్యమగుచు. (మూ)

వేడుకం బూజించి వినతులై యున్నఁ,
గోడలి మనుమలఁ గూర్చుండఁబనిచి,
యాసీనుఁడై పాండవాగ్రజుఁబలికె:

## వ్యాసుఁడు పాండవులకు హితోపదేశము సేయుట

" పాసిపొండని మిమ్ముఁ బలికెనే నృపుఁడు!
కొడుకుఁ దానును నొక్కకుత్తుకయగుచు.
వెడలివచ్చుటమేలు వెయ్యేల మీకు;
వదలక మిముఁ జావువారలఁజేసి
యుదకంబులను నిచ్చియున్నారు వారు.
ఓలిఁగౌరవులకు నుదకంబులిచ్చి,
యేలుదు భూచక్ర మీవు చింతిలకు.
నాలుగుభుజములు నారాయణునకుఁ
బోలెఁ దమ్ములు నీకు భుజబలోన్నతులు.
రాజసూయమహాధ్వ[1] రంబశ్వమేధ
వాజపేయములు భూవర, సేయఁగలవు;
ఇంతనుండియు మిమ్ము నెఱుఁగరాకుండఁ
గొంతకాలము మౌనిఁ గొలిచి యుండుండి,
యేకచక్రమునకు నేఁగుఁ; డేనంత
నాకడకేతెంచి యరయుదు మిమ్ము.
కమలలోచన యిది కడుముద్దరాలు;
రమణి రాక్షసియని రాదు వర్జింప.
తనయు మహాసత్త్వుఁ దనయంతవానిఁ
గను నింద భీముఁడు; కౌంతేయ, మఱియు
నొక్కొకయాపద యుదయించువేళ
నక్కుమారుఁడు మిమ్ము నందఱఁ గాచు."
అనివ్యాసుఁడేఁగిన, నయ్యాశ్రమమున
మునితోడ బహుశాస్త్రములు చదువుచును

---

1. రంబును నశ్వ. (మూ)

మనుజేంద్రులున్నచో, మారుతి యంత
దనుజకామినితోడ దర్పకకేళి
వెసఁ బుష్పకముఁగన్న వేల్పును బోలెఁ
బొసఁగ నానామార్గములఁజరింపుచును,
నేరూప మేప్రాయ మిచ్ఛకువచ్చు
నారూప మాప్రాయ మతివఁగమ్మనుచు
విహరింప, నుదయించె వెస ఘటోత్కచుఁడు;
సహజశస్త్రాస్త్రుండు, శంఖకర్ణుండు,
శ్యామలతనుఁడు దంష్ట్రాకరాళుండు,
భీమవిక్రముఁడు, గంభీరభాషణుఁడు,
రాక్షసయుతుఁడు సంప్రాప్తయౌవనుఁడు,
వీక్షింప సురలకు వ్రేఁగైనవాఁడు.
దనుజుఁడాగతిఁబుట్టి తల్లికిమ్రొక్కి,
మనుజేశులకు మ్రొక్కి మాలిఁగేల్మోగిచి:
"పనిగలయప్పుడు భవ్యాత్ములార,
ననుదలంపుడు వత్తు నానేనఁగూడి;
వచ్చి, సంకటములు వడి నెన్నియైనఁ
బుచ్చివైచెద మీరు బుద్ధిలో మెచ్చ."
ననిచెప్పి, వారిచే ననుమతి వడసి
చనియె నుత్తరముగా జననిఁదోడ్కొనుచు.
ఆలోనఁ బాండవు లట్లు శాస్త్రములు
శాలిహోత్రునియొద్దఁ జదివి చాలించి,
యతనిచేఁ బూజితులై మ్రొక్కి కదలి,
చతురత మత్స్యరాజ్యములోన నడచి,
యంతఁ [1] త్రిగర్తరాజ్యములోన వెడలి,
యంతఁ గీచకవిషయంబులు దాటి,

---

1. త్రిగర్తక. (మూ)

## ఏకచక్ర పురావాసము

లాటరాజ్యంబున లలి బ్రహ్మలోక
చాటువుగల యేకచక్రంబు గాంచి,
యనుపమకీర్తు లయ్యగ్రహారంబు
ఘనవిప్రవేషంబు గైకొని చొచ్చి,
విడిదలగా నొక్కవిప్రునియింట
విడిసి వేదంబులు వేడ్కఁజదువుచు,
నేగురుభిక్షార్థమేఁగి నిత్యంబు
నోగిరంబులు దేర, నువిదభాగించి
సగముభీమునకిచ్చి సరినున్నసగము
ప్రేమ నేవురుఁ దృప్తిబెరయఁ గుడుచుచును
నుండుచో, రవితోడ నుల్లసంబాడు
పాండవ తేజంబు పరికించి ద్విజులు :
“ ఐదుమోముల శివుండైదు [1] వేషంబు
లాదటగతిఁ దాల్చి యరుదెంచినాఁడొ !
పరహితోన్నతినొప్పు పంచభూతములు
ధర నిట్టితనువులు దాల్చియున్నవియొ !
ఈ తేజములు వీరికెక్కడఁ గలిగె
ధాతనూతనసృష్టి తలఁప [2] నేవురును ! ”
అనునంత, నొకనాఁడు హాహారవంబు
వినవచ్చెఁ దారున్నవిప్రునియింట.
అదివిని, కొంతియు ననిలనందనుఁడు
సదయులై కదిసి విచారింపుచుండ,
నాలోన మూర్ఛిల్లి యల్లనఁదెలిసి
యాలి బిడ్డలఁ జూచి యాయింటిద్విజుఁడు :

---

1. వేదంబు. 2. కెవ్వరును. (మూ)

“ అక్కట! సంసారమతికష్టమగుట
నిక్కమెఱింగియు నేరుపులేక
యాలని బిడ్డని యడియాసఁ జొచ్చి
తూలుదునే యిట్టిదుఃఖాబ్ధిమునిఁగి!
యీదెసనైక తొల్లి యీపల్లెవిడిచి
పోదమురమ్మన్నఁ బొలఁతి రాదయ్యె.
ఒగ్గుగూడిన యగ్నిహోత్రంబు విడిచి,
యగ్గలంబైన దేవార్చన విడిచి,
యతిథిసత్కారంబులన్నియు విడిచి,
మృతికేఁగవలసెనే మిన్నక తనకు!
పుత్త్రుండు బాలుఁడు పొమ్మనరాదు;
పుత్త్రి యల్లునిసొమ్ము పొమ్మనరాదు;
పొలఁతి యుత్తమసాధ్వి పొమ్మనరాదు;
నలువురమీయింట నాకుఁబోవలసె.”
అనవు డప్పుడుచూచి యంగనపలికె:
“ననుఁబంపు ప్రాణేశ, నరభోజనునకు;
నెసగ బిడ్డలఁగంటి నీడేరమనువు;
అసురచేఁజత్తు ముత్తైదువచావు.
పతిలేక బ్రదికెడు పడఁతిజీవనము,
కుతలంబుతిట్టు...............
పడినమాంసముఁజూచి పక్షులువోలె
వెడదలగాఁజూచి విటులుగోరుదురు.
కులమువిచారించి కూఁతునీనేరఁ;
జలముతో బాలునిఁ జదివింపనేర;
నేనుజచ్చిననేమి! యింక వివాహ
మై నీకుఁ బుత్త్రుల నార్జింపవచ్చు.”
ననిన నిర్వురఁజూచి యాకూఁతురనియె:
“ననుబంపుమచటికి న్యాయమార్గమున;

నెంతకాలమునకు నే వింతదాన ;
నింత మేలొనరించి యే ముక్తిగాంతు ;
గురుఁడు శ్రాద్ధము సేయఁ గూఁతునకెక్కు ; -
గురునకు శ్రాద్ధంబు కూఁతుచేఁగాదు ;
గురులార ! మీరున్నఁ, గొడుకులుఁ గూఁతు
లిరవొందఁ గల్గెద రిండ్లునిండంగ."
అనునంత, సెలగోల యుల్లార్చి పేర్చి
తనముద్దుమాటలఁ దనయుఁడిట్లనియె :
"ఎవ్వరుఁబోనేల ! యేను నీదివ్వఁ
ద్రెవ్వనేయుదు నట్టిదీనరాక్షసుని ;
నబ్బకదానవుఁ డబ్బక కాక,
యిబ్బాధనొనరింప నెంతటివాఁడు !
ఇదె చన్నుగుడిచి పోయెద." నన్న నవ్వి
మదిశోకమించుక మఱచియున్నంతఁ,
గుంతి బ్రాహ్మణుఁజేరి : "గుణధామ, మీకు
నింతచిక్కులువడ నేమికారణము ?
చావ నెచ్చోటికిఁ జనవలె మొదల ?
ఆవల నెవ్వారికాహారకాంక్ష ?
ఎఱిఁగింపు వినియెద ; నేభంగినైన
వెఱపుమాన్చెద." నన్న విప్రుఁడిట్లనియె :
"ఏమనిచెప్పుదు నింతి, యిప్పురికి
నామడ యమునామహానది గలదు ;
అందు దైత్యుఁడు బకుండనువాఁడు తొల్లి
సందుచేకొని యేకచక్రంబువారి
నొక్కటమ్రింగుచో, నూరిబ్రాహ్మణులు
తక్కక జప హోమ దాన సత్త్వమున
నసురేశునిల్పుచు నప్పుడిట్లనిరి :
'పొసఁగ నిందఱమ్రింగి పోనేల నీకు !

¹నొక్కట శశిమ్రింగ నొల్లక కాదె
యొక్కొక్కకళ మ్రింగుచున్నారు సురలు!
దనుజేంద్ర, నీకు నిత్యము బండిగట్టి
యెనుబోతులనుగట్టి యిరువంక రెండు,
బండిలోఁ గూరలు భక్ష్యభోజ్యములు
నిండించి, యొక్కమానిసి దోలుకొనుచు
నేతెంచు నీవున్న యెడకు; నీ వంతఁ
బోతుల మనుజుని భోజ్యఁబుగొనుము.' —
నావుడు నొడఁబడి సదికేఁగె వాఁడు.
దేవి, యీయది సాగు దిన మొకయింట;
నువిద, నూతేండ్లకు నూరిల్లఁ గలియు;
వివరింప నీయూరి విధమదెట్టిదియొ!
ఏతెంచె నేఁడు మాయింటికి వరుస
నాతి, వోవలె." నన్న నరనాథు దేవి:
"కలవాఁడు నీకు నొక్కఁడె పసుబిడ్డ;
తలఁప నేవురునాకుఁ దనయులుగలరు.
ఒక్కనిఁబుత్తు నీయుపకారమునకు
గ్రక్కునఁ బ్రత్యుపకారంబుగాఁగ;
నుంటిమి నీయింట నుల్లంబులలర;
వెంట ²నొడల్ రాదు విప్ర, యెవ్వరికి."
అనిన విప్రుఁడుపల్కె: "నతిథుల మిమ్ము
దనుజులకనుపుట ధర్మమా తల్లి!
గ్రామసూతకులము గావున మాకు
భామ, యీవిధమును బాటింపవలసె;
నేనుబోయెద." నన్న నిట్లనుఁగుంతి:
........................
"భీమదైత్యులువోరఁ బ్రిదులఁడీ కొడుకు;

---
1. ఒక్కొక. 2. నిండు. (మూ)

దానవు నాహవస్థలిఁ జంపివచ్చు ;
నేనొండువిధమైన నేటికిఁబుత్తు !
తొల్లియు దైత్యులఁదునుమాడినట్టి
బల్లిదుం." డని ప్రీతిఁ బవనజుఁజూచి :
"తడయక బకుఁజంపి తనయ, ర ;" మ్మనుచుఁ
గొడుకు నియోగించెఁ గుంతివేడుకను.
అంతఁ దమ్ములుఁ దాను యమసూతి వచ్చి,
వింత భీముని యందు వీక్షించి యెఱిఁగి
కుంతికినిట్లనుఁ : "గుంతి, యిదేమి !
యెంతయుఁదెలిసి నేఁడిటఁ జున్న వాఁడు ; -
కయ్యంబదెక్కడఁ గలిగెనో తనకు ?
నియ్యత్న మేమైన నెఱుఁగుదే !" యనినఁ,
గుంతియావిధమెల్లఁ గొడుకుతోఁ జెప్పఁ
జింతించి, యతఁ : "డిట్లు సేయంగఁ దగునె !
విడువవచ్చినయట్టె వీరుం డితఁడు !
వడముడి భారతవంశవర్ధనుఁడు.
ఎల్లసంకటములు నితనిచేఁగాదె !
తల్లి, యీవును మేముఁ దప్పి వచ్చితిమి ;
ఇతఁడుగూల్చిన వైరు లెత్తరె తలలు !
మఱిఁ గార్యహేతువు మఱచితి." వనినఁ
దల్లి పుత్త్రుసిఁజూచి : "ధర్మమె తప్పు !
నెల్లవారలలావు నెఱుఁగవు కొంత.
పావని పుట్టినపదియవనాఁడు
నా వెరవునఁదప్పి యవనిపైఁ బడిన,
నిసుమయ్యె నాకొండ యెల్లరు నెఱుఁగ ;
నసురఁజంపఁడె మున్న నాహిడింబాఖ్యు !
ఆ ప్రభావమున మహాపుణ్యుమునను
విప్రకార్యార్థమై వీనిఁబొమ్మంటి."

అనిన సంతోషించి యసురపైఁ బవన-
తనయు నియోగించె ధర్మసూతియును.
అప్పుడు సందేహ మాత్మలోఁ బాసి,
యుప్పొంగి పలికె వాయుజుఁడు బ్రాహ్మణుల :
"కడుపార నశనంబు గానమిఁ జేసి
కడుడస్సియున్నాఁడఁ గరుణాఢ్యులార !
తెండు నాకశనంబు తృప్తిగా." ననిన,
నిండారు వేడ్కతో నెలఁతయుఁ బతియుఁ
గడవలవార్చినకమ్మనికూడు,
నెడపనిబానల నివురువంటకముఁ,—
గొప్పెర్లనుడికిన గుజ్జువులగము,
విప్పైనకాఁగుల విచ్చుపాయసము, -
నేర్పడఁ బరఁటులనెనసినపప్పుఁ,
బేర్పననుడికిన పిండియుక్కెరయు,
ఖండశర్కరయును, గడవలకొలఁది
మండిగలాజ్యంబు మఱిమొదలుగను
గలిమియేర్పడఁదెచ్చి కదలికాపత్ర-
ములఁబోయఁబోయ, భీముఁడు వానినెల్లఁ
గలిపి ముద్దలుచేసి కడుజఠరమున
నిలిపి మెంగిలివార్చి, నెమ్మోముదెలియఁ —
బోలఁగొండలవంటిపోతులు దివియఁ-
జాలక పెనఁగునాశకటంబువెంట
నల్లనవచ్చి, యయ్యసురయున్నడకు
నెల్లేరువునఁబోక యెగువకుఁబోయి, (?)

బకాసురవధ

రమ్మని యొకమాఱు రాక్షసుఁబిలిచి,
క్రమ్మఱ నయ్యేటికటికిఁ డిగ్గి,

శకటంబుడిగ్గి యాచమనంబుచేసి,
బకుఁడువచ్చినదాఁకఁ బసలేదుగాన
బండిలోపలికూడు బావుకొనంగ,
మండుచు బకుఁడు గ్రామంబుపై నలిగి :
"యొక్కటఁ దముమ్రింగ నొల్లకయున్న
మిక్కిలిక్రొవ్విరే ! మేదినీసురులు ;
రారైరిప్రొద్దున ; రాకున్న నేమి,
తేరైరి నేనున్న తెరువుకు బండి ;
తేకున్న నేమి, నాదృష్టిమార్గమున
నీకూడుగుడువ వీఁడెంతటివాఁడు !"
అనిపోయి పిడికిట ననిలజుఁ బొడువఁ,
దనుగానివానిచందమున భీముండు
తలఁకక పాణకయంతయు రిత్తచేసి,
జలముల మఱియు నాచమనంబు చేసి,
యుర్వికివ్రేఁగైన యొకమాను వెఱికి
దుర్వారుఁడై యేసె దుష్టదానవుని.
వాఁడంత నొకమాను వలచేతఁ బూని,
వేఁడిచూపులఁ బాండవేయునిఁజూచి :
"మనుజభోజనులైన మాకు నీవెంత !
మనుజకీటమ, నిన్ను మడియించి నేఁడు
ఎడపనియాఁకట నే నిండ్లతోడఁ
గడిచేసి యేకచక్రము మ్రింగువాఁడ
నిలు." మని యొకమ్రాను నృపునిపై నేయఁ,
బలు దునియలుచేసి పలికె రాక్షసుని :
"ప్రకటించి యసిచూపి బ్రాహ్మలచేత
నొకకాసుమొదలుగా నొల్లరునృపులు ;
అట్టిబ్రాహ్మణుల నేలా ! యిల్లువరుసఁ
బొట్టకై చంపితి పుణ్యవిదూర !

మనుజులపునుకలు, మఱి [1]రక్తబండ్లు,
నెనఁపయట్టలు నిండ నేటిచాడ్పునను;
అన్నియుఁ గ్రక్కింతు." నని వాని నగసి
తన్నిన, వాఁడు నుద్ధతి భీమునురము
వదలకపొడిచిన, వారిరువురకుఁ
గదనంబు లోకభీకరముగా నయ్యె;
ఉరుముష్టిహతి మ్రోఁత యుబ్బటగాని,
కరములరాకపోకలు గానరావు;
పడుట లేచుట కానఁబడుఁ గొంతగాని,
వడముడి బకుఁడన వరుస నేర్పడరు;
విదలింప నదలింప వ్రేటును వాటుఁ
బొదివి నొక్కును ద్రొక్కుఁ బోటును మాటు
నొడుపును విడుపు నొండొరుత్రోపు దాపుఁ
దొడికిపట్టును బట్టుఁ దొరమై నిగుడ
నంధకాసురునకు హరునకుఁబోలె
బంధురసమరంబు బకపాండవులకు
నడచుచో, నలిగి మారుతిపట్టి వానిఁ
బడఁద్రొక్కి, యంత నేర్పడ నిరుఁగేలఁ
గటుకున నటవచ్చి కట్టియువిఱుచు
పటులీల విఱిచె నాపాపాత్మురొమ్ము.
అప్పుడు బకుఁడు మహాధ్వనిసేయఁ
జప్పుడువిని వచ్చి సకలరాక్షసులు
వినువీధినిలిచిన, వీక్షించి భీముఁ
డనియె: "రాక్షసులార, యందఱువినుఁడు;
ఏకచక్రమునకు నెవ్వఁడే నగ్గు
గైకొనిచేయు నాకపటరాక్షసుని

---

1. రక్తపండ్లు. (మా)

నీచావుచంపుదు నెత్తిఁగిపొం" డనిన,
వేచనిరామాటవినుచు రాక్షసులు.
బకుని నెత్తురుటేఱు పాఱినచోట
బకములు నిలువక బంతులుసాగె.
ఆరీతి బకుబారి యాహిడింబారి
యూరికిలేకుండ నుపకృతిచేసి,
బరువైనయాకళేబర మీడ్చి తెచ్చి
[1] పఱగటవైచిన, బ్రాహ్మణోత్తములు
వనిలసంభవుని బాహాధురంధరునిఁ
గనుఁగొనవచ్చిరి కట్టలుగట్టి.
సురపురీసురుల భూసురుల దీవనలు
కరువలిపట్టికిఁ గలిగె [2] వేవేలు.
వేవిధంబుల నిట్లు విప్రప్రతిష్ఠ
గావించి వేడ్కతోఁ గొంతేయులుండ,
నత్తఱి నొకవిప్రుఁ డాగృహంబునకు
హత్తినరతిఁ దీర్థయాత్రకై వచ్చి,
గృహపతిఁగాంచి యాగృహమేధిచేత
బహుభంగిఁ బూజలువడయు, నారాత్రి
కొడుకులువినుచుండఁ గొంతి యావిప్రు
నడిగెనిట్లని చేరి యతివినయమున :
" ఏదేశమునవార ? లెందుఁ బోయెదరు ?
భూదేవ, యేభూమిభుజుఁడు ధార్మికుఁడు ?
అతిథులఁబూజింప నాత్మలోఁగోరు
హితులు పుణ్యగృహస్థు లేసీమఁగలరు ?
తలఁప నేమైన వార్తావిశేషములు
గలవె ! మీ రెఱుఁగనికటకంబులేదు

1. పరకటు. 2. దీవనలు. (మా)

చెప్పఁడా." యనుటయుఁ జెలువనీక్షించి
యప్పుడావిప్రుఁడిట్లని చెప్పఁదొణఁగె:

### ద్రౌపదీ ధృష్టద్యుమ్నుల జననము

"భామ, యేదక్షిణపాంచాలభూమి
ధాముఁడఁ; దీర్థయాత్రకు వెడలితిని.
ద్రుపదుఁడచ్చటిరాజు దుష్టమర్దనుఁడు;
విపులధర్మముత్రోవ విడువఁడా రాజు.
అతనిరాజ్యంబున నతిథిపూజనము
పతిపత్నులేకమై భక్తిఁ జేయుదురు.
ఆనృపునింట స్వయంవరంబైన
నే నందుఁబోయెద నిప్పుడు మరలి.
ఈక్షింపఁబోయినయెల్లవిప్రులకు
దక్షిణలిచ్చునాతండనివింటి."
ననిన: "స్వయంవరం బతనికిఁ జేయఁ
బనియేమి? నాకు నేర్పడఁజెప్పు." మనిన,
నారాచకూఁతున కావిప్రుఁడనియె:
"కారణంబడిగితిఁ గ్రమమొప్పవినుము;
రామ, ద్రోణుండు భరద్వాజమునికిఁ,
బ్రేమతో ద్రుపదుండు పృషతభూపతికి,
నొక్కట మునిసీమ నుదయించి పెరిగి
మక్కువ నన్యోన్యమైత్రి వాటించి
యున్నచో, ద్రుపదునకుర్వీరాజ్యంబు
క్రన్ననఁబూనఁబోఁ గార్యంబు గలిగె.
గురుని రమ్మనిపిల్వ గురుఁ: 'డీవుపొమ్ము;
శరవిద్యనేర్చి యచ్చటికి నేవత్తు;
మఱవకు.' మనుటయు: 'మఱతునే యేను!
జెఱిసాము నీకు నీక్షితి యిత్తుఁగాక.'

అనిద్రుపదుఁడుపోవ, నటయొక్కనాఁడు
ధనకాంక్ష ద్రోణుఁ డాతనిఁగానఁబోయి
తనలేమి చెప్ప, నాతఁడు గర్వమహిమ
వినక యెగ్గులువల్కి వెడలదొబ్బింప,
నవమానమునఁ గ్రోధమా రాజుమీఁద
నివురొత్త నాచార్యుఁ డిభపురి కేఁగ,
ధృతరాష్ట్రుఁ డాతని ధృతినాదరించి
సుతులకు శరవిద్య చూపఁబెట్టుటయు,
శిష్యుల నతఁడు [1]వీక్షించి : 'వివేకి
దూష్యుని నాకు నాద్రుపదుఁ దెండయ్య.'
అనివిద్య చెప్పిన నంతయు నేర్చి
యసికిసన్నద్ధులై యాశిష్యులేఁగి
పాంచాలుఁ దాఁకి యాప్రభుని బాణముల
వంచితులై పాఱ, వారిలో నరుఁడు
దురమునఁ దేరితో ద్రుపదు బంధించి
కురువర్ధనుఁడు దెచ్చి గురునకిచ్చినను,
బాంచాలు నగ్గులుపలికి ద్రోణుండు
పంచతకడమగాఁ బగదీర్చి విడిచె.
విడచినఁ గ్రోధాగ్నివిరిసి యా రాజు
మృడునకుఁ దపమున్న, మెచ్చి యావేల్పు
ప్రత్యక్షముగుటయుఁ, బాంచాలుఁడపుడు :
"సత్యాత్మ, నిర్గుణ, శైలేంద్రచాప,
స్మరహర, భూతేశ, జాహ్నవీమకుట,
కఱకంఠ, మాహేశ, కామితఫలద,
అంధకాసురవైరి, యఖిలాదిజనక,
సింధుర [2]దమన, యాశ్రితకృపామూర్తి,

1. వీక్షింపవివేక. 2. వరద. (మూ)

మధువైరి[1] నియత సమర్చితచరణ,
విధిశిరోమాలికా విభ్రమాభరణ,
నిత్యాత్మ, పరమాత్మ, నిఖిలభూతాత్మ,
సత్యాత్మ, ద్రోణునిఁ జంపెడికొడుకు,
నరునకు దేవిగా నాకొక్కకూఁతుఁ
గరుణింపు." మనుటయుఁ, గాలకంధరుఁడు:
"హోమంబు సేయుము, హోమకుండమున
భూమీశ, యిరువురుఁ బుట్టుదు." రనుచుఁ
బంచాస్యుఁ డేఁగినఁ, బాంచాలుఁ డరిగి
పంచ[2] భక్ష్యములతో బ్రాహ్మణతతికి
నెడపని భోజనంబులు పెట్టుటకును (?)
గడగట్టి, శాలలు కట్టించి, యంత
యాజోపయాజుల నఖిలసన్నుతుల
యాజకత్వమునకు నర్చించి తెచ్చి,
యాగోపకరణంబు లన్నియుఁ గూర్చి,
[3] యాగాగ్నులను దాను నాత్మలో నిలిపి,
దేవేంద్రసుతునకు దేవిగాఁ గూఁతు
వావిరి గురునకు వైరిగాఁ గొడుకు
బుద్ధిలోపలఁ గోరి పుత్త్రకామేష్టి
యద్ధాత్రిపతి వ్రేల్వ, నగ్నికుండమున
మణికిరీటముతోడ మార్తాండకిరణ—
గుణ[4] ధనుర్లతతోడ గురుశక్తితోడఁ
దూణీరయుగముతోఁ దొడవులతోడ
శోణాశ్వములతోడ సుతుఁ డొక్కరుండు,
మందహాసముతోడ మంజిమతోడ
నిందీవరశ్యామ హితకాంతితోడ

---

1. నేత్ర. 2. భక్షణలతో. 3. యాగమగ్నులు దాను 4. ధనుల్లతి. (మూ)

హిమకరముఖములతో హేమకలాప -
కుముదగంధములతోఁ గూఁతురొక్కర్తు
జనియింపఁ, దనయు ధృష్టద్యుమ్నుఁడనియు,
ననువొప్ప సుతఁ గృష్ణయనియును బిలిచె.
జనపతి యాగంబుచాలించి యంతఁ,
దననగరికివచ్చి తనయఁబెంచుటయు,
బంగారుప్రతిమకుఁ బరిమళంబొదవు
భంగిఁ గృష్ణయుఁ బెండ్లిప్రాయమై యపుడు
ననుజన్మ మోసులు నూగారునారుఁ
గనుదోయిసిగ్గును గలుగుచో, నృపుఁడు
వారణావతమున వహ్నిఁ గౌంతేయ -
వీరులీల్గినవార్త విన్నాఁడుగాన :
'నింద్రజునకుఁగూఁతు నీనేరనైతిఁ ;
జంద్రాస్య కెవ్వఁడు సరియైనవరుఁడు !
దుర్మదాంధుండగు దుర్యోధనుండు
ధర్మమూర్తుల వారి ధరనుండనీక
పావకశిఖలోనఁ బడఁద్రోచె.' యనుచు
వేవిధంబులనేడ్వ, వీక్షించి మంత్రి :
'సత్యాత్ములగువారు చావ ; రున్నారు ;
ప్రత్యక్షమునఁ బక్షి పలుకంగ వింటి.
[1] క్షితినాథ, యేలయేడ్చెదు మోమువాచ ! —
క్షితినున్నవారలు చెడరుపాండవులు ;
కాంత వారలసొమ్ముగాఁ బ్రాప్తికలదు ;
చింతింపవలదు ; సుస్థిరబుద్ధితోడ
నంగనామణికి స్వయంవరోత్సవము
రంగుగా ఘోషింప రమణమైఁ బనుపు.

1. క్షితినాథ! యేడ్వకుమోమువాచ (మూ)

అవ్వాసవిఁదక్క నన్యులకేయ
దవ్వైన [1] చరలక్ష్యధనువులువన్ని
నేయుముయత్నంబు ; జిష్ణునకైన
వేయేల కాంచెడు విపులాధినాథ !'
అనినధైర్యమువచ్చి యతఁడట్లునేయ
ననిచె మంత్రీంద్రువాక్యప్రకారంబు.
— [2] చక్కడింపఁగలేని చాపమూలమున
నుక్కనక్కలుగట్టి యొకచిల్లుచేసి,
యొనయంగఁ దొమ్మిదియనుపసంకెలలఁ
బెనచిననాగినప్పెనువింటఁగట్టి,
[3] యేనులుఁవుసరాక యిటునటుఁబఱచు
మోసపుశరణులు మొగ్గనైదమర్చి,
కోలలకందక కోనమింటఁదిరుగు
నాలజాలమువోలె యంత్రమత్స్యంబు
పన్నించి : 'యెవ్వఁడేఁ బఱఁగ నవ్వింట
నిన్నభోమత్స్యంబు నిలవ్రాలనేసె,
వాఁడు మాకృష్ణకు వర్ణింప మగఁడు ;
మూఁడుజాతులకును ముగల యీమాట.' —
అనినవార్తకు లోకులందఱుఁ గదలి
చనుచున్నవారు పాంచాలి రాఁగోరి.
బ్రాఁతి రోహిణిఁ బెండ్లి పౌష్యశుద్ధమున ;
నాఁతి, డెబ్బదియేనునాళ్లాదినంబు."
అని విప్రుఁడబలతో నాడువాక్యములు
వినఁ గృష్ణపైఁబుట్టె వేడ్క యేపురకు.
కుంతియు నప్పుడు కొడుకులఁబలికె :
" నెంతకాలంబైన నిందుండఁదగునె !

---

1. శర. 2. చక్కటపసలేదు చాపమూలమున. 3. యేకలవుల. (మూ)

పోదము ; పాంచాలభూములలోని
భూదేవు లతిథులఁ బూజింతురట్టె !
చూతము పాంచాలసుతవివాహంబు ;
నేతెఱంగున బ్రహ్మ యెన్నుచున్నాఁడొ !
యాయూఢి." ననఁగ నయ్యవనీసురుండు
నూరికేఁగె గృహస్థునొప్పవీడ్కొనుచు.'
అంత సూర్యోదయంబైనఁ, బాండవుఁడు
శాంతితో సంధ్యాదిచర్యలుదీర్చి
కువలయామరకోటికొలువున్నయట్టి
ధవళవేదికిఁబోయి, తమ్ములుఁ దాను
నామముల్ నొడివి ప్రణామముల్ చేసి
యామహాత్ములు తమ్మునాశీర్వదింప
వినతుఁడై యున్నచో, విప్రులఁజూచి
జననికుంతియుఁ గరాబ్జములు మొగిచి :

## పాండవు లేకచక్రపురము విడుచుట

"ఉత్తమోత్తములార, యొకచోటమాకు
నిత్తెఱంగునసిల్వ నెఱయదునీతి ; —
పుణ్యదేశములకుఁబోయి మీవంటి
పుణ్యులఁబొడగాంచి పుత్తుముదినము ;
దేశాంతరులకిదిదీక్షగా." దనిన
నాశాంతులిట్లని రాకుంతితోడ :
"ఒందు దేశములేల ! యుత్తమసాధ్వి,
సిండ నిన్నియు మీరునిలిపినయిండ్లు ;
ఈయుమునాస్నాన, మీయనుష్ఠాన,
మీయగ్నిహోత్రంబు లేనీమఁగలవు !
దేవమూర్తుల మిమ్ము దృష్టించుభాగ్య
మే వెంట మఱువలేమే." యన్నఁ గొంతి :

"మీకృపయిట్టిది, మిము నేమువిడిచి
యేకడ కేఁగెద! మీవ్వారుహితులు!
తీర్థయాత్రలు మాకు దీక్షగా వలసి
యర్థిఁబోవుట భావ్య మఖిలజ్ఞులార!"
అనుడు విప్రులు వారి నతిగౌరవమున
ననిచిరి పూజించి యాశీర్వదించి.
వారును, యమునాప్రవాహంబు దాటి
వారాశిఁజూచుచు వచ్చుచో, నెదుట
వ్యాసుండు హరిపరధ్యానలక్ష్మికళి
దానుండు శ్రితకృపాదాసుఁ డేతేర,
నట్టిమౌనికిఁ బార్థు లతిభక్తి మ్రొక్కి,
పట్టినయంజలిప్రతతులతోడ
[1] నుపవిష్టుఁగావించి యోలిసేవింపఁ,
దపసి యందఱ దయాధారనిట్లనియె:
"ద్రుపదభూపాలుకూఁతురుస్వయంవరము
నృపులార, చూడఁబూనితిరి మేలయ్యె;
ఆకన్య మునికన్య యాదిజన్మమునఁ;
జేకొని తపము దా శివునకుఁజేసి
మగనిమ్మని యేనుమాఱులు వలుక,
నగి చంద్రధారి యన్నాతిపల్కులకు
నీజన్మమున దాని కేవురుమగల
యోజించుచున్నవాఁ; డొకటి చెప్పెదను,
ఏకచక్రమున దైత్యేంద్రశిక్షణము
మీకతంబుననయ్యె; మీరింకఁబోయి
పాంచాలపురమున బ్రాహ్మణవేష
మంచితచ్ఛాయ పాయక వెలుంగుచును,

1. ఉపవిష్టు. (మూ)

బాలఁతిస్వయంవరంబున మత్స్యయంత్ర
[1] దళనంబుచేసి, యాద్రౌపదీకన్య -
నేవురుఁగైకొనుఁ ; డింతలో నేను
దేవమూర్తుల మిమ్ము దృష్టింపవత్తు.
ఆవివాహోత్సవంబైనమీఁదటను
వేవేగఁ గరిపురవిభుఁడు మిమ్మెఱిఁగి,
రప్పించి రాజ్యభారంబునఁబూన్చుఁ ;
దప్పదింతయు." నని తగనానతిచ్చి
తపసి యంతర్ధానధారణఁేగుటయు, -
నృపతులానందించి నెఱినుత్తరముగ
వచ్చుచు, సరయూప్రవాహంబుదాటి,
యచ్చట గోవర్ధనాద్రిఁజూచుచును,
గాశ్మీరభూములు గడచి, గంధర్వ
వేశ్మమై పొడవైన వృషభాద్రిగడచి,
మునిసీమలకుఁ బురంబులకుఁ గిరాత-
ఘనసీమలకుఁ ద్రోవఁగడు వేడ్కఁగడచి,
యిదిపగ లిదిరాత్రి యిదిసంధ్య యనక
చదురొప్ప నమ్మహోత్సవదినంబునకు
ముందటఁ బార్థుండు మొగిఁద్రోవపెట్ట
నందఱునడచుచు, నర్ధరాత్రమున
నమరసంగతరంగ నతిమంగళాంగ
నమరంగ భవభంగయగు గంగఁగదిసి,
యేవురపెండ్లికి నీవుసాక్షివిగ
రావలెనని మహాప్రభువగ్నినవుడు
తోడుకొనిపోవుటదోపఁ జీఁకట్లు
జడియంగఁ గొఱవి వాసవిచేతఁబట్ట

1. దళితంబు. (మూ)

## అర్జునుఁ డంగారపర్ణు జయించుట

నాగంగదాటి వారారసికొనుచు
ధీగతిఁ బార్థులేతేర, నారాత్రి
ననువుగఁ జీఁకటి నంగారపర్ణుఁ
డనియెడుగంధర్వుఁ డాంద్రునుదాను
జలకేళిసలుపుచుఁ జాలగర్వమునఁ
బలికె మీఁదెఱుఁగక పాండునందనుల:
"ఎవ్వరురా! యోరి! యీమధ్యరాత్రి
జవ్వనులును నేను జలకేళిసలుపఁ,
ద్రోవపెట్టుక మూరత్రోఫుతనాన
వేవచ్చుచున్నారు! విధితప్పినదియొ!
కానరొ! నన్నునంగారపర్ణాఖ్యు;
నేనిందు విహరింతు నెదురెందులేక.
ఇదికారణంబుగా నీగంగమడువు
విదితమై నా పేర వెలయుటవినరె!
మానరుగర్వంబు మానవులయ్యుఁ;
గానరు మీకింత కావరంబేల!
జలజనేత్రలు నేను జలకేళి యిచట
సలుపుచునున్నాము చావకపొండు;
అంగారపర్ణుండ నమరాదులైన
సంగతి నేనన్నుఁ జలియింతురెపుడు.
కొఱవిదాల్చితివేల కొఱవిదయ్యమవా!
గిఱుకున మరలుఁడు కినియనన్నైన."
అనుఁడు నర్జునుఁడును హాసంబుచేసి:
"విను, నీవుపొమ్మన్న వెఱచిపోలేము;
పోవభీతుఁడుగాడ ప్రొద్దువాటించు!
నేవేళయును మాకు నేకరూపంబు.

జగదేకవిఖ్యాతచరిత యైనగంగ ;
జగదేకనిర్వాణజనయిత్రి గంగ ;
అట్టిజాహ్నవిఁ దీర్ఘమాడకమాన ;
మెట్టివాఁడునుమాన్ప నెంతటివాఁడు !
ఏరులు వాగులు నెవ్వారిసొమ్ము !
.........................
సతులుంసన్నిధినున్న చండగర్వమునఁ
బ్రతిభాషలాడకు బంటవై నిలుము. ”
అనినఁ బద్మవనంబు హస్తి వెల్వడిన
యనువున యువతిమధ్యము వాఁడు వెడలి,
వరభూషణప్రభావళులఁ జీకట్లు
పారిపారఁ జెదర నేర్పునవిల్లుదాల్చి,
మాటలఁబోదని మణిరథంబెక్కి,
బోఁటులు వెఱవ నద్భుతపరాక్రముఁడు
అమ్ములసంధించి, యవనిపైఁ బింజ
లిమ్ముల మోపుచు నిట్లనిపలికెఁ :
“ఎట్టెట్టురా ! నన్ను నేమంటి మనుజ !
పొట్టక్రొవ్వున నన్ను బొమ్మంటి తొలఁగి !
రథమొసరించునే రాట్నమే తేరఁ ! —
బృథివి నరాధమ ! ప్రేలెదనైన్నన ;
క్రుక్కుదునో నిన్నుఁ గొఱపినీయేట !
దిక్కెవ్వరున్నారు ధృతినన్నుమాన్ప !
ఒగి నింకముందఱ కొక్కుడుగిడినఁ,
గగనేయువాఁడ నీతీవ్రబాణమున. ”
అని వింట [1] గంధర్వుఁడమ్ముసంధింప,
మనమున బెదరక మఱియునర్జునుఁడు

1. గర్వాంధు. (మూ)

వానిఁ దృణప్రాయవచనుఁగాఁ జేసె.
పూనికనార్వురుఁ బొదివిప్పుడు
వారిపై నడవంగ, వనితలున్నడకు
వారురాఁగనుఁగొని వాఁడాగ్రహించి,
బాణవర్షము పార్థుపైఁ బ్రయోగింప,
బాణారిమఱఁది యబ్బాణంబులెల్లఁ
బిడుగుచే వర్షించుబిందువుల్ వోలెఁ
గడకొఱవిని నేర్పుగదురఁ ద్రుంపుచును,
సవ్యకరంబున జంగజాలెత్తి
దివ్యపైవైచుచోఁ, దెమలక వాఁడు
బాణధారల నట్టిపాషాణవృష్టి
రేణువుల్ చేసి యార్చిన, నింద్రసుతుఁడు
మిడుఁగుర్లు గంధర్వుమీఁద జెట్టురలఁ
గడువడి నయ్యగ్నికాష్ఠంబు ద్రిప్పి
పలికె: "నీవాకతేరుపై విల్లుగలిగి
యలుగులేయుచు మమ్ము ననదలఁ జేసి
యెత్తివచ్చెదవింకనోరి! యీకొఱవి
క్రొత్తగా వైచెదఁ గుండకనిలువు."
మనివైవ నాభీల హాలాహలాగ్ని
జనిత కోలాహలసరణి నయ్యగ్ని
నిప్పులుజడిగాఁగ నిగిడి బెట్టుగను.
అప్పుడు పైచీరలంతంతఁగమరి
కొన [1] మీసములుగాలుకొని శరీరంబు
నొనరఁజొక్కిన, నింతులోలిపొక్కంగ,
నమరులాకలకలంబాలించి మింట
సమరసన్నద్ధులై సైనికోత్తములు
పటిసన్నద్ధమువచ్చి పార్థుపైఁగినిసి
యతిఘోరశరవృష్టి నందంద ముంప,

1. వాస. (మూ)

ధృతిఁ గాష్ఠమెత్తి యెంతే నగ్నిమెఱయు -
గతి నర్జునుఁడు చేతికాండాగ్ని పెంచి
సేననంతట మహాశిఖఁ గప్పుటయును,
నానాముఖంబుగా నడికి యాసేనఁ
గొందఱుభయమంది, కొందఱుమ్రగ్గి
కొందఱు దరికొని, కొందఱుగమరి,
చేతులాడక [1] చేదుచిచ్చునఁదొల్లి
భీతిల్లు సురసైన్యబృందంబు వోలెఁ
బ్రాణభయంబున భగ్నులై పాఱ,
నేణలోచనలతో నితఁడొంటినిలిచి
నవనిధీశ్వరదత్తనారాచపంక్తి
కవిసి మంటలుగ్రమ్మఁ గవ్వడిమీఁద
గుప్పిస, నావృష్టిఁ గొఱవిచేఁదరలఁ
దిప్పశక్యముగాక దేవేంద్రసుతుఁడు
నాగ్నేయమంత్రమయ్యగ్నిశాస్త్రమున
నగ్నిప్రతాపుఁడు హత్తించి వైవ,
నది ధగధగయని యంతరిక్షమునఁ
ద్రిదశులువెఱఁగందఁ దీవ్రమైవచ్చి
రథముపై గంధర్వరాజుఁగూల్చుటయుఁ,
బృథివిపైఁబడె వాఁడు బిట్టుమూర్ఛిల్లి.
నరుఁడీడ్చి తెచ్చి గంధర్వు ధర్మజుని
చరణాబ్జములవద్ద సాఁగఁబెట్టుటయు, —
నంతలోపల వానియతివలు చేరి :
“ శాంతలక్షణులార, చాలింపుఁడలుక ;
[2] ఎఱుఁగఁడు మహి మిమ్ము నితఁడాడె నెగ్గు ;
మఱవుఁడు ; పతిభిక్ష మాకు నీవలయు ;

1. చేఱ. 2. ఎఱుగుడు. (మూ)

ఎట్టివాఁడు మదించు నింతులయెదుట;
నిట్టితప్పు సహింపుఁడీ." యన్న నృపతి:
"హారితనూభవ, వీరియులమటమానఁ
బురుషభిక్షార్థమై పోనిమ్ము వీని."
అనినఁ బార్థుఁడు వానినచ్చోటవిడిచి
జననీసహోదరసహితుఁడై కదల,
నంగారపర్ణుండు నంతలోఁదెలిసి
సంగతిఁ దనమాయశక్తిచే నపుడు
కాలి నీఱైపడ్డ కనకరథంబు
లీలరావించి వాలిక [1] మొనఁదీర్చి,
యరిగెడుపార్థుల కడ్డంబువచ్చి,
సరసవైఖరి వారిసన్నుతిచేసి :
"ధారుణి దివ్యాస్త్రధరులు లోకైక
వీరులు వెసఁబాండవేయులు మీరు;
సతులసన్నిధినున్న సాధులకైన
మతిదప్పు; నింక నామాటయేమిటికి!
వెలిఁగినరథమేను విద్యాబలమునఁ
గలుగఁజిత్రించితిఁగాన, నాపేరు
చిత్రరథుండనఁజెల్లు; మీకృపకుఁ
బాత్రుఁడ; నంగారపర్ణాఖ్యమొల్ల;
నరయంగ నేనును నర్థేశసఖుఁడ
ధరణీశులార! యొంతయుఁగృపతోడ
. . . . . . . . . . . . . . . . . . . . . . .
నను గాచి పోవుచున్నాఁడవు పార్థ!
విను, నీకు గంధర్వవిద్య యిచ్చెదను;
నాకు నాగ్నేయబాణము సత్కరింపు;
చేకొని నీతోడఁ జేసెదఁజెలిమి.

1. మొనందీర్చి. (మా)

బంధుర రిపు హయ ప్రతియానమడఁచు
గంధర్వహయములు గలవు నాయింట ;
నిన్నాఁటి సందులో నిత్తునేవురకుఁ ;
జెన్నార నాకీవె! చిచ్చఱకోల."
అనిన, ధర్మజునాజ్ఞ నాదివ్యబాణ
మనిమిషునకునిచ్చి హరితనూభవుఁడు.
'అవసరంబై నప్పు డశ్వరత్నములు
దివిజ, పుత్తే.' మ్మని తెలియంగఁజెప్పి,
గాంధర్వమాయయు ఘనముగాఁగాంచి :
'గంధర్వ, యపుడేల గడఁగితి పుమ్ము ?
నీక్షింప మాసత్వ మెఱుఁగలేవైతి ;
యక్షులు సర్వజ్ఞులని చెప్పవిందుఁ ;
జెప్పుమా.' యనవుడుఁజెలఁగి గంధర్వుఁ :
'దప్పటికకార్య మట్లన్యో ; విజయ !
ఉగ్రాంశువులులేక యుండుటఁగాద
[1] సుగ్రాహముగఁ జంద్రుఁజూతురు నరులు ;
సూర్యునిఁ దామట్లు [2] చూడరుగాక ;
కార్యమొకటిచెప్పఁగలదదివినుము.
హితుఁడు మీకొకపురోహితుఁడు లేకునికి
శ్రుతశౌర్య, యిసుముగాఁ జూతురునరులు.
మంత్రరక్షితమైనమగఁటిమిగాదె !
[3] సంతాపమొనరించు శత్రుకోటికిని.
వ్రతధారులై మీరువర్తించుకతనఁ,
జతురత మీయెడ జయముసిద్ధించె.
కాంతలలో నతికామినై యుంట
నెంతయు మీచేత నిట్లుగావలసె.

1. సుగ్రాసమున. 2. చూతురు. 3. సంతాన. (మూ)

ఇటమీఁదఁ [1]కృతపురోహితుతోఁచుఁ దిరుగఁ
బటుబుద్ధి వైరులు పగులంగఁగలరు;
కావున మీరలు ఘనపరాక్రములు
భావింపఁ బరధర్మభరితమానసులు
తాపసునొక్కనిఁ దాపత్యులార,
చేపట్టుఁడబ్బెడు శ్రీయును జయము."
అనుడు గంధర్వున కర్జునుండనియె:
"వినుతాత్మ, నీచేత వినవయ్యెవింత;
కాంతేయవిఖ్యాతి ఘనతమై నుండ,
నెంతయుఁ దాపత్య కేలంటివిపుడు?
వినయంబుతోడ నీవృత్తాంతమెల్ల
విన వేడుకయ్యెడు వినిపింపుమాకు."
అనుడుఁ గవ్వడిఁజూచి యమరుఁడిట్లనియె:

## తపతీసంవరణము

"ఘనశౌర్య, యాకథ కడముట్ట వినుము;
భారతవంశాబ్ధి పరిపూర్ణచంద్రుఁ
డారయ సత్యధర్మాంచితాత్మకుఁడు
ధరణి నజామీఢతనయుండు ఘనుఁడు
వరయశోధనుఁడు సంవరణుండు తొల్లి
ధరణీతలంబెల్ల ధర్మమార్గమున
నరయుచు, వేడ్కమై నతఁడొక్కనాఁడు
వాటంపుసేనలు వలనొప్పఁ గొలువ
వేఁటకై చనుదెంచి విపినంబులోనఁ
గంతునిదీమంబుఁ గాంతాలలామఁ
గాంతి నారతినైనఁ గైకొనిబోఁటి

1. బహుకృపాహేలితకైతిరుగ. (మూ)

ఘనరూపసంపద గలిగినయట్టి
వనితనొక్కతెఁజూచె వసుమతీవిభుఁడు.
పడఁతిఁజూచినచూపు మరలించి తివియు-
నడువునఁ దలయూఁచి వర్ణింపఁదొడఁగె :
" ఈకాంతముఖకాంతి కెన [1] చేయఁబూని
యాకంజభవుఁ డమృతాంశుని నెప్డు
నెలకునొక్కొకమాఱు నెఱిఁజెఱచి చెఱచి,
కలకాలమును నిట్లు గడపుచునాఁడు.
ఏవంక యీకేశ మొయిలింతలోఁ జూచె,
నావంక నలగల్వ లమరినట్లయ్యె ;
నీయింతి చనుదోయి మొలచినాఁడాఁడ
రాయుగున్నవి గడిరాజులుపోలె ;
పలరాజు చేపట్టు వాలునుబోలె
వలనొప్పు వళుల నీవనితరోమాళి ;
'జలజబాంధవుఁ డేకచక్రరథంబు
గలిగినమాత్ర లోకములెల్లఁ దిరిగె ;
రెండుచక్రములయంత్రితమైనరథము
దండిగల్గిన నేను దాటనే యతని'
నని కంతుఁ డాకరథంబాయిత్తపఱచె
నన నొప్పె నీయింతి కాజఘనంబు ;
అతికర్కశంబులు హస్తితుండములు
సతతశీతలములు జగతినరంట్లు,
కావున నీభామ కలితంపుఁదొడల
కేవిధంబున సవతెన్నంగరాదు ;
ఈనాతి పదముల కెనగాఁగఁదలఁచి
పూనెఁ దపంబు నంబుజములు నీట ;

1. గాగ. (పూ)

పల్లీల దీనికి సరియైనసతుల
నెల్లలోకంబుల నేఁగాంచియెఱుఁగ.
చిత్రంబులో బ్రహ్మ చెలువొప్పఁ దలఁచి,
హత్తింపనోపు నీయబలరూపంబు ;
కాక, చిత్రగుపునఁ గ్రమమొప్పవ్రాసి
జోకఁ బ్రాణము మఱి జోడింపఁబోలు ;
దైవకన్యకయొ ! గంధర్వకన్యకయొ !
భూపకన్యయో ! భూదేవసుతయొ !"
అని యిట్లుతలపోయు నారాజచంద్రు
మనసిజాకారుని మానినిఁజూచి
మెఱయు మేఘములోని మెఱుఁగునుబోలెఁ
దెఱవ వేగంబె యదృశ్యయై పోయె.
పోయిన, నారాజు పొలపొలవోయి
ధీయుక్తి నెంతయుఁ దిరిగిరాఁజూచి,
వినువీధియునుజూచి విస్మయంబంది
తనమనంబున నిట్లు తలపోయుఁదొణఁగె :
"ఈకన్య యెందుండి యిటవచ్చెనొక్కొ !
కాక యీ తేజంబు కాంతయొ కాదొ !
వలరాజుమాయయో ! వనలక్ష్మియొక్కొ !
తెలియంగలేనైతి దిటతప్పెనవుడు ;
అనుమానమటుమాని యాలేమఁగదిసి
ఘనుమానమున వేడ్కఁ బలుపలేనైతి ;
చేతనుండెడిసొమ్ము చిందంగవైచి
బ్రాఁతితో వెడలెడుపందఁబోలితిని ;
చేరినమృగనేత్రఁ జెందంగలేక
జారంగవిడిచి నే జాలిఁబొందితిని."
అనుచు సంవరణుండు హత్తినమోహ-
వినతుఁడై, యెంతయువిరహాగ్నిఁబొంది,

మదనాస్త్రములఁ వ్రస్సి, మానంబు [1]గ్రొచ్చి, –
హృదయమోహము పెంచి, యూలువవంచి,
గండుఁగోయిలకూఁత గర్వంబు వెడలి,
నిండుతుమ్మెదజంట మేనెల్లఁ బొదలి,
రాచిల్కపలుకులరవళికిఁ జిక్కి
పూఁచినలతలచేఁ బొంకంబు దక్కి
యుండ, నశోకమలి రోయసరంగ వచ్చి

. . . . . . . . . . . . . . . . . . . . . . . . .

తళతళమని మేనితళుకులొప్పంగఁ
బలికె భూవిభుఁ జూచి పరమహర్షమున :
"ఓ రాజ, నీ కేల యుపతాపమందఁ !
జేరునెందైనను జేరెడు సొమ్ము ;
నాతండ్రి సూర్యుండు ; నా పేరు తపతి ;
నాతలంపున నీవు నరనాథ, కలవు ;
ఏ తెఱంగున నైన నీవు మాతండ్రి
నాతతగతి వేఁడు మతఁడు నీకిచ్చు ;
తరుణికి నాకు స్వాతంత్రత లేదు ;
నరుఁడ వవశ్యంబు వసుధేశ, నీవు."
అని చెప్పి తపతియు నర్కునికడకుఁ
జనియె ; సంవరణుండు స్మరబాధఁ బొంది
యున్నంత, మంత్రీంద్రులొయ్యన వచ్చి
యున్కియుఁ దెలిసి యయ్యవనీశువలన,
భూకాంతు నప్పుడు పురవరంబునకుఁ
గ్రొక్కొనఁ జేసి తెంచి, తోరంపు వేడ్కఁ
జంద్రకాంతపువేది [2]చలువగా నొక్క
సాంద్రపుష్పపుశయ్య సవరగాఁ జేసి

1. గ్రాస్సి. 2. చలువగా. (మూ)

పన్నీరు చిలికించి పార్థివుఁ గదిసి
క్రన్నన మృగమద కర్పూర భద్ర-
మిళితగంధంబును మేనిండ నలఁది,
[1] చలువగా సురటిచే జానొప్ప విసరఁ,
దావమగ్గలమైన ధారుణీవిభుఁడు
దీపించు రవిపుత్త్రిఁ దేఁజాలినట్టి
తన పురోహితుఁడైన తపసి వసిష్ఠు
ననువొప్పఁ దలఁచె నాయతభక్తితోడఁ;
దలఁచిన నాతఁడా ధరణీశునెదుర
నిలిచిన, వీక్షించి నీతితో మ్రొక్కి
యాసీనుఁ గావించి యంజలిచేసి
భాసురాత్మకుఁ బల్కెఁ బ్రార్థనచేసి:
" ఆచార్య, మీకృపా [2] యత్తతవలన
భూచక్రమంతయు [3] భోగదేశంబు.
ఒక్కటి నాకింక నొనఁగూర్పవలయు;
సత్కార్యమంతయు నాదట వినుఁడు.
వేఁటకై పోయి యేవిపినమధ్యమున
వాటంపుఁగూరిమి వామాయతాక్షిఁ
దపనునికూఁతునిఁ దపతియన్ దానిఁ
జపలతఁ జూచితి స్మరుఁడు ప్రేరేప;
అదియును, నామీఁదనాసక్తినెఱపి
మాఁదలలేమిని బోయె మొగిఁ గండ్రికడకు;
ఈపొద్దు నీవేఁగి యేరీతినైన
నాపొద్దుఁ బ్రార్థించి యతివఁ దేవయ్య."
అనుచుఁ బ్రార్థించినఁ, నావశిష్ఠుండు
ననుమతిగైకొని యర్కునికడకుఁ

---

1. చెలువు. 2. యత్నంబుగాక. 3. భోగకాలంబు. (మూ)

జతురతఁబోయి యాజలజబాంధవుని
శ్రుతులచే నెంతయు స్తుతియింప, నతఁడు
మనమునహర్షించి మౌనికిట్లనియె :
" అనఘాత్మ, యేమైన నడుగు మిచ్చెదను ;
బ్రహ్మవేత్తవు నీవు బ్రహ్మపూజ్యుఁడవు
బ్రహ్మసంభవుఁడవు ప్రణుతింపవలదు. "
అనిన వశిష్ఠుండు హరిదశ్వుఁబలికె :
" వనజాప్త, యిప్పుడు సంవరణభూపతికి
నీకూఁతుఁ దపతిని నెమ్మినీవలయుఁ
బ్రాకట నిఖిల సౌభాగ్యవర్తనల ;
వనితలఁగన్నట్టి వారలకెల్ల
ఘనవరునకు నీయఁ గాంచు టేఫలము. "
అనిన సంతోషించి యంభోజసఖుఁడు
తనకూఁతుఁ దపతినిఁ దాల్మి రాపించి,
దివ్యభూషణములు దివ్యవస్త్రములు
నవ్యంబుగానిచ్చి నయములునొడివి,
భూవరునకుఁ బెక్కుభూషలు నొసగి
యావశిష్ఠుని వెంట ననిచిపుత్తెంచె.
ఆరీతి నమ్మౌని యర్కసంభవను
గారవంబునఁదెచ్చి కడుసంభ్రమమున
వరముహూర్తమున సంవరణభూపతికి
సరిఁబెండ్లి సేయ, నాజననాథుఁడలరి
మునిశిఖామణికిఁ గేల్మోగిచి వీడ్కొలిపి,
యనుభవవాంఛ నయ్యవని రాజ్యమున
మంత్రులఁబూన్చి, యమ్మగువయుఁదాను
యంత్రితమదనరాజ్యానుభోగంబు
వరుసఁ బన్నెండేండ్లు వారక సేయ,
ధరణి సధర్మంబుతిగులులఁ జేసి

తొలఁగకనావృష్టితోఁచెఁ ; దోఁచుటయుఁ,
దెలిఁగి యేతెంచి వశిష్ఠుఁడాలోన
శాంతిహోమాదులు సవరగాఁ జేసి
వింత ననావృష్టి వేగంబెమాన్చి,
ప్రజలకు సౌఖ్యంబు పాటిల్లఁ జేసి
నిజనివాసమునకు నెమ్మితో నరిగె.
అంత సంవరణధరాధినాథునకుఁ
గాంతితోఁ దపతికిఁ గలితలగ్నమున
నొదవువసిష్ఠాదియోగిజనకర్తుఁ
డుదయించెఁ గురుఁడను నొకకుమారకుఁడు.
ఆతపతీతనయాన్వయులగుట
బ్రాఁతి మీకబ్బెఁ దాపత్యనామంబు ;
కావునఁ గురువంశకర్తలు మీర ;
లావశిష్ఠుఁడు మీకు నాచార్యుఁడెపుడు. ”
అనుచు నాగంధర్వుఁ డంతయుఁ జెప్ప
విని, హర్షమునఁ గ్రీడి వెండియుఁబలికెఁ :
“ మావంశమునకెల్ల మహిఁ గురుండైన
యావశిష్ఠుమహత్త్వమది చెప్పవలయు. ”

వశిష్ఠునిమహిమ

అనిన దివ్యుఁడువల్కెఁ : ” సతిసామర్థ్య
[1] మనయంబుఁ జెప్పఁగ నలవియె నాకు !
కొంతచెప్పెద విను, క్షోణి నమ్మౌని
యెంతయు ఘనతపోహితమానసుండు ;
మున్ను విశ్వామిత్రమునిసేయునెగ్గు
లన్నియుమఱచి, యయ్యమలాత్మునకును
బ్రహ్మమునిత్వంబు పరగంగ నొసగె ;
బ్రహ్మసంభవుశక్తి ప్రణుతింపవశమె ! ”

1. మనయంగ. (మూ)

అనినఁ, గవ్వడిపల్కె : "నావశిష్ఠునకు
మును గౌశికుం డేల మొగినెగ్గుచేసె?
విను, బ్రహ్మ[1] మౌని యావిసులుఁ డెట్లయ్యె?
విన వేడ్కయయ్యెడు వినిపింపునాకు."
అనవుడు గంధర్వుఁ డర్జునుకనియె :
"యనఘ, చెప్పెద నదియంతయు వినుము;
తొల్లి రాజన్యుఁడై దొరయు కౌశికుఁడు
సల్లీల జగమెల్ల శాసింపుచుండి,
సకలసేనలు గొల్వ శైలాటవులకు
నొకనాఁడు వేఁటమై నొప్పఁగాఁబోయి,
నొగిలించి మృగముల నూల్కొన్న శాంతి
మనిడి వశిష్ఠాశ్రమమునకువచ్చె.
వచ్చిన గాధేయు వరుస నమ్మౌని
యచ్చుగాఁ బూజించి యర్థినిట్లనియె :
"మహితాత్మ, మాయాశ్రమంబున నేఁడు
విహితసేనలు నీవు విందారగించి,
దీవనఁ బొంది యీదివసాంతమునను
బోవంగవలె." నన్నఁ బొంగి కౌశికుఁడు :
"సమలాత్మ, నీమాటకడ్డంబు చెప్ప;
— సమర నన్నియు వేగ నావటిం." పనినఁ
గైకొనివచ్చి యాఘనతపోధనుఁడు
ధీశాంతిఁ దమకామధేనువుఁ బిలిచి,
విందు తెఱంగెల్ల వినిపించి, వేడ్కఁ
బొంది 'భోజనమెల్లఁ బుట్టించు' మనిన,
నాకామధేనువు నట్లకాకనుచుఁ
బ్రాకటంబుగ నన్నపర్వతంబులును,

1. హానత్వ. (మూ)

నిండి పొలుచుచున్న నేతికాలువలు,
దండిగా నొప్పారు దధిసరస్సులును,
బిండివంటలుఁ జెక్కుఁబృథుశాకతతులుఁ
గండచక్కెరలతోఁ గడునేకములు
చాలంగఁగురిసిన, సంయమి చూచి
మేలని యాశక్తిమేనెల్ల దువ్వి,
మేయంగఁబొమ్మని మృదురీతి ననిచి,
యాయవనీశ్వరు నటకు రాఁబనిచి,
వినుతింపరాకుండ విందువెట్టుటయుఁ,
దనసేనలును దానుఁ దనరి కౌశికుఁడు
భుజియించి విస్మయపుంజితుండగుచు,
భజన నరుంధతీపతిఁ జూచిపలికె:
“ముదితాత్మ, నాకు నీ మొదవునీవయ్య!
మొదవులెన్నైనను మొగి దీనికంటె
ఘనవయోవిభవంబు గలిగినవానిఁ
దనియంగ నిచ్చెదఁ దాపసారాధ్య!”
అనినఁ గౌశికునకిట్లనియె వశిష్ఠు:
“విను మేను నీకిత్తువిడువంగఁజాల ;
దీనినొక్కటిఁగావఁ దీరదు నాకుఁ;
బూని పెక్కైనను బ్రోవంగఁగలనె!
సర్వకృత్యంబులు సరి దీనివలన
నుర్వీశ, యెప్పుడే నొదవును నాకుఁ;
గావున నీయావుఁ గడచి యోరాజ,
యేమైనఁ బ్రార్థింపు మిచ్చెదనీకు.”
అనిన విశ్వామిత్రుఁడలుకనిట్లనియె:
“మునివని నేనిట్లు మోమోటనేయ
వినయమించుకలేక విట్టవీఁగెదవు!
నినువంటి మానులునెటి నెందులేరు!

సకలభూతలమెల్ల శాసించునాకు
నొకకుత్తినడిగిన నొప్పింపఁదగదె!
పెన్నిధియునుబోలెఁ బిదుకనీ మొదవు
నెన్నిభంగుల నుండనిత్తునే! యేను."
అనుచుఁ గోపంబున నాగోవుఁబట్టఁ
దనబలంబులనెల్లఁ దడయక పనిచె.
పనిచిన, నానేన యాక్రేవుఁబట్టి-
కొనిపోయి యావుకు గుఱుతుగాఁ జూపి,
మొఱయింపరాకున్న నెంతయుబలిమిఁ
దలకొని వల్లెలఁ దప్పక దిగిచి
కట్టంగఁజూచినఁ, గనలి యామొదవు
మెట్టి యావల్లెలు మిన్నక తన్ని,
పొట్టలువగులంగఁ బోరిపోరిఁ ద్రొక్కి,
యట్టిట్టుగాఁ దోలి యాబలంబులను,
జనుదెంచి భక్తితోఁ సంయమిఁబలికె:
"ఇనతేజ! నన్నుపేక్షింపఁదగునె!
బలిమి విశ్వామిత్రబలములుపొదివి
చలమున నాదూడఁ జావనీకుచును
నన్నుబట్టుకపోవ నడచుచున్నారు;
క్రన్నన మాన్పవే! గాధేయుబాధ."
అనిన నూరకయుండ నమ్మౌనిచంద్రు
మనసు పూనికగాంచి మరలి యామొదవు
నెఱిఁగన్నుఁ గ్రేవల నిప్పులు గ్రమ్మఁ
దఱిమిడి క్షితిఁ గాలఁద్రవ్వి దిమ్ముచును,
స్ఫురితక్రోధంబునఁ గ్రోధంబులదర,
నరిమురి సేనల నదరంటఁదాఁకి,
చెక్కియుఁ జెండియుఁ జెదరఁదన్నియును,
ద్రొక్కియుఁ ద్రుంచియుఁ ద్రుళ్ళడంచియును,

బఱచియుఁ బొడిచియుఁ బొఱఁద్రోలియును,
మొఱమియు మెట్టియు మెల్లెవాపియును (?)
గడిమిమైనే తేరఁ, గౌశికుబలము
తడయక యాకుట్టి దండిమైఁగదిసి
యేచి యార్పులు బొబ్బలిడుచు నందంద
నేచందమునసైన నిట దీసినిపుడు
పట్టకున్ననుగాదు పౌరుషంబనుచుఁ
జుట్టిరా రథ దంతి సూతులనిలిపి,
యొత్తి యుల్లనడాసి యొదిగి డాకాల
హత్తించి యొకవల్లె నదిబిగియించి
తలఁగోల దగిలించి తాళ్లనుబట్టి
పలుమాఱు గోలలపాలు సేయుటయు,
సంసారబంధముల్ సరి విడఁదన్ను
కంసారిసముఁడైన ఘనయోగివోలె,
నందిగోపించి యంతయుఁ బాకసమితి
సందంద తెగఁదన్ని 'హంబా' యటన్న,
గోమయంబున దానిఖురరోమములను
సామర్థ్యముప్పొంగ శబరకోటులును
క్షత్రియుదరఁ బుళింద సింహళ ద్రవిడ
తతులనేకులు బల్మిఁ దడయకపుట్టి,
పరశు తోమర కుంత పట్టస ప్రాస
పరిఘ గదా శూల బాణాసనాది
వివిధాయుధంబులు వీరులై తాల్చి
జవమొప్పఁ గౌశికుసైన్యంబుఁ దాఁకి
రథముల విఱిచి, సారథులఁగారించి,
రథికులవిదళించి, రథ్యాళినొంచి,

కరులనుదెగటార్చి, కలఁచిమావుతులఁ,
దురగాళిఁ [1] జఱచి, రౌతుల [2] నేలఁగలిపి,
యోడక కాల్బంట్ల నుక్కడగించి,
[3] వాఁడిమిగా మోది వదలకయార్వ,
హతశేషమైన విశ్వామిత్రబలము
క్షితియెల్లయెడలను జెదరి చేడ్వడియె.
అప్పుడు నందిని హంబారవంబు
లుప్పొంగ మేయుచు నొగిఁబంచతిలుచుఁ
దనక్రేపు వేడ్కమైఁ దఱచునాకుచును
ఘనముగా విహరింపఁ గౌశికుఁడంత :
"నచ్చుగా నక్కట! యావుచే నిట్లు
చెచ్చెఱ నా సేన చిందువందయ్యెఁ!
బటురాజతేజంబు బ్రహ్మతేజమున
కటువలెఁ జేసిన నీఱుగా." దనుచుఁ
బటుతరనిష్ఠమై బ్రహ్మకుఁ దపము

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

పెక్కుకాలంబులు పెక్కురీతులను
దక్కక సేయఁ బ్రత్యక్షమైయజుఁడు :
"అనఘ, నీకోరు బ్రహ్మర్షిభావంబు
ఘనవసిష్ఠుఁడు పల్కఁ గలుగు నీ." కనుచు
నానతిచేసి యయ్యజుఁడు పోవుటయు,
జానొప్ప వేడ్క విశ్వామిత్రుఁ డపుడు
రమణ నరుంధతీరమణుముందఱకు
సమబుద్ధి నేతెంచి చతురతనిలిచె.
నిలిచినఁ గనుఁగొని నెఱి వశిష్ఠుండు
లలి 'రాజముని! కుశలంబెసి?' కనిన,

---

1. చలిపి. 2. గాల. 3. వాడలు. (మూ)

మరలి యేతెంచియు మఱియుఁ గౌశికుఁడు
తరమిడి యత్యుగ్ర తపమున నుండె.
అంతఁ గల్మషపాదుఁడను రాజవరుఁడు
వింతగా హయమెక్కి వెడలెడుచోట
శక్తి శంభుఁడు వశిష్ఠాగ్రసుతుండు
శక్తి సంయమి త్రోవఁజన నెదురైనఁ,

### శక్తిమహాముని కల్మాషపాదుని శపించుట

జూచి యిట్లనియె నా క్షోణివల్లభుఁడు :
'వే చనుమార్గంబు విడిచిపో విప్ర !'
అనవిని యాశక్తి యవనీశుఁ బలికె :
'మనుజేశ, ధర్మంబు మఱచి పల్కెదవు ;
రాజవు నీవు ; నే బ్రాహ్మణోత్తముఁడ ;
నోజ నేఁ దొలఁగంగ యోగ్యమా నీకు !"
అనిన రాజిట్లను నలుకదీపింప :
"నినుఁ జూచి పలుకుము ; నియమంబులేల !
తొలఁగు ; మూరక నీవు దొసఁగులుమాను ;
తొలఁగకుండితి వేని తొలఁగింతునిపుడు."
అనిన సంయమి పల్కు : "నవనీశ, నీదు
మనసు వచ్చినయట్లు మర్దించు నన్ను ;
ధర్మమార్గంబు నేఁ దప్పఁ ; దప్పినను
ధర్మంబులన్నియుఁ దప్పుఁగావునను."
అనిపల్క రాజన్యుఁ డలిగి యమ్మౌని
దనచేతికశకోలఁ దప్పక వేసె.
వేసిన నాశక్తి విశ్రుతుఁడై పలికె :
'వాసి యెంచుకలేక వసుధీశ, నన్ను
దఱటున నేయంగ ధర్మమే నీకు !
వెఱపు విప్రులయెడ విడిచితి ; గాన,

దక్కక కానలో [1] దశవర్షములును
అక్కనుఁడవుగమ్ము రాజ్యంబు మాని."
అని శాపమిచ్చిన, నధిపుఁడ మ్మౌనిఁ
బొనర వసిష్ఠునిపుత్త్రుఁగా నెఱిఁగి,
పురపురఁ బొక్కుచుఁ బురమున కేఁగి
గురుకౌశికునకు నా ఘోరత చెప్పి
యున్నంత, నొకవిప్రుఁ డార్త్యశుఁ గదిసి
సన్నుతి మాంసభోజనమడుగుటయు,
రాజప్పు డడబాల రాఁపించి: "యిట్టి
భోజనంబతనికిఁ భువిఁ బెట్టు." మనుచు
నప్పనచేసిన, నడబాల వోయి
యుప్పొద్దు మాంసంబులందక యున్నఁ
గౌశికుమాయచేఁ గార్యంబునుఱచి,
యాశయ్య నరమాంస మనువుగా వండి
ద్విజునకుఁ బెట్ట, నాద్విజుఁడు గోపించి:
"నిజమింతయును లేక నృపుఁడు నాకిట్లు
మనుజమాంసము పెట్టు మహాతపాపమున
మనుజాశనుండు దా మహి నౌను గాక."
అనుచు శాపంబిచ్చి యావిప్రుఁడేఁగ,
నను వేది యానృపుండట్లయ్యె; నప్పుడు
వింతగా దనుజుఁడై విహరించుచోట
నంతట నొక్కనాఁడడవిలోపలను,
సమితతపశ్శక్తి యాశక్తి వచ్చి
సమిధలు విఱుచుచుఁ జరియింపఁ జూచి
కపటాత్ముఁడైనట్టి కౌశికమౌని
చపలాత్ము నొకదైత్యుఁ జలమొప్పఁ బిలిచి

1. దశమవర్షములు. (మూ)

పలికె: "నోరాక్షస, పదరక నీవు
బలిమిమైఁ గల్మాషపాదులోఁ జొచ్చి,
యావశిష్ఠాత్మజనణఁగింపు." మనిన
వావిరి నాదైత్యవరుఁడియ్యకొనుచుఁ
గల్మాషపాదులోఁ గడిమిమైఁ జొచ్చి
జాల్మఁడా శక్తినిఁ జంపి భక్షించె.
మఱియు విశ్వామిత్రుమాయ ప్రేరేపఁ
బఱచి యాకల్మాషపాదుండు కినిసి,
పొదలువశిష్ఠునిపుత్త్రులనెల్ల
ఎదలక వధియించి వరుసనోఁదినియె.
ఈరీతిఁ దనపుత్త్రులీల్గినఁ జూచి,
దారుణశోకాగ్నిఁ దాపసోత్తముఁడు
పత్నియుఁ దానును బలవరింపుచును —
నూత్నదుఃఖంబున నొగులంగలేక
కాళ్లుఁ జేతులుఁ ద్రాటఁ గట్టుక పోయి
నీళ్ల నొక్కటను మునింగిన, నదియుఁ
బాశంబులన్నియు భగ్నంబు నేసి
పేశలంబుగ ధరఁ బెట్టె నమ్మౌని.
నది మొదలాది యన్నిదిక్కులను
విదిత విపాశనా వెలసె; వెండియును
నొకకొండచఱియలో నుఱుక, నాగిరియు
వికలంబు లేకుండ వెలువలఁ బెట్టె;
విడువక యమ్మౌని విపరీతబుద్ధిఁ
దడయక శంతానఁదగ నొక్కగుండు
కట్టుక ఘోరనక్రగ్రాహములకు
బెట్టైననదిఁ జొర, బెదరి యన్నదియు
నతిసాత్త్వికులనంటదలజడన్నట్లు
శతముఖంబులఁ [1] బాఱె [2] శతద్రువయ్యె;

1. బఱచి. 2. శతధృతియయ్యె. (మూ)

మఱియును వసిష్ఠుని మరణయత్నములు
వెలయఁగఁ జేసియు విఫలంబులైనఁ,
దనతపోవనభూమిఁ దడయక చేరి
యనయంబుఁ దపముండ, నటనొక్కనాఁడు,
తనకుమారుఁడుశక్తితాపసుభార్య
[1] యనఘాంగదృశ్యంతియనియెడుముగ్ధ
తనయుగ్రమునఁబోవ, దానిగర్భమున
ఁనుత సుస్వర వేదపఠితులు చెలఁగ
విని, మాని యెంతయు వెలఁదిగర్భమునఁ
దనయుఁడుండుటెఱింగి తద్దహర్షించి
పుత్రశోకముమాని పొలఁతియుఁ దానుఁ
పౌత్రునిజన్మంబు ప్రార్థించుచుండె. —
అంతట నొక్కనాఁ డమ్మానికోడ
లెంతయు జలములకే తెంచుచోట
ఘనరక్షస్సుండైన కల్మాషపాదుఁ
డెనయు నామునికాంత నేచిమ్రింగంగఁ
జనుదేరఁ, [2] బాచదృశ్యంతి తలంక,
మును దానినీక్షించి మునివసిష్ఠుండు

## కల్మాషపాదుఁడు శాపవిముక్తుఁడగుట

వెఱవకుమని దాని వెఱపెల్ల మాన్చి,
మఱివక వానిపై మంత్రోదకంబు
ఝల్లనఁ దనమంత్రశక్తిచే నపుడు
చల్లిన, రాక్షసచపలభావమును
గల్మాషపాదుండు కడముట్ట విడిచి
మళ్ళి రాజై ప్రణమిల్లి యాలోన,

1. అనఘాంగి దృశ్యంతి. 2. బాచి దృశ్యంతి. (మూ)

వినయసద్భక్తితో వీక్షించి పలికె:
"అనఘాత్మ, నీచేత నణఁగె శాపంబు;
చనియెద నేనింక జనపదంబునకు;
నెనసిన వేడ్కనీ వే తేరవలయు."
అనవుడు మౌనియు నంగీకరించి
పొనర నారాజన్యుపురికి నేతెంచె.
అపుడు కల్మాషపాదావనీశ్వరుఁడు
తపసియుఁ దానును దనపురంబునకు
నేతెంచి, మంత్రుల నింతులఁ గూడి
యాతాపసారాధ్యు నర్చించి మ్రొక్కి
ప్రణుతించి పలికె: "శోభనాత్మ, నాకు
గణుతింప మునిశాపకారణంబునను
మగువఁ గూడఁగరాదు మరణోక్తిభీతి;
మగవాని నొక్కని మదయంతియందుఁ
గులమెల్ల నిలుపంగఁ గుదురైనవానిఁ
జెలువుగా నీవయ్య! క్షేత్రజుఁగాను."
అనుచుఁ బ్రార్థనసేయ నతఁడు గైకొనుచు
మనుజేశుసతియైన మదయంతియందు
నొకపుత్త్రు నత్తము నుదయింపఁజేసి
ప్రకటించి రాజుచే బహుమానమంది
యచ్చోటువీడ్కొని యాశ్రమంబునకుఁ
జెచ్చెర నేతెంచె శిష్యులుగొలువ.
అంత నదృశ్యంతి హర్షంబుతోడఁ
గాంతిమంతునిఁ బుత్త్రు ఘనతపోధనుని
రవినిభతేజుఁ బరాశరుఁగనియె.
అవసరంబునవచ్చి యావసిష్ఠుండు
సకలకర్మంబులు శాస్త్రోక్తిఁజేసి,
ప్రకటించి పెనుపంగఁ, బ్రబలి యాసుతుఁడు

బాలోప[1] నీతుఁడై కలవిద్యలెల్ల
లీలమై నేర్చి, వాలికప్రాయమునను
దాతకు నెఱిఁగించి తపమునకరిగి
ప్రీతితోఁ దపంబు పెక్కేండ్లుచేసి,
హరి ధాత హరులఁ బ్రత్యక్షంబుచేసి,
వరుస వారలచేత వరములుపడసి,
మరలి యేతెంచి యామహితాత్ముఁడు
గురుతరంబుగఁ దాతకును భక్తిమ్రొక్కి-
పలికె: "భవ్యాత్మక, ఫలియించెఁదపము;
అలరి మిమ్మొకటి నేనడుగవచ్చితిని;
పితృఋణంబుడుపఁ బిడ్డఁడేమిటికిఁ!
వితతులకెల్లను బ్రియముగా నిపుడు
ఘోరతపంబునఁ గుటిలరాక్షసులఁ
బేరుమాన్పెద నన్నుఁ బ్రియముతో ననుపు."
మనవుడు నమ్మౌని మనుమనిఁబలికె:
"ననఘ, తపంబేల యల్పంపుఁబనికి!
నుగ్రతపంబున నొకకీడు దోఁచు;
[2]వ్యగ్రత దానిచే నణఁగులోకములు.
ఈయర్థమునకు నే నితిహాసమొకటి
ధీయుక్తిఁ జెప్పెద ధీరాత్మ, వినుము.
కృతవీర్యుఁడనురాజు క్షితియేలి మున్ను
జతురతఁ గావించె సకలయజ్ఞములు.
ప్రీతి యాజకులైన భృగునందనులకు
బ్రాఁతి దక్షిణలుగా బహుధనంబొసగి
యాపుణ్యఫలమున నాంద్రును దానఁ
బ్రాపించె నాకంబు పార్థివోత్తముఁడు.

1. నియతుఁడై. 2. అగ్రత. (మూ)

ఆవెన్కఁ దత్పుత్త్రు లవని నేలుచును
ఆవిప్రులకు ధనంబబ్బుటయెఱిఁగి,
భృగుతనూభవులను బిలిపించి బలిమిఁ
దెగనియర్థముత్తృష్ణఁ దివిటియిట్లనిరి :
'ద్విజులార, మీకేల విపులార్థగతులు ?
విజయింపవలె మాకు వేగంబె తెండు'.
అనిన, వారలు ధనమట్టియకున్నఁ
గినిసి భార్గవుల నాక్షితిపులు చంపి,
దాఁచినధనములు దాఁకఁగైకొనుచుఁ
బూఁచి [1] యెవ్వనినిందుఁ బొడమనీమనుచు
నర్భకులాదిగా [2] నణఁగించుచోట,
గర్భంబు నొకకాంత గరిమతోఁదొడల
ధరియించెఁ బదియేండ్లు ; తగ నంతమీఁద
సురుచిరాత్మకుఁడైన సుతునిఁ గాంచుటయు,
నరయంగ నాపుత్త్రుఁడౌర్వుఁడై పెరిగి
జననిచే జనకులచావెల్ల నెఱిఁగి
ఘనతపంబొనరింపఁ, గలఁగెలోకములు ;
సురరాజుభీతిల్లె ; సూర్యుండుసల్లె ;
నరుదందెభవుఁ ; డజుండతిభీతిఁబొందె
నప్పుడౌర్వునితండ్రు లచటికివచ్చి
యుప్పొంగి పలికిరయ్యురుతపోధనుని :

### పితరు లౌర్వుని శాంతునిఁజేయుట

'ఓవత్స ! యింక నీయుగ్రతపంబు
గావింపవలదు లోకములఁగాల్చెడిని
కృతవీర్యసుతులచేఁ గృతమున నేము
సతతధనాపేక్షఁ జచ్చుటలేదు ;

---

1. యెవ్వాడిందుఁ బొడమనిమనుచు. 2. అగణించుచోట. (మా)

పరలోకసౌఖ్యంబు ప్రాపించుకొఱకుఁ
బొరలి యీవిధమునఁ [1] బొలిసితి మింతె.'
అనిన నౌర్వుఁడుపల్కు: 'నమలాత్ములార,
యొనసిన యీతపంబేమాన్తి నేసి,
నన్నునే గాల్చు నీవనతపోవహ్ని ;
యున్నది నెచ్చోట నునుతునే.' ననిన
నంతయుఁ జింతించి యమ్మానులనిరి :
'వింతతపోవహ్ని విమలాత్మ! యిపుడు
జలముల [2] లోకముల్ జనియించెఁగాన
జలధిలో వైవుము జలము గ్రోలంగ.'
అనిన వారలమాటలంగీకరించి
యనిచి దండము వెట్టి యౌర్వుండువోయి,
తనతపశ్శిఖ సముద్రములోన వైవ
ననయంబు బడబాగ్ని యై యుండె; నంత
నౌర్వుఁడు నటవచ్చి యుంబయుఁ దాను
సర్వకర్మంబులు సలుపుచు నుండె.
కావునఁ బౌత్రక, కడిఁదితపంబు
గావింపవల దింకఁగార్యంబువినుము.
రాక్షసక్షయముగా రమణ జన్నంబు
దీక్షతోఁ జేయంగఁ [3] దివురుము నీవు."
అని వశిష్ఠుఁడు చెప్ప నప్పరాశరుఁడు
విని యిచ్చగించి యవ్విపినమధ్యమున
సకలసాధనములుఁ జయ్యనఁ గూర్చి
ప్రకటించి రాక్షసప్రళయయాగంబు
చేయుచునుండఁగఁ, జెదరిదానవులు
నాయుజునకుఁ జెప్ప, నద్దేవుఁడపుడు

---

1. బోరితి. 2. జ్వాలనంబు. 3. దిమురుము. (మూ)

పౌనరఁ బులస్త్యాదిమునులఁ బుత్తేర,
ననఘులే తెంచిరయ్యజ్ఞవాటికకు.
ఆరీతి వచ్చినయమ్మునీంద్రులకు
నారీతినర్ఘ్యాదులప్పరాశరుఁడు
గారవంబుననిచ్చి, కలితాసనములు
ధీరతఁబెట్టించి దృఢభక్తిఁబలికె:
“ఓమహాత్మకులార, యోగ్యులుమీర
లీమహికే తెంచు టేమికారణము!
ఏనుధన్యుఁడనైతి; నింక నాపితరు
లానినసౌఖ్యంబులనుభవించెదరు.
ఏపని నాచేత నెసగుమీకిపుడు!
చేపట్టి దయతోడఁ జేయించుకొనుఁడు.”
అనినఁ బులస్త్యాదు లాశక్తిసుతుని
వినయంబునకు [1] మెచ్చి వేడ్కసిల్లనిరి:
“మహాత్మ, నీయట్టిమనుమండు గలుగ
మహి వశిష్ఠుండు నెమ్మదినున్నవాఁడు;
ఆమహాత్ముని ధైర్య మాశాంతగుణము
నేమంబుతోఁ జెప్పనేర్తుమె మేము!
అతనితోఁ బగగొని యాకౌశికుండు
[2] మతకముసల్పిన, మాయదానవుఁడు
తినియె మీతండ్రుల దేవసన్నిభుల.
దనుజులుచేసినతప్పు గాదదియు;
వారును మీతాత వరతపోమహిమ
బోరనఁ గాంచిరి పుణ్యలోకములు;
కావున నీవింక ఘనరోషముడుగు;
కావింపవలవ దీక్రతువు చాలింపు.”

1. మ్రొక్కి. 2. మతమునబల్కిన. (మూ)

అని పులస్త్యాదు లిట్లానతిచ్చినను
విని పరాశరమౌని వేడ్కనిట్లనియె :
"[1]మీవాక్యమంతయు మీయాజ్ఞ[2]సేతు ;
నేవిధంబుననార్తు నీమహావహ్ని ?"
అనిన మౌనులుపల్కి : "రసఘాత్మ, దీని
నొసర హేమాద్రికి నుత్తరంబునను
గడుఘోరమైయుండుకాననమందు
వెడలింపు[3]మీ" వన్న వేగంబెపోయి
యనలంబుగైకొని యప్పరాశరుఁడు,
మునులవీడ్కొల్పి యిమ్ముల నంతలోన
దనుజాటవీ దాహ దావాగ్నిఁ బోలు
ఘనతరాటవిలోనఁ గడువేగ వైచె.
వైచిన నాచిచ్చు వనమెల్లనిండి
యేచి దావాగ్నియై యెప్పుడుమండె,
నప్పుడు శాక్తేయుఁ డలుకఁ జాలించి
తప్పక చనుదెంచి తాతకు మ్రొక్కి,
యవ్వకుఁ దల్లికి నతిభక్తి నెఱఁగి,
మువ్వంపుఁదపములు మహిఁజేయుచుండె.
అట గౌశికుండును నతిఘోరతపము
పటుబుద్ధిఁ గావించి బహువత్సరములు
బ్రహ్మసంభవుచేత బ్రహ్మమెచ్చంగ
బ్రహ్మమునిత్వంబు భక్తితోఁ బడసి,
యావశిష్ఠునకును నబ్జసంభవున
కేవెంట సరివచ్చి యెలమివర్తించె.
అనఘ, తపశ్శక్తి నందంగరాని
ఫలములుగలవె! సంభావితాత్ములకు.

---

1. మీకార్య. 2. పోలంగ నేఁడాజిభూమిగైసేతు. రం. నా. రా. యు. కా.
3. మీయగ్ని వేగంబెయనిన. (మూ)

ఎనయ నీ తాపత్యహితవశిష్ఠార్య-
ఘనమహాఖ్యానముల్ కనుభక్తి విననఁ
జదివిన వ్రాసిన జనులకెప్పుడును
బొదలు సంపదలును బుణ్యజాలములు.
కావున భక్తితోఁ గాంతేయ, మీరు
భావింప నొకమునిఁ బరమతపస్విఁ
జేపట్టియున్న నీక్షితి నెంతవారు
నేపట్టునను మీకు నీడుగాలేరు."
అనుచు నవ్విధమున నంగారపర్ణుఁ
డనయంబు చెప్పంగ నర్జునుండనియె:
"అనఘ, నీ చెప్పినయట్ల చేసెదము;
వినుతాత్ముఁడగు నొక్కవిప్రుండుగలఁడె!"
అనుడు దివ్యుఁడునల్కు: "నాచార్యుఁగాఁగ
నొనరింపఁదగువిప్రు నరీశ, వినుము;
ఉత్కచంబనుతీర్థమున్నది యెదుట;
సత్కాంతినిధులార, చనుఁడు మీరటకు.
ధౌమ్యుఁడున్నాఁడందుఁ దాపసోత్తముఁడు;
సౌమ్యుఁడతండు మీచనవుచేకొనును.
ఆచార్యుఁగా మీర లతనిఁ బ్రార్థింపుఁ;
డాచుల్కఁదనమేఁగు నంతలో." ననిన
నంగారపర్ణుచే నంతయుఁ దెలిసి,
సంగతిఁ బాండవుల్ సంతసంబునను
అతనివీడ్కొని వేగ నాగంగదాటి,
ధృతివచ్చి యుత్కచతీర్థంబునందుఁ

## పాండవులు ధౌమ్యునిఁ బురోహితుఁగా వరించుట

దపమున్నధౌమ్యు నుత్తమశీలరమ్యు
విపులవర్తనసౌమ్యు వేడ్కతోఁ గాంచి

జననీసమేతులై సాగిలి మ్రొక్క,
ముని వారిఁ బూజించి ముఖవికాసమున :
" నే మొక్కొ! వచ్చితి రిటనన్ను వెదకి ;
భూమి మీవృత్తాంతములు వినియుందు ;
దుర్యోధనుఁడు సేయుదుష్కార్యములకుఁ
గార్యంబుపుట్టనికరణి వర్తింత్రు.
మిముఁ [1]గూల్చువారైన మీరు చింతించి
సమబుద్ధినున్న మీశాంతి వర్ణింతు.
వేడుకతళుకొత్త [2]విభులార, మిమ్ముఁ
జూడఁగంటిమి నేఁడు సుదినంబు మాకు.
మీరు కాలినవార్త మేదినిమ్రోయఁ
గౌరవకుల మేను గాల్పఁజింతించి,
మఱి యోగదృష్టి మీమునికి యెఱింగి—
మఱవకున్నారము మముఁ గాంతురనుచు.
పరమకళ్యాణంబు పాంచాలువీఁట
దొరకొనుమీకు బంధువులెల్ల నెఱుఁగ.
అప్పుడు విని మిమ్ము నాంబికేయుండు
రప్పించి మఱి యర్ధరాజ్యమీఁగలఁడు."
అనిన సంతోషించి యతినికిఁ బాండు-
తనయులిట్లనిరి : " మీతత్త్వమిట్టిదియె ;
ఇచ్చలో మిముఁ బురోహితునిఁగాఁ గోరి
వచ్చితిమిచటికి ; వాత్సల్యలీల
ననుమతిచేసి మమ్మనుపుదుగాక ;
చనవలెఁ గాంపిల్యజనపదంబునకు."
అనుటయు నట్లకాకని పురోహితము
మునియియ్యకొని ప్రియంబున వీడుకొలుపఁ,

1. గెల్చువారుగా. 2. విధులార. (మూ)

కవచధారులువోలెఁ గదలి పాండవులు
జవమొప్ప నడచుచు సంప్రీతి [1] యడరఁ
బోవుచోఁ, గొందఱు భూసురోత్తములు
త్రోవ గుంపులుగూడి తోడ్తోన నడవఁ,
గ్రోధమించుకలేక కుంభినిఁ బరఁగు
సాధువిప్రులఁ గూడి జననియుఁ దారు
నడచి శరావతినది యుత్తరించి
యడరంగ వచ్చుచోఁ, నంతఁ గట్టెదురఁ
గాంచిరి మణిసౌమ్య కాంచనరమ్య
సంచిత సురపురీ సమ భాసురంబు,
గజరాజ భటరాజ ఘనరాజయోగ
నిజకీర్తిగుణసుధా నిర్మలీకృతము,
నభ్రస్థలభ్రమ [2] దభ్రసందర్భ
విభ్రమాస్పద సౌధవీథిబంధురము,
కేళీగృహాంచిత కృత్రిమపుష్ప
లీలాపిలోల శిలీముఖాకులము,
నిరుపమ తారుణ్య నిచితలావణ్య
వరవనితారత్న వైభవోజ్జ్వలము,
బహుళతర కుట్టిమ భర్మమాణిక్య
మహనీయ తోరణమార్గ శోభితము,
రవిరథవాహ విక్రమ [3] ధావనోత్థ
పవనచాలిత కేతుపట భావితంబు
నింపార ద్రుపదరాజేలుచునున్న
కాంపిల్యనగరంబుఁ; గనుఁగొని యలరి
విప్రకోటులుఁ దారు వేడ్కఁ గౌంతేయు
లా ప్రొద్దెసొచ్చి సూర్యాస్తమయమునఁ

1. నడుమ. 2. దర్భ. 3. దానహేతు. (మూ)

గుమ్మరవాడలో గుణిశైన యొక్క-
కుమ్మరివానింట గుఱుతుగా విడిసి,
భిక్షాన్నములు దెచ్చి ప్రియముతోఁ గుడిచి
యక్షీణసుఖనిద్ర నందిరారాత్రి.
అంత స్వయంవరంబందుఁ బాండవులు
కాంతఁగైకొన రాచగమి మోములెల్లఁ
దెల్లనాసిల్లని తెలిపినమాడ్కిఁ
దెల్లఁబాఱె సురేంద్ర [1] దిగ్భాగమొగము ;
పుండరీకాక్షునిఁబొడగన్న నయన
పుండరీకంబులు బోరన నెల్లి
వికసించుఁ బాండవవిభులకన్నట్లు
వికసించెఁ గొలఁకుల విరిదమ్మిగములు ;
విభులోలిఁ దమచేత విలువంపరాక
సభయులై యొండొండ జరుగుదురిట్టు
లని చూపిచెప్పినట్లాకాశవీధి
వెనుకొని చుక్కలు విచ్చిపోఁ దొణఁగె ;
ద్విజరూపధరుఁడెల్లిఁ దివియుఁ గార్ముకము
ద్విజకులంబులకెల్లఁ దేజంబువచ్చు
నని వేడ్కఁ దమలోన నాడుకొన్నట్లు
గొణఁగఁజొచ్చె ద్విజాలి గూడులలోన ;
వారణావతములో వహ్ని పాండవులఁ
– బారణగొనెనని ప్రజలాడుకొనఁగ
నానిందఁ బాపుకో నగ్నిరాఁబోలు
నీనెలవునకన నెఱ్ఱంజ దోఁచె ;
విజయాస్త్రములఁ ద్రెవ్వ వీరులకెల్ల
గజవీధి యొసగంగఁ గాలకాలమున (!)

1. దిగ్భాగచయము. (మూ)

నుదయింతునన్నట్టు లుదయాద్రిసూర్యుఁ
డుదయించె నర్ఘ్యంబులొసఁగ బ్రాహ్మణులు.

### ద్రౌపదీస్వయంవరోత్సవము

అటమున్న ద్రుపదుండు నఖిలదిక్కులకుఁ
బటులీలఁ గల్యాణపత్రికల్ వ్రాసి
క్షత్త్రకోటికిఁ జెప్పఁ, జయ్యన వారు
యాత్రామహాభేరు లందంద మ్రోయఁ
దమతమగొడుగులుఁ దమతమపడగ
లమితవైఖరి [1] మెఱయ నాప్రొద్దె కదలి
వచ్చుచో, శల్యుండు వజ్రతుల్యుండు
నచ్చినభుజబలోన్నతిఁ బెచ్చుపెరిగి:
'విలువంతు గుఱిఁద్రుంతు వెలఁదివరింతుఁ
బలుకులేల!' ని వచ్చెఁ బాంచాలుపురికి;
శిశుపాలుఁ డతిరథశ్రేష్ఠులతోడ
దశదిశలద్రువఁ బ్రకాశించి కదలి
తగినకోమలిగల్గెఁ దనకయ్యెననుచు
నగిమొదువారిఁ [2] గానక వచ్చె నటకు;
దుర్యోధనుఁడు మహాద్భుతవైభవమున
ధైర్యభూషణులైన తమ్ములు గొలువ
నేకార్ణవఖ్యాతి నిభములు గొలువ
ధాకతో వచ్చెఁ జట్టువానిపురికి;
నలివేణిఁబొందాస నంగాధిరాజు
నలుగడఁ గవికీర్తనంబులు చెలఁగ:
'విజయుఁడుర్వరలేనివేళ [3] నేఁడత్తు
గజయాన' నని వచ్చెఁ గాంపిల్యపురికి;

1. ప్రౌఢ. 2. గావఁగవచ్చినతఁడు. 3. యేతెంతు. (మూ)

'రాకపోనరు పాండురాజనందనులు
నాకుఁజూడఁగఁగల్గు నయమొప్ప' ననుచు
నారాయణుఁడు వచ్చె నలుగడ [1] వృష్ణి-
వీరులు సేవింప విందుప్రోలికిని.

ఈరీతి మఱియు ననేకులు నృపులు
వారాశివలయిత వసుమతినుండి
చిగురుఁబోఁడి విరాలిచిక్కముచేరు
తిగిచినకరణి సంధిలిరి తత్పురిని.

ఉర్వీమోపరులెల్ల నొకవంకఁ గూడ
నుర్వీభారము శేషుఁడోర్వలేఁడయ్యె.
పనిగొని సేనతోఁ బాంచాలుఁడట్టి
యినసోమవంశ్యుల కెదురుగాఁ బోయి
తడయక తోడ్తెచ్చి తగు విడిదలల
విడియించి, వారికి విభవంబుమెఱసి
యుపచారములుసేయ, నొకరీతి రాత్రి
నృపులు వేగించిరి నెలఁతరాఁగోరి.

ఆఁడుబిడ్డకును స్వయంవరోత్సవము
నేఁడని ద్రుపదుండు నిజపురిలోనఁ
జాటింపఁబనిచిన, శంబరారియును
చాటింపఁబనిచెను బాణసంపదను.

మఱునాఁడు ద్రుపదుండు మనుజేంద్రసభలఁ
దఱిగొని యింద్రనందను వెదకించి
కానక, గజముపై గంటమొత్తించి
జానొప్ప నిట్లని చాటఁబుత్తెంచె:
"మంచలమీఁద వేమాఱుండి మిగుల
నంచిత పుష్పగంధాదులవలన

---

1. దృష్టి. (మా)

యూపింప నొప్పుకార్ముక మెవ్వఁడేని
మోపెట్టి పంచాస్త్రములు వింటఁ దొడిగి
యంత్రమత్స్యమునేయు, నతఁడు ద్రౌపదికి
మంత్రదేవతగూర్చు మగఁడు గాఁగలఁడు."
అనిచాటుటయు, విని యారాజలక్ష్మ
లినుమడింపఁగ రాజులెల్లఁగైసేసి,
గుంపులై సింగంపుఁగొదములు వోలె
సంపద మెఱసి పాంచాలిరాఁగోరి
ధనువువంపకమున్న తమమీఁద మరుఁడు
ధనువువంపఁగఁ బోయి తగినవేడుకను
వందిమాగధులు కైవారముల్ సేయఁ
గ్రందైన మంచలు క్రమముతో నెక్కి
యెప్పుడెప్పుడు కృష్ణ నీక్షింప మాకుఁ
జొప్పడు నని సిక్కచూచిరెదుళ్లు.
విప్రులు వైశ్యులు [1]వృషలవల్లభులుఁ
గప్రము [2]గంధంబుఁ గైసేసివచ్చి
చెలువఁబాంచాలిఁ జూచినఁజాలు ననుచుఁ
గులము తేర్పడ వచ్చి కూర్చుండిరచట.
ద్విజులలోపలవచ్చి ద్విజరాజవంశ్యు
[3]లజిన జటావల్కలాంచితులగుచు
ఘనమైన రాజలోకములోనఁ జొచ్చి
పొనర నందఱకంటెఁ బొడవుదీపింపఁ
గొనకొన్న వేడుకఁ గూర్చుండి రంత.
కొనియాడు మానవకోటుల రవముఁ,
దునియని పటహాది తూర్యరవంబుఁ,
జెలఁగు భూసురుల యాశీర్వాదరవముఁ,
బలుకు లోకుల పక్షపాతరవంబుఁ

1. ద్రిపద. 2. గంధింప. 3. అజిత. (మూ)

బోరుకలంగ నంభోనిధిఁ ద్రచ్చు
నారావమునుబోలె నప్పుడెంతయును.
అటమున్న ద్రుపదరాజాత్మసంభవను
బటుతరకల్యాణ [1] భాగ్య యోగ్యతలఁ
గై సేయఁబనిచినఁ, గలికి జవ్వనులు
చేసూటి బోఁటిమెచ్చినపరిపాటిఁ
జంపకతైలంబు చారుధమ్మిల్ల
సంపదకింపుగా సకియకు నంటి,
కలకంఠి నలసత గదయకయుండ
[2] నలకలు మెల్లన నతివకుదువ్వి,
కుంకుమ చందన గోరోచనముల
పంకంబు [3] సతిమేనఁ బసిమిరానలఁది,
నీలాలకాఁగుల నెటి దొరలించి
హొలిఁబట్టినతీర్థ మువిదకు నార్చి,
మొత్తని [4] వలిపాన మెయితడి యొత్తి
యుత్తమాంగజలంబు లొయ్యన విద్రిచి,
తొడరి కాలాగరుధూపవాసనలఁ
దడియార్చి, మల్లికాదామముల్ దురిమి,
తిలకంబు బాలికాతిలకంబునుదుట
నలికంబుగాఁబెట్టి నగవంకురింపఁ,
గాటుక తెలిసోగకన్నుల వ్రాసి,
పాటించి మకరికాపత్త్రంబు లొత్తి,
స్వాతి తా ముత్తెమె చనుదెంచె ననఁగ
బ్రాఁతిగా నాసికాభరణంబు వెట్టి,
మృగనాభికప్రము మేలనచేసి,
మృగనేత్ర చక్కనిమెయిదీఁగె నలఁది

---

1. భాస్య. 2. నలకంట. 3. గఱ. 4. వలిపెము. (మూ)

వట [1] ఫలాధరకు దువ్వట మావటముగఁ
దటుకునఁ గట్టి, యొంతయు ముదంబొదవ
మట్టెలు మొలనూళ్లు మణివలయములుఁ
గట్టి, నేవళములుఁ గంఠమాలికలు
బవిరె లుంగరములుఁ బల్లేరుపువ్వు
లివియాదిగా సొమ్ము లింతికిఁ దొడిగి,
వాలికలైన నివ్వాళికలెత్తి,
బాలికామణికి సౌభాగ్యదర్పణము
చూపినఁ, దనరూపు చూడలజ్జించి
ద్రౌపది తనయింటి ధనువుచింతించి :
"యీకార్ముకమువంచి యెవ్వఁడే నన్ను
[2] గైకొనునల్లనా! కాదొకో!" యనుచుఁ
[3] దలపోయఁ, జెలువలాధవళాయతాక్షిఁ
గొలువుకూటమునకుఁ గొమరొప్పఁదెచ్చి
యారాజునకుఁజూప, నతఁడుముద్దాడి
కీరభాషిణిఁ బల్లకీ యెక్కఁబనిచి
ఛత్రచామరములు [4] సకియలుపూనఁ
జిత్రవైఖరి మహాసేనలు నడవ,
సంతసకట్టి ధృష్టద్యుమ్నుకపుడు
నెంతయుఁ బ్రియమున నిట్లనిపలికె :
"కన్నియ రాజమార్గంబునఁ జనుచుఁ
గన్నిచ్చయగురాజుఁ గైకొనరాదు ;
వెలయు బ్రహ్మక్షత్త్ర విట్శూద్రులందు
నలువొప్ప నెవ్వఁడైనను గొదలేదు ;
ఇవ్విల్లు మోపెట్టి యిషుపంచకమున
దవ్వులయంత్రమత్స్యము నెవ్వఁడేయు

1. లాధరకి. 2. కైకొనుగల్లనాకొకనాకనుచు. 3. తలపొల. 4. చలువలు. (మూ)

వనజాతముఖి వానివరియింపఁగలది.
వినఁజెప్పుమబలకు వీరులు వినఁగ
నతిభక్తిఁ జేర్వేర నట్టివీరులను
సుతకెఱింగింపుమీ చూపుచు." ననుచు
నెల్లరు వినఁజెప్ప నింతి యామాట
లెల్లను ధరియించె హృదయంబులోన.
ఇదెవచ్చెఁ బాంచాలి యివ్వీధికనుచు
నదెవచ్చెఁ బాంచాలి యవ్వీధికనుచు
నొక్కమొత్తంబులై యువిదపైఁ గవిసి
నిక్కనమెడలెల్ల నిడుపులుగాఁగ
రాజలోకము చూడ, రాజబింబాస్య-
కాజాడచూపుచు నగ్రజుండనియె :

### ధృష్టద్యుమ్నుఁడు రాజులఁ బేర్వేర ద్రౌపదికిఁ జూపిచెప్పుట

"మలయజగంధి, యీమనుజేశుఁజూడు,
మలవడ ముత్యాలహారముల్వైచి
పన్నగపతివోలె బాహువిస్ఫూర్తి
నున్నవాఁ; డితఁడు పాండ్యుఁడు నీరజాక్షి!
కుంతలపతివీఁడె కుటిలకుంతలుల
చింతా[1]స్థలులఁగాని చేయఁడు విడిది;
స్వారాజునకు నాత్మ చలియింపుచుండఁ
బారియాత్రాపురిఁ బాలించునితఁడు.
మాళవేశ్వరుఁజూడు మదిరాయతాక్షి!
బాలార్కనిభమౌళి ధరియించువాఁడు;
వీని యౌవనమున విహరింప రంభ
మేనక యూర్వసి మెఱసికోరుదురు.

1. స్థయల. (మా)

తరుణి, యీతఁడు పరంతపుఁడనువాఁడు
మరహాటకామినీ మదనమంత్రంబు;
వీనిశాత్రవగేహ విపినమధ్యమున
నీనినపులులుండు నెందునుబోక.
భూరిశ్రవుఁడు వీఁడె పూఁబోఁడి, చూడు
ధీరుఁడు బాహ్లీకదేశనాయకుఁడు;
బలుఁడు భీముఁడు సింహబలుఁడు మాగధుఁడు
బలమునఁ దనతోటిపాటివారనుచు
నెక్కువలావున నెపుడు మట్టాడుఁ.
జొక్కించుమగవానిఁ జూడుమా శల్యుఁ.
జేదీశు నిటుచూడు శిశుపాలు నబల!
[2] ఈదృక్శుభమువిని యెదిరి శూరులకు
బలవంతమునఁనైన భామిని, నిన్ను
వలవంతఁ గొనిపోవ వచ్చినవాఁడు.
మధురిపుఁడెవ్వనిమహిమకుఁ గాక
మధురనుండఁగపోయె మహినొక్కపురికి;
రాకేందువదన, జరాసంధుఁజూడు
కైకొనఁ డీవిల్లు కసవునకైన;
అవనీశవరుల సహస్రసంఖ్యలను
శివగాత్రికై వీఁడు చెఱఁబెట్టినాఁడు.
జగతి నక్షోహిణీసంఖ్యలుగలుగు
పగ రాక్షసులఁజంపి ప్రజలలో నిపుడు
సాధులాగుననున్న జగదేకనాథుఁ
డాదినారాయణుండైన దేవుండు
బాణాసురునితోడి బవరంబునాఁడు
బాణునికై పూని భవుఁడువచ్చినను

2. యేదిశుభము. (మా)

బ్రముఖులతోడఁ బాల్పడి పోరినట్టి
సమరభీముని జూడు జలజాక్షి, బలుని.
కర్ణుఁ జూడుము వీఁడె కర్ణాంతనేత్ర!
దుర్నివారుఁడు వీఁడె! దురములోపలను;
ఎన్నఁగఁ [1]గవులకు నితఁడిచ్చు ధనము
పన్నగపతి యైన భరియింపలేఁడు.
కౌరవపతి వీఁడె కమలాక్షి, చూడు
ధారుణీశుల నెల్లఁ దగ నేలినతఁడు;
వీనిధాటీభేరి వినినవీరులకుఁ
గానరానలెన్నొండెఁ గానఁబోవలెను.
నలువొప్ప ధృతరాష్ట్రునకు బిడ్డనిచ్చి
బలిమి భూస్థలిఁ జెల్లుబడిగాఁగ నేలు
బంధుసంపదఁ గాకిబలగంబుఁ దెగడు
గాంధారరాజు నోకల్యాణి, చూడు.
ఈతఁడు శూరసేఁ; నితఁడు విరాటుఁ;
డీతఁడు [2]భగదత్తుఁ; డితఁడు సైంధవుఁడు;
ఇతఁడు చిత్రాంగదుం; డితఁడు సుషేణుఁ;
డితఁడు సేనాభిదుం; డితఁడు సుశర్మ;
వాఁడె సుమిత్రుండు; వత్సరాజితఁడు;
వాఁడె చూడుము పౌండ్రవాసుదేవుండు;
శ్రీనిధులదె చంద్రసేన సముద్ర-
సేన శుభాంగద చేకితానులును."
అని చూపి వెండియు నవనిఁ గాంభోజ-
ఘనశూరసేన కేకయులాదిగాఁగ
నృపులఁ గన్గొనఁజేసి, నెమ్మి బ్రాహ్మణుల
నపరిమితాధ్వరాహర్తలఁ జూపి,

1. కాలకు. 2. భగదంతుడు. (మూ)

హేమకోటికిఁ బడగెత్తు వైశ్యులను
భామ కేర్పడఁజూపి, పాంచాలసుతుఁడు
ఆవరవర్ణిని నవరవర్ణులకు
వేవేగఁ జూపి యావిభులకిట్లనియె :
"సకలభూములవారుఁ జనుదెంచినారు ;
శుకవాణి మీకు రాఁ [1] జూడద యురక.
ఇవ్విల్లు మోపెట్టి, యేనింట మీనుఁ
ద్రెవ్వనేసినవాఁడు దీనికిమగఁడు.
[2] అంగవింతురుగాక యాకార్యమునకు
శృంగారనిధు." లన్నఁ జెలఁగి పార్థివులు,

మత్స్యయంత్రమేయుటలో రాజపుత్రులు పరాభూతులగుట

మూలగాలికిలేచు మొగిళులుపోలె
నోలి నందఱులేచి యుద్దండవృత్తి,
నంచిత పదఘట్టనారావమెసగ
మంచలపైనుండి మహిడిగ్గనురికి,
పైవుట్టములువుచ్చి పటులీలదాటి
...........................
...........................
యాభంగివచ్చిన యాకృతివోలె,
మనుజవార్ధిమథింప మంధరాచలము
చనుదెంచెనో విష్ణుసన్నిధికనఁగ,
నిరువంకలను నడుమేక ప్రకార
పరిణతిఁ బుణ్యాత్ములు కనుబోలెఁ,
గదియ నక్కజమైనఁ గదిసి చేదూర్చి,
కదలింపరాకయగ్గలము మల్లాడి,

1. జూడక. 2. అంగలించు. (మూ)

కొందఱువిరిగిరి ; కొందఱావిల్లు
చెందిన వేడ్క వంచియు నెత్తలేక
కలఁగిరి ; కొందఱు కదలించి యెత్తి
యొలమి నించుక నారియెక్కింపలేక

.........................

పూపునఁదివియుచోఁ బోవునో ప్రాణ
మేపునఁ బాంచాలికిట్లు భూపతులు

.........................

అనుచుఁ బోయిరి కృష్ణ యాత్మలోనవ్వఁ ;
మునుపు కొందఱు వీరులు డగ్గఱైరి ;
ఘోరమైయున్నఁ గన్గొని కొందఱందు :
"నీరేలఁ బాంచాలి నీయత్నమున
నుడివెట్టెనో ! కాక, మొదల నీవిల్లు
కడఁగి యెక్కించేనిఁ గదలింపకున్న !"
అని చూడభీతులై యంగంద నిలిచి
కనుఁగొనుచుండిరి ఘనశరాసనము.
మఱికొంద ఱవ్విల్లు మలయుచుఁగదిసి
నెఱిఁగదల్పఁగలేక సిగ్గొఱఁజనిరి.
కొంద : "ఱీవిల్లేల ! కోమలియేల !
యిందఱిలోపల నీసిగ్గులేల !
ఊరకుండుటకార్య ; మువిదకై నోళ్లు
నూరకుండుటకార్య మొప్పుగా" ననిరి.
అంత జరాసంధుఁ డావిల్లుగదిసి
పంతంబుతో నెత్తి ప్రజలెల్లఁ బొగడ
మిడికొప్పునకు నారి మినపగింజంతి
కడమగా నెక్కించి గ్రక్కునవిడిచె ;
అటువిడిచిన వ్రాలునాపింటి క్రిందఁ
బటుసహస్రములిల్గెఁ బ్రజలుసందడిని.

మద్రేశుఁ డప్పుడు మదమునఁగరసి
యద్రిఁబోలినచాప మవలీలనెత్తి,
పెడగాల నడుమూఁద పెసరగింజంత
కడమగా నెక్కించి గ్రక్కున విడిచె.
శిశుపాలుఁడును దనచేతికి విల్లు
వశముగా నెత్తి భూవరులెల్లఁ జూడ
వడిఁ గొప్పునకు నారి వరిగింజయంత
కడమగా నెక్కించి గ్రక్కున విడిచె.
అంగాధిపతి కర్ణుఁ డార్చుచు వచ్చి
యంగద నాచాప మవలీలనెత్తి
'యక్కట! వీనిపాలై పోదు' యనుచు
నక్కన్యవీక్షింప, నలువొప్ప మార్వ్వ
విడువనిలావున వెండ్రుకయంత
కడమగా నెక్కించి గ్రక్కునవిడిచె.
హలపాణి మొదలైనయాదవులెల్లఁ
దలపడఁజూచిన, దైత్యారిగదిసి :
"విప్రులతోఁ బాండవేయులు వచ్చి
యీప్రసంగమునకై యిదె యున్నవారు ;
వారికై ద్రుపదుండు వరమునఁగన్న
వారిజాక్షికి మీరు వలదాసచేయ ;
వినుతిఁ గన్నులుగలవేల్పులువోలెఁ
గనుఁ ;" డని వారలఁ గదియనీఁడయ్యె.

## అర్జునుఁడు మత్స్యయంత్రమేయుట

మఱియెవ్వరును వింటిమాటాడ వెఱచి
మఱుఁగులకొదుగుచో, మఘవాత్మజుండు
కరియూథములనుండి కరిరాజులేచు-
సరణి మహీదేవ సభనుండి లేచి

చాపంబుగదియు చో, శక్రజుఁజూచి
యాపార్శ్వచరులెల్ల నటతమలోన :
"సద్దిరా! పతిమీఁదనాస బ్రాహ్మణున ;
కిదీర్ఘమైనవిల్లెట్లు! తానెట్లు!
పార్థివేంద్రుల సిగ్గుపఱచినదాని
సర్థిడగ్గఱియె మేఁనవచ్చు వీని!"
ననిరికొందఱు ; కొందఱు : "శ్లేల! వీఁడు
ధనువునకెంతయుఁ దగియున్నవాఁడు ;
ధరణిపై నెవ్వారెంతటివారుగలరో !
పరికింపుచుండదము భావికార్యములు ;
నృపుల నుల్లస [1] మాండనెగడిన బాణ-
తపముపెంపెట్లైనఁ దనకునున్నదియొ !"
అనుచోట, మఱికొంద : "ఆశ్లేల! వీఁడు
ఘనమంత్రసిద్ధుండు గాఁబోలు మొదల ;
అట్టివారలకు సాధ్యముగానిదెద్ది !
యెట్టిదో కాక యీయింతిభాగ్యంబు!"
అని. రంత, బ్రాహ్మణులతనిదీవించి :
— "ఘనుఁడ, మాకపకీర్తి కట్టకుమయ్య !
— [2] యిందని లావున నీవిల్లువంచి
కందువగన్నట్లు ఘనయంత్రమేసి,
కల్యాణదేవతాకరుణ గైకొనుము
కల్యాణగీతివాక్యములు మిన్నంద."
ననుచుండ నాపార్థుఁడావిల్లు గదిసి,
పౌనరఁ బ్రదక్షిణంబుగవచ్చి నిలిచి,
జడధులు దశదిశాచక్రంబు భీతి
నడుక భుజాస్ఫాలనంబొనరించి,

1. మాడినుడిగిన. 2. యిందటి. (మూ)

లలి మత్తకరి యిక్షులతయెత్తినట్టు
లలవోక విల్లెత్తె నమరులువొగడ.
ఎక్కు వెట్టినవేగ మెవ్వారుఁగాన
రక్కన్యకయె కాంచె హరియున్న కాంచె.
పెనఁచినగొలుసుల ఫెళఫెళధ్వనుల
నసిచి యొక్కటఁగాఁగ నారిసంధింపఁ,
గలఁగె నంభోనిధుల్ ; కంపించె గిరులు ;
తలఁకిరి సప్తపాతాళవాసులును ;
పరఁగఁ బ్రత్యాలీఢపాదుఁడై నిలిచి,
పురలక్ష్యమీక్షించుభూతేశుపోలె
నేసమ్ము లొక్కట నేయనుంకించు
మీనకేతుఁడుపోలె మీఁదమీననుర
హరిమెచ్చ హరిమెచ్చ నఖిలంబు మెచ్చ
శరములిమ్ములవెంట సంధించి యేయఁడు
ఆననాంబుజమెత్తి, యంతరిక్షమునఁ
గానవచ్చియుఁగాక కనుసూక్ష్మరేఖఁ
జపలచిత్తముపోలెఁ జలియింపుచున్న
కపటలక్ష్యముఁగాంచి, కళవళపడక
తప్పనిచూడ్కి నంకలితమర్మమెఱిఁగి
యొప్పునాత్మనుగన్న యోగియుఁబోలెఁ
గర్ణాంతకృష్టశీకరమార్గమునుండి
తూర్ణవైఖరిఁ బాఱఁ దూపులేయుటయు,
నవి హంసములుపోలె నంబరవీథి
నివలావలఁబోక యేకమై నడవ,
సంచితగతి లక్ష్యమున్మృణాలమును
ద్రుంచి, యంతటఁబోక తోడ్తోననెగసి
లీల నెగురపెండ్లిరేఖలాయింద్రు-
ప్రోలి కర్జునుఁడు పంపఁబోయినట్లుఁగ.

మొగి రాజలోకసముద్రమధ్యమునఁ
దెగిన సుత్స్నము వ్రాలె దృష్టింపజగము.
అప్పుడు సిగ్గును నానందకళయుఁ
దప్పక సాత్త్వికోదయమును దీపింపఁ
బాంచాలి వెసవచ్చి పార్థుకంఠమునఁ
జంచరీకారావ సంతతితోడి
పుష్పమాలిక వైవఁ, బులకించి నరుఁడు
పుష్పాస్త్రములు నారుపోసినట్లగుచు
నావేళఁ బ్రేమఁ గంఠాశ్లేషణార్థిఁ
గావించెనని యాత్మగణుతించుకొనియె.
ఇదిమంత్రబలమని యెన్నిరి నృపులు ;
యదుకుమారులుఁ దాను హరి సంతసిల్లె.
పైపుట్టములువీచి బ్రాహ్మణులార్చి
రాపజ్జ నైదమ్ములపుడువీక్షించి ;
పురుహూతసుతుమీఁదఁ బువ్వులవాన
కురిసిరి సురలంతఁ గొనియాడి దిశల.

భేరీమృదంగాది భీమఘోషంబుఁ,
జేరి పాఠకకోటిచేయుకీర్తనము,
విప్రులు చెలఁగిదీవించు సంభ్రమము,
సుప్రసన్నతనొప్పు సురసన్నుతులును,
నేకమైయుండంగ నింద్రజుభాగ్య
మాకంజజుఁడుఁ గొనియాడలేఁడయ్యె".
అనియిట్లు జనమేజయావనీంద్రునకు
ముని చెప్పెనని చెప్ప మోదించి వారు:
'ననఘాత్మ, తరువాతనైనవృత్తాంత
మనువొప్పఁజెప్పవే!' యనియడుగుటయు,

ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితాదిపర్వ నిర్మలకథయందు
నుచితమై యాశ్వాస మొప్పె నాఱవది.



# సప్తమాశ్వాసము



శ్రీకర, శ్రితకల్పవృక్షావతార,
పాకశాసనభోగ, భవ్యసంయోగ,
నీలవర్ణునిమీఁద నిజమైనభక్తి
కీలుకొల్పెడువివేకీ చిత్తగింపు ;
అక్కథకుఁడు శౌనకాదిసన్మునుల
కక్కథాసూత్రమ్మిట్లని చెప్పఁదొడఁగె.
అంత నావైభవంబంతయుఁ జూచి,
శాంతితో హరిచూడ శమననందనుఁడు
కవలిరువురుఁ దాను గ్రక్కునలేచి
జవమొప్పఁ బోయెఁ బాంచాలి రానమ్మి. -
విల్లువంపఁగరాక విఱిగినసిగ్గుఁ,
బల్లవాధర విప్రపాలైనసిగ్గుఁ,
బ్రజలుమెచ్చక తమ్ముఁబలికినసిగ్గు
నిజమనోవీధుల నిగుడఁ బార్థివులు
కలశాబ్ధి కల్పాంత ఘనపవనమునఁ
గలఁగినట్లుకలంగి కడుఁ దమలోన :

అసూయచే ద్రుపదుపైనెత్తివచ్చినరాజుల
విజయుఁడు పరాజితులఁజేయుట

“ మనలఁ బాంచాలుండు మాయలువన్ని
తనయస్వయంవరోత్సవమని కూర్చి,
మంత్రసిద్ధుండైన మానవుచేత
యంత్రంబునేయించి యటుగన్యనిచ్చె.

చదురులు మనతోడఁ జనునె యీతనికిఁ!
గదనోర్వఁ గూల్తము కలుషాగ్నులుడుగ."
అని యేకయత్నమై యరదము ద్విరద
మనుపమాశ్వములు జోళ్లాభరణములు
విలు కోల మొదలుగా వీరయత్నములు
వెలయ సన్నద్ధులై వేల్పులుబెదరఁ
గమలజాండంబల్లకల్లోలపడఁగ
సమకొన్న భేరినిస్సాణముల్ మ్రోయ
[1]సమవర్తి సంవర్తచండమార్తాండ
సమరేఖ నస్త్రశస్త్రంబులు మెఱయ
నార్చుచుఁ బాంచాలునరికట్టుకొనినఁ,
జర్చింప నసమానసమరమై యతఁడు
క్షాత్త్రతేజముమించి జయముతోనున్న
శ్రోత్త్రియసభమాటు చొచ్చెఁ; జొచ్చుటయు,
విప్రు: "అహో! యేలవెఱచెదు ద్రుపద!
క్షిప్రము తుమురుచేసెదము పార్థివుల.
నడినెత్తు లడఁతుమా! నలివుస్త్రకముల;
మెడలు బిగింతుమా! మీఁదిధోవతుల;
దండంబులున్నవి; దర్భలుచాలు;
నొండొండ మంత్రింప నుదకంబుగలదు;
హుంకారముల శక్తియొకవంకఁ బొదలఁ
బొంకంబుచెడదు తపోవైభవంబు;
[2]మొగమోటములుమాని మూఁకలకుఱికి
[3]యగలింతుమా! నేనలటునిటు పడఁగ."
అనునంత, నర్జునుం డఱనవ్వునవ్వి:
"పనివడి మీరేల పలికెదరిట్లు!

---

1. సమవర్త. 2. మొకమాటములు. 3. అకలింతుమా. (మూ)

ఉవిద నేఁగైకొన్నయుదుకునఁ గాదె!
తివిరెదరిట్లు ధాత్రీపతులెల్ల.
నాకాంక్షఁదీర్తు ; రంభాదికామినులఁ
గైకొనఁజేసెదఁ గ్రమముతోడుతను ;
ధృతి నన్ను నాశీర్వదింపుఁడు చాలుఁ
జతురత ద్రుపదరక్షణ మేనొనర్తు."
అని యర్జునుఁడు విప్రులనుమతివడసి,
తనకుఁ బాంచాలుండు తగనిచ్చినట్టి
సమరోచితాస్త్ర శస్త్రములు ధరించి,
కమనీయకవచంబు గైకొని యపుడు
చలియింపకుండఁ బాంచాలి వేఱొక్క
స్థలమునను౦చ ధృష్టద్యుమ్నుఁబనిచి,
భీమసహాయుఁడై పృథివీశకులముఁ
జీమలకంటె సూక్ష్మించి చూచుచును,
శరములేయుచుఁ బల్కె శక్రనందనుఁడు :
"హరిణాక్షి రాదింక నాలంబులేల!
చాలుమీయలుక! పాంచాలుపై [1]నుఱుకఁ
బోలునే! యతఁడేమి బొంకె మీయెడల!
గుఱియెవ్వఁడేసినఁ గూఁతునీఁగోరి
మఱికదా రప్పించె మక్కువ మిమ్ము!
జనకుండు నిలుపఁడా! జానకికొఱకు
ననలాక్షువిల్లు బ్రహ్మాభేద్యముగను ;
మీకు సత్వంబున్న మృదునిపై నలుగుఁ ;
శీకలహమున మీకేది జయంబు!"
అనుచు మార్గణవృష్టి నందఱు ముంప,
మనుజేంద్రు నావృష్టి మరలించి నిలిచి,

---

1. నురక. (మూ)

నలుఁగడనిగుడు బాణప్రవాహములు
కలనువట్టని పాటి క్రందునఁబఱపి,
'యదెపో యెఁబోయె భీమానుజుం' డనుచుఁ
ద్రిదశులు దివిఁజూడ ద్విజకోటియాడ,
నాతిధైర్యమువీడ, నారదుఁడాడ,
[1] నాతూపునెఱినాడ, నతఁడల్కఁతోఁడ
[2] నగి పెద్దలడుగుప్రశ్నములకు సరిగఁ
దగ యాజ్ఞవల్క్యుఁడుత్తరమిచ్చినట్లు
కౌరవ కాళింగ గౌడాంగ వంగ
కేరళ కేకయ [3] కీచక సాళ్వ
చేది జరాసంధ సింధు గాంధార
వైదేహ బాణప్రవాహంబులెల్ల
ఘోరాస్త్రతతియను కుంభజుచేతఁ
బారణసేయించి పార్థుఁడుప్పొంగె.
[4] (అప్పుడు శల్యుండు నంగాధిరాజు
ముప్పిరిగొనుకోపమును సంభ్రమంబు
నీసును గదురఁ దీవ్రేషుజాలముల
నేసిరాపవనసురేంద్రనందనుల ;)
ఏయుచో నొక్కమహీజమ్ము వెఱికి
వాయునందనుఁడును వారిపైఁగవిసె ;
వారిరువురు నంత వజ్రసంకాశ-
ఘోరబాణంబులు గురిసిరి మిగుల ;
ఆపవనజుచేత నరిరాజసేన
చాపకట్టై త్రెళ్లె సమరమధ్యమున.
రణభూమి యీక్షింపరాక దేవతలు
మణివిమానములెక్కి మరలిరి దివికి.

---

1. నాతూపు. 2. దాగి. 3. కీచకాస్యాంత. 4. గ్రంథపాతమగుటచే సందర్భానుసారముగా నీపంక్తులు చేర్చఁబడినవి. (మూ)

అన్యోన్యశరధార లనలంబు లీనఁ,
గన్యావివాహాగ్ని గతి మండుచుండె ;
లాజలగతి హారలత లందుఁదునిసె ;
రాజరక్తం బాజ్యరాజి [1] గాఁ దొఱఁగె ;
విసిరి భీముఁడువ్రేయ విఱిగినరథము
లసమున సమిధలై యాయగ్నిఁబడియె ;
ఆసర్వనృపుల వీరాలాపరవము
రాసియై వేదమంత్రధ్వనిఁ బోలెఁ ;
బదిటఁ బదారింటఁ బండ్రెంట రెంటఁ
బదివేలు లక్ష తప్పనిసాయకముల
నాటింపఁ, జూచి సైన్యములు రోషమున
మీటుగల్గినయట్టి మెఱవడితోడఁ
గరివాఁడు హరివాఁడు కాల్నడవాఁడు
నరదంబువాఁడునై యాశ్చర్యలీల
సవ్యసాచిరథంబు సందీక పొదివి
సవ్యాపసవ్య శస్త్రంబులఁ గప్ప,
వాయుజుండును సైన్యవారిధిమీఁదఁ
బాయక బడబాగ్ని పడినట్లు గదిసి,
కాపులుఁ దోపులు దప్పఁ గావించి,
వీపుల దాపల విఱుగఁ ద్రొక్కుచును,
వాటుల వ్రేటుల పడఁ బాఱమీటి,
మీటుల గూటుల మెల్లెవాపుటను
గలగుండు వెట్టి, దిక్కరిచొచ్చికలఁచు
కొలను సేసిన, గండుగూలి యబ్బలము
అర్జునపసవ్రేట్ల నాభీమువాట్ల
జర్జరితాంగులై జడియఁ జొచ్చుటయుఁ,

1. మీఁదొఱఁగె. (మూ)

గర్జాదు [1]లొక్కఁడొక్కఁడ యేనికెక్కి
తూర్ణవైఖరి భీముతోఁ బార్థుతోడ
సమరంబుసేయ, నాచండాస్త్రవృష్టిఁ
గమలబంధుఁడు [2]డాఁగి కమ్మెఁజీఁకట్లు;
అరుణరత్నాభ సంధ్యారాగ మెసగెఁ;
గరికుంభదళిత ముక్తాతారలడరె;
నిబిడహుంకృతి ఘూకనినదంబు లెసగెఁ;
బ్రబలి బాణాంధకారము పెచ్చుపెరిగె;
ధరణీశ్వరుల మోముదమ్ములు మొగిడెఁ;
గర మొప్పఁ బ్రతిపక్షకలకలంబడఁగె;
ఘనభూతమిధున చక్రంబులు గూడె;
ననిమిషేక్షణ చకోరావలి చెలఁగె;
పదలకెల్లెడ బాణవాయువుల్ వీచెఁ;
గదన మొప్పె నకాలకాళరాత్రగుచు.
దేవేంద్రుఁ డమరావతీకవాటములు
వేవేగఁ బెట్టించె విజయాస్త్రభీతి.
పెండ్లికి [3]వచ్చినపెంపేది రంభ-
పెండ్లికేఁగిరి భటుల్ బీభత్సుఁడనుప.
రథములువిఱిగి, వారణములుదొఱఁగి,
పృథివిపైఁ బీనుఁగుపెంటలై పడియె.
అట్టిచో శల్యుఁడాహవదక్షు ననిలు-
పట్టి నార్చుచు నిల్వఁబట్టిన, నతఁడుఁ
దనశాలఁ దగిలినతామరనూలు
వనకరి గొనని కైవడిని గైకొనక
తానంత శల్యునిఁదగులఁబట్టుటయు,
లోనయ్యెఁగీర్తికి; లోనయియతఁడు

1. లెక్కఁడెక్కఁడయేనకెక్కి. 2. గ్రాఁగి. 3. వచ్చుటపెంపోయి. (మూ)

విడిపించుకొని భీము వ్రేయుచో, నతఁడుఁ
గడిమినాతనిలావుగ్గొని తెలిసి
తానట్లు వ్రేయ నాతండుమూర్ఛిల్లె.
జానొప్ప వేవేగ కల్యుండు గదిసి
మల్లయుద్ధమునకు మఱి తొడఁబడినఁ,
బెల్లార్చి భీముండు పృథివిపై గొంత
సదవుచ్చుకొని రెండుసగములుచేసి,
వదలక యవి రెండు వంకలఁజిమ్మి,
కనుమోసమునఁజొచ్చి కచ్చయు మెడయుఁ
బెనఁగొన నిరుగేల బిగియంగఁబట్టి,
కాలుకాల గ్రహించుగతిఁ జూచి, కల్యుఁ
డాలోనఁ గడు భీము నడఁగఁబట్టుటయు,
మంచుననిలువని మార్తాండుపగిదిఁ
బొంచినబంధనంబులు ద్రెవ్వ నిలిచి,
ననిలునాత్మఁదలంచి యనిలనందనుఁడు
ఘనశక్తి నిరుగేలఁ గబళించి యెత్తి,
మలయవైచినయట్లు మహిఁద్రెళ్లవైవఁ,
గలకల నవ్విరి కన్నవారెల్ల.

## అర్జునుఁడు కర్ణు నోడించుట

కానీనుఁ డట పార్థుఁగట్టల్కఁదాఁకి
నానాస్త్రములు మేననాటి యార్చుటయు,
సింహంబునకుఁ బ్రతిసింహ మన్యోన్య-
సంహారమతిఁ దోచుచందంబు దోచె.
ఆవేళఁ జూచుసైన్యము లిరువురను
భావించు తమలోనఁ బలుకుదురిట్లు.
"ఈతండు నీతండు నేమాదురొక్కొ!
చాతుర్యరేఖల సరివచ్చినారు;

పోలికలిట్టివీభువినెన్నిలేవు !
వాలంపవాన సర్వముఁగానవచ్చు ;
[1] నంటినభానమెన్నఁడునిరువురకు
వింటలే ; దిదియొందు [2] విన్నదిలేదు ;
కుదువఁబోవుచు నేలకూరాకులదుగఁ
దొడిర ; " మ్మనుచునుండఁదొడరి రిర్వురును.
బలశిలీముఖ [3] శాతభల్ల నారాచ
విలసార్ధచంద్రాది విశిఖంబులేసి,
యొండొరుచాపంబు లొండొరుపడగ
లొండొరుకవచంబు లోలి ఖండించి,
ధనువులు నాలోన ధరియించునంత,
వినతనూజుఁడు ఫాలమేడింట గ్రుచ్చి
కోదండగుణ మొక్కకోలఁ ద్రుంచుటయు,
మోదించి చిఱునవ్వు మొలవ నర్జునుఁడు
నారిగైకొని నాల్గునారాచములను
వారిజాప్తతనూజువక్షంబు నాటి,
మూఁడువాలమ్ముల ముఖవీధిగ్రువ్వ,
వాఁడర్జునుని గ్రుచ్చె వాఁడితూపులను.
పటుతరనారాచపంక్తులీరీతిఁ
దటుకున నేయుచోఁ, దగనర్జునుండు
పరికక్షనిలువక శాతనారాచ-
నిరవధి [4] వృష్టి నించిన, మూర్ఛఁబొంది
భానుతనూజుండు పడివడిఁ దెలిసి
యూనిన నెత్తుట నుదయార్కురీతిఁ
బగులుమేనికిఁగాక పడగకుఁగాక
తెగుసారథికిఁగాక తేరికిఁగాక

1. అల్లెన. 2. విందును. 3. కర్త. 4. ముష్టి. (మూ)

గాలివానఁ జరించు కారాకుపోలెఁ
జాలఁదూలి చలించి శక్రజుఁ బలికె :
"నన్నిట్లు మార్కొని నడుఁకక నిలిచి —
కొన్ని బాణములేయఁ గుంభినిమీఁద
హరిసూనుఁడోపు శ్రీహరి తోఁపుఁగాక
బిరుదుల మూఁడవపేరు నేనెఱుఁగ.
నీవెవ్వఁడవు నాకు నెఱిఁగింపు తొలుత ;
చేవేఁడి మఱికాని నేయు నీమీఁద ;
నిజవిద్య మఱికాని నెఱప నీమీఁద ;
ద్విజమాత్రుఁడవొ! కాక [1]ధృష్టతె ?" ట్లనిన
ననిమిషేంద్రునిపుత్త్రుఁ : "డాప్రసంగంబు
వెనుకఁ జెప్పెదఁగాక ; వినుము నిన్నిపుడు
తల గునుమకమూనఁ దప్పించుకొనుము :
పలుకులతో నీకుఁ బనిలేదు కర్ణ !"
అని వేగ మీఁద దివ్యాస్త్రంబు లేయ,
ననిఁ గాలుపొందక యతఁడు వణంకి —
'విప్రుని నిన్నేయ వెఱతునే' యనుచు
క్షిప్రవైఖరిఁ బాఱె సేనలు చెదర.
ఆకర్ణశల్యులిట్లైన, విస్మయము
గైకొని యిట్లనుఁ గౌరవేశ్వరుఁడు :
"ఆలంబులోఁ గర్ణునలయించి తఱుమఁ
జాలునెవ్వఁడు ! వాసవిచాలుఁగాక ;
లోపంబులేక శల్యునిఁ ద్రెళ్లవైవ
నోపునెవ్వఁడు ! వాయుజుఁడోపుఁగాక ;
ఉఱికెదవీరిపై నొగి విప్రులనక
నఱికెద ; నా వెంటనడువుఁడీ దొరలు.

---

1. ధృష్టమెట్లనిన. (మూ)

అనఘులార! యనిత్య మధ్రువప్రాణ
మనుమాన [1]మీచందమన మున్నువినరె!"
అనియార్చి కవయుచో, హరివారికనియె:
"జననాథ, యీవృథాసాహసంబేల!
కరమున్నఁ దమకు శక్యముగానిపనికిఁ
జొరక నెమ్మదినుండు సుమతికి మనికి.
విలువంచినప్పుడే వీరలబలిమి
తెలియవు నీకేమితిక్కవట్టినదొ!
ఇరువురుగూడినా రిలకెల్లఁగలరు;
వరుస నెవ్వరు తోడువత్తురో వెనుక!
దొఱకొన్న విరిపాటి దునియదు రణము;
మరలుటకార్యంబు మాకుఁ జూచినను."
అనిచెప్ప హరిమాట లతఁడు పాటించి
తనవీరసైన్యంబు తప్పక త్రిప్పి,
పనిగానిసిగ్గునఁ బట్టణంబునకుఁ
జనుచు [2]మేలందినజాడగా నడచి
కరిపురికరిగినఁ, గలరాజులెల్ల
మరలిరి తమతమ మనికిపట్టులకు.
తనియ దక్షిణలిచ్చి తమగ్రామములకు
ననిచెఁ బాంచాలుండు నంత బ్రాహ్మణుల.
ఇట భీమపార్థులు నింతిఁ దోడ్కొనుచుఁ
బటువేషములతోడ వచ్చిరి మరలి.
కుంభినీపతులిట్లు కోమలిఁగొనుచుఁ
గుంభకారులవాడ కొమరొప్పఁ జొచ్చి,
తమవిడిసిన [3]యింటిద్వారదేశమునఁ

1. మాచంద్ర. 2. యేలిందిన. 3. యట్టి. (మూ)

## అర్జునుఁడు ద్రౌపదినిఁ దల్లికి నివేదించుట

గొమరొప్పనిలిచి : " యోకుంతి ! ముదంబు
లూరఁగ నటపోయి యొకభిక్ష దెచ్చి
నారమిచ్చటి ;" కన్న నాతి : వేవేగఁ
గొదలేక భిక్ష యేగురుఁ బంచుకొనుఁడు
మొదలనెట్లట్ల." ని ముసుముట్ట నాడి
వెలుపలకే తెంచి వీక్షించునపుడు,
నెలకొన్న పండు వెన్నెలసోగవోలెఁ
బూని వర్షము వెంట భువిడిగ్గి మరలఁ-
గా నేరకున్న తొల్కరిమెఱుఁగువోలెఁ
దూరఁ జెందొవరేకుదొనఁ జోటులేక
జారిన పంచాస్త్రశరమును బోలెఁ,
జెదరక శుక్రసంజీవనివలన
బ్రదికిన బంగారుప్రతిమయుఁబోలె
నభినవశ్యామాంగి యలినీలవేణి
త్రిభువనలక్ష్మి యత్తెఱవయుండంగ,
వీక్షించి యానందవివశయైకుంతి :
" యీ క్షితిఁ గంటినే యిటువంటికొత్త !
ఇందుఁజూచి కఱంగు నిందుకాంతముల
పొందునఁ గన్నులీపొలఁతినెమ్మోముఁ
గనుఁగొని హర్షాశ్రుకణములు విడిచె ;
వినక కానక యేల వీరినిట్లంటి !
నెప్పుడు నన్నట్టులే వీరనంటి ;
నిప్పువ్వుఁబోఁడి చొప్పెఱుఁగలేనైతిఁ;
జయ్యన మీఁదువిచారించికాని,
యెయ్యెడఁ బలుకుట యిదికార్యహాని.
తనయులురారని తలఁకుచునుండి
మనముచలించి యామాటలాడితిని.

ఏవురకొకయింతి యనియు సక్రమము!
నావాక్యమునుదప్పి నడవ రెన్నఁడును;
ధర్మమేగతినుండెఁ దలకూర్తు." అనఁగ
ధర్మరాజంత నంతయు వినివచ్చి,
తమ్ములుఁ దానును దల్లికి మ్రొక్కి,
తమ్ములఁజూచి యాద్రౌపదిఁజూచి,
హరినూతినిట్లను: "అర్జున, నీవు
వరియింతుగాక యీ వామాయతాక్షిఁ;
చాపచాతురిఁగాదె చనుదెంచె!" అనఁగ,
నాపుణ్యుఁ: "ఇట్లేలయానతిచ్చెదవు!
అన్నవు నీవుండ నర్హమా! నాకుఁ
గన్నియ మున్నాడికైకొన దేవ!
మీరు వరింపుఁడీమృగరాజమధ్య;
నీరూపమున మాకు నిదిమనోహరము.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

అనుఁగాక యేమి, మృగాక్షి యేవురకు
మనమున నభిలాషమగ్నయైయుండ."

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

నావిధంబంతయు యమసూతి యెఱిఁగి,
దేవేంద్రసుతుఁజూచి తేటనవ్వమర:
"నేవురువరియింత మీపువ్వుఁబోఁడి;
నేవెంట గురువాక్య మేటికిఁదప్ప!
కుంతి 'యేగురుఁబంచుకొనుఁ' డన్నమాట
యెంతయుఁబాటింత మిదిదాటరాదు.
భావింప నిదిధర్మపథముగాకున్న
నేవురకును బ్రేమ యిందేల మొలచు?
వ్యాసమహామునివాక్యంబులెల్ల
మోసమే! మనకు ధౌమ్యుఁడుఁ జెప్పెనిట్లు."

## కృష్ణుఁడు పాండవులఁ జూడవచ్చుట

అనునంత, రామసహాయుఁడై శౌరి
కనకరథంబున గరుడాంకమమర
[1] మేదినిడిగ్గిన మేఘమోయనఁగ
నాదినారాయణుండచటికే నేరఁ,
దమకుఁబ్రాణముగాన దైత్యారిరాక-
కమర మేనులువొంగ నతిసంభ్రమమున
నాచారములుసేసి, యర్ఘ్యపీఠముల
[2] నాచారుమూర్తుల నర్థిఁబూజించి,
సేమంబులడుగుచు శ్రీకృష్ణుఁజూచి
భీమాగ్రజుఁడువల్కెఁ బ్రేమరెట్టింప:
"లక్కయింటికిఁదప్పి లక్ష్మీశ, మేము
తక్కకవెడలి యీధాత్రి నేరికిని
వివరింపఁగారాక విప్రవేషములు
నివిడివర్తించుచో నీవెట్లుగంటి?
భువనంబులన్నియుఁ బుక్కిటనిడిన
దివిజవంద్యుఁడవీవు తెలియనిదేది!"
అనినఁ గృష్ణుఁడుపల్కు: "నమరులకైనఁ
గనుఁగొనఁ బనిగొనఁగారానివిల్లు
నృపతులందఱుఁజూడ నీసహోదరుఁడు
చపలాక్షికై వంచె సత్వంబుకలిమి;
ఇట్టిచేతల మిమ్మునెఱుఁగుట యరుదె!
పట్టిచూడఁగరాక ప్రబలులోకముల.
దుర్యోధనుఁడు సేయుదుష్కార్యములకు
ధైర్యసమ్మతులార, తగులక మీరు

---

1. మేదికి. 2. ఆచార. (మూ)

వెడలితి ; ఁదిపదివేలు మామేలు ;
కడపట నిచ్చోటఁగంటిరి శుభము
'ధర్మమెక్కడ నైనఁ దలఁగాదు' ననుట
ధర్మాత్మ, నిజమయ్యెఁ దలఁప మీయందు.
రప్పించు మిము ధృతరాష్ట్రుఁడక్కడికి ;
నిప్పించుఁ [1] ద్వద్భాగ మేనె చూచెదను.
ఈవైభవమ్మెసు [2] మ్మిచ్చెననూయ ;
భావింపఁ గురురాజుఁ బార్థ, నమ్మకుము ;
ఏసంకఁబోయెద ; నిచ్చటనున్న
మీనిర్ణయములకు మెచ్చెగా." ననుచుఁ
గుంతికిఁ దత్పుత్రకులకును జెప్పి
కంతుజనకుఁడుపోయెఁ గదలి ద్వారకకు.
అప్పుడింద్రజు [3] గెల్పు నాత్మసంభవుని
నొప్పియుఁజూచి, మనోవ్యథ నినుఁడు
జగమునిర్వాహంబు చాలించెననఁగ
మొగి [4] మింటఁ బశ్చిమాంబుధిచాయ డిగ్గె ;
'తగఁ గాలనృపతి యాధర్మాధికులను
బగలుచేసెదవని పట్టించె గిరిని
. . . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . . .
రథమునగంబు సారథివిచ్చెగుంటు
రథికుఁ డట్లయ్యెఁ జేరఁగవచ్చె నన్న'
[5] అని ప్రతీచీకాంత యనురక్తినెఱపెఁ
[6] దనువెల్లననఁగ సంధ్యారాగమెసగె ;
'ఇందిర హరిదేవి యిల్లడసొమ్ము
మందిరమనివచ్చి మనలోన జేరెఁ ;

---

1. దద్భాగ. 2. మ్మెచ్చె. 3. గెల్వ. 4. మిన్ను. 5. అనినప్రాచీ. 6. తనువెల్లి. (మూ)

జీఁకటిపొద్దు రక్షింతు' మన్నట్లు
మూఁకలుమూఁకలై మొగిడెఁ బద్మములు ;
వరుస మిన్నునునీలవస్త్రంబుమీఁదఁ
బఱపుమై ముత్యాలు పచరించిరనఁగ
నక్షీణ తారతమ్య ప్రభావమున
నక్షత్రకులములు నభమునఁదోఁచెఁ ;
దనమీఁదఁ బార్థుండు ద్రౌపదిఁదెచ్చు-
కినుకపోలిక నుర్వి గిరికుచ [1] శ్రీలు
చూపక మేలుముసుంగిడె ననఁగ
వేపర్వెఁ జీఁకట్లు విశ్వంబునిండ ;
శ్రీకంఠుఁ డర్ధనారీస్వభావంబు
గైకొన్న, నతనివక్షము [2] తెన్నుచూచి,
యాలీల తమకురా [3] నట్లాయె ననఁగ
నోలినొప్పెఁ గొలంకు లొంటిజక్కవలఁ ;
జంద్రాన్వయుల పెండ్లి సంభ్రమంబునను
జంద్రునెచ్చెలు లెల్ల సంప్రీతిఁగనుట
తగవని వికసించెఁ దక్కైరవములు
జగతిపైఁ బర్వంగఁ జంద్రికావితతి.
ఆరాత్రి కుంతి భిక్షాశనంబునకు
గారాబుకొడుకులఁ గ్రమమొప్పఁబనుప,
వారేఁగి భిక్ష పూర్వప్రకారమునఁ
గోరి తెచ్చినఁ, గుంతి కోమలిచేత
దేవార్థ మొకపాలు తివియించి, యందు
భావించి యతిథితర్పణకొకపాలు,
చిక్కినయది రెండుసేయించి, యొకటి
తక్కక మును వృకోదరునకిప్పించి,

1. స్త్రీలు. 2. తన్నుచూపి. 3. నట్లాడె. (మూ)

* .......................

.......................

నీకీచిల్వఁగఁ గొంతనిలిచినకూఁడు
చేకొని యదిరెండుచేసి, వేవేగఁ
గోడలుఁ దానును గుంతిభుజించి
వేడుక శయ్యల విరచింపఁబనుప,
నవదర్భశయ్యలు నాతి యేవురకు
నవరించి, మఱి వారిచరణాగ్రభూమి
నాదిగ ద్రౌపదియయ్యె శయించె ;
[1] రాదు స్వయంబంత రాచకూఁతునకు ;
వింతవారలుగదా వీరనిఁగొంత
చింతింప ; దెవ్వరు చెప్పిరోబుద్ధి !
ఇట్టివృత్తాంతంబు లెంతయునరయ
నట్టనఁ దనయుని నృపుఁడు దా మున్న
యతిరహస్యంబుగా ననుపుటఁజేసి
యతఁడేఁగి యన్నియునరసి, యారాత్రి
ధరణీశుకడకేఁగి తగుభక్తిమ్రొక్కి
వరుసతోడుతఁజెప్పె వారివర్తనము :
"జననాథ, యే వారిచరితంబులెల్లఁ
గనుఁగొనివచ్చితిఁ గడఁగి మీరనుప ;
నుక్షత్రియులువారు చూచినఁదెలియు ;
నీక్షోణిపై నెన్న నితరులుగారు.
తలపోఁతకై రాత్రి తమలోనఁ దారు
పలుకుకొన్నారట్టి పలుకులేవింటి.
పరసేన భేదనో [2] పాయ క్రమంబుఁ,
బరబాణ భంజనోపాయ క్రమంబుఁ,

---

* ధర్మజాదులకు అన్నమిడిన విషయమిట లుప్తమైయుండును.

1. రాదిస్వయంబంది రాచకూంతులకు. 2. పాయసక్రమము. (మూ)

బరిగణించిరి, విప్రభాషలుగావు.
ధరణీశ, యొక్క చోద్యము వినుమింకఁ ;
జెలువ వారికిఁ జేయు సేవాక్రమంబు
తలఁపవచ్చునె! వింత దనమింత లేదు ;
ఆవిల్లువంచిన యతని తోయంబు
ఏవురన్నలుఁ దమ్ము లీక్షించిమాడ ;
[1] జరఠ యొక్కతె వారిజననిగాఁబోలు !
వరుస భిక్షాన్నంబు వారికిభుక్తి. "
అని వేషధారుల యఖిలవర్తనముఁ
దనయుఁడెఱింగించెఁ దండ్రి కంతయును.
అంతటఁ బాంచాలుఁ డమ్మఱునాఁడు
కాంతతో మంత్రిసంఘంబులుఁ దాను
నవవేషకుల వర్తనంబు లెఱుంగ
నవిరళంబగు నుపాయంబు దలంచి,
నాలుగురథములు నాల్గుజాతులకుఁ
జాలనొప్పిదముగాఁ జక్కఁబన్నించి :
[2] 'యేజాతితనుజాతి యో యారథంబు
రాజిల్ల నెక్క వారలు నగరికిని
వచ్చునట్లుగఁ జేసి వరుసఁదోడ్తెండు
మచ్చిక ;' నని చెప్పి మంత్రులనసిపె.
పురుషార్థములునాల్గువోలె నారథము
లరుదారఁగొనివచ్చి యామంత్రివరులు
పాండుపుత్త్రులఁగాంచి భక్తితో మ్రొక్కి :
. . . . . . . . . . . . . . . . . . . . . . . . .
" యీవాహనము లెక్క రేతెండు ; మిమ్ము
భూవరుండట పిల్వఁబుత్తెంచినాఁడు ;

---

1. జనని. 2. యేజాతితనజాతియందారథంబు. (మూ)
అర్థస్ఫూర్తికై యతిభంగమంగీకరించఁబడినది ; మూలమునను యతిలేదు.

ఈ తేరువిప్రుల ; కీ తేరునృపుల ;
కీ తేరువైశ్యుల ; కిదిశూద్రులకును.
వీనిలోనొక తేరు విభులార, యెక్కి
జానొప్ప ద్రౌపదీసహితులై రండు."

## పాండవులు ద్రౌపదీసహితులై ద్రుపదునగరి కేఁగుట

అనిన, ధర్మతనూజుఁ డట్లకాకనుచు
ననుజులుఁ దాను నొయ్యన రాజరథముఁ
బరువడి నెక్కినఁ, బంచాయుధములు
హరిదాల్చినట్లయ్యె నయ్యరదంబు.
అత్తయుఁ గోడలు నందలంబులను
ముత్తైదువలమూఁక మొనసియే తేరఁ,
బంచపాండవులును బాంచాలుసభకు
నంచితలక్ష్మితో నరుదెంచునపుడు
నడనడ నెదురుగా నీప్సితార్థములు
జడయక ద్రుపదుండు జాతిజాతులకు
రసికతఁబుత్తెర, రాజయోగ్యముల
వెసఁగయికొనుచు నవ్వీరులువచ్చి
రాజయోగ్యములైన రత్నాసనముల
నోజలోఁ గూర్చుండి రుచితంబుగాను.
ఎంతైనఁ దమ్ముఁదా మెఱిఁగించుకొనక
కౌంతేయులని యెఱుంగఁగరాదు గాన,
వారలఁబూజించి, వసుధేశుఁడాత్మ
నేరూపమును నిర్ణయింపంగరాక
తిన్నని ప్రియములోఁదెలియనిట్లనియె :
"ఎన్నఁ బుణ్యశ్లోకు లెవ్వారుమీరు?
రామఁగైకొన నమరావలినుండి
భూమిడిగ్గిన దివ్యపురుషులో! కాక,

భవుపంచముఖములో ! పంచవర్ణములో !
వివరింపరాజులో ! విప్రులో ! చెప్పుఁడ ;
అస్తోకభుజధారు లమలవర్తనులు
విస్తీర్ణవక్షులు వృషభకంధరులు
కర్ణాంతనేత్రులు కఠినైకగాత్రు
లర్ణవగంభీరు లర్థినేవురును.
విలువంచి గుఱిద్రుంచి వెలఁదివరించి
కలహించి నిర్జించి కడుమించియున్న-
యతఁడెవ్వఁడిందులో ? నందఱు నొక్క-
ప్రతినుండ నితఁడని భావింపరాదు.
ఏనును బాండవు లిలలేనివగల
నూనియుండెదఁగాన నొత్తియడిగెద.
వారలుగారుగా ! వటులార, మీరు ;
కోరిక లల్లెనఁ గొనసాఁగు." ననినఁ,
బాండవాగ్రణి నవ్వి పాంచాలుఁబలికె :
"నొండేల ! పాండవేయుల మేము ద్రుపద !
యమసూతి నేను ; భీమార్జునుల్ వీరు ;
యమలువీరిరువురు ; నాయింతి కుంతి.
మహిమీఁదఁ గురురాజుమనసు రావలసి
విహరింపుచుంటిమి విప్రవేషముల.
నినువంటిచుట్టము నేనెందుఁగాన ;
ఘనుఁడ ! లోకులకింకఁ గానసయ్యెదము."
అనవిని పాంచాలుఁ డానందలహరిఁ
గనువ్రాల్చి గద్గదకంఠుఁడై తెలిసి,
కలరూపాకో ! యని కదలనిభీతిఁ
గలరూపకానమ్మి కడుసంభ్రమమున
నందఱ గాఢగాఢాలింగనముల
నందంద గ్రుచ్చుచు, హరిని మెచ్చుచును,

బసిమి నేర్పురఁ దనభక్తిశక్తులకుఁ
బొసఁగిన [1] యుక్తితోఁ బూజలుచేసి :
" యిదిగదా ! నాఫల ; మిదినాప్రతిజ్ఞ ;
నెదకినవిధిఁగంటి ; విఖ్యాతిఁగంటి ;
నాభాగ్యమునఁగాదె ! నాఁడగ్నిఁదప్పి
యీభంగి నుండితీరిన తేజులార !
కూరిమిఁ బార్థుకుఁ గూఁతునీఁగంటిఁ ;
గోరినకోర్కి కొనసాఁగఁగంటి.
విల్లువట్టినయట్టి విధము వీక్షించి
యుల్లంబు నగునిఁగా నూహించిచూచి,
యిందువంశాధీశ, యెఱుఁగలేనైతి ;
సందేహమిటపాసె సంతోషమెసఁగె.
వాసవికింక వివాహయత్నంబు
చేసెద లగ్నంబుచింతించి " యనఁగ
బాంచాలువీక్షించి పలికె ధర్మజుఁడు :
" మంచిమార్గము నీదుమాటయిట్టిదియె ;
ఇంక నొక్క విచార మించుక గలదు.
పంకజానన నేము పరఁగ నేర్పురము
వరియించువారము వైదికస్థితిని ;
పరికింప మాకుంతిపలుకు నిట్టిదియె.
తల్లివాక్యంబని ధర్మంబుఁదప్ప ;
మెల్లనావులఁ దొల్లి యిట్టివిగలవు ;
[2] ఘనజటిలాకన్య గౌతముకూఁతు
మునులేడ్వురనుఁగాదె మున్నుగైకొనిరి !

---

1. భక్తితో. 2. ఘనజటాలునికూఁతు కౌతునికన్య — మునులేవురనుగారె మున్నుగైకొనిరి— పూచి దక్షిణియను పూఁబోణింగాదె— ప్రాచేతసులుకొంట పదవ కొక్కండు. (మూ) వ్యాసభారతమునుబట్టి పైవిధముగా మార్చఁబడినది.

పూఁచి దాక్షాయణీపూజోణిఁ గాదె!
ప్రాచేతసులుకొంటఁ బదుగు రొక్క తెను ;
[1] నాళీనారునికూఁతు నగితాఖ్యకన్య
నీళయ్యె నైషధులేవురుఁ గొనరె!
వింతగా." దనిన వివేకించి ద్రుపదుఁ :
"డింతకార్యమునిర్ణయింప నే నెఱతు ;
నెల్లి ధృష్టద్యుమ్నుఁ డీవును గొంతి
యెల్లపెద్దలుఁగూడి యీప్రయోజనము
మనమునఁ గాంతము ; మాకుఁజూచినను
వినుఁ లోకమునకిది వింతగానోపు."

వ్యాసుఁడు ద్రుపదుఁ గానఁబోవుట

అనునంత ద్రుపదుని యాత్మసందేహ
ఘనతిమిరమువాపు గ్రహరాజువోలె
వ్యాసుఁడచ్చోటికివచ్చిన ద్రుపదుఁ :
'డీనమయంబున నీపుణ్యమూర్తి
వచ్చుట నాభాగ్యవైభవం.' బనుచు
నిచ్చలోఁబొంగుచు నెదురుగాఁబోయి
'మునిసింహ, తుభ్యన్నమోనమ' యనుచు
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
'ముక్తీశ! తుభ్యన్నమోనమ' యనుచు
నిలమ్రొక్కి కైదండయిచ్చుకవచ్చి
కలితజటా [2] భారుఁ గనకపీఠమున
నునిచిపూజించిన, నోలిఁబాండవులు
మునికిఁ దల్లియుఁ దారు మ్రొక్కిరిప్రీతి.

---

1. మూలభారతములందీగాథకన్పడకుండుటచే ఈవిషయస్వరూపమిట్టిదని నవరింప వీలుకాదయ్యెను. 2. చారు. (మూ)

అంత వారల మాని యాశీర్వదించి,
సంతోష మొప్పఁ బాంచాలునిఁబలికె :
"కూఁతుఁగాంచి పయోధి కొనియాడ [1] వెలసెఁ ;
గూఁతుఁగాంచి హిమాద్రి కొనియాడ [2] వెలసె ;
[3] నీవు ద్రౌపదిఁగాంచి యీపాండవులకు
దేవిగా నీఁగంటి ; [4] ధృవగిరిఁగంటి ;
వేలుపుమ్రాఁకుల విద్రుమలతికఁ
గీలుకొల్పుటయిది కీర్తింపనొప్పు.
[5] నీకువీరలప్రాపు, నీప్రాపువీరుఁ
గైకొనివచ్చిరి కడునొప్పఁ బనుపఁ.
ఏపురకొకకన్య నెట్లొత్తునసుచు
నీవు చింతించుట నృప, యేనెఱింగి
తెలుపవచ్చితి ; నీకుఁదెలియ దీకుంతి-
పలుకు ధర్మజుపల్కుఁ బరమార్థముగుట ;
ఈజాడ యెంతయు నెఱిఁగింతు నీకు
రాజ, ర." మ్మని యోగిరాజు లోపలికిఁ
బాంచాలుఁ గొనిపోయి పలికె నేకతము :
"పాంచాలికిట్టి శోభనము భావ్యంబు ;
మఱి దీనిపూర్వజన్మస్థితి వినుము ;
తెఱఁగొప్ప వినిన వర్ధిల్లుఁ బుణ్యములు ;

## పంచేంద్రోపాఖ్యానము

లలనాలలామ [6] నాలాయని యనఁగఁ
గలదు మౌద్గల్యునిగాదిలిబోఁటి ;
చిత్తజుదీమంబు, చెంగల్వబంతి,
మెత్తనిమేనిది, మీనాయతాక్షి,

1, 2. వలసె. 3. నీద్రౌపదినిగాంచి. 4. ధృతి. 5. అన్వయము చింత్యము.
6. నారాయణి. (మూ)

కిసలయతామ్రోష్ఠి, కిన్నరకంఠి,
పసిఁడిశలాకతోఁ బ్రతియైనముగ్ధ.
పతికంటె దైవంబు పడఁతికి లేమి
వితతంబుగా నది విన్నదిగానఁ,
దనసుఖంబెఱుఁగక తగు వేళ లెఱిఁగి,
[1] జనులతోఁ బలుకక సతతంబుఁ బతికి
నోలిమైఁ గ్రాఁగినయుదకమార్చుటలు,
మేలిమికూడ్గూర మేళవించుటలు,
నలికిమ్రుగ్గిడి శయ్యాయాపటించుటలు,
లలిఁ దాళవృంతచాలనము సేయుటలుఁ,
బలుకులవినయంబుఁ, బాదసేవనముఁ,
దెలివినాజ్ఞాక్రియ తీయనిభక్తి,
తాలిమి, యణఁకువ, తగవు ధైర్యంబు
లాలిత్య మభిరతి లజ్జ మానములు
దయ ధర్మ మతిథిసత్కారంబు నిష్ఠ
ప్రియము దాక్షిణ్యంబుఁ బెంపాదిగాఁగఁ
బుణ్యలక్షణములప్రోవై ధరిత్రిఁ
బుణ్యాంగనలమించి, పూఁబోణి మఱియుఁ
బతిభక్తిఁ బరఁగు; నప్పతి దేహమైన
జతనంబువదలి కుష్ఠవ్యాధిపట్టి
మఱియును నీరుగ్రమ్ముచు [2] నీఁగకాటు-
తఱచునఁ జెడి వాచి తద్దయుఁబగిలి
వాసనఁ బ్రేవులు వాతికి రాఁగ
రోసి యెవ్వరు 'నమ్మరో' యని తొలఁగ
నెడపక పాతలనీఁగలఁ జోపుచును,
దడఁబడఁగుంటుచు 'దైవమా' యనుచు

1. జనులలో. 2. నింగకాటు. (మూ)

వర్తింపఁ, బరిచర్యవదలక యింతి
మార్తాండతేజుఁగా మగనిఁదలంచి,
మడుఁగుఁ బుట్టంబున మసటువోఁ బుండ్లు
దుడుచుచు నొత్తుచుఁ, దొయ్యలి మఱియుఁ
బురుషుఁడెక్కడకైనఁ బోవలెననిన
నిరవొంద వీపుననిడుకొని చనుచు,
నతఁడు భుజించినయన్నశేషంబు
సతతంబుఁగుడుచు-చో, జననాథ! వినుము,
పొసర నమ్మునివ్రేలు భోజనవేళఁ
దునిసి యన్నములోనఁ దొరఁగిన, నింతి
విరిదమ్మిరేకులవీడు పూఁదేనె
కరణి బాష్పంబులు కనుఁగవఁ దొరఁగ:
'నక్కటా! యీవ్యాధి యన్నమాయితని;
కెక్కడవేగింతు నేమిటమానుఁ;
దునిసి యిప్పుడు వ్రేలు దొరఁగె నన్నమున;
ముని యెంతనొచ్చెనో! మలుగుచున్నాఁడు.—
[1] అనగ వాయంద మాసోగభావ
మానయు మాకాంతి యాచక్కఁదనము
నెడపక యొల్లవా! యీకూటఁబడితి;
వొడలంట నిన్నవ్వ రోసరించెదరు.'—
అనుచు నయ్యంగుళి నల్లనఁబుచ్చి,
తనచీర నతనిహస్తముఁ జక్కఁదుడిచి,
హితునిచిత్తమెఱింగి యితరపాత్రమున
నతివ యన్నము వెట్టి యల్లనఁగుడిపి,
రోఁకరింపక తొంటిరోదనంబబల
గైకొని భుజియింపఁ, గడుమెచ్చి మౌని:

1. అనఘవాయంద మాసాగభావ. (మూ)

‘యువిద, నీతలఁపొప్పు ; నొద [1] వెడుభక్తి ;
జవరాలనై యుంటి సంసర్గలేక.
కుసుమమంజరికంటెఁ గోమలంబైన
పసమేనికొప్పైన పాటన లేక,
మాకోపమునకోర్చి, మాసేవనేర్చి,
వే కూరలోపలివెంట్రుకవోలె
నవసియు నేఁటియన్నము భుజించుటకు
ధవళాక్షి, మెచ్చితిఁ దగ వరమడుగు.’
అనుటయు, సిగ్గు నొయ్యారంబు భయము
దనరార నింతి మౌద్గల్యునిఁజూచి :
“ ఓ దేవ, రతికాంక్ష యుండునుల్లమున ;
నైదు దేహంబు లీవర్థి ధరించి,
యనవరతాసక్తి నంగజక్రీడ
ననుఁగటాక్షింపవే! నాకిదివరము ;
అంతతో రతికాంక్ష యణఁగునా.” కనినఁ,
గాంతకోరినలాగు గైకొని మౌని
పెక్కులోకంబులఁ బెక్కుకాలములఁ
దక్కక రతికేళిఁ దరళాక్షిఁ గూడి,
యా దేహములువీడి యతఁడుపోవుటయు,
నాదట రతికాంక్ష యణఁగక యతివ
యాశరీరమువీడి యవనిపై మఱియుఁ
గాశిశుకడుపునఁ గన్యయై పుట్టి,
చిన్నిప్రాయంబునఁ జెలువున సతుల
కెన్నఁగా నెక్కుడై యిలయెల్లఁబొగడఁ
గమ్మసిళీతాంశుకళయునుబోలె
నమ్మానినీమణి యహరహంబునకు

1. యదు. (మూ)

నల్లనఁబెరిగి, తన్నడిగెడివారి
కెల్ల కాలంబును నెదురులు చూచి,
కానక యంతలోఁ గన్నియ ముదిసి
కానకుఁ బోయి శంకరునకుఁ దపము
నతిఘోరనిష్ఠఁ జేయఁగ, శంకరుండు
నతివ తపంబున కాత్మలో మెచ్చి,
వేదాంతసీమలవిహరింప నేర్చు
మేదురప్రభగల్గు మృదులపాదములు,
గౌరికిఁ గూర్చుండ గద్దియయగుచుఁ
జారలపులితోలు జారినతొడలు,
ముదిపాఁపమొలనూలు ముచ్చట్లు మలచి
గదురు లేనుఁగుతోలు గట్టిన పిఱుఁదు,
బాగుగా బహుదీప్తి భాసితంబైన
యోగ [1]పట్టముచేత నొప్పునెన్నడుము,
హరివాహ ఘంటాంకుశానల హేతి
వరశూల [2]పరశువుల్ భయదఖడ్గమ్ము
నరుదుగా ధరియించి యరుణనఖాళిఁ
బరిచితంబైనట్టి బాహుదండములు,
గౌరీసమాశ్లేష కలితహస్తముల
నారూఢి నీలిమ హత్తెనోయనఁగ
గంఠమాలికయైన కాలసర్పంబు
కంఠధూమముసోఁకి కందెనోయనఁగ
. . . . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . . . .
విసమునఁ గనలైన విపులకంధరముఁ,
బసనిమొమ్ముల పేర్లు భాసిల్లునురము,

1. పట్టెయు. 2. భయవజ్ర. (మూ)

నైదక్షరంబుల నమరుమంత్రంబు
నైదుమొగంబుల నమరెనోయనఁగ
నైదుమోములు నాథునడిగినసతికి
నైదవతెనమీయ నైదయ్యె ననఁగ
నైదువర్ణములైన యైదుమోములను
వేదనిశ్వాసముల్ వెడలఁజేయుచును,
[1] కృతకకోపాక్రాంత గిరిరాజ్యకన్య
నతిసక్త నంకభాగాసీనఁజేసి,
యిక్షుచాపునిదేహ మింక శోషించ
లక్షించినట్టి లలాటనేత్రంబు,
వలపునఁ దలకెక్కువడువుదీపింపఁ
జలిలేమవిడిసిన చదురుకెంజడలు,
మెఱయువెన్నెలపువ్వు మేకొన్న వేయి
చెఱఁగులతలపాగఁ జెలువొప్పుమౌళి,
..........................
..........................
నునుబూదిమైపూఁత నునుపుగాఁబూసి
యాలమిండనినెక్కి యతిసంభ్రమమున,
బసవని టెక్కె మభ్రంబునఁ గ్రాలఁ,
బసగల్గు ధవళాతపత్త్రముల్ మెఱయ,
సతులు వింజామరల్ జానొప్పవీవ,
సుతులు బరాబరుల్ సొంపారఁజేయ,
వరహంస గజరాజ వాహ[2] నులగుచుఁ
బరమేష్ఠి యింద్రుండు భక్తిసేవింపఁ,
గరి మేష మహిష రాక్షస నక్ర హరిణ
తురగవాహనములు దొరయంగ నెక్కి

1. కృతకాల కుపితాంఘ్రి గిరిరాజకన్య - నతిసక్త వామాంక నభ్రాంతిచేసి.
2. వాహన్య. (మూ)

శక్రాగ్ని యమ దైత్య జలనాథ వాత
చక్రిభూషాప్తులు సరవితోఁ గొలువ,
గంధర్వ సంగీతగతులతోఁ గూడ
బృందారకులు పరివేష్టించి కొలువ,
జావుఁ బుట్టువు లేని సడిసన్న పెద్ద
జీవరాసుల కెల్ల జీవంపుముద్ద
యంత్రపాణులలోన నాదిశిల్కాఁడు
[1] శాస్త్రవాదంబుల జగజోలికాఁడు
విసమైన నఱిగించు విసమువైద్యుండు
బిసరుహాసనవైరి [2] విదులకాద్యుండు
దేవాధిదేవుండు దేవతాత్మకుఁడు
దేవపూజ్యుఁడు మహాదేవుఁ డావేళఁ
బ్రత్యక్షమగుటయుఁ, బద్మాక్షి మ్రొక్కి
ప్రత్యయంబున నిట్లు ప్రణుతింపఁదొడఁగె:
"సత్యాత్మ, సన్మయ, సదమలభావ,
నిత్య, నిత్యానంద, నిర్మలాకార,
శంకర, సర్వజ్ఞ, శాంభవీరమణ,
పంకజభవవంద్య, భవ, వామదేవ,
భర్గ, విరూపాక్ష, భావనాతీత,
సర్గలక్షణకల్ప, సకలనిధాన,
శాశ్వత, భూతేశ, జన్మవినాశ,
విశ్వేశ, విశ్వాద్య, విద్యానవద్య,
త్రినయన, శ్రీకంఠ, త్రిపురసంహార,
ఇనవహ్నిశశినేత్ర, హితజగత్పాత్ర,
ఉగ్ర, నిర్గుణ, గణ్య, యురుతరపుణ్య,
నిగ్రహప్రతికార, నిరుపమాకార,

1. శస్త్ర. 2. బిదుల. (మూ)

శాంతాత్మ, శివ, శంభు, చంద్రార్ధమకుట,
కాంతానుషంగిత, కలితసంగీత,
శర్వ, మహేశాన, జాహ్నవీమకుట,
సర్వసమ్మిత, [1] భూతజగదధివాస,
నిర్మలగుణ, భీమ, నిరవధితేజ,
ధర్మసంభవదేహ, ధర్మాత్మవాహ,
మదనకోటిసమాన, మదనసంధాన,
మదనమర్దనదక్ష, మర్దితదక్ష,
కర్మకలాపైక కారణాధార,
(నిర్మల నాకధునీ జటాభార,)
రుద్ర, విద్రాపిత రూఢాసురేశ,
భద్రాత్మ, పరమేశ, పరశుప్రకాశ,
కల్యాణనగచాప, కల్యాణ [2] కరణ,
కల్యాణవారాశి, కల్యాణనిలయ,
తారకాధిపజూట, తారకాలోక,
తారకాసురవైరి, తారకా [3] పాంగ,
హరినేత్రపూజిత, హరిహయవినుత,
[4] హరిబాణ, జితదైత్య, హరిరాజవర్ణ,
కృష్ణాజినచ్ఛన్న, కృష్ణాజివినుత, (?)
కృష్ణాభిరతికంఠ, కృష్ణాజిధీర, (?)
నందితాండవలోల, నందితాజాండ,
నందితాపసగమ్య, నందితాను [5] చర,
సప్తసామ [6] స్తుత, సప్తార్చిరూప,
సప్తలోకాధార, సప్తాశ్వనయన,
విజ్ఞానమయరూప, విమలకలాప,
ప్రాజ్ఞ [7] మానసగమ్య, బంధురక్షమ్య,

---

1. భీతజగతాన్నివాస. 2. కరుణ. 3. ధాంగ. 4. హరిజాణ. 5. చిర.
6. స్వత. 7. సౌగ్యగమ్య. (మూ)

భక్తపరాధీన, భక్తినిధాన,
శక్తిసమాలింగ, సద్భావలింగ,
అక్షర, అవ్యక్త, ఆద్యంతరహిత,
అక్షయ, అచ్యుత, [1]హర, నీలకంఠ,
మూర్తిత్రయమునీవ ; మూర్తిత్రయంబు
మూర్తి [2]భావన సేయు మూర్తివినీవ ;
కర్తయునీవ ; వికర్తయునీవ ;
భర్తయునీవ ; సంహర్తయునీవ ;
గౌరీయుతుఁడవయ్యు గరిమ నొక్కఁడవు ;
చీరలేకుండియు క్షితి నీశ్వరుఁడవు ;
అరయ నుగ్రుఁడవయ్యు నధికశాంతుఁడవు ;
గరళకంఠుఁడవయ్యుఁ గడు నమృతుఁడవు ;
భ్రాంతిగా శుచివై కపాలహస్తుఁడవు ;
భూతనాథుఁడవయ్యు [3]భూతియుక్తుఁడవు ;
కడు రెండువేలనాల్కలశాస్త్రి నీకుఁ
దొడవఁట పొగడెడు దొర వేఁడి నిన్ను !'
అనిసన్నుతించుచో, హరుఁడు : 'నీకెద్ది
వనిత, వాంఛిత ?' మన్న, వదలకిట్లనియె :
'మగని మగాతని మగవాని నాకు
మగదిక్కు మగదేవ మదనారి, యీవె !'
అని యిట్లు మదనపరాధీనగాన
మన నైదుమాఱులు మగని వేఁడినను,
నగుచు శంభుండు తా నాతికిట్లనియె :
'మగలేవురగుదురు మహిలోన నీకుఁ ;
[4]బాంచభౌతికమైన ప్రాణంబు భాతిఁ
జంచలేక్షణ, నీవుసమకూరు.' దనిన

1. హరి. 2. భావము. 3. భూత. 4. పంచభౌతిక. (మూ)

నా వారిజాక్షి : 'యేనట్టిన నొల్ల ;
దేవ, యీవరము ధాత్రికి హాస్యకరము.
ఒకతెకొక్కఁడె కాక, యుర్విఁ బెక్కండ్రు
వికృతపుమగలైన వినసెట్లుపొసఁగు !
నాలుకతడఁబాటు నగచాప, యోర్చి
పాలింపు.' మనుటయుఁ, బార్వతీప్రియుఁడు :
'ఏనఁటవరమిత్తు ! నిది నగుఁబాటు-
గా నెట్లువచ్చు ! ముగ్ధా ! వెఱవకుము ;
ఏవురు నీమీఁద నెడపనిప్రేము
గావింతు రన్యోన్యకలహంబు లేక ;
నీకు నేవురమీఁద నిచ్చ భోగేచ్ఛ
చేకూరుఁ ; బ్రాయంబుఁ జెలువంబుఁ జెడదు ;
అనిశంబు మగుడఁ బ్రాయమువచ్చు నీకు ;
దినమొకక్రొత్త వర్ధిలుఁ జక్కఁదనము.
అవిచారముచాలు నబల, యిచ్చటికి
దేవేంద్రుఁదోడ్కొని తెమ్ము పొ.' మ్మనిన,
నదియుఁ : 'దెచ్చెదఁగాని యభవ, యిచ్చోటఁ
గదలకయుండుమీ కరుణాఢ్య !' యనుచు
నాయతగతిమ్రొక్కి యతిదూరయాత్ర
పోయి, గంగాతీరమునఁ గాచియుండె.
అటమున్న యముఁడు నిజాధికారమునఁ
బటుజంతుహింస తప్పక చేసిచేసి
వేసరి : 'యీ ఘోరవృత్తి కేనోప ;
నాసరివారిలో నవ్వుఁబాటిదియు.
తియ్యని సంసారతృష్ణ పోలేక
[1] కుయ్యిడుజనులను గూల్ప నావశమె !

1. కుయ్యని యజనంబు గూల్పనావశమె. (మా)

కర్తవశంబునఁ గను బాలుఁడనక
కూర్మి [1]వృద్ధనకుండఁ గూల్చు నాపశమె!
తపసినై పోయెదఁ; దగఁ జాలుమణిగ;
మిపుడుకోపింపనీ యిఁక బ్రహ్మ.' యనుచు
నైమిశారణ్య పుణ్యక్షోణిఁ జొచ్చి
యామునిశ్రేణితో నద్దేవుఁడచట
సత్త్రయాగము నిష్ఠ జరుపుచున్నంత,
ధాత్రిఁ జావులులేక దట్టమై ప్రజలు
తరములతాత లాతరములతాత
లరయ నవ్వలితాత లాండ్రును దారు
[2]గాటంటుగాక ముక్కాలంబుఁ గుడిచి,
గురుకూటములువోలె గోళ్లువిూటుచును,
సుఖమున్నచో, వజ్రి సొంపుతోనరిగి
..........................
దండప్రణామముల్ తగనాచరించి
పుండరీకాసనుఁ బొందుగాఁ బలికె:
'ఓ బ్రహ్మ, సంసారమొల్లఁడు శమనుఁ;
డా బ్రహ్మమగు కార్య మటువెట్టిపోయెఁ;
గాలుఁడయ్యును గూడు కాలఁదన్నుదురె!
భూలోక మెడలేదు పుట్టినప్రజకు.'
అనినఁ బల్కె విధాత: 'యట్లేలవగవఁ!
జనియెడుఁ దనకార్యసరణికై యముఁడు.
[3]తనువపేక్ష కరంబు తఱచైన ప్రజల
మునుకొని యొకఁడెట్లు మోదు నవ్వేల్పు!
అమర వాయువు నీవు నశ్వినీసురులు
నమరేశ, [4]పిలువఁగ నరుగుఁ; డవ్వేల్పు

1. వృద్ధునకిట్లు. 2. గరిగంటి. 3. తనువుప్రేక్షకరంబు. 4. పిలువక. (మూ)

నేవురుఁ[1] గూడక యిప్పటిభార
మేవిధంబునఁ బాయు దీవసుంధరకు.'
అనుటయు దేవేంద్రుఁ: 'డక్లేల నాకు
మనుజుఁడనై పుట్టి మరణంబునొంద!
యముఁడాఫలమ్ముఁ దానందని.' మ్మనుచు
నమరాధిపతిపల్కి యట మరలుచును
దెరువున గంగానదీతీరభూమిఁ
బొరిపొరి శోకించుపూఁబోఁడిఁ గాంచి,
మనసిజుచేఁతల మగ్నుఁడై యప్పుడు
తనలోన నిట్లని తలపోయఁదొడఁగె:
'అహహా! మనోహరంబయ్యెఁ జూపులకు;
మహి నెంతటికిలేదు మాయపుబ్రహ్మ!'
అనివితర్కింపుచు హరి దాసిఁగదిసి:
'వనజాక్షి, యక్కట! వగచుచు నిచట
నెవ్వనికొంటిమై నెదురుచూచెదవు?
ఎవ్వతెవీవు? నీయభిలాషయేమి?
చెప్పు.' మన్న లతాంగి: 'చెప్పెదఁగాని,
యిప్పుడునావెంట నింద్ర, యేతెమ్ము;
తెలియ నొల్లకయున్నఁ దిరిగిపో.' మ్మనిన,
వెలఁదిరూపవిలాస విభ్రమంబులకు
నింద్రుఁడెంతయునోడి: 'యేఁగూడివత్తుఁ
జంద్రాస్య! పద.' మని చనఁజొచ్చె వెనుక.
తోయజానన యింద్రుఁదోకొని యిట్లు
పోయి కైలాసాగ్రమునఁ జంద్రధరుని
నీక్షింపవచ్చుచో, నింద్రుకన్నులకు
దక్షారి వరుణుఁడై తగఁదోచెఁ; దోప,

1. గూడుక. (మూ)

నామాయయెఱుఁగక యైశ్వర్యగర్వ-
ధూమాత్ముఁడై వజ్రి ధూర్జటిఁ బలికె:
'అగుర! యేఁ బూర్వుండ; నపరుండు తాను;
వగ నింద్రుఁడను నేను; వరుణుండు తాను;
ననుజూచి గద్దియ నాయమా దిగఁడు!
కొనియెద నొకవ్రేటు ఘోరవజ్రమున.'
అనినఁ, జి[illegible]ంపక హరుఁడు వెండియును
వనితకిట్లన: 'ఏని వనజాక్షి, కంటె!
కన్నులు వెయిగల్గి కానఁడునన్నుఁ;
బన్నుగా నట ఏనిఁబట్టితె.' మ్మనిన
నతివ నాలాయని యతనిఁబట్టుటయు,
మతి నాతఁడలరి మన్మథవికారమునఁ
బరవశుఁడై జాఱఁ, బంచబాణారి
దరహాసమున ధరాధరభేదిఁ బలికె:
'వాసవుఁడవునీవు వరుణుండ నేను
ఈసున నాకొండ యెత్తుమానీవు!
ఏనైన నెత్తెద నీక్షింపు.' మనిన
మానక యాకొండ మఘవుఁడెత్తినను,
ఉన్నారు వేఱుపు లొకనల్వురింద్రు
లెన్న సహస్రాక్షు లిటువజ్రధరులు.
వారిసింద్రుఁడుచూచి వడిఁదన్నుఁజూచి
యూరకే చింతింప, నుగ్రుండువలికె:
'ఎక్కడ గూడినా రేవురింద్రులును!
ఒక్కఁడు జముఁ, డింద్రుఁడొక్కఁడు, గాడ్పు,
నిరువురశ్వినులును, నెలమి నేగురును
గుఱుతుగా నాయాజ్ఞఁ గూడినారిచట;
నీవెలఁదియు మీరలేవురుఁ బోయి
భూవలయంబునఁబుట్టి వేడుకను

హారికిసహాయులై యవనిభారంబు
హరియింపఁ డీయింతి యాలుగానుండు.
నిదివిష్ణుసంకల్ప మేమిటఁబోదు ;
మొదలధాత్రీదేవి మొఱవెట్టుకొనియె.'
అనిన, నీశ్వరునాజ్ఞ నరుదెంచి మర్త్య-
తనులై నయామహాత్ములు పాండవులు.
నాఁటినాలాయని నాథ! నీపుత్త్రి ;
యేటికిఁజింతింప నిత్తుగా." కనిన,
నాశ్చర్యకలితుఁడై యప్పుడానారి
నిశ్చయింప విభుండు నేరకపలికె :
"ఈవుచెప్పుదువఁట! యీవలశంక
గావించువారలు గలరె సర్వజ్ఞ!
వీరి నిజాత్మలు వీక్షించికాని,
యీరూపములు నమ్మ నింతినినమ్మ ;
దివ్యదర్శనమిచ్చి దృష్టింపఁజేసి
భవ్యాత్మ, నాశంకఁబాపవే!" యనినఁ,
దాపసోత్తముఁడంతఁ దనప్రభావమున
భూపాలునకునిచ్చె భువి దివ్యదృష్టి.
ఇచ్చిన వెలుపలికేతెంచి నృపతి
యచ్చోట నృపమూర్తులై యున్న వారి
నినకోటితేజుల హేమభూషణుల
ననిమిష నేత్రుల నమరసేవితులఁ
[1] గాసర మృగ దంతి కనకవిమాన-
వాసుల యమ వాయు వాస వాశ్వినుల
నాలాయనిని బుణ్యనారినిఁజూచి,
చాలనక్కజమంది జయవెట్టిమ్రొక్కి :

1. కాసార. (మూ)

“ లోకపాలకులార, లోకజ్ఞులార,
నాకుఁగల్గితి రిట్టినవకృపాయుక్తి ;
నేనెట్టిసుకృతినో ! యెట్టిధన్యుఁడనో !
పూని మీమూర్తులు పొడగంటి.” ననుచుఁ
గీర్తింపఁగాఁ, దొంటిక్రియ రాజుదృష్టి
వర్తింపఁజేసి యవ్వ్యాసుధీశుతోడ :
‘ నింకఁబాండవులకు నింతి నేవురకు
శంకింప కీనేర్తె జననాథ !’ యనిన :
‘ నేనుగృతార్థుండ ; నేనుధన్యుఁడను ;
బూని దేవతలకుఁబుత్రినీఁగంటి
నెంతయుమీకృప ; నేనుమీవాఁడ ;
నింతచెప్పకయున్న నేమియు నెఱుఁగ.”

## ద్రౌపదీకల్యాణము

అనిమ్రొక్కి వ్యాసమహామునిననిచి,
జనపతి లగ్ననిశ్చయముచేయించి,
చక్రధరాదుల సకలబాంధవుల
సక్రమగతిఁ బిల్వఁ జారులఁబనిచి,
కలయ నక్కాంపిల్యఘనపట్టణంబు
లలితవైఖరితో నలంకరింపించి,
యంత ముహూర్తదినాగమంబైన
నెంతయుసంతోష మిగురొత్త నృపుఁడు
జలముల మంగళస్నానంబుచేసి,
తిలకించి నగరికి ద్విజులరావించి-
పుణ్యాహవాచనపూర్వంబుగాఁగఁ
బుణ్యాంగనలచేతఁ బువ్వుఁబోఁడికిని
నలుఁగువెట్టించి, కొట్నంబువాటించి,
యిలువేల్పులకుఁ బూజలిప్పించి వరుసఁ,

[1] బరువడి సంకురార్పణము గావించి,
దొరఁకొని మంగళతూర్యముల్ మ్రోయఁ
గన్నియఁగై సేయఁగా నియమించి,
యన్నియత్నంబులు సనువులుచేసె.
ఇట పాండవులు ధౌమ్యు నెలమిరప్పించి,
పటుతర భాగ్యసౌభాగ్యంబు మెఱయ,
వందిబృందములు కైవారముల్ సేయ,
దుందుభి పటహాది తూర్యముల్ మ్రోయ,
మణిగృహంబులలోన మానినీమణులు
ప్రణుతవైఖరి నెల్లపనులకుఁ దిరుగ,
సలలితమంగళస్నానముల్ చేసి
చెలువుమీఱంగఁ గై సేసి రేవురును.
స్నాతకవ్రతములు సకలంబుఁదీర్చి,
భూతలాధీశులు పొడసూపునట్టి
విప్రులఁబూజించి, వేదఘోషముల
సుప్రశస్తంబైన శుభలక్ష్మితోడ
ధవళవస్త్రంబులు ధవళమాల్యములు
ధవళగంధంబులుఁదగు వేడ్కఁదాల్చి,
యనుపమంబగులగ్నమాసన్నమగుట
విని మహోత్సవమున విడిదికి వెడల,
స్యందనకోటులు సందడింపంగ
నిందిరావల్లభుఁ డెదురువచ్చినను,
భావింప దైవంబు ప్రత్యక్షమగుట
నేవేల్పులకుఁ దారె మొక్కుడై నృపులు
రథముల నిజమనోరథములనెక్కి
పృథివి యాకాశంబుఁబెనఁచుక చూడఁ,

1. పనివడిశంకురార్పణము. (మూ)

[1] గడు నురుగుపట్టి గంగాప్రవాహంబు (?)
వెడలినగతిఁ గ్రంతవీధులనడవఁ,
గాంతలు ద్రౌపదీకల్యాణమనుచు
నంతంతఁ గర్ణసౌఖ్యముగఁ బాడఁగను,
గ్రందుగ నాతపత్త్రంబులనీడ
మందమందానంద మాధుర్యలీలఁ
జనుదేర, నెదురునేసలుచల్లి ద్రుపద-
తనయుఁడెదుర్కొని తగురీతి వారి
విభుమందిరమునఁ బ్రవేశింపఁజేయఁ
ద్రిభువనంబులు వేడ్కఁదేలె నద్దినము.
అంతఁ, బాంచాలుండు హర్షించి వారి
వింతగా మధుపర్కవిధిఁ బూజచేసి,
కన్యకావరణంబు గావించి, పిదపఁ
గన్య ధారాపూర్వకము [2]నీయ, నృపులు
మంగళసూత్రముల్ మక్కువముడిచి,
తొంగలించినవేడ్కఁ దూర్యముల్ మ్రోయ
ధౌమ్యుండు కదిసి మంత్రంబులుచెప్ప
రమ్యనైఋతిఁ దలఁబ్రాలొప్పఁబోసి,
కరమున విమలరక్షాబంధనములఁ
దిరమొప్ప నేవురుఁ దెఱవకు ముడిచి,
హోమవేదికయెక్కి యుచితమార్గముల
ధీమంతు లగ్నిప్రతిష్ఠ గావించి,
కన్య నేవురుఁగరగ్రహణంబు చేసి,
ధన్యతఁబులకించి తగనుత్సహించి,
హోమంబులన్నియు నొప్పారఁదీర్చి,
హేమంబు ద్విజులకునిచ్చిరి తనియ.

---

1. నూరువట్టి. అనియుండఁదగునేమో! 2. సేయ. (మూ)

ఆపాండుతనయుల కపుడు పాంచాలుఁ
డేపార నైదువేలిభములు [1] మోయఁ-
దగినవిత్తంబులు దండి తేరులును
బాగడనొప్పిన యశ్వములు నూఱువేలు,
దాసీసహస్రంబు, దంతిశతంబు,
గోసహస్రంబును గొనియాడ లక్ష,
రత్న [2] పేటీసహస్రంబులు నాల్గు
యత్నపూర్వకముగా నరణమిప్పించి,
పరఁగ దివ్యాంబరాభరణమాల్యములఁ
గరమొప్ప బంధువర్గముఁ బూజచేసి,
కనకపాత్రములలోఁ గమ్మనిరుచుల
జనములు [3] మెచ్చ భోజనముపెట్టించి
కట్టనిచ్చిన, నంతఁ గమలనాభుండు
దట్టంపుఁబ్రియముతో ధర్మరాజునకుఁ
గలిమియేర్పడ రత్న కాంచన తురగ
[4] కలితరథంబులు ఘనతతోనిచ్చె.
అత్తఱి విదురుచే నాపాండుసుతుల
వృత్తాంతమంతయు విభుఁడు దానెఱిఁగి,
వెస నాత్మలోభీతి వెలుపలి ప్రీతి
పొసఁగ [5] నౌర్వానలంబున నబ్ధివోలి,
పెద్దకొల్వైననంత భీష్ముండు గురుఁడు
నొద్దికఁ గృపుఁడు దుర్యోధనాదులును
హీరభూషణులు బాహ్లిక సోమదత్త
భూరిశ్రవ స్సూతపుత్త్ర సౌబలులు
నున్నచో, విదురు లోకోత్తరుఁబలికె:
“ఎన్న మాకపకీర్తి యీశుండుమాన్చె;

1. ప్రోవ. 2. పీఠ. 3. పెట్ట. 4. కనక. 5. పూర్వాంతంబుల. (మూ)

మఱియుఁ గల్గిరి చాలు మహిఁ బాండుసుతులు ;
ఊఱక మ్రోయుచునుండె నుర్విదుర్వార్త ;
బోరన రప్పించి భూమిపాలిచ్చి,
వారికి హితుఁడవై వర్తించువాఁడ."
అనవిని తండ్రికిట్లనియె రారాజు

### దుర్యోధనుఁడు తండ్రితో దుర్మంత్రణము సేయుట

"మనము వారలకింక మంచివారలము!
ఇంక సామోపాయ మేటికి వినుము ;
కొంకక భేదంబు గొనియాడవలయు ;
'నేగురకొకయింతి యిదిహేయ' మనుచు
బాగొప్పఁ బాంచాలుపట్టు వదల్చి,
ద్రుపదుని వారిసందున ముడివన్ని,
నిపుణత వారి నన్నలవు వాపుదము ;
కాదేని, నేర్చిన కాంతలఁ బంచి
'ఈ దేవి నిన్నొల్ల దతనికివలచు
నిను దప్పనాడె నీనృపతిఁ గీర్తించె.'
నని పాండవులలోన నలుక పుట్టించి,
పోరాడి తమలోనఁ బొలియఁ జేయుదము ;
నారులెంతకు లేరు నరులఁ బోధింప!"
అనినఁ, గర్ణుఁడువల్కు : "నదినీతిగాదు ;
కినియరు వారెంతకీలువన్నినను ;
అనుపమ సేనాసహాయుల మగుచు
మనమెత్తిపోద మీమార్తుఱమీఁద.
బలములపసలేని పాంచాలుఁడెంత!
తలఁప రాజ్యములేని ధర్మరాజెంత!
వినిపించె వారియొద్దను 'వీపుఁదోమ
మనుజుండులేఁ' డని మనవేగువాఁడు.

ఇల భీమపార్థుల [1] కేఁబిఱుఁదీయఁ ;
గలశజాతుఁడు గెల్వఁగలఁడు పాంచాలు."
ననిన భీష్ముఁడువల్కు : "నందు మీరేఁగి
మును ద్రుపదునిచేత మోసపోయితిరి ;
ఎన్నఁబార్థునిచేత నింతిక్కై పోయి
మొన్నగదా! మీరుమోగులువడుట ;
హారికి సైన్యంబులేదని తలంపకరు ;
పరచక్రముండంగ వలయునే సేన!
ఈవేళ వారలకెగ్గుచేసినను,
భావింప మీకంటెఁ బగవారు లేరు.
కానఁడుకర్ణుండు కార్యంబుకోలఁది ;
తానఁట! వారితోఁ దలపడఁగలఁడె!
పరబుద్ధివినువారి బ్రదుకేమిబ్రదుకు!
పరనీతిఁ బాలిండు వారిరప్పించి."
అనవిని కోపించి యంగరాజనియెఁ :
"దనరంగ దురమున్నఁ దలయోర్చుమీకు ;
ముదిసి ముప్పునఁ బ్రాణములు వీడఁజాల ;
రిదికార్యమని కాన ; రేలపాలీయు!
కురుకుమారులకీర ఘోరాస్త్రసమితి
హారినందనునకు ద్రోణాచార్యుడీఁడె!
పుట్టినకురురాజుఁ బొలియింపుఁడనుచు
నెట్టనఁ జెప్పరే! నృపునితో మీరు.
అచ్చిపెట్టినజీతమా! బూదిలోని
గచ్చకాయులు [2] మీరకారణహితులె!
ఆమేటివారల నటఁదెచ్చుకొనుట
పాముల నింటిలోపల నిడికొనుట."

1. కబిరుదుదివియ. 2. మీరు. (మూ)

అనుడుఁ, గోపాటోపమడర రాధేయుఁ
[1]గొనకంటనీక్షించి కుంభజుఁడనియె:
“ కలిగితివాకఁడవు! కౌరవకులము
నిలుప! నెవ్వరమును నీసమానులమె!
పాండునందనులతోఁ బగగొని నిలిచి-
యుండఁ జూచెదు కర్ణ, యొనరదుగాని.
నినునమ్మి ఈ రాజు నృపతినివిడిచె;
ననిసేయనోపిన నరుగుదు గాక.”
అనునంత, ధృతరాష్ట్రుఁ డయ్యిరువురకు
ఘనతరంబగుకార్యకలహంబు మాన్పి:

విదురుఁడు పాండవులఁ దోడ్తేర నేఁగుట

“ యీకర్ణకౌరవులేమెఱుంగుదురు!
నాకొడుకులరాక [2]నాకార్య.” మనుచు
వివిధవస్త్రంబులు వివిధరత్నములు
వివిధభూషణములు వేడ్కఁ [3]గృష్ణకును,
ఛత్రచామరములుఁ జారుహారములు
ధాత్రినొప్పారు విత్తము ధర్మజునకు,
దాసీసహస్రంబు దంతిశతంబు
వాసిగా ద్రుపదభూవరునకు నిచ్చి
విపులరథంబిచ్చి విదురునిఁ బనుప,
నృపునకు మ్రొక్కి యన్నీతికోవిదుఁడు
ఘనవస్తువులతోడఁ గాంపిల్యపురికిఁ
జనుదెంచి, ద్రుపదునిసభఁ జొచ్చి, యందు
శౌరికిభక్తవత్సలునకు మ్రొక్కి,
కూరిమిదైవాఱఁ గుంతికి మ్రొక్కి, –

1. గొనికొండ. 2. నాకుంగాదెపుడు. 3. గృష్ణునకు. (మూ)

నుతరీతిఁ బాండుసూనులఁ గౌఁగిలించి,
ధృతరాష్ట్రుఁడిచ్చిపుత్తెంచు వస్తువుల
వారికివారికి వరుసతో నొసగి,
బోరన ద్రుపదుచేఁ బూజలువడసి
పంకజనాభునిఁబరికించి పలికె :
"ఇంకఁ బాండవులకు నేవిచారంబు !
పాంచాలుఁడిటఁగల్గఁ బరమబాంధవుఁడు ;
వంచింప నిఁకరాదు వారి వైరులకుఁ ;
దలఁపులో నదిగాక తిరలవునీవు ;
కలుగునేవారికిఁ గమలాక్ష, వెలుపు !
కలిగిరి వెండియుఁ గౌంతేయులనఁగఁ
గలఁగిరి తమలోనఁ గౌరవాధిపులు.
పాండునిపాలిత్తుఁ బార్థులకనుచు
నిండినకొలువులో నృపుఁడాడె మొన్న ;
గురు భీష్మ కృపులెఱుంగుదు ; రిప్పుడతఁడు
పురికిరమ్మని పిల్వఁబుత్తెంచె వీరి.
[1] కీడెంతయెఱుగక కెలనిమెచ్చులకు
వేడుక నటియించు వీరిపై నతఁడు ;
అవనిలో ధర్మజుఁ డర్ధమేలినను,
నవఖండపతివోలె నయమొప్పఁగలఁడు."
అనినఁ బాంచాలుండు హరియు నిట్లనిరి :
"వినుము, నీకంటె వివేకులుగలరె !
[2] మొన్న మీఁదెఱుగక యీవుపాండవుల
మిన్నక యిల్లల మేకొనిపిల్వ !

1. ఈమాట ధృతరాష్ట్రునిపట్ల నిజమేయైనను, ఈసందర్భమున రాయబారిగావచ్చిన విదురుఁడు పల్కఁదగినది కాదు. 2. ఈవాక్యము సందర్భోచితముగా లేదు.

కొనిపోమ్ము పార్థులఁ గుతలమేలింపు ;
ఘనపుణ్య, నీవుగల్గఁగ విచారంబె!
కరుణించి మునునీవు గఱపినత్రోవ
నరుదేరఁబట్టికదా ! వీరుబ్రదుకు
ట." నుసంత, ధర్మరాజతనికిట్లనియె :
"మనుజేంద్రుఁడవుడు మీమాటకు వెఱచుఁ ;
గార్యార్థమగుప్రేమఁ గలిసియుండంగ
దుర్యోధనుఁడు మాటదొరఁకొనఁ ; డంత
ధార్తరాష్ట్రులకేమితప్పుచేసితిమొ !
వార్తయునొల్లరు వసుధ మేమున్న ;
నతనికిఁ బ్రతికారమాత్మలో నొల్ల ;
మతనిచేఁతలకు భయంబునొందెదము.
హరియును దోడురా నరుదెంచి, యచటఁ
గురురాజు వెట్టినకూడు గుడిచెదము."

## పాండవులహస్తిపురప్రవేశము

అంత పయనమునకు నాయిత్తమైనఁ,
దనయు ధృష్టద్యుమ్ను ధర్మరాజునకు
బలమును దోడిచ్చి పాంచాలుఁడనుప,
వెలయంగ నారాజువీడ్కొని కదలి
ద్రౌపదివెంటరా ధౌమ్యుఁడే తేర
నాపాండుపుత్త్రులు హరియును దారుఁ
గుంతీసమేతులై కురురాజుపురికి
నెంతయు లక్ష్మితో నేతెంచుచుండ,
నిట వారికెదురుగా నిభపురాధిపుఁడు
పటుగతి నందనప్రతతిఁ బుత్తెంచి,
నృపతులు సేవింప నెమ్మిఁగొల్వునకు
నపరిమితోత్సాహుఁడై వచ్చి, యంతఁ

పౌరులు సేవింప భటులు మైవంప
వారువచ్చిన లేచి, వరుసయేర్పడఁగ
నాలింగనంబుల నభినందనములఁ
జాలదీవనలఁ బూజావిశేషముల
హారిపూర్వముగ వారినందఱఁ బ్రీతిఁ
బౌరయించి, మణిపీఠముల నుండఁబనిచి,
మఱఁదలిఁ గోడలి మఱి లోనికనిచి,
నెఱి వారినూరార్చి నిజపీఠమెక్కి
పేరు పేరునఁబిల్చి ప్రేమఁ బాండవుల
నారాజరత్న మిట్లని చెప్పఁదొడఁగె :
" అరయరు నన్ను జాత్యంధు ; సల్లల
నరనాథులార, మిన్నక తిరుగంగ !
ఇందునందును నేల ! యేనున్న కాల
మందఱు మనవలదా ! నెయ్యికూడుట.
ఏమిట మీకు నే హితుఁడఁగానైతి !
నేమితలంచుక యేఁగితి రట్లు ! "
అని పాండవులఁబల్కి, యందఱకన్ని
కనక గేహములిచ్చి కడఁకతోనని చె.
అప్పుడాపురమున నైదువర్షంబు
లప్పాండుసుతులు నెయ్యముఁదియ్య మొసగఁ
గౌరవసుతులతోఁ గలిసి క్షీరంబు
నీరంబుఁగలిసిన నేర్పున మెలఁగి,
హారియును దారును నధికంపుఁగూర్మిఁ
జరియింపుచుండిరి సంతసంబునను.
అనియిట్లు జనమేజయావనీంద్రునకు
ముని చెప్పెనని చెప్ప మోదించి మునులు :
' అనఘాత్మ ! తరువాతనైనవృత్తాంత
మనువొందఁజెప్పవే ! ' యనియడుగుటయు,

ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితాదిపర్వ నిర్మలకథయందు
నుచితమై యాశ్వాస మొప్పె నేడవది.



# అష్టమాశ్వాసము



శ్రీకరగుణజాల, సితకీర్తిలోల,
నాకేంద్రవైభవ, నరసయచౌడ,
ప్రకటిత నిఖలసౌభాగ్య వర్తనః
[1] సకలంకుఁడగు నమాత్యా! చిత్తగింపు;
అక్కథకుఁడు శౌనకాదిసన్మునుల
కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె.
అంతట నొక్కనాఁడాంబికేయుండు
కాంతితోఁ గొలువుండి మనులును దాను,
ధర్మతనూజునిఁ దార్మి రావించి,
యర్మిలిమన్నించి యతనికిట్లనియె:

ధర్మజుని యౌవరాజ్యాభిషేకము

"పాండుభూపాలునిపాలు నీపాలు;
పాండునందన, నీవుపట్టంబుఁబూను;
సాధింప నరుదైనశత్రుల నొత్తి
యీధర విరివిగా నేలింపుమమ్ము.
ఎల్లి లగ్నంబని యెఱిఁగించె ద్విజుఁడు;
వల్లభాయుతుఁడవై వ్రతముధరింపు.
అభిషేకసలిలంబు లాదిగావచ్చె;
నభినవంబుగ యత్నమఖిలంబు నయ్యె;
వారిపూర్వాకంబుగా నరదంబులెక్కి
యరుదెందు ప్రొద్దున నాస్థానమునకు.

1. సకలంకమగు. (మా)

ఖాండవప్రస్థంబుగల ; దది మీకు
నుండ యోగ్యంబైన యొప్పులపురము ;
ఉండుఁడు దప్పులే దొకవాడ పెట్టు ;
రెండుదేశములు వర్ధిల్లు నిట్లైన."
అనిచెప్పి ధర్మజుననిచి భూవిభుఁడు
గొనకొని కృప భీష్మ గురులనుమతింప,
నరుణోదయంబైన యమ్మఱునాఁడు
హరిపుణ్యాహముగ వారి నర్థిరప్పించి,
యభిషేకశాలలో సర్వపీఠమునఁ
బ్రభువైన ధర్మజుఁ బాంచాలినునిచి,
మంత్రోదకంబుల మజ్జనంబార్చి,
మంత్రి [1] సమేతుఁడై మకుటంబువెట్టి,
పాండునిపాలికిఁ బట్టంబుగట్టి
ఖాండవప్రస్థంబు కడకు వీడ్కొల్పఁ,
బాండవుల్ ధౌమ్యునిఁ బాంచాలిఁ గుంతిఁ
బుండరీకాక్షునిఁ బొసఁగఁ దోడ్కొనుచుఁ,
ద్రుపదుని సైన్యంబుతో వీడుకొల్పి,
నృపతిపంచినసేన నియతిఁ దోడ్కొనుచుఁ,
గురుపతి కృప భీష్మ గురు విదురులకు
నిరవొంద నందుఁబోయెదమని చెప్పి,
కరిపురిఁ బాండునికాలంబు విప్ర-
వరులకిచ్చిన [2] చేలు వడినప్పగించి
యరిగినచోఁ, గృష్ణుఁ డప్పుడప్పురికిఁ
గరిపురిఁగల సొంపుగలుగమి చూచి,
కరము వేగము విశ్వకర్మ రావించి,
సరసత నయ్యూరిచందంబుదెలిపి,

1. సమేతులై. 2. శేలు. (మూ)

## ఇంద్రప్రస్థనిర్మాణము

"స్థలము మంచిదిగాదు ధర్మరాజునకుఁ ;
గులరాజధానికిఁ గొంచెమీపురము.
సురపురంబునకంటె సొంపైనపురము
విరచింపుమా నీదువిద్యాబలమునఁ ;
జెలువున బ్రాహ్మసృష్టికిఁ బ్రతిసృష్టి
వలెనన్నఁ [1] ద్రుటిఁజేయువాఁడవునీవు.
ఈయూరితూర్పున నిదె రమ్యసీమ
యోయోము [2] పరిణాహ యంత్రితస్థలము."
అనిన, నింద్రప్రస్థమనియెడుపురము
కనకరత్నమయంబుగా విశ్వకర్మ
నిర్మించిపోయిన, నృపుఁడందువిడిసి,
ధర్మసహాయుఁడై ధరణినేలుచును,
బంచబాణానంద పారవశ్యమునఁ
బాంచాలిఁ గవయునా భావంబుఁదెలిసి,
నారదాగమనంబు నారాయణుండు
ధారుణీశులకెల్లఁ దగనెఱిఁగించి :
'యతఁడేమి మీకుమర్యాద గావించె
హితమతి నడుఁ.' డని యేర్పడఁబలికి,
యాయతగతి వారలనుప ద్వారకకుఁ
బోయెఁ ; [3] బోవఁ, బురాణమునిపుంగవుండు
విరహులనేఁచిన [4] వృజినంబుపాయు
నురుశాంతి మునియయ్యెనో చంద్రుఁడనఁగఁ,
దెల్లని చల్లని దేహంబుతోడ
నల్లనవచ్చి, యేకాంతవాసమున

---

1. ప్రతికించు. 2. పరిణామ. 3. బోయెం బురాణపురుషుం డన్నట్లు.
4. విజయంబు. (మూ)

నృపకుమారులఁగాంచి నెమ్మితో వారి
యుపచారములఁగాంచి యొప్పనిట్లనియె :

### నారదుఁడు పాండవులకు హితోపదేశము సేయుట

“తమ్ములందఱు ధాత్రిఁ దఱచైననేమి !
మిమ్ముఁబోలఁగరాదు మిత్రభావమున.
మూఁడుమూర్తులు నొక్కమూర్తియున్నట్లు
పోఁడిమిమీరేవురుఁ బొసఁగ నొక్కళ్ల.
నీటినడుమడఁచిన నెఱిరెండుగాని
[1] నూటి మీకూటమి చూడనచ్చెరువు ;
అగుఁగాక యేమి, నెయ్యముచిక్కవాప
మగువల నిర్మించె మాయపుబ్రహ్మ.
మగువలెందఱు లేరు ! మహిఁ గృష్ణవోలు
మగువగల్గదుగాక మానాథ్యులార !
సుందోపసుందులు సుదతికిఁగాదె !
మ్రందిరి తమలోన మర్యాదలేక ;
కావున, వత్సరక్రమమునఁగాని
యేవురుఁ బాంచాలినిటఁ గూడరాదు.
ఒక్కఁడు రతి [2] సేయుచున్నఁ బాంచాలి
నొక్కఁడయ్యేఁటిలో నొగిఁజూచెనేని,
యతఁడు వత్సరమాత్ర మఖిలతీర్థముల
వ్రతధారుఁడై గ్రుంకి వచ్చువాఁ.” డనుచు
నందఱ నొడఁబడనాడి యాబ్రహ్మ-
నందనుఁడేఁగిన, నాఁటినుండియును
మరియాదదప్పక మగువఁ బాండవులు
మరుకేళిఁగవయుచో, మఱియొక్కనాఁడు

---

1. చూటమి. 2. సేయనున్న. (మూ)

అచ్చోట బ్రాహ్మణుండడవిలోపలను
మ్రుచ్చులఁగోపించి మొఱవెట్టుకొనుచు
నతివేగమునవచ్చి యాస్థానవేది
శతమఖసుతుఁగాంచి చాలదైన్యమున :
" మేదినీపతులార, మీరలూరేల
వేదంబులనుగాని వినము మ్రుచ్చులను ;
రవిగాని పరతాపరతులెందు లేరు ;
దివిఁగాని పుట్టదు ద్విజపగోగ్రహణ ;
మిట్టిచో, మ్రుచ్చులు హెచ్చి నాపశులఁ
బట్టినఁ, బరితాపభయుఁడనై యేను
గూయిడవచ్చితిఁ ; గూడఁగాఁ బోతి
నాయాలఁద్రిప్పవే ! నలినరణ్యమున.
ద్విజుఁడ దరిద్రుండ విపులకుటుంబి
నజునైన విత్తంబు లడుగనివాఁడ. "
అనిన 'నీగోవులనర్థితోఁదెత్తు'
ననుచు, బ్రాహ్మణుఁజాలనాద [1] రింపంగఁ
బవనజునకుఁజెప్పి పార్థుండులేచి
. . . . . . . . . . . . . . . . . . . . . . .
యాయుధశాలకై యస్త్రముల్ దేరఁ
బోయి, యచ్చో ధర్మపుత్త్రుఁబాంచాలి
నొక్కట రతిసేయుచున్న నీక్షించి,
గ్రక్కున నస్త్రముల్ గైకొని వెడలి,
కవచ శిరస్త్రాణ ఘనతనుత్రాణ
సవిశేషమూర్తియై స్యందనంబెక్కి,
చదువులుగొనిపోవు చండరాక్షసుని
వెదకు మీనాకారవిష్ణుఁడువోలె

1. రణమున. (మూ)

వెదకి గోచోరుల విపినమధ్యమునఁ
జెదరిపోనీక నిర్జించి, యాపశుల
మరలించి తెచ్చి బ్రాహ్మణునకునొసగి,
వరరత్నకాంచనావలిఁ బూజచేసి,
యతనివీడ్కొల్పి యభ్యంతరంబునకు
నతివేగమునఁ బోయి యమసూతిఁ గాంచి,
తక్కక సాష్టాంగదండపాతముగ
మ్రొక్కి హస్తంబులు మోడ్చి యిట్లనియె :
" అనఘాత్మ, విప్రకార్యార్థినై యేను
జనుదెంచుచో, నస్త్రశాలలోపలను
సతియు మీరును నొక్కశయ్యపై నుండ
మతిలేక గనుఁగొంటి మర్యాదదప్పి ;
కావున, నొకయేఁడు ఘనతీర్థయాత్ర
గావింపకుండినఁ గార్యంబుగాదు.
మనలోన మర్యాదమానిన, మనల
మనుజులు మనముల మఱి పాటిగొనరు.
మెలఁత ద్రౌపదిఁ గంటి మీరున్న శయ్యఁ ;
గలదె! యీదుష్కీర్తి [1] కంటె వేఱొకటి."
అనవుడు, ధర్మరాజర్జునుఁ బలికెఁ :
" బనివడి నిన్ను నేఁ బాయనోపుదునె!
నర, నీకు [2] వంత యెన్నఁడు లేనవింత!
మరియాదయే యింత! మానుమీ చింత!
అవనీసురార్థమై యయినయీపనికి
వివరింపనున్నదే! వీరాగ్రగణ్య!
అధికధర్మార్థమై యల్పదోషంబు
బుధుఁడాచరించిన భువి నిందపడఁడు."

1. గలదె. 2. వెంత. (మూ)

అనినఁ గవ్వడిపల్కు : "నదియట్ల తగును ;
మునియాజ్ఞ మీఱుట మోసంబుగాదె !
మనల దుర్నయులుగా మనుజులెన్నుదురు ;
జననాథ, పోవుటచందంబునాకు ;
ఒకయేఁటిపనియెంత ! యుల్లమున్నెన
వికసించునా." యని వీడ్కొనికదలి,

## అర్జునతీర్థయాత్ర

తిలలు ధాన్యంబులు ధేనువత్సములుఁ
గలశంబు లాజ్యంబుఁ గనకంబుఁ గంచుఁ
[1] బులకండమును రత్నములు లవణంబు
వెలిపచ్చడంబులు వెండి యాదిగను
ననుపమ దానపదార్థముల్ గొనుచు
ఘనధర్మవతిదాటి కాళిందిదాటి,
రథదాన హయదాన రవిమూర్తిదాన
పృథులగోదానముల్ పెక్కాచరించి,
యాదెసఁగదలి ప్రయాగతీర్థమున
నైదురాత్రులు నిరాహారుఁడై నిలిచి,
పరిపూతహృదయుఁడై పారణవేళ
ధరఁ గోటికన్యాప్రదానముల్ చేసి,
యక్షయ [2] వటమున్న యాపర్వతంబు
నీక్షించి, కాశికినేతెంచి, యందు
దీనులై నవసినతీర్థవాసులకు
వానగాఁ గనకంబు వర్షించి, మఱియు
శివుని సహస్రాభిషేకపూర్వముగ
భువనైకపూజ్యునిఁ బొసఁగఁ బూజించి,

1. పుల్లఖండంబు. 2. వటమును. (మూ)

గంగ మునింగి గంగాద్వారమునకు
సంగతినేఁగి మజ్జనమాడు వేళఁ,
గౌరవ్యుఁడను పాము గన్నట్టికన్య
శ్రీరమ్య [1] యగు నులూచీనామధేయ
[2] గొంతులతో నందుఁగొలనాడఁబోయి,
యంత నాతనిమూర్తి కాత్తలోఁజొక్కి :
"యేవాఁడొకో ! వీని నేఁజూచియెఱుఁగ ;
భావజన్మునికంటెఁ బసమేనివాఁడు !
కట్టక ముట్టక ఘననీలరత్న
మిట్టిరూపముదాల్చె ; నింతియుకాక,
మణిగాక మేనొండు మలయునోయిట్లు !
..............................
విస్తీర్ణతరమైన వీని [3] వక్షమునఁ
గస్తూరిగంధికిఁ గాపుండవలదె !
కొనగోర నితఁడింత గుఱిసేయఁడేని,
చనుఁగవఫలమెంత జవ్వరాండ్రకును !
'ఏను లీలావతి నీక్షోణి' ననుచు
వీనిముందట నిల్వ వెలఁదియెక్కడిది !
ఈక్షణంబున వీనియీక్షణంబులకు
లక్షనిష్కములైన లంచమీవచ్చు ;
గలుగునొకో వీనికౌఁగిలి నాకుఁ !
గలుగకుండినఁ జేటు కామునిచేత.
హీనవృత్తికిఁ జొచ్చి యీస్నానవేళ
నేను బ్రార్థించిన నితఁడేలవినును !
కొనిపోయి పాతాళకుహరంబులోన
నునిచి ప్రార్థించెద నొయ్యన." ననుచుఁ

---

1. ముగ. 2. ఈపదమును స్త్రీపర్యాయముగా వాడియుండును. చూ. ఆ. ప. చ. అ. 207. పు. 3. వక్షంబు. (మూ)

గరపల్లవమున నక్కామినిఁ దిగిచి
యురగలోకమునకు నువిద తెచ్చినను,
ధీరుఁడై కనువిచ్చి దేవేంద్రసుతుఁడు
భూరిసర్పములున్న పుణ్యగేహములుఁ,
బొసఁగ నిందునివింటిపూదెలోయనఁగఁ
బసనారఁబర్విన ఫణరత్నరుచులు,
వేవేగ శేషుని వేదశాస్త్రములు
భావించి వినుచున్న బాలసర్పములుఁ,
జెదరినముత్యాలచిప్పలుఁబోలె
నదనుతోఁ బగిలినయండఖండములు,
మందిరాగ్రములెక్కి మారుతంబులకు
విందులై [1]తినుచున్న వృద్ధనాగములు,
వనితలు గానంబు వలనొప్పఁజేయఁ
గొనియాడి చొక్కిన కోడెమసర్పములు,
నమృతంబునాకిన యలవాటనంగఁ
గొమరునాల్కలుగ్రోలు క్రూరసర్పములుఁ,
[2]దుట్టె పింజర నీరుదోత్త మన్దిండి
కట్టెడ త్రాచు రక్తపుమండలంబు
నెనసిన జెట్టిపో తిరుదలశిఖిని
పెనుఁబాము పసిరిక పెరజు నాదిగను
నాక్కొక్కవీథికి నుప[3]విష్టులగుచుఁ
బెక్కుతెఱంగుల బెరయుసర్పములఁ
జిత్రమై ఖగిని వీక్షింపుచు వచ్చి,
సుత్రామసూనుండు సుదతియిల్ సొచ్చి,
పనివడిమూఁగినవన్నగాంగనల
నసుచుతీవ్రతఁజూచి యాకన్నెకనియె:

1. వినుచున్న. 2. దుట్టపింజరనీతలోత్త. 3. దిష్టు. (మూ)

"నన్నేల తెచ్చితి నాతి! నీవెవ్వ?
రిన్నలినాక్షుల నేలయుంపెదవు?
తెలిసె నించుకమాకుఁ; దీర్థవాసులకు
వలరాజుకేళి తా వర్జింపవలయు
ము; న్నటుగాక, పాములతోడిపొత్తు;
మిన్నకపోయెద మేదినీస్థలికి."
అనుటయు లజ్జించి యనువెల్లమఱచి,
[1] తనలోన తానగి, తడవాపఁజూచి:
"నాగకన్యక నేను; నా పేరులూచి;
బాగొప్పఁ గౌరవ్యఫణికిఁగూఁతురను;
పెండ్లిప్రాయముదాఁకఁ బెనిచి నన్నతఁడు
పెండ్లిసేయఁడు తగుప్రియుఁడు లేఁడనుచు;
గరుడోరగామర గంధర్వులందుఁ
బరికింప మిట్టిసౌభాగ్యంబువాని.
ఏను నీమూర్తికి నిచ్చలోఁజొక్కి
భూనాథ, తెచ్చితిఁ బుష్పాస్త్రనోమ.
ఇంద్రుఁ డింద్రునిపుత్త్రుఁ డింద్రునిపౌత్త్రుఁ
డింద్రాభ, దివి భువి నిచటను వలదె!
ఇంద్రుఁడుగలఁడు; నీవింద్రపుత్త్రుఁడవు;
ఇంద్రపౌత్త్రునినింకనిచ్చోటనిలుపు.
ప్రాణేశ, నాకంటెఁ బాత్రంబులేదు;
ప్రాణదానము సేయు బహుపుణ్యమిచ్చు.
అనయంబు గాంధర్వ [2] మనెడివివాహ
మున నన్నుఁగూడవే! పోదు నీవ్రతము."
అని దైన్యదశనాడ, నతఁడాదరించి
వనితయావనపుష్పవాసనఁగొనిన,

---

1. తనలోనె తా డాంగితడబాపజూచి. 2. పైన. (మా)

సుదతికిఁ బతికి నచ్చో నిరావంతుఁ
డుదయించె సుతుఁడు సద్యోగర్భమునను.
వాసవిమాఱుగా వాని శేషాదు
లాసతో నీక్షించి రందఱువచ్చి.
అంత, నలూచిచే నంపించుకొనుచుఁ
గాంతేయుఁడును దొంటికఁదువ నిలిచె.
తనకథ బ్రాహ్మణోత్తములకుఁ జెప్పి,
ఘనరతి నిఖిలగంగల నాడుకొనుచు
వచ్చి యంతనగస్త్యవటము నీక్షించి,
యచ్చట భృగు[1] తుంగమునుతీర్థమాడి,
కోటికన్యాదాన గోకోటిదాన
హాటకదానంబు లచ్చోటఁజేసి,
నృపచంద్రుఁడుత్పలినియుఁ గౌశికియును
అపరనందయు నందయునుసరోవరము
సేవించి, జాహ్నవీసింధుసంగమున
వావిరి మాసోపవాసంబు సలిపి,
రత్నగర్భంబు హిరణ్యగర్భంబు
యత్నంబుతోఁజూచి యచ్చోటుకదలి,
పురుషోత్తమమునకుఁబోయి, యచ్చోటఁ
బురుషోత్తముని లోకపూజ్యుఁ బూజించి,
వేలాతటంబున వెసఁబోవఁబోవఁ
గాళింగభూములు గానవచ్చినను,
అతిదూరమయ్యెఁకునని విప్రసమితి
మతికల్మి నూరికిమరల వీడ్కొలిపి,
కొందఱువిప్రులు గూడియే తేర
నందందచని మహేంద్రాచలమెక్కి,

1. శృంగమును. (మూ)

వింధ్యాద్రి దక్షిణవిషయంబు చూచి,
సంధ్య [1] సేవించి యాశ్రైలంబునెక్కి,
విలసితబహుళరామ విద్రుమారామ
నలకాభిరామ దాక్షారామఁజూచి,
తెల్లంబుఁ బులగంబు భీమనాథునకు
విల్లెత్తుపాడపు నైవేద్యంబుచేసి,
బోగంబులాడెడు పువ్వుఁబోండ్లకును
జాగంబులిచ్చి యచ్చటనుండికదలి,
తాలాంకబలుఁడు గోదావరినాడి
లీలమార్కండేయలింగంబునకును
జేవపాయసమునఁ [2] జెరవచేయించి, (?)
సేవించి యటఁబోయి శ్రీశైలమెక్కి,
మంత్రస్వరూపుని మల్లికార్జునుని
మంత్రపుష్పమువెట్టి మఱలఁబూజించి,
యందులతీర్థంబులన్నియు నాడి,
కెందామరలనొప్పు కృష్ణకునడచి,
విజవాడశివుని సంప్రీతితోఁగాంచి,
ద్విజులకుఁ గనకంబు తృప్తితోనొసగి,
హరునిఁబూజలుచేసి, యంతనాకోలని
తిరునాళ్లుచూచి, యాదేవదేవునకుఁ
బసిఁడిపళ్లెరములుఁ బట్టువస్త్రములుఁ
బశులు ధాన్యములు సంపాదించియిచ్చి,
భక్తవత్సలు నహోబలనారసింహు
భక్తిపెంపునఁజూచి, భవనాశిఁదోఁగి,
యన్నదానమువెట్టి యటఁగాళహస్తిఁ
గన్నారఁజూచి, వేంకటగిరియెక్కి,

1. సేవించి. 2. చెరుపు (మూ).

కమ్మనియప్పాలఁ గలవంటకముల
రమణ మహోపహారమ్ము సేయించి,
కవ్వడి యటఁబోయి కాంచీపురమున
నవ్విష్ణు సేవించి, యభవునుమేశు
నేకామ్రనాథు గౌరీశుఁ గామాక్షిఁ
గైకొని మదిఁబూని కదలియాక్షణమ
యరుణాచలమునకు నర్థితోఁబోయి,
యరుణేశుఁబూజించి, యభ్రసరసికిని
జని శివగంగలో స్నానంబుచేసి,
పనుగొన్న వేడ్కతో భక్తవత్సలుని
నాచిదంబరనాథు నర్చించి ప్రీతి,
వేచని కమలాలయేశు విశ్వేశు (!)
భావించి సేవించి ప్రార్థించి కదలి,
సేవితనిర్వాణు శ్రీపతిబాణు
జంబునాథుని పాదజలజముల్ గొలిచి,
యంబుజలోచనుండంతఁ గావేరి
దక్షిణగంగగదాయని యందు
దక్షిణామూర్తుల దానంబుచేసి,
సేతురామేశ్వరు శివుఁగానఁబోయి
బ్రాఁతి నచ్చటఁ దులాభారంబు తూఁగి,
యంతలో వ్రతముసమాప్తిఁబొందుటయు
నెంతయు యమసూతికెఱుఁగంగఁ బుచ్చి,
యతఁడంతఁ జిత్రవాహనుఁడనుశబర-
పతియూర ధీరుఁడై పైత్రోవ నడవ,
నతనిని జెంచు తానతివైభవమున
హితమతిఁ గొంపోయి యింటఁబూజించి,
యతనికి మదిలోనియాసక్తిఁదెలిపి
యతివఁ జిత్రాంగదయనుపుత్త్రిఁజూపి:

## అర్జునుఁడు చిత్రాంగదను వివాహమగుట

“[1] వసుధేశ, తొల్లి యీవంశసూత్రంబు
వసతోడఁ దెల్పెదఁ బరిపాటి ; నొకఁడు
హరునకుఁ దపమున్న, నాతండు మెచ్చి
యరుదెంచి మా తాతనప్పుడు వలికె :
‘కులము నిల్పెదను ; నీకొకరుడు కొడుకు
నిలువఁడు గదుర మున్నిటిదోషమునను (?)
అట్టయ్యు, వరము నన్నడిగితిగానఁ,
బుట్టుదు రొక్కొక్క పుత్రుఁడై యిందు ;
శాఖోపశాఖలై జరుగుదుసువ్వె !
యాఖేదమును మాని యరుగుము నీవు.’’
అని యిచ్చిపోయినాఁ డట్టివంశమున
(జనియించినట్టి యీసకియఁ బెండ్లాడి
పుత్రుదానమొనర్పు భూవర !” యనిన)
ధాత్రీశుఁ డయ్యింతిఁ దగిలెదు కాంత
నొడఁబడఁగైకొని యొకకొన్ని నెలలు
పడఁతితోడ విహారపరిణతి నుండి,
బభ్రువాహనుఁడను పట్టిఁ బుట్టించి,
సుభ్రుతండ్రికి వాని సుతునిఁగా నిచ్చి,
యచ్చోటువీడ్కొని యటపోయి పోయి,
క్రచ్చఱ సౌభద్రకంబను కొలన
నారయఁ బౌలోమయనియెడు కొలనఁ,
[2] గారంధమఖ్యాతి గలిగెడి కొలన
నమర భరద్వాజమనియెడు కొలన
నమరులెన్నఁ బ్రసన్నయనియెడు కొలనఁ

1. ఈపంక్తులలోని కథాసందర్భవాక్యయోజనాదికము స్పష్టముగాలేదు; కవిత్రయ భారతమును బట్టి సవరింపఁబూనినచోఁ జాల తాఱుమాఱుచేయవలసివచ్చునని యిట్లే యుంచఁబడినది. 2. కారండవిఖ్యాతి. (మూ)

బొనర మజ్జనమాడఁబోవ, నర్జునునిఁ
గని యందు మౌనులుగదిసి యిట్లనిరి :
" అనఘాత్మ, నీవేలయరిగెద వందు !
నొనరంగ నూఱేండ్లనుండియు నచట
నొగ్గమై మకరంబులుండుటవలన
డగ్గఱ వెఱతురు రాఘాక నెవ్వరును ;
సోపద్రవంబులై చొరరాకయున్న
నేపుణ్యతీర్థంబు లేటికిఁ జెపుమ !
క్షితిఁ దాతగట్టిన చెఱువైన నేమి !
చతురతమునిఁగి లోఁజావంగఁ దగునె !
మఱియుఁ దీర్థంబులు మహినెన్ని లేవు !
జరుగుము నీవందుఁ జననిందువలదు."
అనుచు మౌనులుచెప్ప నర్జునుండనియె :
" మునులార, వినుఁడేను మునివృత్తిఁదాల్చి
సకలతీర్థంబులుఁ జరియింతుననుచుఁ
బ్రకటంపుఁబ్రతిన తప్పక చేసినాఁడ ;
వికటవైరులనెల్ల విదళించునాకు
మకరంబులోకరొండ్డ! మర్దించివైతు."
అనుచు నర్జునుఁడేఁగి యందులో మొదలి
ఘనసరసిని నవగాహంబు సేయ,
విమలజలంబెల్ల విచ్చిపాఱంగఁ
గమలోత్పలంబులు గ్రక్కదలంగ,
మీనంబులన్నియు మిట్టిపడంగఁ, —
దోన నే తేరంగఁ దోరంపునాచు,
వికట దంష్ట్రానన వికృతమై మొసలి
ప్రకటించి యాపార్థుఁబట్టెఁ; బట్టినను,
సరసభవాబ్ధిలో జారంగఁదివియు
నురుకర్మమెడలించు యోగియుఁబోలె,

నర్జునుండా గ్రాహి నదరంటఁదన్ని,
భర్జించి చేపట్టి బాహువిస్ఫూర్తి
నెలిఁ బాఱవైచిన, వేగంబె యదియు
వెలఁదియై నరుఁజూచి వేడ్కనిట్లనియె :
"ఓ రాజ, నీకృపాయోగంబువలన
నీరీతి [1] నాశాప మింతయుఁదీఱె.
తరువాతి సరసులన్ దరుణులు నల్వు
రొరలుచున్నవా ; రొప్పుగా వారి
శాపము క్రుంగఁజేసి స్నానఫలంబు
చేపట్టవే! వారు చెలియండ్రు నాకు.
పోయెద ధననాథుపురమున కేను ;
నీయభీష్టము లెల్ల నెలకొనుఁగాత."
అనిన బీభత్సుండు నతివకిట్లనియె :
"వనిత, మీ కేటికి వచ్చె శాపంబు?
మీనాథుఁ డెవ్వాఁడు? మీకుఁ బేరేమి?
పూని చెప్పు." మటన్నఁ బొలఁతియిట్లనియె :
"వినుతాత్మ, వినుము మావృత్తాంత మెల్ల ;
నొనరఁ గుబేరుని యుడిగలమేము ;
[2] నాపేరునందయా ; నాసఖుల్ లతయు
రూపింప [3] సౌరుచి రూఢిసమీచి
యరయ [4] బుద్బుద యనునట్టియేపురముఁ
బరఁగ సుఖంబుండి, బహుకాలమచట
నొకనాఁడు వేడ్కమై నొనరలోకంబు
లకలంకగతిఁ జూతమంచు నేతెంచి,
సకలలోకంబులుఁ జరియించిచూచి,
ప్రకటభూలోకంబుఁ బరికించుచోట,

1. నాతాప. 2. నాపేరునంద యా నా చెన్కలలిత. (మూ) నంద. అని. నన్నయ. వర్గ. అని వ్యాస. భా. 3. సౌరభేయి. అని సం. ఆం. భారతములు. 4. పుల్వస. (మూ)

నగ్నికల్పుఁడను సంయమిచంద్రుఁ డొకఁడు
అగ్నిసమానుఁడై యటఁదపంబుండఁ,
దొడఁగి యాతనిఁజూచి తొలఁగక యేము
నొడలుండఁబట్టక సోలిఁగట్టెదుర
నాటలుఁబాటలు సలపుమాటలును
దేటలు నట తరితీపు సేయుటలుఁ
బచరించి, మఱియును బహువిలాసములఁ
బ్రచురమై మేనెల్లఁ జూటించినిమిరి,
చిన్నిచన్నులమీఁదఁ జేలాంచలములు
క్రన్నఁదొలఁగించి, కడగంటఁజూచి,
వాతెర కెంపులు వదనలీలలును
లేఁతనవ్వులుసూప, లేవకమ్మాని
కనలి కెంపొదవంగఁ గన్నులువిచ్చి
తనమనోధైర్యంబు తప్పక పలికె :
'మత్తాత్మలార, యే మహితతపంబు
చిత్తశ్రమంబుగాఁ జేయుచునుండఁ,
గ్రొత్తలాగుల నిట్లు కుటిలవిఘ్నంబు
నొత్తిసేయఁగ మీకు యోగ్యమే యకట!
ఈదోషమున మీరలేవురుఁ బోయి
యాదక్షిణాంబుధి కనతిదూరమునఁ
దిరమగు నాపంచతీర్థంబులందుఁ
బరఁగుఁడు జలచరీభావంబుదాల్చి ;
నుసుగక యీరీతి నూఱేండ్లదాఁకఁ
బొసఁగంగ నుండుఁడు భువి ; నంతమీఁదఁ
దీర్థంబులన్నియుఁ దిరిగియాడంగ
నర్థించి వ్రతధారియై యర్జునుండు
నచ్చోటికే తెంచి యన్నిటఁగ్రుంకి
యచ్చుగా మీశాప మడఁగంగఁజేయు.'

నని యగ్నికల్పుఁడిట్లానతిచ్చినను
అనఘాత్మ, యేముఁ బ్రీతిమిచ్చోట.
నెఱి నింతకాలంబు నీరాకగోరి
యొఱలుచునుండంగ నొదవె నీకరుణ.
భరతకులాంభోధిపరిపూర్ణచంద్ర,
యరిగి నాచెలియండ్ర ననుపవే! దివికి."
అనుచు నాసురకాంత యలరిప్రార్థింప,
విని యర్జునుఁడు కృపావిమలుఁడై పోయి,
నాలుగుకొలఁకుల నలిఁ దీర్థమాడి
తొలి నల్గురకును నొనరించెముక్తి.
అప్పు డయ్యేవురు నమరకామినులు
నుప్పొంగి యాక్రీడి నొనరదీవించి
యలకాపురంబున కరిగిరివేడ్క.
జలజాక్షుమఱఁదియు జలచరంబులకుఁ
బస మోక్షమార్గంబు ప్రాపింపఁజేసి,
మసలక యంతలో మహిమదీపింపఁ
గదలి పశ్చిమవార్ధిఁ గరళులుమిగులఁ
గదిసినపురము గోకర్ణంబుచేరి,
యచ్చోటియతులకు నభివందనములు
చెచ్చెరఁగావించి, శివునిసేవించి,
భాసురంబైన ప్రభాసతీర్థమున
వాసుదేవుని లోకవంద్యునిఁగొలిచి,

### అర్జునుఁడు ద్వారకకేఁగుట

ద్వారకాపురికేఁగుతలఁపుననుండ,
శౌరి యాతనిభావసరణి మున్నెఱిఁగి:
"యితఁడు సుభద్రపై నిష్టంబుగలిగి
గతివశంబున వచ్చెఁ గాదననేల!

యాదవులెఱిఁగిన నబలనీనీరు ;
నాదు నేర్పునఁ గూర్తు నాతి నీతనికి."
అని నరుఁగాన నారాయణుండరిగి
మునుమైననాఁటి యిమ్మునఁ గౌఁగిలించి,
మునుమున్న యతివేషముననున్న వానిఁ
గనుఁగొని మేలంబుగా నరాఁ బలికె :
" చతురత ఘనులచే శబరులచేత
[1]నతివలఁ గొన్న సన్యాసులు మీరు ;
ఎందుఁబోయెదరు ! నే నెఱుఁగుదుఁ గొంత
పొందు సేయుదు మీరు పూనినపనులు "
అనుచు రైవతకాద్రి కతనిఁ దోడ్తెచ్చి :
" వినవయ్య ! యాదవుల్ వెఱతురు యతికిఁ ;
గావున, యతివైన క్రమము మేలయ్యె.
ఏవిధముననైన నేమి ! కార్యార్థిఁ
దోఁ తెత్తుఁ బ్రజల జాతరకు నిచ్చటికి ;
నాతిఁ జూతువుగాక నయనంబులలర. "
అని శౌరి యాతని నచ్చోటనునిచి,
తనయూరికేతెంచి తగుసంభ్రమమున
రైవతకాద్రియాత్రకుఁ జాటఁబనిచి
వేవేగఁ గదలుచో, వేడ్కతోఁ బ్రజలు
కుంకుమతోఁ బండ్లుగొని తెచ్చువారుఁ,
గింకిణీరథములెక్కియు వచ్చువారు,
నారులఁ గైసేసి నడపించువారు,
భేరులమ్రోఁతలు బెరయించువారు,
భక్ష్యభోజ్యంబులు పసిఁడిపాత్రములఁ
గక్ష్యలు కక్ష్యలుగాఁ దెచ్చువారుఁ,

---

1. అతివల. (మూ)

జాడెలుపాడుచుఁ జాలఁగోలాట
మాడుచు గుంపులై యరుదెంచువారు,
సతులుఁ బుత్త్రులు బంధుసఖులునే తేర
వ్రతములు చెల్లించువారునై యిట్లు
జాతరవెడలుచోఁ, జాలఁగై సేసి
ప్రీతినుద్ధవుఁడును, బెరయనాహుకుఁడు,
ననిరుద్ధ సారణ హార్దిక్య గదులు,
శిని పౌండ్ర రామ సుషేణ భానులును,
బ్రద్యుమ్న సాంబాది బహుకుమారకులు
నుద్యోగ [1] వంతులై యొదవిరి హరికి.
ఈతెఱంగునఁబోయి యిందఱు గిరికి
జాతర శౌరిమెచ్చఁగ నాచరించి,
యింద్రనందనుఁడున్న యేకాంతసీమఁ
జంద్రకాంతోపలస్థలులు చేరుటయు,
బలభద్రుఁడంత సుభద్రఁదోకొనుచు
వెలయ నచ్చటికేఁగి వెన్నునియెదుట
నతివక్తై వచ్చిన యతివేషధారి
నతిభక్తి నీక్షించి, యందంద మ్రొక్కి
యడుగులుపూజించి యర్ఘ్యంబులిచ్చి
యడరికీర్తింప, నయ్యవసరంబునను
భావంబుకంపింపఁ బడఁతిసుభద్ర
యావేషధారికి నాత్మలోఁదక్కి :
'యతిఁజేసెనక్కటా! యాలరిబ్రహ్మ;
యితనిఁజూచిన నింతి యేమికాఁగలది!
అందనిపండ్లకు నఱుచాచిచాచి
[2] యొందఱు విరహాగ్ని నీదుచున్నారో!

---

1. ఉద్యోగవానులై. 2. ఇందఱు. (మూ)

కామినీజనులకాంక్షలు [1] వృథగాఁగ
నేమిటికిట్లయ్యె నీయయ్యగారు!
ఒకపాటి సతినేల [2] నొల్లఁడుగాన,
సకలంబుఁజాలించి సన్యాసి యయ్యె.
ఇతఁడు కాంతలనేల కిట్లయ్యెఁగాని,
మఱినిల్వనేర్చునే! మనబోఁటులకును;
ననుజూచి యేమొకో! నయనమల్లార్చె;
ననుమాన మీరాత్రి యడిగిచూచెదను."
అనుచు నందఱుమ్రొక్కఁ నట్లు తాఁమ్రొక్కి,
పెనఁగొన్నలజ్జ నాప్రియునిఁ బూజించి,
సఖులకు మున్నాడిచనిన, నత్తెఱఁగు
ముఖసంజ్ఞ నరునకు మురవైరిచూపె.
బలుఁడంత నర్జునుభవ్యతేజమును
దలయూఁచి మెచ్చి యాతనికినిట్లనియె:
"అనఘ, మాపురమున నైదారునెలలు
గొనవచ్చునే పూజఁ! గొన వసియింపఁ
గన్యకాపూర్వంబు గదిసి మీసేవ
కన్యసేయు సుభద్ర కణఁక మాయాజ్ఞ;
మృదువచోరచనల మీతోడిగోష్ఠి
సుదినంబులగు మాకు శుద్ధాంతరంగ!"
అనిన, సంతియుఁ బార్థుఁడంగీకరించి
చనుదెంచె యాదవసదనంబునకును.
బలుఁడును నిజవాక్యఫణితిని యతికిఁ
జెలియలిచే నిత్యసేవచేయించె.
అంత, వర్షాకాలమైన మేఘములు
చింతింపఁ దగవువచ్చినయట్లు కూడి,

---

1. వృథగావు. 2. నొల్లనొల్లఁడు. (మూ)

యుర్విఁ [1]దారిడినట్టి యుదకధనంబు
సర్వంబు మునుగొన్న చండాంశురుచుల
నాకాశపథమున నాఁగినట్లాఁగి,
చేకొన్న యురుములచే ధిక్కరించి,
జడనిధిఁ ద్రావుచో సందడిఁ గొన్న
బడబాగ్నికణములు పర్వి చొచ్చుటయుఁ,
గడుపునకవిగాక గ్రక్కుచందమునఁ
బిడుగులొక్కొకమాటు పృథివిపై రాల్చు;
నెలగోలు వర్షించి యేఱులు వఱపి,
యిలయెల్ల భేదించు నివిధూర్తులనుచు;
ననిమిషేంద్రుఁడు తమ్మునాఁక పెట్టించె
ననితోపఁ గొండల నడఁగు నొక్కెడల;
సైరణ నాఁకొన్న చాతకద్విజులఁ
బారణకై మింటఁ బంక్తి సాఁగించి,
[2]పరితోషమునఁ బాటిపాటి వడ్డించు-
పరుసున నుడువీధిఁ బాఱు నొక్కెడల;
నటులచందమున నానారూపులగుచుఁ,
గటకరత్నంబులగతి మెఱయుచును,
నిలిచి రోగులువోలె నీరు గ్రోలుచును,
గలములగమివోలె గాలిఁ బోవుచును,
యుద్ధభీతులువోలె [3]నుక్కడఁగుచును,
సిద్ధపార్థులువోలె నిటనల్లనగుచుఁ, (?)
బ్రతియోధులనుబోలెఁ బన్ని వచ్చుచును,
ప్రతరాక్షసులువోలె సూర్యునాఁగుచును,
[4]గాడయు పార్థులువోలె గిరులఁ దోచుచును,
జడివట్టి యిట్లు వర్షాపమోదములు

1. తారిమిడిన. 2. పరితోదకము. 3. నుక్కుటయగుచు. 4. కినిసి. (మూ)

## సుభద్ర అర్జును నుపచరించుట

కురియుచో, నప్పుడు గోవిందునను జ
పరిచర్యకై వచ్చి పార్థునిఁగదిసి,
పరమేశ్వరుండు తపంబాచరింపఁ
బరిచర్యకై వచ్చు పార్వతివోలె
మంచిగంధంబున మంటపంబలికి,
మించిన కెంబట్టుమేల్కట్టు కట్టి,
మొగ్గలవలెఁ దీర్చి ముగ్గులుపెట్టి,
గుగ్గులు [1] ధూపంబు ఘూర్ణిల్లఁ జేసి,
సరసముగాఁ బెట్టి జమ్ముఖానంబు,
ధరఁ బులితోలు తాఁ దార్కొనఁ బఱచి,
కప్పురునీలాల కాళులపీట
చప్పరంబునఁ బెట్టి జలకంబులార్చి,
నెఱిఁ బట్టెయుదికిననీర్కావిగోచి
నెఱయ నీళ్లాడిన నృపతికినిచ్చి,
కాషాయవస్త్రంబు కస్తూరినద్ది
వేషధారికిఁ దెచ్చి వెన్నునఁగప్పి,
పవడపుఁబిల్లనపావాలు వెట్టి,
యివురాకుఁగై దండయిచ్చి తోడ్తెచ్చి,
కుంకుమమెత్తిన కూర్చిపీఠంబు
పంకజానన వెట్టి, భక్తితో మఱియు
నాపైనఁదులసియు నక్షమాలికయు
గోపిచందనమును గుశపవిత్రమును
సరసరీతులనిచ్చి, [2] జపమైనదాఁక
నోరసిలియుండి తానొయ్యనవచ్చి

1. ధూమంబు. 2. జడ. (మూ)

దేవపూజకుఁ బెట్టి, దేవసన్నిధిని
బావుమీఱిన పత్రపాత్రంబు వెట్టి,
మెత్తనియశనంబు మేల్మిపాయసముఁ
గ్రొత్తగాఁ గాచిన గోవులనేయి
గారెలు బూరెలుఁ గడియపుటట్లు
నీరొత్తు [1] లౌజులు నెఱయుమండిగలు
ఫలములుఁ గూరలుఁ బంచదారలును
ఒలుపుఁబప్పును దీపునోట్రువడియములు
వరుగు లప్పడములు వాసితోదకముఁ
జిఱుచెట్టు తేనియు చెలువైనకంద
పెరుగులుఁ బచ్చళ్లు భీమానుజునకు
సరసవడ్డించి, భోజనమైనపిదపఁ
గిన్నరకాంతి యొంగిలి [2] పాఱఁబోసి,
పన్నీట నడుగులు భక్తితోఁ గడిగి,
కమ్మఁగాఁ దనువునఁ గప్పురం బార్చి
యిమ్ములఁ జనుచోట, నిటనొక్కనాఁడు
హరినూనుఁ డాయింతి యధరపల్లవము,
నరచందురునిచందమందిననుదురుఁ,
గనుఁగవ చెక్కులుఁ గరమూలయుగముఁ
జన్నులు నడుమును జఘనభారంబుఁ,
గ్రన్ననఁ బాదపంకజములు వేడ్కఁ
జూచి యచ్చెరువంద, సురరాజసుతునిఁ
జూచి యిట్లనియె నాసుదతీలలామ:
"ఎప్పుడు నోయయ్య! యేయూరుమీకు?
నిప్పు డెచ్చోటికి నేఁగుచున్నారు?
వెస మీరుచూడని విశ్వంబులేదు;
పొసఁగ నింద్రప్రస్థపురముచూచితిరె!

1. లేగులు. 2. యార్వంబోసి. (మూ)

పరికించితివె! యందుఁ బాండునందనుల ;
నిరవొప్పు నర్జుననెఱుఁగంగఁగలవె?
ఆతఁడు తీర్థయాత్రార్థియై పోయి
యేతెంచనే తిర్గి యిభపురంబునకు!
ఆతఁడుమాభావ ; యతులప్రభావ,
చూతునో! నేత్రసుఖముప్పతిల్ల ;
నీవేషమున నటియించెదు నీవె
కావుగదా! కాంతిగల యర్జునుఁడవు."
అనుటయు నెంతయు నంతరంగమును
మనసిజుఁడలయింప మమతవాటించి,
యనన్యమధురభాషామృతధారఁ
జొక్క యా దేవేంద్రసుతుఁడోర్వలేక
యిట్లను: "విను, నేనయింద్రపుత్త్రుఁడను ;
ఇట్లువచ్చితి నిన్ను నేఁబెండ్లియాడ ;
నీరూపమునఁగాని యిచ్చటిప్రజలు
గారాము సేయరుగాన నిట్లైతి ;
నోడఁబడివచ్చిన నుగ్మలి, రమ్ము ;
తోడికొనిపోయెద దొరలఁ గన్గొఱఁగి."
అనుటయు : 'హరి యీశ నరుదేరవెఱతు ;'
నని సిగ్గుతోఁజెప్ప, నతివతోడుతను :
"అంగజ[1] శాంతిగా నబల, నీతోడి
సంగతిలేకున్న సైరింపఁజాల ;
ధరణీశ్వరులకు గాంధర్వవివాహ
మరహంబు ర." మ్మన నతివ సిగ్గునను :
"నన్నునీఁగర్తలున్నారు యాదవులు ;
మిన్నక నాకిట్లు మేకొనవచ్చు!"
ననుచు సుభద్ర యంతఃపురంబునకుఁ (?)
జనియె ; నర్జునుఁడును శయనింపఁబోయె.

---

1. శాంతిగా. (మూ)

## సుభద్రార్జునుల వివాహము

అట్టిసల్లాప వృత్తాంతమంతయును
నట్టన మురవైరి నిజబుద్ధినెఱిఁగి,
బలముఖ్య యాదవప్రభుల మొఱంగి
చెలువఁ గ్రీడికిఁ బెండ్లిసేయంగఁ దలఁచి,
తనచేయు కార్యయత్నము పాండవునకు
ననుజకు నతిరహస్యంబుగాఁజెప్పి,
ఖ్యాతి నంతర్ద్వీపకాలకందునకు
జాతర వెడలంగ సమకట్టుటయును,
సాంబ సంకర్షణ సారణాక్రూర
శంబరారి సుధేష్ణ సాత్యకి బలులు
వెడలిరి కామినీవితతులుఁ దారుఁ;
గడు ద్వారవతిలోనఁ గావలిపెట్టి,
తాను వారినిగూడి దామోదరుండు
పూనికఁజని శంభుఁబూజించి యచట
నైదారుదివసంబు లట్లున్నచోట,
యాదవేశ్వరుల నొయ్యన డాఁగురించి
హరి తనపురమునకరుదెంచి మిగులఁ
గరియానఁగై సేయఁ గాంతలఁబనిచి
యింద్రుఁదలంచిన, నింద్రుఁడాక్షణమె
సాంద్రవైభవ కళాచతురుఁడై వచ్చె;
గరుడ కిన్నర యక్ష గంధర్వపతులు
వరసప్తసంయమీశ్వరు లాదిగాఁగ
వచ్చిరి; శచియునువచ్చె; వెండియును
వచ్చిరి మునులు దుర్వాసుఁడాదిగను.
అమరులు విహరింప హరిరాజధాని
యమరావతినిబోలె నటవింతలేక.

కొడుకుపెండ్లికి నిట్లు గోత్రారివచ్చి,
కడువేడ్కఁ బురముశృంగారింపఁబనిచె.
ఈరీతివచ్చిన యింద్రాదులకును
శౌరి పూజలుచేసి సంభ్రమంబునను,
చారులగ్నము బృహస్పతినిర్ణయింప,
నానావిధ దేవతూర్యములు ఘోషింప,
విహిత యాజకమంత్ర విరచనయందు
బహుభంగిఁ గశ్యపబ్రహ్మ వర్తింప,
శచి యరుంధతి రతి సత్యభామయును
నచట సుభద్ర కల్యాణంబు పాడ,
మునిజనాశీర్వాదములు మిన్నుముట్ట
ననితఁ గన్యకకి వివాహంబుసేసి,
వరుసఁబూజించి దేవతలవీడ్కొలిపి,
పరమానురాగుఁడై పద్మనాభుండు
రత్న కేయూర హారములు పార్థునకు
యత్నంబుతోనిచ్చి యతనికిట్లనియె :
" అర్జున, [1] మనసైనయట్టి కార్యంబు
నూర్జితంబయ్యె వేయును నేలమనకు ;
ఇదియెఱుంగనియట్టు లిదె నాకు బలుఁడు
మొదలైనయదుబలంబులకుఁ బోవలయుఁ ;
గోమలి నీవుతోడ్కొనిపొమ్ము లెమ్ము ;
తామసంబయ్యె యాదవులు వచ్చెదరు."
అని రథ్య కేతు శస్త్రాస్త్రసంపదల
ననువైనయరదంబు హరినూతికొసగి
యనిపి, కృష్ణుఁడు వేగ యాదవులున్న
మునుమునకే తెంచె మునిమ్రుచ్చువోలె.

---

1. మనసైన పెట్టి. (మూ)

అటపార్థుఁడును భార్య నరదమెక్కించి
పటుతర శస్త్రాస్త్రభరితుఁడై కదలి
పోవుచో, ద్వారకాపురవీథి నెపుడుఁ
గావలియుండు శృంఖలుఁడనువాఁడు
తను వేవురుగ్రయాదవులు సేవింపఁ
జనుదెంచి యాసవ్యసాచినీక్షించి
దహనుఁడై మండి యాదవసేనతోడఁ
గహకహధ్వని సముగ్రముగ నిట్లనియె :
"ఓరిసేనాధ్యక్ష, యోవిరూపాక్ష,
యోరిసంగరకోప, యోరిసావీర,
రండురం ; డదె! పాండురాజనందనుఁడు
కండక్రొవ్వున రాజకన్య సుభద్రఁ
గొనిపోవుచున్నాఁడు కుటిలమార్గమున
మునుకొని హరియు రాముఁడు లేనిచోట.
వీనిఁబోనిచ్చిన విభులచే మనకుఁ
గానికార్యముపుట్టుఁ గడఁగుఁ." డటంచు
జలదకులంబెల్ల సమకాలవృష్టిఁ
గులగిరీంద్రము ముంచుకొన్న చందమున
బాణవేణికల నప్పార్థుఁగప్పుటయు,
బాణవైరిమఱంది భయమింతలేక
చిఱునవ్వుదళుకొత్తఁ జెలువకిట్లనియె :

అర్జునుఁడు యాదవవీరుల జయించుట

"హరిణాక్షి, చూచితే! యాదవబలము ;
కన్నులుగానక కదనంబు సేయఁ
బన్నిన యీయల్పబలమెంత నాకు !
దొరఁకొని రథమీవు దోలుమా నాకు ;
శరముల భస్మంబుచేసెద వీరి."

అని చెప్పి నొగలపై నతివఁ గూర్చుండఁ
బనుప, సుభద్రయుఁ బగ్గముల్ పట్టి
జిలిబిలినవ్వును సిగ్గును బెరయఁ,
బలుమాఱు పయ్యెద పచరించుకొనుచుఁ
దేరు దోలుటయు, నద్దేవేంద్రసుతుఁడు
ఘోరనారాచముల్ గుఱియంగ నార్చి,
యమృతభాండమునకై యండజాధీశుఁ
డమరులతోఁ బోరునట్టి చందమున
వంచియు వ్రాల్చియు వ్రక్కలించియును,
ద్రుంచియు నొంచియుఁ దూలనేసియును,
జించియుఁ దెంచియుఁ జిదురుచేసియును,
ముంచియుఁ గూల్చియు మొనవిఱిచియును,
బాణధారాసజప్రౌఢిఁ జూపుటయుఁ,
బ్రాంతిభీతికినోడి బలములు చెదరి
కన్నులఁ గన్నవంకలఁ బాఱుటయును,
అన్నరుండును వేడ్కనరిగె శీఘ్రమున.
ఆరీతి సైన్యంబు లాయాదవాగ్ర-
వీరులతోడ నవ్విధము చెప్పుటయు,
వృష్ణిభోజులు కోపవివశులై రామ-
కృష్ణులతోఁ బురికేతెంచునపుడు
రాముఁడు భీకరప్రళయకాలోగ్ర-
భీముసికరణిఁ గోపించి యిట్లనియె :
"ఎట్టురా! పార్థుఁ డేలేనిచోట
నిట్టు నాపురిఁ జొర నెవ్వఁడు వాఁడు!
పొట్టగ్రొవ్విన చందములు గాక, కికురు-
పెట్టిపోయెదునట్టి బీరములు గలవె!
ఎటుపోవవచ్చు నాయెదుట ; నెందున్నఁ
బటుభంగి రథముతోఁ బట్టి వేతెత్తు.

పోదఁడు యాదవులార! పోలఁతియుఁ దానుఁ
గదలి యాతఁడు దవ్వుగాఁబోకయుండ."
అనివిజృంభించిన, హరి రాముఁజూచి
వినయసంభ్రమములు వెలయ నిట్లనియె:
"విను రామ, నిలునిలు వేగిరపడకు;
మెనయ నాతఁడు దవ్వు కేఁగు నింతకును;
యతిమాత్రుఁడన నేల! యతఁడర్జునుండు;
మతి నేఁడెఱింగితి మగఁటిమి చూచి.
హితమతి నేనుండ నిట్లేఁగెఁగాక,
యతివకై పురమెల్ల నాహుతిగొనఁడె!
ఎప్పుడే నొకనికి నీవలెఁ గన్య;
నప్పాండవుఁడు పెండ్లియై పోవనిమ్ము.
అగణిత గాంధర్వమను వివాహంబు
తగుచోటఁ గలిగించె దైవంబుసతికి.
గొనకొన మేనత్తకొడుకు చూచినను;
ఘనత నాతనిసొమ్ము గైకొన నతఁడు.
వలవదు నీకేటివలవనిఱంతు!
కలహింప శక్యమే కౌంతేయు మొదల"
అనిన, రాముఁడు వింజమాఁకిడినట్లు
దనుజమర్దనుమాట దాటంగనోడె.

## అర్జునుఁడు సుభద్రతో నింద్రప్రస్థము సేరుట

అంతనక్కడఁ బార్థుఁడటపోయిపోయి
కాంతి నింద్రప్రస్థకటకంబుచేరి,
తనయూళ్లవారలెంతయుఁ దన్నుఁగూడి
చనుదేర, మిక్కిలిసంభ్రమంబునను
ఇంతిసుభద్రతో నిట్లను: "నీవు
వింతగాఁ బాంచాలి వెస మున్ను గదిసి

మ్రొక్కుము ; నిన్ను నాముదితదీవించు ;
నకాంతదీవెన వ్యర్థంబుగాదు."
నావుడు నయ్యింతి నాథునియాజ్ఞ
[1] వేవేగ నాకాంత వీక్షించి మ్రొక్క,
ననయంబు నాసాధ్వి యాదరంబమర :

..........................

"వెలఁది, నీపురుషుండు విజయుఁడౌఁగాక ;
తలఁపంగ వీరమాతవు నీవుగమ్ము."
అనుచు దీవించుచో, నంత నర్జునుఁడు
చనుదెంచి యన్నకు సద్భక్తి మ్రొక్కి,
భీమధౌమ్యులకును బ్రీతిమై నెఱఁగి,
యా మాద్రిసుతుల నొయ్యనఁ గౌఁగిలించి,
కరమొప్పఁ దనయాత్రకథలెల్లఁ జెప్పి,
హరిసత్త్వమున యాదవావలిఁ ద్రోచి
హరిణాక్షిఁ దెచ్చినయదియును జెప్పి,
సరస [2] రీతులఁ బథశ్రాంతి దీఱంగ
సరస [3] సుభద్రుపచారముల్ సేయఁ,
బరమానురాగ సౌభాగ్యుఁడై యుండె.
అట వారిజాక్షుండు ననుజభర్తకును
దటుకున నరణంబు దానిచ్చువేడ్క
సారణ బల సాంబ శైనేయ ముఖ్య
వీరులు సేవింప వేవేగఁ గదలి,
కరి రథ హరిభటుల్ గదిసికొల్వంగ,
వర భేరికాహళావళులు ఘోషింప,
హరి యింద్రప్రస్థ మహాపురంబునకు
నరుదెంచి, యాపాండవాత్మజులకును

1. వేవేగఁ జనికుంతివీక్షించి మ్రొక్క. 2. ధీరుల. 3. సుభద్రోపచారముల్. (మా)

వేయియేనుంగులు వేర్వేఱ నిచ్చి,
యాయర్జునున కంత సరణంబు గాఁగ
[1] వేఁయిరథములు నూర్వేల ధేనువులు
వేయిమదించిన వేదండములు
సింధుబాహ్లీక పారసీక కాంభోజ
గంధర్వలక్షలు క్రమముతో నిచ్చి,
ధారుణీపతి యంతఁ దన్ను బూజింపఁ
గోరిక లిగురొత్తఁ, గొంత కాలంబు
విందులు గుడుచుచు వియ్యంకు లనక
యందు వినోదించి, యంత నందఱును
ద్వారక కేఁగుచోఁ, దాఁబోక వేడ్క-
శౌరి యర్జునుతోడ సద్గోష్ఠి నుండె.

## ఉపపాండవోత్పత్తి

కాలక్రమంబునఁ గాంతసుభద్ర
యాలోన గర్భిణియై పుత్త్రుఁ గనియె.
అభిమన్యుఁడను నామమతనికి నిచ్చి .
యభిమతి ధౌమ్యుఁ డొయ్యనఁ జేసె క్రియలు.
ద్రౌపదీపుణ్యకాంతయు నంతఁ గ్రమము
దీపింప ధర్మసూతికిఁ బ్రతివింధ్యు,
నెఱయ వేడుకఁ బావనికి శ్రుతసోముఁ,
దెఱఁగొప్ప నింద్రసూతికి శ్రుతకీర్తి,
నలిఁ బూర్వమాద్రేయునకు శతానీకు,
నలువొప్ప సహదేవునకు శ్రుతవర్మఁ
గాంచినఁ, దోడ్తోనఁ గావించె ధౌమ్యుఁ
డంచితసత్క్రియ లక్కుమారులకు.

1. వేయిమదెమల నూఱువేల. (మూ)

భూపాలగృహములఁ బుత్త్రోత్సవంబు
దీపించె ధర్మవృద్ధికి మూలమగుచు.
అక్కడ దుర్యోధనాదులు గనిరి
[1] లక్కనుఁడాదిగా లలిఁగుమారులను.
అంత, వేసవికాల మఖిలజీవులకు
సంతాపభయము నసౌఖ్యంబుగలుగఁ
దవిలినఁ, దమ వేఁడి తారోర్చలేక
రవికిరణములు నీరముద్రావసనఁగ
మనుజికి చెఱువులు మడుఁగులు నూతు
లనువాఁ నేళ్ళు నొయ్యన గిత్తలయ్యె ;
[2] ఆటలకోఁటల నలుల పాటలును
కాటలపవనంబుఁ బలుమాఱు వీఁచెఁ ;
గరములదోసిళ్లఁ గమలముసదులఁ
గరులు సంధ్యలువార్చు గతిఁ జల్లుకొనియె ;
మిక్కిలి [3] పులివోలె మృగతృష్ణగలిగి
యెక్కడఁగదలిపోనీయదు దినము ;
పావకుం డచలంబు ప్రక్కలు చూడ
జేవురించుచు తాలచేఁజెట్లువడియె ;
నెమకి వీసంబంతనీడగల్గినను,
నెమరువెట్టుచు నిర్గునిలుచు నచ్చోట ;
పగలు క్రాఁగిన నేలఁ బావకోదయము
తగునన సూర్యకాంతంబులుమండె ;
కమలాప్తుఁడయ్యును గమలాకరముల
కమలంబు రవి గ్రోలి కమలారియయ్యె ;
ఛాయఁ బాయక [4] నిల్చు సవిత్రుఁడన్నట్లు
ఛాయాప్రియంబయ్యె జగతిజీవంబు ; (!)

---

1. లక్ష్మణపదమునకువికృతి. 2. ఆటులతికలనలుల బాధలను. 3. పురినోలె.
4. గెల్చు. (మూ)

వర చంప కాంభోజ వకుళ మల్లికలు
దిరిసెంబుఁ గ్రోవి మోందెనయును బూచె;
[1]యువతిపాంథుల తల్పయోగంబుపోలె
దినసంబు లఫలిత [2]దీర్ఘోష్ణమయ్యె.
అట్టివేసవియందు హరియు నర్జునుఁడు
దిట్టలై యమునానదీతీరభూమి
విహరింప, నొకవృద్ధవిప్రుఁడై కదిసి
దహనుండు వారినిద్దఱను వీక్షించి:
"దీపసంబయ్యెడుఁ దృప్తిగా నశన
మెప్పుడు రే మాకునొసగ మీ" రనిన
వా: "రెప్పుడునకు నీకు వాంఛయొ?" ట్లనినఁ,
బాఱుఁడిట్లనె: "వహ్నిఁ బ్రభులార, యేను;
నూతన ధనశక్తి నూఱేండ్లక్రతువు
శ్వేతకియను రాజు సేయంగఁదలఁచి,
హోతలఁ దర్శింపనొపక పోయి
శ్వేతాద్రిఁదపమున్న, శివుఁడంతఁగదిసి:
"నీతలంపెఱిఁగితి నృప, [3]సత్రయాగ-
హోతలఁగోరితి వాకటిచెప్పెదను.
గారాముతో నేయి కగికరాకార-
ధారఁ బండ్రెండేండ్లు దహనులోఁ దొలుతఁ
దొరఁగింపు; మందుఁదోతుదు హోత." లనిన,
హరుని వీడ్కొనివచ్చి యతఁడట్లుచేసి
హోతలఁబుట్టించి, యొగివారుఁదాను
జాతిగా నూఱేండ్లు జన్నంబు సేయ,
నటుగమిపుట్టె యే నజుఁగానఁబోయి,
యెఱిఁగించి దీనికి నేదిమందనిన:

---

1. పాంథయువతులని కవి ఆశయము గాఁబోలు. ఈవేసవివర్ణనమందలి అర్థము అంత విస్పష్టముగా లేదు. 2. దీర్ఘోష్ణమగుచు. 3. సత్ర. (మా)

'ఖాండవమను తోఁట గాల్పుము ; నీకు
నుండు నిక్కువమందు నొనరెడుమందు ;
అదియు నింద్రునితోఁట.' యని బ్రహ్మ చెప్పఁ,
గదలి యేఁబోయి యాఖాండవవనము
కాలుపఁ, గోపించి కావలివారు
వేలసంఖ్యలు నన్ను వెడలనేయుటయుఁ,
గ్రమ్మఱ నాహేమగర్భునిఁ గదిసి
యిమ్ముల నాచంద మెఱిఁగింప నతఁడు :
"తత్తరింపకు ; తోఁట తవిలి నీకొసగ
వత్తురు విజయుండు వాసుదేవుండు ;
అప్పుడు నీకోర్కి యగుఁగాక ; నేఁడు
చప్పుడుగాకుండఁ జను." మన్న, నేను
నుండితి నొదిగి ; నేఁడొగి మిమ్ముఁగంటి ;
నిందు ఖాండవభిక్ష యిది నాకు రక్ష."
అనఁ బార్థుఁడిట్లను : "నట్లైన మాకు
ననిమిష పతితోడ నాజి గాఁగలదు ;
తగినయమ్ములు విల్లుఁ దగినరథ్యములుఁ
దగిన తేరును లేవు తలపోయ మాకు ;
శౌరికిఁ దగినయస్త్రము లేదు మొదల ;
నేరితి !" యనుటయు, నింతలో నగ్ని
వరుణదేవుని నాత్మ వగచి రప్పించి, —
వరుణునియింటఁ బూర్వమునఁ జంద్రుండు
దిక్కులుసాధించి ధృతి డాఁచినట్టి
యక్కజంబైన విల్లా గాండివంబు,
సమరభయంకరాక్షయ తూణబాణ
యమలంబు, గంధర్వహయములరథము
నరునకుఁ దగనిమ్ము ; నాఁటిచక్రమును
నురుగదయును శౌరికొసగుము పొసఁగ.

నాకార్యమునకు యత్నము సేయువీరి
కీకలాపములేక యేదియుఁగాదు."
అనిన నన్నియుఁదెచ్చి యతఁడచ్చిపోవ,
ననువుతో నరుఁడు నారాయణుఁజూచి:

## ఖాండవదహనము

" యేరథికుండనయ్యెద ; నిందునీవు
సారథ్యమొనరింపు సత్కృప. " ననుచు
లాలిత సింహగోలాంగూల కేతు-
ఖేలన ధవళాశ్వ కీలితరథము
నాయుధసన్నద్ధులై వేడ్కనెక్కి,
యాయగ్ని వెఱవకుమని యూఱడించి,
ఖాండవవనవీధిఁ గాల్పఁబుచ్చుటయు,
నొండొండ దరికొని యుగ్రుఁడై వహ్ని
నాకంబుపొడవుగా నాల్కలువాఱ
భీకరధ్వనితోడఁ బేర్చికాల్పంగఁ,
దెరువులులేక మ్రందెడుమృగంబులును,
సరసరఁజనలేక వ్రగ్గుపక్షులును,
[1] మలఁగుచోటునులేక మ్రగ్గుసర్పములుఁ,
గలఁగిమడువులలోనఁ గందుమత్స్యములు,
మిడుఁగుఱుఁగాడ్పున మృతిఁబొందుకపులు,
నడవిఁగ్రమ్మిన మంటనణఁగెడు తరులు,
నిగుడుపువ్వులతోన నీఱైనలతలుఁ,
బొడవుగా దరికొనుపొదరిండ్లుఁ గలిగి
వెనుకొని మిన్నంటు వేఁడిగా మంట
వనమువెంటనె పర్వ. వనపాలురార్చి

1. మలంగజాటున. (మూ)

పదివేవు రుద్దండబలులు బాణముల
వదలించి యగ్ని నేయఁగఁ, జూచి నరుఁడు
తెంపున నచటికిఁ దేరుఁదోలించి
యంపకోలల వాన నావీరవరులఁ
గప్పినఁ, దమచేతఁగాక వారరిగి
యప్పుడింద్రునితోడ నది చెప్ప నలిగి:
"తొఁగుకైన నొకమాఱు తొలిసఁబోవు;
గడుసన్న నొకపని గాదన్నమాను;
బలుపునాలుగ మూలఁబడియు నిళ్లల
తొలఁగక యాచిచ్చు తోఁటకువచ్చు!
మఱియు బహ్వాశిత మనునమార్గునకు
నెఱిమండువాసికి నీతియొక్కఁడిది!
తక్షకుఁడక్కటా! తనయులుఁ దాను
నక్షీణగతినుండు నందుఁగాపురము;
ఏమయ్యెనో! వాని నేఁగాతు." ననుచు
వే మేఘములఁదెచ్చి వినువీధిఁబన్ని
ఘోరవర్షము వజ్రి గురియించి యుదక-
ధారల నయ్యగ్ని తడియుకుండినను,
ఘనపుష్కలావర్తకంబులచేతఁ
బొసరఁ గుంభద్రోణములు గురియింప
నుఱియనిపందిలి యుగ్రబాణముల
నెఱచిచ్చుపైఁబన్ని యింద్రనందనుఁడు
వినువీధి మొగిళులు వివ్వనేయుటయు,
ననిమిషపతి యల్గి యాయగ్నిమీఁద
నెఱిపిడుగులవాన నిగిడింపఁ, బార్థుఁ
డుఱక యాశిఖి 'నోడకోడకు' మనుచుఁ
బెనుగాడ్పు తూపులఁ బిడుగులమొగులు
వినువీధివిప్పిన, వెండియు వజ్రి

సుర యక్ష కిన్న రాసుర సిద్ధ సాధ్య
గరుడ గంధర్వ వర్గము నగ్నిమీఁద
ననిచినఁ, గాండీవి యానేననెల్ల
ననిచిన దివ్యబాణప్రభావమున
మంత్రభస్మము భూతమండలిమీఁద
మాంత్రికుండొదవించి మఱి విప్పునట్లు
తఱిమిన, నిలువక దైవతసేన
పఱచె నిప్పులుచల్లి పావకుండార్వ.
అంతఁ దక్షకసూనుఁ డశ్వసేనాఖ్యుఁ
డెంతయు భయముతో నెలదోఁటనుండి
తనతోఁకఁ గఱపించి తల్లిఁదోకొనుచు
వినువీథికెగసిన, వీక్షించి నరుఁడు
వాలమ్ముచే వానివాలమ్ము తల్లి-
తో లీల నగ్నిలోఁ దొరఁగ ఖండించి
మఱి వానినేయుచో, మఘవుండు మాయ
మెఱయించి విడిపించె [1] మిత్రనందనుని.
విను మంత నప్పాము వెసఁబోయి కర్ణు
దొనఁజొచ్చి యర్జునుతోడివైరమున :
"నరునిఁజంపెదఁ గర్ణ, నన్నాజిఁ దొడుగు;
మిరవైనగతి నమ్ము నేనీకు నమ్ము.
హరిహరబ్రహ్మాదు లడ్డమైరేని
మరలఁజుమీ! చంపె మాతల్లినతఁడు."
అనుటయు, ధూప దీపాదుల నతని
నొనరఁ బూజింపుచునుండెఁ గర్ణుండు.
ఇట జాలవాన నయ్యింద్రుండు గురియఁ,
బటులీల నగ్నిపైఁ బడకుండ నరుఁడు

1. మంత్రి. (మూ)

నిసుముగా నేసిన, నింద్రుండు మఱియు
వెస నద్రిశిఖరముల్ విఱిచి వైచినను,
వజ్రాస్త్రముల వాని వాసవి దునుమ,
వజ్రితో నాకాశవాణి యిట్లనియె:
"విడుమింక దేవేంద్ర, వీరాదిమునులు
జడియరునీచేత; 'సకలయత్నములఁ
గాలు నీయగ్నిచే ఖాండవవనము
వాలాయ' మనుబ్రహ్మవాక్యంబు గలదు.
ఈయగ్నిభయమున మున్నె యేఁగె తక్షకుఁడు
పోయెఁ గురుక్షేత్రమున కిందు లేఁడు;
ఈసంకటపుఁగోటి నీఁగెడుపాటి
చేసూటిగల మేటి చెడఁడు కిరీటి."
అనుటయు, దేవేంద్రుఁ డమరులుఁ దాను
ఘనయుతుండై యేఁగెఁ గలహంబుమాని.
నలినంత మయుఁడునా నవ్విశ్వకర్మ
చెలువఁడై ఖాండవస్థలినుండుఁ గాన
దరలి వహ్నికిఁ గాక తక్షకగృహము
చొరఁబాఱి వెడలక చుట్టును బెట్టి
సుడిగాడ్పుతో నందుఁజొచ్చి పావకుఁడు
తడవుచుఁ బోనీక తన్నాక్రమింప,
బలిమి నయ్యగ్నిలోఁ బడలేక మయుఁడు
బలభేదిసుతు నిట్లు ప్రస్తుతిచేసె:
"కావవే యర్జున! కరుణావిధేయ,
పావకశిఖలోనఁ బడియున్నవాఁడఁ;
దక్ష[1]కాదులకును దాత నన్నెఱుఁగు;
లక్షింపఁ బెద్దకాలమునాఁటివాఁడ;

1. రాక్షసులకు. (మూ)

శరణాగతత్రాణచరితుండ వంచు
శరణంటిఁ; గావవే చక్రిసహాయ!
ద్రుపదబంధనలోల, ద్రోణసంస్తుత్య,
కపటఖేచరయంత్ర ఖండనోద్దండ,
రణరంగభీకర, రాధేయవిజయ,
ప్రణవకోవిద, దివ్యబాణప్రవీణ,
శ్వేతవాహన, బాహువిహితగాండీవ,
నాత...గొంరయగు నన్నుఁగావు." మనిన
మయునిఁబోనిమ్మని మంటకుఁ జెప్పి,
ప్రియముతో రక్షించె బీభత్సుఁడతని.
లావుకపిట్టయై లావుకియందు
బావుగా మును మందపాలుండుగనిన
మొలకఱెక్కలఁ బచ్చిముక్కులతోడ
నలువురుకొడుకులు నాగేంద్రుఁడొకఁడు
మయుఁడునుదప్ప, సమ్మంటలో భస్మ
మయమయ్యె జంతుసామగ్రితో వనము.
ఆరీతి ఖాండవం బాహుతిఁగొనిన,
నారోగ్యమునుబొంది యనలుఁడుప్పొంగి
నారాయణునిఁజూచి నవభక్తియుక్తి
గారవంబేర్పడఁ గదిసి యిట్లనియె:
"కమలాక్ష, యీవును ఘనుఁడర్జునుండు
నమితవైభవశక్తి నలరి యిచ్చోట
దేవేంద్రుతోఁబోరి దివ్యబాణముల
వావిరి నవ్వేల్పు వదలంగఁ దోలి,
నాకోర్కెఁగావించి నలువొప్ప జయము
చేకొంటి; రిదిచూడఁ జిత్రంబుగాదు!
నరసహాయుండవై నవ్య తేజమున
ధరణిభారంబెల్లఁ దగమాన్పఁబూని

సప్రతాపుండవై జనియించునీవు
నీప్రయోజనమెంత యెన్నిచూడఁగను!
నీప్రభావముఁ గాననేరఁడు బ్రహ్మ;
నీప్రభావముఁ గాననేర్తునె యేను!"
అనుచు వైశ్వానరుఁ డావాసుదేవుఁ
గొనియాడి, వేడ్కతోఁ గొమరొప్పఁ గ్రీడి
దీవించిపోయిన, దివిజులు మెచ్చ
నావేళఁ గృష్ణుండు హర్షింపుచుండె

### శివుఁడు ప్రత్యక్షమై కృష్ణార్జునులఁ బ్రశంసించుట

అంత మహాదేవుఁ డధికసంతోష
మెంతయు దైవాఱ నింపుసొంపలర
నందికేశ్వర భృంగినాథ విఘ్నేశు
లందంద షణ్ముఖులాదిగాఁ గలుగు
ప్రమథగణంబులు బలిసి సేవింప,
సమితవైఖరిఁ గూడ నష్టభైరవులు
హరి వహ్ని యమ దానవాంబుప వాయు
నరవాహనాదు లున్నతభక్తిఁ గొలువ,
సురముని కిన్నరా సుర సిద్ధ సాధ్య
గరుడాప్సరో యక్ష గంధర్వవరులు
వరుసతోఁ జేరి కైవారముల్ సేయఁ,
బరమమునీంద్రులు ప్రణుతిగావింపఁ,
దుంబుర నారద స్తుతిగీతకళలు
పంబిన ప్రీతితోఁ బరిపాటివినుచు
సకలవాద్యధ్వనుల్ చదలఁబర్వంగఁ
బ్రకటమై జయజయభాషలు చెలఁగఁ,
బరమానురాగసంపద నేఁగుదెంచి
హరి ఫల్గునుల యగ్రమందొప్పనిలువ,

నప్పుడు శ్రీకృష్ణుఁ డమరేంద్రసుతుఁడు
నుప్పొంగి సన్నుతు లొలిఁగావించి,
[1] పొనరఁ గరాంబుజమ్ములు భక్తి మోడ్చి
వినయ వినమ్రులై వినుతించిరిట్లు :
" శర్వ, సర్వేశ్వర, శాంభవీరమణ,
సర్వజ్ఞ, సర్వాత్మ, సచ్చిదానంద,
నిర్వికల్పకభావ, నిగమాంతవేద్య,
నిర్వికార, నిరీహ, నిర్వాణగమ్య,
గజదైత్యసంహార, గజచర్మధార,
గజరక్షసన్నుత, గజవక్త్రజనక,
నిన్నెఱుంగఁగ లేవు నిఖిలవేదములు ;
నిన్నుగానఁగ లేవు నిఖిలశాస్త్రములు ;
నేమెంతవారము నీతత్త్వమెఱుఁగ ;
సోమార్ధశేఖర, సురుచిరతేజ ! "
అనుచు నివ్విధమున హరియు నర్జునుఁడు
వినుతులు సేయంగ విశ్వేశుఁడలరి
చిఱునవ్వుదళుకొత్తఁ జెలఁగియిట్లనియె :
.........................
" జలజాక్ష, నీతోడసఖ్యంబుగలుగఁ
జెలఁగి పూజ్యుఁడనైతి సకలలోకముల ;
కమలాక్ష, నన్నాదికాలంబునందు
భ్రమరకీటన్యాయపద్ధతి వేడ్క
నీవు ప్రతిష్ఠింప నిత్యుండనైతి ;
నీవుసంకల్పింప నెఱిఁ దృణంబైన
నావేల్పుశైలమా నఖిలలోకేశ !
....................
....................

1. యొనరకరంబుల భక్తియుఁ మోడి. (మూ)

అల నరనారాయణాఖ్యులు మీరు
కలిత తేజోధర్మ ఘనపరాక్రములు.
భూభార మిరువురుఁ బూని మాన్పుటకు
భూభువనంబునఁ బుట్టితిరిట్లు.
ఖాండవదహనంబు గావించినట్లు
కాండాగ్నిఁ గూల్పుఁడు ఘనశత్రుతతి.
కృష్ణసఖుండైన కృష్ణాప్రియుఁడుఁ
గృష్ణాభిధానంబు గీల్కొనుఁగాక."
యని కృష్ణనామంబు హరిసూతికొసఁగి
ఘనముగా బహుదివ్యకాండజాలంబు
సురలచే నెల్లను శుభమంత్రశక్తి
నరునకిప్పించి, యిష్టంబుమెఱయ
( దేవదత్తమునిచ్చి,) దేవదేవుండు
దేవేంద్రునిట్లనుఁ దేటనవ్వెసఁగ :
" వాసవ, ఖాండవవనమున కేను
మోసపోయితినని మొగిఁగుందవలదు ;
ఆరీతి ననలున కఱుగిమిచేయు-
కారణంబున కిట్లుకమరె నవ్వనము.
ఈఖాండవమ్ముపోయిన నేమి ! నీకు
నాకేశ, యున్నది నందనవనము.
తొల్లిటికంటెను దోరంపుతోఁట
యెల్లవృక్షంబుల నెల్లపూఁబొదల
మొల్లమై ఫలముల నుల్లసిల్లుచును
ఫుల్లలతాజా (లపుం) జిత్రభ్రమర
కోకిల శుకపిక కూజిత యుక్తి
నేకాలమునుగల్గి యింపొందుఁగాత. "

మనుచు గౌరీశ్వరుఁ డమరనాథునకుఁ
దనరంగ వరమిచ్చి తద్దమోదమున,
వినుతులు సేయుగోవింద ఫల్గుణుల
(నొనరవీ) డ్కొని, సురయూధంబుగొల్వ
సకలమునీంద్రులు సన్నుతిసేయ
నకలంకగతి నేఁగె నాలయంబునకు.
వనజజుఁడాదిగా వరములొసఁగి
చనిరంతఁ దమ నిజస్థానంబులకును.

### ఇంద్రుఁడర్జునునకు దివ్యాస్త్రములొసగుట

అంత దేవేంద్రుండు నాత్మజుమీఁద
నెంతయు వేడ్కఁ ననేక బాణములు
నరునకర్మిలినిచ్చి, నారాయణునకు
నురుహార మకుట కేయూరంబులిచ్చి,
మమత [1] వీడ్కొనిపోవ, మయుఁగూడి ధరణీ-
రమణులు వచ్చి రింద్రప్రస్థపురికి.
హరిచేఁ గిరీట మిట్లందుటఁ జేసి
నరునకబ్బెఁ గిరీటినామధేయంబు.
ఇదియాదిపర్వంబు హితరాజసభల
విదితమై వర్ధిల్లు విద్వాంసులలర.
అని యిట్లు జనమేజయక్షితిపతికి
ముని మున్ను చెప్పినముఖ్యమార్గమున
నక్కథకుఁడు శౌనకాదిసన్మునుల
కక్కథ వినుపింప హర్షించివారు
అతనిఁబూజించి యనఘులుమునులు
అతరువాతి వృత్తాంతమేమనిన,

1. చేకొని. (మూ)

ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్త్ర
మతిమద్విధేయ తిమ్మననామధేయ
రచితాదిపర్వ నిర్మలకథయందు
నుచితాష్టమాశ్వాస మొనరనింపొందె.

ఇది యాదిపర్వము. శ్రీ



# ప్రథమాశ్వాసము



శ్రీసమంచితనేత్ర, శృంగారగాత్ర,
కోసలావనినాథ, గుణశోభి, రామ,
ఘనసార కస్తూరికా గంధసార
ఘనసారవక్ష, రాఘవ, చిత్తగింపు.
అవిరళయశుఁడైన యక్కథకుండు
శౌనకాదులకును సన్మునీంద్రులకు
మానితంబైనట్టి మహనీయచరిత
మానందమునఁ జెప్పె; నటధర్మసుతుని-
కడ శౌరిసహితుఁడై కడఁకతో నున్న
జడధిగాంభీర్యుండు శక్రసూనునకు
మయుఁడు వేడుక మ్రొక్కి మఱి భక్తిఁ బలికె:
"నిఱుమింప నభయంబు నిన్ను వేఁడినను
గాచితి నన్ను బ్రఖ్యాతంబుగాను;
వైచిత్రిఁ బ్రాణంబు వడి నిత్తినట్టి
యుపకారపరుఁడవై యుండిననీకు
నుపకార మొనరింప నోపనేరుతునె!
యైనను నానేర్చినట్లు నీకిపుడు
కానుపింపఁగ నుపకార మొనర్తు.
ధర్మాత్మ, వినుము నే దానవవిశ్వ-
కర్మను; శిల్పమార్గమున నేర్పరిని;
నీవుగోరినయవి నిర్మింపనేర్తు;
భావించి పనిగొను భక్తితో." ననిన
నరుఁ డచ్యుతునివదనంబు వీక్షించి
పరమానురాగుఁడై పలికె నేర్పునను:

"ఇతని నపూర్వంబు నెయ్యదిదైన
నతిరూఢి నిర్మింప నానతియిండు."
అనినఁ బెద్దయుఁ బ్రొద్దు నాత్మఁ జింతించి
వనజాతనేత్రుండు వారిజోదరుఁడు
మయునకుఁ బలికె సమ్మదచిత్తమునను:
"ప్రియుతోడఁ గురుపతికిని యుధిష్ఠిరున
కధిపసంసేవ్యమై యమరినయట్టి
పృథుసభ నిర్మించి పెంపుతోఁ దెమ్ము
మహిమగా." ననవుడు మయుఁడిట్టులనియె:

## మయసభానిర్మాణము

"మహిలోనఁగల రాజములలోపలను
బెద్దయై హరిజంభభేది లక్ష్మలకు
నెందైన నధికుఁడై యాధర్మసుతుఁడు
మించెఁగావున, సభ మిక్కిలి యేను
గాంచన నవరత్న ఖచితమై యొప్ప
నిర్మించి తెచ్చెద నిఖిలంబు నెఱుఁగ
మర్త్యంబులైన విమానవైఖరుల.
వృషపర్వుఁడను దైత్యవిభునకుఁ దొల్లి
సుషమాభిరామమై శోభిల్లుసభను
నిర్మింపనుకట్టి, నిఖిలరత్నములు
ధర్మంబు సమకూర్చి బహువిచిత్రములు,
బిందు [1] సరంబను బిసరుహాకరము
నందు దాఁచినవాఁడ; నన్నియు వేగఁ
దెచ్చెద." ననుచు యుధిష్ఠిరుచేత
నచ్చుగా సత్కృతుండై మయుండేఁగె.

---

1. శతంబను. (మూ)

నారాయణుండు పాండవుల వీడ్కొనుచు
ద్వారావతికి నేఁగెఁ దత్క్షణంబునను.
మయుఁడు పూర్వోత్తరమార్గంబులందు
రయమున నేఁగి కైలాసాగ్రమున
కుత్తరదిశను నత్యుత్తమంబైన
సత్పగు మైనాకశైలంబునందుఁ
గనకశృంగము గాంచి ఘనతనిట్లనియె.
"మనసిజారాతి సమస్తలక్ష్ములను
సచరాచరంబైన జగముల నెల్లఁ
బ్రచురంబుగా సృజింపఁగఁ జూచె నొక్కొ!
గంగ ప్రత్యక్షంబుగాఁ జూచి మున్ను
[1] అంగీకుండైన మహాభగీరథుఁడు
తపమిందుఁ జేసెనో తర్కించిచూడఁ!
త్రిపురహరధ్యాన ధీమంతుడైన
నరునకు శ్రీకృష్ణునకు నివాసంబు
కరమర్థి నయ్యెనో గౌరవంబునను;
సురయుతుఁ సన్నుని సోమంబు క్రతువు
లరుదారఁ జేయు నయ్యావాసమొక్కొ!"
యని చిత్రములు గల్గి యమితయూపములఁ
బెను [1] పొందుచున్నట్టి బిందుసరమునఁ
గమనీయ రత్నోపకరణచయంబు
క్రమమొప్పఁ గైకొని, ఘనవిప్రతతుల
నారాధనముచేసి, యతిశయమునఁ
జారుతరంబైన సభ సృజియింప
నవకమైనట్టి రత్నపుఁదూలములను
వివిధమణిస్తంభ [2] విసరణంబులను

1. ఈపదమును పదింపదిగా వాడుచుండును ; అర్థమూహ్యము. 2. పొందనున్నట్టి బింబోదరమున. 3. విసరంబులందు. (మూ)

నీలపుగోడల నిగుడుకోటలను
బ్రాలేయ కిరణ విస్ఫార వేదికల
మహిత విచిత్ర కోమల సౌధములను
మహనీయ దేదీప్యమానంబుగాను
నిర్మింప, సభయును నిఖిలరత్నముల
నిర్మలంబై యొప్పె; నెఱయ నొక్కెడను
హరినీలకిరణ జలాంతరంబందు
నరుణరత్నములు తోయజములై తోప,
రాజిత సితనవరాజీవ తతులు
రాజహంసంబులై రమణదీపింపఁ,
గమనీయ సౌవర్ణ కలశముల నెడి
యమితకూర్మంబుల, నద్భుతంబైన
వైడూర్యములను బావనకుముదముల,
నీడెన్నఁగారాని హీరాంకురముల
మీనసంఘంబుల, మేటిముత్యముల
ఫేనపుంజంబులఁ, బెంపుగాన్పించు
మరకతమణులనుమహితశైవాల
భరమునఁ గనుపట్టెఁబద్మాకరంబు.
చెలువమైఁ బటికంపుశిలలవిద్యుతులు
గలకుట్టిమంబులు కాంతులమించి
నయమొప్ప నదులుగా నలరుఠావులను,
బయలెల్ల జలము [1]లన్భ్రమపుట్టఁజేయు
కమనీయ మణివిటంక ప్రదేశముల,
సముచిత దళశత స్వచ్ఛహాస్తముల
వెడలుపు నిడుపుల విస్తారమగుచు
నొడికమై చిత్రమై యొప్పు తత్సభను

1. లై భ్రమ. (మూ)

బదునాల్గునెలలు నిర్భరప్రీతితోడ
ముదమున నిర్మించి, ముఖ్యదానవుల
నెనిమిదివేల నహీనసత్త్వులను
మునుమిసిపన్నించి మోయించుకొనుచుఁ +
దెచ్చి ధర్మజునకుఁ దేజంబుతోడ
నిచ్చి, భీమునకును నెక్కుడైన
గదయుఁ బార్థునకు శంఖంబును నొసఁగ,
సదమలయశుఁడైన శమనజుచేత
సర్మిలి సత్కృతుండై మయుండరిగె.
ధర్మసూనుండు ధర్మమార్గమున
ధర్మజ్ఞులైన ధరణీసురులకు
నిర్మలమతులకు నీతిమంతులకుఁ
బదివేవురకు భక్తిఁ బాయసాన్నంబు
విదితవేదోక్తులు వెలయఁ బెట్టించి,
మణిముద్రికల వస్త్రమాల్యగంధముల
గణనకెక్కఁగ నలంకారులఁ జేసి, (?)
వేయేసిగోవుల వేదవిప్రులకుఁ
బాయక భక్తితోఁ బ్రఖ్యాతినిచ్చి,
లాలితంబగు శుభలగ్నంబునందుఁ
త్రైలోక్యగురుఁడైన ధౌమ్యభూసురుని
పుణ్యాహవాచన పూర్వకంబుగను
గణ్యమనస్కుఁడై ఘనతఁ దత్సభను
ఉనికిమై యుండె సత్యోన్నతశ్రీల.
మనుజేశ్వరుఁడు నంత మహితసత్కృపను
భూదేవతాకోటిఁ బూజించి, సర్వ
వేదశాస్త్రంబులు వినుచు, సంసిద్ధి
నమితదానంబులు నాచరింపుచును,
గ్రమముతో నర్థిసంఘములఁ బ్రోచుచును,

దిక్కులయందు సత్కీర్తి నిల్పుచును,
మక్కువ బంధుసమూజంబు నెల్ల
గారవింపుచు, సత్యగౌరవంబులను
బేరంది, భూతిచేఁ బృథివి యేలుచును
ఆదిరాజచరిత్రుఁడై యుండునంత,
నాదరచిత్తులై యైశ్వర్యమహిమ
పత్రంబులతోఁ బూర్వపశ్చిమశైల
దక్షిణోత్తర ధరాధరమధ్య విశ్వ
ధారుణీంద్రులు, భద్రదంతావళములుఁ
జారుఘోటకములు సౌవర్ణములును
నవరత్నములును నానావస్త్రములును
యువతుల మృగమదవ్యాప్తగంధములు
నాందోళికలును ముక్తాతపత్రములు
సందీపితధ్వజ సముదయంబులును
దివ్యభూషణములు దివ్యాయుధములు
దివ్యరథంబులుఁ దెఱఁగొప్పఁదెచ్చి
యిచ్చి సాష్టాంగంబులెఱఁగి సేవింతు
రిచ్చలో సొంపున నెల్లకాలంబు
ధర్మజు నమితప్రతాపసంపన్ను
నిర్మలచరితుని నీతిమానసుని.
అధర్మసుతుఁడును నఖిలరాజులను
ఆదరింపుచునుండు నవసరంబునను,
కలశజ కపిల మార్కండేయ కుత్స
జలజాతభవసమ శాండిల్య వత్స
శౌనక శుక పరాశర కణ్వ గాధి-
సూను గౌతమ గార్గ్య సోమ మాండవ్య
మునిశేఖరులు వచ్చి మును ధర్మసుతుని
ఘనసభాస్థలి వివేకమున భూషింప,

నామహామునులను నర్ఘ్యపాద్యములఁ
బ్రేమతోఁ బూజించి పెంపగ్గలించి
వారిచేఁ గథలెల్ల వలనొప్ప వినుచు
ధారుణీనాథుండు తమ్ములుఁ దాను
సుఖమున్న యెడల, నస్తోకవైఖరుల
నఖిలగుణోపేతుఁడగు నారదుండు
వచ్చిన, నెదురేఁగి వడిఁ జేసి పూజ
లిచ్చి యాసనమున నెంతయు నునిచి,
వారలఁ గుశలంబు పరుసతో నడిగి
నారదుఁ డాధర్మనందనుకిట్లనె :

### నారదుఁడు ధర్మరాజుని పరిపాలనావిషయములడుగుట

"మీవంశనృపతుల మేలునడయందుఁ
బావనమతిఁ జరింపంగ నేర్తువె !
ధర్మంబుదప్పక దయ చాలఁగలిగి
ధర్మకోవిదులను దయఁ బ్రోతువయ్య ?
మహినిఁ గామ క్రోధ మదలోభములును
సహజ మత్సర మోహ సన్నాహములును
బౌరయవుగద ! నీతి బుద్ధినూహింతె ?
పరరాజ భేదనోపాయంబుఁ దలఁతె ?
యపరగాత్రంబులయందుఁ జింతింతె
యుపమచేయఁగ రాని యుచితకృత్యములు ?
పృథుకీర్తులైన మీపెద్దలసాటి
బుధుల మంత్రుల విప్రపుంజంబుఁ బ్రోతె ?
నిజమంత్రములు ధారుణీనాథులకును
విజయమూలంబులు ; వివరింప నీవు
రక్షింపుదువె సుస్థిరంబుగా వాని
నీక్షితి జనులెల్ల నెఱుఁగకుండఁగను ;

భావింప మఱియు నీపౌరోహితుండు
భావజ్ఞుఁడే యెన్ని భంగులయందు?
జననుత, నీయజ్ఞసంఘంబులందు
ననఘ, యేమఱకుండునయ్య యాజ్ఞికుఁడు?
రణధురీణుల వితరణ గుణాకరుల
గణనకునెక్కిన ఘనయశోధనుల
మానుగా నీవు నమ్మఁగఁజాలువారి
సేనాధిపతులుగాఁ జేసితివయ్య?
పలుప్రధానులఁగూడి బలవంతులయ్యు
నిలఁ బక్షపాతులై యిలనాథసుతులు
ధనగర్వములను మదంబొందకుండ
ననిశంబు మెలపుదువయ్య నెయ్యమున?
వేద శాస్త్ర పురాణ విద్యలయందు
భూదేవులొనరిరె పూనినకడను?
రోగంబులెల్లను రూఢిగా మాన్పు
నాగమవేదులు నమృతహస్తులును
నగువైద్యులను నృప, యర్థిఁబ్రోచితివె?
జగతీతలేశ్వర, సద్గుణాంభోధి!
మఱియును నుత్తమ మధ్య మాధముల
నెఱిఁగి రక్షింతువే యెపుడువారలను?
కొలిచినవారికిఁ గోరి జీతముల
నలయింపకిత్తువే యాదరంబునను?
త్రాణతో మూలభృత్యశ్రేణి మనుపఁ
బ్రాణంబులిత్తురు భండనంబునను;
పరికింపఁగాఁ జోరభయవర్జితముగ
ధరణిఁబాలింతువే! ధనలోభమునను
దండి నేలవుగదా తస్కరావళిని?
మండలంబునఁగల మహిత తటాక

వనములు రక్షింతె వసుధాధినాథ ?
పెనుపొంద దున్నెడు పేదకాపులకు
లాలించి విత్తులెల్లను జాలనొసగి,
[1] భావంబుదప్పినఁ బన్నులు గొనక
వలనుగా మెలపుదా ? వాణిజ్యతతులఁ
గొలఁదివృద్ధికినిచ్చి కూర్మిఁగాచుదువె ?
పంగుల మూఁగల బావాహీనులను
వెంగలిమతులను వికల దేహులను
అరసిరక్షింతువె ? యాజిలోఁ [illegible] తె
శరణన్న నెంతటిశాత్రవునైనఁ ?
గృతమెఱింగినవాఁడఁ గృపఁబ్రోతువయ్య ?
కృతకృత్యుఁడని నిన్ను గ్రియఁ బ్రస్తుతింప ;
ధనము నాలుగుపాళ్లు దప్పక చేసి
వెనుకొని యొకపాలు వెచ్చంబు సేతె ?
ఆయుధశాలల నశ్వశాలలను
దోయదవర్ణ సింధుర శాలలందు
బండారమిండ్లను బరమవిశ్వాస్యు
లుండంగ నియమింతె యుర్వీతలేశ ?
పేదల సాదులఁ బెద్దల హితుల
మేదినీసురులను మిత్రబాంధవుల
సరసి రక్షింతువె యవనీశతిలక ?
పరమంత్ర భేదనోపాయ మంత్రులును
మూలబలంబును మూర్ధాభిషిక్తు
లోలిఁగొల్వఁగను గొల్వుందువే నీవు ?
అనవరతంబు బాహ్యాభ్యంతరములఁ
గనుఁగొని మెలఁగుదే గౌరవంబునను ?

---

1. ఈపదమును వివిధార్థములలోవాడును ; ఆధారమూహ్యము.

చారులవలనను జగములవార్త
లారయ విందువే యవనీశచంద్ర ?
సంధిల్లువార్త లెచ్చట వినకున్న
నంధకారముగప్పు నవనిలోపలను ;
దారసంగ్రహమును ధనసంగ్రహంబు
వారణ రథ హయవ్రాత సంగ్రహముఁ
జేయుచు, సర్వంబుఁ జిత్తంబునందుఁ
బాయక యెఱుఁగంగవలయుఁ దత్ఫలము ;
చాలంగఁ దృణ కాష్ఠ జలసమృద్ధియును
శ్రీలు ధాన్యంబులుఁ జింతితార్థములుఁ
గలిగి దట్టములైన కడిఁదిదుర్గములఁ
జెలువుగా సవరణసేయించి తయ్య ?
అరులగెల్చునుపాయ మాచరింపుదువె ?
అరయ నాస్తిక్యంబు, ననృతభాషణము,
నప్రసాదంబును, నాలస్యమును, మ-
హాప్రమత్తతయు, [1] ననర్థకచింత,
చింతింపఁ గ్రోధంబు, [2] శీఘ్రచింతయును,
అంతంబుగానియట్టిసూత్రతయు,
నెఱుకగల్గినవారి నెఱుఁగకొండుటయుఁ,
[3] దెఱఁగొప్ప నర్థంబు ధృతిఁ దాఁపకునికి,
మునుపు నిశ్చితకార్యములు సేయమియును,
ఘనమంత్రములు సురక్షణమొనర్పమియుఁ,
గ్రియ శుభంబులు ప్రయోగింపకయునికి,
భయ విషయాప్తినాఁబరగు పదునాల్గు
రాజదోషంబులు రమణవర్జింతె ?
రాజితంబుగ." నన్న రాజు ధర్మజుఁడు

---

1. 'అనర్థజ్ఞులతోడి చింతనము'. 2. 'దీర్ఘచింత'. 3. 'అర్థంబులయందనర్థకచింత'. అని నన్నయ. సభా.

నారదసన్మునినాథునకనియె :
“ నారయ దోషంబులన్నియు మాని,
న్యాయంబుతప్పని నడవడి గలిగి,
పాయని ధర్మసంపదఁ జరింపుదును.”
అనిమ్రొక్కి భక్తితో నప్పుడిట్లనియె :
“ మునిచంద్ర, బహులోకములుచూడసివియు
నేవియుఁగలవు మీాయిచ్చఁజింతింప !
సౌవర్ణమయమైన సకలచిత్రముల
యీాసభఁజూచితే ! యిప్పు. ” డటంచు
వాసియెలర్ప సర్వంబుఁజూపినను
జూచి యమ్ముని ధర్మసూనునకనియె :
“ భూచక్రమునను నపూర్వమియ్యాదియు !

## ఇంద్ర సభా వర్ణనము

నీసభఁబోలంగ నేసభలేదు ;
వాసవుసభ హేమ వరరత్న చిత్ర
మయముమై శోభిల్లు ; మఱి దానిఁబొగడ
నయశాలియగు శేషునకు నశక్యంబు.
అది శతయోజనంబగు వెడల్పునను,
బదిలమై నూటయేఁబదియోజనముల
నిడుపు, నవ్వలఁబంచనిజయోజనముల
1 పొడవును గలిగి పెంపును దీప్తి గలిగి
ఘనతరంబగు కామగమనంబు గలిగి
యనుపమ ఫలనివహారామములను
వరుసతో వరరమ్య వైభవంబగుచు
గురుతపఃప్రౌఢిచేఁ గొమరుదీపించు.
నమరేంద్రసిద్ధితంబైన యీాసభను
అమరేంద్రుఁ డతిభూతి నమరగంధర్వ

1. ఉన్నతి. అను నర్థములో వాడియుండును. ‘తనరుప్ప’ అని. నన్నయ.

సతులుగొల్వఁగ, విభూషణ వస్త్ర గంధ-
యుతుఁడై శచీదేవి నొనరంగఁగూడి
యభిరామమునసుండు ననిశంబుఁ గొలువు.
అభిముఖులై యానడఁగు శూరులును,
గ్రతువులు వేదోక్తిఁగావించునట్టి
క్షితిదేవులును నింద్రుఁ జేరియుండుదురు.
గురుఁడు శుక్రుండును గురుపవిత్రమునఁ
జిరకాలమొప్పు [1]నగ్నిష్టోమములును,
శ్రీతనులైన విశ్వేదేవతలును,
ధాతవిధాతలుఁ, దగు హరిశ్చంద్ర
ధరణీశ్వరుండును దగ్గతి శక్ర
వరసభాస్థలియందు వరుస నుందురు.

## యమసభావర్ణనము

మఱి కృతాంతుని సభామందిరంబొండు
వెలివార రచియించె విశ్వకర్మయును;
అది శతయోజనంబైన వెడల్పుఁ
బొడవునంతియు నిడుపునుజాలఁగలిగి,
కామగామిత్వంబుఁ గమలాప్తదీప్తి
హేమమాణిక్య సమిద్ధదీధితుల
నతిరమ్యమైయొప్పు; నాసభయందుఁ
దలితో నగస్త్య మతంగాది సిద్ధ-
గణములు, భీకర కాలకింకరులు,
గణుతింపఁ గాలచక్ర క్రతు దక్షి-
ణాధిదేవతలును, నాకృతవీర్య
మేదినీశుఁడు, జనమేజయ జనక

1. అగ్నిసోములని నన్నయ. వ్యా. భా. లో 'అగ్నిష్టోమః.' అని పా. అం.

బ్రహ్మదత్త విశాల బల పృషదశ్వ
బ్రహ్మ మహోదర్క భవ్యశంతనులుఁ,
బుణ్యభూరిద్యుమ్న బుధమన్మథులును,
[1] గణ్యసన్మథురోపశంతాధిపతులుఁ,
జండశౌర్యుఁడు భవజ్జనకుఁడైనట్టి
పాండురాజాదిగాఁ బరఁగు భూపతులు
సేవింప నాసభ చిత్రమైయొప్పు;
భావించి యముఁడును బాపపుణ్యముల
నరయుచుండును బ్రాణులందు నెప్పుడును.

## వరుణసభావర్ణనము

వరుణదేవునిసభ వరవిచిత్రముల
గురుతరంబై యొప్పుఁ గొమరార; యముని
నిరుపమసభయంతనిడుపు వెడల్పుఁ
గలిగియుండఁగ విశ్వకర్మసృజించెఁ.
జెలఁగి యందును సుఖాసీనుఁడై యుండు
వరుణుఁడు దేవితో; వారిరాసులును,
[2] గరమొప్పుచున్నట్టి కాళింది కృష్ణ
గౌతమి నర్మద కావేరి పెన్న
పూతసరస్వతి పుణ్యవాహినులు,
ఘనసరోవర తటాకములును, గిరులు,
వనములు, వసుమతి, వరకూర్మ మకర
ఘోర నక్ర గ్రాహ గురుసింహ శరభ
వారణవ్యాఘ్రాది వరజలచరులు, (?)

---

1. మధుకంఠోపరిచరులును. అని. నన్నయ. 2. నదులును వసుమతియు మూర్తిమంతములై, జలచరస్థలచరములగు కూర్మ......సింహాదిజంతువులతో వరుణునిసభఁ గొల్చుచుండు. అని నన్నయ.

శేష వాసుకి ఫణశ్రేష్ఠులు, గాఢ
దోషాచరుల్, ఖగస్తోమంబుఁ గొలువఁ
జదురొప్పు వరుణునిసభ యెల్లవేళ.

## కుబేరసభావర్ణనము

తదనంతరంబ యాధనదుని సభయు
నింద్రునిసభతోడ నెనయుచుండు;
సాంద్రవైభవములఁ జాలనొప్పార
నది విశ్వకర్మ నేర్పలర సృజించె.
విదితంబుగా నందు వెసఁ గుబేరుండు
కొలువుండు మందార కురుపారిజాత
మలయానిలానంద మహనీయుఁడగుచు.
ననవరతంబుఁ దన్నుచట కిన్నరులు,
ఘనులుగంధర్వులుఁ, గలితవరాహ-
కర్ణ సన్నదగజకర్ణులు నీల
వర్ణులు, సన్మునీశ్వరులును, బుధులు,
[1] మదకాలకంఠ సన్మణిభద్ర హేమ
విదితనేత్రులును బహిత్రధన్వులును,
నలకూబరుండు నున్నతిభజియింప,
రంభయు మేనక రమణీయూర్వశియు
నంభోజవదనఘృతాచి తిలోత్త
మాది దేవస్త్రీలహర్నిశంబొప్పు
మోదంబుతోఁ గొల్వ, ముఖ్యభోగముల
నుందును దేవితో నొగిఁ గుబేరుండు.

## బ్రహ్మసభావర్ణనము

మఱియును విను, మహీమండలంబునకు
నఱుదు చెప్పఁగవిన నాబ్రహ్మసభను.

1. మాణిభద్రహేమనేత్రులు. అని నన్నయ. నామవాచకముల ఆదిని మధ్యను ఉప పదములఁజేర్చుట వింత.

బోయిచూచితి దానిఁ [1]బొగడిచెప్పంగఁ
దోయజాసన ఫణీంద్రులకశక్యంబు.
అందు బ్రహ్మనుగొల్చి యాదిమనువులు,
బృందారకులును, నత్రియు, మరీచియును,
భృగు భరద్వాజ శోభితవశిష్ఠులును,
దగువాలఖిల్య కశ్యప గౌతములును, (?)
బుణ్యకణ్వ పులస్త్య పులహ కుంభజులుఁ,
గణ్యులాంగీరస కమలాసనులును,
జంద్ర సూర్య గ్రహసముదయంబులును,
సాంద్ర తారకములు, సద్గుణాకరులు
వసు రుద్ర సిద్ధ పావనసాధ్యవరులు,
విశదవిశ్వేదేవ విశ్వంబు, నధిక
గౌరవ ధర్మార్థ కామమోక్షములుఁ,
బారీణమైన శబ్దస్పర్శరూప
రసగంధములుఁ, [2]దపశ్శమదమంబులును, (?)
పసిమి [3]సంకల్ప (వి) కల్పప్రణవములు,
సమధికక్షణములు, సన్ముహూర్తములు,
రమణీయమగు నహోరాత్రపక్షములు,
సంచితమాసార్ధసంవత్సరములు,
నంచితాయూథయుగాత్మకంబైన
కాలచక్రంబును, ఘనకరణములుఁ,
జాలఁజతుర్వేదశాస్త్రవిద్యలును
మూర్తిమంతంబులై ముదమునఁగొలువఁ,
గీర్తిశోభిల్ల వాగ్దేవితోఁగూడి

1. బొగడుచుండంగ. 2. మదరాక్షసేశ్వరులు. (మూ) మదరాక్షసేశ్వరులు బ్రహ్మ సభలో నున్నట్లెందును లేకపోవుటచేతను, 'రూపరసగంధము' లని నన్నయ భారతములో నుండుటవలనను పైవిధముగా సవరింపఁబడెను. యతిభంగ మీతని సంప్రదాయమే. 3. సంకల్పవికల్ప ప్రణవములని. నన్నయ.

కమలాసనుండు సౌఖ్యంబున నుండు
నమితభంగుల నందు." నని చెప్పుటయును
రాజచంద్రుండు నారదునకిట్లనియె:
"రాజపూజితుఁడైన రాజు మాతండ్రి
పాండుభూపాలుండు పరమధార్మికుఁడు
దండహస్తునిపురీస్థలి నుండు టేమి?
యాదిరాజవరేణ్యుఁ డాహరిశ్చంద్ర
మేదినీశ్వరుఁడును మెఱసి దేవేంద్రు
సభనున్నక్రమమెల్ల సత్తుగాఁ దెలుపు
రభసంబుతో." నన్న రమణ నారదుఁడు
నాధర్మజునితోడ నప్పుడిట్లనియె:
"యోధ హరిశ్చంద్రుఁ డుర్వీశ్వరుండు
సప్తార్ణవద్వీప జగతీతలంబు
సప్తాశ్వతేజుఁడై జయమున నేలి,
యాజివిరోధిరాజావళి గెలిచి,
రాజసూయ మహాధ్వరంబు గావించి,
యమితదానములు బ్రాహ్మణులకుఁ జేసి,
కామరొప్పఁగా యాజకులకు దక్షిణలు
నేనుమణుంగుల హేమంబులొసగి,
మానుగా జనులసమ్మానంబుచేసి,
పరలోకమున కేఁగి పర్జన్యుసభను
బరమానురాగుఁడై ప్రఖ్యాతినుండె.
దండపాణిపురంబుదరిని మీతండ్రి
పాండుభూపతి నాకుఁ బరఁగనిట్లనియె:
"అధిపులు రాజసూయంబులు చేసి
బుధపూజ్యు, యింద్రునిపురినున్న వారు;
ఏనిందునుండుట యెఱుఁగుదుగాన
నానందనుఁడు ధర్మనందనునకును

వినుపించి, త్రిభువనవిఖ్యాతముగను
ఘనరాజసూయమఖంబు గావింపు. ”
మనివూని పుత్తెంచె ; నదిగాన, మీర
లనుపమరాజసూయాధ్వరంబొప్పఁ
జేయుఁడు ; పాండుపృథ్వీతలేశ్వరుఁడు
వేయికన్నులవానివీటనే యుండుఁ ;
గావున నీపరాక్రమసహోదరుల
లావునఁజేసి చాలఁగ రాజసూయ
యాగంబుగావించి, యఖిలార్థములను
ఆగమోక్తులను బ్రాహ్మణులకునిచ్చి
జనులఁబాలించిన, శక్రునిపురము
గొనకొని గలుగు మీగురుఁడుపాండునకు.
ఇందుకు విఘ్నంబు లెన్నేనిగలవు ;
అందుకు వెఱవకుండది మీకుజయము. ”
అనిచెప్పి నారదుండరిగె నాక్షణమ.
యనఘుండు ధర్మజుండంతఁ దమ్ములను
ధౌమ్య వేదవ్యాస ధరణీసురేంద్ర
[1] సౌమ్య సజ్జన సమక్షమ్మునఁబలికె :

## రాజసూయ సంకల్పము

“ గణుతింపఁ దనయుఁడు గలిగినఫలము
క్షణములోపలఁ బితృజనులకోరికలు
తీర్చఁగల్గుటయె యీత్రిజగంబులెఱుఁగఁ ;
బేర్చినారదుఁడు చెప్పెనుసకలంబు.
రాజసూయమహాధ్వరంబు చేసినను
దేజంబుతోఁ బితృదేవతలెల్ల

1. స్వామ్య......క్షమమున. (మా)

స్వర్గస్థులగుదురు సత్తుగా ; నిట్టి
మార్గంబునను జనమర్దనంబగును ;
ఏమి సేయుదు !" నని యిచ్చఁజింతింప
నా మెయి ధౌమ్యాదులప్పుడిట్లనిరి :
"రాజితంబుగఁ జేయు రాజసూయంబు ;
నాజన్మముగఁ జేయు నఘములుదొలఁగు ;
లోనుమీఱగు రాజలోకమంతయును ;
మానుషంబున రాజమణులను గెలిచి
కావింపవే వేగ క్రతు." వనుటయును,
నావేళ ధర్మజుం డాత్మఁజింతించి
యిందుకు నిర్విఘ్న మెంతయుఁగాను
గందర్పజనకుండు కరివరదుండు
పుండరీకాక్షుండు పురుషోత్తముండు
అండజపతివాహుఁ డట కర్తయనుచుఁ
జారునిఁబిలిపించి సద్భక్తిఁబలికెఁ :
"దేరుగొంచును బోయి తేజంబుతోడ
శ్రీకృష్ణుఁదోతెమ్ము శీఘ్రమ్మునందుఁ
బ్రాకటమ్ముగ." నంచుఁ బనిచిన వాఁడు
ననిలవేగములైన హయములుపూను
ఘనరథంబెక్కి యాకమలాక్షుకడకుఁ

## కృష్ణుఁ డింద్రప్రస్థమునకు వచ్చుట

బోయిన, నెఱిఁగి యాపుండరీకాక్షుఁ
డామెడ రథము నయ్యంబున నెక్కి
తత్క్షణంబునను నింద్రప్రస్థపురికి
రక్షణంబునవచ్చి, రమణికుంతికిని
ధర్మజునకు మ్రొక్కి తరువాత భీము
నర్మిలిఁ గౌఁగిట నందంద చేర్చి,

నరుని మాద్రేయుల నయమార్గములను
గరుణమన్నించినఁ, గమలాక్షుఁజూచి
భయభక్తితో నర్ఘ్యపాద్యాదివిధులఁ
బ్రియమునఁ బూజించి పీఠస్థుఁజేసి,
కలయ లోకముల యోగక్షేమమెల్లఁ
జెలువుగా నరసి రక్షించు శ్రీకృష్ణు
నేమమంతయును బ్రసిద్ధిగా నడిగి,
యామహాత్మునితోడ నప్పుడిట్లనియె :
" మాకు లోకములకు మతివిధేయుఁడవు ;
నీకుఁగాన్పింపవే నిఖిలకార్యములు !
ఐనను నీకు నేనటువిన్నవింతు ;
మానుగా నారదమౌని యేతెంచి
పలికెను నాతోడఁ : ' పాండుభూవిభుఁడు
చలనంబుతో [1] యమసభనున్నవాఁడు ;
అతనికిఁ బుణ్యలోకావాస [2] మబ్బ
రతిపతిగురుకృప రాజసూయంబు
నేయునీ. ' యనుచును జెప్పి తాఁబోయెఁ ;
దోయజనేత్ర, యిందుకుఁ గార్యసిద్ధి
గావింపు." మనవుడుఁ గమలలోచనుఁడు
భూవల్లభునకు విస్ఫురణ నిట్లనియెఁ :
" గుణశీలముల సర్వగుణవిశేషముల
ననఘచరిత్రుండవైనట్టి నీకు
రాజసూయమహాధ్వరము సేయఁదగును
ఆజులగెలుచునీయనుజుల బలిమి ;
నీకోర్కి సఫలంబు నెఱయఁ గావింతు ;
నేకచిత్తంబున నెంతయు నుండు.

1. రాజ. 2. మంబు. (మూ)

విను నీకు నెఱిఁగింతు వృత్తాంత మెల్ల;
మును జమదగ్ని రామునిచేతఁ దెగిన
[1] రాజులనుండి ధరాతలంబునను
రాజసూయాన్వయ రాజాగ్రణులకుఁ
[2] దక్కఁ దక్కి సమహీధవయూథములకు
నెక్కుడైనను జెల్ల దిట్లు సేయంగ;
నీ రాజసూయంబు నిలఁ జేయునపుడు
వైరులు లేకుండ వలయు నిచ్చటను;
ఇపుడు జరాసంధుఁ డేచియున్నాఁడు
నృపులను గెలిచి యున్నిద్ర శౌర్యమున;
నతనిఁ జేగూడి యీ [3] యెడఁ జేదివిభుఁడు
ప్రతిపక్షుడై శిశుపాలుఁడున్నాఁడు;
అతిమాయలను బెట్టు [4] హంసుండు డిచికుఁ
డతనినే సేవించి యర్థినున్నారు;
చిత్రంబు! వారు కౌశిక చిత్రసేన
పాత్రనామంబులఁ బరఁగినవారు;
బహుసేనలను గూడి పస జరాసంధ
సహితులై సాధనసన్నద్ధులగుచు
వర్తింపుచున్నారు వారు మువ్వురును.
స్ఫూర్తిలో వరుణుని భుజశక్తి గలిగి
భగదత్తుఁడను రాజు పశ్చిమభూమి
మగఁటిమి నేలుచు, మఱి జరాసంధుఁ
బొదివియున్నాఁడు భూభువనమెఱుంగ.
పదిలమై యాచేదిపతులలోపలను

1. మూలమును అవ్యక్తముగా ననుకరించినాఁడు. చూ. నన్నయ. సభా. ప్ర. ఆ. 110. గ. 2. అమూలకము. 3. ఆయెడ ఈయెడ మొ. పదములను వ్యవహార మందలి ఉచ్చారణచేఁగలిగిన భ్రాంతివలన, అకారమధ్యములుగా ప్రయోగించినాఁడు. తిమ్మయ రచనయగు ఆదిపర్వములోఁగూడ నిట్టివి గలవు. 4. హంసడిభకులు. అని నన్నయ. సభా. ప. డిచికులనియు. పా. అం. ఇందంతట డిచికులనియే గలదు,

పురుషోత్తముండును, భూమీతలేశ-
వరులలోపలఁ బౌండ్రవాసుదేవుఁడును,
నానామములుదాల్చి నడుఁకక క్రొవ్వి
పూని వైరంబు దుర్బుద్ధులై యిపుడు
కోరి జరాసంధుఁ గొలిచియుండుదురు.
దారుణశక్తిఁ బ్రాగ్దక్షిణదిశల-
స్పృష్టీశ్వరులు పురుజిత్తు కరూశ
దుష్టపౌండ్ర కిరాత దుర్మార్గసాల్వ
యవనులు వానినే యలమియుండుదురు ;
ప్రవిమలయశులైన పాంచాల మత్స్య
శూరసేన పుళింద సుంహాక కుంతి
కేరళ పుష్కర క్షితిపాలతతులు
నెఱి నాజరాసంధునికి నోడి పాఱి,
యఱిముఱిఁ దమభూములన్నియు విడిచి
తిరుగుచునున్నారు దిగ్భ్రమగొనుచు.
సరభసంబున జరాసంధుండు నెపుడు
కంసుని సేనాజి ఖండించుటకును
హింసగావింపంగ నెప్పుడుఁగోరు ;
ఆకంసుఁడును దనకల్లుండుగాన
భీకరశౌర్యుఁడై పేర్చి యీనుసను
నాతోడ వడిఁ బ్రథనము సేయు నెపుడు ;
నాతతజయశాలు రాహంసడిచికు
లిరువురుతోడుగా నేడుదీవులను
దివిజ రాజులను సాధింపంగఁగలఁడు.
అటువంటిడిచికుని హంసునిఁగూడి
తటుకున సేనాకదంబంబుతోడఁ

జలము [1] నందును జరాసంధుండు పేర్చి
మలయుచు శూరుఁడై మధురపై విడియ
నేను సేనలుఁగూడి యెదిరిపోరాడఁ
బూనుచో, నంతయు బుద్ధిఁజింతించి
యాహంసడిచికుల యాయుధంబులును
వ్యూహంబులును జూపకుండుట యెఱిఁగి
హతుఁడయ్యె హంసుఁడుగ్రాజిలోననుచు
హితబుద్ధి డిచికున కెఱిఁగించి పనుప,
నతఁడు హంసునిమృతి యంతటఁ దెలిసి
మతిలోనఁ గడుశోకమగ్నుఁడై యపుడు
పలికె: 'హంసుఁడులేని బ్రదుకునా కేల!
యిలమీఁద.' ననుచును నెంతయు వగచి
డిచికుండు గ్రక్కున దేహంబువిడిచె.
అచలధైర్యుండగు హంసుండు డిచికు
మృతివార్త విని వేగ మృతియునుబొందె.
నుతి హంసడిచికుల మరణంబువినియు
నసహాయుఁడై మగధాధీశ్వరుండు
కొసరుచుఁబురికేఁగెఁ గోపంబునిగుడ.
ఏమును వారితో నెక్కటిపోర
నేమియుననలేక యెఱిఁగియు మధుర
విడిచి ద్వారావతి వేగనిర్మించి
కడిమి రైవతము దుర్గంబుగాఁజేసి
యందున్నవారము హర్షంబుతోడ;
నిందుకు వెఱపక నిష్ఠురత్వమున
నవనిరాజులను బృహద్రథాత్మజుఁడు
తివిఱి పట్టుకవచ్చి దీర్ఘరాద్రమున

1. 'అందు' ప్రత్యయమును తృతీయార్థములో నితఁడు చాలచోట్ల ప్రయోగించి నాఁడు.

మొనసి గిరివ్రజంబునఁ జెఱఁబెట్టి
దినమునొక్కొకని వధించి నేర్పునను
భైరవపూజలు పాటించి సేయుఁ.
క్రూరాత్ముఁడగువానిఁ గువలయాధీశ,
యణఁచిన నీకును నఖిలరాజ్యములు
క్షణములోపలఁ జాలసమకూరు ; మఱియు
రాజసూయమహాధ్వరము సేయవచ్చు ;
రాజేంద్ర, మును భగీరథనరేంద్రుఁడును,
............................
............................
దోర్విక్రముఁడు మరుత్తుండును, నాజి-
గర్వితాహితులను గ్రక్కునఁ ద్రుంచి
సకలసామ్రాజ్యాది సర్వసంపదలు
ప్రకటంబుగాఁ గాంచి ప్రబలిరి ; గాన,
నిఖిలసద్గుణములు నీయందుఁగలవు ;
అఖిలార్థవేదివి ; యరివిజయుఁడవు ;
ఏమిదుర్లభము నీకిజరాసంధు
భీమవిక్రమమునఁ బేర్చి త్రుంపఁగను !”
అని కృష్ణుఁడాడినయట్టిమాటలను
విని ధర్మజునితోడ వెస భీముఁడనియె :

### భీమార్జునులు ధర్మజునకుత్సాహము గలిగించుట

“ఉద్యోగహీనున కుర్విలోపలను
సద్యఃఫలంబులు సమకూరవెందు ;
బాహాబలాఢ్యుతోఁ బ్రతినదలిర్ప
నాహవంబొనరింప నతికీర్తి గలుగు ;
హీనుతోఁ బోరంగ నేకీర్తి గలదు !
మానవునకు మహీమండలంబునను.

అటుగాన నీతో యజాతశత్రునికృపను,
స్ఫుటశౌర్యుఁడైన యర్జునుసహాయమున,
నిత్యమైయొప్పెడు నీప్రసాదమున,
నత్యున్నతుండైన యాజరాసంధు
నఖిలజగద్ద్రోహి నాజిఁ ద్రుంచెదను.
నిఖిలంబెఱుంగంగ నేము మువ్వురముఁ
ద్రేతాగ్నులునుబోలెఁ దేజంబుతోడ
ఖ్యాతిగా నీయజ్ఞకార్యమంతయును
నిర్వహింతుము ; దుర్వినీతు మాగధుని
దుర్వారపశువుఁ గ్రతుక్రమంబునను
ఆహుతులుగ వ్రేల్చి యలరియుండుదుము
సాహసంబున." నన్న శక్రనందనుఁడు
నసిలజుమాటల కనుకూలముగను
జననాథుతోడ సద్భక్తిని బలికె:
"ఆజిలో రిపురాజినడఁచి, [1]లక్ష్ములను
రాజసూయమహాధ్వరమ్ము గావింపు
నాభుజబలమున నాధనుర్విద్యా-
ప్రాభవంబున జగత్ప్రఖ్యాతముగను.
ఈసభాలాభంబు నీప్రతాపంబు
నీసమస్తశ్రీలు నిటనీకుఁగలుగ,
నేవిచారములేల యిలనాథచంద్ర!
కోవిదస్తుతములై కులశీలరూప
గుణములకును ననుకూలమైయొప్పి
ప్రణుతికెక్కిన నీప్రభావంబునందు
సమరంబునను జరాసంధునిఁ ద్రుంచి,
క్రమమునఁ జెఱనున్న రాజులనెల్ల

---

1. ఈపదమును వైభవపర్యాయముగా పదింపదిగా వాడును.

రక్షించి సత్కీర్తిరమణిఁ గైకొనిన
సత్క్రియసుకృతంబు లనిశంబుఁ గలుగు."
ననిపల్క భీముని యాపార్థుమాట
విని కృష్ణుఁడప్పుడు వేడ్కనిట్లనియె :
"శౌర్యంబుగలిగినజగదీశ్వరులకుఁ
గార్యంబులివి వివేకమునఁ జింతింపఁ ;
గాన ముష్కరమును ఘను జరాసంధుఁ
బూని వాహినిదరిభూజంబు మొదలు
పెకలించుకైవడిఁ బెర్చి త్రుంచెదము ;
అకలంకమతిఁజని యాదురాత్మకుని
నంతరంబెఱుఁగనియట్టిదుర్దమని
హంతను సర్వలోకాపకారకునిఁ
జంపుద." మనవుడు సంతోషమంది
తెంపుతో హరికి యుధిష్ఠిరుండనియె :
"నీకోపవహ్నిలో నెఱయంగ మిడుత
యై కడువడిఁబడు నామాగధుండు.
అనఘ, శూరుండైన యాజరాసంధు
జననంబు నాకును సర్వంబుఁదెలుపు."
మనియడిగినయట్టి యమతనూజునకు
వనజాతనేత్రుండు వర [1]భక్తిఁబలికె :

## జరాసంధునుత్పత్తికథనము

"మగధదేశంబేలు మానవేశ్వరుఁడు
అగణితశక్తి బృహద్రథుండొప్పు ;
నక్షౌహిణీత్రితయంబైనసేన
దాక్షిణ్యమునఁ గొల్వఁ దగనున్నవాఁడు.

1. భక్తిపదము ప్రేమవాత్సల్యపర్యాయముగా నిందుఁ గాననగును.

కాశిరాజనువాని గాదిలిసుతలఁ
గాశసన్నిభకీర్తి గౌరవాన్వితలఁ
గవలవారల సతికాంతి [1] సమ్మితల
నవిరళమతిఁ బెండ్లియాడి, సొంపుగను
భోగింపుచును, దుదిఁ బుత్త్రులులేమి
నాగమోక్తులయందు నఖిలదానములఁ
బుత్త్రకామేష్టియుఁ బొందుగాఁ జేసి
పుత్త్రులఁగనలేక పొలఁతులుఁ దాను
వనమున కేఁగి, యవ్వల సహకార
ఘనమహీజము క్రిందఁ గైకొని తపము
చేయుచునున్న కౌశికమునిఁ గాంచి
యాయతభక్తితో నర్ఘ్యపాద్యములఁ
బూజింప నమ్మునిపుంగవుండనియె :
‘ రాజశేఖర, బృహద్రథ, నీకు నెద్ది
యిష్టంబు ? వేడుమ యిచ్చెద. ’ ననిన
దృష్టించి యతనికి ధృతి మ్రొక్కి పలికె :
‘ నెంతసంపదగల్గ నేమిఫలంబు !
సంతానములులేక సన్మునినాథ !
తనయులుగలుగంగ దయసేయు. ’ మనిన
ముని కౌశికుఁడు యోగమునఁ జింతసేయ
మామిడిపండు గ్రమ్మన నేలఁబడిన,
నాముని దానిని నభి [2] మంత్రితంబు
చేసి బృహద్రథుచేతికినిచ్చి,
భాసురభక్తితోఁ బలికె నెయ్యమున :
‘ నీఫలంబున నీకు నిట నొక్కకొడుకు
సాఫల్యమున వేగజనియించు. ’ ననిన

---

1. సన్మతుల. 2. మంత్రకంబు. (మూ)

నా మగధేశుండు నమ్మునియాజ్ఞ
నేమంబుతోడను నిజపురంబునకు
నేతెంచి యాఫలం బిలను భాగించి
చాతుర్యమునఁ దనసతులకిద్దఱకుఁ
బెట్టిన, వారు తత్పృథుఫలప్రౌఢి
గట్టిగా నప్పుడు గర్భిణులగుచుఁ
బదిమాసములు మీఱి, పసనొక్క రాత్రి
విదితంబుగా వారు వెసఁ గాంచిరంత
నొక్కొక్కకన్నును నొక్కొక్క చెవియు
నొక్కొక్క చెక్కును నొక్కొక్క మూపు
నొక్కొక్కచను బొడ్డు నొక్కొక్క చెయ్యి
యొక్కొక్క చరణంబు నుదయంబుగాఁగఁ;
గాంచి యంతటఁ బుణ్యకామినీమణులు
వంచనతోడ నావ్రయ్యలుచూపఁ
బలికిఁ జెప్పఁగ రోసి, [1] పరిఖపంకమునఁ
దలితప్పకుండఁగ దాదులచేత
వేయించినను, నంత వెస దైత్యభామ
యాయెడఁ జూచి వ్రయ్యలు రెండుఁగూర్ప
రెండును నేకమౌరీతి శోభిల్లఁ
జండశరీరుఁడై జయమునొందుటయు,
నాదైత్యభామిని యావజ్రదేహు
నాదట నెత్తంగ నలవిగాకుండె.
ఆబాలకుండు మహారవంబునను
బ్రాబల్యచిత్తుఁడై పలవరించుచును
అకుమారుండేడ్వ, నంతఃపురంబు-
రాకేందుముఖులు గారామునఁ బంప

1. చదుకమందు వైచినట్లు. నన్నయ. భా. 'తే చతుష్పథ నిక్షిప్తే' అని వ్యా. భా

ముసలియవ్వలువచ్చి ముదముతో వాని
నెసగినభక్తితో నెత్తుకయుండ,
నట్టిసంభ్రమమున నాబృహద్రథుఁడు
తొట్టినభక్తితోఁ దొలుతనేతెంచి
యతిరోదనముసేయు నాత్మసంభవునిఁ
జతురతఁగనుఁగొని సంభ్రమం బెసగ.
ఆవేళ రాక్షసి యబలరూపమున
భూవిభుమణితోడ బుద్ధినిట్లనియె:
'జరయనురాక్షసి జననాథ, యేను;
బరికింప నీపురీ పరిఖచదుకమునఁ
బాయకయుండుదుఁ బ్రతిదివసంబు;
నేయెడ నీకు నేనిష్టంబు సేయఁ
గోరుచునుండుదుఁ గొంకక యెపుడు;
నేరుపుతోఁ జేయు నేఁడు సిద్ధించె.
నీయిరువురు తరుణీమణులకును
శ్రీయుతంబుగ జనించినయట్టి మనుజ
శకలంబులివిరెండు చర్చించిచూడ;
సకలంకగతిఁదెచ్చి యట నిందువ్రేయ
నీరెండుశకలంబు లేను గూర్చినను
బోరన మనుజుఁడై భూరిసత్వమున
ఘనవజ్రకాయుఁడై కడఁగి కుమారుఁ
డనిమిషగిరివోలె నమరి యున్నాఁడు;
ఈకుమారకుని నీవెత్తుకొ.' మ్మనుచుఁ
జేకొని జర భక్తిఁ జెప్పిన, వినుచు
నామగధేశుండు నాజరకనియె:
'ఆమహాత్ముండు విశ్వామిత్రమౌని
నాకు వేడుకనిచ్చె నందను మునుపు;
చేకొని నీవునిచ్చితివి నాకిపుడు;

నాకులంబెల్ల నున్నతిని రక్షింప
నాకల్పమునఁ బుట్టినట్టి దేవతవు.'
అని దానిఁబూజించి యాత్మనందనుని
గొనిపోయి దేవులకును నిద్దఱకును
సరభసంబుననిచ్చె సంతోషమునను.
జర వాని సంధింపఁజాలుటఁ జేసి
జననాథ, మఱి జరాసంధుఁడై యొప్పె.
మనుజేశుఁడేఁటేఁట మనుజాళికిని
నుత్సవంబొనరించుచుండె; నందనుని
నుత్సాహమునఁ బెంచుచుండె; నంతటను
జండకౌశికుఁడు ప్రచండమునీంద్ర-
మండలేశ్వరుఁడు నిర్మలబుద్ధి వచ్చె.
అంతట నెదురేఁగి యామాగధేశుఁ
డెంతయు మ్రొక్కి తా నెలవుకుఁ దెచ్చి
కనకాసనంబున ఘనతతో నునిచి
వినతుఁడై పదములు వేడుకఁ గడిగి
యర్చించి రాజ్యంబు సకలార్థములును
జేర్చి నందనుఁ జూపఁ, బ్రియమున మౌని
యామగధేశుతో నప్పుడిట్లనియె:
"సామర్థ్యముగలట్టి జర దైత్యవనిత
నీకుపకారంబు నేర్పునఁ జేసె;
నేఁ దపోదృష్టి నిప్పుడుగంటి;
నీకుమారుఁడు ధారుణీనాథచంద్ర,
యాకుమారునిశక్తి నలరినవాఁడు.
హరినిఁ గైకొనఁడు; కాలాంతకాంతకుని
హరుని మెప్పించు దానవులమర్దించు;
ఏనితోఁ [1] బోరిలో వీరాధివరులు
మానితోత్సాహులై మార్కొనటన్న,

---

1. బోరెదు. (మూ)

శలభంబువహ్నితోఁ సద్విహంగములు
బలుగరుత్మంతుతోఁ బ్రతిఘటింపుటలు ;
ఎల్లవారలు వీనియేచినదాడి
హల్లకల్లోలమై హతులౌదురిట్లు ;
బల్లిదుండగు వీనిపటుశౌర్యవహ్ని
యెల్లరాజులపగయెల్ల మాయించు ;
నేడుదీవులవారి నిట్టట్టుచేయు
దాడియొనర్చి [1] యుద్ధండతవృత్తి ;
శతమఖుశౌర్యంబు శమనుధైర్యంబుఁ
బ్రతిఘటించెడి బాహుబల పరాక్రముఁడు ;
నందివాహనుకృపనందినయట్టి
పొందైన మణిమయ పుష్పకంబెక్కి
యాదిత్యసమతేజుఁడౌనట్టి వీని
మేదినిలోపల మీఱంగరాదు ;
దివ్యాస్త్రముల వీనిదివ్యదేహంబు
దివ్యులకైన భేదింపంగరాదు ;
[2] నదుల సముద్రుఁడున్నతిసఁ జేకొనెడు
పొదుపున ఘనమహీభుజులసంపదలు
సర్వంబు నిజరాసంధుండు గొనును
సర్వథంగుల." అని చండకౌశికుఁడు
చెప్పి గ్రక్కునఁబోయెఁ జిత్రంబుగాను.
అప్పుడు తనయుని నాబృహద్రథుఁడు
భద్రాసనంబునఁ బట్టంబుగట్టి
భద్రేభగమనలఁ బరఁగఁదోడ్కొనుచు
దపముసేయఁగ వనస్థలమున కరిగె.
నృపము జరాసంధుఁ డురుశత్రువిజితి

1. యుద్ధాం...
2. నదులు సముద్రుండున్నతిను జేకొనును. (మా)

[1] యణఁపఁగ హంసుని నాడిభకునిని
గణుతికెక్కిన కార్యకర్తలుగాఁగఁ
జేకొని యరులనిర్జింపుచునుండు ;
నాకాలువురికిని హంసుండు డిభకుఁ
డరిగినపిమ్మట, నతిగర్వముడిగి
పరవినిప్పుడు జరాసంధుఁడున్నాఁడు [2].
ఏయాయుధంబుల నీల్గకుండుఁగ
నాయిందుధరునిచే నటుగఁబండెఁ ;
గావున, వానినిఁ గ్రమముతోఁ దనతను
బావనిచే నణంపఁగఁజేయవలయు ;
మల్లయుద్ధంబున మానుషంబునను
దెల్లమిగాను వర్తింపంగవలయుఁ ;
బవమానతనయుని బాహాబలమును
దివిజేంద్రనందను దివ్యాస్త్రబలిమి
నాకీర్తిబలమునున్నతి సహాయముగ
నీకసాధ్యంబెద్ది నిఖిలలోకముల !
నాకునిల్లడయిమ్ము నరుని భీముని
జేకొని మగధునిర్జించెద." ననిన
హరి భీము నర్జును నప్పుడుచూచి
సరసిజాక్షుఁ తోడ శమనజుండనియె :
"నీసహాయముగల్గ నిఖిలశాత్రవుల
వేసమయంబున విజయవాయుజులు
విదళించి త్రుంతురు వివిధభంగులను ;
దుదిరాజసూయంబు దొరయ సిద్ధించు ;
నీకృపగలుగంగ నిఖిలార్థవితతి
చైకొనరానివి గలవె లోకముల !

1. నడంగను. (మూ) 2. నిజసంశయశంకితాత్ముఁడై అను విషయమధ్యాహార్యము.

అక్షులునాకు వాయుజధనంజయులు ; (?)
పక్షీంద్రగమన, నాభావంబు నీవు ;
మిముఁబాసి నిముషంబు మేముండలేము ;
కమలాక్ష, నీదివ్యకారుణ్యమునను
భీమునకును జంభభేదిసూనునకు
నేమియుఁ దలపోయ నిప్పుడువలదు."

## కృష్ణుఁడు భీమార్జునులతో జరాసంధుఁ జంపింపఁబోవుట

అని వారిఁబుచ్చి నెయ్యమున దీవించి
యనిపిన, వారలు నాత్మనుప్పొంగి
నదులయందును గృతస్నానులై గిరులు
విదితాటవులు దాటి వివిధదేశములు
గనుఁగొంచు మగధేశుఘనభూమిఁ జొచ్చి,
యనుపమ గోరథంబను గిరియెక్కి,
యాలోకనముచేసి యాగిరివ్రజము,
మేలైన రత్నపుమేడలదాని,
నమరావతీపురి కలకాపురికిని
సమమైనదానిని, సకలసంపదలఁ
జెలువొందుదానిఁ వీక్షించి మిక్కిలివి,
జలజాక్షుఁ డనిలజశక్రసూనులకు
నరుదంద భక్తితో నప్పుడిట్లనియె :
"పరికింప గో [1] రథపర్వతాగ్రంబు,
వైహారి, [2] ఋషిగిరి, వరచైత్యకాద్రి
యూహింప నివినాల్గు నొసరఁజుట్టులను
గాచియుండును ద్రిలోకములు నుతింప ;
నేచందములఁజూడ నిది గిరివ్రజము ;

1. వధ. 2. సిరిగిరివరచైత్ర. (మూ)

గౌతమమునిచేతఁ గడురమ్యమైన
పూతదుర్గంబిది భువినసాధ్యంబు.
తెరల మాగధుని సాధింపంగలేరు
దురములో." నని చెప్పి తుదిఁజైత్యనగము
దండకుఁజేరి మోదమునని ట్లనియెఁ:
"జండభేరులు మూఁడు చాలనొప్పారు;
మగధాది [1] నాథులు మానుషాదమను
అగణితవృషభంబు నణఁగించి, దాని
చర్మంబు భేరుల సరవిమూయింప,
నర్మిలినీపురి నటు వింతవారు
చొచ్చినప్పుడుమ్రోయుచును మునిశక్తి
నిచ్చలోనెఱిఁగించు నిట మగధునకు."
అనిన వారలుచూచి హస్తదండముల
ననువార భేరీత్రయంబును జించి,
వారకుద్ధతి గిరివ్రజమధ్యఁజొచ్చి,
బోరన నప్పుడు పుష్పలావికల
సదనంబునకుఁబోయి సకలపుష్పములు
ముదముతో నిమ్ముల ముడిచి, గంధములు
మేననిండుగఁబూసి, మేటిగంధమున
మానుషంబున రాజమార్గంబుచేరి,
గుహలుచొచ్చుమృగేంద్రకులముచందమున
మహనీయులై చొచ్చి మఱియు వచ్చుటయు,
నాజరాసంధుండు నర్ఘ్యపాద్యములు
తేజంబుతోఁగొంచు ధృతినెదురేఁగి

---

1. నాథునిమానుషదంబనెడి. (మూ) చాలవఱకుఁ గవిత్రయభారతమననుసరించి యీద్విపదభారతము వ్రాయఁబడుటచే, లేఖకప్రమాదాదులవలనిదోసఁగులు సవరించుటలోఁ అదియే ఆధారముగాఁ దీసికొనఁబడెను.

భూదేవమణులని పూజసేయంగ
నాదటఁగదిసి, వారవియోల్లకునికిఁ
జూచి యామగధరాజును వారికనియె :
'మీచందములు చూడ మేదినీగోత్ర!
ధరణిదేవతలైనఁ దర్కింప మీరు
సురభిపుష్పంబులు శోభితంబైన
గంధంబులును ధూర్తగతిఁ గొనుటేమి!
బంధురభేరు లుద్భటవృత్తి వ్రచ్చి
సొలయక నాపురిఁ జొచ్చుటయెట్లు!
అలఘుసద్భక్తితో నట నిచ్చునట్టి
మధుపర్కమ్మెల్లఁ మఱి యుండుటెట్లు!
పృథివీశ్వరులుగాని పెంపున మీరు
ధరణీసురులుగారు తర్కించి చూడ
గురుబాహుసత్త్వు లత్యుద్రవిక్రములు."
అనుటయు వానికి నచ్యుతుండనియె :
"జననాథులము మేము సత్తుగా వినుము;
నీపురిఁజొచ్చుట నీతి మాకెందు;
నేపారుగంధంబు నెల్లపుష్పములుఁ
గైకొనుటది జయకారణంబనుచుఁ
జేకొంటి మిప్పుడు సిద్ధంబుగాను.
కార్యంబు నీయందుఁ గలుగుటఁజేసి
యార్యమతంబున నర్ఘ్యంబు గొనము."
అనిన జరాసంధుఁ డప్పుడిట్లనియె :
"మును మీకు మాకునిమ్ములఁబగలేదు;
సురలకు ధారుణీసురులకు మునుల
కగుదారభక్తుండ నాదిభూవిభుఁడ."
ననుటయు సచ్యుతుం డతనికిట్లనియెఁ :
"జెనసి రాజులనెల్లఁ జెఱఁబెట్టితీవు;

వారిరక్షింపను వగుస నీతోడఁ
బోరాడఁగా నేను భుజబలంబునను
వచ్చితి; మీరిందు వాయునందనుఁడు;
సచ్చరిత్రుఁడు వీఁడు శక్రనందనుఁడు;
ఏను శ్రీకృష్ణుఁడ; నెల్లదుర్జనులఁ
బూనిశిక్షింపంగఁ బుట్టినవాఁడ.
నిన్నాజిఁదెగటార్చి నృపతులనెల్ల
నెన్నికకెక్కంగ నిక్కంబునను
విడిపింతు మము దేవవిసరంబుపోఁడఁ
గడిమితో." ననవుడుఁ గనువడి నలిగి
యాజరాసంధుండు నాగ్రహంబునను
రాజసంబున మృగరాజుచందమునఁ
గుటిలసద్భ్రుకుటీ[1] వికుర్వాణఘటిత
నిటలుఁడై పటుకార్య నిర్భరత్వమున
వారితోఁ బలికె దుర్వారవైరమున:
"ధారుణీశులగెల్చి తఱిఁబట్టి తెచ్చి
కారాగృహంబులఁ గడిమితోఁ బెట్టి
భైరవపూజలఁ బరఁగఁజేయుచును
ఇలలోపలను గ్రొవ్వి యేచియుండుటలు
తలపోయఁగా వీరధర్మంబుగాదె!
నాకుదోషము లేదు నవరణస్థలులఁ
జేకొని పట్టితెచ్చినమహీపతుల
దేవహితార్థంబు తెగవ్రేయువాఁడ;
నీవేళ వారల నేనేలవిడుతు!
భావింప నాప్రతాపము లోకములను
నీవెఱుంగవె ధారుణీధర, యెపుడు!

---

1. వికుర్వణం. (మూ)

ఎన్నిమాఱులు పాఱవెదిరింపలేక!
మున్నుగా ; నీవు సముద్రంబులోన
దుర్గంబుగట్టుక తుదఁజరించితివి ;
దోర్గర్వమున మిమ్ముఁ దూలఁద్రోలెదను.
మొక్కలంబున మీరు ముప్పురుఁగూడి
యొక్కటికయ్యాన కెత్తివచ్చినను,
రయమున మీతోడ రణమొనర్చెదను
నియమింపఁ ; గాదేని నిఖిలసైన్యములఁ
గూడుకరమ్మన్నఁ గొసరక వత్తు
నోడక ; యటుగాక, యొక్కండవీవు
రమ్మన్న రణము తీవ్రముగఁ జేసెదను ;
ఇమ్ముల మీతోడ నేయాయుధములఁ
జెనకంగవలసినఁ జెండివైచెదను."
అనవుడు శ్రీకృష్ణుఁ డప్పుడిట్లనియె :
"పలువురొక్కనితోడఁ [1] బ్రధనంబుసేయ
నిలనధర్మము ; గాన నిపుడు మాయందు
నొకనితో రణముసేయుము ప్రతాపమున ;
సకలంకగతియందు నతిధర్మమునను
మల్లయుద్ధంబు సమంబుగావునను
దెల్లముగాఁ బోరు ధీరత్వమునను.
సృష్టివారికిఁ గీడుసేయ నేనంటి ;
దృష్టమిప్పుడు ధరిత్రీపాలతతులఁ
జెఱఁబెట్టితివి ; సదా శివహితార్థముగ
వెఱవక చంపంగ వేగఁబూనితివి ;
ఎవ్వరు హరునకు నిల జీవహింస
యివ్విధంబునఁ జేయ రేయుగంబునను ;
ఇది యధర్మముగాదె యిల నీదుచేఁత !
తుది మహాశౌర్యవంతుఁడనని క్రొవ్వి

1. బ్రదరము. (మూ)

పలికితి దుర్బుద్ధి, పాపంబునందు;
మలసి పుణ్యుల నవమానంబు చేయు-
చుండితి నీకంటె యోధులు లేరె!
మండలంబున; మహామదగర్వమునను
గార్తవీర్యుండు భార్గవునిచేఁ దెగియె;
ధూర్తవిద్యలయందుఁ దుద నింక నీవు
చెడక నాచనంబుచేసి రాజులను
విడిచిపుచ్చుము జగద్విఖ్యాతముగను;
విడువకుండెదవేని, వేగ నీతనువు
విడిపింపుదుము బలువిడితోడ." ననిన

## భీమజరాసంధుల మల్లయుద్ధము

రౌద్రంబుతోడ జరాసంధుఁ డపుడు
భద్రేభవరదుని బహుభాషలాడి
బిరుదుప్రతాపించి భీమునితోడ
దురము సేయఁదలంచి, దుదిఁ దనపుత్త్రుఁ
ద్రిభువనస్తుతు సహదేవు నుత్తముని
నభిషిక్తుఁ జేసి, సజాత్యభూసురుల
దీవనల్ గైకొని, దిక్కులల్లాడ
లావునఁ బొంగి, లీలను గాసెగట్టి,
పాట [1] చోళ్లెంబు బాగుగాఁ దీర్చి
చూపట్టు నగ్గలి; చూడ భీముఁడును
సర్వ [2] సారగ్రంథు సతతమదాంధు
నుర్వీశనిర్బంధు యుక్తిసంబంధు
గాంభీర్యగుణసింధు గతసత్యసంధు
జంభారిరిపుబంధు జయుజరాసంధుఁ

1. మల్లెంబు. 2. సర్వ. (మూ)

గినుఁగొని, మల్లసంగ్రామంబు సేయ
ననిలతనూభవుం డతనిడాయుటయు,
సురుచిరోజ్జ్వలభాను శుచిబృహద్భాను
వరకాంతిహేమభాను వాక్యావధాను
బుధవిబుధోద్యానుఁ బుద్ధ్యభిధానుఁ
బ్రధనజయస్థానుఁ బార్థసన్మాను
శౌర్యవిష్వక్సేను సత్యనిధాను
ధైర్యసన్మణిసాను ధర్మసంధాను
సలఘువిజ్ఞాను భద్రాసనాసీను
బలపవమాను దోర్బలభీమసేనుఁ
గని జరాసంధుండు గర్వంబుతోడ
నని సేయు డగ్గఱి యనిలజుఁ బొడిచె.
భీమసేనుండును భీమశౌర్యమునఁ
నామగధేశుని నదరంటఁ బొడిచె.
హిమకరదోర్దండ హేలాప్రచండ (?)
సమరభీకర వనచరగణ ఘట్టనల
బ్రహ్మాండమెల్లఁ గంపము చాలనొందె;
బ్రహ్మసంస్తుతుఁడైన పరమేశ్వరుండు
మెచ్చెన వ్వేళను; మొఱసి వారప్పుడు
చిచ్చఱ నొడిసియుఁ జెనసి కట్టియును
వేసియు డాసియు వీఁగ నొత్తియును
జేసేఁత నొడసియుఁ జెలఁగి పల్కియును
బ్రబలి సింహంబును భద్రసామజము
విబుధేశ్వరుండును వృత్రాసురుంగుఁ
గులిశంబు గిరియును గొనకొని పోరు
చెలువంబునను భీమసేనమాగధులు
మగఁటిమిఁ గార్తికమాసశుద్ధమున
నగణితంబైన పాడ్యమిదివసంబు

మొదలుగా నుద్దండముష్టిఘట్టనలఁ
బదివేలభంగులఁ బ్రధనంబుచేసి,
పడిఁ ద్రయోదశినాఁడు పరసత్త్వములను
బెడిదంబుగాఁబోర పెనఁగి, వెండియును
ఆచతుర్దశినాఁటియుద్ధరాత్రమున
వైచిత్రి మగధభూవరుఁడలసినను,
ఆవేళ భీమున కచ్యుతుండనియె :
"లావుదొలంగెఁ జాలఁగమాగధునకు ;
పవమానుబలిమి నీపటుభుజాబలిమి
బవరంబులో వీనిభంజింపు." మనిన
ననిలసుతుండు నయ్యనికిఁ దలఁచి
ఘనసత్త్వుఁడై బాహుగర్వంబునందు
నాజరాసంధుని నాజిరంగమున
రాజువాటిగఁ జేసి, కడునడిఁబట్టి
ముక్కున వాతను మొగిఁ జాలరక్త
మొక్కటియైరాఁగ నొగినూఁచుచుఁ గాళ్లు
పసరి నేలనువైచి, వెస వాసితినువు
కొసరక [1]చీల్చి గ్రక్కున రెండుకడలఁ
బాఱవైచుటయు, సపార్శ్వవైచిత్రి-
తో రయంబునను దోడ్తోన నారెండు
బద్దలప్పుడు నెడఁబాయకుండఁగూను
'అద్దిరా! వినినే 'ర్పని కొన్నిగ్రాడ
నంటేర్పడకయుండ నంటిన, లేచి
తొంటియట్లనె వాఁడు దురమున నెదిరె.
అదిగని భీముఁడత్యాశ్చర్యమంది
కదిసి కన్నుల నగ్నికణములుదొరఁగ,

1. నిలిచి. (మూ)

నాగిరివ్రజపట్టణాధీశుఁ బట్టి
లాగించి వ్రేసి తా లఘుగతి వానిఁ
గాలను నేలను గాయంబునొంచి
చీలిచవైచి హెచ్చినసాహసమున
మారుతి వానిఁ బల్మఱు చీల్చివిసిగి
యేరీతిఁ దెగటార్తు నీనీచు! ననుచు
జింతింపుచుండ, నాశ్రితవత్సలుండు
కంతునితండ్రి శ్రీకలితగాత్రుండు
వనజోదరుండప్డు వడముడిఁజూచి
ఘనవృక్షశాఖ చొక్కంబుగాఁ జీల్చి
తాఱుమాఱుగవైవఁ, దనమదిఁదెలిసి
ధీరుఁడై యమ్మగధేశునిఁ జూచి
పికికిట భుజసంధి బెడిదంబుగాఁగఁ
బొడిచియు నడిచియుఁ బొరలించి నొంచి,
యొకకాలు నొకకాల నొకకాలుఁ గేలఁ
బ్రకటంబుగా మెట్టి పట్టి యమ్మేను
పటపటమనఁజీల్చి పవమానుపట్టి
తిటుకునఁ బడవైచెఁ దాఱుమాఱుగను.
ఆవేళ శ్రీకృష్ణుఁ డతిమోదమందె;
నావేళ దేవతలార్చిరి మింట;
భీమునియుద్దండభీమశక్తికిని
భూమికంపించె; నంబుధులెల్లఁ గలఁగె;
హిమగిరియొఱగెనో హేమాచలంబు
కమనీయశక్తి భగ్నంబయ్యెనొక్కొ!
యిదియేమియుత్పాత మిప్పుడటంచు
వదలక పురివారు వడఁకిరి కడఁగి.
మగధేశుమానినీమణులగర్భములు
తెగివిచ్చె; వానియుద్దీప్తసైన్యములు

– పొదివిచ్చె; వానివిస్ఫుటకళేబరము
గదితంబుగా రాజవిప్రులసద్గృహము
తోరణాం [1]తరములఁ దొడరి వేయుటయు,
నారూఢి సూర్యోదయంబయ్యె నంత,
గరుడధ్వజుండు సత్కరుణ మాగధుల
నరుదారరక్షించె సభయంబు వేఁడ.
ఆగిరివ్రజమున నటు చెఱనున్న
సాగరవేష్టిత క్ష్మాతలేశ్వరుల
విడిచి, జరాసంధవిభుసూనుఁ డైన
సుమరాజనిభుని సత్కృత్తమోత్తముని
నాసహదేవుఁ గృపార్ద్రచిత్తమున
భాసురయుక్తిఁ బట్టంబుగట్టి
........................
........................
“ఆజరాసంధు మహాదివ్యరథము
భ్రాజిత నవరత్నరాజి నొప్పఁగ ;
నాయింద్రుఁడును దాని నర్థిఁబ్రార్థింపఁ
బాయక వసునను పార్థివుకిచ్చె ;
నావసువొసగె జయద్రథునకును ;
ఆవసుధేశుండు నట జరాసంధ
విభునకునిచ్చెను వేడుకదీనిఁ.
త్రిభువనస్తుతమైన దివ్యరథంబు
మనమెక్కిపోదము మానుషంబునను.”
అని విహగేంద్రుని హరిదలంచినను,
అతఁడేఁగుదెంచిన నారథంబునకు
జతనంబులోడను సారథిఁజేసి

1. తంబున. (మూ)

హరియును భీముండు నమరేంద్రసుతుఁడు
నరదంబు నెక్కి ధరాధీశకోటి
కొలువంగ వచ్చిరి గురువేగమునను
దలఁపులోఁ బొంగి యింద్రప్రస్థపురికి.
ఆపట్టణము జను లప్పుడిట్లనిరి :
"భూపాలనిపుణుండు భుజబలాన్వితుఁడు
భీముండు సంగ్రామభీముండు గదిసి
యాజి మగధేశ్వరు నడఁచెఁ గావునను
జతురబ్ధివేష్టిత జగతీతలంబు
చతురంబుగా నేలు శమననందనుఁడు.
సహాధికబలు జరాసంధునిఁ జంప
నమర భీముఁడె కాక యన్యు లోపుదురె!"
అని రాజనివహంబు నప్పురిజనులుఁ
జనుదెంచి చూచిరి జలజలోచనుని
భీము నర్జునుని గంభీరంబుతోడ.
ఆమెయిఁ గృష్ణభీమార్జును లంత
ధర్మరాజునకును దగుభక్తి మ్రొక్కి,
పేర్మి జరాసంధుఁ బెనఁచి యుగ్రాజి
సగాఁచిన క్రమమెల్ల నంతయుఁ జెప్పి,
గణుతింప నతనిచేఁ గారాగృహముల
నున్న రాజుల నెల్ల నొగిఁ దెచ్చి చూప,
సన్నాహమున వారు శమనసూనునకు
దండప్రణామంబు దగఁ జేయుటయును,
దండితో వారిసంగతి నాదరించి
నిజదేశములకంపె నెయ్యంబుతోడ.
భుజగేంద్రశయనుఁ డప్పుడు పాండుసుతుల
వీడ్కొని రథమెక్కి వెసఁ బురంబునకు
వేడ్కతో నరిగె నివేశంబునందు.

అంతట ధర్మజుం డనిలజున కనియె:
'నెంతయుఁ గడఁక మీరెల్ల సైన్యములు
సేవింపఁ బూర్వదక్షిణపశ్చిమముల
కా [1] యుత్తరంబునకరిగి రాజులను
గెలిచి కప్పంబులఁ గీర్తితోఁ గొనుచు
బలిమి నేతెం.' డని పనుప నాక్షణమె
నాల్గువారథులపై నడచెడ క్రొత్త
నాల్గువారిధులట్లు నలుగురుఁ గదలి
చనిరి నా." రనవుడు జనమేజయుండు
జననుతుఁడైన వైశంపాయనునకు:
"నేదేశములకు వారేఁగిరి? ధనము
లేదెసఁ దెచ్చిరి? యెఱింగింపు." మనినఁ
జతురాత్ముఁడైన వైశంపాయనుండు
మతి జనమేజయ క్ష్మానాథు కనియె:

విజయు నుత్తరదిగ్విజయము

"వర్ణనకెక్కు పావకదత్తమైన
స్వర్ణదివ్యరథంబు జయముతో నెక్కి,
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
మత్తశాత్రవరాజమణుల మర్దించి,
యుత్తరభూమికి నురువడి నేఁగి
రణరంగమున నుమూరమణునిఁ బ్రమథ-
గణముల గెలిచి, భీకరశౌర్యమునను
ధనదు నోడించి యర్థము చాలఁ గొనుచు,
ననిమిషేశ్వరునిచే హాటకంబంది,

1. వుత్తరంబున. (మూ) వ్యావహారికోచ్చారణననుసరించి కవి యీపదమును వకారాదిగాఁ బ్రయోగించియుండును.

క్రమ్మఱ పూర్వభాగమునకే తెంచి
సమ్మదమ్మున బాహుసత్త్వుఁడై మెఱసి
వరపుళిందావనీశ్వరు నోర్చి పేర్చి,
దురములోఁ బ్రతివింధ్యుఁ ద్రుళ్లడఁగించి,
సకలమహాద్వీప జగదీశ్వరులను
బ్రకటంబుగా గెల్చి పౌరుషంబునను,
రాజులుగొలువంగ రాజసంబునను
రాజశేఖరకృపా రమణీయుఁడగుచు
శూరత వచ్చెఁ బ్రాగ్జ్యోతిషంబునకు.
నారూఢిఁ దత్పట్టణాధీశుఁడైన
భగదత్తుఁడే తెంచి పార్థుసి[illegible]డఁ
దెగి రణంబొనరించెఁ దివిటీపోనీక.
ఎనిమిదిదివసంబు లెదిరి పోరాడి
యనిమిషేంద్రకుమారు నఖిలాస్త్రములను
పడి భగ్నమగుచుఁ గవ్వాడికినిట్లనియె :
“ నెడపనికడఁకతో నే నింద్రసఖుఁడ ;
నీవింద్రసుతుఁడవు ; నీకును నాకు
వావిరిఁబగలేదు ; వలసినర్థముల
నడుగుమిచ్చెద.” నన్న నతఁడాహవంబు
తడవక [1] శౌర్యసంధానుఁడై మించి
భగదత్తు సంతతప్రముదితచిత్తు

.........................

బాహాబలోద్వృత్తు బహుదానవృత్తు
నాహవస్థాయత్తు నతిపుణ్యసత్తుఁ
గని వానికినిభక్తి గలిగి యిట్లనియె :
“ ననఘాత్మకుఁడు భరతాన్వయుండైన

1. శౌర్యవాదియని కవియూహగాఁబోలు !

రాజు ధర్మజుఁడు సంగంభంబుతోడ
రాజసూయమహాధ్వరంబొనర్చెడిని ;
అరివెట్టునీ." వన్న నఖిలహేమములు
వరరత్నములు గజవాజియూథములు
నిచ్చినఁ గొని భక్తినిట్లనిపలికె :
"మచ్చిక ధర్మజు మఖమునకీవు
రమ్ము వేగమున వీరశ్రేష్ఠ !" యనుచు
నిమ్ముఁ దనుభూమి కేఁగె శౌర్యమున.

### భీముని పూర్వదిగ్విజయము

చతురంగబలములసంఖ్యలుగొలువఁ
బ్రతిపక్షులను గెల్చి, పవననందనుఁడు
నానార్థములుగొని నడచి ముందరను
బూని కులూతభూభుజు బృహద్బలుని
గెలిచి, యుత్తరభూమికిని జని యందుఁ
దలిపితోడను వామదేవ గౌతముల
వసునామములుగల వసుధేశ్వరులను
బొసఁగఁగ గెలిచి, యాపూర్వదిక్కునకుఁ
జని భక్తిఁ బాంచాలచక్రేశుచేతఁ
గనకాంబరంబులు గాంచి, విదేహ
రాజుజయించి, ఘోరదశార్ణవిభుని
యాజి [1] సుధన్వుని యతిశౌర్యమునకు
వెస మెచ్చి తనసైన్యవిభునిఁగాఁ జేసి,
యసమానయశుఁడైన యశ్వమేధేశుఁ
డగురోచమానుని ననుజయుక్తముగ
మగఁటిమి గెలిచి, సమ్మదచిత్తమునను

---

1. సుధర్మని. (మూ) సుధన్వుఁడని నన్నయ. అధిసేనాపతిం చక్రే సుధర్మాణం మహాబలం. అని వ్యాస. భా.

చేదిభూమికివచ్చి శిశుపాలుచేతఁ
బ్రోదిమీఱంగను బూజితుండగుచు
నతనిచే శమనసుతాధ్వరంబునకు
నతులితంబైనట్టి యర్థంబు గాంచి,
చేదిదేశము వెళ్లి చిత్తునిఁగాంచి
[1] మేదినీశు సుపార్శ్వ మేటిసత్వమున
ననిగెల్చి, గజపతి నామత్స్యనృపతి
ఘనమాళవులను మాగధమహీశ్వరుల
దండించి, మగధభూధవతనూభవుని
నండజపతిజవు నాసహదేవు
మన్నించి వానిచే మఱి పూజవడసి,
యెన్నంగ హిమగిరికేఁగి తేజమున
నాగిరీంద్రునిచేత ననుమతిఁబడసి,
వేగంబె నిర్జరవిభుపర్వతమున
బహుళకిరాతావళీపతుల నేర్పుగను
సహజశౌర్యుల [2] నుదంచజ్జయాధికుల
ధర్మయుక్తులను సుధర్మధార్మికుల
నర్మిలిఁ జంద్రసేనాధీశ్వరులను
మురహారహితుల సముద్రసేనులను
నాపరాక్రమునఁ గర్ణవత్సపతులను
వైరి [3] భంజన పౌండ్రవాసుదేవులను
గౌరవంబున [4] వశంకరులుగాఁజేసి
ధరణీశ్వరులగెల్చి ధనము రత్నములు
గురుతరంబగుశతకోటి సంఖ్యములు

1. మేదినీశుని పార్శ్వమేటిసత్వమున. 2. నుదంజభవకాశుకులను. 3. జంభన.
4. వశీకరులు. (మూ)

## సహదేవుని దక్షిణదిగ్విజయము

గొని యేఁగె భీముఁ డత్యుగ్రశౌర్యమున ;
ననఘుఁ డుత్తముఁడు [1]సహదేవుఁ డంత
ధీరత దక్షిణదిక్కునకరిగి
శూరసుమిత్రుని శూరసేనులను
దంతవక్త్రుని సాళ్వధరణీశ్వరులను
సంతత ప్రతిపక్షజగదీశవరుల
శృంగారయుతుల గోశృంగగిరీంద్ర
సంగుల నృపుల నిస్సంగులఁ జేసి,
కుంతిభోజునిచేతఁ గోరి యర్ఘ్యములు
సంతసమునఁ గాంచి, జయము రెట్టించి
జలజాక్షుపగవాని జంభకు నొడిచి,
తలకొని వానినందనునిచే సమద
గజ హయరత్నసంఘంబులఁ గొనుచు
విజయుఁడై నర్మద వేడుకఁ జేరి.
యందు నవంతిదేశాధీశ్వరులను
విందానువిందుల వేడుక గెలిచి
పోయి మాహిష్మతీపురమున పిడియ,
నాయెడ పడి నీలుఁడను మహారాజు
దీకొనియెను సహదేవునితోడ.
ఢాక మాద్రేయుఁ డడ్డము చొచ్చి పోర,
నతనిపై నీలుండు ననలంబుఁ బఱప
నతివేగమున వహ్ని యాసహదేవు
సకలసేనలమీఁద సరవితోఁ జుట్టెఁ
బ్రకటితగతి." నన్నఁ బారీక్షితుండు

---

1. ఈపదమును దీర్ఘమధ్యముగాఁ బ్రయోగించుట ఇతనికే గాక, ఆదిపర్వకర్తయగు తిమ్మయకును బరిపాటియే.

చతురోక్తిఁ బలికె వైశంపాయనునకుఁ :
" ప్రతిభటుండై వచ్చి పావకుండేల
యాసహదేవుని నప్పుడు డగ్గఱెను ?
ఈసమయంబున నింతయుఁ దెలుపు."
మనిన నమ్మునివరుం డతనికిట్లనియె :
" జననాథకులవార్ధిచంద్రుఁడై నట్టి
నీలువంశంబున నిషధుండు ధాత్రి
యేలంగ, వహ్ని మహీదేవుఁడగుచు
వేదంబుచదువుచు వేడ్కఁ దత్పురము
సాదరంబునఁ జొచ్చి, చక్కనియువతిఁ
బరసతిఁ బట్టుక భావజుకేళి
సరసతసలుపంగ, జనపతిహితులు
పట్టుక వచ్చి భూపతిమ్రోలఁ బెట్టి
పెట్టిన [1] శాస్త్రసంప్రీతితో నతని
దండింపఁ బోయిన, దహనుఁడై మిగుల
మండుచునుండిన, మానవేశ్వరుఁడు
వెఱచి పావకునకు వెస మ్రొక్కి పలికె :
" నెఱుఁగక యజ్ఞాన మిప్పుడు చేసితిని
మన్నించు." మనవుడు మఱి పావకుండు
సన్నిధియై మహీశ్వరునకిట్లనియె :
" నడుగు నీకోరినయట్టివరంబు
ఇడయకిచ్చెద." నన్న దహనునకనియె:
" నాపురిమీఁద నేనరపతులైన
నేపారవచ్చిన నంతయు నీవు
కదియు వారలమీఁద గ్రక్కున." ననిన
వదలక యగ్నియు వరమిచ్చి పలికె :

1. శాస్త్రసమ్మతముతో నని యర్థము కాఁబోలు !

"నీపురిఁగల మానినీరత్నములకుఁ
బాపంబుపొందదు పరపతులందు
రతిసల్పినను ; మహీరమణ, నీవిపుడు
హితబుద్ధినుండుము యెంతయు." ననుచుఁ
జెప్పిన నృపుఁడును జేయుచునుండె.
నెప్పుడు పరధరణీశులవ్వీట
విడిసిన నీలుండు విదళింపనుండుఁ
గడువడితో ; నదికారణంబునను
అనలదేవుండు సహదేవుమీఁదఁ
గనలుచుఁ గదిసినం గరసరోజములు
మొగిచి మాద్రేయుండు మును శుచియగుచు
మిగులంగ దర్భపై మోఁకువనుండి
యగ్నిసూక్తంబు లయ్యెడఁబఠింపుచును (?)
అగ్నిదేవుని ఘను నభినుతిచేసె :
[1] "నీతదర్థంబులు సిఖిల వేదములు ;
పూతంబులకునెల్లఁ బూతయుక్తుఁడవు ;
ధర్మజుక్రతువు కిత్తఱిసి విఘ్నంబు
పేర్మితోఁ జేయకు పెరిమ మన్నింపు" :
మనవుడు ప్రీతుఁడై యగ్ని దేవుండు
జననుతుఁడైన యాసహదేవునకును
వరదుఁడై యుండెను ; వడిని నీలుండుఁ
గరిహయరత్నముల్ కనకాంబరములుఁ
దెచ్చి వేడుక సహదేవున కప్పు
డిచ్చి సద్భక్తితో నిట్లనిపలికె :
"అమితప్రభావ, ధైర్యామరగ్రావ,
విమలకంబుగ్రీవ, విజితారిరావ,

---

1. నిత్యత్వమైయుండు. (మా)

భూతినీలగ్రీవ, పోషితజీవ,
నీతిపద్మజదేవ, నిత్యస్వభావ, (?)
నుతిమహీదేవ, మానుషబలదేవ,
చతురశిఖాదేవసమ సహదేవ, (?)
శరణులఁగావ సజ్జనులనుబ్రోవఁ
బరఁగ విష్ణుసినేవఁ బరఁగితి వీవ;
నీకు నెవ్వరుసరి నృపులులోకముల!
రాకాసుధాకరారవితారకముగ
మన్నింపు; నిలుపుము మము రాజ్యములను
ఉన్నతి." ననవుడు నుప్పొంగి వేడ్క-
నాసహదేవుండు నారాజుకనియె:
"భానుగప్రౌఢితోఁ బరఁగ రాజ్యంబు
సేయుము; నేఁగల్గఁ జింతనీకేల!
ఏయెడ నీకునాకెంతయుఁ బొందు."
అని వానివీడ్కొని యట దక్షిణమునఁ
జని మహారాష్ట్రరాజన్యులచేత
సకలార్థములుగొని, సాగరద్వీప
నికటనిషాదులు, [1] నిజకాలముఖులు,
కర్ణసత్ప్రభులు, రాక్షసయోధవరులు,
స్వర్ణవర్ణులు రామశైలసుతామ్ర
పతులు, ద్వీపజయంతి పట్టణాధిపులు,
నతులితవశవర్తులై తన్నుగొలువఁ
బోయి కేరళ పాండ్య పుండ్ర కాళింగ
నాయకులను [2] బ్రధనంబునగెలిచి,
ద్రావిడ యవన గాంధారభూపతుల
లావుననోర్చి, చాలఁగ లక్ష్మిఁగొనుచు

1. ఇట్టిపదములను వ్యర్థముగాఁ బ్రయోగించుట యీతనిపరిపాటి.
2. ప్రదరము. (మూ)

దక్షిణభూమికిఁ దద్దయు నేఁగి
రాక్షసేంద్రుఁడు రఘురామభృత్యుండు
శ్రీవిభీషణునకుఁ జెప్పిపంపినను,
భావించి యతఁడును భక్తితోడుతను
[1] శ్రీరామమాడలుఁ జింతితార్థములు
వారణ హయ రథ వ్రాత రత్నములు
నెసఁగఁ జతుర్దశ హేమతాళములు
నసమాంబరంబులు నఖిలార్థములను
బంపెను సహదేవపార్థివేంద్రునకు.
సొంపొంద నదిగొని చూచి మాద్రేయుఁ
డంతట పౌలస్త్యునధిపుల చేత
నెంతయుఁ గప్పంబు లింపుగాఁ గొనుచు
సహదేవుఁడే తెంచె జనలోకనాథ,
విహితప్రతాపుఁడై విశ్వంబు పొగడ.

## నకులుని పశ్చిమ దిగ్విజయము

నకులుండు నతులితోన్నతపరాక్రముఁడు
వకుళప్రసూనోరు వరకచభరుఁడు
బలములు గొలువంగఁ బ్రఖ్యాతముగను
దెలివితోఁ బశ్చిమదిక్కున కేఁగి
కరి తురంగ భటప్రకరఘట్టనలను
శరధులు ఘూర్ణిల్ల, సంభ్రమంబునను
మాద్రేయుఁ డత్యుగ్రమానుషంబునను
భద్రసైన్యంబులు బహుముఖంబులుగ
నరుదేర [2] మాహితకావనీశ్వరులఁ
దెఱఁగొప్పఁగా లాటదేశాధిపతుల

1. రామనామాంకితములగు నాణెములు గాఁబోలు. 2. మహితఉద్యావనీశ్వరుల. (మా)

నాభీరగణముల నవలీలగెలిచి
యాభారతీసింధువందువర్తించు
[1]ద్రావణేయుల సముద్దండవిక్రములఁ
బావన గాంధార పర్వతాధిపుల
వశవర్తులనుజేసి, వాసుదేవునకుఁ
గుశలంబెఱింగించి కోరికతోడ
శాకల్యపురమున శల్యు[2]మద్రేశు
భీకరశౌర్యునిఁ బృథుబాహుబలునిఁ
దనుమేనమామను సత్త్వగుణాంభోధి
రమణీయుఁడై కాంచి, రత్నరాసులను
హేమవాహనములు నిచ్చితార్థములుఁ
బ్రేమతోఁ గొంచును బిరుదుఁడై యరిగి
యుత్తుయ శ్రీపశ్చిమాంబుధిఁ జూచి
కుక్షినివాసులఁ గ్రూరకర్ములను
బహుకిరాతులఁ బ్రతాపంబున గెలిచి,
విహిత సద్వరుణేంద్ర విశద సంపసథ
నరనాయకులచేత నానాధనములు
పరమానురాగుఁడై పడసి యవ్వాని
దశసహ[3]స్రోష్ట్రకదంబంబు చెంత
వశముగాఁ బెఱికి రా వైరిభీకరుఁడు
నకులుండు వోయె నసంతశౌర్యమున.
అకలంకులైనట్టి యనిలజ పార్థ
నకులసహదేవ నరవరోత్తములు
ప్రకటిత గుణధైర్య బాహువిక్రములు
విశ్వభూతలము దిగ్విజయంబుచేసి
శాశ్వతశ్రీలెల్ల శమననూనునకు

---

1. గ్రామణీయులని నన్నయ. సింధుకూలాశ్రితా యేచ గ్రామణీయా మహాబలాః. అని. వ్యా. భా. 2. మాద్రేయు. 3. ప్రాష్ట......చేత. (మూ)

వేడుకతోడ వేర్వేఱ నిచ్చినను,
బ్రోడలు పొగడ నప్పుడు ధర్మసుతుఁడు
సంతోషమునఁ బొంది సద్వరుణేశు
కంతుభంజనమిత్రు కైవడి లక్ష్మి
చాలంగఁ బ్రబలి సోత్సాహుఁడై యుండె.
ఓలి ధరాపాలుఁ డూర్జితశ్రీల
రాజసూయమహాధ్వరము సేయఁ బూని
రాజిత నిజమంత్రిగణ్యులం బిలిచి:
"ధనధాన్యములును రత్నములు గోధనము
ఘనదంతివాజులుఁ గలిగెఁ జాలఁగను;
నవనిధానంబులు నానా[1] ధనములఁ
బ్రవిమలంబై పెట్టె బండారమిండ్లుఁ
బరిపూర్ణమై యుండుఁ బ్రఖ్యాతిగాను;
అరుదుగా రాజసూయాధ్వరంబిపుడు
గావింపు." మనునంతఁ గమలలోచనుఁడు
వేవేగమున వచ్చి వెస ధర్మజునకు
వందనం బొనరించి వలయు రత్నములు
పొందుగా నిచ్చెనఁ, బుండరీకాక్షుఁ
బూజించి యా యమపుత్త్రుఁ డిట్లనియె:
"రాజీవనాభ, ధరాఘనవర్ణ,
నీయనుగ్రహమున నిఖిలరాజులును
ఈయెడ నరివెట్టి రెంతయు మాకు;
నపరిమితంబైన యర్థంబు గలిగె;
నుపమ విప్రులకును నుచితదక్షిణలు
దానంబులును బ్రసిద్ధముగఁ జేయుంచి
మానుగా మఖము సమ్మతిముగావింపు."
మనిన నారాయణుం డధిపతి కనియె:
"నెనయంగఁ బూజ్యుండ వెల్లయంశముల;

1. విధ. (మూ)

రాజులలోనెల్ల రాజసంబునను
రాజితధర్మ నిర్మలయశోనిధిప ;
సకలసామ్రాజ్య ప్రశస్తలక్ష్ములకు
నకలంకగతిఁ గర్త నగుశంబునీవు ;
ఇదితగుఁ దగదన కేపనికైన
ముదమునఁ బనిపంపు మునుపుచేసెదను ;”
అనిన సంతోషించె నప్పుడు ధర్మజుఁడు.

## రాజసూయాధ్వర ప్రారంభము

వనజాక్షు ధౌమ్య సద్వ్యాసానుమతిని
ఘనరాజసూయయాగము సేయఁబూని
యనుజన్ము సహదేవు నప్పుడుచూచి
పలికె ధర్మజుఁడు : “భూపతుల నందఱను
బిలువంగఁబంపుము పెద్దఱికమున ;
రప్పింపు భూదేవరాజుల నెల్ల ;
నొప్పుగా వారికి నుచితగేహములు
కట్టింపు ; యాగోపకరణంబు లెల్ల
గట్టిగాఁ దెప్పింపు గడఁకనీ.” వనిన
నగుఁగాక యనుచు సహదేవుఁడపుడు
నిగమోక్తిగాఁగ నన్నియు సమకూర్చి,
యుర్వీదేవతల రాజులను రప్పించి,
సర్వసౌఖ్యములను సంతోషములను
నుండుచో ; ధర్మజుండోగి నకులునకు
నిండినభక్తితో నెఱయనిట్లనియె :
“ గాంగేయుఁడాదిగాఁగల బాంధవులను
సంగతిఁదో తెమ్ము చయ్యన.” ననిన
నతఁడును గరిపురికరిగి భీష్మునకు
ధృతరాష్ట్రునకును యుధిష్ఠిరుముఖము

క్రమమొల్లఁ జెప్పి వేగముగ రండనినఁ,
బ్రముదితంబుగను గుంభజ భీష్మ విదుర
ధృతరాష్ట్ర కృప కర్ణ ధృతిసోమదత్త
చతురభూరిశ్రవ శ్శల్య సైంధవులు
దుర్యోధనుండును దుశ్శాసనుండు
[1]నార్యనిగ్రహుఁడైన యాశకునియును
వచ్చిన, నవ్వేళ వరుసతోడుతను
మచ్చికఁ బూజించి మనుజేంద్రుఁ డనియె :
“ మీయనుగ్రహమున మెఱసి యీక్రతువు
సేయఁగఁ బూనితిఁ జిత్రంబుగాను ;
ఇదినిర్వహింప మీరెంతయు వలయు
విదితంబుగా.” నని వెస వారియాజ్ఞఁ
బడసి ధర్మజుఁడు ప్రభావంబునందుఁ
గడఁగి హాటకరత్న ఘనదానతతులు
పెట్టంగ [2]నియమించెఁ బేర్మితోఁ గృపుని ;
గట్టిగా నాఁగామికార్యముల్ దెలియ
గాంగేయ ద్రోణులఁ [3]గర్తలఁ జేసె ;
సంగతి మీఱంగ సకలార్థములకుఁ
గలయ రాజులు దెచ్చు కప్పంబులకును
గొలఁదితో నీఁబుచ్చుకొనఁ గర్తఁ జేసె
విదురుని బహునీతివిదుని నుత్తముని ;
ముదమున నిష్టాన్నములు భక్తిఁ బెట్టఁ
దుదిని గట్టడచేసె దుశ్శాసనుని ;
బదవితో మణిహేమభండారములకుఁ
గురురాజుఁ గర్తగాఁ గొనకొని చేసె.
నిరుపమాలంకార నీతిశోభితుఁడు

---

1. ఆర్యాది. 2. నిర్మించె. 3. కర్తగా. (మూ)

ప్రాజ్ఞుండు నయశాలి పాండవాగ్రజుండు
యజ్ఞదీక్షితుండయ్యె నాగమోక్తులను.
రాజతేజము విప్రరాజతేజమును
రాజిత నవరత్నరాజితేజమును
గల ధర్మసుతుని లోకములవారెల్ల
పలరుచుఁ జూచిరి యద్భుతంబంది.
బ్రాహ్మణోత్తమ మణిప్రకరంబునడుమ
బ్రహ్మతేజంబున బ్రహ్మయుంబోలి
యుండంగ నవ్వేళ యురువినోదముల
మండలేశ్వర................
భూసురాశీర్వాద పుణ్యనాదములు
భాసిల్లఁజేయుచో బహువిధంబులను
బంచమహాశబ్ద పటునినాదములు
సంచితంబై మ్రోసె; నాసమయమున
ధౌమ్యుండుఁ బైలుండుఁ దగినహోతలుగ,
సౌమ్యుండు నిగమార్థచతురుండు ఘనుఁడు
యాజ్ఞవల్క్యమునీంద్రుఁ డధ్వర్యుఁడుగను,
సుజ్ఞానుఁడైన వ్యాసుండు బ్రహ్మగను,
.........................
పూతనారదముఖ్య పుణ్యమానులును
రాజిత భీష్మాది రాజశేఖరులు
నోజతో సభ్యులై యున్నతిఁగొలువ,
నభిరామ సర్వక్రియా సమగ్రముగ
శుభకరంబుగ రాజసూయయాగంబు
సువ్రతంబుగఁ జేసి, సొంపుమీఱంగఁ
దీవ్రార్కతేజుఁడై త్రిజగంబుఁబొగడ
వేదవిప్రులకును వివిధదానములు
మోదంబుతోఁ జేసి, మునివరేణ్యులకు

ధరణీసురులకు భూనాయకులకు
మఱియును వర్ణాశ్రమముల వారికిని
సమిత దానంబులు నన్నదానములుఁ
గ్రమముతోఁ జేసెను ఘనధర్మసుతుఁడు."
అనుచు సభాపర్వమందలికథలు
జనమేజయునకు వైశంపాయనుండు
వినిపించె శాస్త్రోక్తివిఖ్యాతముగను
మునిసమూహంబు లిమ్ములఁ బ్రస్తుతింప.
భానుకులాంభోధి పావనచంద్ర,
భానుకోటిప్రభా భాభాసమాన,
యంజనాత్మజలోల, యతిక్ష్మాపాల,
మంజీరయుతపాద, మధురప్రసాద,
శరముఖాకర్షిత జలధికల్లోల,
ధరణిజాలింగన తాత్పర్యశీల,
బాణాసనాంకిత పటుభుజాదండ,
బాణభీకర శత్రుపటలసంహార,
అసమసాహిత్య విద్యాచతుర్ముఖుఁడు
రసికుఁడు బాలసరస్వతీశ్వరుఁడు
పసనొనర్చిన సభాపర్వంబునందు
నసదృశంబుగఁ బ్రథమాశ్వాసము య్యె.

---

# ద్వితీయాశ్వాసము



శ్రీభోగసంపన్న, శివచాపభిన్న,
సౌభాగ్యసుత్రామ, సాకేతరామ,
శరణాగతత్రాణ జయబిరుదముగ
ధర నెగడినమహాత్మా, చిత్తగింపు;
అక్కథకుఁడు శౌనకాదిసన్మునుల
కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె.
దానధర్మాచార తత్పరుఁడైన
భూనాథ కులశిరోభూషణుం డధిక
వైభవసురరాజు వాక్యాహిరాజు
........................
సత్కాంతిరాజు [1]నిశ్చలగిరిరాజు
సత్కీర్తిరఘురాజు సద్ధర్మరాజు
రాజసూయ మహాధ్వరంబొప్పఁజేసి
తేజంబుతోడ సుస్థిరలక్ష్మినుండ,
నతనిని నారదుం డఖిలభంగులను
స్తుతియించి, శ్రీకృష్ణుసొంపుతోఁబొగడె
రాజులువినఁగ సంరంభంబుతోడ:
" రాజీవనేత్రుండు రవికోటి తేజుఁ
డతఁడు కేవలుఁడె మహానుభావుండు!
సితపద్మభవ మునిశ్రేష్ఠులయాజ్ఞ
నాదినారాయణుం డబ్జనాభుండు
వేదాంతవేద్యుండు విమలాత్మకుండు

1. ధైర్యమునకు హిమవంతునివంటివాఁడని కవియూహ కాఁబోలు!

యదువంశమునఁ బుట్టి యఖిలంబు నేలుఁగ ;
మధువైరి పనుపున మనుజేంద్రులెల్ల
యక్షగంధర్వ విద్యాధర సిద్ధ
రాక్షసాంశంబులఁ బ్రభవించిరయ్యె."
అనుచు నానారదుండనిన, వారలకు

## ధర్మజుఁడు శ్రీకృష్ణుఁ బూజించుట

అనఘుండు భీష్ముఁడిట్లనియె : "ఋత్విజుఁడు
గురుఁడు స్నాతకుఁడు సతుఁడు వలయేశ్వరుఁడు
సాంసంయమియు మునివర్ణితయశుఁడు
పూజనీయులు వీరు పుణ్యచరిత్ర !
రాజితంబునను వీరలలోనఁ బెద్ద
యగువానిఁ బూజింపు." మనిచెప్పుటయును,
దగ ముదంబంది యాధర్మనందనుఁడు
గాంగేయుతోడను గడఁగి యిట్లనియె :
"[1] అంగిక లుత్తములగు వీరిలోన
నెవ్వానిఁ బూజింతు నెఱిఁగింపు." మనిన
నవ్యసుధీశుఁడా నాతఁడిట్లనియె :
"సర్వలోకములను సర్వతేజములఁ
బర్వెడి సూర్యునిభాతి, సుధాంశుఁ
డేపారఁగా ధాత్రి నెల్ల కాంతులను
జూపట్టు భంగిని. శోభితంబుగను
దనదీప్తి జగములఁ దగ వెలిఁగించు
ఘనుఁడచ్యుతుండు పంకజలోచనుండు
పరికింప నర్ఘ్యుండు పసనర్ఘ్యమునకు ;
నొరులరువారలుగారు యుక్తి భావింప.

1. ఈపదమునీతఁడు పదింపదిగాఁ బ్రయోగించును ; సభ్యులనియూహయా !

హరిపూజ సేయుట యజ్ఞఫలంబు
పరతత్త్వమున నీకు సమకూరు." ననిన
నొగి నా సహదేవుఁ డాదరంబుఁ దోయ
నిగమవేద్యుం డైన నీరజాక్షునకుఁ
బూని యర్ఘ్యంబిచ్చి పూజ సేయుటయు,
దాని సహింపక తత్తఱిఁ గలుషించి
శ్రీకృష్ణుదూషించి శిశుపాలుఁ డపుడు
శ్రీకరుండగు యుధిష్ఠిరునకిట్లనియెఁ :

## శిశుపాలుఁడు ధర్మజునధిక్షేపించుట

"బట్టాభిషిక్తులు బలసియుండఁగను
నెట్టణంబుగ ధర్మ[1]నియతులుండఁగను
అతివిశిష్టాచార్యులార్యులుండఁగను
మతిదప్పి భీష్ముని మాటలు నమ్మి
యేల దాశార్హుని నర్హుఁ డనుచుఁ
జాలఁ బూజించితి సద్భక్తితోడ?
కురువృద్ధుఁడగు భీష్మకువలయేశ్వరుఁడు
పరధర్మమెఱుఁగక వాసుదేవునకు
జడునకు నేల పూజలు సేయఁబనిచె?
[2]వెడగుఁ డనంబడి; వృద్ధున కేల
బుద్ధులు గలుగును భువనంబునందు!
సిద్ధతేజులు విప్రులెల్ల భూపతులు
[3]చూడంగ, నర్ఘ్యంబు నుచితోక్తి నిచ్చి
పుండరీకాక్షుఁ బూజింపఁదగునె!
అతనికిఁ గూర్తునే సఖిలసంపదలు
నతివేగమున నిట్లు పటుదితగుఁగాని;

---

1. నీతు. 2. ఉడుగు. 3. చూడంగ. (మూ)

యితనికి బహుమాన మిటు సేయఁదగునె!
క్షితిఁ బెద్దయనుచుఁ బూజించితే కృష్ణు!
వసుదేవుఁ డుండంగ వసుమతీనాథ!
అసమాన ఋత్విజుం డనవిచారించి
వరుసఁ బూజించితే వ్యాసుఁ డుండఁగను!
హరిని నీ వాచార్యుఁ డని కొల్చితేని?
ద్రోణుండు కృపుఁడును [1] ద్రౌణియుండఁగను;
క్షోణీశుఁ డని పూజ సొరిదిఁ జేసితివొ!
యాదవు లెచ్చోట నవనినాయకులె!
మేదినిలోన సముచితధర్మకరు
పూజనీయులు గుణాంభోధులుండఁగ,
బూజించితేల యీ పుష్కరనయను!
బాలిశుండగు భీష్ము పలుకులు నమ్మి
బేలవై తేలయ్య పృథివీశతిలక!
నీ వధికుఁడ వని నిఖిలభూపతులు
నే వేగ వచ్చిరి వేడుకతోడ
నీ మఖంబునకును నెఱి వచ్చినట్టి
యామహాత్ముల నెల్ల నవమాన మేల
చేసి కృష్ణునిఁ బూజ చేసితి వీవు!
ఈ సమస్తధరిత్రి నిటు ధర్మతనయ,
ధర్మ మేనికును! ధర్మాత్మ, వినుము
ధర్మంబెఱుఁగక తత్తతిని నిలిడిన
భావంబునకు సిగ్గుపడక యుర్వ్యంబు
గోవిందునకు సందుకొన నుచితంబె!
భువి నెఖ్యుఁ డనఁ బూర్ణేందుముఖియుఁ,
జెవిటికి గీతంబుఁ, జీకు కద్దంబు,

1. ద్రోణుండుండంగను. (మూ)

హారంబు శరుచరు, శఖిలగంధములు
గారవోన్నతి నాసికాహీనునకును,
వేదురునకుఁజీర, విరసచిత్తునకు
వేదంబు, లోభికి వితరణగుణముఁ
జేయుట విష్ణుఁబూజించుట; మఱియు
నీయవనీశ్వరు లిందఱు [1] ండంగ
నర్చింతురే కృష్ణు?" అని యొగ్గులాడి
పేర్చినయలుకతోఁ బెరిమె నేఁగుటయు,
నతనిపిఱుందనే యమసుతుండరిగి
యతులితప్రియభాష నప్పుడిట్లనియె:

### ధర్మజాదులు శిశుపాలు ననునయించుట

"ధీమంతులకుఁ గృపాదృష్టియుక్తులకుఁ
గోమలయశులకు గుణవిశాలురకుఁ
జారునిర్మల ధర్మచరిత్రులైనట్టి
భూరితేజులకు నెప్పుడుఁ గోపమేల?
క్రూరంబు శిఖికంటెఁ గులిశంబుకంటె
దారుణంబై యుండు ధారుణిలోన.
ఆదినారాయణుండైనట్టివాఁడు
వేదాంతవేద్యుఁడై వెలసినవాఁడు
ప్రల్లదులను ద్రుంపఁ గొల్పడ్డవాఁడు
.........................
శరణాగతులఁ బ్రోవఁ జాలెడువాఁడు
పరమాత్ముఁడై లక్ష్మిఁ బ్రబలినవాఁడు
నాతఁడర్హుండని యాభీష్ముఁ డెఱిఁగి
సతతంబుఁ బూజింప సగవిశోఁ బనుప,

1. నవంగ. (మూ)

నేనుబూజించితి ; నిదియొగ్గుగాదు ;
మానసంబున నీవు మానుకోపంబు.
గురుఁడు దైవంబని కుంభినీశ్వరులు
వరుసతోఁ గృష్ణుని వదలక కొలువ,
నిందింపఁదగునయ్య నీకు నచ్యుతుని!
నెందును బగవాను హితబుద్ధి." యనుచు
శిశుపాలు రమ్మని చెఁగిపిల్చి మను
విశదోక్తులందును వేడ్కమన్నింప,
నంత భీష్ముఁడు పాండవాగ్రజున కనియె :
"యంతరంబెఱుఁగనియట్టివీనికిని
బ్రియము చెప్పంగను బేలవె నీవు!
నయవిహీనుఁడు జగన్నాథదూషకుఁడు
శిశువు క్రూరాత్ముఁ డీశిశుపాలుఁ ; డతని
వశవర్తిఁ జేయంగవలదు నీకధిప!"
అని ధర్మసూనున కంతయుఁ జెప్పి
జననాథచంద్రుండు జాహ్నవీసుతుఁడు
బాలుండయిన శిశుపాలున కనియె :
"నేలగోపంబు లక్ష్మీశ్వరుమీఁద!
తగదంటివర్ఘ్యంబు ధరణీధరునకుఁ ;
దగవెఱుంగవు మహాధర్మబాహ్యుఁడవు ;
క్రూరచిత్తుండవు కుంభినిలోన ;
నేరువెఱుంగవు నీతిదూరుఁడవు ;
హరితోడఁ బోరినయట్టివారెల్ల
[1] మరణంబులగుదురు ; మఱి కైటభారి
శరణన్నవారెల్ల జయమునొందుదురు ;
సరసిజాక్షునితోడ శత్రుత్వమేల!

---

1. మృతులగుదురనునర్థములో నిట్టిప్రయోగము శ్రీనాథునిరచనయందును గలదు. 'మాటనాల్కనయుండంగ మరణమయ్యె.' కాశీ. ౫ ఆ. 154 ప.

బాలుఁడై యున్నను బ్రాహ్మణోత్తముఁడు
చాలంగఁ బూజ్యుండు జగములయందు;
సతులవిక్రమశాలియగు మహీపభుఁడు
నతిశిఁ బాత్రుండందు నూతనశ్రీల;
నీరెండువిధముల నెలమిఁ గృష్ణుండె
యారయ [1] నర్హుఁ డర్ఘ్యంబునకిలను.
సచరాచరంబైన జగములకెల్లఁ
బ్రచురంబుగాఁ గర్త పద్మలోచనుఁడు.
వృద్ధులై యుండియు విశ్వంబులోన
బుద్ధులు లేనట్టి పురుషులేమిటికి!
పరమాత్ముఁ డాద్యుండు భక్తవత్సలుఁడు
... .......................
...ర్త...వునఁ బూజ కడఁగి చేసితిమి.
మూర్తిత్రయాత్మకు మునులైరి భక్తిఁ
బూజించినను మహాభువనంబులెల్లఁ
బూజితంబులయగు భూరితేజమున.
బుద్ధియు మనసును బుండరీకాక్షుఁ
డిద్ధతేజుఁడు పరమేశుఁ డవ్యయుఁడు;
చెలువొందు ప్రకృతియుఁ జిరపరంజ్యోతి
జలజారి సూర్యులు జగతియు గాడ్పుఁ
బావకుండును నభోభాగంబు యముఁడు
దేవేంద్రుఁడును మునుదిక్పతితతియు
సకలభూతంబులు సచరాచరములు
...చాబ్జనేత్రుండు వెలయంగఁ దాన.
యిట్టిమహా [2] త్మకుఁ డిందిరాధిపుఁడు
నెట్టనంబుగ యోగినివహంబులకును

1. నర్హంబులవనిలోపలను. 2. త్ముని యిందిరాధీశు. (మూ)

గానంగఁబడుఁగాక ; కష్టజీవులకు
నేనాఁటఁ గనఁబడ సింధిరాధిపుఁడు ? ”
అని భీష్ముఁ డాడినయవసరంబునను
అనఘుఁడై నట్టి సహదేవుఁడప్పుడు
పలికె : “ శ్రీకృష్ణునిఁ బద్మలోచనునిఁ
గలుషుఁడై దూషించు కపటాత్ముతలను
జగణంబుఁ బెట్టెదఁ జూన్యున. ” ననుచు
నగుగుదెంచినఁ, జూచి యాసభవారు
భయమునందియుండిరి ; బ్రహ్మాదిసురలు
రయమున దివినుండి రాజుపైఁ బు
పుష్పవర్షంబులు పొలుపు మీఱంగ
నిష్పత్తిఁ గురిపించి నిలిచిరి ; యంతఁ
గలహాంధుండైన ఘనుఁడు నారదుఁడు
పలువారు నృత్యంబు పలుభంగి నాడె.
అంతట శిశుపాలు నాత్మసైనికుఁడు
దంతివైరిబలుండు గని [1]సునీధునకు
కోపించి సేనలఁ గూడి తానంత,
నేపార శిశుపాలు నెల్లసైన్యముల
రవమున కప్పుడు రాజసైన్యాబ్ధి
వివిధభంగుల నందు వేగంబె కలఁగె.
అతులభయంకరంబైన యారవము
నతిచిత్రముగ విని యమనందనుండు
గాంగేయునకు భక్తి గలిగి యిట్లనియె :
“ సంగరవిజయులు జగదీశులెల్ల
మొగియుచున్నారు సముద్రములట్లు ;
గరిమ నామఖము విఘ్నము నొందకుండ

1. సునాముండు. (మూ)

. . . . . . . . . . . . . . . . . . . . . . . . .

నత్తఱి భీష్ముఁ డాయధిపతికనియె :
" నారాయణుఁడు జగన్నాథుఁ డచ్యుతుఁడు
కారుణ్యమున నీసుఖంబు గావఁగను
ఒరులు విఘ్నము సేయ నోపుదురయ్య!
హరిమీఁద కూడిన యాఖలసేనలును
ఈశిశుపాలుఁడు నీక్షణంబునను
నాశంబులగుదురు నామాటనిజము.
కుక్కలు మదకరిఁ గుంభస్థలములు
వ్రక్కలింపఁగను వసుధలోఁ గలవె!
హరిపరాక్రముఁడైన హరిమహత్త్వంబు
ధరఁగొంద తెలుఁగను తత్త్వహీనమున."
అని భీష్ముఁడాడిన, నాగ్రహంబునను
మును శిశుపాలుండు మొనసి యిట్లనియె :

## శిశుపాలుఁడు శ్రీకృష్ణు నధిక్షేపించుట

" నీముఁగ వెఱ్ఱియు నీపాండవులును
దామోదరునిఁ బరతత్త్వమటంచు
భ్రామికంబులయందుఁ బల్కుచున్నారు ;
భూమిలో నెవ్వరుఁ బూజింపరతని ;
నిన్ను ధర్మజుఁడు మన్నింపుచున్నాఁడు ;
చెన్నలరఁగ యుధిష్ఠిరుఁడును నీవు
నోడగట్టినదూలి మొగపున మిగులఁ
గూడియున్నారు దిక్కులు సంచలింప.
కృష్ణునఁ జేపట్టి కిల్బిషంబునను
[1] నైష్ఠికంబున నొందినాఁడవు నీవు.

---

1. 'ఛాందస' మను వ్యావహారిక పదానుసరణముగా నైష్ఠికత్వమను నర్థములో నీయపశబ్దమును ప్రయోగించియుండును.

అవని నీయట్టి దురాత్ముండు గలఁడె!
వివరింపు మున్ను గోవిందుని చేఁత;
[1] పూతకిఁ జంపి యాపూజ్యశకటమును
రీతి భేదించి గిరిన్ గేల నెత్తి,
వృషభంబు వధియించి విగ్రహంబునను
విషచిత్తుఁడైన గోవిందుని పేరు
పొగడ నీకోకజిహ్వ పొందుగా ; దదియుఁ
బగిలి వ్రక్కలునూఱు పరఁగునుగాక.
అతివల, గోసమూహంబు, బ్రాహ్మణుల,
నతులితాన్నము లిడినట్టివారలను,
విశ్వసించిన వారి వేగఁ ద్రుంచినను
విశ్వధారుణియందు వే పాపులండ్రు ;
వనజనేత్రుండు గోవధయు స్త్రీవధయుఁ
జెనసి చేసెను భూప్రసిద్ధంబుగాను ;
అట్టిగోవిందున కర్ఘ్యంబు నీవు
గట్టిగా నిప్పించి ఘనతనుండితివి.
అదియునుగాక, పరాంగననాక
కదిసి యంబికయను కన్యకామణిని
నీవు దెచ్చుటెఱింగి నీసహోదరుఁడు
శ్రీవిలాసుండు విచిత్రవీర్యుండు
ధర్మజ్ఞుఁడై దానిఁ దగవిడ్చిపుచ్చె.
దుర్మదాంధుండవు దురితదేహుఁడవు
జననిందితుండవు సంతానహీనుఁ
డన నున్న నినునమ్మ నగునె లోకులకు !

---

1. 'పూతకిం జంపిన పూజ్యసంఘముల—రీతి భేదించి గిరి కేల నెత్తి'. అని యీపాదము లిట అనన్వితములుగా మూలమునఁ గలవు. "పూతనాఘాతంబు చేత నేతరమైన..." అను పద్యము పైరచనకాధారమైయుండును. చూ. నన్నయ. భా. సభా. 2 ఆ. 41. ప.

తలపోయు మును సముద్రంబుతీరమున
విలసితంబుగ నొక్కవృద్ధహంసంబు
క్రమము దప్పక ధర్మకథలు చెప్పుచును,
గ్రమముదప్పకయట్టి ఖగములనెల్ల
శిక్షింపుచును ధర్మశీలుఁడై ప్రాణి
రక్షకుండై విహారము సేయుచుండు ;
విహగంబులును దాన విశ్వాసమంది
సహజపాథోరాశి జలచరంబులగు
పక్షుల మాధుర్యభక్ష్య భోజ్యముల
దక్షతఁదెచ్చి నిత్యముఁ బెట్టుచుండి
తమయండ మండముల్ దత్సమీపమున
నమర నిక్షేపించి యతిదూరమరుగ,
నాసమయంబున నాహంసరాజు
గ్రాసంబుగా సర్వఖగకులాండముల
భక్షించియుండినఁ, బఱతెంచి యొక్క
పక్షివీక్షించి తప్పక పక్షితతికి
వృత్తాంతమంతయు వేగఁ జెప్పినను,
జిత్తంబులందును జింతించి వగచి
యాముదిహంసను నడగించె నపుడు.
భీమవిక్రమమునఁ బేర్చి మిక్కిలిని
ధర్మచిత్తుండవై ధర్మసత్కథలు
కూర్మిఁ బాండవులకుఁ గురుకుమారులకుఁ
దెలుపుచుఁ గలహంస ధృతి నొనర్చెదవు.
బలియురఁ బెక్కండ్రఁ బద్మలోచనుఁడు
దండించె నని సంస్తుతంబొనర్చెదవు ;
పుండరీకాక్షుని భూరిబలంబు
నేనెఱుంగనిదియే నిఖిలంబునందు !
మానుషంబునఁ బొంగు మాగధునకును

విఱుగఁడే పదియూర్లు విక్రమంబెడలి!
మెఱసి జరాసంధు మేటిసాహసుని
భీమార్జునులఁ దోడువెట్టుక పోయి
భూమీసురాకృతిఁ బొంగణఁగించె;
నిది విక్రమంబె మహీమండలమున!
మదదైత్యహరు నేల మాటిమాటికిని
బొగడుచున్నాఁడవు [1] బూతుచందమున!
పొగడక నీకును బొద్దు [2] పోదేని
సుగుణాకరులు రణశూరులైనట్టి
జగదీశ్వరులు కర్ణశల్యులాదిగను
యోధులఁ బొగడు మహోత్కృష్టితోడ.
సాధునిందయు నన్యజనకీర్తనంబుఁ
జేయుదు గాంగేయ, సృష్టినుత్తములు
ఏయెడ ననిమునులెంతయు ననిరి."
అనుచును దుర్భాషలాడుట చూచి
యనిలతనూభవుండలిగి రౌద్రమునఁ
బ్రలయకాలమునాఁటి ఫాలాక్షుపగిదిఁ
గలనను శిశుపాలు ఖండింపఁజూడ,
భీముని వారించి భీష్ముఁడిట్లనియె:

## శిశుపాలుని జన్మవృత్తాంతము

"ఈదురాత్ముండు మహీస్థలిఁ దొల్లి
చేదివంశమునఁ బ్రసిద్ధుఁడైనట్టి
యాదమఘోషున కాసాత్వతికిని
బుట్టెను ఘనచతుర్భుజములతోడ,
నెట్టనంబుగ ఫాలనేత్రంబుతోడ,

---

1. పూత 2. పోచెందు. (మూ)

బంధుర దైతేయభావంబుతోడ ;
సంధిల్లుటయుఁ, జూచి జననియు గురుఁడు
నరుదంది భయమంది యట్లున్నఁ, జూచి
వరుస నక్కడ నభోవాణి యిట్లనియె :
'నారులు వీనినిజంప నోపరెవ్వరును ;
దొరయుంగ వీనినెత్తుకయుంకు వేళ
నెవ్వరిచేత నీయెక్కుడుకన్ను
నివ్విశాలభుజంబు లిరెండు నణఁగు,
నతనిచే శిశుపాలుఁడణఁగు గ్రక్కునను
జతురంబుగా ;' నని సర్వంబుఁ దెలిపె.
అదినిమిత్తంబుగా నాకుమారకుని
వదలక చూడంగవచ్చువారలకు :
'బాలుండువీఁడె నాపట్టి ; ముద్దాడుఁ
జోలిమై.' నన వార లాదవినప్రీతి
నెత్తుక ముద్దాడి యింపుసొంపలర
బత్తితోఁ జేతికి ఫలములనొసగి
వారి [1] యూరికిఁజన, వసుధ నీవార్త
ఘోరసవిని యదుపుంగవులైన
భీమవిక్రములు గంభీరనాయకులు
రామకృష్ణులు నిందురవితేజు లపుడు
అమరంగ జయశీలు నాశిశుపాలు
సుముఖులై వేడుకఁజూడంగఁ గోరి
పోయిరి బుధబంధుపుంజంబుతోడ.
ఆయెడఁ దన మేనయత్త సాత్వతియు
బాలకుండగు శిశుపాలునిఁదెచ్చి
చాలంగ సంతోషజనితయై యపుడు

1. వారికి. (మూ)

బలభద్రుకిచ్చినఁ, బరఁగంగ సత్యఁ
జలజాక్షుచేతికిఁ జయ్యన నిడిన,
శిశుపాలు మిక్కిలిచేతులుఁగన్న
దిశయెఱుంగక పోయెఁ దెల్లమిగాను.
దానిఁదలంచి సాత్వతి యశరీర
మానితవాక్యంబు మదిఁ గొని నెఱిఁగి,
హరిచేత శిశుపాలుఁ డణఁగు ట్రిక్కున
బరమార్థమని కైటభద్వేషికనియె:
'మకరాంకజనని, నీసుతుఁడిదె వీఁడు
బ్రకటితబలు శిశుపాలునినాఁడు
నూఱుతప్పులుగావు నూతనంబుగను ;
మాఱుమాటాడక మన్నించు నన్ను.'
అని వాసిజనని పద్మాక్షుఁ బ్రార్థింప,
వనజనేత్రుండును వరమిచ్చెఁ ; గాన
నపరాధములునూఱు నటు సైఁచుదనుక
నుపమ యూరకయుండుటుచితంబు మనకు.
కనకాంబరునిచేతఁగాని యీదుష్టు
మనచేత నాజిలో మరణంబుగాఁడు.
ఇతరమానవులు నన్నెగ్గులాడినను
హతముసేయుదు మదీయాస్త్రములందు."
అనెడుభీష్మునిమాట లాలించి, భీము
మునుపుగైకొనక, యామ్మురవైరికనియె:
"అవమాన్యుఁడగు నిన్ను నాస్థానమునను
అవిరళమతి మాన్యుఁడని పాండుసుతులు
గాంగేయుఁడును నిష్ఠ గడఁగిపూజించి;
రాంగిక మెఱుఁగక యధికదుర్బుద్ధి,
నీవునుగైకొంటి నెఱయఁగాఁ బూజ ;
యీపనుమతి నీకు నిటు చెల్లునోటు!

నాతోడ వడిఁ బ్రథనము సేయు నిలిచి
యీతఱి." యనుచును నగ్గలుపలుకు
శిశుపాలుఁగనుఁగొని శ్రీకృష్ణుఁడనియె
విశదోక్తులను మహీవిభులువినఁగ :
"అమరఁ బ్రాగ్జ్యోతిషంబనుపురంబునకుఁ
బ్రమదితంబుగవచ్చి భగదత్తుతోడఁ
బోరాడ నిచేదిభూపతి పోయి
ద్వారకానగరంబు దగ్ధంబుచేసెఁ
గ్రూరుఁడై యన్యాయ [1] కుశలతఁ బేర్చి ;
భూరివిక్రములగు భోజరాజాది
ధారుణీశులు [2] రైవతకగంబునందుఁ
జారుతరంబగు స్వరపరవశతఁ
బొలఁతులతోఁ గూడి భోగింపుచుండఁ
దెలిసి వారలను వధించె నేకతము ;
దేవాభుఁడగు వసుదేవుండు సేయు
పావన హయమేధ పటుమఖంబునకు
నర్చితంబైనట్టి హయమును గొనియెఁ ;
బేర్చి సోమఖమునకుఁ జేసెను విఘ్నంబు
చేసె వీఁడతిపాపశీలుఁడై పూని ;
భాసురమతియైన బభ్రుని భార్యఁ
దనకు భార్యనుజేసె దర్పంబుతోడ ;
ననురక్తి మామేనయత్త తాఁబలుకు
మాటకున్నై నూఱుమాఱులు వీని
మాటలకోర్చితి మఱి వీనిఁద్రుంతు."
ననుటయు శిశుపాలుఁ డజ్ఞాత్ముకనియె :
"నానరంగ నీకూర్మియును నీదుపలుకు

---

1. కులశత 2. రైవతానగంబునను. (మూ)

నాకదియేటికి నయమార్గదూర!
నాకునిచ్చినయట్టి నలినలోచనను
నీవువరించితి నిఖిలంబు నెఱుఁగఁ;
గావున మఱి సిగ్గుగలదె నీకెందు?"
ననుచు దుర్భాషల నాడుచుండ
విని కృష్ణుఁడప్పుడు వేగఁ గోపించి
తలఁచినంతటిలోనఁ దద్దయు వచ్చెఁ
గలితనిర్వక్ర విక్రమము చక్రమును.

## శిశుపాలవధ

అది శతకోటిబాలార్కప్రకాశ
విదితమై శతకోటివిస్ఫూర్తియగుచు
వచ్చినఁ, జక్రంబు వాసుదేవుండు
చెచ్చెఱ నుగ్రుఁడై చేతసంధింపఁ
గులగిరులూటాడెఁ; గూర్మమల్లాడె;
జలధులుగలఁగె; నాశాచక్రమగలె;
రవితప్పఁదిరిగెఁ; దారకములు డుల్లె;
దివికంపమందెను; దేవేంద్రుఁడడలె;
నుడుగక యొకమ్రోఁత యూఱక మ్రోసె;
నడరి రసాతలంబద్భుతంబందె;
బ్రహ్మాండములు భయభ్రాంతివహించె;
బ్రహ్మాది సన్మునిప్రణుతాంఘ్రుఁడైన
హరి యట్టివేళ మహారౌద్రమునను
బిరబిరమని త్రిప్పి బిట్టువ్రేయుటయు,
గురుతర నిర్ఘాత ఘోషంబుతోడఁ
బరిపూర్ణ విలయోగ్ర పావకశిఖలు
భూమండలమున నభోమండలమున
భీమమై పర్వంగ బెట్టునవచ్చి

చేదిభూవిభు శిరశ్ఛేదంబు చేసె;
నాదట వానిమహాకళేబరము
కులిశంబుచేఁ బడ్డకొండచందమున
నిలమీఁగఁబడె రక్తమెంతయుఁ దొరఁగ.
జగతీతలేశులు సంచలంబందఁ
దగ శిశుపాలునితనువునున్న
తేజంబు వెలువడి దిశలెల్ల వెలుఁగ
రాజకోటులుచూడ రాజార్కునయును
దేహంబుసొచ్చె సందేహంబులేక.
యూహింప నచ్చోట నుర్వీశులనిరి:
"జయపుండరీకాక్ష, జయచక్రపాణి,
జయరమాధీశ్వర, జయహృషీకేశ,
ఖగరాజగమన, రాక్షసరాజదమన,
నగరాజహస్త, పన్నగరాజశయన,
రక్షించుసర్వేశ, రాజీవనాభ,
యీక్షించుమముఁ గృప నిభరాజవరద!"
అనుచు సన్నుతిచేసి యందఱు మ్రొక్కి
మనముః సంతోషమగ్నులై యంత
ననురక్తి రాజసూయాధ్వరంబొప్ప
ఘనత సంపూర్ణంబుగా నొనరించి
యాధర్మనందను నధికపుణ్యాత్ము
యోధాగ్రవర్యు నత్యుత్తమోత్తమునిఁ
గని మోదమునుబొంది కమలాక్షుఁడాది
యసిమిసావళి గొసియాడిరి; మఱియుఁ
గురువీరులెల్లఁ బేర్కొనిరివేర్వేఱ.
వరుసతో నంత నైశ్వర్యుఁడై యున్న
ధర్మజాకడకు భూధవులేఁగుదెంచి
యర్మిలి సద్భక్తి నప్పుడిట్లనిరి:

" సకలరాజన్యవంశములలో నెల్లఁ
బ్రకటమై యొప్పె నీభరతవంశంబు ;
రంజిల్లఁజేసితి రాజసూయంబు ;
మంజులవాక్య, నీమహనీయకృపను
ఇలఁ గృతార్థులమైతి ; మేము భూములకు
నేమింబోమెద." మన్న నెఱిఁగి ధర్మజుఁడు
ఆనతియొసఁగింప, నపుడు భీముండు
ననిచె భీష్ముని ధృతరాష్ట్రు ; నర్జునుఁడు
ననిచెను యజ్ఞసేనాదుల ; సుబలు
వెనువెంటనరిగి వావిరి భక్తిననిచె
నకులుండు ; కృపు ద్రోణు నయభక్తిఁ బంచె
నకలంకమూర్తి సహదేవుఁడంతఁ ;
బరిగ విరాటును భగదత్తుఁబనిచె
నరసచిత్తమున ధృష్టద్యుమ్నుఁడపుడు ;
పాగ్వతేయుల మహీపతులను ననిపె
సర్వసామ్ములునిచ్చి సౌభద్రుఁడెలమి ;
ధరణీసురులఁబంచెఁ దమగృహంబులకుఁ
గరుణ వాటిల్లంగ గౌఁగిళ్లఁ జేర్చి ;
పాండునందనులను బద్మలోచనుఁడు
నిండువేడుకల మన్నించి యిట్లనియె :
" సకలభూతములు పర్జన్యునిఁ బట్టి
సికరంబు [1] ఫలధారుణీజంబు నెపుడు
భజియించుకైవడి బంధువులెల్ల
భజియింపుదురు నిన్ను భక్తియుక్తముగ."
అనిన శ్రీకృష్ణున కనియె ధర్మజుఁడు :
" అనఘాత్మ, నీకృపయందు నామఖము

1. లోధారుణీజంబునందు (మూ) చూ. నన్నయ. సభా. ద్వి. ఆ. 79 ప.

సఫలమైయుండును జగమెల్ల నెఱుఁగ;
సభికసంస్తుతులఁ దేజతురుండ నైతి; (?)
ద్వారావతీపురీస్థలినుండి నీవు
దూరంబుగాకుండఁ దోఁచు మామదికి;
శుభములుగలఁచు మెచ్చోటను మాకు;
నిభరాజవరద, నిన్నెంతయుఁ బాసి
నిమషమాత్రంబును నిలువనోడుదుము
క్రమముతో." ననవుఁడు కంజనాభుండు
నాధర్మనందను నట్లూఱడించి
సాధులు నుతియింప సంతోషమునను
అనిలవేగములైన హయములుపూను
కనకరథంబెక్కి కదలిపోవుటయు,
ధర్మతనూజుండు తమ్ములుఁ దానుఁ
బేర్మిఁ గృష్ణునిసంపి పెరిమనేతెంచి
యుండంగ, మేటిసుయోధనుండంత

మయసభాసందర్శనమున దుర్యోధనుఁడు లజ్జితుఁడగుట

గండితో శకునియుఁ దానును గూడి
సముచితంబైన యాసభఁ జూచు వేడ్కఁ
గొమరొప్ప నక్కడ కొన్నిదినములు
నిలిచి యాసభరమణీయతఁ జూచి,
లలిత నిరంతరాలంకారమహిమఁ
దేజంబులోఁ దత్ప్రదేశంబునందు
రాజితంబైన ద్వారమున నెయ్యమున[1]

........................
.
........................

1. గ్రంథపాతమైయుండును. చూ. నన్నయ. భా.

నీలరత్నచ్ఛటానిచయంబుపర్వ,
నాలోననవి జలంబని సంశయించి
రమణీయ దివ్యాంబరమ్ములన్నియును
క్రమమున నెగఁద్రోచి కడురభసమునఁ
జొచ్చిన, నది నీలశోభితమణుల
నచ్చుగాఁ జూపట్టునాస్థలంబయ్యె.
అటుమీఁద నేఁగంగ నంబుజాకరము
పటుతరంబుగఁజూచి బహునీలరుచుల
మణితలంబనుచుఁ గ్రమ్మనఁ జొచ్చుటయును,
బ్రణుతికెక్కిన భవ్యాంబరములు
తడిసినఁ గ్రమ్మఱ తడయకే తేర
సడరి పాంచాలకుమారులయ్యెడ నగిన,
ధర్మంబుదలపోసి ధర్మనందనుఁడు
కూర్మి రెట్టింప నాకురుమహీపతికి
దివ్యవస్త్రములును దివ్యగంధములు
దివ్యభూషణములుఁ దెఱఁగొప్పఁ బనిచె
ననిలసూనునిచేత నానందమునను;
బనిచినఁ గురుమహీపతియును గట్టి
చాలంగ ధర్మజుసభఁజూచి లజ్జ
నోలి పాండవులను నొగివీడుకొనుచు
నిజపురంబునకును నేర్పునవచ్చి,
భజనలేకతలంచి బహుభంగి వగచి
రాజచంద్రుఁడు ధర్మరాజశేఖరుని
రాజసూయమహాధ్వరంబు మానవుల
నయనోత్పలముల కానందమై యొప్ప
సయమింపఁగాఁ దన నేత్రంబులకును
బావకనిచయమై పరఁగుచునుండె.
భావింపఁగాఁ దగు పసిఁడిగాచినను

గందినవై వడి కౌరవేశ్వరుఁడు
కుంది మనోవ్యథఁ గొనసాగి విన్న
దేహుఁడై యుండె ధాత్రీరాజ్యభార
మోహంబుదక్కి యిమ్ముల సుహృజ్జనుల-
తోడ మాటాడక తుది రహస్యమున
నోడక యుండె యుద్ధోచితంబుగను.
వేదనఁబొరలుచు విముఖుఁడై యున్న
యాదుర్యోధను నప్పుడు చూచి
శకుని యిట్లనియె నాశ్చర్యంబుతోడ:

## దుర్యోధను దురాలోచన

"వికలుఁడవై రోషవేషంబునొంది
యేల నాతోడ నీ [1] విన్నన్నినాళ్ల-
వోలెను బలుకవు భూమీశతిలక!
ఇంతచింతింపంగ నేటికినీకు?
నెంతటికార్య మిట్లెత్తిఁగింపవలయు.
నేనుండఁగా నీకు నేటికిఁ దలఁక!
గానఁగఁబడు నెంతకార్యంబుదీర్తు;
వ్యాకులపడకుండు వసుధేశతిలక!
లోకంబులో నృపలోకసంసేవ్య!"
అనిన సుయోధనుం డాశకునితోడ
వినిపింపఁబూని వివేకంబుతోడ:
"నీవునుజూచితి నేనుఁజూచితిని
భూవలయంబున బురణించిచూడ
నేయుగంబునఁగల్గ దీసభమహిమ
శ్రీయుతంబై భూప్రసిద్ధమైయొప్పె.

---

1. విన్నవినాళ్ల. (మూ)

అతిమనోహరమైన యాసభయందు
నతులితభద్రసింహాసనాసీనుఁ
డంతకతనయుఁ డత్యంతసంపన్నుఁ
డెంతపుణ్యంబు దానిఁ జేసెనొక్కొ!
సకలభూపతులు నసంఖ్యంబులైన
ప్రకటితార్థములు దప్పక తెచ్చిపెట్టి
కొలుచుచునుండిరి కొంకక కదిసి;
బలవంతులై ప్రతాపమున శోభిల్లి
భూసురోత్తములకు భూరిదానములు
చేసి దిగ్విజయలక్ష్మీసమగ్రమున
నున్నారు రాజులై యుర్వి యేలుచును
సన్నాహమునఁ బాండుజగదీశసుతులు.
వారి కెవ్వరు సాటి వసుధీశకోటి;
వారికి వరదుఁడై వాసుదేవుండు
హితమాచరింపుచు నెల్లకాలంబుఁ
జతురత్వమున నుండు; శౌర్యంబునందుఁ
జేదిభూపతి శిరశ్ఛేదంబుఁ జేసె
మేదినీనాథులు మిక్కిలి బెగడ;
యాదవోత్తముఁ గృష్ణు నందఱుఁ జూచి
భేదింపఁగాలేక పెంపుతోడుతను
బొగడుచునుండిరి భుజశక్తి దలఁగి;
తెగువతోఁ బాండుధాత్రీనాథసుతుల
సంపదలెల్ల నీక్షణములోపలను
సొంపుతోఁ గొనుబుద్ధి చొనుపంగవలయు."
ననుకురురాజు భవ్యాలాపములను
మనమునఁ దలపోసి మామయిట్లనియె:
"మీతండ్రి ధృతరాష్ట్రమేదినీశ్వరుని
నీతివిచారించి నెఱయఁ గావింపు."

మని శకునియు వేగ మాసుయోధనునిఁ
గొనిపోయి ధృతరాష్ట్రుకువలయేశ్వరుని
సన్నిధినిలిపి నిశ్చలవృత్తిఁ బలికె:
"నెన్నికకెక్కిన యీసుయోధనుఁడు
నీకుమారుఁడు ధారుణీనాథుఁ డాత్మ
వైకల్యమునను వివర్ణమునందుఁ
బొందయున్నాఁడు పెంపున విచారింపు
మందంబుగా." నన్న నాధృతరాష్ట్ర
ధరణీశుఁ డాసుయోధనుశరీరంబు
పరికించినిమిరి తత్పరబుద్ధిఁబలికె:
"శాశ్వతైశ్వర్యంబు సకలలక్ష్ములును
విశ్వంబులోపల వెలయుంగఁగలవు;
అనుజులు మిత్రులు నఖిలబాంధవులు
ననుకూలురై యుందు రనిశంబునీకు;
నింద్రునికంటెను నెక్కుడైనట్టి
సాంద్రభోగము నీకుఁ జాలంగఁగలదు;
సకలభూపతులును సతతంబు భక్తి
ప్రకటంబుగాఁగ నీపంపునేయుదురు.
ఏమికొక్కువనీకు నెల్లసౌఖ్యముల!
నీమేనుడస్సిననిర్ణయంబేమి?
నిజదేహకాంతులు నీకేలదఱిగె?

...........................

[1] సరసత్వమున నీవు సకలసామ్రాజ్య
పరభారకముదప్పి పరఁగియుంటివి."
అనవుడు ధృతరాష్ట్రకాతఁడిట్లనియె:

---

1. 'సకలధరణిరాజ్య భోగసుఖపరాఙ్ముఖత్వముఁ బొందనేల.' అని నన్నయ. సభా. ద్వి. ఆ. 102. ప. నన్నయభారతమునను కరించియు, నీరసిల్లఁజేసిన రచనా భాగము లిట్టివింకను గలవు.

పాండవాభ్యుదయమునకు దుర్యోధనుఁ డసూయపడుట

"జననాథ, పాండవభ్రాతలేశ్వరుల
భాగ్యభోగంబులు పర్జన్యకంబై
యోగ్యమైయున్నవి యున్నతంబగుచు ;
సకలదిక్కుల వారిసత్ప్రతాపములు
వికటమైచూపట్టి వెలసెను బేర్మి ;
నరుఁడు విక్రమశాలి నయగుణోన్నతుఁడు
పరరాజ్యవిజయుండు బలసముగ్రుండు
కొమరొప్ప నుత్తరకురుభూములాది
యమరదేశములెల్ల నర్థి సాధించె ;
శక్రుండు ద్రుపదరాజన్యశేఖరుఁడు
చక్రధరుండును జగతిలోఁ దక్కఁ
దక్కనరాజులందఱుఁ బాండవులకు
మ్రొక్కి యప్పనము లిమ్ములఁబెట్టువారె ;
కాసి, కొల్వనివారిఁగానము జగతిఁ
గానన శైలసంధు ద్వీపములను.
వనధివేష్టిత చక్రవాళమధ్యంబు
ననురక్తితో నేలె నఖిలంబుఁ బొగడ.
నేనొకరాజనా యీమహీస్థలికి!
దీనిఁజూడఁగఁజాల ; దిక్కులెఱుంగ
ధర్మనందనుఁడు రత్నపరిగ్రహంబు
పేర్మినేయఁగ నన్ను బెద్దయుఁ బనిచె.
నేనునుజూచితి నెనగ నమ్మణుల
భూనాథ, యేజగంబులఁగాన నెందు.
యజ్ఞదీక్షితుఁడైనయమనందనునకు
విజ్ఞానవంతులు విశ్వభూవిభులు

కాంభోజపతులు ఘనకూటరథంబులును
జృంభితహయములు సింధురావళులుఁ
దెచ్చియిచ్చిరి మహా తేజంబుతోడ ;
మెచ్చి శ్రీకృష్ణుండు మెలఁకువతోడఁ
దగు శార్క్కరుచుల రథవ్రాతములును
దురగరత్నములు బంధురరత్నములును
బదునాల్గు వేలు నిర్భరగజేంద్రములు
ముదముతోఁ బాండవముఖ్యున కొసఁగె.
నవరత్నములు సువర్ణములు గంధములు
వివిధాంబరంబులు వేడ్కతో మతను
గౌళ సింహళ కేకయ చోళ
శూరసేన సుపాండ్య శోభితనృపులు
ధర్మరాజునకు మోదముతోడుతను
అర్థిలి నిచ్చిరి యధికలక్ష్ములను ;
నరుఁడు నాద్యుండైన నారాయణుండు
నిరువురు సుఖగోష్ఠి నేకతంబునను
వర్తింపుదురు మహావైభవంబునను ;
మూర్తితో ధర్మజు మూర్ధాభిషిక్తు
కాపరాటుండు పరాక్రమోన్నతుఁడు
వేవేగమున రెండు వేలదంతులను,
వేడుక ద్రుపదుఁడు వెయ్యేనుఁగులను,
జూడనొప్పిన తనుసురుచిరాశ్వములఁ
బదునాల్గువేలను బటువిలాసినులఁ
బదివేలదాసులఁ బనసిచ్చిరపుడు.
గాంధార కేకయ కాంభోజ మద్ర
బంధుర కాశ్మీర బహ్లీకకులాత
కురు మరు మాళవ కుంతల మగధ
కరహాట వంగాంగ కాళింగ నృపులు

భగదత్తుఁడాదిగాఁ బార్థివోత్తములు
నగణిత గోమహిషాశ్వదంతులను
అజముల రథముల నంబరంబులను
నిజభూషణంబులు నీరజాననలఁ
దెచ్చియిచ్చిరి యాయుధిష్ఠిరునకును.
అచ్చుగా మఱియును నపరిమితంబు
రత్న కాంచనముల రాజీవముఖుల
రత్నసాను ధరాధరశ్రేష్ఠ తుహిన
గిరి మందరాచలక్షితిధరేశ్వరులు
కరగు కుసుమాసవ కోమలపాత్ర
దివ్యౌషధంబులు దివ్యాంబరములు
[1] దివ్యేంద్రనీల సుస్థిరచంద్రకీర
మరకతవర్ణసుమానితహారులు,
వరమౌక్తిక చ్ఛత్ర సర్ణితతల్ప
చామర దివ్యాస్త్ర సముదయంబులును,
కోమలంబగుపట్టు కోలైనగములు
నిచ్చిరి ధర్మజు కింపురుషాంపారఁ ;
జెచ్చెర గంధర్వచిత్రరథుండుఁ
దుంబురుండునుగూడి దొరసి నూఱేసి
కంబువర్ణములైన గంధర్వహారుల
మహిమతోనొసగిరి మహనీయముగను ;
బహుభంగి సందులై పరఁగఁజొక్కలిని.
ఒకలక్షభూసురు లొగి భుజియింప
సకలయత్నములందు శంఖంబుమ్రోయుఁ
దనకుఁదాన సముంచితంబుగానెపుడు ;
మునుమిడి యాగంబు ముగియునన్నాళ్లు

1. దివ్యవీతేంద్ర సుస్థిర చంద్రకీర్ణ-మరకతవస్త్ర సమానితహారులు. (మా) 'ఇంద్ర నీల...పిక చంద్ర...కీరవర్ణతురంగంబులను.' అని. నన్నయ. సభా. ద్వి. ఆ. 113 గ.

నుడుగక మ్రోసెఁ బెంపొదవి శంఖంబు.
అదరి జన్నము చూడ నరుదెంచినట్టి
సర్వభూములమహీశ్వరుల భూసురుల
దుర్వారవైశ్య శూద్రుల నాప్తజనులఁ
బ్రాణబంధువులను బ్రాణిసంఘముల
క్షోణిపైఁ బేదల సుజనుల నరసి
ప్రతిదివసంబును భాసురాన్నములు
చతురత్వమునఁ బెట్టి సంతోషమునను
అర్ధరాత్రంబున నన్నంబుగొనును
అర్ధేందుధరకృప నాద్రౌపదియును.
అధికుఁడా ధర్మజునధ్వరంబునను
అధమాధముండును అధికపూజ్యతను
బొందుఁ; [1] గానప్రియంబును బొందఁడెందు.
ముందు హరిశ్చంద్రు మూర్ధాభిషిక్తుఁ
డరుదుగా రాజసూయాధ్వరంబొప్ప
సరవిఁ జేసెను; గాని, చర్చించిచూడ
ధర్మనందనుమహాధ్వరముతో నదియుఁ
జేర్చినఁ సరిగాదు పృథివిఁ దర్కింప.
ఆయాగదీక్షితుండై ధర్మసుతుఁడు
పాయక ధారుణీపతులు భూసురులుఁ
[2] దిరుగు నాఁటి భజింప దిక్పతిశ్రేణి
వరుసఁ గొల్వఁగనున్న వాసవుఁబోలె.
ధర్మనందనుఁడు మోదముఁ బొందియుండ,
ధర్మమూర్తులు మునీంద్రసముత్కరంబుఁ
గొనియాడ, ధౌమ్యుఁడు గోచరతీర్థ
ఘనజలంబులను యోగ్యంబుగాఁ బూని

1. కాని+అప్రియము. 2. తిరుగ (మూ)

యభిషేక మొనరించె నతివిచిత్రముగఁ.
బ్రభ నభిషిక్తుఁడై పరఁగినయట్టి
సత్యసంధుఁడు ధర్మజమహీశునకును
సాత్యకి మౌక్తికచ్ఛత్రంబుపట్ట,
భీముండుఁ బార్థుండుఁ బ్రేమంబుతోడఁ
జామరంబులు విశేషంబుగా నిడిరి;
కమలనాభుండును గవలును ద్రుపదు
కొమరుండు వేర్వేఱ కాపలయొశ్వటల
మ్రొక్కింపుచుండిరి మోదంబునందు;
దిక్కులరాజులుఁ దెఱఁగొప్ప నేను
జిన్నఁబోయున్నను చేష్టలెఱింగి
వెన్నుండు పాండుభూవిభుతనూజులును
ద్రౌపది సాత్యకి దగుసంతసమునఁ
జూపట్టియుండి; రచ్చో యుధిష్ఠిరుఁడు
నెనయుంగ నెనుబదియెనిమిదివేలు
ఘనమహీసురులకుఁ గల్యాణ మొప్పఁ
జేసి, ప్రత్యేకంబు చెలఁగి ముప్పండ్రు
దాసుల వేర్వేఱ తడయక యిచ్చి,
పదివేలు వేదవిప్రవ్రాతములను
బదవికెక్కిన హేమపాత్రంబులందు
భుజియింపఁగాఁ జేసి, భూషణవ్రజము
నిజవస్త్రములు గంధనివహంబు నొసఁగి
[1] మన్నించియుండును మహాసియరుచుల.
నెన్నంగ నాజన్మమేమిఫలంబు!
పాండునందనుల సంపదలుచూడంగ
మండలంబుననోర్వమఱి." యనుటయును
శకునియిట్లనియె నిశ్చలవృత్తితోడ:
"నకలంకమగుచున్న యయ్యక్షవిద్య

1. మన్నింపుచుండును. (మూ)

నేర్పరిసగుడును నిఖిలంబెఱుంగ;
దర్పంబులణఁతు ద్యూతమునఁ బాండవులఁ
దూకొనియాడ నాతో నొనఁగూర్పు;
శోకింపకుండుము సుఖవిశేషములఁ
జాలంగ." ననియాడు శకునివాక్యమ్ము
లాలించి కురుపతి హర్షించిమించి,
చతురత ధృతరాష్ట్రచరణాబ్జములకు
నతిభక్తితో మ్రొక్కి యప్పుడిట్లనియె:
"జననాథశేఖర, శకునిమాటలకు
ననుకూలమైయుండ ననిశంబునలయు;
శకునియు నను సర్వసామ్రాజ్యమునకుఁ
బ్రకటితకర్తగాఁ బరఁగంగఁజేయు;
నొడఁబడు మతనికార్యోక్తుల." ననినఁ
గడువిచారముచేసి గౌరవంబునను
బలికెను గురుమహీపాలచంద్రుండు:
"కులగిరిధైర్యుండు గుణసముద్రుండు
విదురుండు సత్కళావిదుఁడుత్తముండు
సదమలచరితుండు శాస్త్రార్థవేది
నీతిమార్గంబున నిర్జరగురుని
బ్రాఁతిగాఁగఁజాలు భావంబువాఁడు
సముచితుఁడుభయపక్షములవారికిని
క్రమమొప్ప నతనితోఁ గడువిచారించి
చేయుదమీపని సిద్ధంబుగాను;
పాయక భీష్ముని బాహాబలమున
విదురునిమతమున విశ్రుతంబుగను
వదలక మనమహీవలయంబునిలిచె."
ననవుడు ధృతరాష్ట్రి కానుయోధనుఁడు
మనమునదుఃఖించి మఱియునిట్లనియె:

"పాండుపుత్త్రులమీఁద పక్షంబు గలిగి
యుండునువిదురుండు యుక్తంబుగాను ;
అతఁడేలశకుని కార్యములకు లీల
క్షితిలోన నొడఁబడుఁ జింతించిచూడ ?
నుర్వీశ, యిందులకొడఁబడ నేను,
సర్వభక్షకుఁజేతఁ జత్తుఁ దథ్యము ;
విదురుండు నీవును వేడ్కనుండుండు
హృదయంబులుప్పొంగి యెల్లకాలంబు."
అని యడలుగ మాటలాడినఁ జూచి
మనుజేశ్వరుండు కుమారునకనియె :
"నీకు విచారింప నెఱయంగ వలదు
చేకొని యొకరీతి చేసెద నింక ;
శిల్పకాచార్యులఁ జెలఁగి రప్పించి
కల్పింతు నొకసభ గౌరవంబునను."
అని ధృతరాష్ట్రుండు నాక్షణంబునను
అనఘాత్ములను శిల్పకాచార్యవరుల
రప్పించి, హాటకరత్నహర్మ్యముల
నొప్పుగాఁదెప్పించి యుగశరచిత్ర
సన్మణిద్వారదేశములు నిర్మించి
సన్మోదముననుండు సమయంబునందు,
ధృతరాష్ట్రుఁడొకనాఁడు తెల్లమిగాను
మతిమంతు విదురుఁ గ్రమ్మనబిలిపించి
యేకాంతమున భక్తి నెల్లనుబలికి,
కైకొని శకునియుఁ గౌరవేశ్వరుఁడు
పలికినపలుకులు పరఁగఁజెప్పినను,
కలఁగి వే వివశుఁడై కడువడిఁదెలిసి

తగఁ [1]గలిద్వారసందర్భంబునగుట
జగడంబు జూదంబు సత్ప్రజాక్షయముఁ
గాఁగలవని మదిఁ గడిమితో నెఱిఁగి,
లోఁగుచు నృపునకాలోన నిట్లనియె:

## జూదమాడఁదగదని విదురునుపదేశము

"ఇట్టికార్యమునకు నేనొడఁబడను;
బుట్టును మీఁదను భూరివైరంబు.
క్షత్త్రులకెల్లను బోరాటమేల
ధాత్రిఁ జేసెదవు చిత్తంబున నెఱిఁగి!
ఇదిమీఁద నొప్పదు ఎన్నిభంగులను;
వదలక జూదమే వలన నాడినను
ఎట్టిశాంతులకైన నీసులుపుట్టు;
గట్టిగా నినేర్పుకలిమి నీశకుని
కురుమహీపతుల దుర్గుణములువాపి
కురువంశమెల్లను గోరి రక్షింపు."
మన విదురునిఁ జూచి యారాజుపలికెఁ:
"దనయులకేల యుద్ధముసంభవించు?
నీవును నేనును నీతి[2]మంతులగు
పావన భీష్మకుంభజులుండఁగాను;
అటుగాన యిందుల కనుకూలమొందుఁ;
దటుకున నీవు రథంబెక్కిపోయి
ధర్మనందనుని మోదముఁ దోతెమ్ము
పేర్మితో." ననిపంపఁ బెద్దయు నతఁడు
నేకాంతమున భీష్మ కెఱిఁగించియుండె.
ప్రాకటంబుగ ధృతరాష్ట్రుఁ డంతటను

---

1. కలిప్రవేశసమయమని కాఁబోలు కవియూహ! 'కలి ద్వాపరసమీపంబగుటయు'. అని. నన్నయ. 2. వంతుండు. (మూ)

ఘనతమీఱంగఁ దాఁగట్టించినట్టి
కనకసన్మణిసభ కౌరవేంద్రునకుఁ
జూపి యాతనితోడ సొలపకిట్లనియె :
" నాపదయగుజూద మాడంగవలదు ;
కలహంబు మీలోనఁ గలయంగఁబుట్టు ;
నిలఁ బ్రజాక్షయమగు సంతిమీఁదటను ;
నీవుఁ బాండవులును [1] నెయ్యంబుగలిగి
వావిరి సుఖలీల వర్తించుటొప్పు ;
వలదుజూదంబాడ ; వారిలక్ష్ములకు
నిల నసహింపంగ నేటికినీకు ?
పాపంబుగట్టుకోఁ బాఁడియే నీకు !
నోపికగలిగుండు ముచితయత్నముల ;
వేదార్థవిదుఁడైన విదురున కిదియ
యేదియు సమ్మతంబెంతయుఁ గాదు ;
ధర్మనందనుసంపదకు నెక్కుడైన
ధర్మంబు నీకును బసఁ జాలఁగలదు ;
అతఁడుచేసినయట్టి యజ్ఞంబుకంటె
నతివిశేషంబుగా యజ్ఞంబు సేయు ;
భూలోకమునఁగలభూపతులెల్లఁ
జాలంగ సంపద చయ్యనఁదెచ్చి
యిత్తురునీ." కన్న నిలనాయకునకు
నత్తఱిఁ గురుపతి యల్లనఁబలికె :
" ధర్మజుతోడ జూదంబులాడుటయె
ధర్మయజ్ఞము నాకు ధరణీతలేశ !
అందుమూలంబున నఖిలసంపదలుఁ
జెందుదునునాకుఁ బ్రసిద్ధంబుగాను.

1. నేమంబులకును. (మూ)

ఇందుఁకును మీరలేఁగుదేరంగ
నందున నేనుండి యాసభమహిమ
[1] చూచుచు, నచటి సంశోభితరత్న
వైచిత్రి భావించి వదలక మగుడి
మానిత విమలసన్మణితలంబునను
గానక యే నేరఁ గటిశాటి దడిసియు,
ననుజూచి భీముండు నగియె మిక్కిలిని.
కని ధర్మజుఁడు నాకుఁ గనకాంబరములు
పుత్తెంచినను ముదంబున ధరియించి
తత్తఱంబున మణిద్వారకవాట
దేశంబు వీక్షించి ధృతి లోనికరుగ,
నాశశికాంత శిలాగ్రంబు దాఁకి
నాలలాటము నొవ్వ, నను బిట్టు నవ్వె
బాలాజనంబు లపారంబుగొల్వ
ద్రౌపది రూపసౌందర్యగర్వమున.
ఆపట్టునను ద్రోవయరయంగ లేక
బ్రమసి యేనుండంగఁ, బఱతెంచి కవలు
కమనీయ రాజమార్గంబిది యనుచుఁ
దోకొనిపోయిరి ; దోరయంగ నట్టి
శ్రీకరసభఁ జూచి సృష్టిలోపలను
బ్రాణంబుతోడను బ్రదుకంగఁజాలఁ.
ద్రాణతోఁ బెద్దలు తద్దయు మిగుల
నవమానమొందిరి ; యధములందఱును
బ్రవిమల శ్రీలతో బహుమానములను
బొందిరి యేను భూభువనమెఱుంగఁ ;
గుందుచున్నాఁడను గురుతరంబుగను.
. . . . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . . . .

---

1. చూచునప్పటికి. (మూ)

చేకొనుకంటెను సృష్టిలోపలను
శ్రీకరంబెయ్యది సృష్టీశ్వరులకు ?
నముచిదానవుఁడు తానఁ దపంబుచేసి
యమితప్రతాపుఁడై యలరుటఁజూచి
ధరణీధరారి యధర్మంబునందు
దురమున వాని నుద్ధురశక్తిఁద్రుంచె ;
నలరినగతి శత్రులగు వారినెల్ల
నిలనాశనము సేయ నెంతయువలయు.
నధముఁడై యుండెను నధికుఁడై యుండె
నధికత పరమార్థులగువారు మెచ్చఁ
జెట్టు చుట్టును జనించినయట్టి మేటి
పుట్టచందంబునఁ బొదలుశాత్రవుల
[illegible]ంచుఁగవలయు బాహాశక్తితోడ.
గణుతింప వ్యాధినిఁగలితౌషధములఁ
జక్కఁబెట్టకయున్న జనుల బాధించు
నిక్కువం ; బటుగాన, నెఱయఁ బాండవుల
లక్ష్మి సర్వంబుఁజాలంగఁ గైకొందు
సూక్ష్మమార్గంబునఁ జోద్యంబుగాను.
పాండవేయులలక్ష్మి బహుభంగిఁ గొనక-
యుండిననాఁడు నాయుదరరోగంబు
మానదు పదివేలమార్గంబులందుఁ ;
గాన దీనికి నుపక్రమము గావింపు."
మనఁ గురుపతితోడ నాడెశకుని :
"అనుపమంబగు నాగజాశ్వసన్నాహ
మొనరింప, రాజిలో నుభయసైన్యములు
చెనకకమున్న ప్రసిద్ధంబుగాను
నాయక్షవిద్యను నైపుణంబునను
నీయెడఁ బరధరిత్రీశులలక్ష్మి

నీకు నిప్పించెద ; నెఱయ ధర్మజుని
జోకతో రప్పించు ; సులభంబునందు
జూదంబునన్ వాని సొలవరోడింప
మేదినీరాజ్యంబు మెఱసి నీకొదవు ;
నూరక పాండవేయులతోడఁ గదిసి
పోరాడి గెలువ వేల్పులకశక్యంబు."
అనువేళ ధృతరాష్ట్రుఁ డావాక్యములకు
నొనరంగ నొడఁబడ కొదవియిట్లనియె :
"విదురునిమతమున విశ్వభూభరము
వదలక సేయుదు వ్రతముగానెందు.
జూదంబులాడంగఁ జూడ విగ్రహము
వాదంబుఁ బుట్టును ; వలవదీపనులు.
పాండవేయులతోడఁ బగ నీకువలదు ;
నిండిన స్నేహంబుల నిరతంబునుండు ;
నా మాట నగ్రోవక నడవు నీతులను
వేమఱు." ననవుడు విని సుయోధనుఁడు
తుది ధృతరాష్ట్రునితోడ నిట్లనియె :
"విదురుండు పాండుభూపతినూజులకు
హితముగా విహరించు నెప్పుడు ; నతని
మతము సేయకుము సమ్మదచిత్తమునను ;
దలపోయ నెందు జూదము పురాణములఁ
గలదు దోషము లేదు గౌరవంబందు ;
దేవలుండటు చెప్పె దిక్కులెఱుంగ ;
దేవతాధర్మంబు ధృతిఁ బడయుదురు ;
కావున శకునికింకను నానతిమ్ము ;
రావించు వడి ధర్మరాజు నిచ్చటికి."
ననుటయు ధృతరాష్ట్రుఁ డాత్మఁ జింతించి
యొనయంగ నొడఁబడె నట్టకేలకును.

ఒడఁబడి విదురుని నొప్పరావించి
తడయకిట్లనిపల్కెఁ దత్పరయుక్తి:
"సౌవర్ణ నవరత్నసభ యిదిచూడఁ
బావనమతియైన పాండవాగ్రజునిఁ
దమ్ములఁ దోతెమ్ము తగిలియిచ్చటికి;
నిమ్ముల జూదంబు నీకురురాజు-
తోడ నాడంగ బంధురముగా వలయు
వేడుక." యనవుడు విని విదురుండు
చకితాత్ముఁడై మదిఁ జాలఁజింతించి:
"యకట యిట్లేల! మా కిందుద్యూతమాడ
నుభయపక్షమువారి కుగ్రవైరంబు
త్రిభువనంబెఱుఁగంగఁ దెల్లమియగును."
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

## విదురుఁడు ధర్మజుఁదోడ్తెచ్చుట

అని పెక్కుమాటలు నతఁడు ప్రార్థింప
చెప్పిన, వినకున్నఁ జేసి యావిదురుఁ
డప్పుడు ధృతరాష్ట్రునిమతంబునను
బోయె నింద్రప్రస్థపురవరంబునకు.
నాయెడ ధర్మజు [1] హరిని భీముని
విజయునిఁ గవలను వేడుకఁజూచి,
నిజమతిఁజింతించి నెఱిధర్మజునకు
భయభక్తియుక్తితోఁ బలుగనిట్లనియె:
"జయమొసఁగును నరేశ్వర, మిక్కిలియును
పుణ్యాత్ముఁడవు గుణాంబుధివి లోకమున
గణ్యాయశుండవు కారుణ్యనిధివి

1. ద్యూతాహ్వానమునకై విదురుఁడుపోయినపుడు, పాండవులయొద్ద కృష్ణుఁడున్నట్లు వ్రాయుట, వ్యాస నన్నయ భారతవిరుద్ధము.

నీకును నేనుంబు నెఱయ నెయ్యెడను
ఆకల్పముగ." నన్న నాధర్మజుండు
విదురునిఁబూజించి వేడ్కనిట్లనియె:
"పదవినున్నారము పరఁగినందఱము;
నీవువచ్చినపని యెఱిఁగింపునాకు
నీవేళ." యన నతండిట్లనిపలికె:
"తనసభఁజూడ జూదంబాడ నీవు
చనుదేరఁ బుత్తెంచెఁ జయ్యన నన్ను."
అనుటయు ధర్మజుండటువిచారించి
పనివడి ధృతరాష్ట్రుపంపు మాఱుపఁగ
చేయకపోరాదు చెనసియింకనుచు
నాయతవిధియుక్తుఁడై క్షణంబునను
అనుజులుఁ దానును నద్రౌపదియును
ఘనుఁడుధౌమ్యుండాదిగా బుధశ్రేణి
యేతేర నిభపురికేఁగ నెయ్యమున.
నాతఁడు భీష్మ ద్రోణాచార్య శల్యుఁ
గృపుని నశ్వత్థామఁ గీర్తిభానుజునిఁ
దపనతేజునిసుయోధను భక్తిఁజూచి,
యాసభాస్థలియందు నాధృతరాష్ట్రు
భాసురయశునిఁ [1] బ్రతాపవర్తనుని
గనుఁగొనఁ దారకాగణములలోన
నొనరిన రోహిణీయుత సుధాకిరణుఁ
డుండినకైవడి నొప్పు గాంధారి
పుండరీకాక్షిసంపూర్ణేందువదన
తోడుగ సుఖలీలదొరయంగనున్న
ప్రోడను రాజన్యపుంగవుఁ జూచి

1. ఖ్యాత. (మూ)

దండప్రమాణంబు తగనాచరించి
నిండినభక్తితో నెఱినందుతలఁచి
..................... ...
........................
ఇందీవరాక్షిని నిభరాజగమనఁ
గుందేందురుచిని సద్గుణగణశీల
నలినీలవేణిని నబ్జసంభవుఁడు
చెలువుగా జగములఁ జిత్రంబుగాను
శృంగారలక్ష్మిగాఁ జేసె నేరుపుఁ ;
నాఁగిరమైన యాయంగనఁబోల
సతులులేరని చాలసన్నుతిసేయు
చతురతఁజెప్పె నాసమయంబునందు.
* అంతఁ బాండవులును నాదినంబునను
సంతోషచిత్తులై సంభ్రమంబునను
ఆసీనులై యున్న యాసమయంబున
నాసుయోధనుఁడు దా నప్పుడిట్లనియె :
"ధర్మనందన, నీకు దాక్షిణ్యనిధికి
ధర్మవర్తన వినోదంబు జూదంబు ;
ఆడుద" మనవుడు నతఁడునిట్లనియె :
"సోదర జూదమిట్లాగి నాడవలదు ;
జూదంబు వాదంబు సుజనఖేదంబు ;
........................
ఇదిదోషమాడంగ నేపారవినుము
పదహీనులగుదురు బహుళదుఃఖములఁ
బొందుచుందురు భూభువనంబునందు.
నందందు ధరణి మాయాద్యూతమునను
అడరంగఁ బాతకంబంద్రు మానవులు ;
ఎడర ధర్మద్యూతమిరవొందఁజేయు

ధర్మంబుగలుగును దత్త్వార్థముగను
నిర్మలమతినని నెఱిదేవలుండు
చెప్పినాఁ."డన యుధిష్ఠిరునకు శకుని
యప్పుడిట్లనియె నాహ్లాదంబుతోడ :
"నిందింపఁదగునయ్య, నీకు జూదంబు!
లెందును బలవంతు లితరులగెలుతు-
రయ్య, జూదంబునీవాడలేవేని
చయ్యనఁ గదలుము శాంతంబునందు."
నన ధర్మజుండును నతనికిట్లనియె :

### ధర్మరాజు శకునితో జూదమాడుట

"మునుకొని బలవంతు మునుసభాస్థలిని
జూదమాడంగను సొలవక పిలువ
నాదట నాడక యటుచనదగునె!"
యనుచుఁ గర్ణము దన్ను నటుచుట్టుకొనఁగ
వినరొ యాప్తులందును వేడ్కనిట్లనియె :
"ఎవ్వరు నాతోడ నిటుజూదమాడ
నిశ్చేళఁ బూనుదు రిటచెప్పుఁడి?" యనిన
రాజరాజకిరీటరత్నంబు ధర్మ
రాజునకును గురురాజు తాఁబలికె :
"మామామ శకుని ప్రేమమున నీతోడ
నేమంబులందును, నెత్తంబులాడు ;
నొడ్డెడిధనమెల్ల నొసఁగ నేనిత్తు
దొడ్డగా నాడుము దురితవిదూర."
అని తనచేతిరత్నాభరణంబు
గొని యొడ్డెనను జంద్రకులధర్మజుండు
దివ్యభూషణము వార్ధిసముద్భవంబు
భవ్యంబుగా నొడ్డె పరఁగి యుండగను,

గురు భీష్మ కృప శల్య కుంభజపుత్త్ర
సరసిజహితసూను సౌబలాదులును
ధృతరాష్ట్రవిదురులు తేజంబునందు
ధృతిఁజూచుచుండిరి తెరలకయుచట.
బద్ధమత్సరుఁడై ప్రభావంబునందు
సిద్ధంబుగా యుధిష్ఠిరుఁడు నయ్యెడను
గనకనిష్కంబులు, ఘనపురంబులును,
అనుపమ దివ్యవస్త్రానీకములును,
మరకత హరినీలమణి పద్మరాగ
వరవజ్ర మౌక్తిక వైడూర్య పుష్య-
రాగ గోమేధిక రత్న ప్రవాళ
నాగేంద్రమణులు, భాండాగారములును,
గలిత పంచద్రోణ కాంచనసహిత
[1] నలినమందిరపూర్ణ నవనిధానములు,
మాణిక్య కింకిణీమాలికానేక
బాణ తనుత్రాణ బహురూపములును,
ధన్యవరూథయూథములు, సువర్ణ
మాన్యఘంటాధ్వాన మదసింధురములు,
నమిత వినూత్న రత్నాభరణములుఁ,
గమనీయ నిజసభాగ్ర సమగ్రపాత్ర
పాణులై యొప్పెడు పరిచారకులును,
క్షోణీధరారాతి సుతునకు చిత్ర

.............................

.............................

అజ మేష గో మహిషానీకములును,
రజతపాత్రంబులు, రత్నాంబరములు,

---

1. పద్మాదినవనిధానములని కాంబోలు కవియూహ.

నాకొక్కొక్కయొద్దున నోడినఁ, జూచి
తక్కక విదురుండు ధర్మసూనునకు
వగచి యాధృతరాష్ట్రవసుధేశునకనియె :
" జగతియందును గురుత్స్నాతిలేశ్వరుఁడు
దోషంబులకుఁబుట్ట దుర్నిమిత్తములు
ఘోషతోఁబుట్టెను గోచరంబుగను.
దశదిశలను సుకృతమునొందినట్టి
శశివంశజుండైన శంతనుచక్ర-
వర్తికులంబున వసుమతియందుఁ
గీర్తిపొందని కురుక్షితిపతిపుట్ట
సకలపాపంబులు సంభవంబొందెఁ ;
బ్రకటితముగ మీఁద ప్రళయంబుతోఁచుఁ ;
గులమునకును నెగ్గు గొనకొనపుట్టు
సిలలోన నిప్పుడే యీతనికతన.
కులనాశకుఁడగు దుర్గుణుని దుర్మదుని
వలదనివారించి వంశరక్షణము
చేయఁగానగు నంచుఁ జెప్పెశుక్రుండు.
పాయక యటుగాన, పాలించుకులము ;
యదు వృష్ణివీరులు వారి నియోగించి
ముదమునఁ దమకులంబునకును మిగుల
దూషకుండగు కంసుఁ దునిమించి శౌర్య
భూషణులైరి భూభువనమెఱుంగ.
వాసవసుతు ధర్మవర్తనుఁ బనిచి
రాశి జూదము నివారణముగావింపు ;
జనవిగ్రహము మాన్చి సత్ప్రధానులకు
ననుకూలమొనరించు మద్భుతంబుగను ;
మనుజాధముని దుష్టమానసు శకుని
ఘనబహిష్కృతుఁ బాపకలితు దుర్మార్గ

నీతిదూరుని లోకనిందితుఁ గుజను
జాతరోషుని దురాచారుఁ గ్రూరాత్ము
దుర్యోధనుని దుర్మదుని నివారించి
యార్యసమ్మతమున నన్వయంబెల్ల
రక్షించు ; దగఁ బాండురాజనందనుల
లక్షణజ్ఞుల సముల్లాసచిత్తులను
ధీరుల మన్నించి ధృతరాష్ట్ర, నీవు
ధారుణిఁ బాలించు ధర్మమార్గమున.
వినుము శృంగారంబు పెనఁగొనియున్న
ఘనసముత్తుంగ ప్రగల్భద్రుమములు
నంగారములకై నయంబునఁ గాల్చు
వెంగలికై వడి పీఁకకింతయును
సమకట్టె లోభవశంబునఁ జాల
కుమతి నీతనయుండు కురుకులేశ్వరుఁడు
పాండునందనులను బరఁగఁగల్మషము
నొందొండ..................
అసమసాహసులతో నాజి సేయంగ
మసలుచునున్నాఁడు మదమునఁగదిసి.
తరమెఱుంగక పల్లదంబున వీఁడు
మొఱయుచునున్నాఁడు మొక్కలంబునను.
కురుకులక్షయకారి గుణవిహీనుండు
దురితాత్ముఁ డీతనిఁ దొలుత వారించి
సృష్టిశ, యిఁకనుపేక్షింపక నీవు
దృష్టంబుగా నన్ను తెలిసి జూదంబు
బుద్ధిగా." దనవుడుఁ బుత్రమోహమున
సిద్ధంబుగా నొండు సేయంగలేక
యూరక ధృతరాష్ట్రుఁ డుండెఁ జిత్తమున ;
నారయు విదురుండు నాసుయోధనుని-

## విదురుఁడు దుర్యోధనుని దూషించుట

తోడనే పలికె నుద్ధురరౌద్రమునను:
"ఓడక దుష్కీర్తి కొడిగట్టినట్టి
పాతకుండవు; గుణప్రకరశూన్యుఁడవు;
నీతిదూరుండవు నిందితాత్ముఁడవు;
అన్యాయమున జూదమాడెద వేల!
మాన్యులు బుధశిరోమణులు దూషింప.
ప్రకటసౌబలుని మాయాద్యూతమునను
సకలభూపాలైకచక్రేశులైన
పాండుకుమారుల బహుళసంపదలు
దుండగంబున నీవు తొలుతగైకొనిన
నవ్వరా నిన్ను నానాజనంబులును!
మవ్వమిగా." నన్న మఱి సుయోధనుఁడు
విదురునకలిగి యావేళ నిట్లనియె:
"ఎదిరితలంపు నీవెఱుఁగవేమియును;
బరులగుణంబులు పలుమాఱు నీవు
వరుసఁ గీర్తింతువు వాచానురక్తిఁ;
బరఁగ పాండవపక్షపాతివి; కపట
నిరతుండవై మహానిష్ఠురత్వమునఁ
గుడిచినయింటికే కీడుచదలంచి
యెడపక దోసంబు లెప్పుడుఁ జేసెదవు;
[1] క్రూరోరగము భంగిఁ గొసరక నీవు —
అరయఁగా విఘ్నమాచరించెదవు;
పరులసంపద సుఖోపాయంబునందు
వెరవారఁ గొనుట భూవిభులకు నెల్ల

1. ఉత్సంగతలమునం దుగ్రవిషోరగంబున్నట్లు నీవు మాయొద్దనునికి. అని నన్నయ.

నైజంబుగాదె నానాప్రకారముల!
భూజననుత, నాకు బుద్ధు లేకయును
జెప్పకుండుము నుతిచేసెద నిన్ను ;
నెప్పుడు ధర్మజు హితము కోరుదువు."
అనుచు సుయోధనునకు నావిదురుండు
కనలి యిట్లనియెను గడుదూషించి :
"చెడుబుద్ధి నీకును జెప్పెడువారి
నెడమాటలే విని వేగిరాక,
మాయట్టివారలమాటలు వినక
నీయట్టివారలు నేర్తురే యెందు!
కొంకక నీయట్టి గర్వాహితులకును
బింకపుమాటలే ప్రియములై యుండు ;
నీకుఁ బ్రియంబుగా నెరవైనమాట
నాకునాడఁగరాదు న్యాయంబుమాని.
పగగొని తమతోడ బలములఁ గూర్చి
తెగి తేజమునఁ బోరి ధీరులసిరులు
రాజులు జయమునరప్పింతురెందుఁ
దేజంబుఁ గీర్తియు ధృతియును మిగుల.
నాతలనెవ్వరు నగకుండ రాజ,
నీతిచెప్పితి నిది నీకింపుగాదు ;
పథ్యంబుగాఁగొనరు పాపమానసులు
తథ్యంబుగా సభ్యోక్తులు పల్కినను.
ప్రియభాషణములఁ బ్రియము సేయుదురు
నయవివర్జితులు [1] వినాశకాయువులు.
కాన సజ్జనులు దుష్కార్యవంతులకు
నేనాఁటఁ జెప్పరు హితబుద్ధులెల్ల.

---

1. క్షీణాయుష్కులనునర్థములో నపశబ్దముఁ బ్రయోగించియుండును.

మొదల నప్రియములై మునుకొనితోఁచి
తుదిఁ [1] బ్రియంబులగు హితంపు భాషణములు.
తరువులెక్కంగను దాపలు వలయుఁ;
దెరలక నదులీదఁ దెప్పలు గావలయు;
సమరులకైన సహాయంబువలయు
రమణనొండొరులకు [2] రాజితంత్రముల.
ఎంతబుద్ధులు నీకు నేనింతఁ జెప్పినను
నంతయు నీకును నప్రియంబయ్యె.
చిత్రయశుంగు విచిత్రవీర్యునకుఁ
బుత్త్రుండ నీతివిస్ఫూర్తిశీలుండను;
నన్నాదరము మిన్నకవేసి కినిసి
యెన్నిదుర్భాషణ లెగసియాడితివి!
తిరమొప్పఁగఁ బాండుతనయులతోడ
దొరయుసి జగడంబు తుదిఁజేసుకొంటి.
బ్రదుకుదునా కేమి ప్రాణంబుతోడఁ;
గాదలేదు నీబుద్ధి కుంభినియందు."
అనిపిదురుండు పికలాన నుండగుచు
జననాయకుని సభాస్థలినుండుతిత్తిని,
శకుని ధర్మజునితో సరిపల్కసియె:
"సకలసంపదలును సరిపినోడితివి;
రాజశేఖర, ధర్మరాజ, రాజాధి
రాజ, రాజశశాంక, రాజామరేశ,
యింకనేమిటినొడ్డి యిపుడు జూదంబు
శంకింపకాడుగా సంభ్రమంబునను?"
అనిన ధర్మతనూజుఁ డపనీతిలంబు
తనరంగనొడ్డి యాతనితోడ ననియె:

---

1. బ్రియంబై యుండు దూషభాషణలు. 2. రాజితతరులు. (మూ)

## ధర్మజుఁడు సర్వస్వము నోడుట

“దేవతాసీమలు దీపించువిప్ర
భూవలయంబును బుధపురంబులును
శుద్ధవృత్తులుఁ దక్కఁ గుంభినియెల్ల
దొడ్డుగాఁ గైకొను దోరంబుగాను
ఈజూదమాడి నేనిప్పుడోడినను
రాజితంబుగ.” నన్న దయమున శకుని
ధర్మజుతోడ జూదంబాడి గెలిచి
పేర్మితోఁ గైకొనెఁ బృథివీతలంబు.
వెండియు నొడ్డిన, విపులార్థములను
మండలాధిపుల సామంతభృత్యులను
దమ్ముల నత్యంతధర్మవర్తనుల
సమ్మదచిత్తుల సాహసాధికుల
నభిమానపురుషుల నంచితతేజులను
బ్రభుశేఖరుల జగత్ప్రఖ్యాతయశుల
సత్యవాక్యుల నాదిజగదీశనిభుల
నత్యుత్తముల సుగుణాంబురాసులను
బవమాననందనుఁ బర్జన్యసుతునిఁ
గవలను నోడెఁ దక్కకధర్మసుతుఁడు.
వివరింపఁ దన్నును వేగంబ యోడెఁ
దవిలి యందంద ద్యూతవ్యసనమున.
ఆవేళ శకునియు యమనందనునకు
భావించి పలికెను బటుశఠత్వమున :
“ఓ రాజశేఖర, యోధర్మతనయ,
వారక యోడితి వలయునర్థములు ;
కమలాక్షి పాంచాలకన్యక రూప
రమణీయ సంపూర్ణరాజబింబాస్య

నలువొప్ప నీదుధనంబు గావునను
దలపోయ నొద్ది జూదంబాడు." మనిన
'నవుగాక' యని జూదమాడి ధర్మజుఁడు
ధవళలోచన సాధ్వి ద్రౌపదినోడె.
వెసనోడి మిక్కిలి [1]వికలాత్ముఁడగుచు
ననహాయుఁడై దుఃఖమధికమై యొదవ
హరి పావనసాంభోరుహమునందు నిలిపి
తెలివి సర్వంబుఁ దృణముగాఁ దలఁచి
పాండవాగ్రజుఁడంతఁ బరతత్త్వబుద్ధి
నుండంగఁ, గృపుఁడును నొగిఁ గుంభజుండు
గాంగేయుఁడును గుణాకరు ధర్మసుతుని
నాంగినఁ గనుఁగొని యధికశోకమునఁ
గద్గదయుఁబొగులుచుఁ దరినుండి రంత
నెద్దియునన లేక హీనస్వరముల.
విదురుఁడు మిక్కిలి విముఖుఁడై కలఁగి
మదిలోన శోకాగ్నిమగ్నుఁడై యుండె.
ఆసభవారు బాష్పాంబుపూరములు
వే సముద్రము భంగి వెల్లియై పొంగుడఁ
గుపితశోకముల నెక్కొనియుండిరపుడు
అపుడు భూతాక్రోశమయ్యె నయ్యెడను;
అగుటయుఁ గర్ణుండు నాశకునియును
అగణితదుర్గుణుండా సైంధవుండు
దురితశరీరుండు దుశ్శాసనుండుఁ
బరమానురాగులై బలసియొండొరుల
మొగములుచూచుచు ముచ్చటలాడి
నగుచుండిరచట నానాప్రకారముల.

1. వికలచిత్తుండగుచు (మూ)

ధృతరాష్ట్రుఁడును సభ దిక్కున గనము
నతిభంగి విదురుని నడిగె గ్రక్కునను:
"ఎవ్వారేమివిధంబు లిట వోడి పిదప
నెవ్వారోడిరి? నాకు నెఱిఁగింపు." మనిన
నన్నరపతితోడ నతఁడిట్టులనియె:
"నన్న, యీశకుని మాయాద్యూతమునను
సకలార్థములునోడె శమననందనుఁడు.
[1]వికలులై పాండుభూవిభుతనూభవులు
దీనతనున్నారు తెలివిలేకిప్పు
డానగా." ననుచుఁ గ్రమ్మఱఁ జెప్పుచుండ
నావేళఁ గురుపతి హర్షంబుతోడఁ
బావనమతులైన పాండు [2]నినుతుల
దాసులగాఁ గెల్చి తారతమ్యంబు
వాసి దలంచక వరుసనిట్లనియె:
"వరవుళ్లఁగలిసి నివాసంబుదుడువఁ
దరళాక్షిఁ దన్వంగి ద్రౌపదినిప్పు
వేగంబ తోతెమ్ము విదుర, నీ." వనిన
నాగుణాంభోరాశి యతనికిట్లనియె:
"నీనిష్ఠురతకును నీపాపమునకుఁ
గానంగఁజాలుదు కష్టవర్తనము;
దుర్జనుండవు మహాదురితదేహుఁడవు
వర్జించు నిన్ను నైశ్వర్యంబు; కూడఁ
జెడుదువు నీవును సిద్ధంబుగాను.
పుడమిఁ దోలెడు పాండుపుత్త్రుల సాధ్వి
యగు ద్రౌపదిని నేలయవమానిపుడు
తెగువఁ జేసెదవు ధాత్రీశులుదిట్ట!

1. వికలవ్యూలై. 2. భూపతుల. (మూ)

పాండవేయులంత్క్షి పరఁగఁ గ్రొంటి
దుండగంబుఁ నృపస్తోమంబు నగఁగ.
ప్రకటంబుగా నిట్టిపాపస్వభావు
శకునిమాటలు వినఁ జనునె నీకెందు!
ఈజూదమున నీకు నెగ్గులుపుట్టు
నిజగంబున." నన్న నేచి యంతటను
దుర్యోధనుఁడు మహాదుర్మదాంధుండు
కార్యజ్ఞుఁడను ప్రాతికామికిట్లనియె:

## ద్రౌపదినిఁదోడ్తేర దుర్యోధనుఁడు ప్రాతికామినంపుట

"విదురుఁడెప్పుడు పాండవేయులమెచ్చి
మొదలనుండియుఁ బక్షమునఁ జరియించు;
వెఱచు; నీవేఁగి యావెలఁది ద్రౌపదినిఁ
దత్తఱోడఁ దోతెమ్ము తడయక." యనినఁ
బ్రాతికామేఁగి ద్రౌపదికినిట్లనియె:
"నాతి, నీపతి ధర్మనందనుఁ డిపుడు
ధార్తరాష్ట్రునకు జూదంబాడి మిగుల
మూర్తిఁ గోల్పిల్లఁ దమ్ములఁ దన్ను నిన్ను
సర్వార్థముల నోడె జగమెల్లనెఱుఁగ.
దుర్వినీతమున నాదుర్యోధనుండు
నిన్నుఁదోడ్తెమ్మని నిష్ఠురత్వమున
నన్ను బుత్తెంచెను [1] నడుఁకక రమ్ము."
అనుటయుఁ బాంచాలి యతనికిట్లనియె:
"మునుకొని యేయుగంబులయందునైన
భార్యనోడినయట్టిభర్త గాఁగలఁడె!
యార్యోక్తిగానియీయాలాపమిపుడు

1. నడుగక. (మూ)

వినవపూర్వంబయ్యె విశ్వధారుణిని ;
జెనసి ధర్మజుఁడిట్లు చేయువాఁడోకొక్కొ !
మును గనునోడి దుర్మదవృత్తితోడ (?)
ననునోటువనుట మొన్నఁగ నిదినిజమొ !
కల్లయో !" యనుచును గడుసంశయమున
నెల్లగాసికి మతియిట్లనఁ బలికె : (?)
"ధర్మనందనుని మోదంబుతో నడిగి
పేర్మిఁ దత్సభకును బెంపొదవింపఁ
దోకొని పో." మ్మన్న ప్రాతి వాఁడునరిగి
ప్రాకటంబైన ద్రౌపదిపల్కులెల్ల
ధర్మనందను కంతయు నెఱిఁగింప,
ధర్మదేవతను జిత్తమునందు దలిపి
యధిక చింతాక్రాంతుఁడై యుండుటయును,
అధముండు దుర్మార్గుఁడగు సుయోధనుఁడు
ప్రాతికామికి నతిత్వరత నిట్లనియె :
"నిశత్తి సభవారలిందఱు నెఱుఁగ
ద్రౌపదిఁదోడ్కొని కడయుకర్ము
నైపుణ్యమున." నన్న నలి వాఁడునరిగి
పాంచాలితోడఁ దప్పక యిట్టులనియెఁ :
"జంచలలోచన, శమననందనుని
నడిగితి ; సభవారు నటవిచారించి
వశి నిన్నుఁదోడ్కొని వరుస రమ్మనుచు
నన్నుఁబుత్తెంచిరి నలినాక్షి !" యనిన
నున్నయాద్రౌపదియును దలపోసి
దుర్మార్గుఁడైనట్టి దుర్యోధనుండు
ధర్మంబుదప్పిన తలఁపునకపుడు
ధర్మనందను సమ్మతమునకు వెఱచి,
ధర్మస్వరూప యాద్రౌపది కడఁగి

యేకవస్త్రముగట్టి యెంతయుఁ జాల
శోకాకులతనొంది చుఱచుఱమనుచుఁ
గబరీభరముజాఱఁ గన్నీరుగాఱ
సొబగుదేహముగంద శూన్యతపొంద
వాతెఱయెండ భావముదూలియుండ
భీతిమిక్కిలిపట్టఁ బెనుదిగదొట్టఁ
జెమటమేనునఁబుట్టఁ జింతదాఁబుట్ట
భ్రమచుట్టుముట్ట నాపద్దాయ గాక్షి
యరిగి యాకురువృద్ధునాస్థానమునను
దరలత్వమునను౦డె ద్రౌపది; యంతఁ
బాండునందనులు ద్రౌపదిఁజూడలేక
నిండినలజ్జతో నిబిడదుఃఖముల
మోముదమ్ములు వాంచి ముఖముద్రలు పడ
నేమియు ననలేక యిట్లున్నయెడను,
బాండవేయుల దైన్యభావంబు చూచి
నిండినమదిఁ గురునృపకులోత్తముఁడు
సహజన్ముఁడైన దుశ్శాసనుఁ బిలిచి
బహుమానమొనరించి భక్తినిట్లనియె:
"ఎఱుక యించుకలేక యీప్రాతికామి
వెఱచు భీమునకును; నేఁడు నీవేఁగి
ద్రౌపదిఁ దోతెమ్ము తత్క్షణంబునను

## దుశ్శాసనుఁడు ద్రౌపదినిఁ దలవట్టి యీడ్చుకొనివచ్చుట

ఏపార." ననవుడు నెంతయు నతఁడు
చనియెను ముదమున సంభ్రమంబునను.
మునుకొని యంగట మొగిద్రౌపదియును
దురితాత్ముఁడైనట్టి దుశ్శాసనుండు
విరసుఁడై కొసిపోవ వే వచ్చుటెఱిఁగి

గాంధారికడ కేఁగఁ గదుభయంబునను,
బంధుర సద్గుణాభరణయైనట్టి
యాకృష్ణపిఱుఁదున నరిగియిట్లనియె :
" నేక చిత్తమున నీవెచటి కేఁగెదవు ?
కొంకక చనుదెమ్ము కురురాజసభకు
శంకింప ; కున్నతి శకునిజూదమున
ధర్మనందనుఁడును దను నన్నుఁ దనదు
కూర్మిసోదరులను గోల్పోయె నోగ ;
నలివేణి, కురుపతియర్థంబవైతి ;
వలయు నేతెమ్ము హర్షంబుతోడ."
అనుచు డాయఁగవచ్చుటంతయుఁ జూచి
వనజాక్షి ద్రౌపది వానితో ననియె :
" నేనురజస్వల ; నేకవస్త్రంబు
పూని కట్టినదానఁ ; బుణ్యచరిత్ర ;
ననుముట్టఁగా నీకు న్యాయంబుగాదు ;
గొనకొని యొక్కింతగుణము గ్రహించు ;
మానాభిమానంబు మదిలోన విడిచి
మానిని కురువృద్ధమండలేశ్వరుల
ఘనసభాస్థలికెట్లు కడఁగిరానేర్తు ? "
అనిన ద్రౌపదితోడ నతఁడిట్లనియె :
" ఏకవస్త్రంబు నీవిఁకఁగట్టితేమి !
యేకవస్త్రముఁ గట్టకేకనుండితేమి !
యేకార్తితోడ నీవేఁగుదెమ్మిపుడు ;
రాకున్న నిన్ను సంరంభంబుతోడ
బలవంతమునఁ దత్సభాస్థలంబునకు
నెలమిఁ గొంచునుబోదు నిదనిశ్చయంబు. "
అనవుడు ద్రౌపది యతనితోఁ బలికె :
" విను, ధర్మమార్గంబు వివరింపు ; నన్ను

మును [1]బలాత్కారమ్మునను గొనిపోవఁ
జనునె నీకును రాజసభలోఁ బలికిని!"
అంచును బలికిన, నాగ్రహంబునను
ఎంచనలేక దుర్వారసత్త్వమున
దురితశరీరుండు దుశ్శాసనుండు
తరుణి నుత్తమసాధ్వి ద్రౌపదీదేవి
నతిరాజసూయమహాధ్వరాంతమునఁ
జతురావభృథమున జగతీసురేంద్ర
వేదమంత్ర పవిత్ర విమలోదకములఁ
బ్రోదిఁ బావనములై పొలుపారునట్టి
యసమానపుశిరోరుహంబుల దాఁకఁ
దలవట్టి యీడ్చి యుద్దండతఁ దెచ్చె
నోడక సభకు నార్యులు చింతఁగోడఁ
జూడంగ సభకనిష్ఠురవృత్తి మీఱ.
గాలిఁ దూలినయట్టి కలితఁ దరు
పోలె దుశ్శాసనుభూరిహస్తమునఁ
బట్టంగఁబడి కృష్ణ [2]పటుకీరవాణి
నెట్టన భీతితో నెఱఁ గర్ణశకుని
సైంధవ కురురాజ సభకు నేతెంచి
బంధురకోప నిర్భరలజ్జలందు
నాసభవారికి నప్పుడిట్లనియె:
"రాశికెక్కిన ధర్మరాజు ధన్యుండు
దైవయోగమున జూదంబున [3]నోడి
భావింప నటమీఁటుపడియుండుఁగాక;
ధర్మంబుదప్పునే తనువుపోయినను!
ధర్మాత్ములార, సత్యవ్రతులార,

---

1. బలవత్కారమున. 2. పటికీర్ణవేణి. 3. నోడి. (మూ)

సాహసాధికులార, సభవారు వినుఁడు ;
ద్రోహియైనట్టి యీదుశ్శాసనుండు
పాతకుఁడై రోషభాషణలాడి
నీతిదప్పి త్రిలోకనిందితుఁడగుచుఁ
దలవట్టి యీడ్చుక తద్దయువచ్చెఁ ;
దలఁపంగ నిది యుచితంబు గాదనక
యూరకయుండుట యుక్తధర్మంబె!
యూరయు నోకరుణాంభోధులార!"
యని 'భరతాన్వయం బతిసంద్యమయ్యె ;
ననుమాన మింతలే ;' దనికృష్ణఁ దలఁచె,
భయమందె ద్రౌపది పర్వేందువదన.
రయమున నపుడు నీరజలోచనుండు
కరుణించి ద్రౌపదిఁ గనుసంభ్రమమున
నరసి రక్షింపంగ నాత్మలోఁ దలఁచె.
అపుడు త్రిలోకజయప్రతాపమును
నుపమవర్తింపుచునుండెను పాండు-
రాజనందనుల పరాజయంబెల్ల
రాజితారుణనేత్ర రాజీవములను
వీక్షింపుచుండిన వెలఁదిఁ బద్మాక్షి
వీక్షించి దుఃఖించి యెంతయుఁగనలి
పాండవాగ్రజునితోఁ బవనజుండనియె :
"కొండలఁబోలిన కుంజరంబులను
జవహయంబుల రత్నసముదయంబులను
వివిధభూషణ వస్త్రవిసరంబు ధనము
సర్వసామ్రాజ్యంబు సకలార్థములను
బర్వేందువదనల బాణాయుధముల
నొగి మమ్ము నోడిన నోడితిగాక,
యగణితంబైన మాయాద్యూతమునను

అంచితశుకవాణి నళినీలవేణిఁ
బాంచాలి నోడంగఁ బాడియే నీకు!
శకునికైతవ మార్తఁ జాలంగ నెఱిఁగి
ప్రకటితంబైన మాయాద్యూతమాడి
వేగ నధర్మప్రవృత్తుండవైతి
వాని మాక్కులెఱింగి యధిప, నీ భావాలు
గాహంబుసేయుంగఁదగు నీక్షణంబ
యూహించి." యనవుడు నొసఁగ భీమునకు
నర్జునుఁ డనియెఁ బ్రియాలాపములను:
"సజ్జనారాతి సునీతిమానసుఁడు
ధర్మతనూజుండు ధర్మవర్తనుఁడు
ధర్మంబుదప్పిన, ధరణీతలంబు
తల్లడిల్లును; రసాతలముఁ గంపించుఁ;
బెల్లగిల్లును మహాపృథివీధరములు;
నంబరంబు మునుఁగు; దిగ్గజములు మ్రొగ్గుఁ;
గమలాప్తచంద్రులగతులు గీడ్వడును.
తగిలి సుహృద్ద్యూతధర్మయుద్ధములఁ
బగతునిచే నోటువడియెఁ గావునను,
గురులు ధర్మాత్ములఁ గోపింపఁదగునె!
ధరణి శూరులకును దక్కించి పోరాడ;
దైవికమునను జూదంబాడి యోడెఁ
బ్రావీణ్యమతియైన పాండవాగ్రజుఁడు."
అనిన శోకాక్రాంతులగు పాండవులను,
వనితద్రౌపదిఁ జూచి వగచి మిక్కిలిని

## వికర్ణునార్యవచనములు

అనియె ధర్మైకవికర్ణుఁ డార్యులతోడ:
"ఘనుఁ జగద్ద్రోహి దుష్కర్మతత్పరుఁడు

దుశ్శాసనుఁడు, దురాత్ముఁడుసుయోధనుఁడు
దుశ్శాస[1] నస్థులై దుష్ట[2] వర్తనలఁ
బాండవేయులను ద్రౌపదిని నీభంగి
నొండొండయవమాన మొనరింపుచుండఁ
బెంపుతో మీగ లుపేక్షింపఁదగునె!
సంపూర్ణచిత్తులు సభికు లుత్తములు
గాంగేయ ధృతరాష్ట్ర కలశజ కృపులు
సింగితజ్ఞులు లోకహితదయాపరులు
పలుకకయుండంగ [3] భావ్యమా మీకుఁ!
దలఁపఁ దక్కినసభాస్థలిలోనివారు
మహిత కామక్రోధ మదలోభములను
మహిలోనఁదక్కి నిర్మలచిత్తులగుచు
నధికధర్మము వల్కఁ దఱలంబునెఱుఁగ ;
బుధనుతులార, సత్పుణ్యాత్ములార,
మీరూరకుండిన మెఱసి యేనొకటి
కోరి ధర్మంబుగాఁ గొంకి యెఱిఁగింతు ;
'పరికింప జూదంబుఁ బానంబు వేఁట
పరుషోక్తులును బహుభక్ష్యాసక్తి
..........................
..........................
ధాగుణి ధర్మంబుదప్పి వర్తిల్లు
వారికృత్యంబులు వర్ణింపఁదగదు ;
మాయజూదంబున మఱియోడినట్టి
యాయుధిష్ఠిరునకు ననిలజపార్థ
నకుల సహదేవ నరవరేణ్యులకుఁ
బ్రకటిత సత్కులభామయైనట్టి

1. నస్థులు. 2. వర్తనులు. 3. బాధ్య. (మూ)

పాంచాలిఁ గల్యాణిఁ బణముగా నొడ్డ
నంచితంబుగ[1] నోడఁ; డట్టిద్రౌపదిని
ధర్మవర్తనిఁ బుణ్యతరుణీలలామ
నిర్మలమానస నీరజపాణి
బింబాధరోష్ఠిఁ బుష్పిణి నేకవస్త్రఁ
గంబుకంఠిని నధికక్రోధమునను
దక్కక యీసభాస్థలములో పలికి
నక్కట! తోదేరనర్హమా?" యనిన
నావికర్ణుని పల్కులన్నియు వినఁగ
నోపక కర్ణుఁ డత్యుగ్రుఁడై పలికె:

### కర్ణుఁడు వికర్ణునిఁ గినియుట

"కురువృద్ధు లధికులు గుణవంతులుండ,
వరుసం బోడుతఁ బిన్నవానికి నీకు
నిట్టిమాటలువల్క నేమికారణము?
నెట్టణంబుగ దయానిపుణత్వమునను.
ద్రౌపది [2]యత్యంతధర్మచరిత్ర
యోపార ననిపల్కి, తీవు నెయ్యమున;
శమనతనూజుండు సకలాత్ములను
గ్రమమున నోడుచోఁ గాంతఁ బాంచాలి
నేటికినోడ మహీస్థలంబెఱుఁగ!
నాటికి నిటువంటిమాటలు మాను;
'యేకవస్త్రముతోడ యేణాక్షి దీని
నీకొలువునకుఁ దా నేభంగులందు
రప్పించినా! యిదిరౌద్రంబులోడఁ
దప్పుఁజేసితి.' రని తడయకాడితివి;

1. గానద్రౌపదియును. (మూ) 2. అధర్మవిజితయని. నన్నయ. సభా. ద్వి. ఆ. 229. గ.

లోకంబులో నొకలోలలోచనకు
నేకభర్తయె కాక, యీవధూమణికి
నేవురుభర్తలు! ఇది దూషితంబు;
భావింప దీనిని బంధకి యండ్రు;
అట్టిదానికి విగతాంబరఁ జేసి
గట్టిగాఁ దెచ్చినఁ గలుషంబు లేదు."
అనుచుఁ గర్ణుండు దా నావికర్ణునకు
ననుపమ ప్రతిభాషలాడి నా వేళ
పెరిమ దుశ్శాసనుఁ బిలిచి [1] యిట్లనియె:
"ఘోరవీరవిజయుల పాండునందనుల
వలువలు, ద్రౌపదీవస్త్రసంఘమును
ఒలువుము భయమంద కుగ్రంబుతోడ."
ననిపంచినను వాఁడు నట్లకాకనుచుఁ
జనుదెంచినను, పాండుజననాథసుతులు
అలఘు మాయాద్యూతమునందున నోడి
బలిమి యేమియు లేక పైవస్త్రతతులు
మును బెట్టి యాసభమ్రోల నుండుటయుఁ,
జెనసి యుద్ధతి దుస్ససేనుండు ద్రుపద-
రాజతనూభవ రాజితాంబరము
రాజసంబున నొల్వ రమణ డగ్గఱిన,

## ద్రౌపదీమానసంరక్షణము

నా వేళ ద్రౌపది యతిభీతినొంది
భావజజనకునిఁ బద్మలోచనునిఁ
గరిరాజవరదునిఁ గారుణ్యనిధిని
బరమాత్ము నచ్యుతు భక్తవత్సలుని

1. దుర్యోధనుఁడు కర్తఅధ్యాహార్యము.

వేదాంతవేద్యుని విమలాబ్ధిశయను
నాదినారాయణు నాద్యంతరహితు
సర్వభూతాత్మకు సర్వలోకేశు
సర్వగీర్వాణాబ్జసంభవ వినుతు
శరణాగతత్రాణు సకలకల్యాణు
మురదైత్యహరణుఁ బ్రమోదవిస్ఫురణు
ద్వారకాపురివాసుఁ [1] దరళితోల్లాసు
ధీరుని రవికోటితేజిష్ణుఁ గృష్ణుఁ
జిత్తాంబుజంబునఁ జింతించిపలికె :
"సత్తుగా నిన్ను నే శరణువేఁడితిని
ఘన మనోవాక్కాయకర్మంబులందు ;
ననిశంబు నిన్నకా కన్యమెఱుంగ ;
నీమహాదాపద కిటనీవెదిక్కు ;
స్వామి, సర్వేశ్వర, సత్కృపాంభోధి,
కావంగఁ బ్రోవంగఁ గర్తవునీవు ;
ఈవేళ నను బ్రియంబెసగ రక్షింపు ;
భద్రేభవరద, యోప్రహ్లాదవరద,
యద్రీంద్రధర, రావణానుజవరద,
మానుగా నాయభిమానంబు గావు
మానితంబుగ ననుమానంబులేక."
అని సన్నుతించిన, హరియు సత్కృపను
వనజాక్షి ద్రుపదభూవరతనూజకును
అక్షయవస్త్రంబు లఖిలంబు నెఱుఁగఁ
దత్క్షణంబున నిచ్చెఁ దాత్పర్యమునను.
అట దుస్ససేనుండు నాగ్రహంబునను
దటుకునఁ గదిసి యాద్రౌపదిచేల

---

1. దరళి. (మూ)

పట్టెయొల్లంగ, నా భామినీమణికిఁ
బట్టుచీరలు వెలిపట్టుచీరలును
దట్టపుఁబులిగోరుతెరముచీరలును
జట్టుభవంతులుపారిదిచీరలును
చెల్లాకువన్నెలుజిలుగుచీరలును
నల్లగంటుకులు సన్నంపువస్త్రములు
కస్తూరిమళ్లను గంధపుచీరలును
విస్తారమగు తమ్మిపూలచీరలును
రుద్రాక్షవన్నెలు రూఢిమైనొప్పు
భద్రాక్షవన్నెలుఁ బవడంపువన్నె
గలరాసులాదిగాఁగలిగినయట్టి
లలితవస్త్రంబులెల్లను జాలఁగలిగి
కొండలపాడవులై కుంభినిఁబడఁగ
నొండొండ వస్త్రంబులొలువంగ సలసి
యధికలజ్జాపరుండై మాని పోయె
శిథిలంబులో దుస్ససేనుండు కడఁగి.
ఆవేళ ద్రుపదరాజాత్మనందనను
వావిరిఁ గనుమహీవరునిసోదరుఁడు
దుస్ససేనుఁడు మహాదురితవర్తనుఁడు
నిస్సంశయంబున నెఱి వల్వలొలువఁ,
గనుఁగొని భీముఁడాగ్రహమున నొదవి
వనధిపైఁగినిసిన వనజాప్తకులుని
చెలువునఁ బురములు చెనకిననాఁటి
జలజాక్షు బాణంబుచందంబునందు
నతిభయంకరలీల నరుణాక్షుఁడగుచుఁ
బ్రతిభట భయదదండపాణియుఁ బోలె
దంతసందష్ట దారుణముఖుండగుచు (?)
నంతట సభవారలందఱు వినఁగ

బలిమి మారుతి ప్రతాపమునను ప్పొంగి:
"కలబాంధవులు కురుక్ష్మాపతి చూడ
సమరరంగమున దుశ్శాసనుఁబట్టి
క్రమముతో వానివక్షస్స్థలిచించి
రాజిత రుధిరధారలు క్రోలిక్రోలి
తేజంబుతో వానిదేహాంతరంబు
ప్రేవులఁ జీరెద భీమంబుగాను
దేవకోటులు ప్రస్తుతింప రౌద్రమున;
చెనసి వానిని నిట్లు సేయకుండినను,
దనరంగఁ బితృప్రపితామహులకును
దప్పినయాదురితము నొందు వాఁడ;
నిప్పుడు తథ్యార్థ మీనాడుమాట
సందేహమునులేదు జగతీతలమునఁ
బొందుగా." నని మహాద్భుతశౌర్యమునను
మిగులులు యును జూచి మించి యాసభను
మగఁటిమిగల కురుమండలేశ్వరుఁడు
సమితిభయభ్రాంతుఁడై యుండె; సంతి
రమణతో నాధృతరాష్ట్రునిందించి
పెరిమఁ బాంచాలి నుపేక్షించుచున్న
వరయోధులనుజూచి వైళంబునందు
నెల్లవారునెఱుంగ నెసగుహస్తములు
మొల్లముగావించి మును విదురుండు
పెద్దయెలుంగునఁ బెరసి యిట్లనియె:

## విదురుని ధర్మప్రసంగము

"పెద్దలకెల్లను బృథివిలోపలను
ధర్మంబు సత్తుగాఁ దగఁ జెప్పనున్నఁ,
బేర్మి భావంబులు పెక్కులుపుట్టు;

నీవిశీర్ణుఁడు నిర్జరేశ్వరగురుని
భావంబులనుబోలు బహుళనీతులను
బాలుఁడై యుండియుఁ బరమధర్మంబు
చాలంగ బలికెఁ బాంచాలిపట్టునను ;
[1] అతులితంబైనట్టి న్యాయంబు గాన
నతని వాక్యంబు మీరంటు సేయఁదగును ;
ధర్మజ్ఞులై సభాస్థలికిని వచ్చి
ధర్మసందేహ మత్తఱి నడిగినప్పుడు,
నిజము చెప్పక యున్న నిఖిలభూస్థలిని
భజనతో ననృతసద్భయముల నెపుడు
పొందుచుందురు సత్పురుషులై మిగుల
నిందయేమియు లేక నెయ్యంబునందు ;
ధనలోభమునను సంతతమును సభను
ననృతవాక్యములాడినట్టి సభ్యులకు
సిద్ధించుఁ బాపంబు శీఘ్రంబు గాను ;
ఇద్ధర నీయర్థ మితిహాసములను
వినఁబడెఁ ; బ్రహ్లాదవిబుధారిసుతుండు
జననుతుండగు విరోచనుఁడును, ధన్యుఁ
డగుసుధన్వుఁడు, నొక్కయువతి కేశికొఱకుఁ
దగఁ బ్రతిగ్రహము మోదంబునఁ జేయ
నేమె పెద్దలమని యిద్దరుఁగూడి
మోమోటమాని యిమ్ములఁ బోరుచుండి
ప్రహ్లాదుకడ కేఁగి పస సుధన్వుండు
నాహ్లాదచిత్తుఁడై యప్పుడిట్లనియె :
"ధర్మవిదుండవు తలఁపంగ నీవు
అర్థిలిమా వాదమటు దీర్పవలయు ;

1. తను......ధర్మంబు ? (మూ)

నిజము చెప్పకయున్న నీమస్తకంబు
త్రిజగములెఱుంగంగ దివిజాధినాథు
కులిశంబు వ్రచ్చు [1] నకుంఠితంబుగను
నలవుమై." ననినఁ బ్రహ్లాదుండు వెఱచి
కశ్యపుకడ కేఁగి కమనీయనీర
జాస్యుఁడై పల్కె యథార్థంబుగాను.
తగ విరోచనుని సుధన్వుని పలుకు
లాగిఁ దెల్పఁ గశ్యపుఁ డుదితోక్తిఁ బలికె:
"సాక్షి దప్పఁగఁ జెప్పజాలిన వాఁడు
తత్క్షణంబున మహీస్థలిలోన వరుణ
పాశబద్ధుఁడగుచుఁ బరఁగుదు రెందు ;
దేశంబులందును దృఢముగా మఱియు
నన్యాయసభలోన నతులధర్మంబు (?)
విన్యాససభయందు వెలయదుగాన,
ధర్మంబు సభ్యులు దప్పకుండంగ
నర్మలమతి నెందు నెఱఁజెప్పవలయు."
ననినఁ బ్రహ్లాదుండు నతనికిట్లనియెఁ:
"తనర సుధన్వుండు నాతనయునికంటె
నుత్తముం." డని చెప్పియుండి మెప్పించె.
నత్తఱిఁ గశ్యపుఁ డా సుధన్వుండు
నరిగిరి ప్రహ్లాదు నభినుతింపుచును
బరమవిజ్ఞానులై పాటించి మించి.
మీరు ద్రౌపదియందు మెఱయు ధర్మంబు
గోరి [2] సెప్పుఁ." డటన్నఁ గొలువువారెల్లఁ
బలుకకుండిరి ; యంతఁ బాంచాలి పలికె:
"నలఘుమదీయస్వయంవరవేళఁ

---

1. నంకురితంబుగాంగ. 2. చేయు. (మూ)

దెఱఁగొప్ప భప్పన్న దేశాధిపతులు
వరుసతోఁ గములుగావచ్చియున్నపుడు,
పెనఁగొని విల్లెక్కుపెట్టి బాణంబు
గొనకొనితొడుగంగ గుఱియేయఁబూన
నసమర్థులై తేజముణఁగి యుండఁగను
వెస మఱ్ఱి చూడఁగ, వృత్రారిసుతుఁడు
నలవోక నావిల్లు సవలీల నెత్తి
యొలమిఁ దొడుత గుణమెక్కించి మించి
యలఘుఁడై బాణంబులైదు సంధించి
తలకొని మత్స్యయంత్రము పడనేసి
నన్ను గైకొనిపోవ, నరనాథులెల్లఁ
బన్నగాఁ బైకొని పర్జన్యసుతుని
బాణజాలములను భరియింపలేక
యోటుపడిరిఁ బాఱిరేపెల్లఁ బోలిసి.
నాఁటిరోషంబు మనంబుననుంచి
పాటించకిపుడు నెపంబుసంధించి
సకలతేజంబులుఁ జదురొప్పనన్ను
సకలంకగతి నీదురాత్ముఁడై నట్టి
దుస్ససేనుండతిదోషవర్తనుఁడు
దుస్సంగి [1] చండాలదుర్మార్గుఁ డిట్టు
లవమానమొనరించె నాగ్రహంబునను.
ప్రవిమలయశులైన పాండునందనుల
చెలువనై గోవిందు చెల్లెలనంగ
వెలసియుండిననన్ను విరసంబునందు
నింతసేయుదురయ్యొ యీసభ చూడ !
నెంతయు.'' నని దుఃఖమీఁదుచుండఁగను

1. చాండాలి. (మూ)

ద్రౌపదిఁజూచి శాంతనవుఁడిట్లనియె :
"ఓపుణ్యసాధ్వి, నీలోత్పలనేత్ర,
నీవుపల్కిన ధర్మ్యవాక్యములను
దైవజ్ఞుఁడౌ ధర్మతనయుఁడె యెఱుఁగు ;
నితరులెఱుంగలే రెన్నిభంగులను.
అతిపాపచిత్తులై యవమానమిపుడు
వదరక నినుజేయువారలందఱును
గోదలేక మీఁదఁ ద్రుంగుదురు గ్రక్కునను."
అనుచున్న సమయంబునందు నాసుదతిఁ
గనుఁగొని రోషించి కర్ణుఁడిట్లనియె :
"ఏపురుషులు నిన్ను జూదమునను
వాపిరి విడిచిరి ; పరుసనొక్కరుని
గైకొను" మనుటయుఁ గౌరవేశ్వరుఁడు
నాకంజనేత్రతో నప్పుడిట్లనియె :
"అంకంబునకు హరిణాంకబింబాస్య,
శంకింపకే తెమ్ము సంభ్రమంబునను."
అనుటయు భీముండు నధికసాహసుఁడు
ఘనుఁడు కౌరవకురంగమృగేశ్వరుండు
ప్రళయకాలమునాఁటి ఫాలాక్షుఁడగుచుఁ
బలికెను సభవారు భయమందిచూడ :

## భీమ ప్రతిజ్ఞ

"అధికరాజ్యమదంబునందును గ్రొవ్వి
యధముండవై రోరి ! యతిదుష్టచరిత,
'వావివర్తన' లేనివాఁడవు సర్వ
కోవిదనిందితక్రోధచిత్తుఁడవు
దుర్మదుండవు జగద్ద్రోహివి పాప-
కర్ముండవగు నిన్ను ఖండింతుమీఁద.

పరమపతివ్రతఁ బాంచాలి నెట్లు
సరవి యెఱుంగక సభికులుదిట్టఁ
'దొడలమీఁదికిరమ్ము తొయ్యలి!' యనుచుఁ
గడుపాతకములైన కష్టభాషణలు
పలికియుండితి ; గానఁ బరమార్థముగను
గలసను నీయూరుకాండద్వయంబు
బలిమి నాగదచేత భగ్నంబుచేతుఁ ;
దెలియంగ నిది నా ప్రతిజ్ఞ లోకమున ;
నిక్షత్త్ర మొనరింతు నిన్ను నీవారిఁ
దత్క్షణంబున." నని దర్పితప్రౌఢి
విలయకాలమునాఁటి వికలకృతాంతు
వడువున రుద్రుఁడై పటుగదా ఖడ్గ
కాండాసనములున్నకడ చూచుటయును,
దండపాణి చలించె ; ధాత్రి భీతిల్లె ;
జగములు భయమందె ; జలధులు కలఁగె ;
నగములు వణఁకె ; పన్నగములు మునిఁగె.
అపుడుశంకింపుచు నాసభవారు
నిపుణోక్తులందు వర్ణించిరిభీము ;
తమయన్నయైనట్టి ధర్మజువదన
కమలంబుఁజూచి యాఘనునాజ్ఞ వేచి
యుండుచో భీముఁగుంభోద్భవ విదురు
లొండొండ భయభక్తియుక్తి నిట్లనిరి :
'శౌర్యంబుచూపెడిసమయంబుగాదు
కార్యంబుగావించు గతి యిదిగాని.'
యనుచు శాంతునిఁజేసి యట్లున్నయెడను,
దినకరతేజుని ధృతరాష్ట్రవిభుని
యనలహోత్రములాఱె నద్భుతంబుగను ;
గనుఁగొనఁ గౌరవాంగనలచిత్తముల

వ్యాకులతలుపుట్టె వరుసనందంద ;
లోకనిందితు లతిలోభవర్తనుల
ధార్తరాష్ట్రుల గృహాంతరములమొఱసె
ధూర్తశృగాల సందోహ ఘూకములు ;
మదధారలుడిగె సామజయూథములకుఁ ;
గొదలేక ఘోటకాక్షుల నీరువెడలెఁ ;
జుక్కలునిలరాలె ; క్షోణికంపించె ;
మిక్కిలి రుధిరంబు మేదినిఁగురిసె.
అట్టిమహోత్పాత మడరిపుట్టుటయు,
గట్టిగా విదురుండుఁ గలశజకృపులుఁ
దమలో విచారంబుదగఁజేసిరంత
సమచిత్తులై యొక్కసంస్థానమందు :
'నడుఁకక ధృతరాష్ట్రునకు నరిష్టంబు
పొడము నిశ్చయముగా భూమిలెఱుంగఁ ;
బాండవేయులతోడఁ బగపెట్టుకొనిరి
భండనంబునఁ జావఁబడుదురుగాక.'
అనవుడు గాంధారి యామాటలెల్ల
విని విదురునిఁగొంచు వేగంబెపోయి
ధృతరాష్ట్రుముందట ధృతిఁబెట్టుటయును,
నతిభక్తితో నాతఁ డన్నకుమ్రొక్కి :
"దుర్యోధనుఁడుచేయు దుష్కార్యములకు
నార్యసమ్మత, నీవుననుకూలమైతి ;
నేనెంతచెప్పిన నిచ్చలోఁగొనక
మానవాధిప, మోహమగ్నుండవైతి ;
కార్యంబుదప్పె ; నేగతి మీఁదనింకఁ !
గార్యంబులెచ్చెను గౌంతేయులకును.
హరిసూనుచేఁ బవనాత్మజుచేత
దురములోఁ బడుదురు దుర్యోధనాది

కురువీరులెల్ల [1] సంకోచంబులేక ;
పరమార్థమిదియుఁ దప్పదు చిత్తగింపు. ”
మనవిని ధృతరాష్ట్రుఁ డంతరంగమున
ననిచినభీతితో నిట్టూర్పుపుచ్చి
తతితోడ నట సుయోధనుని రప్పించి
చతురోక్తి నిట్లనె సభ యెల్లవినఁగ :
“ సతతంబుఁ బాండురాజాత్మసంభవుల
మతివిచారింపక మఱచితి తప్పి ;
పరమపతివ్రతఁ బాండవసతిని
వరతపస్విని సత్యవతిఁ బుణ్యసాధ్వి
నిజగుణాకర నయోనిజఁ గంబుకంఠి
రజనీకరానన రాజీవనయన
మానవభామగా మదిలోనఁదలఁచి
మానవ, నీవవమాన మీసభను
జేసితి ; దోషంబుఁ జేసితివీవు ;
చేసితి దప్పంగఁ ; జేసితికీడు ;
పాపాత్ములనుగూడి బాల్యంబునాఁటి
[2] చాపల్యమును మానఁజాలవు నీవు.
నీవుపుట్టఁగఁ బాండునృపతనూభవులు
ఏవెంట దుఃఖితులెంతయునయిరి ;
వారితోఁ బగఁగొనవల. ” దనిబుద్ధి
నేరుపుతోఁజెప్పి నెఱి సుయోధనుని
శాంతునిఁగావించి సకలాప్తనీతి
వంతులమాటలు వదలకవినుచు

1. సంకోశంబులోడ. 2. చాపలత్వము. (మూ)

## ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికి వరములొసఁగుట

ద్రౌపదిరావించి తనరనిట్లనియె:
"ఓపుణ్యవతి, సాధ్వి, యోసత్యనిరత,
కొమరారుచున్న మాకోడండ్రలోన
నమిత [1] పతివ్రత వతిసత్యవతివి;
వరమిచ్చెదను నీకు వనజాక్షి, వేఁడు
పరఁగంగ." ననిన ద్రౌపదియు నిట్లనియె:
"ఇలనాథ, వరమునాకీఁజాలు దేని,
దలఁపంగ ధర్మజుదాస్యంబు మానఁ
గృపసేయు." మనిన నాక్షితిపతి యిచ్చి
యుపమ వెండియుఁబల్కె నుచితభంగులను:
'ఇంకొక్క వరము నీకిచ్చితి నడుగు
శంకింప.' కనినఁ బాంచాలి యిట్లనియె:
"ధర్మజునలువురుతమ్ములు నెల్లఁ
బేర్మి దాస్యముమానఁ బెద్దయు నిచ్చి
హయ రథ గజ వివిధాంబరావళులు
ప్రియమున నొసగుము ప్రేమ వారలకు."
ననుటయు ధృతరాష్ట్రుఁ డావరంబొసగి:
'వనజాక్షి, యింకొక్క వరము నీవడుగు
పరమార్థముగ.' నన్నఁ బాంచాలిపలికె:
"వరవైశ్యసతికిని వరముదా నొకటి,
క్షత్త్రియసతికిని జర్చింప రెండు,
ధాత్రి శూద్రస్త్రీకిఁ దలఁపంగ మూఁడు,
పరమపవిత్ర సద్బ్రాహ్మణస్త్రీకి
వరములునూఱైన వడి వేఁడనగును;
కాన నాకిఁక వేఁడఁగారాదు వరము;
భూనాథ, యీవరంబులురెండు చాలు."

---

1. పాతివ్రత్యమతి. (మూ)

అనవిని ధృతరాష్ట్రుఁ డతివ పాంచాలి
ఘనగుణంబులకును గడుసంతసిల్లి
పాండవాగ్రణిఁజూచి భక్తిసిల్లనియె :
"దండితో నీవు నీతమ్ములుఁ గూడి
లాలిత సామ్రాజ్యలక్ష్ములయందుఁ
జాలభోగింపుఁడు సంతోషమునను ;
మునుపటియట్ల భూములపాలుగోలునఁ
దనరంగ నేలుఁ డింద్రప్రస్థపురము.
ఎఱుఁగుదు ధర్మంబులెల్లను నీవు ;
కలిగినాతనయుందు కలుషచిత్తంబు
నీకుఁ జేసినయెగ్గు నెఱయంగ మఱువు ;
లోకంబులో గుణశ్లోకులు ఘనులు
కైకొన రధములకష్టభాషణలు ;
చేకొని మన్నింపు చెనఁటినాసుతుని.
ఏను బుద్ధులుదప్పి యిట్టిజూదంబు
పూనికావించితిఁ బుణ్యహీనుఁడను ;
గావున, నను వింతగాఁజూడవలదు ;
పావనాచార, సౌభాగ్యసంభరిత,
మీతల్లి గాంధారిమిక్కిలిదలఁచి
[1] మాతలంపులెఱింగి మన్ననల్ చేసి,
దుర్యోధనాదుల దుర్గుణావళులఁ
గార్యముల్ గావని కైకొనవలదు.
విదురుఁడు మంత్రిగా వెలసిధర్మములఁ
బాదలినయట్టిసత్పుణ్యాధికుఁడవు.
కురుకులనిజరక్షకుండవుగాఁగ
సరవి మేలుగను రాజ్యముసేయఁదగుదు."

---

1. మాతలంపెఱింగి మన్ననలసేవించి. (మూ)

పని ధర్మజునినంప, హర్షంబుతోడఁ
గనకలతాతన్వి కాంతి ద్రౌపదియుఁ
బురుషసింహముల నప్పాండు దనపతుల
నరుదుగా శాంతుల నందంద చేసె.
ఆవేళ భీముండు నన్నకిట్లనియె :
“ వాపిరి ద్రుపదభూపాలతనూభవను
అవమానమొనరించినట్టి శాత్రవుల
బవరంబులోపల భంజించి నిన్ను
నేలింతు ధర[1] యుద్ధిమెల్లగా.” ననుచు
ఫాలాక్షు శౌర్యసంపద మించియుండె.
మృగమధ్యమునున్న మృగరాజుభంగిఁ
దగసహోదరుల మధ్యంబుననున్న
యనిలతనూభవు నపుడువారించి
ఘనుఁడు ధర్మజుఁడు వేడ్కనునిట్టులనియె :
“ ఎంతతప్పునకైన నీవేళ నోర్చి
యెంతయు మీఁదటనేచి శాత్రవులఁ
దునుముద.” మనుచు బుద్ధులు చాలఁజెప్పె.
కనకరథములెక్కి కాంతియుఁ దారుఁ
బోయి యింద్రప్రస్థపురవరంబునను
బాయక సకలసంపదలనుండుటయు,
నాతఱిఁ గురురాజు నాదుస్ససేను-
చేత వృత్తాంతంబు చెనసి తా వినుచుఁ
దపనజ శకునిసైంధవులతోడుతను
నిపుణతఁదలపోసి నిశ్చయంబుగను
ధృతరాష్ట్రుకడకేఁగి తెలివినిట్లనియె :
“[2] ప్రతిభటావళి నెన్నిభంగులనైన

---

1. యొల్ల. 2. ధృతి. (మూ)

నణఁచుటయే నీతియని దేవమంత్రి
ప్రణుతికెక్కఁగఁ జెప్పెఁ బర్జన్యసఖును ;
సంతసంబునఁ బాండుజనాథసుతుల
కెంతమేలొనరింప హితులమా మనము !
పాములనలిగించి పటుకంఠమునను
సోమించి విడిచినచొప్పున మనము
నాసమయంబున నటుపోనవిడిచి
మోసపోయితిమి భూము వారలెటుఁగ.
వాసవి విల్లు తీవ్రముగఁబట్టినను,
భీముఁడుగదగొన్న, బిరుదులైకవలు
భీమాయుధంబులఁ బెరిమఁబట్టినను
హరిహరబ్రహ్మదులైనను వారి
నరుదుగా సాధింప ననిమొనలేరు ;
కావున వారి వేగమునరప్పించి
ప్రావీణ్యమునను [1] బావద్యూతమునను
గెలిచి పాండవులను క్షితివెడలంగ
నలుకతోఁ ద్రోవంగ నాగూఢివలయు."
ననుటయు ధృతరాష్ట్రుఁ డటుసమ్మతించి
మొనసి పునర్ద్యూతమును నాడఁదలఁచి

## పునర్ద్యూతము ; అరణ్యగమనము

ప్రాతికామినిబంచెఁ బాండునందనులు
ఏ తేర సభకును హితవాక్యములను (?)
వాఁడుఁ బాండవులను వరుసతోఁ బిలువఁ,
బోఁడిమి ధృతరాష్ట్రభూవరునాజ్ఞ
నరుగుదెంచిరి లీల హస్తినాపురికి ;
సరవిఁ దొల్లిటియట్ల సభపెద్దలెటుఁగ

1. అనుద్యూతమని. నన్నయ. పునర్దీవ్యాయభద్రం తే. అని. వ్యాస. భా.

శకుని ధర్మజునితోఁ జతురతఁబలికె:
"సకలసామ్రాజ్యంబు సమధికార్థములు
ధృతరాష్ట్రభూపతి ధృతి మీకునొసగె
నతులితభంగిని సవివొద్దవలదు;
శ్రోత్ర ఘోషణము దిక్కులయందువినఁగ;
సత్తుగా జూదంబు సరవినాడంగ
నోడినవారలు నున్నతశక్తిఁ-
గూడి నిత్యమును సంకుచితమార్గమున
ద్వాదశాబ్దములు కాంతారమధ్యమున
మోదంబుతోఁ గందమూలఫలములు
భక్షింపుచును మహాబ్రహ్మచర్యమున
దక్షతవర్తించి, తత్తితోడ నొక్క
వర్షంబు నజ్ఞాతవాసంబుచేసి,
హార్షజ్ఞలగుగోకులటయొఱఁగినను
ననమునఁ బండ్రెండువత్సరంబులును
మునుజరింపుచుఁ బదుమూఁడవయేఁట
నజ్ఞాతవాసంబు నటుసల్పువారు;
తద్జ్ఞతనొడ్డి జూదంబునీవాఁడ
నోపితివేనియు యుక్తితోనాడు
దీపించి." యనిన విధిప్రేరణమున
ధర్మనందనుఁడు జూదంబాడి యోడె
ధార్మికులును సభాస్థలివారు నెఱుఁగ.
పటుశుభాశుభకర్మఫలము లెవ్వరికి
నటనుభవింపక యరుగంగరాదు;
కావునఁ బాండవాగ్రజుఁడు జూదంబు
దైవికంబుగనోడి తమ్ములుఁ దాను
నడవికేఁగఁదలంచి యఖిలరాజ్యమును
విడిచి సుహృద్బంధువిప్రులతోడఁ

బోదివి భీష్మద్రోణభూరిశ్రవాది
విదురాంబికేయుల వీడ్కొనిపోవ,
నెదుట ధర్మజుఁజూచి యెంతయుఁబ్రీతి
విదురుండు పలికె వివేకంబుతోడ :
"కాంతారములకు నేఁగఁగ లేదు కుంతి
సంతతవ్రతశీల సాధ్వి కల్యాణి ;
అరసి పూజించెద సతిభక్తియుక్తి
పరసతి మద్గృహస్థగియుండు నిలుపు ;
ధర్మవర్తనుఁడవు తర్కింపనీవు ;
దుర్గదారాతి సింధురమృగేంద్రుండు
భీముండు సంగ్రామభీముండు ఘనుఁడు ;
భీమానుజుఁడు రిపుపృథివీతలేశ
నికరవిదారుండు నీతిసాహసుఁడు ;
నకులుఁడు శత్రుభూనాథభంజనుఁడు
కారుణ్యనిధి బంధుకల్ప [1] భూరుహము ;
ధీరుండు మఱి సహదేవుఁడుత్తముఁడు
పరమవిజ్ఞానసంపన్నుండు ఘనుఁడు ;
తరుణిద్రౌపది దయాధర్మంబులందు
వెలసినసతి ; గాన విశ్వభూస్థలిని
బలియురు మీరలు భాగ్యవర్తనులు ;
ఇతరులు మిము గెల్వ నెవ్వరు లేరు ;
వ్రతయుక్తు లనఘులు వ్యాసశిక్షితులు
విక్రమక్రములు గోవిందరక్షితులు ;
శక్రునిగురువుతో సరియైనవాఁడు
ధౌమ్యుండు మీకు నుత్తమపురోహితుఁడు ;
సౌమ్యులు మీరు రాజశ్రేణిలోన

1. భూజనుండు. (మూ)

దైవమానుషములఁ దర్కింప నధిశు
లీవసుంధరలోన నెన్నిభంగులను;
చంద్రసూర్యులు గాఁపు శమనుండు వహ్ని
యింద్రాదిదివిజులు నీశుండు హరియు
.........................
మిమ్ము నెవ్వరును బేర్చిని గెల్వలేరు
ఇమ్మహిఁ గలరాజు లెల్లఁ; గ్రమ్మఱను
వైశమే లెంచి భూవలయమేలుండు
వాలాయముగ." నన్న నరున ధర్మజుఁడు
విదురుని సద్భక్తి వినుతించి పలికె:
"విదితకీర్తివి శాస్త్రవిదుఁడవు నీవు;
నీకృపగలుగంగ నేము లక్ష్ములను
బ్రాకటవిజయసంపదల నుందుదుము.
నీకడనుండును నెఱయంగఁ గుంతి
[1] శ్రీకర, యేము వచ్చెడియంతఁదాఁక."
అని విదురునియింట నటు కుంతినునిచి
యనఘులు కురువృద్ధులాజ్ఞ గైకొనుచుఁ
బోవంగఁదలఁచి యప్పుడు భక్తిఁ గుంతి-
దేవిపాదములకు దృఢభక్తి మ్రొక్క.
నా [2] గొంతిదేవియు నాత్మనందనుల
వేగంబెగనుఁగొని వేదనఁబొంది
పలికెను: "వల్కలాంబరములు గట్టి,
సలువొప్పఁ గృష్ణాజినములు ధరించి,
మునివేషధారులై మునుకొని మీరు
చనియెదరా! వనస్థలమున." లనుచుఁ
గన్నుల బాష్పాంబుకణములు దొరఁగ
విన్నఁదనంబున వెచ్చనూర్చుచును

1. శ్రీకలి. 2. కుంతి. (మూ)

అతులశోకాక్రాంతయగుచు నిట్లనియె :
"సుతులార, భానుతేజోమూర్తులార,
కదిసి మీ తేజంబు గాంచకముందె
సద [1] యాత్ముఁడైన మీజనకుఁడుత్తముఁడు
పాండుభూవిభుఁడేఁగెఁ బర్జన్యపురికి ;
నుండితి నేటికి నుర్విలోపలను !
భర్తతోడనెగూడి పరలోకమునకు
స్ఫూర్తి నేఁగఁగనైతిఁ బుణ్యంబులేన ;
మీమనోవ్యథలు పేర్మిసి జూడవలసె
నేవి సేయుదు !" నని యేడ్చుచునుండి
యెల్లవారు నెఱుంగ నిట్లనపలికె :
"బల్లిదులై ప్రతాపమున శోభిల్లు
పాండవేయులకునే బహుళదైన్యమున
నొండొండ వర్తింపుచుండంగవలసె ;
ఓపుండరీకాక్ష, యోరమాధీశ,
యోపుణ్యమూర్తి, నీలోత్పలవర్ణ,
కరుణించు వీరలగౌరవంబునను ;
నిరతంబు నీపాదనీరజాతములు
గొలుచుచున్నారు గైకొని ప్రోవఁదగును
విలసితంబుగ." నని వేఁడియు మఱియు
"గాంగేయకుంభజ గౌతమ విదురు
లాంగికులుండంగ నక్కట ! యిపుడు
పాండుసూనులకు నాపదపొందవలసె
మండలంబునను సన్మానంబులేక ;
యురుదోషములకెల్ల నొడిగట్టినాఁడు
కురురాజు ; సభవారు గొంకిరిమిగుల."

1. యాంగు. (మూ)

ననుచు దుఃఖింపుచు నాకుంతిదేవి
ఘనుని సహదేవుఁ గనుఁగొని పలికె:
"అన్నలతో నీవు నరిగెదవయ్య!
యున్నత శైలమహోగ్రాటవులకు.
ఒక్కఁడ వీవైన నుండితి వేని,
తక్కక తనయులందఱు నుండినట్లు
నాకు నెమ్మదిని మానసముండు." ననుచు
శోకించి ద్రౌపదిఁ జూచి నేత్రముల
వారిధారలు గ్రమ్మ వరుస నిట్లనియె:
"సారసనేత్ర, పాంచాలవంశమును
బాండుకులంబును బ్రబలె నీకతన
దండిఁ బుట్టుటను మోదమునఁ జొచ్చుటను.
పురుషగోరాజులు భూనుతపుణ్య
పురుషులు ఘనులు నీపురుషులు ; వీరి
చిత్తముల్ రాగిల్ల సేవలు చేయు
సత్తుగా భయభక్తిశక్తియుక్తులను."
అని కుంతిదేవియు నావేళయందుఁ
దనకు మ్రొక్కినయట్టి ద్రౌపది సాధ్వి
నాలింగనము చేసి యలర దీవించి,
చాలను బుత్త్రుల నరవి దీవించి,
సదయాత్మయై యుండె సాధ్వీలలామ
విదురుమందిరమున వెసవారు వినఁగ.

## పాండవుల ప్రతిజ్ఞలు

అమితపరాక్రమాభ్యధికుఁడై యున్న
యమసూతితో భీముఁ డపుడిట్లు పలికె:
"సాహసంబున రణస్థలమున నాదు
బాహుగదాహతిఁ బగఱఁ జంపుదును

దుర్యోధనాదుల దుర్మదాంధులను
క్రౌర్యచిత్తులఁ బాపకర్ముల శఠుల
నతుల కృతద్రోహులైన దుర్జనుల
మతిహీనులను మహామర్త్యనిందితుల."
ననుచు భీముఁడు పల్క, నావేళయందుఁ
గనలి యర్జునుఁడును గడు వడిఁ బలికె:
"అంగరాజికిని బాణాసనంబైన
బంగారుకొండ నిర్భరరుచిమించు
కమనీయ మత్కరకాండాసనమున
సమరరంగంబునఁ జంపుదు నేను
కర్ణాది దుర్జనాగ్రణుల నందఱను
నిర్ణయంబుగ దేవనివహంబు పొగడ."
అనుటయు నకులుండు నధికరోషమున
గొనకొని పలికె: "నాశాంతంబు మొనను
సకలకౌరవసేనఁ జంపుదు నేను
నకలంకవృత్తి నుగ్రాహవంబునను."
అనిన సహదేవుఁ డలిగి యిట్లనియె:
"మును గపటద్యూతమున మమ్ము నోర్చు
పాపాత్ము శకుని నా బాణజాలమున
నేపారఁ దునుముదు నిందఱు నెఱుఁగ."
ననుచు నతిప్రతిజ్ఞారూఢులగుచు
ఘన కరిపురము వేగంబున వెడలి
పాండవేయులు పోవఁ, బటు ధృతరాష్ట్ర
మండలాధీశ్వరు మందిరంబునను
నుదురుచు గోమాయువులు పట్టపగలు (?)
బెదరుచు నఱచెను భీషణంబుగను;
అప్రదక్షిణముగా నగ్నులు వెలిగె;
నప్రియంబుగఁ బల్కె నాకాశవాణి;

యొసఁగెనుల్కాపాత మెంతయు దివిని;
అసమాన విద్యుత్సహస్రంబు దోఁచె;
పర్వంబులేకయే పట్టె భాస్వంతు
దుర్వారశక్తితోఁ దానె రాహువు;
భూకంపమయ్యె; నప్పుడు సభవారు
నాకంపమునఁ బొంది యటనున్నతఱిని,
బలికెనారదుఁడు సభాస్థలి వినఁగ
నలఘువాక్యముల నత్యద్భుతంబుగను:
"పదునాలుగగు నేఁట భారతరణము
త్రిదశులెఱుంగఁగ ధీరత నగును;
పాండవేయులు ప్రతాపంబు రెట్టించి
చెందుదురతిశక్తి[1] చెంది కౌరవుల;
విజయలక్ష్ములయందు వెలసియుండుదురు
భజనకెక్కినయట్టి పాండునందనులు
ఇదియథార్థం." బని యేఁగినపిదప:
'మదచిత్తుఁడగు కురుక్ష్మాపతికతన
నేయరిష్టము పుట్టనిటమీఁదఁగలదొ!
పాయక.' యనుచుఁ గంపమునొంది కుంది
మదిలోనశంకించి మంత్రరక్షకుని
విదురునిఁబిలిచి భావించి యాలోన
ధృతరాష్ట్రుఁడంతటఁదెలిసి యిట్లనియె:
"నతిపుణ్యులైన ధౌమ్యాదులు గొలువఁ
బాండునందనులు ద్రౌపదిఁగూడి యెచట
నుండంగఁబోయిరి? యుచితమార్గమున."
అనుటయు విదురుండు నాధృతరాష్ట్ర
మనుజేశ్వరునిఁజూచి మహిమనిట్లనియె:

---

1. చెది. (మూ)

## పాండవులరణ్యమున కేఁగిన విధమును విదురుఁడు ధృతరాష్ట్రున కెఱిఁగించుట

"వదనసరోజంబు వస్త్రా[1]ంతమునను
బొదువుగాఁ గప్పికపోయె ధర్మజుఁడు ;
బాహులయుగ్మముచాచి పవననందనుఁడు
సాహసంబున నేఁగె జగమెల్ల నెఱుఁగ ;
నిసుముచల్లుచు నమరేంద్రసుతుండు
కొసరక చనియె సంకుచితమార్గమున ;
భూరేణుపుంజంబు పొదిగిన మేన
నారయ నకులుండు నరిగె శీఘ్రమునఁ ;
దొడరినలజ్జ నధోవక్త్రుఁడగుచు
నడరి సహదేవుఁ డవలీలఁబోయె ;
వెన్నుపైఁ గ్రుమ్ముడవెడలంగ నేఁగు
మిన్నక ద్రుపదభూమీనాథతనయ ;
కోమలకీర్తియై గురురౌద్రయామ్య
సామగానము రూఢిఁ జదువుచు నేఁగె
ధౌమ్యుండు జనులద్భుతంబందిచూడ
సౌమ్యవర్తనమున సత్యవాక్యముల."
అనవుడు ధృతరాష్ట్రుఁడావిదురునకు
మనమున వెఱఁగంది మఱియునిట్లనియె :
"ఈవిధంబున వారలేటికిఁజనిరి ?
భావజ్ఞ, నాకుఁదప్పక యెఱిఁగించు."
అనవిని విదురుండు నాధృతరాష్ట్ర
జననాథులోడను సరవినిట్లనియె :
"నీతనూభవులును నెఱయ దుఃఖముల
నీ తెఱఁగునఁబోదు రెంతయు ననుచు

---

1. ర్ధ. (మూ)

యమసుతుఁ డరిగె జింతాక్రాంతుఁ డగుచు ;
రమణ భీముఁడు 'సంగరస్థలమునను
జేతులుకసివోవఁ జెనసి శాత్రవుల
శాతాయుధంబులఁ జంపఁగఁగలను'
అనుచు బాహులుచాచి యరిగె వేగమున ;
'అని నింతకునదలచ్చెనబాణముల
వెసనేసి రిపుల నావిరిఁద్రుంతు' ననుచు
గసుముచల్లుచుఁ బోయె నింద్రనందనుఁడు ;
'తనరూపుచూచి భూతలమువారెల్ల
నొనర దుఃఖంబులనొందుదు' రనుచు
ధూళిగప్పినమేన దొరయంగ నేఁగె
నోలి నానకులుఁ డత్యురుపరాక్రముఁడు ;
'తనదీనవదనపద్మము విలోకించు-
జనులకు నగ్గులు చాలంగఁబుట్టు'
నని యాననమువంచి యాసహదేవు
చనియె గూఢాచారసన్మార్గమునను ;
తడిసినయేకవస్త్రంబుతోడుతను
గడుపడి వీడినకచభరంబునను
శోకంబుతో నేఁగె సొలసిద్రౌపదియు
'నాకౌరవస్త్రీలు నధికదుఃఖములఁ
బొందుదు రిటమీఁదఁ బొ' మ్మనునట్టి
చందంబునందును ; సమరంబునందుఁ
బాండవేయులచేతఁబడుకౌరవులకుఁ
బాండిత్యమహిమను బరలోకగతులు
చేయింప సూచించుచందంబుదోప
నాయెడ నతిరౌద్ర [1] యామ్యాగమోక్తి

1. యాయాగ. (మూ)

దగఁ బరింపుము నేఁగె ధౌమ్యుండు వడిని
దెగువతో." ననవుడు ధృతరాష్ట్రవిభుఁడు
శోకించి విదురునిఁ జూచి యిట్లనియె :
"భీకరశౌర్యులు పృథివీశసుతులు
పాండవేయులు జగత్ప్రఖ్యాతయుతులు
చండాంశుతేజులు సజ్జనోత్తములు ;
వారలతోడ దుర్వారవైరంబు
కౌరవేశ్వరునకుఁ గనుఁగొనఁ గూడె ;
ఎంత చెప్పిననైన నెఱుఁగఁడు ; బుద్ధి
మంతుఁడు గాఁడు దుర్మదుఁడు నా కొడుకు ;
కడఁగి మీఁదను బ్రజాక్షయముగాఁ గలదు
పుడమిపై." నని భయంబును బొంది మిగుల
వెచ్చనూర్పుచు మనోవికలుఁడై యుండ,
నచ్చట సంజయుఁ డారాజుకనియె :
'పాండవేయులు ధర్మపరులని యెఱిఁగి-
యుండియుఁ దోలించితివి వారి[1]ఁ గానలకు ;
చేకొంటివిదె యీసృష్టితలంబు ;
నీకును వగవంగ నిరతంబు నేల !
కలశజ విదుర గంగాతనూభవుల
పలుకులు విననైతి పరమార్థముగను ;
కర్ణ గాంధారులకఱపులు వినుచు
గుర్ణితమతుఁడై దుర్యోధనుండు
పగయయ్యెఁ గలశజ[2] ప్రముఖ సాధులకు ;
మగఁటిమిఁ బాండుకుమారులతోడఁ
దొడరుఁగా కేమి పొందుగ నీసుతుండు,
తగయుక యింక నీతనయుండు దక్కి-

1. వారలను. 2. ప్రకర. (మూ)

గురుభీష్మవిదురులఁ గూడి నీవరిగి
కరమర్థిఁ దోతెమ్ము కడఁగి పాండవుల.
వెరవొప్ప నీవింక విచ్చేయకున్న,
నెఱుఁగుదురే యొరు లీకార్యమునకు
నతిమతి." యనవుడు నావిదురుండు
తతితోడ నపుడట దగ్గఱవచ్చి
ధృతరాష్ట్రుతోడను దెలియనిట్లనియె:
"క్షితినాథ, మీకిఁక చింతింపనేల!
పటుకృప నీయెడఁ బాండునందనులఁ
దటుకొన రప్పించి ధారుణీతలము
పంచిమ్ము సగఁబాలు ప్రఖ్యాతముగను;
వంచించి వారికి వసుధయీకున్న,
మెత్తురే! నిన్నును మేదినిలోన
నుత్తములెల్ల నత్యుచితోక్తి." ననిన
జనపతి విదురుభాషణములు వినియు
వినకుండె, పాపిన ప్రవేశులైనట్టి
పాండవేయుల ధర్మపరుల రావింప
కుండె నుపేక్షించి కౌఁగిఁగిల్చెమమున.
ద్రోణుండు పాండుపుత్త్రులకు నందఱకుఁ
బ్రాణపదంబయ్యుఁ బస వారివెంట
నరుగఁడ; ద్రుపదరాజాత్మసంభవుని
దురమున మీఁదట దునిమెడికొఱకుఁ
గలశజుఁడుండెను ఘనతరప్రీతి
వెలయంగ ధృతరాష్ట్రవిభుసన్నిధిని.
తదనంతరంబ యింద్రప్రస్థపురము
ముదమున నిరుపదిమూఁడేండ్లునిండఁ
జెలఁగి రాజ్యమ్ముఁ జేసి, జూదమున
నెలమితో నోడి, యయ్యెడ పాండుసుతులు

అడవికిఁ జనిరి బ్రాహ్మణసహస్రములు
కడువడి నేతేర గౌరవంబునను.
అనుచు సభాపర్వమందలికథలు
జనమేజయునకు వైశంపాయనుండు
వినిపించె శాస్త్రోక్తివిఖ్యాతముగను
మునిసహస్రంబు లిమ్ములఁ బ్రస్తుతింప.
పంచఘంటానాద, పాండవాహ్లాద,
పంచాస్త్రసమశౌర్య, భర్మాద్రిధైర్య,
శ్రీరంగయామాత్యశేఖరపుత్త్ర,
కారుణ్యసింధు, దానకర్ణావతార,
శ్రీయనంతామాత్యశేఖరోత్తంస,
కాయజసమమూర్తి, కమనీయకీర్తి,
ధర్మసమగ్రంబు తలకొన్నయదియుఁ
బేర్మిఁ బుణ్యంబులఁ బెనుపొందునదియు
నసమసాహిత్యవిద్యాచతుర్ముఖుఁడు
రసికుండు బాలసరస్వతీశ్వరుఁడు
పసనొనర్చిన సభాపర్వంబునందు
నసదృశంబుగ ద్వితీయాశ్వాసమయ్యె.

ఇది సభాపర్వము.



శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయఁడు గారిచే
రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రింపఁబడినది—1942.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 21 | ద్రౌణీయుపాండవ | ద్రౌణియపాండవ |
| 11 | 18 | వర్థిలు | వర్ధిలు |
| 11 | 20 | కరమర్ధి | కరమర్థి |
| 13 | 16 | మొగిఁగనన్ | మొగిఁగగ్గ |
| | | శల్యాఖ్యమును | శల్యాఖ్యములు |
| 16 | 21 | తపోన్నతిబ్రాభవ | తపోన్నతిఁబ్రాభవ |
| 17 | 19 | దనయులఁజెలయ | దనయులజెలయ |
| 17 | 23 | యిద్ధతికోర్కి- | యిద్ధఅకోర్కి- |
| 18 | 12 | చిట్టుముల్ | చిట్టుముల్ |
| 20 | 9 | బుద్థి | బుద్ధి |
| 22 | 25 | యనుచుఁగొనకొని | యనుచుగొనకొని |
| 23 | 18 | పరచి | పఱచి |
| 24 | 3 | దూర్వాసుఁడు | దుర్వాసుఁడు (ఇట్లే తక్కిన చోట్లను) |
| 24 | 21 | నిడితివి; యే | నిడితివి; నే |
| 25 | 28 | పరిచ్ఛేద | పరిచ్ఛేది |
| 30 | 23 | అర్ధపతి | ఆర్థపతి |
| 31 | 14 | మొఱమొఱ | మొరమొర |
| 31 | 17 | మానవుఁడు | మానసుఁడు |
| 32 | 19 | ప్రాణంబలుండ | ప్రాణంబులుండ |
| 36 | 20 | అనిరుథ్ద | ఆనిరుద్ధ |
| 37 | 19 | వెన్నడచి | వెన్నడఁచి |
| 40 | 20 | అందతితోడ | ఆందఱితోడ (ఇట్లే తక్కిన చోట్లను) |
| 54 | 12 | నేఁపుదూలించి | నేపుదూలించి |
| 58 | 14 | మాటలనుగా | మాటలనుగా |
| | | వొడఁబాటు | దొడఁబాటు |
| 58 | 28 | వాఁడి | వాడి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 60 | 11 | నేప్రొద్దు | నేపొందు |
| 61 | 8 | జొప్పడుగాన | జొప్పడుఁగాన |
| 61 | 25 | నల్లనైయుండెఁగా! | నల్లనైయుండెఁ |
| | | నవుఁగా | గానవుగా |
| 62 | 2 | కంటిఁదెలివి | కంటి తెలివి |
| 62 | 22 | చూడ-జామరో | చూడఁ-జామరో |
| 64 | 7 | బాయకపుత్త్రులకును | బాయక కుమారులకు |
| 64 | 15 | యనుపఁగొనకొని | యనుప గొనకొని |
| 70 | 22 | వారిథి | వారిధి |
| 70 | 26 | తె వెస | తేవెస |
| 72 | 28 | భగ్గించి | బగ్గించి |
| 77 | 8 | గరుఁడండు | గరుడండు |
| 77 | 16 | బెనచి | బెనఁచి |
| 80 | 23 | గరుఁడని | గరుడని |
| 84 | 4 | ధారమై | ధామమై |
| 85 | 3 | వక్షస్థలము | వక్షస్స్థలము |
| 87 | 13 | చిన్నబుచ్చు | చిన్నఁబుచ్చు |
| 91 | 23 | తలచి | తలఁచి |
| 105 | 11 | వార్థి | వార్ధి |
| 127 | 10 | మెట్టుచేసె | మెట్టుఁజేసె |
| 128 | 19 | బందులగ్రుచ్చి | బందుల గ్రుచ్చి |
| 131 | 1 | కాఁగాదు | కాఁగాదు |
| 151 | 25 | ఘూనుదునే | ఘూనుతునే |
| 152 | 4 | రాజునకుఁదక్కి- | రాజునకుదక్కి- |
| 158 | 24 | శత్త్రు | శత్రు (ఇట్లే తక్కిన చోట్లను) |
| 173 | 8 | నింక చెప్పక | నింకఁజెప్పక |
| 173 | 27 | హేలప్రయాణమై | హేలఁ బ్రయాణమై |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 176 | 1 | సౌంజ్ఞ | సంజ్ఞ |
| 177 | 13 | నొ్క్రాంత | నొక్కి్రంత |
| 183 | 14 | పతిపోవఁగా | పతివోవఁగా |
| 198 | 17 | నేకాతపత్త్రము | నేకాతపత్రము |
| 199 | 10 | లంపచిప్ప | లంపచిప్పల |
| 200 | 18 | శేషునఁకు | శేషునకు |
| 201 | 7 | మడాఁగు | మడుఁగు |
| 212 | 16 | నాకికయొల్లు | నాకిఁకనెల్లు |
| 212 | 17 | క్షేత్త్రజ | క్షేత్రజ |
| 215 | 25 | తొడరిఁ | తొడరి |
| 219 | 1 | తనుబాసె | తనుఁబాసె |
| 227 | 13 | రుగ్గ | దుగ్గ |
| 228 | 7 | దనయులచేతఁ | దనయులచేత |
| 230 | 5 | విల్లుఁ | విల్లు |
| 234 | 7 | యమలు | యములు |
| 235 | 7 | ద్వైవార | ద్వైవాఱ |
| 237 | 7 | శిఖల | శిఖలు |
| 240 | 23 | లన్నియుఁ | లన్నియు |
| 251 | 10 | బలియులు | బలియురు |
| 252 | 20 | బల్లు | బల్లు |
| 256 | 18 | చిత్రపుఁదొనలు | చిత్రపుదొనలు |
| 259 | 9 | వివరంబుఁ | వివరంబు |
| 263 | 6 | కృత్యమేలింక | కృత్యమేమింక |
| 269 | 1 | దారిద్ర్యనకును | దారిద్రునకును |
| 272 | 7 | గర్వంపఁజాలు | గర్వంబుచాల |
| 272 | 8 | నెతెదీర్ప | నెఱిఁదీర్ప |
| 272 | 11 | నమ్మ్రక | నవ్యక |
| 273 | 22 | భూపాలఁబుత్త్రుల | భూపాలపుత్త్రుల |
| 282 | 13 | చందములఁ | చందముల |
| 288 | 22 | ననుచుఁదొనల | ననుచుదొనల |
| 289 | 6 | బ్రాతి | బ్రాఁతి |
| 289 | 21 | పింజఁపింజ | పింజపింజ |
| 310 | 27 | జతుశ్శాల | చతుశ్శాల |
| 311 | 1 | దర్శింపఁజేజేయ | దర్శింపఁజేయ |
| 314 | 7 | జతుశాల (?) | జతుశాల |
| 317 | 1 | శాఖలన్ జే | శాఖలన్ చే |
| 320 | 27 | ఇంద్రాదిసుగల | ఇంద్రాదిసురుల |
| 340 | 1 | మధువైరినియతి | మధువైరినేత్ర |
| 340 | F. N. 1 | నేత్ర | omit |
| 354 | 5 | చిత్తురువు | చిత్తరువు |
| 355 | 24 | వేదిఁచలువగా | వేదిఁజలువగా |
| 369 | 5 | ధాత | ధాత్రి |
| 371 | 9 | లోకముల్ | జ్వాలనంబు |
| 371 | F. N. 2 | జ్వాలనంబు | omit |
| 375 | 15 | పీఁట | పీట |
| 390 | 20 | యోగియువోలె | యోగియుఁబోలె |
| 413 | 1 | దాక్షాయణిపూబోణి | దాక్షాయణిఁ బూఁబోణి |
| 414 | 6 | ధృవకీర్తి | ధ్రువకీర్తి |
| 414 | 10 | బనులుఁ | బనులు |
| 415 | 2 | ముగ్ఫ | ముగ్ధ |
| 423 | 23 | వేనరి | వేసరి |
| 428 | 6 | వసుధీశ | వసుధేశ |
| 442 | 12 | గృష్ణవోలు | గృష్ణఁబోలు |
| 450 | 11 | జైరవ ! | జైరవ |
| 465 | 13 | దేవతుల | దేవతల |
| 472 | F. N. 2 | విస్పృష్టము | విస్పష్టము |
| 474 | 20 | మిడుఁగురుఁగాడ్పు | మిడుఁగురుగాడ్పు |
| 476 | 3 | ననిచినఁ | ననిచిన |
| 493 | 11 | ధర్మరాజుని పరిపాలనా | ధర్మరాజును బరిపాలనా |
| 499 | F. N. 2 | మూర్తివంతములు | మూర్తిమంతములు |
| 518 | 3 | నిఘుషంబు | నిముసంబు |
| 539 | 20 | ధరాధర | ధారాధర |
| 541 | 8 | మచ్ఛిక | మచ్చిక |
| 551 | 9 | బ్రహ్మదిసురలు | బ్రహ్మాదిసురులు |
| 560 | 8 | రాజకోటలు | రాజకోటులు |
| 562 | 7 | నిమసమాత్రము | నిమిషమాత్రము |
| 606 | 9 | చెప్పజాలిన | చెప్పఁజాలిన |
| 625 | 5 | యతులు | యశులు |

## Foot Notes

| పుట | సంఖ్య | ఉన్నవి | ఉండవలసినవి |
|---|---|---|---|
| 66 | 2 | నిఘ్న | మఘ్న |
| 83 | 1 | ప్రసవ | ప్రసత |
| 120 | 1 | ప్రచితంపు | ప్రచిరంపు |
| 190 | 2 | ఉచితానుభాగ | ఉచితాసుభాగ |
| 197 | 4 | యుల్లంబురానుండి | యుల్లసంబు రానుండి |
| 243 | 1 | మనకుఁబోదనుచు | మనకుంబందనుచు |
| 250 | 1 | సంభ్రమమున | నింభ్రమమున |
| 294 | 2 | దొరసిన | దొరసైన |
| 300 | 1 | సార | సాను |
| 301 | 1 | విఱిగినతగు | విఱిగినటతగు |
| 336 | 1 | ఒఱచి | బొరచి |
| 623 | 1 | ర ధ | వస్త్రాంధ |

ఇంకేవేని పొరపాటులుండవచ్చును. పాఠకులు మన్నింతురుగాక.